# దాశరథి రంగాచార్య



## మాయ జలతారు,
## రానున్నది ఏది నిజం,
## పావని, నల్లనాగు.

# దాశరథి రంగాచార్య రచనలు

## నాల్గవ సంపుటం

* మాయ జలతారు
* రానున్నది ఏది నిజం?
* పావని
* నల్లనాగు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**Dr. Dasharathi Rangacharya Rachanalu Vol. IV**
* Maayajalatharu * Raanunnadi yedi nijam * Paavani * Nallanagu
(Novels & Stories)

ప్రచురణ నెం. : 2235

ప్రథమ ముద్రణ : డిసెంబరు, 2000

కాపీలు : 1000



వెల: రూ.150-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు (సుల్తాన్‌బజార్, అబిడ్స్),
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అక్షరాలంకరణ: ట్వెంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 4066986

ముద్రణ:

# అంకితం



కని, పెంచి, కన్నుమూసిన

మా అమ్మ

వేంకటమ్మకు

# అంతరంగం

1957లో నేను సికింద్రాబాదు మున్సిపల్ కార్పొరేషను ఉద్యోగిగా చేరాను. మరుసటి సంవత్సరం మారేడుపల్లిలో మున్సిపాలిటీవారు మాకు ఒక ఇల్లు Hire Purchase మీద కేటాయించారు. ఇప్పటికీ ఆ ఇంట్లోనే ఉంటున్నాం.

మాకు కేటాయించిన ఇంటిముందు పేదల వాడ ఉండేది. దానికి మురికివాడ అని ముద్ర వేశారు నాగరకులు అనిపించుకునేవాళ్ళు. మురికివాడ ముందు ఉన్నందున చాలామంది పలుకుబడి గల ఉద్యోగులు మా వరుసలో ఇండ్లు తీసుకోలేదు. నాకెందుకో పేదల వాడ బాగనిపించింది. నేను నిరాకరించలేదు. దిగిపోయాం.

మేము 1959 విజయ దశమినాడు గృహప్రవేశం చేశాం. ఆనాటి రాత్రంతా ఆ వాడలో బాగోతులు ఆడారు. నాకు గుర్తున్నంతవరకూ వారు ఆడింది విరాటరాజు కథ. ఆడడానికి బయటనుంచి ఎవరూ రాలేదు - గూడెం వాళ్లే ఆడారు - పాడారు. మాకు ఎంతో బాగనిపించింది. మేమూ నిద్రలు మాని ఎంతో ఆసక్తిగా విన్నాం - చూశాం.

పేదవాడ ప్రజలంతా పల్లెలవారు. కడుపు చేతపట్టుకొని పట్నం వచ్చారు. వారు వచ్చినపుడు ఈ స్థలం ఎందుకూ పనికిరానిది. ఎవరిదో కూడా తెలియదు. గుడిసెలు వేసుకుంటే అభ్యంతరమూ చెప్పలేదు. ఒక్కొక్కరూ వచ్చి గూడెంగా సిద్ధం అయింది.

గూడెం అంటె గుడిసెలే. చిందరవందర - ఒక పద్ధతి ప్రకారం ఉండవు. దానికి రోడ్లుండవు. పాయఖానాలుండవు. నల్లాలుండవు. లైట్లుండవు. సౌకర్యాలనేవి ఉండవు. ప్రభుత్వం, మునిసిపాలిటీ, దేవుడు సహితం కరుణించని శాపగ్రస్త స్థలం అది.

ఇది ఆనాటి మాట!

ఆ గూడెంల పోచయ్య ఉంటడు. పెంటయ్య ఉంటడు. పరమయ్య ఉంటడు. ఇస్తారి ఉంటడు. ఎల్లమ్మ, మల్లమ్మ, పుల్లమ్మ, మాంకాళమ్మ ఉంటరు. శ్రీకాంతులు, ఉషాసుందరులు ఉండరు!

వారిలో రిచ్చగుంజెటోండ్లున్నరు - ఉప్పరి పనిచేసెటోండ్లున్నారు - సఫాయిపని చేసెటోండ్లున్నరు - జేబులు కొట్టెటోండ్లున్నరు - రాళ్లు కొట్టెటోండ్లున్నరు - బాసన్లు తోమెటోండ్లున్నరు - చాఖాచలాయించెటోండ్లున్నరు. ఈడ ఆడ, మగ అనేడిది లేదు. అందరు పనిచేస్తరు. పొద్దు మింకంగ అందరూ తాగతరు. చీకటి పడంగ అందరు కొట్టుకుంటారు. తెల్లారంగనే అందరు అన్నలు, అక్కలు, మామలు, అత్తలు, బావలు, మరదండ్లు అవుతారు. రాత్రిది మరచిపోతరు. మల్ల సరసాలు, విరసాలు - పన్లకుపోతారు.

నాకు ఇది సొంతం దాపరికంలేని జీవితంగా – వాస్తవ జీవితంగా – వలువలు లేని జీవితంగా – నిలువెత్తు నిలిచిన వెలుగు జీవితంగా కనిపించేది. వారు ఏదీ దాచరు. కోపం దాచరు. ద్వేషం దాచరు. అలక దాచరు. అనురాగం దాచరు. వలపు దాచరు. వెలుగు దాచరు. చీకటి దాచరు. ప్రకృతి సహితం దేన్నీ దాచదు. ఎండ దాచదు. వెన్నెల దాచదు. అగ్ని దాచదు. వాయువు దాచదు. వారు ప్రకృతి బిడ్డలు! వారిదగ్గర దాచాల్సిందిలేదు.

నాగరికత అన్నింటినీ దాచడం నేర్పుతుంది!

మాకు పోచయ్యలతో, పోచమ్మలతో, పెంటయ్యలతో, పెంటమ్మలతో పరిచయం ఏర్పడింది. స్నేహం ఏర్పడింది. ఒకలాంటి బాంధవ్యం ఏర్పడింది. వారు మమ్ములను కంటిరెప్పగా కాపాడారు. కష్టాల్లో ఆదుకున్నారు. బాధలు పంచుకున్నారు. వారు మాకు ఆప్తులు అయినారు! గుడిశ మీది సొరకాయకు, చిక్కుడు కాయకు డబ్బు తీసికునేవారు కారు. ఆత్మీయంగా అందించి, తృప్తిగా వెళ్ళేవారు.

మా ఇంటికి కొద్దిదూరంలో కల్లుకంపోండు ఉండేది. ఆ రోజుల్లో మా అడ్రసే మారేడుపల్లి కల్లుకంపోండు. అక్కడ సాయంకాలం నుండి సందడి మొదలై, క్రమక్రమంగా పెరుగుతూ అర్ధరాత్రివరకు అల్లకల్లోలం అయ్యేది. పాటలు – మాటలు – ముచ్చట్లు – జగడాలు – ఏడ్పులు – పకపకలు, ఇకఇకలు – కొట్టుకోవటాలు – సాపెనలు – అరుపులు. ఆ జీవితం అక్షరానికి అందదు. చూడడానికి అక్కడ ఏమీ మిగల్లేదు – ఏడుస్తున్న నేల తప్ప!

ఆ జీవితాలు నన్ను ఎంతో ఆకర్షించాయి. నన్ను రొమ్ముకు అదుముకున్నాయి! ఆ ఆలింగనం – ఆ వడి – ఆ రొమ్ము – అన్నీ పోయినా – నన్ను ఇంకా వదల్లేదు. ఆ గూడెం – ఆ దుకాణం నాలో కాపురం పెట్టుకున్నాయి. వదలడంలేదు.

చెట్టు కొమ్మమీద కలుసుకుంటున్న క్రౌంచ మిథునానికి – వాల్మీకి ఎదుటనే – బాణం కొట్టాడు కిరాతుడు. విలవిల్లాడి వాల్మీకి మనసునుంచి వచ్చిన శోకం శ్లోకత్వమాగతః.

సరిగ్గా మా యింటి ముందు వాడ పరిస్థితి అలాగే జరిగింది. ఒకనాటి ఉదయం ఈ స్థలం తనదేనని దిగాడు ఒక దాదా. ఖాళీచేసి వెళ్ళిపొమ్మన్నాడు. సొమ్ము చేసుకుంటానన్నాడు. ఇది ఎరుగని పోశయ్యల, పెంటయ్యల మీద పిడుగులు పడ్డాయి. వారి జీవితాలను అమావాస్య ఆవరించింది.

'నీవే తప్ప ఇతఃపరంబెరుగ' అని వారు నన్ను ఆశ్రయించారు. S.B. గిరి గొప్ప కార్మికనాయకుడు. సహృదయుడు. కపటమెరుగని కోదండుడు. నిండుగా నవ్వగల మానవతామూర్తి. నాకు హమ్దమ్. ఒకే ఊపిరి పీల్చేవాళ్ళం. ఆ రోజుల్లో గిరి, చిరంజీవి, డాక్టర్ నరసింహన్ నాకు ఆత్మీయులు, ఆప్తులు, అనన్యులు. ముగ్గురూ నన్ను విడిచి వెళ్ళిపోయారు!

గుడిశ వాసుల స్థలం రక్షించడానికి గిరీ, నేనూ ఉద్యమం నిర్వహించాం. దాదులను ఎదుర్కొన్నాం. పోలీసు స్టేషన్లలో పడ్డాం – మంత్రులదాకా వెళ్ళాం.

మేము గెలుపుకు కొద్దిదూరంలో ఉండగా భూస్వామి వల పన్నాడు. గుడిశవాసుల్ని వలలో చిక్కించుకున్నాడు! మాముందే విజయపతాకం ఎగరేశాడు!!

పోశయ్యలు, పోశమ్మలు మమ్మల్ని చూచి ముఖాలు చాటువేసుకున్నారు. మేము వారికి వాస్తవాలు వివరించడానికి చేసిన ప్రయత్నాలు విఫలం అయినాయి. వాడు డబ్బుచూపాడు. లొంగిపోయారు. గుడిశలు విప్పుకొని వెళ్ళిపోయారు!

ప్రజా ఉద్యమాలను సహితం డబ్బు సంచులు కొనే ధనస్వామ్యం దాపురించింది. మేము ఈనగాచి నక్కల పాలుచేశాం!!

ఇవీ 'మాయజలతారు' పుట్టుకకు పురిటినొప్పులు.

ఆ జీవితాలు, ఆ పోరాటం మనసు మీద చెరగని ముద్ర వేశాయి! దానికి అక్షరాకృతి ఇవ్వడానికి చేసిన కృషియే "మాయజలతారు."

కమల, పిల్లలు పుట్టింటికి వెళ్ళినందున భాయ్‌జాన్ నార్ల చిరంజీవి ఇంట్లో ఉండే చాల భాగం నవల రాశాను. 'వండనలయదు వేవురు వచ్చిరేని,' నాగరత్నమ్మ వదినగారు నన్ను వాస్తవ మరిదివలెనే ఆదరించింది.

నేను తెల్లవారుజామున లేచి వ్రాసేవాణ్ణి. సాయంకాలం ఆఫీసునుంచి తిరిగివచ్చేటప్పటికి భాయ్‌జాన్ చదివి మార్పులు చేర్పులు చెప్పేవారు.

"తారురోడ్డు నీగ్రోయువతి బుగ్గలా మెరుస్తూంది" అని నా నవల మొదలవుతుంది. ఉపమానం బావుండలేదు, తొలగించమన్నారు భాయ్‌జాన్. తొలగించాను.

"చమేలీకెమండ్వేతలె" అనే మఖ్దూం కవిత కల్లుకాంపౌండులో తాగేవాళ్ళు చదివినట్లుపెట్టాను.

"మఖ్దూమ్ అంటే నీకున్న అభిమానం తప్ప, ఆ కవిత అక్కడిదాకా వెళ్ళలేదు" అన్నారు భాయ్‌జాన్. నేనూ సందిగ్ధంలోనే పడ్డాను.

ఒకరాత్రి టాక్సీలో భాయ్‌జాన్ ఇంటికి వెళ్తున్నాను. డ్రైవరు మహమ్మదీయ వృద్ధుడు. ఎరుపు ట్రాఫిక్ సిగ్నల్ వచ్చింది. "సుర్ఖ్‌సవేరుహూగయా" అరుణోదయం అయింది అన్నాను. అది విని ఆ వృద్ధుడు పొంగిపోయాడు. మఖ్దూమ్ కవిత 'సుర్ఖ్‌సవేరా' వినిపించడంలో పచ్చలైటు వచ్చిన విషయం నేను గుర్తు చేయాల్సి వచ్చింది. భాయ్‌జాన్ ఇంటికి వెళ్ళిన తరువాత డ్రైవర్ని పరిచయం చేస్తే భాయ్‌జాన్ పొంగిపోయారు. ఆ కవిత ఉండవచ్చును అన్నారు.

నా ప్రణాళికలో లచ్చిశీలం అనేకులచే చెరచబడుతుంది. నవల చివరలో పోచయ్యకు దూరంగా ఉండిపోతుంది లక్ష్మి. తాను చెడిపోయానంటుంది. నా లక్ష్మికి చెడటమంటూ లేదని దగ్గరకు తీసుకుంటాడు పోశయ్య. లక్ష్మి – అమ్మో – లక్ష్మి చెరచబడడం ఏమాత్రం ఇష్టంలేకపోయింది చిరంజీవిగారికి. ఆమె శీలం కాపాడ్డానికి ఆమె పూర్వస్మృతులు కోల్పోవడం వగైరా సన్నివేశాలు కల్పించాల్సి వచ్చింది. ఆ రూపంలో నవల మీముందుంది.

నగరపు పేదల – సంపన్నుల జీవితాలు చిత్రించడానికి ప్రయత్నించాను. కొత్త నాగరకతలో డబ్బుమాత్రం చేరి, సంస్కారం కొరవడడం, కొత్త ధనికులు సమాజానికి సారథులు కావడం చూపించాను. ఆ తరువాత జరిగిన పాతాళపతనం దిగంబరంగా దర్శనం ఇస్తున్నది!

ఈ నవలకు నామకరణం చేసినవారు నార్ల చిరంజీవి. ఈ సమాజం "మాయజలతారు" కల్తీ – బంగారంలా మెరిసిపోతుంది. కాని, వాస్తవానికి బంగారం కానేకాదు.

మనం మాయలో జీవిస్తున్నాం. వాస్తవం చూడనీయని మెరుగులున్న సమాజం ఇది. మనం ఇందులో జీవించడంలేదు. జీవిస్తున్నట్లు నటిస్తున్నాం. భ్రమలోపడి జీవిస్తున్నాం. జీవితపు వెలుగు చూడలేని అంధకారంలో ఉన్నాం.

"మాయజలతారు" ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 6–1–1971 నుంచి 21–4–1971 వరకు సీరియల్‌గా వచ్చింది.

విశాలాంధ్ర ప్రచురణాలయంవారు "మాయజలతారు"ను .1973–1976లలో ప్రచురించారు. ప్రస్తుతం 'దాశరథి రంగాచార్య రచనలు', నాలుగవ సంపుటంలో ప్రచురిస్తున్నారు. ఇంతకుముందు చిల్లర దేవుళ్లు మొదటి సంపుటిగా – మోదుగుపూలు, మానవత, శరతల్పం, దేహదాసు ఉత్తరాలు రెండవ సంపుటిగా – జనపదం మూడవ సంపుటిగా ప్రచురించారు.

విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి నామీద, నా రచనల మీదా ఉన్న ఆదరాభిమానాలకు ఎంతో కృతజ్ఞుణ్ణి.

కని, పెంచి, కష్టాలు మాత్రమే అనుభవించి కన్ను మూసిన మా అమ్మ, విదుషీమణి దాశరథి వేంకటమ్మకు "మాయజలతారు"ను కన్నీటి కాన్కగా అంకితంగా సమర్పించుకుంటున్నాను.

సర్వేపి సుఖిస్సంతు. అందరూ సుఖంగా ఉండాలి.

సికిందరాబాదు, దాశరథి రంగాచార్య
4–12–1997.

★ ★ ★

# ఈ సంపుటిలో...

# మాయ జలతారు

## ఒకటి

*"పీనా న మనా హై న పిలానా హి మనా హై
సాఖీ!
పీనేకె బాద్ హోష్‌మె ఆనాహి మనా హై"

"వహ్వా ఏమ్ ఇన్పించినవుర! ఏమిన్పించినవుర!" అని పిచ్చయ్య పోచయ్యను ఊపాడు.

"వహ్వా వహ్వా" అని వీపు చరిచాడు పరమయ్య.

"ఈ పాట మీదనే ఆడరిస్త నాల్గు షీషలు. రే పోరగా. పోరడా! రాబే జల్దీ" అని పిలిచాడు పిచ్చయ్య.

సికింద్రాబాద్ నించి హైద్రాబాద్ వెళ్ళే రోడ్ల మలుపులో కల్లుదుకాణం. జన సమ్మర్థం ఎక్కువగా ఉంది. జనం గుంపులు ఎడం ఎడంగా కూర్చున్నారు. అందరికీ సప్లయి చేయాల్సినవాడు ఒక్కడే కుర్రాడు. వేరే గుంపుకి సీసాలిచ్చి డబ్బు పుచ్చుకుంటుండగా పిలిచాడు పిచ్చయ్య.

"వస్తి, వస్తి" అని డబ్బులు లెక్కపెట్టుకుంటున్నాడు కుర్రాడు.

"అరే రాబే జల్దీ" – మళ్ళా కేకవేశాడు పరమయ్య.

పరిగెత్తుకొని వచ్చాడు కుర్రాడు. నాలుగు కల్లు సీసాలకు ఆర్డరిచ్చాడు పిచ్చయ్య. వారి ముందున్న ఖాళీ సీసాలూ, డబ్బూ పుచ్చుకొని వెళ్ళి నాలుగు సీసాలు తెచ్చిపెట్టాడు కుర్రాడు. ముగ్గురూ మూడు సీసాలెత్తి తాగేశారు. మురుకులు, బజ్జీలమ్మే అవ్వ బుట్టతో వచ్చింది.

"పైసలున్నయిర ఏమన్న?" అని పిచ్చయ్య, పోచయ్య జేబులో చేయివేశాడు. చిల్లర చేతికందింది. తీశాడు. "పైక ముంచుకొని లేదంటన్నవులే?"

"తాగేకాడ దాచెడి దేందిర, ఉన్నకాడికి తాగాలె" అన్నాడు పరమయ్య.

పోచయ్య పలకలేదు. గుడాలు కొన్నాడు పిచ్చయ్య. గుడాలు తింటూ ఒక్క సీసా ముగ్గురూ తాగుతున్నారు.

* "తాగుట, తాగించుట కాదు తప్పు
సాఖీ!
తాగి, తెలివితప్పకుంట శుద్ధతప్పు"

కల్లు దుకాణంలోంచి బుర్రకథ, బిచ్చపువాళ్ళ పాటలూ వినిపిస్తున్నాయి. వీటన్నింటిని మింగుతూ కేక వేసి పక్కనుంచి రైలు సాగిపోయింది. సీసా ఖాళీ చేశారు ముగ్గురూ.

"పోరడు కండ్లపడ్తాండా యాణ్ణన్న" అడిగాడు పిచ్చయ్య.

"కంపోనకి పోయినట్లున్నడు."

"సట్కాయిస్తాం పా–మళ్ళపైస లేదున్నయి?" అని చల్లగా జారుకున్నాడు పిచ్చయ్య. అతణ్ణి అనుసరించా రిద్దరూ.

☆ ☆ ☆

పోచయ్య భార్య లక్ష్మి గుడిసెముందు కూర్చొని ఉంది. ఆ గుడిసె చుట్టూ గూడెంలోని పిల్లలంతా మూగారు. అవిడంటే పిల్లలకు బాగా చనువు. కథలు చెపుతుంది. పాటలు నేర్పుతుంది. పాఠాలు కూడా చెబుతుంటుంది.

అప్పుడే ఇంటికి వస్తున్నాడు బాలయ్య రిక్షా ఇచ్చి. చూచాడు. "పోరలందర్ని పెట్క కూకున్నవు సర్లేగాని పోచయ్య ఏడికి పోయిండే?" అడిగాడు.

బాలయ్య మాట విని లేచి నుంచుంది లక్ష్మి. "నూకలు తెస్తనని పోయిండన్న."

"పోయినాడు మల్ల. అడు చెడిపోతాండు చూడు. దోస్తి గిట్టమంచిగ లేదు. ఎప్పుడు పోయిండు?"

"పొద్దుమింకంగ."

"వాని కెందుకిచ్చినవు పైసలు? నువ్వే తెచ్చుకోక పోయినావు రేసన్ దుక్నానికి పోయి."

"మందెక్వుంటరు, నువ్వేం పోతవు. నేనే తెస్తనని పైకం తీసుకున్నడన్న."

"ఇంకా దేమొస్తడుగాని, పోరలు పొండి గుడిసెల్లకు" అని అందరినీ వెళ్ళగొట్టి, "నూకలేమున్నన్నయా? లేకుంటే అడికే వచ్చి ఒక ముద్ద తిను."

"ఎందుకన్న! వస్తనే ఉంటడు."

"ఏందో వాడెట్లనో అయిపోతాండు. వాణ్ణి జర సుద్రాయించాలె చూడు" అని వెళ్ళిపోయాడు.

కల్లు దుకాణంనుంచి బయలుదేరిన ముగ్గురూ రోడ్డు పక్కనుంచి నడుస్తున్నారు తూలుతూ. పరమయ్య తూలి పడిపోయాడు. పిచ్చయ్యా పోచయ్యా లేవనెత్తారు.

"ఏమొ అట్ల పడ్తివి?"

"జర సోలిన."

"సోలినాణ్ణి పట్టుకుంటంలనే మజ ఉన్నదే. ఏమన్నడో ఎరికెనా?" అన్నాడు పోచయ్య.

"ఇన్పించ రాదుబే. ఎరికెనా? ఎరికెనా? అనడుగుతవు."

*"నశా పిలాకె గిరానాలో సబ్ కో అతా హై*

*మజా తా జబ్ హైకి గిర్తోంకా థామ్ లే సాఖీ!"*

"ఏమ్ చెప్పినవుర, ఏం చెప్పినవుర పోచిగా, పైసల్లేవుగని రొండు చప్టీలు పోయిస్తుంటినిర..."

"ఏమన్నవు? చెప్పి. ఏదె బే"..... అని చేయిచాచి లాగబోయి తూలి పడబోయాడు పరమయ్య.

ఇద్దరూ పట్టుకున్నారు నడిపించుకు వెళ్ళారు. కొంతదూరం నడిచి జన సమ్మర్ధంలేని రోడ్డుకు వచ్చేశారు. కరెంటు దీపాల వెలుగుకు తారు రోడ్డు మెరుస్తూంది. ముగ్గురూ రోడ్డుకు ఒక పక్కన కూలపడ్డారు.

"తాగినవ్క ఊరుకుంటే మజ ఏమున్నది. పాడరపాట–" పిచ్చయ్య ప్రోత్సహించాడు. అందుకున్నాడు పోచయ్య.

"చమేలీ కే మండ్వే తలే

దో బదన్ ప్యార్ కీ అగ్ మే జల్ గయీం."

చప్పట్లు కొడుతున్నారు ముగ్గురూ.

"దో బదన్ ప్యార్ కీ అగ్ మే జల్ గయీం

ఏక్ మైకదేసే అగే ఉస్ మోడ్ పర్."

"లేర పోదం పదం పాడుకుంటనే" – పరమయ్య అన్నాడు. ముగ్గురూ లేచారు. తూలుతూ నడిరోడ్డునుంచి వెళ్ళిపోతున్నారు. ఒక కుక్క నాల్క చాచుకొని వస్తూంది. వారిని చూచి "భౌభౌ" అని మొరిగింది. "ఉస్కా ఉస్కా" అన్నారు ముగ్గురూ.

కుక్క వెంటపడింది. ముగ్గురూ తలా ఒకవైపు పరిగెత్తారు. కుక్క రోడ్డుకు వెళ్ళిపోయింది. ముగ్గురూ భుజాల మీద చేతులు వేసుకొని ముందుకు సాగారు.

"అహ తైతక, అహ తైతక"

"బండిమీద బండి కట్టి పదహారు బండ్లు కట్టి"

"ఏ బండ్ల మున్నవు కొడకో నైజాం సర్కరోడా?"

ముగ్గురూ ఎగురుతున్నారు. అడుతున్నారు. పాడుతున్నారు.

ఎదురుగా లారీ వస్తూంది. వారికి లారీ లైట్లు కనిపించలేదు. హారనూ వినిపించలేదు. దగ్గరికి వచ్చి ఆగిపోయింది లారీ. డ్రైవరు దిగాడు.

"ఏమ్రో! ఏమన్న చావు పిలుస్తోందా. చస్తే చస్తిరి కాని ఇంకో లారీ కిందపడి చావురి. జరుగుండి జరుగుండి" అని పక్కకు నెట్టాడు.

అప్పుడుగాని ఈ లోకంలోకి రాలేదు వారు. పోచయ్య లారీని చూచాడు. "బియ్యమేన అన్న ఇండ్లున్నయి?" అడిగాడు డ్రైవరును.

"నీ కెందుకుర అయ్యన్ని? నడువ్ బే నడువ్" అని నెట్టాడు డ్రైవరు. కాస్త తూలి సర్దుకున్నాడు. "అట్లకాదన్న నూకలు తెస్తనని పైకం తీసుకొని ఎల్లిన. కల్లు దుక్నానికి పెట్టిన. జరిన్ని పెడ్తవేమోనని."

పెద్దగా నవ్వాడు డ్రైవరు. "వచ్చిండు తీస్‌మార్‌ఖాన్, సన్నబియ్యం తినేటందుక్క. పోబే పో" అని లారీ ఎక్కి వెళ్ళిపోయాడు.

మళ్ళీ ముగ్గురు కలిసి సాగిపోయారు. "ఇదో గూడె మొచ్చింది. గా బాలిగా డున్నడు సూశినవా? వాడు గడ్డివాముకు కాపలా ఉన్న కుక్కసు వంటోడు. వాడు తాగడు, మందిని తాగనియ్యడు. పోశిగా, నువ్వట్లపో. మేమిట్ల పోతం. జర సంబ్లాయించుకొని పోతవులే."

"పోతలే మీరు పోరి."

విడిపోయారు ముగ్గురూ.

పోచయ్య రోడ్డు దిగాడు. దీపాలు లేని బాట. ఈ పక్కల మురికి కాలువ. ఆ పక్కన మున్సిపాలిటీ లారీలు గుమ్మరించిన చెత్తగుట్టలు, మధ్య నుంచి నడిచి పోతున్నాడు కూనిరాగాలు తీస్తూ.

ఒక గుడిసె ముందుకు వచ్చి తడక నెట్టాడు. లక్ష్మిని పిలిచాడు. అనేక సార్లు పిలిచాడు. కోపం వచ్చింది. గట్టిగా నెట్టాడు తడకను. తడక తీసుకొని ఒక బుర్ర మీసాలవాడు వచ్చాడు. "మంది గుడిసెల కాడికొచ్చి మొరుగుతున్నవేమిర? పోతవా, నశదింప మంటవా?" అని ఉరిమాడు.

"అన్న! దండం పెడ్తనే. మాఫ్ చెయ్యి. జర నీలుపడ్డయా? నీ కాల్మొక్త. తిట్టకు. ఇగా పోతాన్న" అని వెళ్ళిపోయాడు పోచయ్య.

"ఇగ్గోగిదె నా గుడిసె. బాగచూస్త. గాయిన కాబట్కే ఊరుకున్నడు. ఇంకోడైతే చమ్డలీస్తడు." తడక్కు చూచాడు జాగ్రత్తగా. సినీమాస్టారు బొమ్మ ఉంది. తన ఇల్లని స్థిరపరచుకొని లక్ష్మిని పిలిచాడు. పలకలేదు.

"నీ కాల్మొక్తనే. తడక తీయవే. తియ్యవ్ లే. కోపమొస్తాంది. ఒక్క లాతుకొడ్తే తడక ఇరుగుతది. అం ఏమంటే తడక ఇరిగి పోతదని చూస్తాన్న. తీయ్. తియ్యవులే" అని తన్నాడు. తడక చిరిగింది. డబ్బా ధడల్ మని క్రిందపడింది. లక్ష్మి అదిరిపడి లేచి నుంచుంది.

"దయ్యం పట్టినట్టు నిద్రపోతున్నావేమే ఛినాల్! పెట్టు, బువ్వ పెట్టు."

"నూకలు తెచ్చినావా?"

"నూకలు తేకుంటే బువ్వ పెట్టవులే. నీ తల్లి........" అని నెట్టాడు.

లక్ష్మి కింద పడిపోయింది, కేక పెట్టింది.

"చిల్లాయిస్తవులే" అని కర్ర తీసుకొని ఉరికాడు పోచయ్య.

లక్ష్మి కేకవిని పరిగెత్తుకొని వచ్చిన బాలయ్య కర్ర చేతులోంచి లాగిపారేసి పోచయ్యను బయటికి లాక్కొచ్చాడు. ఈలోగా మరో ఇద్దరు ముగ్గురు అక్కడికి చేరారు.

"ఊరంగ తాగిండే, వీని నశ దింపాల్నంటే నీలు పొయ్యాలె. నీలు తేరి కుండల్తోని" అన్నాడు బాలయ్య.

ఇద్దరు ముగ్గురు కుండల నిండా నీళ్ళు తెచ్చారు, పోచయ్యను బలవంతంగా కూర్చోపెట్టారు. కుండలతో నీళ్ళుపోయడం మొదలుపెట్టారు.

"మంటలు, మంటలు బాలయన్నా! పెయి మండిపోతుంది. నీ కాల్మొక్త. నిప్పులు పొయ్యకు. అయ్యో వద్దనలె! గులాపోణ్ణయిత."

"నోరు మూస్తవా? లాతుల్తింటవా?" అన్నాడు ఒకడు.

నోరు మూసుకొని కూర్చున్నాడు పోచయ్య. పది కుండల నీళ్ళు పోసిం తరువాత దిగింది మైకం.

"దిగినాదిర?" అడిగాడు బాలయ్య.

"దిగిందన్న. నీ కాల్మొక్త. ఉగెప్పుడు పోనే అటు. నాతోడు, నీతోడు. లచ్చితోడే."

"నూకలెత్తనని పోయి తాగొస్తవుబే. మల్ల తాగొచ్చినట్టు కనపడ్డావో పానాలుతీస్తా ఏమనుకున్నావో. ఫో. ఇంట్లకు ఫో" అని నెట్టి, "అనికేమే తినొచ్చుంటాడుబాగ. జర బువ్వ తెచ్చి పెట్టరా దుండే. పోరి ఉపాసమెట్ల పండుతుది...?" అన్నాడు బాలయ్య.

"పోరిని ఉపాసాలతో చంపేట్టున్నాడు. ఉండె లచ్చి, బువ్వతెచ్చి పెట్త" అని వెళ్ళి మైసమ్మ పళ్ళెంతో అన్నం తెచ్చి ఇచ్చింది.

"ఎందుకత్త మీకు, తక్లీఫు. ఇట్ల కండ్లు మూసుకుంటె అట్ల తెల్లారె..."

"గదేంది బిడ్డ? గట్లంటవు? నువ్వు మా పోర్లకు బువ్వలు పెట్తలేవా? ఆడిపిస్తలేవా? చదివిస్తలేవా? గూడెంలా ఎవ్వరికిం తొచ్చినా ఉరుకుతవుకద. బువ్వ తెస్తె వద్దనొద్దుబిడ్డ. రా" అని ఇంట్లోకి తీసుకెళ్లింది, మైసమ్మ.

బాలయ్యా వాళ్ళంతా వెళ్ళిపోయారు.

"తినుబిడ్డ తిను" అని లక్ష్మిని కూర్చోపెట్టి పళ్ళెం ముందు పెట్టింది మైసమ్మ.

"ఆడ పెట్టిపో అత్త, తింటలే."

"సరే, అట్లనే పోతలే. ఉపాసం పండకుబిడ్డ. ఒక ముద్ద తిని పండు" అని హెచ్చరించి వెళ్ళిపోయింది, మైసమ్మ.

అంతా వెళ్ళిపోయారు. పోచయ్య చతికిల పడ్డాడు. అతని నిషా దిగిపోయింది. తాను దుడ్డుకర్రతో లక్ష్మిని కొట్టబోవటం, నూకల కోసం ఇచ్చిన పైకం పెట్టి త్రాగడం గుర్తుకు రావడంతో తానేదో పెద్ద నేరం చేశాననుకున్నాడు. దుఃఖం పొంగి పొర్లింది. మౌనంగా ఏడుస్తూ కూర్చున్నాడు. గాలికి రెపరెపలాడే దీపంముందు లక్ష్మి కూర్చుంది. కొంతసేపు అలా కూర్చొని లేచింది. పోచయ్య దగ్గరకు వచ్చింది. "లే, బుక్కెడు బువ్వ తిందం." బొంగురుపోయిన గొంతుతో అన్నది.

పోచయ్య ఏడ్చేశాడు. "లచ్చీ! నువ్వు దేవతవే! నేను సైతానును! నిన్ను కొట్టెతందుకు లేచినయే గీ చేతులు. నాకేమొ బువ్వ పెట్తనంటూ వచ్చినావు! లచ్చీ! పాపం చేసిన్నే పాపం. కనికరమెందుకే నామీద. నాకు బువ్వ పెట్టకు. ఇచ్చిన పైకంతో తాగొస్తే ఇంక బువ్వ పెట్తావు? పండ్త ఈ పోశిగాణ్ని మాడనియ్యే"

భరించలేకపోయింది లక్ష్మి. పోచయ్యమీద పడి ఏడ్చేసింది. "గలానకు. నువ్వేమన్న కొట్టినవా? కొట్టొచ్చినవు. నల్గురు చూస్తే ఏమనుకుంటరు? లే, గుడిసెలకు పా. నువ్వేం చేసినవే. గా తాగుడు చేసింది. నువ్వు తినంది నేను తింటానే. లే ఒక్క బుక్క తిను. పా –" అంటూ బ్రతిమిలాడి లోనికి తీసుకెళ్ళింది.

"లచ్చీ! నీ మీ దొట్టు. మల్ల తాగనే. నిన్ను కొట్టబోయిన కాదు నా లచ్చీ! మాఫ్ చేసినవా? మాఫ్ చేసిన్నను."

లచ్చి చిరునవ్వు నవ్వింది. చెక్కిలి సొట్టబోయింది.

ఆ నవ్వులో కరిగిపోయాడు పోచయ్య.

దీపం గాలికి ఆరిపోయింది.

అంధకారం అలుముకుంది. ఎక్కడా వెలుగన్న మాటలేదు. కుక్కలు దూరంగా ఏడుస్తున్నాయి. కీచురాళ్ళ ధ్వని వినిపిస్తూంది. సమయం ఎంత అంటే ఇక్కడ మనకేం తెలుస్తుంది? ఇక్కడి చుక్కల భాష మనకు తెలీదు.

☆ ☆ ☆

నగరానికి తలమానికం లాంటి హోటల్ నయాగరా. గడియారం సంగీతం తరవాత ఒక గంట కొట్టింది. నయాగరా నియోన్ లైట్ల వెలుగులో వెలిగిపోతూంది. సుళ్ళు తిరుగుతూ కొండ నెక్కి వచ్చిన కారు పోర్టికోలో ఆగింది. కారులోంచి దిగిన సూరి ముంజేతి గడియారం చూసుకున్నాడు. 11–30 అయింది. టాక్సీకి డబ్బిచ్చి హోటల్లోకి దూరాడు. లోన డ్యాన్సు జరుగుతూంది మ్యూజిక్ మ్రోగుతూంది. కొందరు తాగి తూలుతున్నారు. కొందరు తాగి మాటల్లో పడిపోయారు. అయినా, అంతా ఫ్రెంచి యువతి నృత్యం చూస్తూనే ఉన్నారు. సూరి వీటిని వేటినీ పట్టించుకోలేదు. మేనేజరు గదిలోకి వెళ్ళాడు. "హల్లో రమోరియా!" అని విష్ చేశాడు.

"హల్లో సూరీ! చాలా కాలానికి వచ్చావ్" అని కరస్పర్శ చేసి కూర్చోమన్నాడు రమోరియా.

"కాకుంటే మన కేముందోయ్ ఇక్కడ? మునగడానికి వస్తామా? సరేగాని, డెయిజీ వచ్చిందా?"

"ఏఁ! డెయిజీనే పట్టావూ! గట్టివానివే!"

"గట్టివాణ్ణి కాకుంటే నయాగారా హోటల్లో బాయ్ నుండి సినీ డైరెక్టరుదాకా ఎలా ఎదుగుతానోయ్? కాల్చు సిగరెట్టు. నిజంగా రాలేదా బిచ్?"

సూర్యం జీవితం నయాగరా హోటల్ బాయ్‌గా మొదలైంది. అతనిలోని మాటల చాకచక్యం, మనిషిని ఆకట్టుకునే తెలివి నయాగరాలో రెస్టోరెంట్ సెక్షనుకు మేనేజరును చేశాయి. ఆ తరువాత ప్రమోషనుతో అతనిని సిరి వరించింది. సంధానకర్తగా డబ్బే కాక, పెద్ద పలుకుబడీ సంపాదించాడు. సినీ రంగం భాగ్యనగరానికి అవతరించడంతో ఇతడు సినీరంగాన్ని వరించేశాడు. వచ్చే సినీ పెద్దలంతా నయాగరాకే వస్తారు. దాంతో అతడు సినీ మనిషై పోయాడు. తనను డైరెక్టరునని చెప్పుకోవడం, ఏదో చిత్రం పేర బోర్డు తగిలించి, అమాయకుల్ను, అమాయికలను సినిమాపేర పిండడం అతని ప్రస్తుత వృత్తి. ఆ పనితోనే వచ్చాడక్కడికి ప్రస్తుతం.

"అబద్ధం చెపుతానా? అందులోనూ నీతో! ఎంత వరకొచ్చింది, సినిమా వ్యవహారం?"

"మూడు పిక్చర్లు పెట్టాను. ఒకదానికి డబ్బు లేకుండా కథ రాయించాను. రెండోదానికి డబ్బులేకుండా స్టార్స్‌ను ఏర్పాటు చేశాను. ఇప్పుడు మూడోదాని వ్యవహారం. నీకూ ఒక వేషం ఇస్తాలేవోయ్. రాదా ఏం బిచ్? వస్తానని ప్రామిస్ కూడా చేసింది. పైగా రాజారావును రమ్మన్నాను."

"చూసిరానా వెళ్ళి?"

"వద్దులే గాని, ఎన్నో నెంబరు గది కాళీగా ఉంది? చూడూ! వారం రోజుల్నుంచి

నాకింద ఉన్నట్లు రాసెయ్యి. ఫిఫ్టీ, ఫిఫ్టీ సరేనా?"

"ఎందుకులే బ్రదర్! 103 కాళీగా ఉంది."

ఎత్తుమడమల బూట్లతో ఒక ఆంగ్లో ఇండియన్ యువతి గదిలోకి ప్రవేశిస్తూనే "సూరి వ...." మాటమింగేసి "హలో సూరీ! అయామ్ సారీ! పదిహేను నిమిషాలు ఆలస్యం అయింది" అని వచ్చికూర్చుంది.

"హల్లో డెయిజీ! నా రాణీ! ఎంత వెయిటింగ్, ఎంత వెయిటింగ్! పదిహేను నిమిషాలంటున్నావు. పదిహేను ఏళ్ళలా ఉంటేనూ? అహా, అహా! ఏం తయారై వచ్చావు డార్లింగ్! రంభలా ఉన్నావనుకో రాజారావు చూశాడంటే వెన్నలా... కాదు...కాదు...మంచులా కరిగిపోతాడు. కమాన్ మై హీరోయిన్ డెయిజీ!" అని చేయి అందుకొన్నాడు. టకటకా సాగిపోయా రిద్దరూ లిఫ్టులో మూడో అంతస్తుకు.

నూట మూడో నెంబరు గదిలోకి వెళ్ళి సోఫామీద పడిపోయింది డెయిజీ "ఐ యాం టైర్డు" అంటూ.

"డెయిజీ! నా రాణీ! ఆ మాటే అనొద్దు. వచ్చే వాడున్నాడు చూచావా – సరికొత్త సరుకు. వట్టి ముడి సరుకు... కాంట్రాక్టులు చేసి లక్షలు గడిస్తున్నాడు. సాధారణంగా కరిగే ఘటంకాదు, సూరి కరిగించేశాడనుకో. పిక్చరు తీయడానికి అంగీకరించాడు. మిగతా పని నీవు చేయాలి. నెగ్గిందా నా రాణీ, నువ్వు హీరోయిన్, నేను డైరెక్టరు. ఇగ చెపుతావూ?"

"ఐ విల్ ట్రై" – చిరునవ్వు నవ్వింది డెయిజీ.

"ట్రై అంటేకాదు మేడమ్, సాధించాలి. వాడు వచ్చేవేళ అయింది, కిందికి వెళ్తా. వట్టి ముడి సరుకు. దింపాలి. వస్తామరి" అని క్రిందకి వచ్చేశాడు సూరి.

సూరి క్రిందికివచ్చి సోఫాలో కూర్చున్నాడు. "వెధవముండ, ప్రాణం తోడేసింది ఒప్పుకునేందుకు. టెక్కు. ఆ ముసలివాడు! ఇచ్చేదాకా వదల్లేదుగా. అయినా పట్టేశాం. చూస్తే కరిగిపోతాడు వెధవ. ఒక్క పెగ్గు కొడ్తే మేలేమో? పన్నెండుకు మూడు నిముషాలుం దంటుంది నా వాచి. అయిదు నిమిషాలుందంటుంది నయాగరా గడియారం. సొంత డబ్బెందుకూ ఖర్చుపెట్టడం? అయినా వెధవ హేవర్డ్సేమిటి ఈరోజు! వస్తాడుగా కొడ్దాం వాట్ 69. ఇంకా రాడేం వీడు? వీడు మోసగిస్తాడా? నయాగరా గడియారం 12 కొట్టింది. చచ్చువెధవ, ఏ గుడుంబా కొడ్తున్నాడో? డబ్బుండగానే సరా? ఆనందించడం చేతకావాలి. మరెవరైనా పట్టెయ్యలేదుకదా? ఏమో మరీ? సాయంకాలం కలిసి వస్తానన్నాడే?"

బక్కపల్చగా పొడుగ్గా ఉన్న వ్యక్తి హోటల్లో ప్రవేశించాడు. నాలుగువైపులా చూచాడు. సూరి పరధ్యానంలో గుర్తించలేదు. రాజారావు గుర్తించాడు. "హల్లో సూరీ!" అని విష్ చేశాడు. ఉలిక్కిపడ్డాడు సూర్యారావు. "హల్లో మిస్టర్ రాజారావు! నాకు తెలుసు గడియారమన్నా తప్పి నడవవచ్చు. గాని మీరు టైమ్ తప్పరని. పదండి పైకి వెళ్దాం" అని లేచాడు. ఇద్దరూ నడక సాగించారు లిఫ్టువైపు.

"వచ్చిందా?" అడిగాడు రాజారావు.

"ఈ సూర్యారావు రమ్మన్న తరువాత రాకపోవడం అంటూ ఉండదండీ రాజారావుగారూ! రంభా, ఊర్వశులు ఇంకా స్వర్గంలో ఉన్నారంటే ఈ సూర్యారావు

అక్కడికి వెళ్ళలేక పోవడమే కారణం. అయినా ఎంత సతాయించిందనుకున్నారు. ఆవిడ అడుగుల కింద నోట్లు పరచడానికి సిద్ధంగా ఉండే కోటీశ్వరులు కాపలా కాస్తుంటారు. సినీమాలో హీరోయిన్ను చేస్తాననీ, అదీ ఇదీ చెప్పి తెచ్చాను. ఇలా సినీమా మొదలుపెట్టి ఒక్క షాట్ తీశామనుకోండి, ఇంక డెయిజీ కుక్కలా మన చుట్టూ తిరుగుతుంది. వెధవ లిఫ్టు చెడిపోయిందీ – పదండి మెట్లెక్కుదాం. డెయిజీ అంటే మెరుపు. మెరుపంటే మెరుపే ననుకోండి. గులాబీరంగు సన్నని పెదవులు, చిన్న చుబుకం, పల్చని చెంపలూ, వ్రేలాడే జుట్టూ, అబ్బో చెప్పబాకండి. నవ్విందంటే రత్నాలు రాలినట్లే."

"ఎంతకు ఒప్పుకుంది?"

"డబ్బు. డబ్బు. ఆడదాని విలువ కట్టగలమటండీ డబ్బుతో! ఉమర్ ఖయ్యాం చెప్పాడు – మదిరా, మధువు ఉంటే రాజ్యాలైనా వద్దని. ఏదైనా కంట్రాక్టు చేసుకుందాం. ఈ రాత్రికో వేయి పారెయ్యండి. తరవాత విషయం ఆలోచింతాం."

"వెయ్యే!"

"వెయ్యంటే ఎంత? లక్షలో నూరో వంతు! ఇనప్పెట్టెల్లో ఏడుస్తుంది. నయాగరాలో నవ్వుతుంది. రేపు కంపెనీ రిజిష్టరు చేస్తున్నామా? కంట్రాక్టు చేసుకుందాం. తరువాత ఫిలిం కోసరం ఇచ్చే డబ్బే. మిగతాదంతా ఉల్టా కర్చంతా కంపెనీ పేర రాస్తాం, ఏమంటారు?"

"బాగుంది. కాస్త జాగ్రత్త. లాస్ లేకుండా చూడండి."

"ఈ సూర్యారావు ఉండగా నష్టమన్నది అడుగు పెట్టడానికి జంకుతుందండీ. మీరే చూస్తారుగా. అలా తెరమీద మీ పేరు వచ్చిందో – ఇక చూడండి. మీరూ ప్రొడ్యూసర్లయిపోతారు. మాదేమిటి, ఎప్పుడూ డైరెక్టర్లమేగా! అదిగో డెయిజీ ఎదురు చూస్తూంది."

ఇద్దరూ గదిలో ప్రవేశించారు.

లేచి నుంచొని తలవంచి "హల్లో మిస్టర్ రాజారావ్!" అని విష్ చేసింది డెయిజీ.

స్ఫటికపు బొమ్మలా ఉండి, వంగి, వయ్యారంగా నమస్కరిస్తూ చిరునవ్వు నవ్విన డెయిజీని చూచి చకితుడైనాడు రాజారావు. చూస్తూ ఉండిపోయాడు. తనను తాను మరచిపోయాడు.

"రాజారావుగారూ, డెయిజీ విష్ చేస్తూంది" అని డెయిజీకీ కన్ను గిలిపాడు సూర్యారావు.

తేరుకొని "అయామ్ సారీ! హల్లో మిస్ డెయిజీ!" అని ముందుకు అడుగు వేశాడు రాజారావు.

చిరునవ్వు నవ్వి స్వాగతం పలికింది డెయిజీ. చేయి చాచింది కరచాలనానికి.

నవ్వులో కరిగిపోయాడు రాజారావు.

చేయి అందుకుని హ్యాండ్‌షేక్ చేశాడు. మెత్తగా పూవులా ఉంది చేయి.

"కమాన్, టేక్ యువర్ సీట్" అని తన ముందున్న సోఫా చూపించింది డెయిజీ.

యాంత్రికంగా కూర్చున్నాడు రాజారావు. సూరి పక్కనున్న మరో సోఫాలో

కూర్చుంటూ బెల్లు నొక్కాడు. బాయ్ వస్తే ఆర్డరిచ్చి, ఒకరిని ఒకరికి పరిచయం చేశాడు. సూర్యారావు చాలా ఉత్సాహంగా ఉన్నాడు.

"వీరు రాజారావుగారు. నగరంలో పేరుమోసిన కాంట్రాక్టరు. మనం నడిచే రోడ్లూ, తిరిగే పార్కులూ అన్నీ వీరు నిర్మించినవే. లక్షలు ఆర్జించారు. లక్షంటే నయాపైసలా భావిస్తారు. దేహీ అన్నవాడికి కాదనలేరు ఈనాటికి. చేతికి ఎముకలేదు. ఎన్ని స్కూళ్లు, ఎన్ని ఆస్పత్రులు కట్టించారో లెక్కలేదు. సినీరంగంలో ప్రవేశించమని ఈ సూర్యారావు ప్రార్థించాడు. అంతే, ఊఁ కానీ అన్నారు. వీరు సినీరంగంలో ప్రవేశిస్తున్నారంటే ప్రొడ్యూసర్లందరి గుండె ఝల్లు మంటూంది. యాడాది తిరక్కుండానే రాజారావుగారి పేరు యావద్భారతంలో మ్రోగిపోతుంది. చూస్తుండు డెయిజీ!"

రాజారావు ఉబ్బిపోయాడు.

"రాజారావుగారూ! ఈమె మిస్ డెయిజీ. ఈ నగరంలో అందం, ఆనందం ఇంకా ఉన్నాయంటే డెయిజీ ఉండబట్టే. ఆ ఖులీ కుతుబ్‌షాకు భాగమతి దొరికింది కాని అప్పుడే డెయిజీ ఉండిఉంటే ఇది అసలు డెయిజీ నగరం కావలసింది. చిరునవ్వు నవ్విందంటే వరాలు రాల్తాయి. లక్షాధికారులు ఈవిడ ఇంటిముందు పడిగాపులు కాస్తుంటారు. ఈవిడ తెరకెక్కిందంటే భారతదేశంలో ఉన్న హీరోయిన్లంతా సైనాయిడ్ వెతుక్కోవల్సిందే..."

కిలకిలా నవ్వేసింది డెయిజీ. "మిస్టర్ సూరీ! చమత్కారంగా మాట్లాడ్తారండీ. సినిమాస్టార్లకు సాయ్‌నాయిడ్ పనిచేస్తుందా?" అన్నది.

నవ్వులో మునిగిపోయాడు రాజారావు. ఏదో చమత్కారమైన మాట అనాలని వెతుక్కున్నాడు. "అయితే, హుసేన్‌సాగర్‌లో పడితేసరి" అనేశాడు.

"పోలీసువారి ప్రాణాలు తీసేస్తారు జనం" అన్నది డెయిజీ, మళ్ళీ నవ్వడానికి ప్రయత్నిస్తూ.

ఇంతలో బాయ్ గ్లాసులూ, సీసాలు తెచ్చిపెట్టి వెళ్ళిపోయాడు.

డెయిజీ గ్లాసులో సోడావేసి కలిపింది. ముందు రాజారావుకు అందించిన తరువాత సూరికిచ్చింది 'ఛీర్స్' అని అంతా పుచ్చుకోవడం సాగించారు.

"ఇంతకూ కథేమిటో చెప్పారుకారు తీయబోయే సినిమాకు కాబోయే డైరెక్టరుగారు." డెయిజీ అడిగింది తానొక సిగరెట్టు తీసుకొని, రాజారావుకు సిగరెట్టు అందిస్తూ. అగ్గిపుల్ల గీసి రాజారావు సిగరెట్టుకు అంటించి తాను అంటించుకుంది.

డెయిజీ ముఖం రాజారావు ముఖం దగ్గరికివస్తే రాజారావు రక్తం వేగంగా ప్రవహించింది. డెయిజీ కళ్ళల్లోకి చూచాడు. చిలిపిగా నవ్వాయి.

"కథా! ఈనాటికి ఆంధ్రదేశంలో అవతరించనంతటి ఉత్తమ కథ తీస్తాడు సూర్యారావు. మన కథను చూచి హిందీ పిక్చర్లవాళ్ళేకాక ఇంగ్లీషు పిక్చర్ల వాళ్ళుకూడా పరేషాన్ అయిపోవాలి. నగ్ననృత్యాలూ, కత్తియుద్ధాలూ, నవ్వులూ, ఏడ్పులూ... అబ్బో! అడక్కు డెయిజీ, పిక్చర్ చూశాడో – పిచ్చెత్తి పోవాల్సిందే."

"అయితే, పిచ్చాసుపత్రులకు గిరాకీ తెస్తుందన్న మాట మన పిక్చరు!" అని రాజారావు నవ్వేశాడు.

"బాగా చెప్పారండీ!" అని డెయిజీ కూడా నవ్వేసింది.

రాజారావు ముఖం విప్పారింది.

సూరి ముఖం వాడిపోయింది. గటగటా గ్లాసు ఖాళీచేసి "మరచాను, నా కొక అర్జంటు ఎంగేజ్మెంటుంది. ఉదయమే వస్తా. ఉంటారుగా ఇక్కడే?" అని లేచాడు.

"మంచిది. నన్నెందు కడుగుతావు, డెయిజీ నడుగు" అన్నాడు రాజారావు.

"రైటో, గుడ్ నైట్!" అన్నది డైజి.

"రైటో" అని గుమ్మందాకా వెళ్ళి కన్ను గిలిపి వెళ్ళిపోయాడు సూరి.

ప్రశాంతమైన వాతావరణం. రాత్రి–గ్లాసుల్లో మధువు – తనముందు సుందరి. ఏదో స్వర్గంలో తేలిపోతున్నట్లనిపించింది రాజారావుకు. గ్లాసు ఖాళీచేసి సిగరెట్టు వెలిగించాడు. ఏదో ఉద్రేకం అతన్ని బాధిస్తుంది. ఎలా వ్యక్తపరచాలో తెలీడంలేదు.

రాజారావు అమాయకతలో మునిగిపోయింది డెయిజీ. తానెంత మందినో చూచింది. కవ్వించింది. నవ్వించింది. డబ్బు లాగేసింది. ఇలాంటి అమాయకత ఒకే ఒకనివద్ద చూచింది. అతడు జార్జి. జార్జి తనకు దక్కలేదు. రాజారావులో జార్జి అమాయకత కనిపించింది. అతని చూపులో ఏదో ప్రార్థన, ఏదో వినతి, ఏదో విన్నపం కనిపించింది. దానిలో అగ్గి, తృష్ణ, అధికారం, అంధకారం కనిపించలేదు.

డెయిజీ చిరునవ్వు నవ్వింది.

"డెయిజీ! చిరునవ్వులో ఎంత అందంగా ఉంటావు? ఏదీ నీ చేయి ఒక్కసారి."

"మిస్ డెయిజీ! నీతో కాఫీ తాగాలని ఎంత కాలంగానో అనుకుంటున్నాను. వస్తావా కాఫీ తాగడానికి?" అన్న జార్జి మాటలు గుర్తుకు వచ్చాయి. వెంటనే కళ్ళు చెమ్మగిల్లాయి. మెల్లమెల్లగా ఏదో దౌర్బల్యం ఆమెలో ప్రవేశింపసాగింది. చెమ్మగిలిన కళ్ళు దాచడానికి లేచి కిటికీ దగ్గరికి వెళ్ళి నుంచుంది.

నగరం యావత్తూ గోతిలో ఉన్నట్లు కనిపిస్తూంది. చుక్కల్లా మిలమిలా మెరుస్తున్నాయి కరెంటు దీపాలు. ఒక ఉల్క రాలింది. అది తనమీద రాలినట్లు జంకింది. రాజారావులో జార్జి కనిపించాడు డెయిజీకి. తాను వచ్చింది రాజారావును మోసగించడానికి. అతణ్ణిచూస్తే తానే లొంగిపోతూంది. అతణ్ణి లోబరుచుకోవలసిందని చెప్పిపోయాడు సూరి. అందుకు డబ్బు కూడా పుచ్చుకున్నాడు మైకేలు. రాజాను డబ్బడగాలి. ఎందుకు జాలి? ఇది తన వృత్తి. ఎంతమందిని తానిలా మోసగించలేదు? కాని, రాజానా? తన జార్జినా?

రాజారావు సోఫాలోనుంచి లేచివచ్చాడు. డెయిజీ వెనకనుంచొని జుట్టు సవరించాడు. "కోపమా డెయిజీ! ఏం కావాలో చెప్పు? నాకేదో కొత్త ఆనందం నీలో కనిపించింది. డార్లింగ్ డెయిజీ! నా జీవితం ఈ రోజు నుంచే బిగిన్ అయినట్లు అనిపిస్తుంది. డెయిజీ, నువ్వు నా రాణివి" అని తనవైపు త్రిప్పుకున్నాడు.

తల వంచుకుంది డెయిజీ. కరిగాడు రాజారావు. అతనిని పిండవలసిందని చెప్పాడు సూరి. తాను దించకుండ అతడే దిగాడు. ఇక అడిగేస్తే? అవును అడిగేయాల్సిందే. "నిన్ను చూచింతర్వాతే నా జీవితం మొదలైంది డెయిజీ" అన్న జార్జి మాటలు గుర్తుకు వచ్చాయి. ఏ మూలనో, ఎక్కడో రాజారావు గుండెలో తన విషయంలో మమత గోచరించింది. దాంతో ఆమెలో ప్రవేశించిన దౌర్బల్యం

మరీ పెరిగింది. లొంగిపోసాగింది. రాజారావును చూచింది. మనిషి అందమైనవాడు కాదు. పొడుగ్గా, బక్కపల్చగా ఉన్నాడు. అయినా, ఏదో ఆకర్షణ కనిపించింది. తాను లొంగిపోతున్నానని గ్రహించింది. దూరం జరగడం మంచిదనుకుంది.

అక్కణ్ణుంచి కదిలింది. అద్దం ముందుకు వెళ్ళి నుంచుంది. అద్దంలో తానే కనిపించింది. ఏదో మమత, ఏదో ఆకర్షణ, ఎక్కడో ఆనందం, ఏదో ఓటమి, ఏదో బలహీనత, ఏదో లొంగుబాటు, ఏమిటో అర్థం కాలేదు. అద్దంలోని తన ప్రతిమను అడుగుదామనుకుంది పిచ్చిది. అది తానేగా! జవాబేమి చెప్తుంది?

రాజారావు వచ్చాడు. గుండె జల్లుమన్నట్లనిపించింది. "డెయిజీ డార్లింగ్! ఎందుకింత కఠినురాలవు అవుతావు? ఈ రోజే ఏదో కొత్త జీవితం, కొత్త ఆనందం, కొత్త వలపు కనిపించాయి నీలో. నాకు ఆస్తికి లోటులేదు. కార్లున్నాయి. బంగళాలున్నాయి. ప్రతిష్ఠ ఉంది. పేరుంది, పలుకుబడి ఉంది. అయినా, ఇన్నాళ్ళనుంచీ కనిపించని, అనుభవించని ఏదో కొత్తదనం నీలో కనిపిస్తోంది. నువ్వు ఊఁ అంటే నా ఆస్తి యావత్తూ పోయినా సినిమా తీసి నిన్ను తారాపథానికి ఎత్తుతాను..."

డెయిజీలో ఘర్షణ ఎక్కువైంది. ఆమెకు తెలియకుండానే గొంతుదాకా వచ్చిన "వద్దు రాజా, వద్దు. సూరి మంచివాడు కాదు. నువ్వు నాశనం అవుతుంటే చూడలేను" అన్న మాటలు మింగి, "నీలో ఏదో ఆకర్షణ ఉంది. నాలో ఏదో దౌర్బల్యం ప్రవేశించింది. రాజా! నేను నీదాన్ని. ఇక నీదాన్నే" అని అతని కౌగిలిలో వాలిపోయింది. గొంతు బొంగురుపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

రాజారావు ఆమె ముంగురులు సవరించాడు. ఓదార్చాడు.

ఆ రాత్రి కొందరికి చీకటి రాత్రి, కొందరికి వెన్నెల రాత్రి అయింది.

★ ★ ★

# రెండు

పార్వతి పాతకాలపు మనిషి. అంటే చదువు రానిదని కాదు. హెచ్.ఎస్సీ. వరకు చదువుకుంది. ఆ సంవత్సరం స్ఫోటకం పోసింది. దాంతో పరీక్ష రాయలేదు. తరవాత ఆమెకు చదవాలనీ అనిపించలేదు. తండ్రి నారాయణరావు బలవంతమూ చేయలేదు. ఆధునిక విషయాల మీద అట్టే మోజు లేదామెకు. నవలలకంటేనూ రామాయణ, భాగవతాల్లాంటి వాటిమీదనే ఆమెకు ఆసక్తి. పౌరాణిక సినిమాలే చూస్తుంది.

పార్వతి స్వతహాగా అందమైందే. చిన్నతనంలో అప్పుడే వార్చిన గంజి చెదిరి పడడంతో ముఖం కుడిభాగం కాలింది. ఆ మచ్చ నేటికీ అలాగే ఉంది. అది అలా ఉండగా స్ఫోటకం ముఖం నిండా మచ్చలను ఏర్పరచిపోయింది. ముఖం అందాన్ని మార్చిన స్ఫోటకం మనసు అందాన్ని మాత్రం మార్చలేకపోయింది.

పార్వతికి పూజలూ, వ్రతాలూ ఎక్కువ. తన పూజకోసం చిన్న పూలతోట పెంచింది. ఎందరు మనుషులున్నా ఆ మొక్కలకు తానే స్వయంగా నీరు పోస్తుంది. తెల్లవారుజామున లేచి స్నానం చేసి ఆ మొక్కల పూలు తెంపి తులశమ్మకు పూజచేసి, పూజ గదిలో ప్రవేశిస్తుంది. ఆ గది అలంకరణ చూస్తే ఇంటి మొత్తంలోనూ ఆ గదిమీదనే ఆమెకు శ్రద్ధ ఎక్కువని గ్రహించవచ్చు. త్రిమూర్తుల అనేక అవతారాలే కాక వారి భార్యాబిడ్డల సహితంగా ముక్కోటి దేవతలూ అక్కడే కాపురం పెట్టారు.

పార్వతి తడివెంట్రుకల విడిముడితో భర్త రాజారావు గదికి మూడవసారి వెళ్లింది. కిటికీలోంచి చూస్తే ఇంకా నిద్రలోనే ఉన్నాడు. నిన్నటి వరకూ తెల్లవారే వరకల్లా ముఖం కడుక్కొని పార్వతి తెచ్చే కాఫీకోసం ఎదురు చూస్తుండేవాడు. కాఫీ తాగుతూ కాసేపు కులాసాగా కబుర్లు చెప్పుకునేవాళ్ళు. కలుగబోయే పాపను గూర్చీ, భవిష్యత్తును గురించీ, ఇంటి విషయాలను గురించీ సరదాగా మాట్లాడుకునేవారు. రాజారావు బయట పడ్డాడంటే ఏ రాత్రికోగాని వచ్చేవాడుకాదు. కాబట్టే అదే పార్వతికి భర్తతో మాట్లాడే సమయం.

పదైనా ఇంకా లేవలేదు ఈ రోజు రాజారావు. లేపుదామనుకుంది. మరొక అర్ధగంట చూద్దామని వెళ్ళిపోయింది. వంటమనిషితో కబుర్లు చెప్పాలని ప్రయత్నించింది. కాని, ఏదో గుండె దడ, ఏదో చిరాకు కలిగింది. కాలు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరిగింది. ఏవేవో సవరించడానికి ప్రయత్నించింది. తీసినవాటిని మళ్ళీ యథాస్థానంలోనే ఉంచింది. పుస్తకం చదవాలని తెరిచింది.

రాముడు లంకకు వచ్చాడు, రావణుని వధించాడు. సీతను రాముని ముందు ప్రవేశపెట్టాడు విభీషణుడు. సీత రాముని ముందు సిగ్గుతో కుంచుంచుకుని కొంగు ముఖాన కప్పుకొని "ఆర్యపుత్రా!" అని ఏడ్చింది. రాముడు తనపక్కన నుంచున్న సీతను చూచాడు. అతనికి క్రోధం పెల్లుబికింది. కనుబొమలు ముడిచి చురచుర

పక్కచూపులు చూస్తూ "నీవు నాకు నేత్రరోగికి దీపంలా ప్రతికూలవై వున్నావు. కాబట్టి, నీకు అనుమతి నిస్తున్నాను – దశ దిక్కులలో నీకు యిష్టం వచ్చిన దిక్కుకు వెళ్ళు. లక్ష్మణుని వద్దగాని, భరతుని వద్దగాని సుగ్రీవుని వద్దగాని ఆత్మపోషణము చేసుకో" అన్నాడు.

సీత సల్లకీ లతలా గజగజ వణకుతూ కన్నీరు కార్చింది. డగ్గుత్తుకతో "లక్ష్మణా! ఈ దుఃఖానికి ఔషధంలాంటిదగు చితి పేర్చు. మిథ్యాపవాదానికి గురియైన నేను జీవించలేను" అన్నది. సీత ఇలా అనగా లక్ష్మణుడు దీనంగా రాముని వైపు చూశాడు. రాముడు అందుకు అంగీకరించాడని గ్రహించి చితి పేర్చాడు.

ఇంక చదవలేకపోయింది, "సీతమ్మ తల్లీ! ఎన్ని చెరలు పడ్డావమ్మా?" అనుకొని "రామయ్యా, ఇంత కఠినమా తండ్రీ? సీత శీలం నీకు తెలియనిదా? ఆమెను చితిలో పెట్టి కాల్చిస్తావా?" అనుకుంది.

పుస్తకం మూసి అక్కడపెట్టి రాజారావు గదికి వెళ్ళింది. ఇంకా నిద్రలోనే ఉన్నాడు. గది తలుపులు తెరచి లోపలికి వెళ్ళింది. తలుపు తెరచే ధ్వనికి లేస్తాడనుకుంది, లేవలేదు. మంచం పక్కన నుంచుంది. దుప్పటి ముఖంమీదినుంచి తొలగించింది. మళ్ళీ కప్పుకున్నాడు. "లేవండి, పదిన్నర అయింది" భుజం తట్టి లేపింది. లేచాడు రాజారావు. పార్వతి కనిపించింది. తెలియని కోపం ప్రజ్వరిల్లిందతనిలో. "ఛీ! నీ పాడుముఖం చూపించడానికి లేపావా? పో అవతలికి" అని కసిరాడు.

పార్వతి వణికిపోయింది. పిడుగు పడినట్లు గడగడలాడింది. గొంతు పూడుకుపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి. మెదడు మొద్దుబారిపోయింది. ఏమనాలో, ఏంచేయాలో తోచలేదు. స్థాణువులా నిలుచుండిపోయింది.

రాజారావు లేచి మంచంలో కూర్చున్నాడు. అలా నుంచున్న పార్వతిని చూచి జాలి కలిగే బదులు కోపం మండింది. "ఎందుకలా రాయిలా నుంచున్నావు? పో ఇక్కణ్ణుంచి" అని చేతితో నెట్టాడు.

పార్వతికి ఏమీ అర్థం కావడంలేదు. ఎందుకిలా అంటున్నాడో ఆలోచించే స్థితిలో గూడా లేదు. తూలి రెండడుగులు వెనక్కువేసి నిలదొక్కుకుని నుంచుంది.

గుమ్మంలో నుంచున్న పార్వతి తండ్రి నారాయణరావు ఇదంతా చూస్తున్నాడు. నారాయణరావు పొడవైనవాడు. స్ఫురద్రూపి. ఒకప్పుడు అతడు బలవంతుడేకాని ఇప్పుడు ఎముకల గూడుకు చర్మం తొడిగినట్లున్నాడు. బాగా వదులైన పైజామా, లాల్చీ వేస్తాడు. చెంపలు ఎండుకపోయిన చెరువుల్లా ఉంటాయి. ముక్కు పొడవు. కళ్ళు ఎప్పుడూ ఎర్రగా ఉంటాయి. అతని బ్రతుకు బ్రాందీ. వినోదం చదరంగం.

పూర్వం సంపన్నుడే నారాయణరావు. గుణవంతుడు, శీలవంతుడు, పరోప కారపారీణుడుకూడా. కాని, అతనికి గుర్రపు పందాలపిచ్చి పట్టుకుంది. దానికి అనుబంధంగా అంటుకున్నదే త్రాగుడు. త్రాగుడు ఆరోగ్యాన్నీ, పందాలు ఆస్తినీ హరించగా అల్లుని ఆశ్రయంలోకి వచ్చాడు. అల్లుడు రోజూ బ్రాందీకి డబ్బిస్తాడు. బ్రాందీ మంచినీళ్ళప్రాయం అయిందతనికి. నల్లమందుకూడా అలవాటు చేసుకున్నాడు. బ్రాందీ, నల్లమందు సేవించడం, ఎవరూ దొరక్కుంటే తానే ఇరుపక్షాల చదరంగపు

ఆట ఆడడం అతని జీవితం. మరో ప్రపంచం తెలియదతనికి. భారతదేశంలో ఆంగ్లప్రభుత్వంవున్నా, ప్రజాప్రభుత్వంవున్నా అతనికి అక్కరలేదు.

రాజారావు మామగారిని ఇంట్లో ఉంచుకొని ఇంతఖర్చు ఎందుకు భరిస్తున్నాడూ అంటే అందులో ఒక రహస్యం ఉంది. రాజారావు కొంత కాలం అబ్కారీ కంట్రాక్టులుచేసి లక్షలు ఆర్జించాడు. కాని, ప్రభుత్వానికి ఎగనామం పెట్టాడు. తెలివిగల అధికారుల సలహాతో ఆస్తినంతా మామగారిపేర పెట్టాడు.

పార్వతి దుఃఖం పొంగింది. జలజలా కన్నీరు రాల్చింది. ఏదో అగ్గిలో పెట్టి ఊదుతున్నట్లూ, కాళ్ళకింది భూమి జారిపోతున్నట్లూ అనిపించింది. తండ్రివైపు చూచింది. అతనిలో చలనం కనిపించలేదు. భర్తను చూచింది. అతడింకా మండిపోతూనే ఉన్నాడు. పైట చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

"ఫో ఇక్కణ్ణుంచి" – గర్జించాడు రాజారావు.

ఎవరో కొరడాతో కొట్టినట్లూ, మెడపట్టి గెంటుతున్నట్లూ అనిపించింది. ముఖాన కొంగు కప్పుకొని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది పార్వతి.

గుమ్మంలో నుంచున్న నారాయణరావు పక్కకు తొలగి దోవ ఇచ్చాడు.

నారాయణరావును చూచాడు రాజారావు. కోపం విసుగ్గా పరిణమించింది. "జేబులో ఉంది తీసికెళ్ళండి, ఇదొకపీడ" అన్నాడు.

నారాయణరావుకు వినిపించింది జేబులో ఉందనే విషయమే. తరవాతదేమీ అతనికి వినిపించలేదు. చరచరా గదిలోకి వెళ్ళి జేబులోంచి డబ్బు తీసుకొని తన గదిలోకి వెళ్ళి చదరంగం ముందు కూర్చుని ఉన్న చంద్రయ్యకు అందించాడు. చంద్రయ్య డబ్బందుకొని సైకిలు మీద వెళ్ళిపోయాడు.

రాజారావుకు ఇంకా రాత్రి మత్తు వదలలేదు. డెయిజీ ఇంకా అతని కళ్ళల్లోనే ఆడుతూంది. ఏదో కొత్త యుగం, కొత్త జీవితం ప్రారంభం అయినట్లుందతనికి. డెయిజీ దగ్గరికి వెళ్ళాలనే తహతహ ఎక్కువైంది. ముఖం కడుక్కున్నాడు. స్నానమైనా చేయకుండా బట్టలు మార్చుకున్నాడు. బయలుదేరుతుంటే కాఫీ, టిఫిను తెస్తున్న పార్వతి ఎదురైంది. ఆమెవైపు చురచుర చూచి వెళ్ళిపోయాడు.

పార్వతి చేతులు వణికాయి.

పోర్టికోలో కారెక్కుతుంటే కనిపించాడు సూరి. అప్పుడే టాక్సీ దిగాడు.

"హల్లో హీరో రాజా! రాత్రంతా రాజ్యమేలావు. అప్పుడే బయలుదేరావే! ఘటికుడివే!! కారు నడుస్తుంటేనే మజా. నుంచుంటే ఏముంది? ఊఁ సాగనియ్." కారెక్కాడు సూరి. కారు సాగింది.

"ప్రొడ్యూసర్ రాజా! పదిమంది కవులు పదేళ్ళు పరితపించినా తోచని పేరు ఎన్నిక చేశా మన సినిమాకు. పేరు ఆహా. ఆ పేరు వింటేనే చాలు, జనం విరగబడాల్సిందే. శతదినోత్సవం తరువాతకూడా బ్లాకులో అమ్మాల్సిందే టిక్కెట్లు. పేరు చెప్పకముందే డిస్ట్రిబ్యూటర్లు విరగపడుతున్నారు! మన పలుకుబడి అలాంటిది. పిక్చరు పేరుతోనే హక్కులు అమ్మేయగలం.

"డిస్ట్రిబ్యూటర్లు మన ఇంటిముందు పడిగాపులు కాయాల్సిందే" అని రాజారావును చూచి "వినడం లేనట్లుందే" అని నసిగాడు.

"వినకేం, వింటూనే ఉన్నా. ఇంతకూ ఆ పేరేమిటో చెప్పావు కాదు?"

"చెపితే ఇంకేముంది? ఆ పేరుకే ఇస్తారు పదివేలు ఎవరైనా. అసలు కథలో ఏముంది? ఉన్నదంతా పేరులోనే. అయినా, పిక్చరు మనం తీస్తున్నాం కాబట్టి, పేరుకు డబ్బులేదు. కాని, పదిమంది సినీ రచయితలు ఉస్మాన్ సాగర్‌కూ, హిమాయత్ సాగర్‌కూ, కిద్వాయ్ గార్డెన్‌కూ తిరిగి తిరిగి చర్చలు జరిపి అంగీకరించారు. వారి ఖర్చులకు అయిదువేలు! ముష్టి అయిదువేలు!! మనం కాబట్టి అడ్వాన్సు లేకుండా అంగీకరించారు. అయిదువేలు అలా పారేశారా అంటే డిస్ట్రిబ్యూటర్లు మన ఇంటిముందు పడిగాపులు కాయాల్సిందే. ఆఁ – మరచాను. రాత్రి బాపతు వేయి ఇచ్చారు కారు. మైకేలు ప్రాణాలు తోడేస్తున్నాడు. ఏదీ, ఒక్క ఆరువేలకు చెక్కు రాసి ఇలా పారెయ్యండి. అది అరవై వేలయి కూర్చుంటుంది."

నయాగరా రావడంతో ఇద్దరూ దిగారు. లిఫ్టులో 103 వ నెంబరు గదికి వెళ్ళారు. తలుపు తీసి చూస్తే గది రిక్తంగా ఉంది. డెయిజీ లేదు.

ఆనంద భాండపు అడుగు ఊడినట్లయింది రాజారావుకు.

డెయిజీ ఆంగ్లో ఇండియన్ యువతి. మెడల వరకూ జారి కత్తిరించిన జుట్టూ, పొడవైన ముక్కూ, పల్చని చెంపలూ, సొగసైన కళ్ళూ, పసిడిఛాయ. అందంగా ఉంటుంది. కళ్ళలో ఏదో సొగసూ, ఆకర్షణా ఉన్నాయి. వాటిని డబ్బుగా మార్చుకోవడంలో నైపుణ్యం సంపాదించాడు మైకేలు. మైకేలు డెయిజీకి తండ్రి కాడు. పెంచి పెద్దచేసినవాడు. అతడే హైస్కూలు దాకా చదివించి, ఒక కంపెనీలో రిసెప్షనిస్టుగా చేర్చాడు. ఆవిడ అందమైన చిరునవ్వుకు డబ్బు చేసుకోవడానికి జీతం బాగానే ఇస్తున్నారు కంపెనీవాళ్ళు. కాని, మైకేలుకు అంతటితో తృప్తిలేదు. అంటే, మైకేలు చెడ్డవాడని కాదు. అతను బైబిలు చదవంది నిద్రపోడు. ప్రతి ఆదివారం తప్పకుండా చర్చికి వెళ్తాడు. వారంరోజులు చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుని మళ్ళీ ప్రారంభిస్తాడు. యవ్వనం డెయిజీలోని అందాన్ని వికసింపచేసింది. ఆ పరిమళం కొంతదూరం వ్యాపించింది. పూవు పరిమళం బేరగానికేం తెలుస్తుంది? అతనికి కావలసింది వ్యాపారం. మన మైకేలు పూలమ్ముకునే వాడనుకోండి. అందాన్ని డబ్బు చేసుకోవడానికి డెయిజీని 'కాల్ గార్ల్'ను చేశాడు.

పట్టణాల్లోని నవ నాగరకులు పాశ్చాత్య పద్ధతుల్లో జీవించాలని ఉబలాటపడ్డారు. ఆంగ్లో ఇండియన్ యువతులు స్వేచ్ఛగా తిరుగుతారు. కిల కిలా నవ్వుతారు. గంతులేస్తారు. వారిని చూస్తే మురిసిపోతారు నవ నాగరకులు. పరిస్థితులకు లొంగిన ఆంగ్లో ఇండియన్ యువతులు వారి డబ్బుకు లొంగిపోతారు. వారితో చెట్టపట్టాలు పట్టుకొని తిరగడం, బార్లల్లో త్రాగడం, కార్లల్లో తిరగడం, డ్యాన్సులు చేయడం వీరి వృత్తి. నాగరకతకు డెయిజీని అప్పగించి డబ్బు చేసుకున్నట్లున్నాడు మైకేలు.

మైకేలుతో బేరమాడి డెయిజీని తెచ్చాడు సూరి. రాజారావు గది వదిలి వెళ్ళేవరకు ఇంకా నిద్రలోనే ఉంది డెయిజీ. ఇంకా ఆమె లేవకముందే వచ్చాడు మైకేలు. లేపాడు. ఆఫీసుకు టైమైందని తీసికెళ్ళాడు. డబ్బు విషయం అడుగుతే తనకేమీ తెలియదని చెప్పింది. కస్సు బుస్సు మని తీసికెళ్ళి ఆఫీసులో దింపాడు.

ఆ స్థితిలో గదిలో ప్రవేశించారు రాజా, సూర్యారావు. రాజా దిగజారిపోయాడని

తెలుసుకొని సంతోషించాడు సూర్యారావు. డెయిజీ వలలో వేసుకుందనుకున్నాడు. ఇక ఉచ్చు లాగడమే తరువాయి అనుకున్నాడు.

"రాజా, ఏమయ్యా! బాణంలా వచ్చి బంతిలా పడిపోయావు! డెయిజీ హైజీ. కహోఁజాయేగీ? కావాలంటే బ్యూటీపెరేడు చేయిస్తాడు సూర్యారావు. డెయిజీయే కావాలంటావా, క్షణంలో రప్పిస్తా" అని ఫోను డయల్ చేశాడు.

"రాజా! ఇలా ఒక చెక్కు పారేయి, అరువేలకు. వచ్చేస్తుంది డెయిజీ. 5,000 ఆ సినిమావాళ్ల ముఖానకొట్టి, వెయ్యి మైకేలుగాని ముఖాన కొడ్తా. ఈ సూర్యారావుకు నయాపైసా అవసరం లేదు. రాజా ఆనందించాలి. అంతే కావలసింది సూరికి. మైకేలున్నాడే, వాడు షైలక్ అవతారం. పుట్టబోయే మైకేలును దృష్టిలో పెట్టుకొనే షేక్స్పియరు వికారాఫ్ ది వేక్‌ఫీల్డు రాశాడు. ఇలా పారెయ్యండి చెక్కుబుక్కు మీకెందుకు శ్రమ?" అని చెక్కుబుక్కు లాక్కొని రాశాడు. యాంత్రికంగా సంతకం చేశాడు రాజారావు. "ఈలోగా కాస్త మందు పుచ్చుకోండి. ఆర్డరిచ్చి వెళ్తా" అంటూ పరుగెత్తినంత వేగంగా నడిచి వెళ్ళాడు సూర్యారావు.

☆ ☆ ☆

డెయిజీ చిరునవ్వు కురిసింది. వెన్నెల విరిసింది. రాజారావుకు నందనం వెలిసింది. దగ్గరికి లాక్కున్నాడు. "నన్ను వదిలి వెళ్ళిపోయావు కదూ! నాకన్నా ఉద్యోగం ఎక్కువైందికదూ?" అన్నాడు.

"మైడియర్ రాజా! వచ్చేశాగా" అని టేబుల్ మీద ఉన్న గ్లాసు రాజాకు అందించింది.

"డెయిజీ డార్లింగ్! నువ్వు ముందుంటేనే మస్తుగా, మత్తుగా ఉంది. ఇంకా గ్లాసెందుకూ?" అంటూనే ఒక్క గుక్క మింగేశాడు.

డెయిజీ కిలకిలా నవ్వింది: "నాకేది గ్లాసు?"

రాజారావు ముఖం వెలవెల బోయింది. ఏదో తప్పు చేసినవాడిలా ముఖం పెట్టాడు. ఏమనాలో అర్థం కావడంలేదు. ఆ అమాయకత్వంలో మునిగితేలింది డెయిజీ.

"ఊరికే అన్నా. వేరే గ్లాసెందుకూ?" అని ఆ గ్లాసుతోనే రెండు గుటకలు వేసి రాజారావు నోటికి అందించింది. రాజారావు ముఖం విప్పారింది. "థాంక్స్" అని మింగేశాడు.

ఈ తడవ డెయిజీకి జార్జి గుర్తుకు రాలేదు. రాజాను తన రాజాగా గుర్తించింది. ఎంత మంచివాడు! ఇట్టే తనవాడై పోయాడు! ఇంతలో సూర్యారావు మాటలు గుర్తుకువచ్చాయి. నీకు చేతకాకుంటే గుర్రప్పందాలకు తీసుకురా, నేనే చూసుకుంటా అన్నాడు. తన చేతకానితనం సూర్యారావుకు చూపదలచలేదు. తానే సాధించాలనుకుంది. కాని, తీరా రాజారావు కనిపించేవరకూ, అతని మాటలు వినేవరకూ తనలో ఏదో బలహీనం ప్రవేశించింది. సినిమా తీయడానికి డబ్బుడగాలి. తండ్రి చెప్పాడు, తాను ఇల్లు కొనుక్కోవడానికి డబ్బిమ్మని అడగమని. ఎలా అడుగుతుంది తాను? ఏదో మమత ఏర్పడింది తనలో. తనను నమ్మినవాణ్ణి నిలువునా మోసం చేయడమా? ఎందరిని మోసగించలేదు తాను? ఎందరికి

తనను అమ్ముకోలేదు? ఏమిటీ దౌర్బల్యం? అడిగేద్దామనుకుంది. పిండుదామనుకుంది. కాని, మనసొప్పలేదు. ఈ పని సూర్యారావుకే వదిలివేయడం మంచిదనుకుంది. భుజాలమీద చేతులువేసి ముఖంలోకి చూస్తూ "డార్లింగ్! ఎప్పుడు ఈ గదిలోనేనా? బయట ప్రపంచంలో ఎంత ఆనందం ఉందో చూచావా? ఈ రోజు 'జాక్ పాట్' గుర్రప్పందాలు ఎలా ఉంటాయనుకున్నావు! సిటీ యావత్తూ అక్కడే ఉంటుందనుకో. ఆడ, మగా జంటలుగా ఎంత ముద్దుగా ఉంటారనుకున్నావ్! మనమూ వెళ్దామా? ఇద్దరమూ జతగా వెళ్ళాలని ఉంది" అన్నది.

గుర్రప్పందాల్లో లక్షలు కోల్పోయినవాళ్ళున్నారు. దివాళా తీసి విషం పుచ్చుకుని చచ్చిన ఒకని విషయమూ తెలుసు రాజారావుకు. నారాయణరావుగారు ఆ పిచ్చితోనే అడుగంటారనీ తెలుసు. అయినా, అవేవీ అతనికి స్ఫురించలేదు. "పద వెళ్దాం, నేనూ ఎన్నడూ చూళ్లేదు." అన్నాడు.

ఇద్దరూ బయల్దేరారు. కారు చాదర్‌ఘాట్ బ్రిడ్జివద్ద ఆగిపోయింది. రోడ్డంతా కార్లమయం అయిపోయింది. బ్రిడ్జిమీద నాలుగు వరసలుగా కార్లు సాగుతున్నా ట్రాఫిక్ కదలడంలేదు. అడుగు కదిలేవరకు అయిదు నిమిషాలు అవుతూంది. ఒకనికంటే ముందు ఇంకొకడు పోవాలని ఆదుర్దా. ముందుకుపోయి మళ్లీ అదే నడక. ట్రాఫిక్ పోలీసుల విజిల్స్. అసలు ఇన్ని కార్లు పట్నంలో ఉన్నాయనికూడా ఊహించలేదు రాజారావు.

"డెయిజీ! ఏమిటి ఇంత రష్?"

"ఆనందం కొనుక్కోవడానికి."

అర్థం కాలేదు రాజారావుకు. చిరునవ్వు నవ్వేశాడు. వెనక కార్ల హారన్లు. కారు నడిపించాడు. రేస్ కోర్సుకు చేరి జంటగా లోనికి ప్రవేశించాడు.

"హల్లో రాజా! వచ్చేశావూ? ఇవ్వాళ నగరం యావత్తూ ఈ కోర్సులోనే వుందనుకో - సినీజనం, రాజకీయాలు, కంట్రాక్టర్లు, వ్యాపారులు, అధికారులు... ఈ జాక్‌పాట్ మనదే-లక్షా యాభైవేలు. అయినా, మనం సినిమా తీయం. మీ పేరే తెరకెక్కాలి. ఆంధ్రదేశం యావత్తూలోనూ రాజారావుగారి పేరు మారుమ్రోగాలి. పదండి గుర్రాలు చూదాం" అని డెయిజీవైపు ఒక రకంగా చూచాడు. డెయిజీ బ్యాండువైపు చూస్తున్నట్లు నటించింది.

రాజారావు కదిలాడు. తెలిసిన కంట్రాక్టర్లు చాలమంది కనిపించారు. కాస్త సిగ్గనిపించింది. కొందరు అమ్మాయిలను రాచుకుంటూ, చేతులు కలుపుకొని తిరిగేవారూ కనిపించారు. అతనికి ధైర్యం వచ్చింది. డెయిజీతో చేతులు కలుపుకొని నవ్వుతూ మాట్లాడుతూ సాగిపోతున్నాడు. ఇప్పుడతని కేదో గర్వంగా, గౌరవంగా అనిపించింది. గుర్రాల్ను జనానికి చూపిస్తున్నారు. "ఆ మూడో నెంబరు గుర్రం చూచావూ? కొట్టిందనే అర్థం! చెవిమీద తెల్లనిమచ్చ, అదీ అసలు అదృష్టం. వేయిపెట్టు, ఎనిమిదివేలు వస్తాయి. ఏ సినిమా తీసి సంపాదించేము? ఏ కంట్రాక్టు చేసి సంపాదించేము? ఒక్క వేయి. గంటలో ఎనిమిదివేలు. ఎంత మంచి చౌకబేరమూ, ఊఁ రాజా! ఒక్క వేయి. ఎక్కువ అవసరం లేదు." డెయిజీవైపు చూశాడు రాజారావు. డెయిజీ మనసు కలవరపడింది. వద్దని చెప్పేద్దామనుకుంది.

అసలు సూరి దుర్మార్గుడని పెద్దగా కేకవేద్దామనుకుంది. సూరి చూచాడు. ఏవో బల్లాలు గుచ్చుకున్నాయి. బాధగానే నవ్వింది.

రాజారావు డబ్బు యిచ్చాడు.

అంతా గ్యాలరీకి కదిలారు. డెయిజీ రాజా ప్రక్కనే కూర్చుంది. సూరి మూడు గ్లాసులు తెచ్చాడు. ముగ్గురూ పుచ్చుకుంటున్నారు. జనమంతా లేచి నుంచున్నారు. కీచు ధ్వని వినిపించింది. "పందెం మొదలైంది" అని రాజా లేచాడు. అంతా బెంచీలమీద నుంచున్నారు. గుర్రాలు పరుగెడుతుంటే గుండెల్లో రైళ్ళు పరిగెడుతున్నాయి. మూడో నెంబరు గుర్రం వెనకబడింది. ఒకటో నెంబరుది వచ్చేస్తూంది. మూడోది ఒకటోదానివెనక వచ్చేసింది. ఈలలు. కేకలు. ఒకటోదాన్ని దాటిపోయింది మూడోది. ఆనందంలో చేతులో గ్లాసుందని మరిచి చప్పట్లు చరిచింది డెయిజీ. గ్లాసు ఢన్‌మని పగిలినది. మూడో గుర్రం దూసుకుపోయింది.

రాజారావు గెలిచాడు.

డెయిజీ చేయి గట్టిగా నొక్కి కౌగలించుకున్నంతపని చేశాడు.

సూరి షేక్ హ్యాండిచ్చి కౌగలించుకున్నాడు.

మళ్ళీ బుక్కీస్ దగ్గరికి బయల్దేరారు.

ఆ రోజు జరిగిన నాలుగు పందాలలోనూ పోనూ రానూ రాజారావుకు పదివేలు పెచ్చువచ్చింది.

రాజారావు మహదానందంలో ఉన్నారు.

సూర్యారావు సినీజనాన్ని డెయిజీ సహితంగా రాజారావుకు పరిచయం చేశాడు.

రాజారావు తన అంతస్తు హోదా, గౌరవం పెరిగినట్లుగా భావించాడు.

సూరిమీద గౌరవభావం ఏర్పడింది.

"ఎక్కడికి వెళ్దాం?" అడిగాడు రాజా.

"మళ్ళీ మురికిపట్నంలో కెందుకు? చలో గండిపేటకు" అన్నాడు సూరి.

"బ్యూటిఫుల్ అయిడియా! మూన్‌లైట్ ఎంజాయ్ చేయాలంటే గండిపేటకే వెళ్ళాలి" అనేసింది డెయిజీ.

"ఆల్‌రైట్, పదండి" అని రాజారావు కారెక్కి స్టీరింగ్ అందుకున్నాడు. మిగతా ఇద్దరూ కారెక్కారు. కారు కదిలింది.

"మైడియర్ రాజా! గ్రహాల్ను గడియారం ముల్లులాగా తిప్పేశావోయ్. లక్ నీ చెక్‌లో కొచ్చేసింది. ఇక నీవు పట్టిందే బంగారం. నా జాక్‌పాట్ పోయినా నీకో లక్‌పాట్ వచ్చేసింది. ఈ సూర్యారావున్నాడు చూచావూ – తనకోసం బ్రతకడు. నువ్వు మురిసిపోయావా? అంతేచాలు వీడికి. అన్నట్లు మరచా. నాకు నయాగరాలో అర్జంటు ఎంగేజ్మెంటుంది. నాకో బుల్బుల్ దొరుకుతే ఉస్మాన్‌సాగర్‌లో పడ్తా. నన్ను నయాగరాలో డ్రాపుచేయి."

డెయిజీ కృత్రిమపు నవ్వు నవ్వింది. కళ్ళలో భయం దడ దడలాడింది. కొంత డబ్బు కాజేసి నయాగరావద్ద దిగిపోయాడు సూర్యారావు.

కారు శరవేగంగా సాగిపోతూంది.

"ఒరే పోచిగా! ఓరి పోచిగా!" అని కేకలేస్తూ, పరాకుగా పరి
పిచ్చయ్య అడ్డురావడంతో జర్క్ ఇచ్చి కారు ఆగిపోయింది. కారు ఆగింది సహితం గమనించకుండా పరిగెత్తాడు పిచ్చయ్య. పోచయ్యను పట్టుకున్నాడు.

త్రాగనని ఒట్టేసుకున్నాడు పోచయ్య. అదీ తన లచ్చిమీద. కూలి నుంచి తిరిగి వచ్చేప్పుడు సంచిలో బియ్యం వగైరాలు తీసుకొని ఇంటికి వెళ్తున్నాడు. లక్ష్మికోసం సన్నజాజి పూల మాలకూడా కొన్నాడు. లక్ష్మి సినిమాకు వెళ్దామంది. పని దగ్గరనుంచి త్వరగా బయలు దేరుదామంటే కంట్రాక్టరు తెమలనిస్తేనా? వారం పొడుగునా కూలి చేసినా విసుక్కొని నసుక్కొని ధర్మం చేసినట్టు డబ్బిస్తాడు. అందులో అనేక కోతలు, పండక్కిచ్చినది, పెళ్ళికిచ్చింది. డబ్బు చేతిలో పడేవరకే ఆలస్యం అయింది. గుండె కలుక్కుమంది. అయినా, లచ్చి తయారుగా ఉంటుంది అనే ఉత్సాహంలో అన్నీ కొని బయలుదేరాడు. స్నానంచేసి, తెల్లబట్టలు వేసుకొని లచ్చితో కలిసి సినిమాకు పోవడం తల్చుకుంటే అతనికీ గర్వంగా ఉంది. పూలు తురుముకొని తెల్లచీర కట్టుకున్న లచ్చి ప్రక్కన తానుండటాన్ని ఊహించుకుని మురిసిపోతూ ఫుట్ పాత్ మీద సాగిపోతున్న పోచయ్యకు పిచ్చయ్య కేకలు వినిపించలేదు.

అమాంతంగా వెనుకనుంచి వచ్చి జబ్బ పట్టుకు లాగాడు పిచ్చయ్య. పోచయ్య వెనక్కు తిరిగి చూచాడు. పిచ్చయ్య! ఉలిక్కిపడ్డాడు. గజగజా వడకాడు. బియ్యపు సంచి పడిపోతుందేమోనని గట్టిగా పట్టుకొన్నాడు.

"ఒరే పోచిగా! ఏందిరా ఇంత పొద్దాల పోతున్నావు? ఇయ్యాల ఉన్నదిర మజా. కంపోన్ కనపడ్తాంటే ఎట్లపోతున్నవుర! అగ్గో పరమయ్య సుత సస్తాండు. నడువ్ ఒక్క చప్టీ కొట్టిపోదాం."

ఇంతలో పరమయ్య వచ్చేశాడు. "అలికి గులామయినావుబే. భాడ్ ఖావ్! లచ్చి వద్దన్నదనుకో. నువ్వేమన్నా తాగుబోతు వైనావుబే! అప్పుడింత ఇప్పుడింత త్రాగు. పెద్ద దెబ్బ కొట్టేందు" అని ఇద్దరూ కలిసి లాక్కోపోయారు పోచయ్యను.

పోచయ్య మాట్లాడలేకపోయాడు. ఒకవైపు కల్లు సీసాలూ, రెండోవైపు తెల్లచీర కట్టుకొని పూలు తురుముకున్న లచ్చి. లచ్చి తనకోసం ఎదిరి చూస్తుంటుంది. తాను ఒట్టేసుకున్నాడు. తాగి ఇంటికి చేరితే, లచ్చి – తన లచ్చి ఏమనుకుంటుంది? లచ్చి నవ్వు, జతగా సినిమా కెళ్ళడం – లచ్చి లాగేసింది పోచయ్యను.

ముందు సీసా లున్నాయి, పక్కన బియ్యపు సంచీ, ఎదురుగా ఇద్దరు కూర్చుని ఉన్నారు. వారిని బ్రతిమిలాడి లాభంలేదు. తాను ఎదిరించలేడు. లచ్చి పూలను గురించీ తెల్లచీరను గురించీ ఎలా చెపుతాడు? ఏం చేయాలి? ఏం చేయాలి?

"కొట్టరా పోచిగా, సునాయించు ఒక షేర్" అన్నాడు పిచ్చయ్య.

"పిచ్చయ్యన్న! కడుపునొస్తోందే. జర ముంత పట్కపొయ్యొస్త" అని ముంత తీసుకొని బయలుదేరాడు. కనుమరుగయ్యేదాకా నడచి ముంత బద్దలుకొట్టి పరిగెత్తాడు.

గుడిసెముందు కూర్చొని చిన్న అద్దంముందు తల దువ్వుకుంటూంది లక్ష్మి– పోచయ్య తేనున్న పూలు తురుముకోవడానికి. పోచయ్య వచ్చాడు. ముఖం పీక్కోపోయింది – చేతులో సంచీలేదు. మౌనంగా వంగి గుడిసెలోకి దూరాడు, లక్ష్మి గుండెపగిలింది. ఉత్సాహం నీరుకారిపోయింది. దువ్వెన తలలోనే వుంది.

అమాంతంగా లేచి గుడిసెలోకి దూరింది. పోచయ్యకు దుఃఖం పొంగివచ్చింది. "లచ్చీ!" అని భుజంమీదపడి బావురుమన్నాడు. అర్థం కాలేదు లక్ష్మికి. కాళ్ళు వడికాయి. దుఃఖం పొంగింది. లక్ష్మికూడా ఏడ్చేసింది. ఒకరిని చూచి ఒకరు ఏడుస్తున్నారు. ఎందుకు ఏడుస్తున్నారో ఎవరికీ తెలియదు.

"లచ్చీ! తాగలేదు లచ్చీ! తాగలేదు. నూకలసంచి పోయింది లచ్చీ, నూకలసంచీ. పూలు సుత తెచ్చిన. అయ్యి సుత పోయినయి. సైకల్ మోటరోడ్డడ్డ మొచ్చిండు. బెదరి సంచి పడేసిన. సంచిమీద గాడిపోయింది. లచ్చీ! పూలు పోయినయి. లచ్చీ, పూలు" అని ఏడ్చేశాడు.

అర్థం చేసుకుంది లక్ష్మి. "అయ్యో! దెబ్బల్తగలలేదుగద!" అని వళ్ళంతా చూచింది. "పోతే పోయినైలే. ఒక్కపూట ఉపాసముంటం. దెబ్బలు తగులలేదు. అంతనేచాలు. మాంకాళమ్మదయ" అని పైటతో పోచయ్య కన్నీరు తుడిచింది. పోచయ్య లక్ష్మి కన్నీరు తుడిచాడు. కమ్ముకున్న చీకటితెర తొలిగిపోయింది. లక్ష్మి చిరునవ్వు నవ్వింది. పోచయ్య మనసులో వెన్నెల విరిసింది. సినీమా కోసరం ఉంచిన డబ్బుతో నూకలుతెచ్చి వండేసింది లక్ష్మి. ఇద్దరూ తిన్నవి కారంమెతుకులే అయినా పంచభక్ష్య పరమాన్నాలు తిన్నట్లు ఆనందించారు.

☆ ☆ ☆

"ఒరే పోశిగా! ఓరి పోశిగా! తీయ్ బే తడక. సంచి తెచ్చినంర, గట్ల పారొస్తి వెందుకో" అని తడక తట్టాడు పరమయ్య. తడక తీసి సంచి అందుకుంది లక్ష్మి. "కంపోన్ల ఇడిచి పారొచ్చిండే" అని అందించాడు. అందుకుని తడికేసుకుంది లక్ష్మి. అంతా గ్రహించింది. ఆమెలో ప్రేమ పెల్లుబికింది. "ఎంత మంచోనివి!" అని కౌగలించుకొని ముద్దు పెట్టుకుంది. సంచిలోని జాజిపూలదండ లక్ష్మి తలలో తురిమాడు పోచయ్య. మురిసిపోయాడు.

★ ★ ★

# మూడు

పూర్వం అసఫ్జాహీ వంశంలోని ఒక నవాబుకు సంతానం కలుగలేదు. అతడు ఎంతోమంది దేవుళ్ళకు మొక్కాడు. మసీదులు దేవాలయాలు కట్టించాడు. అయినా, ఫలితం కలుగలేదు.

మక్కా నుండి ఒక ఫకీరు హైద్రాబాదుకు వచ్చాడు. అతడు నేరుగా ప్రధానమంత్రి దగ్గరికి వెళ్ళాడు. తాను నవాబును దీవించ తలచుకున్నాననీ, అందువలన తప్పక నవాబుకు సంతానం కలుగుతుందనీ చెప్పాడు. ప్రధాని నవాబుతో ఆ విషయం విన్నవించాడు. నవాబు ఫకీరు దీవనలు అందుకోవడానికి అంగీకరించాడు. కాని ఏనుగును ఎక్కే అధికారం ఉన్నవాడు మాత్రమే నవాబును దీవించే అర్హత కలిగి ఉంటాడని మనవి చేశాడు ప్రధాని. ఆ అర్హత ఫకీరుకు కల్గించాల్సిందని ఆదేశించాడు నవాబు. జాగీరు కలవాడు మాత్రమే ఏనుగును ఎక్కే అర్హత కలిగి ఉంటాడని నివేదించాడు ప్రధాని. ఆ నియమాలు విసుగు కలిగించాయి నవాబుకు. అయినా, అతనికి జాగీరు ఇవ్వాల్సిందని ఫర్మాను జారీచేశాడు నవాబు.

ఫకీరుకు జాగీరు లభించింది. ఏనుగు నెక్కాడు. నవాబును దీవించాడు. తరువాత నవాబుకు సంతానం కలిగిందీ లేనిదీ మన కథకు సంబంధించింది కాదు. అయితే, ఫకీరు బంగళా కట్టుకొని బేగమ్‌ను తెచ్చుకొని సుఖంగా ఉంటున్నాడు.

ఒకనాటి ఉదయం నైజాంనవాబు తమ బంగళామీద ఎక్కి నగర సౌందర్యం తిలకిస్తున్నారు. జాగీర్దారుగా మారిన ఫకీరు బంగళామీద వెంట్రుకలు ఆరబెట్టుకుంటున్న బేగం కనిపించింది. అమె పారసీక దేశపు సుందరి. అమె సౌందర్యం చూచి ముగ్ధుడైనాడు నవాబు. మన్మథ తాపంలాంటివన్నీ అనుభవించి ఆ యువతిని తీసుకొని రావలసిందని హుకుం జారీ చేశాడు.

ప్రధానికి ఆ విషయం తెలిసింది. ప్రధానికి ఫకీరంటే భక్తి. తాను చేయగలిగింది రాజాజ్ఞను గురించి ఫకీరుకు ముందుగా తెలియపరచడం. ఆ పనే చేశాడు ప్రధాని.

ఆ రాత్రి ఫకీరు బంగళాకు నిప్పంటుకుంది. మంటలు ఆకాశాన్నంటాయి. నగరం యావత్తూ హాహాకారాలతో నిండిపోయింది. పట్నం అంతా కలిసి మంటలను ఆర్పారు. ప్రధానీ, నవాబు లోనికివెళ్ళి చూచారు. కాలి కూలిన ఫకీరు, ఫకీరు భార్య శవాలు కనిపించాయి. ఇద్దరూ కన్నీరు కార్చారు.

అది శాపదగ్ధ స్థలమనీ, అక్కడ ఎవరూ ఇళ్ళు కట్టుకోరాదనీ ఫర్మాన్ జారీ చేశాడట నవాబు.

ఆ ఫర్మాను ఎంత నిజమో, ఆ కథలో ఎంత సత్యం ఉందో తెలీదుకాని అక్కడ కొన్ని శతాబ్దాలపాటు ఎవరూ ఇల్లు కట్టుకోలేదు. ఆ శాపం సంగతి తెలిసీ గుడిసెలు వేసుకొని ఉంటున్నారు బాలయ్య మొదలైనవారు ఆ ప్రాంతంలో.

పల్లెల్లో జమీందార్ల దౌర్జన్యాలు పెరగడం, చిన్నచిన్న నేలచెక్కలవాళ్ళు వ్యవసాయం చేసుకోలేకపోవడం, చేతి పరిశ్రమలు మూలపడ్డం, ఊళ్ళలో పక్షాలూ, కక్షలు పెరగడం

మూలాన జనం పల్లెలు వదిలి పట్నాలు పట్టారు. అలా పట్టిన పేదలు వెంట రెక్కలుతప్ప వేరేమీ తెచ్చుకోలేదు. ఉండడానికి స్థలం చూచుకుంటూ విడిగా ఉన్న స్థలాలలో గుడిసెలు వేసుకున్నారు. ఇవే మనం నగరాలకు పీడలనే మురికి పేటలు. అక్కడ లైట్లుగానీ, పంపులుగానీ ఉండవు. మురుగు దొడ్లకు మైళ్ళు నడవాలి. డ్రైనేజి ఉండదు. ఏ ఇంటికి ఆ ఇంటిముందే ఒక మురికి కాలవ. దోమల ఉత్పత్తి పంచవర్ష ప్రణాళిక అంచనాలను అధిగమిస్తుంది. పిల్లల శౌచాన్ని శుభ్రం చేయడానికిమాత్రం వస్తుండే పందులు మనుషులతో సహజీవనం చేస్తుంటాయి.

హైదరాబాదులో ఉన్న 273 మురికి పేటల్లో మూడున్నర లక్షల మంది ఉంటున్నారని మున్సిపాలిటీవారి అంచనా.

ఈ మురికి పేటలో బాలయ్య గుడిసె, పోచయ్య గుడిసె ఒకదానికి ఎదురుగా ఒకటి ఉన్నాయి. ఆ రెండిండ్ల మధ్యనున్న ఇరుకు సందులోంచి వెడితే ఎడమవైపు గొందిలో పిచ్చయ్య గుడిసె ఉంది. కుడివైపు సందులో ఉన్న పెద్ద మురికి గుంట ముందున్నది పరమయ్య ఇల్లు. ఇవికాక ఇంకా అనేక గుడిసెలు చిందరవందరగా ఉన్నాయి. అన్నిటికీ మున్సిపాలిటీవారి నంబర్లున్నాయి. అందరూ ఓట్లకు అర్హతగల భారత పౌరులే. అందరూ పన్నులు చెల్లిస్తున్నవారే. కాని, వీరిని మనుషులే కాదు, దేవుడూ విస్మరించాడు. అయినా, వారికి ఆ ఇద్దరిలో విశ్వాసం చావలేదు.

శనివారం కావడాన లక్ష్మి తలమీంచి స్నానం చేసి వెంట్రుకలు ఆరబెట్టు కుంటూంది. బాలయ్య రిక్షా తుడుస్తున్నాడు. పోచయ్య టిఫెన్ క్యారియర్ తుడిచి పనికి వెళ్ళడానికి తయారు అవుతున్నాడు.

మురికి పేటకు కొద్ది దూరరలో ఒక మార్క్ టూ అంబాసిడర్ కారు ఆగింది. కారు దిగి డ్రైవరు గుడిసెలవైపు పరిగెత్తాడు జనాన్ని పిలవడానికి. అందులో ఉన్న ఉస్మాన్, సూర్యారావు ఇద్దరూ లక్ష్మిని చూచారు. ఆమె అందం చూచి ఇద్దరూ ముగ్ధులయ్యారు. సూర్యారావు కారు దిగి, ఆమెను చూస్తూ ఉండిపోయాడు. అతనికి ఏవేవో ఆలోచనలు వచ్చాయి. అల్లాంటివే కొన్ని ఆలోచనలు ఉస్మాన్ మెదడులోనూ మసిలాయి.

ఉస్మాన్ పొట్టివాడు. బలిష్ఠుడు. ఖద్దరుతప్ప అన్యం ధరించడు. తెల్లని షేర్వానీ, చుడీదార్ పైజామా మాత్రమే కాక గాంధీ(కి) టోపీ పెడ్తుంటాడు. టోపీ లేకుంటే అతని వ్యక్తిత్వానికి ఏదో లోపం కలిగినట్లు అతనికే కాదు – మనకూ అనిపిస్తుంది. గాంధీ టోపీకి ముందు సైతం అతనికి టోపీ పెట్టడం అలవాటే. అయితే, అప్పుడతను పెట్టింది కుచ్చుటోపీ. పోలీసుచర్య జరిగి హైద్రాబాదులో భారత సైన్యాలు ప్రవేశించిననాటినుంచీ గాంధీ టోపీయే ధరిస్తున్నాడు. భారత సైన్యానికి మొట్టమొదట స్వాగతం చెప్పింది తానేనని అతి గర్వంగా చెప్పకుంటాడు. కాని, అంతకు ముందు రజాకార్లకు సాలార్‌గా ఎంతమందిని బలిగొన్నదీ చెప్పకోడు. గిట్టనివాళ్లు అతణ్ణి తారసకాడంటారు. కాని, అతడు మంత్రులతోనూ, మహా నాయకులతోనూ తీయించుకున్న ఫోటోల ఆల్బం ఎప్పుడూ అతని దగ్గర ఉంటుంది. ఆ పలుకుబడే అతనికి జీవిక ప్రస్తుతం. అతణ్ణి గురించి ఇన్ని విషయాలు మనం తెలుసుకోవడం తప్పే, ప్రస్తుతం అతను విచ్చేసింది ఈ గుడిసెల వాళ్ళను ఉద్ధరించడానికి అయినపుడు.

బాలయ్య, పిచ్చయ్య, పోచయ్య, పరమయ్య, ఇతరులూ కారు దగ్గరికి వచ్చి సలామ్ చేశారు. ఉస్మాన్ ప్రతి సలామ్ చేసి ఆల్బంతో సహా కారు దిగి "ఆ లడ్కీ ఎవరు?" అని అడిగాడు. అంతా వెనక్కు తిరిగి చూచారు. అప్పుడుగాని గ్రహించలేదు లక్ష్మి తన నెవరో చూస్తున్నారని. వెంటనే గుడిసెలోకి దూరింది.

"అదానుండి. పోరుద్రి, దానికి ఇంక చిన్న పెద్దరిక లేదుద్రి. ఇగోగీ పోచిగాని పెండ్లం. మొన్ననే లగ్గమైందుండి" అని, "వచ్చిన మత్లబు చెప్పక పోతిరి" అడిగాడు బాలయ్య.

"అప్సర కాలుజారి నేలమీద పడి ఇల్లు వెతుక్కుంటూ ఇటు వచ్చిందేమో ననేట్లుంది. అప్సరసలను తల తన్నిన అందం – ఆహా! డబ్బులేదు కాని, ఇలా ఇలా ఇక్కడ నుంచున్నట్టే మువీ కెమెరా తెప్పించి ఫిలిం తీసేవాణ్ణి. తలా వేయి చందా ఇస్తే రేపీపాటికి డాక్యుమెంటరీ తీసేస్తా – 'పంకంలో పద్మం' " అని సూరి యింకేదేదో చెప్పబోతుంటే అతని వాగ్ధారను ఆపడానికి ఉస్మాన్ ఉపన్యాసం ప్రారంభించాడు:

"నేను మీకు మద్దత్ చేసేటందుక్కు వచ్చిన – చందా లడిగి సినిమా తీసేటందుక్కుకాదు" – సూరి నోరుమూసి అటూ యిటూ చూచాడు. గుడిసెల వాళ్ళంతా ఏవగింపుగా ఒకసారి అతణ్ణిచూచి ఉస్మాన్ చెప్పే మాటలు వినసాగారు.

"జోడ్డి లేసుకున్న జమీన్లన్ని హడప్ చేయాల్నని చూస్తున్రు మాలిక్‌లు. జమీన్ దామ్ రోజ్ రోజ్కి బఢాయిస్తోందని ఎరికేకదా! జోడ్డిల్లుండేది గరీబులు. వాళ్ళతా నేముంటది? ఈణ్ణించి హటాయించి న్రనుకో. మళ్ళ యాడ బసాయిస్తరు? గరీబోల్ల కాణ్ణుంచి జమీన్ ఖించాయించుకొని రుప్యాచేస్కునేటందుక్కు చూస్తాన్రు అమీర్లు. జోడ్డిలోల్లకు ఖిద్మత్ చేసేటందుక్కు ఒక అంజుమన్ పెట్టినం. మినిస్టరుకు భీ అంజుమన్ మత్లబు సునాయించినం. ఆయినభీ మదద్ చేస్తనన్నడు. గుడిసెల్ను ఉఠాయించె టందెక్కెవడన్న వచ్చిండనుకోరి, నాకు ఇత్తలా ఇయ్యండ్రి. నేను టెలిఫోను మీద మినిస్టరు సాబుకు ఇత్తలా ఇస్త. ఆయినగాడిల కూకుండి జట్న వస్తడు. వచ్చినోణ్ణి భగాయిస్తడు. నిన్ననే నేను మినిస్టర్ను కల్సి తస్వీర్ దిగినం చూడ్రి. ఈ మినిస్టరున్నడే – శానమంచోడు. గరీబ్ అవామ్‌కు కిద్మత్ చేసేటోడు.

ఈ పన్లన్ని చేసేటందుక్కు పైకం కావాలె కద! పైకం లేంది ఏమన్న ఎల్లుతాది ఈ జమాన్ల? మీరు జోడ్డికి పాంచ్ రూపైలు వసూలు చేస్రియి. ఇక మీరు బేఫికరుండ్రి. మీ కేమన్నావస్తే నా జాన్ అడ్డమేస్త. మల్ల మహెనకు పాంచ్ రూప్య. అంతే. ఇయ్యక పోయిన్రనుకోరి, తెల్లారేటాల్కల్ల గుడిసెలు ఉఖ్డాయిస్తరు. ఏమంటరు?" అని అందరివైపు చూచాడు.

అప్పటికి చాలమంది కూడారు కారు చుట్టు. ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. వారికి ఏమీ అర్థం కాలేదు. వారికి తెలిసిందల్లా అయిదు రూపాయీ లివ్వకుంటే గుడిసెలు ఊడబెరుకుతారని. కాని, అయిదు రూపాయీలంటే మాటలా? ఏం చేయాలో ఎవరికీ అర్థంకాలేదు. బాలయ్యే ముందుకు వచ్చాడు. "దొర! నీ కాల్మొక్త. పట్టుపట్టమంటే అయిదు రూపాయి లాణ్ణుచొస్తయుండి? జర సబర్ చేయుద్రి. పైలీకి వసూలు చేసి ఇస్తం. జర మెహర్బానీ ఉంచుండి గరీబోల్లమీద. ఎట్లనన్న చేసి ఇస్తంగాని గుడిసెలు పీకించకుండి. నీ కాల్మొక్తం. మే మొచ్చినప్డిడొక్క బంగ్లనన్న

లేకుండె. అసలు ఇల్లున్నాదుండి? మేమె గుడిసె లేస్కున్నం. సరేనండి, పైలికి తెచ్చిస్తం. కావల్నంటే పేర్లు రాస్కపోండి. ఏమంటారు?" అని అందరిని అడిగాడు.

"బాలయ్యన్న కన్న ఎక్కు వేరికెనానానె మాకు. నువ్వెట్ల చెపితే గట్లేంటం" అన్నారు వాళ్ళంతా.

"సరె నంట్రాను దొర. పైలిక్కాదుగని దుస్రీకి తెచ్చిస్తం. వాయిద చేసి ననక తప్పరుండి గరీబోల్లు."

"సర్ సిల్సిలన పేర్లు చెప్పండి, రాస్కపోత. దూస్రీకి తెచ్చిస్తరు కద? వాయిద తప్పొద్దు. నా ఇల్లాదున్నదో ఎర్కైన? చార్మినార్ తాన. పత ఎరికెనా?" అని అడిగిన ఉస్మాను, జవాబు కోసరం ఎదిరి చూడకుండానే విజిటింగు కార్డు బాలయ్యకు అందించి "ఈ కారటు చూపిస్రంటే నా మకాన్ దిఖాయిస్తరు" అని చెప్పి, "పేర్లన్నీ సిల్సిలగ రాయించుండి. గీ పేర్లున గుడిసెల్దే నా జమ్మెదారీ" అన్నాడు కాస్త కరుకుగా.

"గరీబోల్లం బాంచను. జర మెర్బానీ ఉంచుండి. కోప్పడ్తే ఎట్ల బతుకుతం? పైకమంత ముట్టచెపుతంగాని జర కాపాడుండి. మా రాముడు పుట్టినప్పడొచ్చినం. అని కిష్నడిరవై ఏండ్లొచ్చే. గిప్పుడు పొమ్మంటే యాడికి పోతం? మీరే రచ్చించాలే" అని, "పేర్లు రాయించుండిర సిల్సిల్న, పనికి పొయ్యే యాళై తాంది" అన్నాడు బాలయ్య.

ఒక్కరొక్కరే ముందుకు వచ్చి నూరుపేర్లు రాయించారు. పేర్లు రాసుకొని ఉస్మాన్ సాహెబ్ సూరితో కలిసి వెళ్ళిపోయాడు.

ఉస్మాన్ను గురించి తలా ఒకరకంగా వ్యాఖ్యానిస్తూ గుడిసెలకు చేరి పనులకు వెళ్ళడానికి తయారవుతున్నారు. పోచయ్య గుడిసెలోకి రాగానే లక్ష్మి "నాకేందో బుగులు గున్నదే. ఎందుకొచ్చిను వాళ్ళీడికి?" అని అడిగింది.

"గుడిసెల్నెవరో పీకుతమంటాన్రట. పీకకుండ చేసేటందుక్కు సంగం పెట్టిన్రట. చందలడిగేతందుక్కు వచ్చిన్రు."

"సైతానున్నట్లున్నడు. వాడెట్ల చూసిండు! వాడు చూసిన కాణ్ణించి దుగులైతాంది. నేనియ్యాళ పనికి పోను. నువ్వుసుత పోవద్దు. ఒక్కదాన్నుండలేను."

"ఏమో! ఎల్తలేవు, ఇయాళ సుత పనికి నాగ పెడ్తవా?" అంటూ బాలయ్య వచ్చాడు.

"బాలయ్యన్న! లచ్చి బుగులైత దంటాందే. ఇంట్ల ఉండమంటాంది" అన్నాడు పోచయ్య.

"ఎందుకే లచ్చి బుగులు? కష్టం చేసుకుంటేనే ఎల్తలేదు. ఇంట్లకూకుంటే ఎట్ల ఎళ్తది? ఇదోచూడు లచ్చి! నువ్వీ గూడానికి దేవతసువంటి దానివి. నిన్నే మన్నంటే ఎవడన్న బతుకుతాడే? లే, లేచి పనికి పో" అని ఇద్దరినీ పనికి పంపి బాలయ్య రిక్షా తొక్కుతూ వెళ్ళిపోయాడు.

బాలయ్య బలవంతాన బయలుదేరిందిగాని భయం భయంగానే పనిచేసే చోటికి చేరింది లక్ష్మి. గేట్లో ప్రవేశిస్తుండగానే వెనకనుంచి పెద్దగా కారు హారను వినిపించి అదిరిపడి వెనక్కు జరిగింది. ఆ అదురుపాటుతో చేతిలో టిఫిను జారి కిందపడి

మూత ఊడి అన్నం నేలమీద పడిపోయింది. కారు ముందుకు వచ్చి టిఫిను మూతను నలక్కొట్టి నిలిచిపోయింది.

అది రాజారావు కారు. ఇదివరకు రాజారావు తన పనులు జరిగే చోటికి ప్రతి రోజూ వస్తుండేవాడు. కాని, ఈమధ్యన ఎప్పుడోగాని రావడంలేదు. పనులన్నీ చంద్రయ్య బాధ్యతమీదే జరుగుతున్నాయి. అందువల్ల రాజారావు తన యజమాని అని లక్ష్మికిగాని, లక్ష్మి తన కూలీల లోనిదని రాజారావుకుగాని తెలియదు.

భయంతో వణికిపోతూ, తానేదో పెద్ద నేరం చేసినట్లు రెండు చేతులూ జోడించి నీరు నిండిన కళ్ళతో నిలిచి ఉన్న లక్ష్మిని చూచాడు రాజారావు. క్షణం అలానే చూస్తూ ఉండిపోయాడు. ఆ అందం, ఆ భయం, ఆ తత్తరబాటు, ఆ దుఃఖం అతన్ని కలవరపెట్టాయి.

యజమాని వచ్చాడని చంద్రయ్య పరిగెత్తివచ్చి దృశ్యం చూచాడు. యజమానికి నమస్కరించడం కూడా మరిచి, "ఏయ్ లచ్చి! ఏందట్ల నిలబడ్డవు? ఎంత పొద్దెక్కిందో కండ్ల పడ్తలేదా? నడువు, జల్ది పనిమీద ఎక్కు" అని కేకలు వేశాడు.

గిన్నెమూత నలిగిపోయింది. గిన్నె దొర్లిపోయి రోడ్డుమీద పడింది. అన్నం మట్లో కలిసిపోయింది. మిగిలిన గిన్నె తీసుకొని వెళ్ళాలా, ఇలాగే వెళ్ళాలా అనే సందిగ్ధంలో పడ్డది లక్ష్మి.

"చెప్తాంటే ఇనపడ్తలేదా? వస్తవా రేపణ్ణించి పొద్గాల పన్లకిరా, లేకుంటే బంద్ చేయి. ఆఁ – నడువ్" అన్నాడు చంద్రయ్య.

లక్ష్మి ముందుకు అడుగేసింది. కార్లోంచి "ఆగు" అని తలుపు తెరుచుకొని దిగాడు రాజారావు.

కారు తలుపు పడిన చప్పుడు, రాజారావు కేక విని దభాల్న ఆగి వెనక్కు తిరిగింది లక్ష్మి. పనిలోంచి తీసేస్తారేమో అనే భయంతో గజగజ లాడింది.

"నీ టిఫిను నా కారుకింద పడి నలిగిపోయింది. అన్నం పడిపోయింది. ఇదిగో, ఈ డబ్బు తీసుకో" అని పది రూపాయలు అందించబోయాడు రాజారావు.

లక్ష్మి అలాగే నుంచుండిపోయింది. ఆమెకు అంతా అయోమయంగా ఉంది. కళ్ళు కనిపించడంలేదు. చెవులు వినిపించడంలేదు. రాజారావు ఏమన్నది ఆవిడకు వినిపించలేదు.

"ఊఁ – పైకం తీసుకో. దొర ఇస్తాండు. జల్దీ పనిమీద ఎక్కు" అన్నాడు చంద్రయ్య.

చంద్రయ్య అన్న చివరిమాటలు మాత్రం వినిపించాయి లక్ష్మికి. గబగబా ముందుకి నడిచి వెళ్ళిపోయింది.

"పిచ్చిపిల్ల" అని ముందుకు నడుస్తూ "పాపం, టిఫిను పడిపోయింది. గిన్నెలు తెచ్చిపెట్టు" అని చంద్రయ్యకు పురమాయిస్తూ ముందుకు నడిచాడు రాజారావు.

కూలిదాని గిన్నెలు తెచ్చిపెట్టమని యజమాని తనకు పురమాయించడం కష్టమనిపించింది చంద్రయ్యకు. కూలివాణ్ణి పిలిచి గిన్నెలు తెమ్మని, రాజారావును అనుసరించాడు చంద్రయ్య.

రాజారావు మనసులో లక్ష్మి మసలింది. వచ్చి చింతచెట్టు కింద కూర్చున్నాడు. ఇంకా లీలగా లక్ష్మి కనిపిస్తున్నట్లే ఉంది. లక్ష్మిని పిలిపిద్దామనుకున్నాడు. తానే లేచి అలా చూస్తూ లక్ష్మి దగ్గరికి వెళదామనుకున్నాడు.

ఇంతలో చంద్రయ్య వచ్చి నుంచున్నాడు. చంద్రయ్య ముందు నుంచుంటే గంటల తరబడి వ్యాపారాన్ని గురించి మాట్లాడేవాడు. ఏమి అడగాలో మాటలు తడుముకోసాగాడు. తుదకు "పని ఎలా నడుస్తూంది?" అడిగాడు.

"ఏం నడుస్తుందండి? ఈ ధంధలేమి ఫాయిదున్నట్లు కండ్లపడ్తలేదు. మేస్త్రీ కాణ్ణించి పెద్ద ఇంజనీర్ దాకా రిష్వతులేనాయే. మల్ల బడికి చందని వచ్చిరి. గుడికి చందని వచ్చిరి. దవఖానాకు చందని వచ్చిరి. ఇగ కూలోళ్ళున్నరా టేముకు రారు, టేముకు పోరుగని, కూళ్ళేమో ఎక్కువ కావల్నంటాండరి. ఇగ కర్జీ చేయక ఎళ్ళదాయె. సిమెంట్లో కల్తాయె, సున్నంల కల్తాయె, ఇటికెలు కాలవాయె, బంగ్లలు నిల్వవాయె. దొరల్ను చూస్తే కర్చులేమో పెరుగుతాండే" – ఇంకేమేమో చెప్పదల్చుకున్నాడు చంద్రయ్య. కాని దొర పరధ్యానంగా ఉన్నాడని ఊరుకున్నాడు.

రాజారావు లక్ష్మికి డెయిజీని పోల్చి చూస్తున్నాడు. డెయిజీ అందమైందే కాని, అందులో కృతకత కనిపించింది. పౌడరు, లిప్‌స్టిక్, కత్తిరించిన వెంట్రుకలు, మోకాళ్ళవరకు స్కర్టు, తేజోహీనములైన కండ్లు, కృత్రిమపు చిరునవ్వు అన్నీ ఎక్కడో అరువు తెచ్చుకున్నట్లుంటాయి. లక్ష్మి డెయిజీవంటి తెలుపుకాదు. చామనచాయ, కళ్ళు పెద్దవి. వాటిలో ఏదో వెలుగుంది. పొడవైన వెంట్రుకలు, సహజమైన అందం, ముగ్ధత్వం. భయం, దుఃఖంలో కూడా ఎంత అందంగా వుంది! డెయిజీ కాగితపు పూవు. లక్ష్మి తాజా గులాబి పూవు.

"ఇయ్యాళ చీఫ్ ఇంజనీర్ వస్తున్నాడు తనక్కీకి" అన్నాడు చంద్రయ్య, దొరనుండి జవాబు ఆశిస్తూ.

"వస్తే నేను చేసేదేముంది? ఏంకావాలో వాడి ముఖాన కొట్టు" అని లేచి నుంచున్నాడు – ఒకసారి అలా తిరిగి లక్ష్మిని చూచి, పలకరించి రావాలనే ఉద్దేశంతో. ఇంతలో చీఫింజనీర్ రమణరావు రానే వచ్చాడు. "హల్లో మిస్టర్ రాజారావ్!" అని విష్ చేయనూ చేశాడు. రాజారావు లేని చిరునవ్వు తెచ్చుకొని కరచాలనంచేసి కుర్చీ చూపి కూర్చున్నాడు. కాఫీలు వగైరాలు వచ్చాయి. కబుర్లు సాగాయి. ఏకాంతంగా ఉన్నది చూసి రమణరావు అడిగాడు:

"మిస్టర్ రాజారావ్! మా అమ్మాయి పెళ్ళి నిశ్చయం అయింది. యాభైవేలకు తక్కువ కట్నం పుచ్చుకోనంటున్నాడు అల్లుడు. అమెరికా వెళ్ళి చదువుకొని వచ్చాళ్ళే! మీరు కనీసం ఓ పదివేలు సాయం చేయాలి."

"పదివేలే? కాంట్రాక్టర్ల పరిస్థితి మీకు తెలీడం లేదండీ!" అని ఏదో భారతం అంతా చదివాడు రాజారావు.

"మీకు నేను చేసిన సహాయానికి ఇదేమంత ఎక్కువకాదు. కూలిపోయిన వంతెనకు కూడా డబ్బిప్పించాను. అందాకా ఎందుకు ఇప్పటి – ఈ ఆస్పత్రి బిల్డింగులో నేను చూసీ చూడకుండా ఉన్నాను కాబట్టి నడుస్తూంది. ఇప్పుడు ఇనస్పెక్టు చేస్తే లక్ష పెట్టించగలను మీతో."

"మిస్టర్ రమణారావు! ఎందుకంత చదువుతారు? కష్టంగా ఉందన్నాను గాని ఇవ్వనన్నానా? చెక్కు కావాలంటే ఇప్పుడే ఇస్తా. డబ్బు కావాలంటారా, రేపు చంద్రయ్యతో పంపిస్తా. అదిసరేగాని, ఇంకేం కబుర్లు?" అడిగాడు రాజారావు.

"కబుర్లకేం కావలసినన్ని. కాని, ఈ చింతచెట్టు క్రింద ఏమొస్తాయి? నడవండి నయాగరాకు. కాస్త పారాయణం చేసుకోవచ్చు. ఈ మధ్య బాగా లాగేస్తున్నారట మీరూ?"

"ఎక్కడిదండి, ఈ మధ్యనేగా మొదలుపెట్టింది. వచ్చింది అందరూ చెప్పుకుంటారు, పోయిందెవరికీ తెలీదు. చాలా పోయిందిలెండి. చెప్పకుంటే ఏం ప్రయోజనం? అయినా, ఇప్పుడెందుకూ – మీకు ఆఫీసుంటుంది. సాయంకాలం నయాగరాకు వచ్చేస్తాను."

"ఆఫీసు, ఆఫీసు! గుమాస్తాలున్నారయ్యా ఆఫీసులో, కదుల్తావా లేదా?" అని చేయిపట్టి లాక్కెళ్ళాడు, రమణరావు.

రెండు కార్లూ సాగిపోయాయి.

★ ★ ★

# నాలుగు

బాలయ్య రిక్షా ఇంటి ముందుంచి దిండు తీసుకొని గుడిసెలో దూరాడు. పెద్దకూతురు రాజమ్మ కాళ్లు చాచుకొని కూర్చుంది. ఆవిడ కాళ్ళమీద తమ్ముడు పుల్లయ్య పడుకొని వగరుస్తున్నాడు. బాలయ్య బియ్యపు కుండలో చేయి పెట్టాడు. అడుగు తగిలింది. అడుగు తుడిచి చేయి తీశాడు. పొద్దుటినుంచి ఎండు డొక్కతో, చింపిరి తల, చింకిబట్టలతో వున్న రాజమ్మ తండ్రి రాగానే ఆశగా చూచింది. ఆ చూపుతో కూలిపోయాడు బాలయ్య. పుల్లయ్యకు జ్వరం. నాలుగురోజుల్నుంచి, మూసిన కన్ను తెరవలేదు. ఏం చేయాలో అర్థం కాలేదు. ఒక నిట్టూర్పు విడిచి బయటికి వచ్చి తలపట్టుకొని కూర్చున్నాడు.

బాలయ్యకు తన పల్లె, సారతీగ పాకిన గుడిసె, యింటి ముందరి బంతిచెట్లూ గుర్తుకు వచ్చాయి. బాలయ్య తండ్రి వెట్టి మాదిగ. దొరలకూ అధికారులకూ వెట్టి చేస్తూనే కళ్ళుమూశాడు. బాలయ్యా, అతని అన్న కొమరయ్యా అదే వృత్తి అవలంబించారు. ఊళ్ళో ఏదో సంఘం పెట్టారు. వెట్టి చేయరాదన్నారు. దొరల దౌర్జన్యం నశించాలన్నారు. అన్నదమ్ము లందులో చేరారు. వెట్టి మానారు. కూలి చేసుకొని జీవిస్తున్నారు. భూములు పంచుతామని వచ్చారు కొందరు. బాలయ్య తుపాకి పట్టుకొని రంగంలో దూకాడు. దొరలు పారిపోయారు. వాళ్ళ ఇండ్లు దోచుకొన్నారు. పొలాలు పంచారు. బాలయ్య నేలచెక్క వాడయ్యాడు. పోలీసులు వచ్చారు. బాలయ్య పారిపోయాడు. కొమరయ్యను పట్టుకొని హింసించారు. తుదకు తుపాకీతో కాల్చి చంపేశారు. బాలయ్య పొలం ఊడింది. దొరలు పల్లెకు చేరారు. బాలయ్యను పట్టుకొని జేలుకు పంపారు. జేలు నుంచి తిరిగి వచ్చి తల్లినీ, పెళ్ళాన్నీ తీసుకొని పట్నం వచ్చేశాడు. ఒక్క కొడుకునూ, ఇద్దరు కూతుళ్ళనూ కని, క్షయ వ్యాధితో కన్ను మూసింది బాలయ్య భార్య. తల్లి కేన్సరై చనిపోయింది ఈ మధ్యనే. కొడుకు రామారావు ఇరవై సంవత్సరాలవాడు. ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నాడు. కాస్త షోగ్గాడు. ఈ మధ్యనే రొమాన్సులో పడ్డాడు. పరమయ్య కూతురు శారదను ప్రేమిస్తున్నాడు.

"రాజీ! రేషన్ దుక్నపోడేమున్నడు?" కూతురును అడిగాడు బాలయ్య.

"ఉద్దేరియ్యనన్నడు." నిశ్చలంగా బదులు చెప్పింది రాజమ్మ.

"ఉద్దేరిచ్చేకాడ గింజల్లేవు. గింజలున్నకాడ ఉద్దెరలేదు. గీరేసనెందుకు పెట్టిన్రో? ఎవల్ని చంపేటందుక్కో?" విసుగ్గా గులుక్కున్నాడు.

"దున్యల మందెక్కువైనంటనే? గిట్లనన్న కొందరు చస్తరని పెట్టిన్రంట, ఏమంటవ్?" పిచ్చయ్య వచ్చి కూర్చుంటూ అన్నాడు.

"ఏమంట? నా బొందంట. నా బొక్కలంట. గా నైజాం సర్కారోడే బాగనిపిస్తాండు. బువ్వన్న దొరకెడిది. అసలా పోలీసిక్కల్నే బర్కతున్నదని! రూపాయి పట్కపోతే చాటనిండ బియ్యమొచ్చెడివి. నయా పైసొచ్చింది. బర్కతు సుతాం

లేకుండా పోయిందే. రూపాయి పట్కపోతే చాటలకేంది, కీసలక్కాడ వస్తలేవు. ఎట్ల బతుకుతురో గరీబోల్లు తెలుస్తలేదు."

"గరీబోల్లు బతకాల్నని ఎవరనుకుంటాన్రే నీ పిచ్చిగని. గిదంత ఉన్నోల్ల దున్యే! ఉన్నోల్లదున్య!! మోటర్ గాడిలోల్లకోసం సడకు లేస్తాన్రు. బిజ్లిగోలలు పెడ్తాన్రు. నల్లలు, మోరీ లేస్తాన్రు మరి, గరీబోల్లకేం పెడతాన్రో చెప్పు? గుడెసెలేసుకున్నందుకు రంగుపూసే, లంబర్లేసి పాయే ముర్కిపాలిటోడు. టెక్కులు గుంజుతాండే. ఒక నల్ల పెట్టిండా? ఒక్క బిజ్లిగోల పెట్టిండా? టెక్సులేమో ఈడగుంజె, బిజ్లిగోల లాడపెట్టె".

"అయ్య! ఆకలే! గింత చాయన్నచేస్తే. పోరడుట్టి ఉపాసమున్నడు పొద్దటాల్నుంచి" అన్నది రాజమ్మ.

బాలయ్య కళ్ళకు నీళ్ళు వచ్చాయి. వెంటనే ఆరిపోయాయి. జేబు చూస్తే ఒక బీడీ, అగ్గిపెట్టెలో రెండు పుల్లలూ ఉన్నాయి. గురుగులన్నీ సోదా చేయగా దొరికిన 24 పైసలు రాజమ్మకిచ్చి "చాపత్త, బెల్లం తెచ్చి చా చెయ్యి" అని పుల్లయ్యను తాను తీసుకొని రాజమ్మను పంపించాడు.

"ఇయ్యాలేమీ గిరాకి కాలేదానే బాలయ్యన్నా?" అడిగాడు పిచ్చయ్య.

"కాకేమన్న? అయింది గని ఉన్నరు గద మనకు పుట్టిన కొడుకులు పోరల్నుపాస ముంచి వాలకు పెట్టాల్నాయే. అవ్వ దినాలకు అప్పు తెచ్చిన్నా వచ్చిన పైకమంత గుంజుకొని ఒక్క రూపాయిచ్చి ఎల్లగొడ్తడు సేటు. తక్కువొచ్చిందని పైస బచాయించ మనసొప్పదసె. ఏం పుట్కొగాని; పానం బిగపట్టుకొని అబద్ధ మాడిన్ననుకో ఇయాల. ఏం చెయ్యమంటవు చెప్పు? పోరలకు బువ్వ లేదాయె! ఆడెంత తిట్టిండనుకున్నావు తక్కువొచ్చిందని! కొట్టితందుకు సుత వచ్చిండె పైపైకి. వాణ్యమ్మ అట్లనే నెత్తిమీదేసి పూడ్చి పెడ్దమనుకున్న. కాని, తెల్లార్తే ఆని రిచ్చ కావాలె గదనే. తిట్లుపడి రెండు రూపాయలు బచాయించు కొస్తన్ననుకో, సైకలోడు కండ్లబడ్డడు. ఎరికెగద, బట్టలమ్మె టంద్కొస్తడు చూడు!"

"అయ్యో! ఆడా? ఎరికే! లేకపోతే యేందే! వద్దంటాంటే ఉద్దేరేసి పోతాడు. బజార్ల నిలబెట్టి వసూలు చేస్తడు."

"అట్లనే చేసిండే పిచ్చయ్యన్న! ఆడట్ల కండ్లపడ్డడా గిట్ల పానం పోయిందనుకో. వాణ్ణి చూసిన. గిట్ల ఎన్కకు తిరిగిన్నో లేదో దొంగ సాలెగాడు చూసిండే. 'ఒరే బాలిగా!' అని ఎంటపడ్డడనుకో. గట్ల నిలబడి పోయిన్ననుకో. వచ్చి మీద పడ్డడనుకో. 'ఇస్తవ? చస్తవ' అని. మంది కూడిన్రనుకో. 'ఇస్తనయ్య, ఇయ్యనంటాన్నానా? జర కష్టంలున్న. నాల్గుదినా లాగ' మన్ననే. ఇంకేమున్నది ముండకొడుకు అంది పట్టుకున్నడే. 'పైకం కక్కి పోబే. నీ తాత ముల్లీ దున్నదనుకున్నవా? అని ఉద్దెర తీసుకున్నడు. అడుగుతే ఇగిస్త అగిస్తనంటడు, మొఖం తప్పిస్తడు. ఇయ్యాల కండ్లబడ్డడు. ఇంక నాలుగొద్దు లాగమంటడు' అని చెప్పిండు కూడిన మందికి.

"అలికీ జనం. అంతే. రాజ్యం వాళ్ళదేనయా, ఏమంటాం?" అని ఎళ్ళిపోయిం డొకడు. "తీసుకునేటప్పుడు తీసుకుంటవ్ ఇయ్యమంటే ఎందు కియ్యవుబే" అన్న డింకొకడు. "ఇస్తం దొర. ఇయ్యనన్నాన?. మా యవ్వ చచ్చింది. జర కర్చుల పడిన. నాలు గొద్దులు నిలిస్తే ఇస్తనన్న గద" అన్ననను కో. "ఇంకెప్పు డిస్తవురా?

నాలుగొద్దులు, నాలుగొద్దులని యాడాది చేసినవు. బట్టలిడిచి ఆడ పెట్టిపో" అన్నడే బట్టలోడు. పానం చచ్చినట్లయిందనుకో. కీసలున్న రొండు రూపాయలు అని చేతుల పెట్టి కాళ్ళు కడుపుల పట్టుకొని బైటపడ్డ. గుడిసె కొచ్చేటార్కల్ల గిట్లున్నది. ఏం బతుకులే పిచ్చయ్యన్న! గొడ్లకన్న యాళ కింత గడ్డి దొరుకుతదిగాని గరీబోనికి బువ్వ దొరికదాయె!" అని బీడి తీసి వెలిగించాడు బాలయ్య.

నోట్లో చుట్ట పెట్టుకొని, చెంబు పట్టుకొనిపోతున్న పరమయ్య "ఏమొ, శాన మంతకలు కాడ్తాను, తగిలిందయాణ్ణిన్న?" అని అడిగాడు పిచ్చయ్యను.

"మంతక లేందే పరమయ్యన్న? కార్ఖాన్ల కొలువు చేస్తాన్నవు, నీకేం తెలుస్తదే? పైలే వచ్చే టార్కల్లపడే చేతుల. సర్లే, పోయిరా" అన్నాడు బాలయ్య.

"గట్లనే ఉంటది లేవే. ఎంత చెట్టు కంత గాలి" అంటూ వెళ్ళిపోయాడు పరమయ్య.

"పంటలు గరీబోల్లే పండించిరి, బంగ్లలు గరీబోల్లే కట్టిరి, కార్ఖానాల్ల గరీబోల్లే పని చేసిరి. వీండ్లకేమో బువ్వకు లేదాయె. ఉన్నోల్లేమొ మతలుడాయించిరి. సరేగాని బాలయ్యన్నా, ఆదతైన పానంకాదే. కల్లోల్లకు గుంజుతాందే."

"పిచ్చయ్యన్న నువ్వే మన్నను, గరీబోల్లు నాయంగనే బతకాల్నే. ఏ జల్మల పాపం చేసినమో ఈ జల్మల గిట్లయిన్నం. ఇప్పుడు సుత ఎందుకే దొంగతనం? కూల్నాలి చేసుక బతకరాదు? ఎన్నిసార్లు పట్కపోయిన్రే పోలీసులు! ఇంక మడిసివి కాకపోతివి!"

ఇంతలో చంకలో ఉన్న పుల్లయ్య మూలిగాడు. ఎత్తుకొని లోపలికి వెళ్ళిపోయాడు బాలయ్య. పరమయ్య రావడంతో పిచ్చయ్య లేచిపోయాడు.

☆ ☆ ☆

టాక్సీ నుంచి దిగారు సూరి, బాలయ్య కొడుకు రామారావు. "ఇప్పుడే వస్తా, మీరిక్కడే ఉండండి" అని చెప్పి వెళ్లిపోయాడు గుడిసెల వైపు రామారావు.

లక్ష్మిని చూచిన్నాటినుంచి నిద్రపోవడంలేదు సూరి. ఉస్మాన్ అతనికి మద్దతు ఇస్తానన్నాడు. డబ్బుకూడ ఆశ పెట్టాడు. ఎంతో ప్రయత్నం చేసి, నగరమంతా గాలించి పట్టాడు రామారావును. అతని ద్వారా గుడిసెల వాళ్లను పరిచయం చేసుకుని లక్ష్మిని లోబరచుకోవాలని అతని ప్రయత్నం. రామారావును సినిమాల్లో చేరుస్తాననీ, హీరోను చేస్తాననీ ఎన్నో ఆశలు చూపటమేకాక సినిమాలకూ హోటళ్ళకూ తిప్పుతున్నాడు. రామారావు సుమారు సూరి శిష్యుడైపోయాడు. తండ్రితోనూ ఇతరులతోనూ పరిచయం చేయిస్తానని తీసుకొని వచ్చాడు. సూరిని అక్కణ్ణే నుంచొమ్మని రామారావు వెళ్ళిపోతే, కొంత దూరం అతణ్ణే అనుసరించి నుంచుండిపోయాడు సూరి.

టీపొడి, బెల్లం తేవడానికి వెళ్లిన రాజమ్మ, రామారావు ఎదురైనారు పుల్లయ్యను లోన పడుకోబెట్టి వస్తున్న బాలయ్యకు.

"యాడికి పోయినవుర గింతసేపు?" అడిగాడు బాలయ్య.

"సినీమాకు" అని టెక్కుగా జవాబు చెప్పాడు రామారావు.

కొడుకు అంత టెక్కుగానూ, నిర్లక్ష్యంగానూ ఎన్నడూ జవాబు చెప్పలేదు బాలయ్యకు. పైగా, ఇంటి పరిస్థితి ఇలా ఉంటే సినీమాకు వెళ్ళడమూ, వెళ్లిందేకాక సిగ్గులేక సినీమాకు వెళ్ళానని చెప్పడమూ అగ్గి రగిల్చాయి.

"ఒరి గాడ్దికొడక. ఇంట్ల పోరలు చస్తాంటే సిల్మలు చూస్తావుర! అందర్ని గుడిసెలపెట్టి తగలపెట్టరాదురా, నీ పీడ వదల్తది."

రామారావుకు తల కొట్టినంత పనైంది. తండ్రి తనను తిట్టేస్తున్నాడు. సూరి చూస్తున్నాడో ఏమో? ఏదో వెర్రి ధైర్యం వచ్చేసింది. కోపంతో వణికిపోయాడు. ఏమనాలో తోచలేదు. అయినా అనేశాడు, "నువ్వు డబ్బిచ్చావా?" అని.

"పైసల్నేనియ్యాల్రా! సిగ్గు, శరమ్ లేదేమిర! గాడిదంతైనవు ఇంక నన్ను పైసలియ్యమంటావుర! ఎవర్ర నిన్ను పెంచి పెద్దచేసింది? నీ సంపాదనంత నీ బొంద కొమ్ముక కొట్టుకుంటే ఇల్లెట్లెల్లుతదిర? లగ్గం కాకుంటేనే ఇట్లున్నవు. లగ్గమైతే అందరి బొండిగ పిసికె టట్లున్నావు."

రామారావుకు దుఃఖమూ కోపమూ పొంగాయి. సూరి అలా ఉండగా శారద వింటూందేమో ఇదంతా. తన పౌరుషం చూపాలనుకున్నాడు. ఏమిటీ ముసలాడు ఒంటికాలిమీద లేస్తున్నాడివ్వాళ!

"ఇంట్లో ఉండమంటావా? వెళ్ళిపొమ్మంటావా?" అని వెనక్కు తిరిగాడు.

బాలయ్య రక్తంలో అగ్గి రగిలింది. ఆ మాట అతడు సహించలేకపోయాడు. వెనక్కు తిరిగినవాని చేయి పట్టుకొని లాగి, "ఎళ్ళిపోతావు! యాడకి పోతవు? చంపి ఈడనే పూడ్చిపెడ్త" అని లాగి కొట్టాడు చెంపమీద. రామారావు తూలాడు. నిలదొక్కుకున్నాడు. బాలయ్య ఫెడీ ఫెడీ అని బాదేశాడు.

రాజమ్మ పెద్దగా ఏడ్చేసింది.

పిచ్చయ్య పరిగెత్తుకొనివచ్చి రామారావును బాలయ్య చేతుల్లోంచి లాగి, "ఏందే బాలయ్యన్న! నీ అంతైన కొడుకును కొడ్తావే" అని వెనక్కు నెట్టాడు.

అప్పుడు అర్థం అయింది బాలయ్యకు, చెట్టంతైన కొడుకును బాదేస్తున్నానని. దుఃఖం పొంగివచ్చింది. "రాముడూ!" అని కొడుకును కావలించుకొని ఏడ్చేశాడు.

'తంతారేమో వెధవలు. ఇలాంటప్పుడు కాలికి బుద్ధిచెప్పమన్నాడు గురు' అనుకొని రోడ్డుదాకా పారిపోయి నయాగరాకు పోనిమ్మని చెప్పి టాక్సీలో కూర్చున్నాకగాని ఊపిరి పీల్చలేదు సూరి.

★ ★ ★

# అయిదు

సుమారు ప్రతి రాత్రి డెయిజీ రాజారావుతోనే గడుపుతూంది. కాని, ఆశించింది లభించలేదని విచారం పట్టుకుంది సూరికి, మైకేలుకూ. ప్రతిరోజూ బోధిస్తున్నారు– ఎలాగోలా సినీమా తీయడానికి డబ్బు పుట్టించమని. ఆ డబ్బే చేతికందితే హైద్రాబాదునుంచి ఉడాయించి బొంబాయిలోనో, గోవాలోనో మకాం పెట్టాలని ఉద్దేశం. అయితే, ఎంతచెప్పినా, బెదిరించినా డెయిజీ అదోలా ముఖం పెడ్తుంది కాని అడగదు. రాజారావు దగ్గర రాల్చిన డబ్బుకూడా సూరి రాల్చిందేకాని డెయిజీ కాదు. గుర్రప్పందాలూ, పేకాట అలవాటు చేసినవాడు సూరే అయినా సంపద వాటికి హరించిపోయి తన చేతికేమీ దక్కదేమోనని తహతహ లాడిపోతున్నాడు మైకేలు. ఆ సాయంకాలం మైకేలు దగ్గరికి వెళ్ళి డెయిజీమీద చాడీలు చెప్పాడు సూరి. రాజాను లొంగతీసుకునే బదులు అవిడే లొంగిపోతూందనీ, ఏదో ప్రేమా, విరహం లాంటివి మాట్లాడుతూందని, చేయి జారిపోయేట్టు కనిపిస్తూందని చెప్పి వెళ్లిపోయాడు.

మైకేలు గుండె జల్లుమంది. కేకులు వేడివేడిగా వున్నప్పుడే అమ్ముకోవాలనేది అతని నీతి. కేకు ఆరిపోవడమే కాక జారిపోతున్నట్లు కనిపించింది. ఆ సాయంకాలం ఇంటికి వచ్చినపుడు బెదిరించాడు డెయిజీని, "ఈ రాత్రి సాధించలేకపోయావో – రేపక్కడికి వెళ్ళడానికి వీల్లేదు" – కీలెరిగి వాతపెట్టాడు మైకేలు.

డెయిజీ గుండె లిప్తపాటు నిలిచిపోయింది. దుఃఖం పొంగింది. కళ్ళు చెమ్మగిల్లాయి. తాను కష్టపడి ఆర్జించుకున్నది ఎవరో దొంగిలిస్తున్నట్లనిపించింది. వెంటనే అక్కణ్ణించి తన గదిలోకి పోయి ఏడ్చింది. మైకేలు వచ్చి "డ్రెస్ చేసుకొని, బైల్దేరు" అనేవరకూ ఆమెకు లైట్లు వెలిగాయని తెలియదు. "డాడీ! ఒక్క వారం టైమివ్వు" అంది. వారమంటే జీవితమంత పొడుగుంటుందనుకొని, "వీల్లేదు. ఇవ్వాళ రాత్రి జరిగిపోవాలి" అని గర్జించి, "నడువ్" అన్నాడు. యంత్రంలా వెళ్లి టాయిలెట్ అయి వచ్చి టాక్సీ ఎక్కింది. టాక్సీ దిగి లిఫ్టులో గదికివెళ్ళి కూర్చుంది.

గది మౌనంగా వుంది. డెయిజీ మౌనంగా వుంది. కాని, ఆమె మనసు ఒకచోట నిలవడంలేదు. ఏం చేయాలి తాను? సాధించగలదా రాజాను? అతడు తననే కాదంటే? తానిప్పుడు వట్టి మనిషి కూడా కాదు. గుండె జల్లుమంది. మనసు మరొకవైపు మళ్లించడానికి ప్రయత్నించింది. సోఫా మీద తల ఆన్చి ఫ్యానువైపు చూడసాగింది. ఫ్యాను గిరగిరా తిరుగుతూంది. దానికి ఎవరితోనూ నిమిత్తం లేదు. అది కాలచక్రం లాంటిది.

అలా చూస్తుంటే డెయిజీకి పూర్వస్మృతులు మనసులో మసిలాయి. మొట్ట మొదటిసారి మైకేలు కారులో తననీ హోటలుకు తెచ్చాడు. ఇక్కడే ఒక యువకుణ్ణి చూపించాడు. అతడు అష్రఫ్! ముగ్గురూ కలిసి త్రాగారు. తరువాత మైకేలు వెళ్ళిపోయాడు, "విష్ యూ హేపీ లైఫ్" అంటూ. ఆనాటి రాత్రి అష్రఫ్, తానూ

కారులో, వెన్నెట్లో ఎక్కడెక్కడో తిరిగారు. చెట్టపట్టాలు పట్టుకొని బుజాలుమీద చేతులు వేసుకొని, కూనిరాగాలు తీస్తూ తిరిగారు. నాటి హాయి, ఆనందం ఏదో నేడు అనుభవిస్తున్నట్లనిపించింది. పాత సంఘటనలు నెమరువేసుకోవడంలో ఏదో రిలీఫ్ కనిపించింది డెయిజీకి. గుమ్మంవైపు చూస్తే బేరర్ కనిపించాడు. విస్కీ తెప్పించుకుంది. ఒక్క గుటకవేసి, సిగరెట్టు వెలిగించింది. సిగరెట్టుపొగ ఉంగరాలలో ఎన్నో పాత దృశ్యాలు కనిపించాయి.

ఆ తరవాత ఒకడు, ఇద్దరు, ముగ్గురు అనేకులు, వారిపేర్లు ముఖాలు సహితం గుర్తులేవు తనకు. జంటగా తిరగడం, సినిమాలు, హోటళ్ళు, బార్లు, డాన్సులు, అవును – ఎన్నో! ఎందరో!! కాలం కర్పూరంలా హరించుకుపోయింది. క్రమక్రమంగా వాటి మోజు తగ్గింది. తరవాత అవి విసుగనిపించాయి. అందుకు చాలావరకు కారణం జార్జి.

జార్జి చాల కాలం నుంచి పనిచేస్తున్నాడు ఆ హైర్‌పర్చేజ్ కంపెనీలో. జార్జిది పాపం, నిస్సార జీవితం. "పూర్ జార్జి" అనేవారంతా అతణ్ణిచూచి. అతడు పుట్టింది పాండిచేరీలో. పుట్టకముందే తండ్రి చనిపోగా పుట్టిన నెలకు తల్లి గతించింది. నాన్సీ అతణ్ణి పెంచింది. ఆ వెనుక నాన్సీకి పాండిచేరీనుంచి సికింద్రాబాదుకు ట్రాన్స్‌ఫర్ కావడంతో ఇక్కడికి వచ్చేశాడు. అతనికి కఠినమైన క్రమశిక్షణ తప్ప ప్రేమ అనేది తెలియదు. సమయానికి లేవడం, బైబిల్ చదవడం, స్నానం చేయడం, స్కూలుకు వెళ్ళడం వగైరా యాంత్రికంగా నిర్వహిస్తున్నాడు. జార్జి మెట్రిక్యులేట్ కాగానే తన దగ్గర్నుంచి పంపించేసింది నాన్సీ. హైర్‌పర్చేజ్ కంపెనీలో ఉద్యోగం ఇప్పించింది. అందుక్కారణం ఆవిడకు గౌహతికి ట్రాన్స్‌ఫర్ కావడం. ఉద్యోగం చేస్తూనే టైపు రైటింగ్ నేర్చుకున్నాడు. శ్రమపడి పనిచేస్తాడు. వృథాగా ఎవరితోనూ మాట్లాడడు. అయినా, అతనికి అట్టే ప్రమోషన్ దొరక్కున్నా ఉద్యోగాన్ని అంటిపెట్టుకున్నాడు.

హోటల్లో తినడం, ఆఫీసుకు రావడం, గదిలో పడుకోవడం. ఏదో ప్రాణం ఉంది కాబట్టి బ్రతుకుతున్నట్లుండేవాడేకాని, ఏ విషయంలోనూ శ్రద్ధగా ఉండేవాడుకాదు. గడ్డం ఎప్పుడోగాని గీసేవాడుకాదు. బట్టలు ఎప్పుడోగాని మార్చేవాడు కాడు. ఒకరితో మాట్లాడ్డంకాని, ఒక చిరునవ్వు నవ్వడంగాని ఎరుగడు.

డెయిజీ రిసెప్షనిస్టుగా చేరిన్నాడు జార్జి జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభం అయింది. డెయిజీని చూడగానే అతడు జుట్టు సవరించుకొన్నాడు. ముఖం కడుక్కొని వచ్చి కూర్చున్నాడు. తన ముందున్న టైపురైటర్ను కాక డెయిజీని చూడసాగాడు. ప్రాణంలేని టైపురైటర్ను చూచేవాడల్లా, ఊపిరిపోసుకున్న పాలరాతి ప్రతిమను చూడసాగాడు.

ఆ రాత్రి జార్జికి నిద్రలేదు. డెయిజీతో మాట్లాడాలనీ, పరిచయం చేసుకోవాలనీ తహతహ లాడాడు. జీవితంలో మొదటిసారిగా అతనికి అలాంటి బాధ కలిగింది. అది బాధే అయినా ఏదో వెచ్చదనం, ఏదో ఆనందం అనుభవించాడు. తెల్లవారి అతని గదిలో బ్రిల్‌క్రీమ్, స్నో, పౌడరు, టై వగైరా వచ్చేశాయి. అతని ముఖంమీద చిరునవ్వు కనిపించింది.

డ్రెస్ చేసుకొని అద్దంముందు నుంచున్నాడు. బాగా అణగిన వెంట్రుకలు నున్నగా చేసుకున్న గడ్డం, కరకు చొక్కామీద టై, తళతళ మెరిసే బూట్లు చూసుకున్నాడు.

తాను ఒక మనిషినేననీ, అందమైనవాణ్ణేననీ గ్రహించాడు. తెలియకుండానే పెదవులు ఈల వేశాయి. ఆశ్చర్యపోయాడు. చిరునవ్వు నవ్వుకున్నాడు. బైల్దేరాడు. బస్‌స్టాండు చేరాడు. వీధి రోజులాగే సమ్మర్దంగా ఉంది. కాని, ఎన్నడూ అంత అందంగా కనిపించలేదు లోకం జార్జికి.

బస్సు కోసం ఎదురు చూస్తూ నుంచున్నాడు. అతని స్మృతి పథంలో డెయిజీ............ రిసెప్షన్ కౌంటర్.............. ఆమె చిరునవ్వు. తాను వెళ్ళగానే కనిపిస్తుంది. గుడ్ మార్నింగ్ అని విష్ చేస్తాడు. ఆమె చిరునవ్వు నవ్వుతుంది. తరువాత................ తరువాత ఏదో మాట్లాడాలి............. మాట్లాడాలి............. ఆమెతో మాట్లాడితే ఎంత హాయిగా ఉంటుంది! ఏముంది ఆ అమ్మాయి దగ్గర? ఏదో తనకు ఆనందం కలిగించేది ఉంది............... ఇవే ఊహాలు అతని మెదడులో సుళ్ళు తిరిగాయి.

బస్సెక్కాడు. మళ్ళీ అవే ఊహాలు. అవే ఆలోచనలు. ఆఫీసులో ప్రవేశించాడు. కౌంటర్ వద్ద డెయిజీ లేదు. పచ్చనిచెట్టు బాంబుపడి కాలి కూలినట్లయింది. అతణ్ణిచూచి ఆఫీసులో వారంతా ఆశ్చర్యపడ్డారు. ఆఫీసులో గుసగుసలు బైల్దేరాయి. జార్జిలోని మార్పుకు డెయిజీయే కారణం అని కొందరు, కాదని మరికొందరు. అదే అనాటి టాపిక్ అయింది. డెయిజీ వెంట్రుకలు సవరించుకొంటూ ప్రొప్రైటర్ గదిలోంచి వచ్చేసింది. టైపు చేస్తూ కూర్చున్న జార్జి గమనించాడుకాదు. కాస్సేపటికి తలెత్తిచూస్తే కనిపించింది డెయిజీ. తాను పూర్వం అనుకున్నవన్నీ తలలో మసిలాయి. కాని ఆ ఉత్సాహం లేదు. విధులూ నియమాలూ ఆ ఉత్సాహాన్ని తగ్గించాయి. అయినా "గుడ్‌మార్నింగ్" అన్నాడు జార్జి పేలవంగా. డెయిజీ చూచి చూడనట్లు "గుడ్‌మార్నింగ్" అనేసింది.

ప్రొప్రైటర్ పిలిచి టైపులో తప్పులున్నాయని చివాట్లు పెట్టాడు జార్జిని.

ధ్యానంగా టైపు చేయడం ప్రారంభించాడు జార్జి. ఆ రోజు గడిచిపోయింది. అలా కొన్ని రోజులు దొర్లిపోయాయి. ప్రతిరోజూ డెయిజీని పలకరించాలనీ, తాను పులకరించాలనీ అనుకుంటున్నాడు. కాని, రోజూ ఏదో బలవత్తరమైన శక్తి అడ్డు తగులుతూంది.

ఒకనాడు ధైర్యం చేశాడు. కొన్ని గులాబీలు తీసికెళ్ళాడు. డెయిజీ ముందుంచాడు–భగవంతుని ముందుంచినట్లు. డెయిజీ పూలను చూచింది. జార్జిని చూచింది. ఆవిడ చెక్కిళ్ళు చెవురించాయి. క్షణంలో ఆ ఎరుపురంగు మాయం అయింది. థాంక్సు అని పూలు తీసుకుంది. మళ్ళీ చూచాడు జార్జి ఆమెను. ఆమె అతనిని అలా చూళ్ళేకపోయింది.

పూలు అంత శ్రద్ధగా, భక్తితో తనకు తెచ్చివ్వడం డెయిజీకి కొత్తగా కనిపించింది. ఆమె హృదయం ఆర్ద్రితమైంది. ఏదో పచ్చని మొక్క ఆమె హృదయంలో మొలిచినట్లనిపించింది. తాను ఎందరితోనో తిరిగింది. అనేక విధాలుగా మసలింది. కాని, ఇంత ఇదిగా......ఇదిగా......అంటే, ప్రేమతో తనకు ఎవరూ పూలు అందించలేదు. ఈ పూలల్లో ఏదో ప్రత్యేకత ఉంది అనుకుంది. ఏదో కొత్తదనం.....ఏదో ఆహ్లాదం......ఏదో ఆనందం.......ఏదో సొగసు ఆమెకు కనిపించాయి.

ఆమె జార్జిని చూచింది - జార్జి టైపిస్టు.
అతడు డెయిజీని చూచాడు - డెయిజీ రిసెప్షనిస్టు.
పూలు తెచ్చిస్తున్నాడు జార్జి. దేవతకు అర్పించినట్లు అర్పిస్తున్నాడు. దేవతలా స్వీకరిస్తుందామె. దేవత కంటే ఎక్కువగా ఒక చిరునవ్వు నవ్వేస్తూంది డెయిజీ.
తరువాత ఏమనాలో, ఎలా ప్రారంభించాలో అర్థం కావడంలేదు జార్జికి. ఏదో భయం భయంగా ఉంటూంది. గుండె దడ దడ కొట్టుకుంటూంది. ప్రేమలేఖలు వగైరా ఎన్నో ఆలోచించాడు. రాశాడు. కానీ, ఏదీ పూర్తి చేయలేకపోయాడు.
ఆఫీసు ముగిసే సమయానికి ఒక కారు వస్తుంది. డెయిజీని తీసికెళుతుంది.
ఒకనాటి సాయంకాలం బస్‌స్టాప్ దగ్గర కనిపించింది డెయిజీ. అదృష్ట దేవత ఆ రూపంలో అక్కడ ప్రత్యక్షం అయిందనుకున్నాడు జార్జి. దడదడా కొట్టుకుందతని గుండె. సుమారు పరిగెత్తాడు డెయిజీ దగ్గరికి. "గుడ్ ఈవినింగ్ డెయిజీ!" అన్నాడు. ప్రక్కకు తిరిగి చూసింది. "హో జార్జి, గుడ్ ఈవినింగ్. ఇటు ఎక్కడికి?" అడిగింది.
"డెయిజీ, డార్లింగ్! ఎంతకాలంగా నీ ప్రేమ భిక్షం కోసం ఎదురు చూస్తున్నాను. చూడు నా గతి ఎలా అయింది, నా హృదయరాణీ? దయరాదా? కరుణించవా? కరుగవా? ఈ దీనుడు దేహీ అని యాచిస్తున్నాడే? నీ సొగసు, నీ అందం, నీ చందం, నీ వయస్సు నా హృదయంలో అగ్ని రగిలింపచేయుచున్నవే. ఏమందువే రాణీ, ప్రణయ రాజ్ఞీ" లాంటి ఏదో డైలాగు అందా మనుకున్నాడు జార్జి. కానీ ఏమీ అనలేకపోయాడు. ఒక్క మాట మాత్రం అన్నాడు, "మిస్ డెయిజీ, నీతో కాఫీ తాగాలని ఎంత కాలంగానో అనుకుంటున్నాను" అని.
నవ్వేసింది డెయిజీ. ముచ్చెమటలు పోశాయి జార్జికి. "దానికేం, పద వెళ్దాం" అన్నది. జార్జికి ప్రాణం వచ్చింది. ఫేమిలీ కేబిన్‌లో కూర్చున్నారిద్దరూ. కాఫీ చప్పరిస్తూ భయం భయంగా అన్నాడు జార్జి: "ఒక్క మాటంటాను, మన్నిస్తావా?" "ఎస్" అన్నట్లుగా కళ్ళతో ఆమోదం తెలిపింది డెయిజీ.
"డెయిజీ! వాస్తవం చెపుతున్నాను. అతిశయోక్తి కాదు. నీవు మా కంపెనీలోకి వచ్చిన తరువాతే నా జీవితం మొదలైంది. అంతకు ముందు నేను బ్రతికాను. కాని, జీవితం నాకు తెలీదు........."
వింటూంది డెయిజీ ప్రశాంతంగా. అతని కథంతా కొత్తగా కనిపించింది. ఆనాటి పూవు లందించినలాంటి ఆనందం ఆవిడ మనసులో తలెత్తింది. తనకోసం ఒకడు తపిస్తున్నాడని తెలిసి ఆమె ఆనందానికి అంతులేకపోయింది. జాగ్రత్తగా అతని కథంతా విన్నది. అప్పుడప్పుడూ అతని కళ్ళల్లోకి చూచింది. వాటిలో తన ప్రతిబింబం చూచుకుంది.
"డెయిజీ డార్లింగ్! ఇంతకూ నేను చెప్పొచ్చిందేమంటే, నాకు నీవంటే ప్రేమ....." తరువాత చెప్పలేకపోయాడు.
ఆ అమాయకత్వం డెయిజీని మైమరపించింది. ఆమె హృదయంలో ఎన్నో మల్లెతోటలు వెలిశాయి. పచ్చని పచ్చిక మైదానాలు పరచుకున్నాయి. ప్రేమ పూవుల్లాంటిదనీ, ప్రేమ ఉషస్సు లాంటిదనీ, ప్రేమ సంధ్యారాగం లాంటిదనీ, ప్రేమ వెన్నెలలాంటిదనీ, ప్రేమ మలయానిలం లాంటిదనీ ఆమె గ్రహించింది.

ఆమె జీవితంలో మొదటిసారిగా ఒడలు పులకరించింది. "జార్జి డియర్! ఐ లవ్ యూ" అన్నది.

జార్జి మీద అమృత వృష్టి కురిసింది. వెన్నెలవాగుల్లో మునిగాడు. పూలవాన కురిసింది. ఉబ్బితబ్బిబ్బయినాడు.

ఆ ఆనందంలో సహితం అతడు హద్దుమీరలేదు. 'మై డార్లింగ్' అని చేయి చాచాడు. ఆమె చేయి అందించింది. వారు షేక్‌హేండ్ చేసుకున్నారు. వారి గుండెలు చేతుల్లో చేరి కలిసిపోయాయి.

జార్జితో వెన్నెల్లో విహరించడంలో ఆవిడకు ఎంతో ఆనందం కలిగేది. అతని భుజంమీద తల ఉంచి అలా ఎంతో సేపు ఉండిపోయేది. జార్జి ఒళ్ళో తలపెట్టుకొని పడుకుంటే అతడు కురుల్ను సవరించడం, చెక్కిలిమీద వ్రేలితో గీతలు గీయడం తల్చుకుంటే ఆమె గుండె జలదరించింది.

తరవాత ఆమె జీవితంలో చీకట్లు కమ్మాయి.

ఒకనాటి రాత్రి వాళ్ళ ప్రొప్రైటర్ జార్జి ఇంటికి వెళ్ళాడు. కలకత్తాకు టికెట్టు రిజర్వేషను, ట్రాన్సుఫర్ ఆర్డరూ ఇచ్చి తన కార్లో తీసికెళ్ళి కలకత్తా రైలు ఎక్కించి వచ్చాడు.

జార్జి క్రమశిక్షణలో పెరిగినవాడు. నియమ నిబంధనల చట్రంలో బిగింపబడినవాడు. మారుపలకలేకపోయాడు.

కలకత్తా వెళ్ళినవాని పేరు జార్జేకాని అతడు డెయిజీ జార్జికాడు. తరువాత చాలామంది వచ్చారు. వచ్చిందెవరో వెళ్ళిందెవరో ఆమెకు గుర్తులేదు. రాజారావు వచ్చాడు. అతడు వెళ్ళలేదు. అతడు సర్వదా తనవాడు కావాలని ఆమె కోరిక. రాజారావు మీద డెయిజీకి మనసైంది. అతడు తనను ప్రేమిస్తున్నాడనుకుంటూంది డెయిజీ. అలాంటి వాణ్ణి మోసం చేయడానికీ తనను యంత్రంగా వాడుకుంటున్నారు సూరీ, మైకేలూ. తాను యంత్రంగా ఉపయోగపడాల్సిందేనా? తనను నమ్మిన వాణ్ణి మోసగించాల్సిందేనా? మోసగిస్తే రాజారావు తనను నమ్ముతాడా? మోసగించకుంటే మైకేలు తనను బ్రతకనిస్తాడా? బ్రతుకులో ఉన్న స్వారస్యం ఏమిటి? ఇళ్ళూ, ఫర్నిచరూ అద్దెకు పోయినట్లు తానూ అద్దెకు పోవాలి! సారాయివలె, సినీమావలె, రేసులవలె, జూదంవలె క్షణకాలపు ఆనందంకోసం తాను అమ్ముడు పోవాలి. చస్తేనేం? చచ్చినా పరవాలేదు; మోసం చేయరాదు, అదీ తాను నమ్మినవాణ్ణి!!

"చావు" అనే పదం అంధకారంగా, భయంకరంగా, అయోమయంగా కనిపించింది. గుండె దడదడలాడింది. చావంటే తానొక్కతేనా? తనలో ఒక ప్రాణి జీవం పోసుకుంటూంది. తాను తల్లి కాబోతోంది. రాజారావు ప్రతిబింబం, ప్రతిరూపం తనలో మసలుతూంది. ఆ ఆలోచనే ఆమెలో ఆనందాన్ని కలిగించింది. ఆ ఆనందం కోసం, తన బిడ్డకోసం, జీవించాల్సిందే? ఎన్ని కష్టాలైనా భరించాల్సిందే! తాను ఏదైనా చేస్తుంది. కాని, తన బిడ్డను కాపాడుకుంటుంది.

అవును. అయితే, అందుకు చేయాల్సిందేమి? ఎలా? ఏవిధంగా? పారిపోతే? ఎటు? ఎక్కడికి? ఎవరున్నారు? ఏ రీతిగా? అయినా ఎందుకు పారిపోవడం?

మరి ఏమిటీ చేయడం? రాజాతో ఈ విషయం చెప్పేస్తే? తనకు ఆశ్రయం కల్పించమంటే? ఆ ఆలోచన మెరుపులా మెరిసింది. ఇంతసేపణ్ణుంచీ తనకా ఆలోచన ఎందుకు రాలేదో అర్థంకాలేదు.

అంతే. అలాగే చేయాలి. రాజా రాగానే చెప్పేస్తుంది. రాజా మురిసిపోతాడు. రాజాతోనే వెళ్లిపోతోంది. రాజా అనే కోటను బద్దలు చేసి మైకేలుగాని, సూరిగాని రాలేరని స్థిరపరచుకుంది.

కాని, రాజా ఎలా రిసీవ్ చేస్తాడో ఈ వార్తను? తనలో అతని ప్రతిబింబమే ఉందంటే నమ్ముతాడా? గుండె జల్లుమంది. అవును, నమ్మాల్సిన అవసరమేం? తానేం తాళికట్టించుకున్న పెళ్ళామా? నమ్మకుంటే తన గతేం కాను? తానెక్కడికి పోవాలి?

మళ్ళీ ఆలోచనల పరంపర, వందలవేల క్వశ్చన్ మార్కులు. గుండె చీల్చినట్లు అవుతూంది. మెదడు మండిపోతూంది. ఎదురుగా టేబుల్‌మీద విస్కీ కనిపించింది. ఏమైనా ఈ వ్యధనుంచి దూరం కావాలనుకుంది. గటగటా త్రాగి గ్లాసు ఖాళీచేసి టేబుల్‌మీద పెడ్తుండగా గదిలోకి ఎవరో ప్రవేశిస్తున్న అడుగుల చప్పుడైంది. గుండె జల్లుమంది. గుమ్మంవైపు చూచింది. సూరి కనిపించాడు. సైతాన్ను చూచినట్లయింది. కెవ్వుమని కేకలేద్దామనుకొని లేచి నుంచుంది. కాని, కేక గొంతుదాకా వచ్చి నిలిచిపోయింది.

"హల్లో డార్లింగ్ డెయిజీ! ఎంత అందంగా ఉన్నావు? ఇప్పుడు నీకు పదహారేళ్ళన్నా కాదనేవాడు లేడు. ఆ సూర్యుడు నిన్ను చూళ్ళేదు కాని, చూస్తే నీ ఆయుష్షు హరించేవాడుకాడు. ఏమి ఆ చమక్కు? రా.రా. రావే వయ్యారీ!" అని చేయి పట్టుకోపోయాడు సూరి.

డెయిజీ చేయి వదిలించుకొని దూరంగా పోయింది. "ఎందుకలా పారిపోతావు డార్లింగ్, ద్రౌపదిలా? ఒహో తెలిసింది. రాజారావు వస్తాడనా? మైసింపుల్ డెయిజీ! రాజా ఈ లోకంలో లేడు." గుండె జల్లుమంది డెయిజీకి. "పేకలో మునిగి తేలుతున్నాడు. యాభైవేలు అతనివి పోయినాయి. ఇరవైవేలు మనకు వచ్చేశాయి. ఇవ్వాళ మనం రాజా, నువ్వు రాణీ – ఏమంటావు? అదిగో కుర్రాడు వోడ్కా తెచ్చేశాడు, రా డార్లింగ్ త్రాగేద్దాం. ఉమర్ ఖయ్యాం అన్నాడో అనలేదో తెలీదు కానీ నీవూ, వోడ్కా ఉంటే మరేం కావాలే మైస్వీట్?" అని డెయిజీని పక్కన కూర్చుండబెట్టుకొని వోడ్కా అందించి, "యిది వోడ్కా, రష్యా తయారీ. రష్యన్స్ ఉన్నారు చూచావూ? అన్ని విషయాల్లోనూ స్ట్రాంగ్. రష్యన్ వోడ్కా స్ట్రాంగ్, లిటరేచర్ స్ట్రాంగ్, రెవెల్యూషన్ స్ట్రాంగ్ కాని, గరల్స్ మాత్రం చాలా సింపుల్ అంటారు. కానీ, ఒక్క సిప్ కొట్టు. కాస్త గొంతు కాల్తుంది. అంతే, తరవాత ఉంది దాని మజా" అని త్రాగించాడు డెయిజీతో.

డెయిజీ గుండె దడదడలాడింది. చమటలొచ్చాయి. ఈ పరిస్థితిలో రాజా వస్తే? వస్తే.........వస్తే......? ఏం చేయాలి? తన నిలా పాతాళంలోకి ఎందుకు దింపుతున్నారు? గొంతుదాకా దుఃఖం వచ్చింది. ఏం చేయాలో అర్థం కాలేదు. కన్నీరు టప టప రాలింది. సూరి మైకం సగం చచ్చింది. వెర్రిగా చూచాడు.

"డెయిజీ, దుఃఖం రెండూ ఒక్కచోట ఉండరానివి, ఎందుకలా ఏడుస్తున్నావ్?" అడిగాడు.

"సూరీ, ప్లీజ్ అండర్‌స్టాండ్ మీ" అని బ్రతిమాలుతున్నట్లుగా మైకేలు తనకు అప్పగించిన పనిని గురించి చెప్పి, సూరి అక్కడుంటే ఆ పనికి అంతరాయం కలుగుతుందని చెప్పింది.

"సో డెయిజీ, అయామ్ వెరీసారి. ఇదిగో, ఇప్పుడే వెళ్లిపోతున్నా. ఎక్స్‌క్యూజ్‌మీ. ఈ రాత్రి పని పూర్తికావాలి. తెల్లవారే వరకు శుభవార్త తెలియాలి" అని వోడ్కా సీసా తీసుకొని నిష్క్రమించాడు సూరి.

ఒక నిట్టూర్పు విడిచింది డెయిజీ. ఏదో బరువు దిగిపోయినట్లయింది. బయట వర్షం పడుతూంది. గాలి చల్లగా వస్తూంది. ఫ్యాను ఆఫ్ చేసి వచ్చి కూర్చుంది. మళ్ళీ ఆలోచనలు ముసురుకున్నాయి. ప్రశ్నల పరంపరలు! స్థిర నిశ్చయానికి వచ్చింది. రాజావస్తే వీరి ప్లానులన్నీ చెప్పాలని నిశ్చయించుకుంది. రాజారావు కోసరం ఎదురుచూస్తూ కూర్చుంది. రాత్రి 12 అయింది. రెండు, నాలుగు... రాజారావు రాలేదు. కన్ను మలిగింది. సోఫామీద పడి నిద్రపోయింది.

☆ ☆ ☆

పేకాటలో పెద్ద మొత్తం పోయింది రాజారావుకు. దాంతో జానీ వాకర్ నిషా కూడా దిగిపోయింది. నయాగరాకు వెళ్ళాల్సినవాడు ఇంటికి వచ్చేశాడు. మనసు సరిగా లేదు ఏదో చిరాకుగా ఉన్నాడు. కారు దిగి చరచరా వెళ్ళాడు. తెరను కూడా చూడకుండా గదిలో దూరాడు: కొంత దూరం అతనితో వచ్చిన తెర పడిపోయింది.

పార్వతి పుస్తకం చదువుకుంటూ కూర్చుంది. అతన్ని చూచి ఆశ్చర్యపోయింది – అతడు ఆ దశలో వచ్చినందుకు కాదు, అంత తొందరగా వచ్చినందుకు! రోజా పార్వతి అలాగే నిద్రను ఎదిరించి మెలకువతో ఉంటోంది. ఎంత రాత్రైనా రాజారావు రావాలి. ఆమె తినాలి. అతడు తింటాడని కాదు. తినేవస్తాడు – చిరాకు పడ్తాడు. గద్దిస్తాడు. విసుక్కుంటాడు. అయినా, అతడు తినివచ్చాడని తేల్చుకోవాలి. అప్పుడు గాని ఆమె తినదు.

పార్వతి పుస్తకం మూసింది. అక్కడే పెట్టింది. రాజారావును – తన భర్తను – చూసింది. బూట్లు సైతం విప్పకుండా మంచంలో పడిపోవడం ఇదే మొదటిసారి. అతడు ఎంత నిషాలో వచ్చినా బూట్లు, మేజోళ్ళు విప్పేవాడు. బట్టలు మార్చుకునేవాడు. ఈ పరిణామం ఆమె మీద మరొక పిడుగు! కొంగు వంటినిండా కప్పుకుంది. భర్త పాదాల దగ్గరికి వెళ్లింది. అతడు ఈసడిస్తాడని ఆమెకు తెలుసు. అయినా వెళ్ళింది. బూట్ల లేసులు విప్పింది. రాజారావు కిమ్మనలేదు, ఈసడించలేదు, చిరచిర లాడలేదు. అదీ ఆశ్చర్యమే కలిగించింది పార్వతికి. మేజోళ్ళు తీసింది. బట్టలు మార్చుకోవలసిందని అందామనుకుంది. కాని ధైర్యం చాలలేదు. కాలి సవ్వడిసైతం కాకుండా గది దాటింది. పోర్టికోలోకి వచ్చి చూచింది. కారు తాళంచెవులు అలాగే వున్నాయి. అని తీసుకొని గదిలోకి వెళ్ళింది. యథాస్థానంలో వుంచింది. వంటింట్లోకి వెళ్ళింది. వంటమనిషి కొంగు పరచుకొని నేలమీద పడుకొని వుంది. మెలుకువగానే వుంది. పార్వతిని చూచి లేచింది. పళ్ళాల్లో

అన్నం వడ్డించి ఇచ్చింది. పార్వతి రెండు పళ్ళాలు తీసుకొని గదిలో ప్రవేశించింది. ధైర్యం కూడగట్టుకొని భర్త దగ్గరికి వెళ్ళింది. వాసన గుప్పుమంది. అతడు కళ్ళుతెరచి ఉన్నాడు. "లేవండి. బట్టలు మార్చుకోండి" అన్నది.

యంత్రవతుగా లేచాడు రాజారావు. బట్టలు మార్చుకున్నాడు. పార్వతి సంతోషించింది. తన ప్రార్థనలు ఫలించాయనుకుంది. రాజారావు టేబులు ముందు కూర్చున్నాడు. ఆమె పళ్ళెం ముందుంచింది. కాళ్లు కడుక్కోమందా మనుకుంది. ధైర్యం చిక్కలేదు. పలుకలేదు. రాజారావు రెండు మెతుకులు నోట్లోవేసుకున్నాడు. ఏదో లాంఛనానికి అన్నట్లు తిన్నాడు. చేయి కడుక్కున్నాడు. మళ్ళీ మంచంలో పడిపోయాడు.

అంతకే సంతోషించింది పార్వతి. తిన్నాననిపించుకుంది. లైటు ఆర్పేసి బెడ్ లైటు వేసింది. పడుకుంది.

రాజారావు పడుకున్నాడనేకాని నిద్రపోలేదు. అసలు అది రాలేదు. ఎన్నో ఆలోచనలు అతనిని ముసిరాయి. సూరి చెక్కుమీద సంతకం పెట్టమనడం, తాను పెట్టడం... ఎంత మూర్ఖుడు తాను? అడగ్గానే సంతకం పెట్టేశాడు. ఆరును అరవై చేసి కాజేశాడు సూరి. ఎంత దుర్మార్గుడు! ఎంత కపటి!! అసలు బ్యాంకువాళ్ళు ఎలా ఇచ్చారు? వాళ్ళనూ ఏదో మోసం చేసి ఉంటాడు! ఒళ్ళు మండింది, కళ్లు చింతనిప్పులైనాయి. వాడి అంతు తేల్చుకోవాలనుకున్నాడు. తరవాత ప్రయోజనం లేదనుకున్నాడు. తానే బయటపడిపోతాడు! సంఘంలో లోకువైపోతాడు!!

డెయిజీ మనసులో మసలింది. చలించాడు. ఏదో వెన్నెల విరిసినట్లయింది. క్షణంలో నిప్పుల వాన కురిసింది. మనసులో ముళ్ళపొద మొలిచింది. ఛీ ఎంత దుర్మార్గురాలు! అందం ఉందా దాని దగ్గర! వట్టి పౌడరు ముండ, ఎంత లొంగాడు తాను దానికి! దాని వగలు, దాని కులుకు!! అసలు దానివల్లనే తాను మునిగింది. గుర్రపు పందాలు! ఎంత పోయింది దానిలో? పేకాట? కొంప గుల్ల అయ్యేస్థితి వచ్చింది! ఎంత డబ్బు పోయింది ఇవాళ! దీనంతటికీ డెయిజీయే కారణం. అది లేకుంటే తాను సూరికి లొంగేవాడా? ఎంత కపటి! ఎంత వగలాడి! కొంతసేపు ఆవిడ అందం, చిరునవ్వు అతనిమీద ప్రభుత్వం చేశాయి. ఇంతలో మరొక దృశ్యంలో మునిగిపోయాడు.

కారు హారను, బెదిరి పక్కకు జరగడం, ఆ కళ్ళలో భయం... అబ్బ! ఎంత అందంగా ఉన్నాయి! ఎంత అమాయికత! గడగడా వడకిపోయింది. ఎంత సొగసుంది లోకంలో! ఎంత ఆకర్షణ ఉంది ఆవిడలో – ఆ సుందరిలో!

లక్ష్మి అందం అతనిని ముంచెత్తింది. అతడు అందులో మునిగిపోయాడు. తబ్బిబ్బైనాడు. ఉక్కిరి బిక్కిరి అయినాడు. ఆమె తన పనిలోనే ఉంది. కూలిది! తనకు వశం అవుతుందా? ఎందుకు కాదు? వశపరచుకోవాలి. అన్ని ప్రయత్నాలు చేయాలి. సాధించాలి.

రాజారావులో ఏదో తపన బయలుదేరింది. లేచాడు. లైటు వేసి సిగరెట్టు కాల్చాడు. పార్వతి నిద్రపోతూంది. చూచాడు. లక్ష్మితో పోల్చుకున్నాడు. అమాంతంగా లైటు ఆర్పి మంచంమీద కూర్చున్నాడు.

టెలిఫోను మ్రోగింది. "ఎవరు? చంద్రయ్యా! ఏం మునిగిందింతరాత్రి? ఏమి? సిమెంటు లారీలు పట్టుకున్నారూ! ఎక్కణ్ణుంచి? గవర్నమెంటు స్టోరునుంచా? మన శ్రీనివాసరా వున్నాడుగా సబిన్‌స్పెక్టరు! ఏమంటున్నావు? అతనే అడుగుతున్నాడూ ఒక లారీ సిమెంటు? మరి మనం ఇచ్చే మామూళ్ళో? ఏమంటాడు? జేలుకు పంపుతాడా? పోలీసులు అంతేలే. వాళ్ళని నమ్మడం మనదే తప్పు. ఇచ్చేయి ఏం చేస్తాం? నేను వచ్చిమాత్రం చేసేదేమి? తగలబెట్టు...." రిసీవర్ దభాల్నపడేసి బయటికి వచ్చాడు. అటూ ఇటూ పచార్లు చేశాడు. మళ్లీ వచ్చాడు. మంచంలో పడిపోయాడు. అటూ ఇటూ పొర్లాడు.

తెల్లవారింది. అప్పుడే అతనికి నిద్ర పట్టింది. లేచేవరకు పదకొండైంది. గబగబా నిత్యకృత్యాలు ముగించుకున్నాడు. స్నానం చేశాడు. బట్టలు వేసుకొని బయలుదేరాడు. ఆస్పత్రి కడ్తున్న చోటికి చేరాడు. కారు ఆగడం చూచి చంద్రయ్య పరిగెత్తుకొని వచ్చాడు. తలుపు తెరిచాడు. "ఎన్ని మాట లన్నడనుకున్నరు పోలీసోడు. బూతులు కూడా తిట్టిండుండి..." ఇంకేదో చెప్పబోయి దొర వినడం లేదని తెలుసుకొని ఊరుకున్నాడు.

"పని ఎలా జరుగుతుంది?" సాగిపోతూనే అడిగాడు రాజారావు.

"బాగానే సాగుతున్నదండి."

"పనివాళ్ళందరూ వచ్చేశారా?"

"వచ్చిన్రుండి"

"నేను చూడాలి."

ఆశ్చర్యపోయాడు చంద్రయ్య. ఇంతవరకూ ఎన్నడూ ఆ మాట అనలేదు రాజారావు. చంద్రయ్యే అక్కడి సర్వాధికారి. డబ్బివ్వడం రాజారావు పని. పనులు చేయించడం చంద్రయ్య పని. ఈ రోజు తన అధికారాన్ని సవాలు చేస్తున్నాడు దొర. అయినా తనేం చేయగలడు?

"చూడండి" అని వెనుక నడవసాగాడు.

"నువ్వెందుకు? నేనే చూస్తా. నీ పని చూచుకో."

చంద్రయ్య మాట్లాడలేదు. వెళ్లిపోయాడు. అందరినీ పరీక్షగా చూస్తూ సాగిపోతున్నాడు రాజారావు.

పని యంత్రంలా జరుగుతూంది. వడివడిగా జరుగుతూంది. ఒక అంతస్తు చూచాడు. తాను కోరింది కనిపించలేదు. రెండవ అంతస్తు, మూడవ అంతస్తు – కనిపించలేదు. నాలుగవ అంతస్తు మీదికి వెళ్ళాడు. జనం ఎక్కువగా లేరు. అక్కడ కనిపించింది లక్ష్మి. సన్‌షేడ్ మీద నుంచొని నీళ్ళు పోస్తూంది.

వెనుకనుంచి చూచాడు రాజారావు. అయినా గుర్తించాడు. సన్‌షేడ్ మీదినుంచి నడచాడు. తన పనిలో నిమగ్నమై ఉంది లక్ష్మి. అడుగుల చప్పుడు సైతం గమనించలేదు.

"అంతలా పని చేస్తే ఎలా?"

అదిరిపోయింది లక్ష్మి. చేతిలోని గొట్టం వదిలేసింది. అది జర్రున జారి నాలుగు అంతస్తుల క్రింద పడిపోయింది.

గుండె దడదడ లాడింది.

వెనక్కు తిరిగి చూసింది.

"దొర!"

ముచ్చెమటలు పోశాయి. కళ్ళు తిరిగాయి. తల గిరగిరా తిరుగసాగింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. మెదడు మొద్దుబారింది.

"ఎందుకలా అయినావ్?"

రాజారావు ముందుకు అడుగేశాడు. ఆమె వెనక్కు అడుగేసింది.

వెనుక ఏమీ లేదు.

వెనక్కు తూలింది.

'అఁ అఁ' అంటూ పరిగెత్తాడు రాజారావు. ఆమెను పట్టుకోలేకపోయాడు. తానూ పడిపోయాడు.

నాలుగు అంతస్తుల మీదినుంచి ఇసుకలో పడిపోయాడు రాజారావు.

"దొర పడ్డడు" "దొర పడ్డడు" – ఈ వార్త క్షణంలో అంతటా పాకింది.

పని పిడుగు పడినట్లు ఆగిపోయింది.

జనం గుంపులు గుంపులుగా కూడారు.

టెలిఫోన్లు మ్రోగాయి.

అంబులెన్సులు వచ్చాయి.

రాజారావును స్పృహలేని స్థితిలో ఉస్మానియాకు చేర్చారు.

టెలిఫోన్లు, డాక్టర్లు, నర్సులు, మందులు, ఇంజక్షన్లు, విజిటర్లు – ఆస్పత్రి యుద్ధరంగంగా మారింది.

రాజారావును తీసికెళ్ళింతరవాతగాని లక్ష్మికూడా పడిపోయిందని తెలియలేదు జనానికి!

ముఖంమీద నీళ్ళు కొట్టారు. కొందరు ముక్కులో పసర్లు పోయాలన్నారు. కొందరు వాత లేయాలన్నారు.

పోచయ్య ఏడుస్తూ రిక్షా దిగాడు. పరిగెత్తుకొని వచ్చాడు. లక్ష్మి మీద పడి పెద్దగా ఏడ్వసాగాడు.

అయినా లక్ష్మి కదలలేదు, కళ్ళు తెరవ లేదు.

ఒకడు ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. ఊపిరాడుతున్నది. "బతికున్నదసే. రిచ్చ తేరి. దవఖాన కేస్కపోదం" అన్నాడు.

అప్పుడు పోయిన ప్రాణాలు వచ్చాయి పోచయ్యకు. లేచి నుంచొని చొక్కాతో కన్నీరు తుడుచుకున్నాడు.

రిక్షా వచ్చింది. లక్ష్మి ఉస్మానియాకు చేరింది. ఎమర్జన్సీ రూములో వేయి ప్రశ్నలు వేసి, గంటన్నర తరువాత ఇన్‌పేషెంటుగా చేర్చుకున్నారు.

పోచయ్యను బయటికి గెంటేసి, లక్ష్మిని లోనికి తీసికెళ్ళారు–స్ట్రెచర్ మీద.

★ ★ ★

# ఆరు

బుగ్గ గిల్లినట్లు ఎర్రవారింది తూర్పు. తెల్లవారనున్నది. సంపదను సృష్టించడంలో నలిగేవారి వాడ మేల్కొన్నది. వాడ సందడిగా ఉన్నది. వంటలు సాగుతున్నాయి. ఇండ్ల కప్పుల్లోంచి పొగ వస్తూంది.

పొగ కనిపించని, సందడిలేని ఇల్లు ఒకటుంది. అది పోచయ్యది. పోచయ్య మౌనంగా ఏడుస్తున్నాడు. ఏమీ చేయలేడు కాబట్టి ఏడుస్తున్నాడు. నిద్రాహారాలూ ఏడుపే అయినాయి అతనికి.

ఏడు రాత్రులకు, రాత్రి కన్ను మలిగింది పోచయ్యకు. కలలో లక్ష్మి కనిపించింది.

యమదూతలు వచ్చారు. లక్ష్మిని రమ్మన్నారు. తాను వారితో యుద్ధం చేశాడు. ఓడించాడు. లక్ష్మిని తెచ్చుకున్నాడు. దక్కించుకున్నాడు.

అస్పత్రి. ఆపరేషన్ థియేటరు. మూతులకు గుడ్డలు కట్టుకున్న ముసుగు జనం. తళతళా మెరిసే కత్తులు! లక్ష్మి తల తరిగేశారు! తల కెవ్వున కేకవేసింది. తలను తీసుకొని పరుగెత్తుతున్నాడు తాను.

అస్పత్రి. తాను లక్ష్మి పక్కన కూర్చున్నాడు. లక్ష్మికి తెలివి వచ్చింది. వెర్రిగా తన వైపు చూస్తూంది. తనను గుర్తించినట్లు లేదు. తనమీద ఏదో నల్లని ముసుగు పడింది. తనను ఎవరో లాక్కుపోతున్నారు.

"లచ్చీ! లచ్చీ!!" అంటూ పలవరిస్తూ లేచాడు పోచయ్య. చూస్తే తెల్లవారింది. అయినా, లోకం చీకటిమయంగా కనిపించింది అతనికి. మనసులో చీకటి వున్నప్పుడు సూర్యుడుకూడా అమావాస్య చంద్రుడు అవుతాడు.

లేచాడు పోచయ్య. నడక సాగించాడు. ఉస్మానియా ముందుకు వచ్చాడు. అతనికి తెలుసు ఆ సమయంలో ఎవరినీ లోనికి పోనివ్వరని. అయినా, అస్పత్రి ముందు కూర్చుంటాడు. అందులో ఏదో సంతృప్తి ఉందతనికి.

చెట్టు క్రింద కూర్చున్నాడు పోచయ్య. ఒక బైరాగి వచ్చి పక్కనే కూర్చున్నాడు. సంచిలోంచి గంజాయి తీసి అరచేతుల్లో వేసుకున్నాడు. నీటి చుక్కలు వేసి బొటన వేలుతో నలిపాడు. గొట్టంలో వేసి ముట్టించి దమ్ము లాగాడు. "హరహర మహదేవ్" అని కాలుమీద కాలు వేసి పొగ వదిలాడు.

పోచయ్య వింతగా చూశాడు. "భాయీ! పుచ్చుకుంటావా? దేన్ని తలుస్తావో అదే ఉండిపోతుంది మనసులో. భగవంతుణ్ణి తల్చుకొని పీల్చేస్తాం. ఉండిపోతాడు మనసులో. హిమాలయ పర్వతాల నుంచి తెచ్చాం. చూడు రుచి" – అందించాడు. యాంత్రికంగా పుచ్చుకున్నాడు పోచయ్య. దమ్ము లాగడం రాలేదు. బైరాగి నేర్పాడు. పీల్చాడు పోచయ్య. పొగ వదిలాడు కొద్దిగా దగ్గి. లక్ష్మి కనిపించింది. తనముందే ఉన్నట్లనిపించింది. మరొకసారి పీల్చాడు. ఇంకొకసారి పీల్చాడు. తల ఏదో దిమ్ము పట్టినట్లనిపించింది. లక్ష్మి కనిపిస్తూనే ఉంది.

"హరహర మహాదేవ్" అన్నాడు బైరాగి. "వస్తాను శిష్యా" అంటూ లేచిపోయాడు. లక్ష్మి తనకు దూరం అవుతున్నట్లు అనిపించింది పోచయ్యకు. అతడు బైరాగి కాళ్ళు పట్టుకున్నాడు. "నీ కాల్మొక్త మారాజ్. ఇంక జర్రిచ్చిపో. నీ గులాం నైత" అన్నాడు.

"భాయీ! ప్రస్తుతం మా దగ్గర గంజాయి లేదు. ఈ పూట హిమాచలానికి వెళ్తున్నాం. రేపు పొద్దున మళ్లీ తెస్తాం. ఉండు, ఇక్కడే వాల్తా" అని వెళ్ళిపోయాడు బైరాగి.

క్రమక్రమంగా పోచయ్య ముందు నుంచి లక్ష్మి మాయం అయింది.

నాలుగు కావస్తూంది. తాను వెళ్ళగానే లక్ష్మి మాట్లాడుతుందనీ, లక్ష్మికి గంజాయి ప్రభావం తెలియజేయాలని, బైరాగిని చూపించాలనీ ఉత్సాహపడ్డాడు.

నాలుగైంది. పోచయ్య లక్ష్మి దగ్గరికి వెళ్లాడు. లక్ష్మి నిన్నటిలాగే పడి ఉంది. మౌనంగా కూర్చున్నాడు పోచయ్య. ఆరింటిదాకా కూర్చున్నాడు. వచ్చేశాడు. ఇంటికి వెళ్ళడం మనస్కరించలేదు. అంతేకాదు. నీరసించిపోయాడు. కదలడం కూడా చేతకావడంలేదు. కూలబడిపోయాడు.

డొక్క మాడిపోతూంది. దుమ్ములో కూలపడ్డాడు. చుట్టూ చూశాడు. కుడిపక్క సైకిలు స్టాండుంది. జనం సైకిళ్ళు తీసుకుంటున్నారు. వెళ్ళిపోతున్నారు. సైకిలుస్టాండు పక్కనే ఒక ముసిలాడు సిగరెట్లూ, అగ్గిపెట్టెలూ పెట్టుకొని కూర్చున్నాడు. ఎడమపక్క గుడి వుంది. కొంత దూరాన బిచ్చగాళ్ళు గిన్నెలు పట్టుకొని కూర్చున్నారు. పార్కు ముందు పండ్ల దుకాణం ఉంది. బత్తాయిలూ, ఆపిల్సూ అమ్ముతున్నారు. అవి చూచి నోరూరింది పోచయ్యకు. జేబులో వెతికాడు. అయిదు పైసలబిళ్ళ కనిపించింది. దాని విలువ తెలుసు అతనికి. కుడివైపుకు చూచాడు. రాతి ప్రహరీకి అంటివున్న గుడికి కొబ్బరికాయలు కొడుతున్నారు జనం. వెళ్ళాడక్కడికి. కొబ్బరి దొరికింది. తిన్నాడు. అయినా ఆకలి చల్లారలేదు. గుడివైపుకు వెళ్ళాడు. గంటలు మ్రోగుతున్నాయి. భజన జరుగుతూంది. అక్కడే గోడకు అనుకుని నుంచున్నాడు. ప్రసాదం తెచ్చాడొకడు. పెట్టింది కాస్తా నోట్లో వేసుకున్నాడు. అక్కడే కూలబడ్డాడు. ఇంకా ఆకలి చల్లారలేదు. బటానీలవాడు వచ్చాడు. అయిదు పైసల బటానీలు కొనుక్కొని తినేశాడు. అక్కడే నేలమీద పడుకున్నాడు. నిద్ర రావడంలేదు. ఆకలి...ఆకలి చంపేస్తూంది. కడుపు దహిస్తూంది. అది గంజాయి ప్రభావం. తినడానికి ఏమీ కనిపించలేదు. రాత్రి చాలా అయింది. అయినా లైట్లున్నాయి. వెలుగు బాగా ఉంది. ఆస్పత్రి ముందు జనం ఏమాత్రం లేరు. పండ్లదుకాణం, సిగరెట్ల దుకాణం మాయం అయినాయి. సైకిల్ స్టాండులో కూడా సైకిళ్ళు ఎక్కువ లేవు. పళ్ళదుకాణం ఉన్నచోటు చూశాడు. అరటిపండ్ల తొక్కలు పడివున్నాయి. లేచాడు అక్కణ్ణుంచి. పొట్టంతా ఏరుకున్నాడు; అదీ ఎంతో లేదు. అవులు తినగా మిగిలింది. ఒక్కొక్కటే తినేశాడు. పార్కులోకి వెళ్ళి నీళ్ళు తాగాడు. కాస్త డొక్క నిండినట్లయింది. వెల్లకిలా రెండుచేతులు నెత్తిక్రింద పెట్టుకొని గడ్డిమీద పడుకొన్నాడు. ఆకాశంలో నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి. పక్కకు చూచాడు. ఎవరో బీడీ తాగుతున్నాడు. తనకూ పొగ పీల్చాలనిపించింది, పొగ పీల్చేవాణ్ణి ఒక బీడీ అడిగాడు. లేదన్నాడు. అటూ యిటూ వెతికాడు. ఎంగిలి

సిగరెట్టు దొరికింది. నిప్పడిగి అంటించుకున్నాడు. మళ్ళీ పడుకున్నాడు ఆకాశాన్ని చూస్తూ. లక్ష్మి కళ్ళలో మసలింది. పచ్చనిగడ్డి, పొడవైన పోకచెట్లు, హౌజులు, రాత్రి చుక్కలు... లక్ష్మి బాగవుతుందా? మళ్ళీ తనకు దక్కుతుందా? ఏవో వింత వింత ఆలోచనలు వచ్చాయి. బైరాగిని గురించిన ఆలోచన వచ్చింది. అవును, గంజాయి పీలుస్తే. లచ్చి ఎపుడూ తన ముందే ఉన్నట్లుంది. బైరాగి ఎపుడు వస్తాడో? బైరాగి తనకు కలిసిన చోటికి వెళ్ళాడు. అక్కడే పడుకున్నాడు. ఏ రాత్రికో నిద్ర ముంచేసింది.

లేచేవరకు ఎండ బాగా ఎక్కింది. ఒళ్ళంతా నొప్పులనిపించింది. ఒళ్ళు విరుచుకున్నాడు. ఇటూ అటూ చూచాడు. జనం అప్పుడప్పుడే ఆస్పత్రికి వస్తున్నారు. డొక్క చూసుకున్నాడు. లొక్కుపోయింది. మళ్ళీ ఆకలి మొదలైంది. ఏమీ తోచలేదు. లేచి పార్కులోని పంపు దగ్గర పుక్కిలించి ఊశాడు. బైల్దేరాడు గౌలీగూడెం చమన్ దగ్గరుండే మనుషుల మార్కెట్టుకు.

పండ్లకూ, కూరగాయలకూ, కోళ్లకూ, చేపలకూ మార్కెట్లు కట్టేవారు మనుషులను గురించి ఆలోచించరు. మనుషుల మార్కెట్టుకు ఇళ్లుండవు, బోర్డు వుండదు. ప్రత్యేకంగా స్థలం వుండదు.

రోడ్డుకు రెండుపక్కల బారులుతీరి నుంచున్న జనం తమ శ్రమను మార్కెట్లో అమ్ముకోవడానికి వచ్చారు. వారివారి వృత్తుల్ను సూచించడానికి వాళ్ళ చేతుల్లో వారివారి పనులకు సంబంధించిన పనిముట్లు – తాపి, కొంచె, సుత్తె ఉన్నాయి.

పోచయ్య మనుషుల మార్కెట్టుకు వచ్చాడు. అక్కడ నుంచున్న వారంతా అతన్ని వింతగా చూచారు.

"ఏయ్! ఎవల్నువ్వు?" అడిగా డొకడు.

"మడిసిని."

"అది కండ్ల బడ్తాంది. ఈడికెందు కొచ్చినవ్?"

"పనికి."

"ఏ అడ్డలోనివి?"

"చిక్కడపల్లి."

"ఈడి కెందుకొచ్చినవ్?"

పోచయ్యకు కోపం వచ్చింది. ఈ అడ్డా (వ్యాపారస్థలం) వానికి గుత్త అయినట్లు మాట్లాడతాడేం? తానూ కూలి చేసుకోవడానికి వచ్చాడిక్కడికి. వాడి పెత్తనం ఏమిటిక్కడ అనుకున్నాడు.

"ఈ అడ్డేం గుత్త గొన్నావా?" అన్నాడు పోచయ్య.

"చూడ్రో, దిమాఖ్ కొడతాండు. ఇదేం వీని అయ్యసొమ్మైనట్లు" అన్నాడు వాడు అక్కడున్నవాళ్ళతో.

ఇంకొకడు కాస్త బలంగా ఉన్నవాడు పోచయ్యమీదికి ఉరికి వచ్చాడు.

"ఏం బే సర్ ఫిరాయిస్తున్నదా? ఈ అడ్డ నీ తాతదా బే సాలే. పోతవా ఈణ్ణుంచి, జబ్డలు పగలకొట్టనా?" అన్నాడు.

"ఏందయో! మీది మీది కొస్తాన్నవు. జర్ర సంబ్హాయించుకొని మాట్లాడు. నువ్వు కూలి చేస్కునే టంద్కొచ్చినవ్; నేను కూలి చేస్కునేటంద్కొచ్చిన, ఈ జాగేం గుత్త కొన్నవా?"

"ఏంది బే, పెద్ద లీడరోలె మాట్లాడ్తాన్నవు సాలె. ఫో ఈణ్ణుంచి హడ్డీనరమ్ చేస్త" అని ఒకటి పుచ్చుకున్నాడు. అక్కడున్న వారంతా కూడి కొట్టారు పోచయ్యను. పోచయ్య ఒక్కడు ఏం చేస్తాడు?

క్రింద పడిపోయిన పోచయ్య లేచాడు. నోట్లోంచి రక్తం కారుతూంది. చేత్తో రక్తం తుడుచుకొని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు ఆస్పత్రి వైపు.

"వచ్చిండయ్యా నీతుల్చెప్పేటందుకు" అన్నాడొకడు.

"నవాబురా నవాబు" అన్నాడొకడు.

అందరూ గొల్లుమని నవ్వారు.

ఒళ్ళు తిరిగినట్లయింది పోచయ్యకు. కొంతదూరం వెళ్ళి ఒక దుకాణం ముందున్న అరుగు మీద కూలబడ్డాడు. రెండు చేతులతో తల పట్టుకొని కూర్చున్నాడు. కొంతసేపటి తరవాత స్థిమిత పడ్డాడు.

"అరే ఎవడ్రా, ఈడకూకున్నడు? దొంగ ఉన్నట్లున్నడు సాలెగడు" అన్నాడు దుకాణం తెరవడానికి వచ్చిన కుర్రాడు. లేచి వెళ్ళిపోయాడు పోచయ్య.

పోచయ్య ఆస్పత్రి ముందుకు చేరి కూలబడ్డాడు. అతని గుండెపై రాయి పడింది. అతనిపై దౌర్జన్యం జరిగింది. అతడేం చేయగలడు? బలం ఉన్నవాడి ముందు బలం లేనివాడు లొంగిపోతున్నాడు. మోకాళ్ళ మీద తలపెట్టుకొని ఏడ్చాడు.

"హరహర మహదేవ్" – బైరాగి ధ్వని విని ప్రాణం లేచివచ్చింది పోచయ్యకు. చొక్కాతో కన్నీరు తుడుచుకొని బైరాగి వైపు చూచాడు. బైరాగి అతని పక్కనే కూర్చున్నాడు. "ఏం భాయీ, ఇలా ఉన్నావు?" అన్నాడు. దుఃఖం పొంగి వచ్చింది. అయినా, దిగమ్రింగి జరిగిందంతా చెప్పేశాడు పోచయ్య.

"భాయీ! దుఃఖించకు. ఇదిగో రూపాయి తీసుకో" అన్నాడు బైరాగి.

రూపాయి తీసుకొని వెళ్ళిపోయాడు పోచయ్య. ఫుట్‌పాత్ మీద రొట్టె లమ్మే మనిషి దగ్గర తిన్నాడు, బీడీలు కొనుక్కొని వచ్చి, బైరాగి దగ్గర కూర్చున్నాడు. కృతజ్ఞత ఎలా తెలియజేయాలో తెలియక తికమకపడ్డాడు.

"భాయీ! దమ్ములాగు" అన్నాడు బైరాగి. దమ్ములాగాడు పోచయ్య. అతనికి లక్ష్మి కనిపించింది. మళ్ళీ మళ్ళీ దమ్ములాగాడు. లక్ష్మి తన ఎదుటనే కనిపించింది.

బైరాగి వెళ్ళిపోయాడు. మళ్ళీ వస్తానన్నాడు.

ఆ రోజు కూడా లక్ష్మికి స్పృహ రాలేదు. నిరాశచెంది వచ్చేశాడు పోచయ్య.

★ ★ ★

# ఏడు

పార్వతి దేవుని గదిలో కూర్చొని ఉంది. ఆవిడ ముందు సీతారామ లక్ష్మణులున్నారు. అవి స్ఫటికపువి. సుందరమైనవి. సీతారాములు చిరునవ్వు చిందిస్తున్నారు. పార్వతి ఆ నవ్వుతో తన్మయురాలు అవుతూంది. కాని, ఆరు రోజులనుంచీ ఆమె మనసు ఆ విగ్రహాలమీద లగ్నంకావడంలేదు.

ఆరు రోజుల నుంచీ నిద్రాహారాలు లేవు పార్వతికి. రాత్రింబవళ్ళు ఆస్పత్రిలోనే ఉంటూంది. ఉదయం వచ్చి స్నానం చేసి పూజ చేసుకుంటూంది. తన భర్తను కాపాడమనీ, మాంగల్యం రక్షించమనీ ప్రార్థిస్తూంది.

నేడు ఎలాగైనా రాముని మనసున చూడాలనుకుంది. చేతులు జోడించి, కళ్ళు మూసుకుని, ధ్యానించింది. ఎంతో ప్రయత్నించింది. కాని, ఫలించడంలేదు. సీతారాములు వస్తున్నారు. కాని, క్షణంలో అదృశ్యులు అవుతున్నారు. రాజారావూ, అతని మంచం ప్రత్యక్షం అవుతున్నాయి.

నారాయణరావుగారు గుమ్మంలో నుంచొని చూశారు. పార్వతికి అతని అడుగుల చప్పుడు కూడ వినిపించినట్లులేదు. నారాయణరావుగారు రావడం ఇది రెండవసారి. నిన్న అతనికి డబ్బు దొరకలేదు! ఈ రోజు కురుక్షేత్రం చూడాలని అతని తాపత్రయం! కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నాడు! బ్రాందీ పడితేకాని మనిషికాడు!

పార్వతి అలా కూర్చొని తన మాంగల్యం కాపాడమని సీతమ్మను బ్రతిమాలింది! రామయ్యను ప్రార్థించింది! హారతి ఇచ్చి వెనుకకు చూచింది – తండ్రి కనిపించాడు! గ్రహించింది. హారతి అందించింది. ప్రసాదం ఇచ్చింది. గది తలుపులువేసి తాళంవేసి రాజారావు గదికి వెళ్లింది. నారాయణరావు అనుసరించాడు. పార్వతి తండ్రికి డబ్బు అందించింది. నోట్లు అందుకొని వెళ్ళబోతూ "కురుక్షేత్రం ఆడుతున్నారు, రవీంద్ర భారతిలో" అన్నాడు. పార్వతి చంద్రయ్యను పిలిపించింది.

చంద్రయ్య చెప్పులు విడిచి గదిలో ప్రవేశించి పార్వతికి నమస్కారం చేశాడు. ప్రతి నమస్కారం చేస్తూనే అడిగింది పార్వతి: "కురుక్షేత్రం టిక్కట్లు వచ్చాయి కదూ మనకు?"

"అవ్. వచ్చినయ్. జబర్దస్తిగ కట్టిండుండి ఇంజనీరు. పానార్తింటాౘుండి అప్పర్లు. ఊఁ అంటే చందంటరు ఆఁ అంటే చందంటరు."

అయ్యకివ్వమని తండ్రిని చూపించి, "రాత్రికి ఫియట్ కాళీగా ఉంటుందికదా?" అడిగింది.

"పుర్సతాడుదుండి ఫైట్‌కు సూపర్‌జరింట్ల లగ్గమైతాంది. అయినకిచ్చినం. ఒకటే రద్దాయిస్తాండు. పెట్రోలేమో మనకాతాల్నే."

"ఎం–బాసెడర్?"

"పొద్దుమికేయోల పుర్సతుంటది. కౌన్సిలర్ గుట్టకు పోతనంటే ఇచ్చినం నిన్న. ఇయాలొస్తది."

"సాయంకాలం అంబాసెడర్ అయ్యక్కావాల. పంపు. రవీంద్రభారతికి వెళ్తారు. మళ్ళీ తీసుకొచ్చి ఇంట్లో దింపాలి. డ్రైవరుతో చెప్పు, మరెక్కడికీ తీసికెళ్ళొద్దని." అదంతా విని నారాయణరావుగారు వెళ్లిపోయారు.

ఈలోగా టెలిఫోన్ చేసి భర్త విషయం తెలుసుకుంది పార్వతి. పరిస్థితి అలాగే ఉందనీ, వస్తే ఈ రోజు స్పృహ రావచ్చనీ, సాధ్యమైనంత వరకు ప్రయత్నిస్తున్నామనీ చెప్పాడు డాక్టర్. రాజారావు పక్కన నర్సు ఉన్నదనే విషయం ధృవపర్చుకుంది. ఏ పరిస్థితిల్లోనూ రాజారావుకు జరిగే సేవలో లోపం కలగరాదని ఆమె అభిప్రాయం.

"పనులెలా జరుగుతున్నాయి?" అడిగింది పార్వతి.

"దవాఖాన బత్తయింది. కళాయి పెడ్తాన్రియాల. పంజగుట్టకాడ సడక్ పని నిలిచింది. రోడ్ రోల రియ్యమంటే ఇస్తలేదు ఇంజనీర్. అయినకేదన్న ఇయ్యాలె. లేకుంటే ఇచ్చేటట్టులేదు. లష్కర్ల డ్రైనేజి పని అడనే ఆగింది. గొట్టాల్లేవంటాన్రు, రైల్వేవాండ్ల ఇండ్ల పని జరుగుతాంది.

"ఇంజనీరు పైక మడుగుతాండు. బిడ్డ లగ్గమట మనకేమో బిల్లురావాలె. పైకమియ్యకుంటే బిల్లు రాయనంటాడు. దొర యిస్తనని ఒప్పుకున్నాడు."

"ఎంత?"

"పాంచ్ హజార్!"

"మూడు వేలకు చెక్కు రాసిస్తా, తీసికెళ్ళు. ఇంకెంత కావాలివ్వాళ?"

"దస్ హజార్ కావాల్నుండి."

"నిన్నటి పైకానికి లెక్క తెచ్చావా?"

"ఇదో నుండి లెక్క" అని కాగితాలు టేబుల్ మీద పెట్టి, వెనక్కు నుంచున్నాడు చంద్రయ్య.

జాగ్రత్తగా లెక్క చూచింది పార్వతి.

"ఈ రాతి పొడేమిటి?" అడిగింది.

"సిమ్మెంట్ల కలిపేతందుకు."

"సిమెంట్లో ఏమీ కలపొద్దు. మంచి సిమెంటు వాడండి, డబ్బు మంచి సిమెంటుకు పుచ్చుకుంటున్నాంగా మనం?"

"అట్ల అయితాదుండి? లుక్సానొస్తది. అప్సర్లందరికీ తగల పెట్టొద్దండి! యాణ్ణుంచొస్తది?"

"ఎందుకియ్యాలి మనం నీతిగా పనిచేసేటప్పుడు?"

"గదంతా నడ్వదుండి. గద్దలు పొడ్చుక తిన్నట్టు తింటరు."

"ఏమో ఇదంతా అయోమయంగా ఉంది. నీతి నియమాలు గలవాడు బతికేట్లు లేదు. సరే, ఇదిగో పదమూడు వేల చెక్కు. లెక్క చూపించాలి రేపు. మనకు రావాల్సిన బిల్లు ఇవ్వాళ రావాలి. రేపు నేను చెక్కురాసివ్వను" అని చెక్కు అందించింది.

"సరేనుండి" అని సలాంపెట్టి వెళ్ళిపోయాడు చంద్రయ్య. డ్రాయరుకు తాళంవేసి లేస్తుండగా మళ్ళీ ప్రవేశించాడు. "ఇన్కంటాక్సాయనకు సుత ఇయ్యాల్నుండి."

"ఇప్పుడుకాదు. దొర అలా పడివున్నాడా – నా కాతాలో దబ్బిస్తున్నా. చెప్పు ఆయనతో తర్వాత సర్దుతామని."

"సరే, అట్లనేనుండి" అని వెళ్లిపోయాడు చంద్రయ్య.

పార్వతి భర్త గదిలో ప్రవేశించింది. రాజారావు మంచం పక్కన డెయిజీ కూర్చుని ఉంది. పార్వతిని చూచి లేచి నుంచుంది. నమస్కరించింది. పార్వతి అర్థం చేసుకుంది. లిప్తపాటు కోపం ప్రకోపించింది. క్షణంలో అది తగ్గిపోయింది. డెయిజీదేం తప్పు భర్తది కాని? అది తన దురదృష్టం అనుకుంది. చిరునవ్వు నవ్వి ప్రతి నమస్కారం చేసింది.

"ఎప్పుడొచ్చారు?" ఆమె ప్రశ్న ప్రసన్నంగా ఉంది. డెయిజీ ఆశ్చర్యపడింది. హిందూ భార్యలు సాధారణంగా భర్తలు పరాయి స్త్రీలతో ఉండడం సహించరు. అలా ఉండడం తమ భర్తల దోషంగా కాక ఆ స్త్రీల దోషంగా పరిగణిస్తారు. కాని, పార్వతి అలాకాక ప్రసన్నంగా ప్రశ్నించడంతో ఆశ్చర్యపడింది డెయిజీ.

"ఉదయం వచ్చాను. అప్పటికి మీరు వెళ్లిపోయారు. ఇప్పటికి వెళ్ళిపోయేదాన్నే. కాని, ఈ రోజు స్పృహ వస్తుందని చెపుతున్నాడు డాక్టరు. మీరు దగ్గరలేరు కాబట్టి కాస్త ఎక్కువసేపు కూర్చున్నాను. వెళ్తా" అని నమస్కరించింది.

వాస్తవానికి డెయిజీ రోజూ ఉదయం వస్తూంది. పార్వతి వెళ్ళిపోయిం తరవాత వస్తూంది. పార్వతి వచ్చేవరకు వెళ్ళిపోతూంది.

"ఎలా వెళ్తారు?"

"బస్సు."

"కారుంది వెళ్ళండి. త్వరగా పంపించెయ్యండి." డెయిజీ ఉక్కిరిబిక్కిరైంది. ఆ సానుభూతినీ, దయను భరించే స్తోమత లేకపోయింది. ఎరుపు తరంగం ముఖం మీదనుంచి పరుగెత్తింది. థాంక్సు అని వెళ్ళిపోయింది.

పార్వతికి లక్ష్మి గుర్తుకు వచ్చింది. లక్ష్మి అంటే ఆవిడకు ప్రత్యేకమైన సానుభూతి ఏమీలేదు. ఒక పేదది. తన పనిమీద వున్నప్పుడు పడిపోయింది. ఆవిడను చూడడం తన కర్తవ్యంగా భావిస్తుందావిడ. రోజూ చూచి వస్తుంది లక్ష్మిని. పేదవారంటేనూ, తిండిలేని వారంటేనూ ఆవిడకు దయగాని సానుభూతికాని లేదు. ఆవిడ విశ్వాసం వేరు. ఆవిడ సిద్ధాంతం వేరు. ఏ జన్మలోనో పాపం చేసుకున్నవారు ఈ జన్మలో దరిద్రులై పుడతారని ఆవిడ నమ్మకం. దరిద్రం మన సమాజంలోని అస్తవ్యస్తాల ఫలితమనీ, దాచుకునేవా రుండబట్టే దారిద్ర్యం ఉందని మనం వాదించి ప్రయోజనం లేదు.

పార్వతి లక్ష్మి పక్కన కూర్చుంది. లక్ష్మి శవంలా పడి ఉంది. అయినా ఆవిడ ముఖంలో అందం ఉంది. కళ ఉంది. తనలో లేని అందం లక్ష్మిలో ఉంది. అందుకు ఈర్ష్య సైతం కలిగింది పార్వతికి. లక్ష్మి జీవిస్తుందని ఏ కోశానా విశ్వాసం లేదు పార్వతికి. ఊపిరి ఆడుతుండడం తప్ప లక్ష్మి జీవించి ఉందనడానికి సంబంధించిన ఏ లక్షణమూ కనిపించడంలేదు.

"రాజారావుగారికి తెలివి వచ్చింది" అని ఒక నర్సు పరిగెత్తుకుంటూ వచ్చి చెప్పి ఉరికింది టెలిఫోను చేయడానికి.

పరిగెత్తింది పార్వతి. అప్పటికే ముగ్గురు నలుగురు నర్సులున్నారు రాజారావు మంచం దగ్గర. పార్వతిని చూచి వారు తొలగిపోయారు.

పార్వతిని చూచాడు రాజారావు. వింతగా చూచాడు. ఆస్పత్రి కప్పులనూ, చుట్టూ ఉన్న మంచాలనూ చూచాడు. "పార్వతీ! నేనెక్కడున్నాను?..." అడిగాడు.

"ఇది ఆస్పత్రండీ!" అని జరిగిన విషయం అంతా చెప్పేసింది.

"నే నొక్కణ్ణే పడ్డానా?"

"లక్ష్మి కూడా పడింది."

"దెబ్బలు బాగా తగిలాయా?"

"స్పృహతప్పి పడిపోయింది. ఇంకా స్పృహ రాలేదు. ఏం బ్రతుకుతుందో పాపం!"

గుండెల్లో ముల్లు గుచ్చుకున్నట్లయింది రాజారావుకు.

"చూడాలి ఆ అమ్మాయిని" అంటూండగానే వచ్చాడు డాక్టరు. "హల్లో మిస్టర్ రాజారావు! మీరు చాలా అదృష్టవంతులు. ఎలా వుందిప్పుడు?" అన్నాడు.

"డాక్టర్! బాగానే ఉన్నానే. అట్టే బాధేమి లేదు. కాని, ఏదో నరాలన్నీ వంగకుండా కర్రలా అయిపోయి నట్లనిపిస్తూంది."

"దట్సాల్రైట్. అదేమంత ప్రధానం కాదు. ఏడు రోజుల్నుంచీ పడుకొని ఉంటే అలాగే ఉంటుంది. నౌ యు మస్ట్ టేక్ సం లిక్విడ్ డైట్. యువార్ ఆల్ మోస్టు స్టార్వింగ్ సిన్స్ సెవెన్ డేస్" అంటూ కుర్చీలో కూర్చున్నాడు డాక్టరు నాడి పరీక్షిస్తూ.

"డాక్టర్! లక్ష్మి స్థితి ఎలా ఉంది? ఆవిణ్ణి చూడాలని ఉంది నాకు."

"వీల్లేదు. మీరు కదలడానికి వీల్లేదు. కాస్త జాగ్రత్తగా చూడమ్మా!" అని పార్వతితో చెప్పి వెళ్ళిపోయాడు డాక్టర్.

"రాజారావుకు స్పృహ వచ్చింది" – ఈ వార్త వేల టెలిఫోన్లలో వినిపించింది. ఆస్పత్రి ఆవరణ కార్లతో నిండిపోయింది. రాజారావు గది పూలతో నిండిపోయింది. స్థానిక పత్రికల్లో ఈ వార్త కూడా అచ్చు అయింది.

★ ★ ★

# ఎనిమిది

బొంబాయి జేలుగది కిటికీ సువ్వలు పట్టుకొని బాహ్య ప్రపంచాన్ని చూడ్డానికి ప్రయత్నిస్తున్నాడు పోచయ్య. కాని, అతనికి కనిపిస్తున్నది జేలు గోడ మాత్రమే. పైకి చూచాడు. క్రిందికి చూచాడు. పక్కలకు చూచాడు. అదే గోడ కనిపిస్తూంది. అవతల ప్రపంచం లేదని చెపుతూంది. గోడమీదనే దృష్టి నిలిపి చూస్తున్నాడు. చూపుతో గోడను చీల్చి అవలి ప్రపంచాన్ని చూడాలని అతని సంకల్పం.

లచ్చి ఏమైనట్లు? లచ్చికి తెలివివస్తే? తానలా ఎందుకు వదిలి వచ్చినట్లు? అవును, ఎందుకు వచ్చినట్లు? బొంబాయి రావడానికి, జేల్లో పడ్డానికి ఆ బైరాగి కారణం.

ఆ రోజుకూడా మామూలుగానే వచ్చాడు బైరాగి అస్పత్రి ముందుకు. చెట్టుకింద పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు పోచయ్య. పోచయ్యను చూచి చిరునవ్వు నవ్వాడు బైరాగి. ఆ నవ్వు గారడిలా పనిచేసింది. "తిన్నావా?" అడిగాడు బైరాగి. తల ఊపాడు అడ్డంగా పోచయ్య. "పాపం, ఆకలిగా ఉందేమో – తింటావా?" అడిగాడు. అప్పుడుగాని అర్థం అయిందికాదు పోచయ్యకు, ఆకలి దహించుకు పోతోందని. "తింటాను" అన్నట్లుగా తల ఊపాడు. బైరాగి లేచాడు. పోచయ్య కూడా లేచాడు. బైరాగి నడిచాడు. పోచయ్య అనుసరించాడు. కొంతదూరం నడిచి ఒక టాక్సీని పిలిచాడు బైరాగి. టాక్సీ ఎక్కాడు బైరాగి. నసిగాడు పోచయ్య. బైరాగి చెయ్యిపట్టి లాగి కూర్చుండబెట్టుకున్నాడు. టాక్సీలో కూర్చుంటే సిగ్గనిపించింది పోచయ్యకు. తన అవతారం తానూ టాక్సీలో! జుట్టు సవరించుకున్నాడు. ఏదో ఆకాశంలో తేలియాడుతున్నట్లనిపించింది. బస్సులన్నింటినీ దాటేసుకుని రయ్యిమని పరుగెడుతూంది టాక్సీ. టాక్సీలో కూర్చుంటే తన హోదా ఏదో పెరిగిందనుకున్నాడు. పెద్దమనిషి తరహాగా కూర్చోవాలనుకున్నాడు. నడిచి పోతున్నవాళ్ళనూ, సైకిళ్ళ మీద ఉన్నవాళ్ళనూ అదొక రకంగా చూస్తున్నాడు.

డ్రైవరు దిగాడు. ఏహ్యంగా అతనివైపు చూస్తూ తలుపు తెరిచాడు. పోచయ్య కారు దిగాడు. బైరాగి అంతకు ముందే దిగాడు. డబ్బిచ్చి టాక్సీని పంపించేశాడు. పోచయ్య ముందుకు చూచాడు. అదొక పెద్ద హోటల్ – హోటల్ నయాగరా – బైరాగి హోటల్లోకి దారితీశాడు. పోచయ్య అనుసరించాడు. హోటలు శుభ్రంగా వుంది. అంతా పైతరగతి వారున్నారు. కార్లు బారులు తీరి ఉన్నాయి. శుభ్రమైన దుస్తుల్లో అందమైన వారున్నారు. అందులో ప్రవేశించడానికి సిగ్గనిపించింది. సంకోచించాడు. అయినా ముందడుగు వేశాడు బైరాగి. మెట్లు ఎక్కాడు. గదిలో ప్రవేశించాడు. పోచయ్య కూడా ప్రవేశించాడు. గదినీ, అక్కడ తగిలించి ఉన్న పటాలనూ వింతగా చూచాడు పోచయ్య. బేరర్ లోనికివచ్చి బైరాగిని అడిగాడు. పోచయ్య బేరర్ వైపు చూచాడు...బేరర్ పోచయ్యను ఏహ్యంగా చూచాడు. పోచయ్యకు కోపం వచ్చింది. బేరర్ను చితక్కొట్టేయ్యా లనిపించింది. బేరర్ వెళ్లిపోయాడు. మళ్ళీ వచ్చాడు

బేరర్. టేబుల్ మీద రమ్ సీసా, సోడా సీసాలూ, తినుబండారాలూ పెట్టి, సీసాల మూతలూ తీసిపెట్టి వెళ్లిపోయాడు.

పోచయ్య సీసావైపు దీక్షగా చూచాడు. ఎర్రగా ఉన్న ద్రవం. ఏమిటో అతనికి తెలియలేదు. బైరాగి రెండు గ్లాసుల్లో రమ్‌పోసి సోడా కలిపాడు. తీసుకొమ్మన్నాడు. గ్లాసు ఎత్తి గటగటా తాగాడు పోచయ్య. "ఏయ్, అలాకాదు. కొద్దికొద్దిగా తీసుకొని చప్పరించు. మజా తెలుస్తుంది. ఇది గుడంబా కాదు, రమ్" అన్నాడు. పోచయ్య కొద్దికొద్దిగా తీసుకొని చప్పరించాడు. ఏదో కొత్తరుచి, కొత్త అనుభూతి, గుడుంబా వెంటనే గొంతు కాల్చేస్తుంది. ఇది అలా లేదు. రుచి పరిమళం ఘాటుగా లేదు. క్రమంగా మెదడు తేలిపోతున్నట్లనిపిస్తూంది.

సిగరెట్టు వెలిగించాడు బైరాగి. పోచయ్యక్కూడా అందించాడు. అది ఖరీదైన సిగరెట్టు. పోచయ్య కూడా అందుకున్నాడు. దాని పరిమళం పొగ అదొక రకంగా అనిపించింది పోచయ్యకు. తనముందు కూర్చున్న బైరాగి దేవునిలా కనిపించాడు పోచయ్యకు.

"పోచయ్యా! ఎలా ఉంది?" అడిగాడు బైరాగి.

"శాన బాగున్నదుండి. ఎంత బాగున్నదుండి...!" అని తన భావం వ్యక్తపరచడానికి పదాలు లభించకపోగా ముఖంలోనూ, కన్నుల్లోనూ కృతజ్ఞత ప్రవహించింది.

"పోచయ్యా! మళ్ళీ గుడిసెకు వెళ్తావా?"

ఏం సెప్పాలో అర్థం కాలేదు పోచయ్యకు. కాని, స్వర్గంలో ఉన్నవాణ్ణి బూటుకాలుతో తన్నినట్లనిపించింది. వింతగా చూచాడు పోచయ్య.

భయంగా భయంగా చూచాడు బైరాగివైపు.

బైరాగి అర్థం చేసుకున్నాడు. పెద్దగా నవ్వాడు. "పిచ్చివాడా! మళ్ళీ పంపిస్తానా? వస్తావా నాతో బొంబాయికి? బొంబాయి ఇంకా అందంగా ఉంటుంది – ఏమంటావ్?"

ఏమనాలో అర్థం కాలేదు పోచయ్యకు. బొంబాయి అనే పదం గారడిలా పని చేసిందతనిమీద. బొంబాయిని గురించి అనేక మంది చెప్పగా విన్నాడు. అది మహా పట్నం. చూడాలని అతనికి ఎంతకాలం నుంచో వుంది. హిందీ సినిమాలన్నీ అక్కడే తీస్తారు. అసలే మైకంలో వున్నాడు. అతని మనసు బొంబాయిలో వాలింది.

"సరేనుండీ" అన్నాడు గ్లాసు ఖాళీ చేస్తూ.

"ఇవ్వాళ సాయంకాలమే ప్రయాణం."

"సరేనన్నను గదనుండి."

బేరర్ భోజనం తెచ్చాడు. అతి రుచికరమైంది. ఇద్దరూ తిన్నారు మౌనంగా.

జుమ్ము మంటూంది పోచయ్యకు. కాళ్ళు తేలిపోవడం, వళ్ళు తూలడం ఏమీ జరగడంలేదు. ఏదో హాయిగా వున్నట్లుంది. మగతగా వుంది. బహుశః పడుకుంటే నిద్ర రావచ్చు.

"పడుకుంటావా?" అని మంచం చూపించాడు బైరాగి.

మంచంలో పడిపోయాడు పోచయ్య. పరుపు మెత్తగా వుంది. కిందికీ పైకీ ఎగురుతూంది. కాస్సేపు అలా ఎగిరాడు. నిద్రపోయాడు.

నయాగరా వెనుకనే ఉన్న ఉస్మాన్ యింటికి వెళ్ళాడు బైరాగి, రహస్య ద్వారం నుంచి. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. బైరాగి గదికి వచ్చేశాడు. పోచయ్యను లేపాడు. అతడు ఉలిక్కిపడి లేచాడు. ఇద్దరూ స్టేషన్‌కు వెళ్ళారు.

☆ ☆ ☆

బండి బొంబాయి చేరింది. బైరాగి ఆరు సూట్‌కేసులు తెస్తున్నాడు. అవి ముగ్గురు కూలీలకు ఎత్తాడు. పోచయ్యకు టిక్కెట్టిచ్చి ముందు నడవమన్నాడు. పెట్టెలు ఎవరివి అంటే తనవేనని చెప్పమన్నాడు. పోచయ్యకు ఏదో భయం భయంగా ఉంది. కసాయి ఇంటికి వెళ్ళే మేక చూచినట్లు చూచాడు. బైరాగి ఉరిమాడు. నడవమన్నాడు. గత్యంతరం లేక ముందడుగు వేశాడు. పోచయ్యకు కాళ్ళు వణుకుతున్నాయి. తాను చేస్తున్నది తప్పుపని అని అతనికి తెలుసు. ఆ పెట్టెలనిండా ఉన్నవి బ్రాందీ సీసాలు. బొంబాయిలో మద్య నిషేధం ఉన్న విషయం అతడు విన్నాడు. రైల్లో బైరాగిని పోలీసు బెదిరించి డబ్బుకాజేసి పోవడం తాను కళ్ళారా చూచాడు. అలాంటి సూటుకేసులు తనవి అనమంటున్నాడు బైరాగి. గత్యంతరం లేదు. బైరాగి మోసంలో పడిపోయాననుకున్నాడు. ఏంచేయాలో తోచిందికాదు. చరచరా తాను వెళ్ళిపోదామనుకున్నాడు. సూట్‌కేసులు విషయం తన కెందుకూ? ఏదో రకంగా కూలిచేసుకొని బతకవచ్చు. నిశ్చయానికి వచ్చి త్వరత్వరగా అడుగులు వేశాడు. పోలీసువాడు కూలివాళ్ళను ఆపేడు. ఎవరివి అని అడిగాడు. అదిగో, వాడివి అని పోచయ్యను చూపించారు కూలీలు. పోలీసు పరిగెత్తి మెడమీంది ఒక్కటి పుచ్చుకొని చొక్కా పట్టి లాక్కొచ్చాడు. పోచయ్యకు కళ్ళు చీకట్లు కమ్మినట్లయింది. ఏమీ అర్థం కాలేదు. తనను ఎవరు లాక్కొస్తున్నదీ కూడా తెలీలేదు.

"అబే సాలె. కిధర్ జాతాహై, క్యా హై ఉస్‌మే?" అని రెండంటించాడు పోలీసు.

దిక్కులు చూచాడు పోచయ్య. కళ్ళలో నీళ్ళు నిండాయి. మాటలు తడబడ్డాయి. ఒక్కొక్కరే జనం కూడుతున్నారు.

"హర్ హర్ మహాదేవ్" అన్నాడు బైరాగి. పోలీసువాడు సాధువును చూచి తల వంచి దండం పెట్టాడు. "ఇత్నా జులుం నహీ భాయియా, నయా అద్మీ దిఖతాహై కొత్తవాడులా కనిపిస్తున్నాడు" అని కన్ను కొట్టాడు. "జీ మహరాజ్" అని పోచయ్యను "పో బే పో. అదృష్టం బావుందిరా. అయ్యగారు వచ్చారు" అన్నాడు పోలీసు. పోచయ్య టిక్కెట్ కలెక్టరుకు టిక్కెట్టిచాడు. "లగ్గేజ్?" అన్నాడు టి.సి. కూలీలు అతణ్ణి చూచి నవ్వారు. దూరంగా బైరాగి కనిపించాడు. మాట్లాడలేదు టి.సి. బైరాగి టి.సి. దగ్గరకు వచ్చాడు. తన జేబులోంచి ఒక సీసా తీసి "హర్ హర్ మహాదేవ్" అని టి.సి. జేబులో పెట్టాడు. వంగి సలాం చేశాడు టి.సి. బైరాగి చరచరా వెళ్ళిపోయాడు.

స్టేషన్ దాటారు. వారికోసం వేచివున్న కారుడిక్కీలో పెట్టేశారు పెట్టెలు కూలీలు. పది రూపాయిూ లిచ్చాడు కూలీలకు బైరాగి. వారు దండం పెట్టి వెళ్ళిపోయారు. పోచయ్య, బైరాగి కారెక్కారు. కారు శరవేగంతో సాగిపోతూంది. జన సందోహం, కార్లు సైకిళ్ళు, ఏడేడు అంతస్తుల బంగళాలూ అన్నీ పరిగెడుతున్నాయి.

కాని, వాటిని వేటినీ చూడ్డంలేదు పోచయ్య. అతనికి భయం భయంగా ఉంది. తానేదో చేయరాని పని చేస్తున్నాడు. తానేమైతానో అనే దిగులు పట్టుకుంది. ఆలోచనలు తేనెటీగల్లా ముసురుతున్నాయి. లచ్చి, ఆస్పత్రి, గంజాయి, సారాయి.....

కారు ఆగింది. కారు ఆగడం చూచి ఇద్దరు యువకులు అరుగు మీద కూర్చున్నవారల్లా లేచి నుంచున్నారు. వారిలో ఒకడు పొట్టిగా బలంగా ఉన్నాడు. క్రాపు ముఖంమీదికి ఉంగరాలు ఉంగరాలుగా పడుతూంది. కాలర్లో ఉన్న పెద్ద జేబురుమాలు తీసి దులిపాడు. ముందుకు నడిచాడు. రెండవవాడు పొడవుగా బక్కగా ఉన్నాడు. జేబులోంచి దువ్వెన తీసి అతి వేగంగా తల దువ్వుకొని కారు వైపుకు సాగాడు. ఇద్దరూ బైరాగికి సలాం చేశారు. పచ్చగా ఉన్న పండ్లికిలించాడు. పోచయ్యను వాళ్ళకు అప్పగించాడు బైరాగి. సరుకు వచ్చిందని చెప్పాడు వాళ్ళకు. "చాకు పైసల్లేవు మాస్టర్!" అన్నాడు వంగి కార్లో తల పెడ్తూ పొడవువాడు. "పోబే సాలే. ఇప్పుడేమీ లేవు. మళ్ళీ వచ్చినప్పుడు ఇస్తా" అని డ్రైవరును కారు పోనిమ్మని చెప్పడమూ, కారు సాగిపోవడమూ ఒకేసారి జరిగిపోయింది.

పోచయ్యను తీసుకొని వారిద్దరూ అరుగు మీదికి వెళ్ళారు. "ఏం భాయి! ఏ ఊరు నీది?" అడిగాడు పొట్టివాడు. పోచయ్య ఏడ్చాడు. ఇద్దరూ పెద్దగా నవ్వారు. "నాలుగురోజులవుతే నువ్వే గట్టివాడివి అవుతావు భై. మేమూ ముందు ఇలాగే ఏడ్చాం" అన్నాడు పొట్టివాడు జూలు ఒక్కసారి దులిపి. "పోచిగా! పైసలున్నయా ఏమన్న. చా తాగలేదు" అన్నాడు. పోచయ్య నిక్కరు జేబులోంచి పైసలు తీసి ఇచ్చాడు. మొత్తం అర్ధరూపాయి ఉంది. ముగ్గురూ హోటల్లోకి వెళ్ళారు. చాయ్ తాగి బైటికి వచ్చేవరకల్లా మురికి ప్యాంటు, చారల బుష్షర్టు వేసుకున్నవాడు ఎదురైనాడు. "తగిలిందా ఏమన్నా?" అని అడిగాడు పొడుగువాడు. ఇద్దరినీ చాటుకు తీసుకెళ్ళాడు చారల బుష్షర్టువాడు. జేబులోంచి పర్సు తీశాడు. మిగతా ఇద్దరి కళ్ళల్లోనూ ఆశ, ఆతురత కనిపించింది. పర్సు విప్పాడు చారల బుష్షర్టువాడు. నూతన్ ఫోటో ఒకటి కనిపించింది. జేబులో పెట్టుకున్నాడు. దువ్వెన పారవేయబోతే పొట్టివాడు లాక్కున్నాడు. ఒక విజిటింగ్ కార్డు ఒక ఉత్తరమూ కనిపించాయి. రెండూ పారవేశారు. ఒక్క అయిదు రూపాయల నోటు మాత్రం ఉంది. "సాలెగాడు అయిదు రూపాయలు ఉంచాడ్రా!" అని విసిరి పారేశాడు పర్సు. అయిదు రూపాయిలు జేబులో పెట్టుకుంటూ. అందరి ముఖాల మీదా నిరాశ కనిపించింది.

పోచయ్యను పరిచయం చేశారు వారిద్దరూ కొత్తవానికి. ముగ్గురూ బాతాఖాని కొడ్తూ కూర్చున్నారు. పోచయ్య బెరుకు బెరుగ్గా చూస్తున్నాడు. అతనికి అంతా కొత్తకొత్తగా ఉంది. మనసులో బుగులు బుగులుగా ఉంది. ధైర్యం చెప్పడానికి ఎంతో ప్రయత్నించారు ముగ్గురూ. అయినా, అతనికి ధైర్యం చిక్కలేదు. ఏదో తెలియని చీకట్లోకి పోతున్నట్లనిపించింది.

సాయంకాలం అయింది. చీకటి పడింది. లైట్లు వెలిగాయి. రాత్రి అయింది. ఠర్రా త్రాగుదామని నిశ్చయించుకున్నారు ముగ్గురూ. పోచయ్యను తీసుకొని బైల్దేరారు. రోడ్డుదాటి గొందుల్లో పడిపోతున్నారు. అమాంతంగా ఒకడు వచ్చి పడ్డాడు. "అబే సాలే, తీయ్ పైసలు. ఎన్నాళ్ళు బే, మాదర్ చత్" అని

పొడుగువాని కాలర్ పట్టుకున్నాడు. మిగతా ముగ్గురూ పరుగెత్తారు. "ఇప్పుడిస్తావా? నహీతో చాకూ మార్ దూంగా" అని జేబులోంచి కత్తితీశాడు. పొడుగువాడు బ్రతిమిలాడాడు. కాళ్ళు పట్టుకున్నాడు. వినలేదు. మెడ మీంచి ఒక్కటి వేశాడు. దెబ్బలకు పడలేక చారల బుషర్టువాడి దగ్గర అయిదు రూపాయీ లున్నాయని చెప్పాడు. వీణ్ణి వదలి పరిగెత్తాడు వస్తాదు. ఒక గొందిలో ఇంటినీడలో దాక్కున్నవాణ్ణి పట్టుకున్నాడు. "తీయ్‌బే సాలె. లేకుంటే చంపేస్తా" అని జేబులోంచి కత్తి తీశాడు. అది మడతకత్తి. వేలుతో వత్తగానే ఛక్ మని బైటికి వచ్చింది కత్తి. వణకిపోయాడు వాడు. "మాస్టర్, మూడు రూపాయలు తీసుకో! తింటానిక్కూడా పైసల్లేవ"ని బ్రతిమాలాడు. "అబే తియి" అని ప్యాంటు జేబులోంచి అయిదు రూపాయిల కాగితం తీసుకొని నెత్తిమీద ఒక్కటి వేసి మాయం అయినాడు మాస్టరు. "సాలా, పాంచ్ రూపాయ్ మార్‌దియా" అని బూతులు తిట్టూ లైటు వెలుగులోకి వచ్చేశాడు. మిగతా యిద్దరూ అక్కడికి చేరారు. పోచయ్య కనిపించలేదు వారికి. భయం పట్టుకుంది. పోచయ్య పోయినాడంటే చంపేస్తాడు సూరి, వారిని. గొంది పొంతం గాలించారు. ఒకచోట కూర్చుని ఉన్నాడు పోచయ్య రెండు చేతుల్తో తల పట్టుకొని. ముగ్గురూ అతన్ని తీసుకొని రోడ్డుమీదికి చేరారు.

నలుగురూ ఫుట్‌పాత్‌మీద కూర్చొని ఉండగా వారి ముందు ఒక కారు ఆగింది. "గిరాకొచ్చింది" అని ముగ్గురూ లేచారు. కార్లో ఉన్నవాడు పొట్టివాణ్ణి పిలిచి ఎక్కించుకొని వెళ్ళిపోయాడు, "ఎవరో ఎరికేనా?" అని అడిగాడు ప్యాంటువాడు పోచయ్యను. తెలీదన్నట్లు తల అడ్డంగా ఊపాడు పోచయ్య. ఫలానా సినీ స్టార్ – హీరో అని వివరించి చెప్పాడు ప్యాంటువాడు. పోచయ్య ముఖం చేటంతైంది. ఇక్కడి కెందుకు వచ్చాడు అని అడిగాడు పోచయ్య. బ్రాందీ, విస్కీ, రమ్ కావలసిన వాళ్ళంతా అలా వస్తారనీ, తాము వారికి అది తెచ్చిస్తామనీ, చాలమంది సినీతారలు అలా వస్తుంటారనీ చెప్పాడు ప్యాంటువాడు. పోచయ్యకు ఆశ కలిగింది. ఈ తడవ వచ్చినప్పుడు తనకు చెప్పమన్నాడు. చూస్తానన్నాడు. పోచయ్యలోని ఉత్సాహం చూచి అంతా సంతోషించారు.

కార్లోంచి దిగాడు పొట్టివాడు, నడండిరా ఠర్రా తాగుదాం అని. నలుగురూ మళ్ళీ అవే గొందుల్లోంచి బైల్దేరి, సగం తలుపు తీసి ఉన్న ఒక ఇంట్లో ప్రవేశించారు. "సలామ్ సేటూ" అన్నారు ముగ్గురూ, టేబుల్ ముందు కూర్చున్న బొర్రవాణ్ణి చూచి. వాడు వెకిలిగా నవ్వాడు. నలుగురూ లోపలికి వెళ్లిపోయారు. లోపల విశాలంగా ఉంది స్థలం. చాలమంది జనం ఉన్నారు. బృందాలు బృందాలుగా కూర్చొని తమ మధ్య ఠర్రా కాపు సారాయి సీసాలు పెట్టుకొని తాగుతూ పకోడీలు తింటున్నారు.

నలుగురూ ఒకచోట కూర్చొని ఠర్రా సీసాలు తెప్పించారు. పకోడీలు, కబాబులూ తినేశారు. ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. తాగినప్పుడు పోచయ్యకు సాధారణంగా వచ్చేపాట "చమేలీ కే మండ్వే తలే" పాడాడు. అంతా ఆనందించారు. తూలుతూ తూలుతూ నలుగురూ ఫుట్‌పాత్ మీదికి వచ్చి వెల్లకిలా పడుకున్నారు దూరదూరంగా. "చమేలీకే మండ్వే తలే" అని సన్నగా పాడుతూనే ఉన్నాడు పోచయ్య.

ఈలోగా ఒక ఆడది వచ్చిందక్కడికి. వక్కిపోయిన చెంపలు, పీక్కుపోయిన కళ్ళు, రాలిపోయిన జుట్టూ... అయినా, కాస్త పౌడరు వేసుకుంది. పుక్కిట తమలపాకుంది. అక్కడక్కడ మాసికలు వేసిన నైలాను చీర కట్టింది. బీడి తాగుతూ వచ్చింది. దాన్ని చూచి ముగ్గురూ లేచి కూర్చున్నారు. "వచ్చిందా ఛీనాల్ మళ్ళీ" అన్నాడు పొట్టివాడు. "తన్నండి" అని ప్యాంటు దులుపుకుంటూ లేచి పరిగెత్తాడు ఆవిడమీదికి చారల బుషర్టువాడు. పోచయ్య లేచి కూర్చున్నాడు. ఆవిడ జుట్టుపట్టుకొని వీపుమీంది వేశాడొక్కటి. ఏడుస్తూ అక్కడే కూలబడ్డది ఆవిడ, "నీ పెళ్ళం ముండమొయ్య. నీ ఇంట్ల పీనిగెళ్ల" అని తిట్టూ. ఇంకో రెండు అంటించాడు. ఇంకా యేడ్చింది. ముగ్గురూ వచ్చి వాణ్ణి వారించారు. "ఏందే నీ ఏడు పింతకూ?" అడిగాడు పొడుగువాడు. "ఇవ్వాళ గిరాకి దొరకలేదు. ఒక్క పైసలేదు. ఒకడు దొరికాడు ముదనష్టపోడు. డబ్బు లివ్వకుండానే పోయాడు. ఈడేమన్న గిరాకి దొరకుద్దేమని వచ్చిన. మీరేమొ కొట్టి చంపుతున్నారు" అని ఏడ్చింది. ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. "థూ – రోగాలు తగుల్తై" అని ఊసి వెళ్ళిపోయాడు ప్యాంటువాడు. "పైసలేమన్న ఉన్నాయిరా" – అడిగాడు పొడుగువాడు. "అఠా నున్నది. పైసలిచ్చి పంపిచ్చు. దానెంటపోయేవు – చస్తవురో" అని హెచ్చరించాడు పొట్టివాడు. "నువ్వు అరా నియ్యిబే, నీతులు చెప్తాన్నవు" అని కసిరాడు పొడుగువాడు. జేబులోంచి అర్ధరూపాయి తీసి, చాచిన పొడుగువాని చేతిలో పెట్టాడు పొట్టివాడు. ఆ అర్ధరూపాయి మీద ఉన్న నెహ్రూ తల వీధిలైటుకు చమక్కుమంది. "అఠా నున్నది, ఏమంటవ్?" అన్నాడు పొడుగువాడు. చేయి చాపిందావిడ. చేతి కందించాడు. ఇద్దరు కలిసి వెళ్ళిపోయారు.

తెల్లవారింది. నలుగురూ పంపుదగ్గర ముఖాలు కడుక్కున్నారు. పొట్టివాడి దగ్గర మిగిలిన డబ్బుతో రొట్టె తిని, చాయ్ తాగారు. సిగరెట్లు వెలిగించి పొగ ఊదుతూ బాతాఖానీ కొడ్తూ కూర్చున్నారు నలుగురూ.

సుమారు పది గంటల సమయానికి ఒక కారు వచ్చి ఆగింది ఫుట్ బాత్ వద్ద. తమ కొరకే అని గుర్తించారు ముగ్గురూ. ముగ్గుర్నీ అనుసరించాడు పోచయ్య. ముందు సీటులో ఒక నడివయసు మనిషి కూర్చొని ఉన్నాడు ఎర్రని రంగు, ముడుతలు పడుతున్న గుండ్రని ముఖం. ముక్కు లావుగా ఉంది. కణతల దగ్గరా, చెవులపైనా వెంట్రుకలు తెల్లబడ్డాయి. హాఫ్షర్టు వేసుకున్నాడు. చేతికి బంగారపు గొలుసు గల గడియారం ఉంది. నిరంతరం సిగరెట్టు పీలుస్తూనే ఉంటాడు. సింధీ వానిలా ఉన్నాడు.

నలుగురూ వెనుకసీట్లో సర్దుకొని కూర్చున్నారు. కారు ఒక హోటలు దగ్గర ఆగింది. సింధీవాడు పది రూపాయీ లిచ్చాడు పొట్టివాడికి. నలుగురూ హోటల్లోకి వెళ్ళి బాగా తిని వచ్చేశారు, ముంజేతితో మూతులు తుడుచుకుంటూ. కారు మొహమ్ క్రీక్ దగ్గర నిలిచింది. సముద్రంలో ఒక పడవ సిద్ధంగా ఉంది. దానిమీద పడవ నడిపేవాడు అరబ్బువానిరూపంలో ఉన్నాడు.

డ్రైవరు డిక్కీలోంచి ఒక్కొక్కటే తీసికెళ్ళి పడవలో పెడ్తున్నాడు. పోచయ్య సహితంగా నలుగురూ అందుకొని సామానంతా పడవలో చేర్చారు. చేర్చిన సామానులో ఒక ట్రాన్సిస్టరు, ఆరు బీరుసీసాలూ, ఒక స్కాచ్ విస్కీ సీసా, ఒక

ఫ్లాస్కులో మంచుముక్కలు, ఒక టిఫినులో సేండ్విచ్చులు, నీళ్ళ సీసా, పిస్తోలు, టార్చిలైటూ గోల్డుఫ్లేక్ టిన్నులు మూడూ వున్నాయి.

సింధీవాడు పడవ ఎక్కాడు. అతడు ఎక్కగానే మిగతా నలుగురూ ఎక్కారు. పడవ నడిపించాడు అరబ్బు. పడవ మధ్య ద్వీపం వైపు సాగింది. సింధీ బీరు తాగుతున్నాడు; ఎడతెగని సిగరెట్లు కాల్చివేస్తున్నాడు.

మధ్యాహ్నం అయింది, సూర్యుడు నెత్తిమీదికి వచ్చాడు. తన కిరణాల్తో కాల్చేస్తున్నాడు ఓడలోనివారిని. సముద్రంలోకి చూస్తే నల్లని ఆకాశం, చెదురుతున్న అనేకమంది సూర్యులు కనిపిస్తున్నారు. పైకిచూస్తే నల్లని ఆకాశంలో తెల్లని సూర్యుడు వెలుగుతున్నాడు. చూసేవారికి సముద్రంలో ఒక ఆకాశంపై ఒక ఆకాశం ఉన్నట్లు కనిపిస్తూంది.

సింధీ సేటు మౌనంగా బీరు తాగుతున్నాడు. అతడు మౌనంగా ఉన్నపుడు ఎవరికీ మాట్లాడే ధైర్యం లేదు. మౌనంగా క్షణాలు గడియల్లా గడుస్తున్నా కాలచక్రం ఆగుతుందా? సూర్యుడు అస్తమించాడు. ఆకాశంలో చంద్రుడూ నక్షత్రాలూ వెలిగాయి. పడవ ప్రయాణం చేస్తూనే ఉంది. సింధీ సేటు బీరు అయిపోయింది. చివరి సీసాను విచిత్రంగా సముద్రంలోకి రువ్వాడు. అది తరంగంమీద ఊయలలూగి మునిగిపోయింది. మళ్ళీ కనిపించలేదు. స్కాచ్ విస్కీ కలుపుకున్నాడు. చప్పరిస్తూ సిగరెట్టు కాలుస్తూ సముద్రంవైపు చూస్తున్నాడు. గడియారం చూచాడు. రాత్రి పన్నెండయింది. పడవ సాగిపోతూంది. అతని ముఖంలో చిడుముడిపాటు కనిపించింది.

అమాంతంగా ఒక టార్చిలైటు వెలుగు కనిపించింది. పిస్టోలు సరిచేసుకున్నాడు సేటు. దీక్షగా చూచాడు టార్చివైపు. తన టార్చి వెలిగించాడు. ఆ టార్చి వెలుగు వచ్చినవైపు చూపాడు. టార్చి వెలుగు అటూ ఇటూ తిరిగింది. సేటు కూడా అటూఇటూ తిప్పాడు. పడవ వేగంగా సాగింది. దూరంగా మరో పెద్ద పడవ కనిపించింది. పోచయ్య కూర్చున్న పడవ వేగంగా ముందుకు సాగింది. సేటు హుంకరించాడు. పడవ వేగం హెచ్చింది. ఆ పడవ దగ్గర్లోకి చేరింది. పడవలోంచి "విక్టరీ" అనే కేక వినిపించింది. సేటు "డాన్" అని కేకపెట్టాడు. "డాన్, డాన్, డాన్" అని కేకలు పెట్టాడు. ఆ వచ్చిన పడవవాళ్ళు ఈ పడవను గుర్తించారు. చేతులూపారు. సేట్ జేబురుమాలు ఊపాడు. సేటు పడవ ఆ పడవ దగ్గరికి చేరింది. పడవలోనివాళ్లు సేటును పడవలోనికి తీసుకున్నారు. ఏవో గుసగుసలు జరిగాయి. వాళ్ళు పొడుగైన తోలుసంచులు ఇచ్చారు. సేటు పడవమీద ఉన్న నలుగురినీ పిలిచాడు. వాళ్ళు ఎక్కారు. నలుగురికీ నాలుగు సంచులు ఇచ్చాడు. "జాగ్రత్త! వీటిని వార్సోవా దగ్గరున్న హనుమంతుని గుళ్ళో ఇవ్వాలి. అవి ఇవ్వగానే తలా నూరూ రూపాయీ లిస్తారక్కడ, పట్టుబడితే ఏ విషయమూ చెప్పకూడదు. చెప్పారా?" అని పిస్తోలు చూపాడు, "బొంబాయి నిండా మావాళ్లున్నారు. ప్రాణాలతో బయటపడ్డం కష్టం – విన్నారా? వెళ్ళండి" అని చెప్పాడు.

నలుగురూ పొడవైన తోలుసంచులను వీపులకు కట్టుకున్నారు. అలా కట్టుకోవడానికి అనువుగా వాటికి బెల్టులూ, బకిల్స్ ఉన్నాయి. నలుగురూ పడవలోకి దిగారు. పడవ వెనక్కు తిరిగింది. వార్సోవా వైపు వేగంగా సాగింది. పోచయ్యకు ప్రాణం

చిక్కు చిక్కుమంటూంది. ఎవరూ మాట్లాడటంలేదు. పొడుగువాడు సిగరెట్లిచ్చాడు అందరికీ. సిగరెట్లు కాల్చవద్దన్నాడు అరబ్బువాడు, సిగరెట్టు నిప్పు దూరంగా ఉన్న వానికి కనిపిస్తుందని. అయినా కాల్చారు. సిగరెట్లు. నిప్పు కనిపించకుండా చేతులు అడ్డంపెట్టి సిగరెట్లు పీల్చుతున్నారు. చారల బుషర్టువాడు పోచయ్యను చూచి నవ్వాడు. "జాగ్రత్త! అవసరం అయితే ఈదుకుంటూ ఒడ్డుకు చేరాలి. సంచితో ఎక్కడికైనా పోయావా – ప్రాణాలు దక్కవు. సేటు దాదాలు బొంబాయినిండా ఉన్నారు. పట్టుబడితే ఎవరి విషయమూ చెప్పొద్దు, చెప్పినా, చెప్పకున్నా జేలు తప్పదు. కాని, జేలు నుంచి వచ్చాక ప్రాణాల్తో పోలేవు. అలా పోయిన వారిని ముగ్గుర్ని చంపించాడు సేటు. వాడు రాక్షసుడు. కొత్తవాడివి కాబట్టి చెప్తున్నా, జాగ్రత్తగా సంచి చేరవేశావో వందరూపాయలు దొరుకుతాయి. అందులో దాదాలకు యాభై ఇవ్వాలి. ఇవ్వకపోయావో పోలీసులకు పట్టిస్తారు. మళ్ళీ వారానికో పది రోజులకో ఇలాంటిపనే తగుల్తుంది. ఒక్కనాటి పనికి యాభై రూపాయలు. ఏం తక్కువా?..." అన్నాడు.

పోచయ్య మాట్లాళ్ళేదు అతని గుండెల్లో గుబులు ప్రవేశించింది. ఎందుకు వచ్చానా బొంబాయికి అనుకున్నాడు. గుండెనిండా చీకటి అలముకుంది. సముద్రంలో ఈదగలడా తాను? అక్కడే మునిగి చస్తాడేమో! తాను చచ్చిపోతే లచ్చి? ఛా – లచ్చిని వదిలి వచ్చినందుకు చాల బాధ పడ్డాడు. తగిన శాస్తి జరుగుతుందని అనుకున్నాడు. కళ్ళు మూసుకొని తనకు జ్ఞాపకం ఉన్న దేవుళ్ళందరికి మొక్కాడు.

సర్చిలైటు వెలుగు పడవమీద పడింది. "వంగి కూర్చోండి పడవలోకి" అని అరచాడు అరబ్బు. నలుగురూ సిగరెట్లు పారేసి పడవలోకి నక్కి కూర్చున్నారు. సర్చ్‌లైటు వర్తులాకారంలో తిరుగుతూంది. మోటారు బోటు ధ్వని వినిపిస్తూంది. బోటు దగ్గరికి వస్తూంది. పడవ వేగంగా ఒడ్డుకు పరిగెడుతూంది. మోటారు బోటు దగ్గరికి వస్తూంది. సర్చ్‌లైటు వెలుగు దగ్గర్నుంచి పడుతూంది. సర్చ్‌లైటు పడవను దాటగానే "దూకండి" అన్నాడు అరబ్బు సరంగు. ముగ్గురూ అమాంతంగా దూకారు. వెనకా ముందాడాడు పోచయ్య. మళ్ళీ లైటు వెలుగు పడింది. లైటు వెలుగు దూరం కాగానే పడవలోంచి సముద్రంలోకి నెట్టాడు సరంగు పోచయ్యను. సముద్రంలో పడ్డాడు పోచయ్య. ఈదుతున్నాడు. మిగతా ముగ్గురూ అట్టే దూరం పోలేదు. సర్చిలైటు వారిమీద పడింది. 'మునగండి' అనే కేక వినబడి మునిగాడు పోచయ్య. జీవన్మరణ సమస్య... ఈదుతున్నాడు పోచయ్య. భయం అతణ్ణి నీరసింపజేస్తూంది. ప్రస్తుతానికి బతకాలి. ఆ పట్టుదలతో ఈదుతున్నాడు. తుపాకి పేలిన చప్పుడైంది. లైటు వారిమీద పడింది. మునిగాడు పోచయ్య. తేలి చూచేవరకు సముద్రంలో నీరు ఎర్రగా కనిపించింది. రక్తం. ఎవరికి గాయం తగిలింది తెలియదు. పొడుగువాడు చారల బుషర్టువాడిని లాక్కొని పోతున్నాడు. మోటారు బోటు పడవవైపు సాగిపోయింది. ఒడ్డుకు చేరేవరకు చారల బుషర్టువానికి స్పృహ లేదు. పిక్కలోంచి గుండు దూసుకుపోయింది. రక్తం ఇంకా కారుతూంది. పొడుగువాడు ఎత్తుకొని ఒడ్డుకు చేర్చాడు చారల బుషర్టువాణ్ణి.

"డాక్టర్ డాక్టర్" అని కేక లేసేడు పొట్టివాడు. పోచయ్య కాళ్లు వణికేయి.

రక్తం, గాయం చూచి భరించలేకపోయాడు. పరిగెత్తాడు, "డాక్టర్ డాక్టర్" అంటూ. "సంచి సంచీ" అని అరిచే పొట్టివాని మాటలు సైతం వినిపించలేదతనికి. గాయపడిన వాణ్ణి రక్షించాలి, అదొక్కటే అతనికి తోచింది. ఎటు పోతున్నాడు? ఎందుకు పోతున్నాడు? తెలియదు. అప్పటికి తెల్లవారుజామైంది, రోడ్ల మీద పడి పరిగెత్తుతున్నాడు. పోలీసువాడు చూచాడు, "ఏయ్ ఆగు ఆగు" అని అరచాడు. అది వినిపించనేలేదు పోచయ్యకు. పారిపోతున్నాడనుకున్నాడు పోలీసువాడు. పోలీసువాడూ పరిగెత్తాడు. అందేట్టు లేదు పోచయ్య. విజిల్ ఊదాడు. విజిల్ మీద విజిల్. ముందు నుంచీ వెనుకనుంచీ వచ్చి పట్టేశారు పోలీసులు. తడినెత్తి, తడిబట్టలు, వీపున తోలు సంచి... పోలీసులు పట్టుకున్న తర్వాత గాని ఈ లోకంలోకి రాలేదు. పోచయ్య వగరుస్తూ "డాక్టర్ డాక్టర్" అంటున్నాడు.

జనం చాలమంది కూడారు. పోలీసువ్యాను వచ్చింది. అప్పుడు గ్రహించాడు తాను చేసిన తప్పు. అప్పటికీ "డాక్టర్ను పంపించండి" అనేమాట నోటిదాకా వచ్చి దిగమింగాడు.

ఆ రోజంతా పోలీసు లాకప్‌లో ఉన్నాడు. పోలీసులు ఎన్ని చిత్రహింసలు పెట్టినా చెప్పలేదు. అయినా, అతనికి తెలిసింది మాత్రం ఏమిటి? ఏం చెపుతాడు?

తెల్లవారి కోర్టుకు తీసికెళ్ళారు పోలీసులు.

అక్కడ కనిపించాడు బైరాగి. అతణ్ణి చూడగానే పీక నొక్కేయాలనిపించింది పోచయ్యకు. కాళ్ళకూ చేతులకూ బేడీలున్నాయి. ఏం చేయగలడు? కోపం దిగమ్రింగాడు. అతని ఉద్రేకాన్ని చూచి చిరునవ్వు నవ్వాడు బైరాగి. బోనెక్కించారు పోచయ్యను. తోలు సంచీ మేజిస్ట్రేటు ముందుంచారు పోలీసులు. విప్పమన్నాడు న్యాయాధిపుడు. కొన్ని బంగారు కణికలు, కొన్ని గడియారాలు, కొన్ని పెన్నులూ ఉన్నాయి అందులో.

"ఈ సంచీ ఎవరిది?" అడిగాడు మేజిస్ట్రేటు.

"ఎరికలే" అన్నాడు పోచయ్య. ఎన్ని ప్రశ్నలడిగినా అన్నిటికీ తనకు తెలియదన్నట్లుగానే జవాబు చెబుతున్నాడు. చెప్పేద్దామని నోటిదాకా వచ్చినా బైరాగి కళ్లతో ఉరుముతున్నాడు. "జేలు నుంచి వచ్చాక ప్రాణాల్తో పోలేవు" అనే మాటలు గుర్తుకు వస్తున్నాయి.

ఒకసారి బైరాగిని చూపించి వీడే అన్నింటికి కారణం అని చెప్పేద్దామన్నంత వరకూ వచ్చాడు. బైరాగి కళ్ళు నిప్పులు కురిశాయి. భరించలేకపోయాడు. మళ్ళీ మౌనం దాల్చాడు.

"పది నెలలు కఠిన శిక్ష" అన్నాడు న్యాయాధిపతి.

గుండెలో పిడుగులు కురిశాయి పోచయ్యకు.

పోలీసు వ్యానులో ఎక్కించుకుపోయారు పోచయ్యను.

చూపందినంత దూరం చూస్తూ నుంచున్నాడు బైరాగి.

★ ★ ★

# తొమ్మిది

రాజారావుకు స్పృహవచ్చిన తరువాత లక్ష్మి విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనబరిచాడు. జనరల్ వార్డులోని పరిస్థితులు చూచాడు. అక్కడ రోగితోనే రోగం పోతుందని గ్రహించాడు. లక్ష్మిని మృత్యువాత పడనీయరాదనుకున్నాడు. తన రూముకు మార్పించుకున్నాడు. డబ్బు విషయంలో వెనకా ముందూ చూడలేదు. డాక్టర్లకు నర్సులకు విపరీతం అయిన శ్రద్ధ వచ్చింది. ఎక్సరేలు తీశారు. పరీక్షలన్నీ చేశారు. తేలిందల్లా ఆమె మెదడుకు బలమైన గాయం తగిలిందని. అందుకు చికిత్స ఎవరికీ తోచలేదు. అయినా, రోమ రోమానికి సూదులు గుచ్చారు. గ్లూకోజ్ మీద బ్రతికిస్తున్నారు. లక్ష్మి పరిస్థితిలో ఏమాత్రం మార్పు కనిపించలేదు. శ్వాస ఆడటం తప్ప ప్రాణం ఉన్న లక్షణాలేమీ కనిపించడం లేదు. అయినా, డాక్టర్లు నిరాశ చెందలేదు. దేశం నలుమూలల ఉన్న స్పెషలిస్టులతో సంప్రదింపులు జరుపుతూనే ఉన్నారు. అవసరమైతే విదేశాలకు కూడ పంపడానికి సిద్ధపడ్డాడు రాజారావు.

రాజారావు ఆరోగ్యం పూర్తిగా బాగుపడింది. అతడు మామూలు మనిషి అయిపోయాడు. అయినా ఆస్పత్రి వదల్లేదు. రేయింబవళ్ళు లక్ష్మినే కనిపెట్టుకొని ఉంటున్నాడు. డాక్టర్లను పిలిపించడం, పరీక్షలు చేయించడం, మందులు రాయించడం, తెప్పించడం, క్రమం తప్పకుండా వాటిని వాడించడం – ఇదే సరిపోతూందతనికి. పార్వతి కూడా ప్రతి రోజూ వచ్చిపోతూంది. లక్ష్మి విషయంలో ఆమెకూ సానుభూతి కలిగింది, తమ పనిమీద ఉన్నప్పుడు పడిపోయినపిల్ల అని.

రాజారావు వాలు కుర్చీలో కూర్చొని వార్తాపత్రిక చూస్తున్నాడు. డెయిజీ గదిలోకి వచ్చింది కూడా గమనించలేదు. డెయిజీ నోటితో పత్రిక మడిచింది. 'హలో' అన్నాడు పేలవంగా.

డెయిజీ కుర్చీలో కూర్చుంది. ఇద్దరూ ముఖాముఖీ కూర్చున్నారు–ఎవరూ మాట్లాడలేదు. గడియారపు టకటక తప్ప ఏమీ వినిపించడంలేదు.

"మిసెస్ రాజారావు వెళ్ళిపోయిందా?"

"ఆ."

"వారం రోజులనుంచీ ఇంటికి వెళ్ళడంలేదు." నేలను చూస్తూ అన్నది డెయిజీ. ఆమె గుండె దడదడ లాడింది. ఎంతో మథనపడి ఒక నిర్ణయం తీసుకొనే రాజారావు దగ్గరకి వచ్చింది.

రాజారావు సిగరెట్టు వెలగించాడు. "ఎంగేజ్‌మెంట్స్ ఎక్కువైనాయా?" వెటకారంగా అడిగాడు.

డెయిజీ తలెత్తి రాజారావును చూచింది. లిప్తపాటు గుండె ఆగింది. ఆమె కళ్ళల్లో నీరు నిండింది. కన్నీటిచుక్క చెక్కిలిమీదినుండి జారింది. రాజారావు పేపరు విప్పాడు. ముఖం దాచుకున్నాడు.

డగ్గుత్తికతో అన్నది డెయిజీ: "మిస్టర్ రాజారావ్! ఎవరన్నా సహించగలను కాని, ఆమాట నువ్వంటే సహించలేను. నీకు నా హృదయం ఇచ్చాను. అయామ్ ఫెయిత్‌ఫుల్ టు యూ. నేను ఆడదాన్ని. నాకు ఒక మనసుంది. నిన్ను అందులో ఉంచుకున్నాను. ఫలితంగా నాలో ఒక ప్రాణి పెరుగుతూంది."

రాజారావు మీద పిడుగు పడ్డది. పేపరు మడిచి పక్కకు విసిరాడు. తబ్బిబ్బయినాడు. కలవరపడ్డాడు.

"మైకేలు అబార్షన్ కోసరం ప్రయత్నిస్తున్నాడు. వాడు రాక్షసుడు. నాకు పాప కావాలి. రాజా! పాప! నిన్ను ఆశ్రయం అర్థించడానికి వచ్చాను. నీ ఆశ్రయంలో తల్లిని కావాలని నా ఆశ."

మండిపోయాడు రాజారావు. నరాల్లో చిచ్చుపెట్టినట్లయింది. మెదడు మొద్దుబారింది. కళ్ళు పొగలు కక్కాయి.

"షటప్, గెటవుట్" అని పెద్ద కేక పెట్టాడు.

డెయిజీ గుండె ముక్కలైంది. కన్నీరు జలజలా రాలింది. "మిస్టర్ రాజ్! ప్లీజ్, అండర్‌స్టాండ్ మీ!" ఏడ్చేసింది డెయిజీ.

"ఐ సే యూ గెటవుట్!" లేచి నుంచొని మరీ బిగ్గరగా అరిచేశాడు. అతని కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

లక్ష్మి కళ్ళు తెరవడమూ, డెయిజీ వెళ్ళిపోవడమూ ఒకేసారి జరిగాయి. డెయిజీ వెళ్ళినదారి కన్నీటితో నిండింది.

లక్ష్మి కళ్ళు తెరిచింది. వెర్రిగా అటూ ఇటూ చూచింది. అది చూచాడు రాజారావు. కోపం గిగిపోయింది. ఆదుర్దాతో పరిగెత్తాడు లక్ష్మి మంచం దగ్గరికి. డాక్టరును పిలవాలనే ఆలోచన కూడా రాలేదు. చూస్తూ నుంచున్నాడు.

లక్ష్మి మళ్లీ కళ్ళు మూసుకుంది. ఏవో పూర్వస్మృతులను తోడడానికి ప్రయత్నించింది. ఫలించలేదు. కళ్ళు తెరిచింది. ప్రశ్నార్థకంగా రాజారావును చూచింది.

అతనికి ఏమీ అర్థం కాలేదు. "రజనీ!" అనే మాట అతని నోట వెలువడ్డది. అది ఎందుకు వచ్చిందో అతనికీ తెలియదు.

"రజనీ?" రాజారావుపై చూపు నిగిడ్చి "అవును, నాపేరు రజని. నేనెక్కడున్నాను?" అడిగింది.

"ఆస్పత్రిలో, ఉస్మానియాలో."

"ఎందుకు?"

"ఏమో? ఏం చెప్పాలో అతనికే అర్థం కాలేదు. డాక్టరును పిలవాలనే విషయం మెరుపులా తోచింది. వెంటనే డాక్టరు దగ్గరికి పరుగెత్తాడు. డాక్టరు, నర్సులు పరుగు పరుగున వచ్చారు. గది ముందు జనం కూడారు.

డాక్టరు "అమ్మా! లక్ష్మీ!" అన్నాడు.

లక్ష్మి వెర్రిగా చూచింది. "నాపేరు రజని" అన్నది.

డాక్టరు గ్రహించాడు. పూర్వ స్మృతులు పోయినా యనుకున్నాడు. ఇలాంటి కేసు ప్రత్యక్షంగా చూడ్డం ఇదే మొదటిసారి. అతనికి ఆసక్తి ఎక్కువ అయింది.

"రజనీగారూ! మీరు ఎక్కడున్నారు?"

"ఆస్పత్రిలో ఉన్నానని చెప్పారు –" అని పేరుకోసరం తడుముకుంటూ రాజారావు వైపు చూచింది. "రాజారావుగారు" అని పూర్తి చేశాడు డాక్టరు.

"రాజారావు, రాజారావు" అని మననం చేసుకుంది. మళ్ళీ కళ్ళు మూసుకుంది, పూర్వస్మృతులు వెదకడానికి.

అంతా నిశ్శబ్దంగా ఊపిరి సహితం బిగబట్టి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. డాక్టరు స్వయంగా అయోమయంలో పడ్డాడు.

కళ్ళు తెరచింది లక్ష్మి – కాదు రజని. "ఊ" అన్నది.

"నే నెవరిని?" అడిగాడు డాక్టరు.

చిరునవ్వు నవ్వింది. "డాక్టరు" అన్నది.

"ఈమె ఎవరు?" నర్సును చూపించి అడిగాడు డాక్టరు.

మళ్ళీ కళ్ళు మూసుకుంది రజని. కాస్సేపటికి తెరిచింది. డాక్టరు అడిగిన ప్రశ్నకు జవాబు మాత్రం యివ్వలేదు.

ఆమె మేధస్సుపై భారం వేయదలచలేదు డాక్టరు.

"మీ కెలా ఉందమ్మా?" అడిగాడు.

"మబ్బు కమ్మినట్లున్నది. మనసు మీద పొగ కమ్మినట్లున్నది."

"ఆకలిగా ఉందా?"

"అవు" – అప్పటికిగాని ఆకలిగా ఉందనే విషయం తెలియలేదు రజనికి.

నీరసంగా కళ్ళు మూసుకుంది రజని.

డాక్టరు ఆమెను పరీక్షించి, నర్సుకు ఏవో ఆదేశాలిచ్చి వెళ్ళిపోతూ రాజారావును రమ్మన్నట్లుగా సంజ్ఞ చేశాడు. రాజారావు డాక్టరును అనుసరించాడు. మౌనంగా ఇద్దరూ కుర్చీల మీద కూర్చున్నారు. ఇద్దరూ ఏవో ఆలోచనలలో నిమగ్నులై ఉన్నారు. ఇద్దరూ మాట్లాడలేదు. డాక్టరు సిగరెట్టు కేసు తీశాడు. రాజారావుకు అందించాడు. సిగరెట్టు తీసుకున్నాడు. డాక్టరూ అందుకున్నాడు. ఇద్దరూ కాల్చుకున్నారు.

డాక్టరు గట్టిగా పొగలాగి వదిలాడు.

డాక్టరు చెప్పేదాన్ని వినాలనే ఆతురతతో గబ గబా సిగరెట్టు పీల్చుతూ వదులుతున్నాడు రాజారావు.

"మిస్టర్ రాజ్!" రాజారావు ఆఖరు దమ్ములాగి సిగరెట్టు పారేశాడు. "ఇది చాలా విచిత్రమైన కేసు. మెడికల్ హిస్టరీలో ఇలాంటి కేసులు చాలా అరుదుగా కనిపిస్తాయి. వాటిని గురించి చదివేప్పుడు నాకు నమ్మకం కలిగేది కాదు. హిస్టరీయే అలాంటిది. లక్ష్మిగారి మెదడుకు బలమైన దెబ్బ తగిలింది. దాంతో ఆవిడకు పూర్వస్మృతులు పోయాయి. అసలు ఆమె జీవించిందంటే మీరు తీసుకున్న శ్రద్ధవల్లనే. ఇప్పుడు ఆమెకు ఇదొక క్రొత్తజన్మ. మీరు ఏది చెబుతే అది నమ్మాల్సిందే. కాని, ఒక చిక్కుంది. ఆమె మెదడుమీద ఏ మాత్రం భారం పడినా ప్రమాదమే. పూర్వస్మృతులు జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించిందా – ఆ భారం భరించలేక మతి భ్రమించినా భ్రమించవచ్చు. మిస్టర్ రాజ్! ఐ కెన్ అండర్‌స్టాండ్ యువర్ ఫీలింగ్స్. బట్ యూ మస్ట్ హేవ్ పేషన్స్. అంటే, మీరు ఓపిక పట్టాలి" అని మిగతా విషయాన్ని చిరునవ్వుతో వ్యక్తం చేశాడు.

"అంటే డాక్టర్! జీవితాంతం ఇంతేనా?"

"చెప్పలేం. కాని, కొంతకాలం ఆవిడను ఏ విషయంలోనూ బలవంతం చేయరాదు. ఈ క్రొత్తస్మృతులు కాస్త బలపడ్తే, గతాన్ని గురించి ఆమె ఆలోచించడం మానేస్తే బహుశః మీకు ఉపయోగపడవచ్చు. అందుకు ఒక సంవత్సరం పట్టవచ్చు. అదంతా మీరు తీసుకునే కేర్‌మీద ఆధారపడి ఉంటుంది."

"డాక్టర్! యూ మస్ట్ హెల్ప్ మీ. రజనికోసం ఒక జీవితకాలం వెయిట్ చేయగలను."

"మీరు నిరాశ చెందాల్సిన అవసరం లేదు. ఓపిక పట్టాలి. అంతే. నాకు సాధ్యమైనంతా చేస్తాను. ఆఫ్టరాల్ ఇట్ ఈజ్ నాట్ ఓన్లీ ఫిజికల్!"

బెడ్ నెం. 25లో సీరియస్‌గా ఉందని నర్స్ చెపితే వెళ్లిపోయాడు డాక్టరు.

రాజారావు గదికి వచ్చాడు. రజని మంచంమీద కూర్చున్నాడు. తదేకంగా రజనిని చూడసాగాడు. అవిడలో ఏదో ఆకర్షణ ఉంది. అయస్కాంతం ఉంది. ముఖం శుష్కించింది. అందం కొంత అడుగంటింది. అయినా, ఆ ఆకర్షణ అలాగే ఉంది. అది ఏ జన్మ బంధమో అర్థంకాలేదు. ఈ బంధం, అనుబంధం ఏమిటో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించలేదు. ప్రయత్నించినా బహుశః అర్థం కాదు. లైలా కురూపి అంటారు కొందరు. "లైల్" అంటే రేయి. ఆమె రంగు రేయి వంటిదట. అయినా, మజ్నూ ఎందుకు పిచ్చివాడైనాడు? మనసుకు గణితశాస్త్రంతో సంబంధంలేదు.

రజని ఆరోగ్యం కుదుటపడింది. ఆస్పత్రినుంచి ఆమెను ఇంటికి తెచ్చుకున్నాడు రాజారావు. రాజారావు పోషణలో రజని బాగా కోలుకుంది. పెదవులలో గులాబీలను, చెంపలలో కెంపులను నింపుకుంది. రాజారావుకు రజనివినా లోకం లేదు. రజనికి రాజారావువినా లోకం తెలియదు.

రజనితో రాజారావు సినీమాలకు వెళ్తున్నాడు. పార్టీలకు, పిక్నిక్కులకు జంటగా పోతున్నారు.

రజని కబుర్లు చెప్తుంది. నవ్వుతుంది. కళ్ళతో మాట్లాడుతుంది. ఆమె సరసన అతడు ఏదో అందని ఆనందం అనుభవిస్తున్నాడు.

ఒకనాడు రాజారావు తాగి వచ్చాడు. రజని మూతి ముడిచింది. రాజారావు తాగుడు మానాడు. సిగరెట్లను సహించింది కాబట్టి, కాలుస్తున్నాడు రాజారావు.

రజని ఇంటికి రావడంతో కలిసివచ్చింది రాజారావుకు. లక్ష్మి ఆ ఇంట్లో అవతరించినట్లయింది. అతనికి ఎన్నడు లేనన్ని కంట్రాక్టులు వచ్చాయి. ప్రభుత్వంలో పలుకుబడి హెచ్చింది. అతడు కోరుకున్న వారిని తన పనిమీద నియమించేటట్లు చేయగలిగాడు. తనకు గిట్టనివారిని బదిలీలు చేయించాడు. ఒక ఇంజనీరునే, తన పనిని సవాలు చేసినందుకు ఉద్యోగం ఊడగొట్టించాడు.

రజనితో అతనికి కాలం కర్పూరంలా గడుస్తోంది. కాని, కావలసింది ఇంతవరకూ లభించలేదు. రజని వలన అతనికి లభిస్తున్నదల్లా మానసికమైన ఆనందమే. అతనిని

దగ్గరికి రానివ్వదు రజని. తాకాడంటే "టచ్ మీ నాట్"వలే ముడుచుకుపోతుంది. అందం సాంతం అంతం అవుతుంది. భయంకర రూపం దాల్చుతుంది. శవంలా పడిపోతుంది.

రాజారావు సహనానికి రజని పరీక్షలా తయారైంది. అతని ఇంద్రియ తృష్ణ తీరడానికి రజని ఉపకరించడంలేదు. అది ఒక రోగం అన్నారు డాక్టర్లు. దాన్ని కుదర్చడానికి అనేకమంది డాక్టర్లకు చూపాడు. డబ్బును పంపునీళ్ళలా ఖర్చు పెట్టాడు. ఎందరో వైద్యులు చికిత్స చేశారు. అయినా, అందుకు మందు కనిపెట్టిన నాథుడు కనిపించలేదు.

డాక్టర్లు స్థలం మార్చమన్నారు. దానికి మానసిక వ్యాధి అని పేరు పెట్టారు. మనసుకు ఉల్లాసం కలిగించాలన్నారు. స్థలం మార్చడం మంచిదన్నారు. వినోదయాత్ర విహారయాత్ర చేయించమన్నారు.

రజనిని తీసుకొని విలాస యాత్రకు బయలుదేరాడు రాజారావు.

★ ★ ★

# పది

"ఆవ్‌మల్ల! నాలుగు యాటలన్న తెగాల్నె బాలయ్యన్న గూడెమ్ల. అఁమల్ల పండుగంటె ఏంది? పరమయ్యన్న ఇష్టడ్లే ఒక్క యాటకు పైకం. కొలువులున్నడు. కమాయిస్తాన్నడు. ఏం చస్తడా?" అన్నాడు పిచ్చయ్య.

తెల్లవారి జరుగనున్న మహాకాళి ఉత్సవానికి ఏర్పాట్లు చేయడానికి బాలయ్య ఇంటిముందు కూడారు గూడెపు జనం.

పిచ్చయ్య ప్రతిపాదనను మిగతావారు బలపరచారు. బాలయ్య మాత్రం మాట్లాడలేదు.

గుండెలో రాయిపడింది పరమయ్యకు. "ఏయ్ కమాయిస్తున్ననే, ఏమన్న జమచేస్తాన్ననా? మండిపోతున్నాయి కీమతులు. నిన్న రొండు రూపాయలుండె పల్లినూనె. ఇయ్యాల అయిదు రూపాయలాయె. దంచిందానికి బుక్కెందె మిగిలె నాతా నేమున్నదే? అందరెంతిస్తే నేనంతిస్త." తప్పుకోవడానికి మండిపోతున్న ధరలను ఆశ్రయించాడు పరమయ్య.

"ఒరే పరమిగా! ఇంక కంజూసులై ఏం కట్కపోతువురా? పండుగ పసందుగ చేయాలె బే. పై నువ్వోరంత గిట్లనే ఏడుస్తర. తియ్ ముండకొడక, ఒక్క యాటకిస్తె చస్తావురా!" పిచ్చయ్య మళ్ళీ అన్నాడు, పరమయ్యకు రోషం తెప్పించాలని.

"నలుగురితోడి నారాయణ. అందరెంతిస్తె నేనంతిస్త" అని లేచి నుంచున్నాడు పరమయ్య.

"ఎహే! పైక మియ్యకుంటె మాయనే. పోతవేడికే" అని లాగి కూర్చోపెట్టి, "బాలయ్యన్న, తీసుకో ఒక యాటపైకం నేనిస్తాన్న" అని నోట్లు బాలయ్య ముందు విసిరాడు, పిచ్చయ్య.

రోషం వచ్చేసింది పరమయ్యకు. తానూ అలాగే పారేతా మనుకున్నాడు. కాని, మైసమ్మను తల్చుకుంటే గుండె జల్లుమన్నది.

"థూ నీ పుటక. పిచ్చయ్యన్నిస్తె కిక్కుమనకుండ కూకుంటడేమె. ఇద్గా నా పైకం" అని ఇచ్చాడింకొకడు.

డబ్బు ఎంత వచ్చిందీ లెక్కించి తెల్లవారి చేయవలసిన కార్యక్రమాన్ని గురించి చర్చిస్తుండగా పుల్లయ్య వచ్చాడు. అతడు సుమారు యాభై ఏండ్లవాడు. లొట్టలు పడిన చెంపలు, ముడతలు పడిన నల్లటి శరీరం, తలగుడ్డ చుట్టుకున్నాడు. చిరిగిన బనీను వేసుకున్నాడు. పంచె మోకాళ్ళవరకుంది.

"మంచిగొచ్చినవే పుల్లయ్యన్న. నేను పూర యాదిమరచిన్ననుకో. రా కూకో" అన్నాడు బాలయ్య పుల్లయ్యను చూచి.

పుల్లయ్య ఒక పక్కన కూర్చున్నాడు.

"యాదిమరిచిన్నే పిచ్చియ్యన్న. పుల్లయ్యన్న రెండు మలకలొచ్చిందు. పోచిగాని గుడిసున్నది గద, గండ్ల ఉంటనంటాడు."

"పుల్లయ్యన్నది చెన్నూరే. గింత జమీనుండె. దానిమీదనే బత్కుతాండె. ఒక సన్నాసాయన వచ్చిండట అడికి. అయ్న నడ్చుకుంటనే తిర్గుతడంట. ఎంటనేమో జీవులుంటయట! బండ్లుంటయట, ఉన్నోండ్లను బిచ్చమడ్గి లేనోండ్ల కిస్తడట్నే జమీన్లు. వచ్చిన సన్నాసాయన దొరింట్ల దిగిండట. దొర జమీన్ ఇచ్చి అయనెళ్లిపోయిండట. దొరరాసిచ్చిన జమీన్ల పుల్లయ్యన్నది సుత ఉన్నదట. అన్నను బేదఖల్ చేసిండ్రట సర్కారోరు. దొరేమొ చావకొట్టించిండట. ఊరిడించిండు. పట్నమ్ల పడ్డడు. గూడైతే కావాలెగదనే. ఈడికొచ్చిండు, మన నడిగెతండ్కు."

"యాటకు పైక మియ్యమను, గుడిసె లుండమను" అన్నాడు చప్పున పరమయ్య—తన భారం వచ్చినవానిమీద వేస్తూ.

ఆ ప్రతిపాదన చాలమందికి నచ్చింది. "ఎట్లనన్న పరమయ్యన్న జర సమజున్నోడు" అన్నారు కొందరు. ఆ మాట నచ్చలేదు పిచ్చయ్యకు.

"గీ పరమిగా డున్నడు చూసిండ్రా! మడిసి చస్తాంటే జేబుల పైకం చూస్తడు. మీరు సుత గట్లనే అంటాండ్రేమే. చచ్చెటోని కంట్ల ఏలుపెట్టి చూస్తారే. పరమయ్యన్న ఇయ్య నంటెనేమో నోరు మూసుకుంటిరి. ఈ డేమిస్తడే గంజికి లేనోడు. అందుకె అంటరు శరంలేదని అలికీ మందికి. ఏమొద్దె బాలయ్యన్న! ఉండమను పోచిగాని గుడిసెల. ఏమన్న కట్కపోతమ పోయెటప్పుడు!"

పిచ్చయ్య ప్రతిపాదన చాలమందికి నచ్చలేదు. గుసగుసలు బయల్దేరాయి. చర్చలు జరిగాయి.

"ఇన్ని కల్మీలన్న కోయించకుంటె గుడిసెట్టిస్తం" అన్నాడొకడు. "యాటకు పైక మియ్యటం నాయమేనే" అన్నాడొకడు. "అసలు పోచయ్య యాడికి పోయిండో? ఎప్పుడొస్తడో? అడొస్తెట్ల" అన్నాడింకొకడు. బాలయ్య అందుకున్నాడు:

"ఇగొ చూడుండ్రి! గీ గుడిసెలు మనమె ఏసుకున్నమనుకోరి. ఎరువై ఏండ్ల కాణ్ణుంచి ఉంటాన్న మనుకోరి. గిప్పుడెమొ గుడిసెలు ఉస్మాన్‌సాబు యైనయి. నెలకు అయిదు రుపైలుకట్టి కిరాయకుంటన్నట్లాయె మనబతుకు. మొన్న పైకం కట్టెటందుకు పోయిన్నా. అడిగిండు ఒక్క గుడిసె పైకమొస్తలేదని. పోచయ్యన్న ఎళ్లిపోయిండని చెప్పిన. గా గుడిసెల ఎవలు దిగినగని తొల్త నూర్రూపాయలు కట్టాల్నన్నడు. ఆ సంగతి సుత చూడుండ్రి."

పిచ్చయ్య మండిపడ్డాడు. ఉద్రేకంతో వణికిపోయాడు. లేచి నుంచొని ఉపన్యాసం ఇచ్చినట్లు అన్నాడు:

"దొంగముండ కొడుకులు. లేకుంటె పొట్టలుకొట్టి బంగ్లలు కడ్తాండ్రు. గప్పుడు తురుకోల్లే రాజ్జమేలిరి. గిప్పుడు వాల్లె ఎల్తాండ్రి. వాడేమన్న మన అయ్యలకు పుట్టినాడు భాడ్‌ఖావ్‌గాడు. గీ జాగేమన్న అనిదా? గుడిసె లేయించిచ్చిండా? సంగాలు పెట్టనేర్చిండ్రు సంగాలు. ఎందుకియాల్నె ఆ నా కొడుక్కు పైకం? పైసిచ్చేడ్డి లేదు. అయిదు బంద్, పుల్లన్న గుడిసెల్నె ఉంటడు."

జనం అంతా ముక్తకంఠంగా అనేశారు "అయిదు బంద్, పుల్లన్న గుడిసెల్నె ఉంటడు."

పిచ్చయ్య పిడికిలి బిగించి "పాంచ్ రూపాయ్" అన్నాడు. జనమంతా "బంద్" అన్నారు. "పుల్లన్నకో జోడ్దీ" అంటే, జనం "దేకే రహేంగే" అన్నారు.

ఇండ్లకు వెళ్ళడానికి అంతా లేచారు. ఈ నిర్ణయం నచ్చని పరమయ్య, "బాలయ్యన్న! నువేమన్నను ఆడు పైనున్నోడే. ఆనితో లడాయెందుకే? ఉన్నట్లె ఉండనియ్యే. కొత్త జగ్డ మెందుకు తెస్తరు!" అన్నాడు.

"పరమయ్య! ఏందే గట్లంటవు. అసలు దున్య నడిపెడ్డి గరీబోల్లనే. గరీబోల్లు మర్ల పడ్డరంటే.........నీ తల్లి ..........యాడ పోతడే గా ఉస్మాన్‌గాడు. నీ అక్క..........వాని హడ్డీ నరమ్ చేస్తే పాకిస్తాన్ల పడాలె" అన్నాడొకడు.

అందరూ నవ్వారు. ఎవరి దోవన వారు వెళ్ళిపోయారు.

దూరంగా రెండు నీడలు కలిసి కనిపించాయి బాలయ్యకు. కొంతసేపటికి విడిపోయాయి. ఒకటి గుడిసెల వెళ్ళిపోయింది. పరీక్షగా చూశాడు. పరమయ్య కూతురు శారద. మళ్ళీ మరొక నీడకోసం దృష్టి నిగిడ్చాడు. అది నిశ్చలంగా నిలిచింది కొంతసేపు. తర్వాత కదిలింది, కొంత వెనక్కు పోయింది. పొడుగు కాసాగింది. మనిషి బయటపడ్డాడు. తన ఇంటివైపే వస్తున్నాడు. చూచాడు, పరీక్షగా చూచాడు. రామారావు – తన కొడుకు! ఒళ్ళు జల్లుమన్నది. వెంటనే కోపం పెల్లుబికింది. వెంటనే దిగిపోయింది. వయసు వచ్చింది. పెళ్ళి చేయకపోవడం తనదే తప్పనుకున్నాడు... కార్తీకమాసం. నిండువెన్నెల, గడ్డివాము వెనుక ప్రాంతం తాను వేచి ఉన్నాడు. బంతిపూలు తురుముకొని వచ్చింది వెంకమ్మ – వెంకమ్మను చూచాడు తాను. పొంగిపోయాడు. నున్నని చెంపలు. పొంగిపొరలే వయసు. వెంకమ్మ అప్సరలా తోచింది. అమాంతంగా కౌగలించుకున్నాడు. పూలు నలిగిపోయాయి.

వయసు మరలి వచ్చినట్లయింది. తనను చూచుకున్నాడు. శరీరం ముడుతలు పడింది. వెంకమ్మ చనిపోయింది. తనకు సంతానం కలిగింది. ఆ వస్తున్నది తన కొడుకు. నాటి తన వయసులో ఉన్నాడు. తనంతవాడు అయినాడు. మైసమ్మ అత్మని మనసులో మెరిసింది. ఆమె పరమయ్య భార్య. చండి. ఆమె అంటే గూడెం అంతటికీ దడ.

రామారావు దగ్గరికి వచ్చాడు.

"యాడికి పోయినవురా?" అడిగాడు బాలయ్య.

"సినిమా కెళ్ళా."

"ఈ కాలపు పోరలంత అంతే. సీన్మాల దయ్యం పట్టింది."

రామారావు మాట్లాడలేదు. వంగి గుడిసెలో ప్రవేశించాడు. గుడ్డి దీపం వెలుగుతూంది. కూర్చున్నాడు. బాలయ్య కూడా గుడిసెలోకి వచ్చాడు. తడకపెట్టి కొడుకు ముందు కూర్చున్నాడు. ఇద్దరిమధ్యా పొగ చిమ్ముతూ బెడ్‌లైట్ వెలుగుతూంది.

ఇద్దరూ ఒకరిముందు ఒకరు కూర్చున్నారు. ఇద్దరూ ఆలోచనల్లో మునిగి ఉన్నారు. ఇద్దరూ మాట్లాడలేదు. కొడుకుకు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు బాలయ్య. తండ్రి తన రహస్యం కనిపెట్టాడా ఏం అని ఆలోచిస్తున్నాడు రామారావు.

"రాముడూ....." అన్నాడు బాలయ్య. రామారావు గుండె జల్లుమన్నది.

"ఇన్నావురా......" పదాలు తడబడ్డాయి. "మైసమ్మంటే గూడెమంతటికీ బుగులు.

నువ్వేమొ గాపోరి ఎంటబడినవు. గూడెమ్ల బతకనిస్తవా? గూడె మిడిచి పొమ్మంటవా?"

రామారావు మాట్లాడలేదు. తల వంచుకొని గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నాడు.

"నువ్వు సుత పెద్దోనివైనావు. పోరనివికాదు. జర్రంత సదవు సుత నేర్చినవు. జర సోచాయించు. నీ తిరుగుల్లేం మంచిగుంటల్లేవు. గాపోరే దొరికినాది నీకు?"

రామారావు అప్పటికీ మాట్లాడలేదు.

"నేను చెప్పెడ్డి చెప్పిన, అటెన్క నీ మర్జీ" అని లేచి బయటికి వచ్చాడు బాలయ్య.

రామారావు మనసులో మనసులేదు. రాత్రంతా ఏవేవో ఆలోచించాడు.

తెల్లవారింది. అది పండుగరోజు, శలవురోజు, సంబరాలరోజు. మహాకాళి జంటనగరాలకు అధిష్ఠాన దేవత. సికింద్రాబాదులోని మహాకాళి పూర్వం రక్తబలినే కోరేది. ఆ రోజు రక్తం నదులుగా ప్రవహించేది. కాని, ఆర్యసమాజ ప్రభావంగల మానవసేవా సమితివలన ఆ దేవత రక్తం కోరడం మానేసింది. ఇప్పుడు రక్తపుచుక్క సైతం చిమ్మదు. కొబ్బరికాయలు గుట్టలుగా పగులుతాయి. ఆ తల్లి పండుగ అందరూ చేసుకుంటారు. అసలు అదే ప్రధాన పర్వదినం జంటనగరాలకు.

గూడెంలో పండుగ శోభ వ్యాపించింది. ప్రతి ఇల్లూ శుభ్రంగా ఉంది. అలికి ముగ్గులు పెట్టారు. గడపలను పసుపు కుంకుమలతో అలంకరించారు. వేపమండల తోరణాలు కట్టారు. అబాల గోపాలం తలంటి పోసుకున్నారు. అందరి ఇండ్లలోనూ మాంసం ఉడికింది. అందరూ మంచి భోజనాలు చేశారు. వేపచెట్లక్రింద చేరారు. జముకుల కథ చెప్పించారు.

*జుముకు జుముకు జూ జుం జుం.*
*జుముకు జుముకు జుం జుం జుం.*
*అంతా పాండవులోరు ఆc ఆc ఆc*
*అంతా పాండవులోరు.*
*ఏశాల్మార్చినారూ ఆc ఆc ఆc*
*ఆc ఏశాల్మార్చినారూ.*
*కొలువున చేరినారూ ఆc ఆc ఆc*
*ఆc కొలువున చేరినారు.*
*ఆc ఆc ఆc అప్పుడు*
*ఆc అప్పుడు*

అప్పుడు విరాటరాజుగారు చూచిండు. కుర్చీలమీద కూకుండపెట్టిండు. వారి చహరలు చమ్కాయిస్తున్నాయి. వారికి కొలువులిచ్చిండు. ఏం కొలువు లిచ్చిండయా అంటే –

*ఆc ఏమ్ కొలువులిచ్చిండయా అంటె*
*ధరమరాజుకు బాపనాయన కొల్వు*
*ఆc బాపనాయన కొల్వు*
*బీములోరికి వంటలయ్య కొలువు*

ఆం వంటలయ్య కొలువు

అరుజునులోరికి బుహనల కొలువు

బుహనల కొలువు

అరే! బుహన లంటే ఏందిర?

అంటే ఆడదికాదు.

మరి మొగోడా?

అంటే మొగోడు కాదు.

మరి పోరడార!

అంటే పోరడు కాదు.

ఆడది కాదు, మొగోడుకాదు, పోరడు కాదు, మరి నీబొందా! నీ మొగమా? ఏందిర నీ కత, నేను ఇననుపో.

అట్లకాదుర, ఆడదికాదు, మొగోడు కాదు, పోరడుకాదు. నువ్వేర బుహనల.

జనమంతా గొల్లుమని నవ్వారు.

పాండవుల అజ్ఞాతవాస కథ, విరాట పర్వం యావత్తూ చెప్పారు కథకులు. వారికి విరాటపర్వం తెలుగున రాసినవాడు తిక్కన అనే విషయం తెలియదు. వారు చెప్పిన కథకు శాస్త్రం లేదు. రాగతాళాలు లేవు. వారు జానపదులు. వారు చెప్పినది జానపదగాథ. అందు తన్మయులైపోయారు జనులు. కథలో లీనం అయిపోయారు. కీచకుడు ద్రౌపది వెంట పడినాడని విన్నారు. ఉద్రిక్తులయినారు. ఆడవారు నేలమీద ఊశారు. కీచకుణ్ణి బూతులు తిట్టారు. భీముడు కీచకుణ్ణి చంపాడని తెలుసుకున్నారు. నిట్టూర్పులు విడిచారు. భీముణ్ణి మెచ్చుకున్నారు. ద్రౌపదిని కీచకుని శవంమీద వేసి కట్టారని విన్నారు. "అయ్యో, ఎంతగతి పట్టెనే తల్లీ నీకు? గీ ఉపకీచకులాడినుంచి వచ్చిరే?" అని ఏడ్చారు. భీముడు ఉపకీచకుల నందరినీ హతమార్చాడు. "భీమన్నా! యాళకొచ్చినవు. మా తల్లిని కాపాడినవు" అనుకున్నారు. ఉత్తరుని ప్రజ్ఞలు విన్నారు. నవ్వుకున్నారు. జమ్మిచెట్టుమీద ఆయుధాలను చూచి శవం అనుకొని జంకుతాడు ఉత్తరుడు. "ఈడు యుద్ధం చేస్తడట. కిరీటాల కుచ్చులుకూడా తెస్తనని చెప్పిండు చెల్లెకు" అని చెప్పుకున్నారు. యుద్ధం జరుగుతున్నంతసేపూ శ్వాస బిగబట్టి విన్నారు. అర్జునుడు అందరినీ మూర్ఛిల్లచేశాడు. అప్పుడు శ్వాస పీల్చుకున్నారు. విరాటుడు కంకుభొట్టు మొఖాన పాచికతో కొట్టడం విని భగ్గుమన్నారు. ధర్మజుని రక్తం నేలమీద పడకుండా దోసిలితో పట్టుకొని "ఈ మహాత్ముని రక్తం నేలమీద పడితే నీ రాజ్యం నాశనం అవుతుంది" అన్న ద్రౌపది మాటలు విని ఆమెకు మ్రొక్కారు.

ఉత్తర పెళ్ళి జరిగింది.

అందరూ ఆనందించారు.

సాయంకాలం కావస్తూంది. అందరూ అలంకరించుకున్నారు. ఆడవారు పెద్ద కుంకుమబొట్లు పెట్టుకున్నారు. శుభ్రంగా తోమి తళతళ మెరిసే బిందెలకు పసుపు, కుంకుమ పెట్టి అలంకరించారు. వేపాకు మండలు కట్టారు. వాటిలో నీరు నింపి అలంకరించబడిన మరొక బిందె దానిమీద పెట్టారు. దానిమీద చెంబు, చెంబుమీద మరొక చెంబు పొట్టారు. అది బోనం. ఆడవారంతా తలలకు బోనాలు ఎత్తుకొని తయారుకాగా మగవారు డప్పులు తీసుకొని బయలుదేరారు.

డప్కు డప్కు డప్కా డప్కా
డప్కు డప్కు డప్కా డప్కా

పందెం వేసుకొని డప్పులు మోగించసాగారు. పోతురాజు కొరడాతో గుంపులో దూకాడు. చబుకు గిర్రున తిప్పాడు. జనం అంతా దూరం జరిగారు. పోతురాజు వార్నీషు రంగు పూసుకొని, పులిచారలు తీర్చి, వేపాకు మొలకు కట్టుకొని ఆడుతున్నాడు. శివం వచ్చింది. ఆట సాగింది. డప్పులజోరు హెచ్చింది. ఈలలమీద ఈలలు. గిర్రుమని తిరుగుతున్నాడు. కొరడా ఝుళిపిస్తున్నాడు. జనం పరుగెత్తుతున్నారు. మళ్ళీ గుమిగూడుతున్నారు.

"పొద్దుమింకుతాంది. నడువురి నడువురి" అన్నాడు బాలయ్య. ముందు డప్పులవాళ్ళు, తరువాత పోతురాజు, జనం, వారి వెనుక బోనాలు ఎత్తుకున్న ఆడవారు సాగిపోయారు.

ఊరేగింపు సాగింది. పిచ్చయ్య కర్ర అందుకొని జనంలోకి దూకాడు. పరమయ్య మరోకర్రతో దూకాడు. జనం దూరం జరిగి వర్తులాకారమైన చోటు దొరికింది. డప్పులు మోగుతున్నాయ్. కర్రసాము సాగించారు పరమయ్యా, పిచ్చయ్యలు. ఎప్పటికప్పుడు ఒకరి కర్ర ఒకరి నెత్తినో, నడుం మీదనో పడేట్టు కనిపిస్తాంది. కాని, తీరా దెబ్బ కర్రమీదనే పడుతుంది. నడిరోడ్డుమీద జరుగుతూంది సాము. ఆ సాము చూచి డప్పులవాళ్ళకు కూడా ఉత్సాహం హెచ్చింది. బస్సులు, కార్లూ రెండువైపులా నిలిచాయి. కాని, ఒక్క హోర్ను వినిపించలేదు. బస్సులో ఉన్న జనమంతా చూస్తున్నారు. కార్ల టాపులెక్కి చూస్తున్నారు కొందరు.

వారి హస్తనైపుణ్యం వింతగానూ విచిత్రంగానూ ఉంది. కర్రలు మెరుపులా తిరుగుతున్నాయి. చూస్తూ చూస్తూనే గిర్రున తిరిగేస్తున్నారు. ఈలలు, చప్పట్లు వారిని మరింత ప్రోత్సాహపరుస్తున్నాయి. గుంపును చెదరగొట్టడానికి వచ్చిన పోలీసు సైతం చూస్తూ నుంచిండిపోయాడు.

కొంతసేపటికి ఊరేగింపు కదిలింది. పోతురాయని ఆట సాగింది. మళ్లీ కొంతదూరం సాగింతర్వాత పుల్లయ్య, బాలయ్య మధ్యన దూకారు. వారికి వర్తులాకారపు స్థలము వదిలి జరిగారు జనం. వీరు ఆట సాగించారు. అది నృత్యం.

"తద్దినక్క తిక్క
తద్దినక్క తిక్క" – డప్పులు సాగాయి.

"హేయ్ హెయ్" ఎగిరారిద్దరూ. ఇద్దరూ యువకులైపోయారు. యువకులుసైతం సిగ్గుపడిపోయేట్టు గంతులేస్తున్నారు. తలకూ మొండానికీ సంబంధంలేనట్లు తలలు తిప్పారిద్దరూ. చేతులు వెనక్కు-ముందుకూ ఆడాయి. ఒకసారి పైకి లేస్తున్నాయి. ఒకసారి కిందకు పడుతున్నాయి. ఈలల మోత. డప్పుల చప్పుళ్ళు. ఆట. మాంచి జోరుగా సాగుతూంది.

"నడవండి నడవండి" అన్నారు కొందరు.

ఇద్దరికీ చమటలు కారిపోయినై. ఇద్దరూ తుడుచుకున్నారు. ఊరేగింపు సాగిపోయింది. ఊరేగింపు మహాకాళి గుడిదగ్గరి బొమ్మలగుడి దగ్గరికి వచ్చేసింది. రెండువైపులా ఉన్న కాలి బాటల మీద మట్టిబొమ్మలు అమ్ముకొంటున్నవారూ, బొంగుపేలాలూ, బత్తీసాలూ, చిలకలూ అమ్ముకునేవారూ, ఒక పిల్లను చేటలో

కోసిపెట్టి ఆ రక్తాన్ని చూపి పైసలడుక్కునే దొమ్మరివారూ, శక్తిబొమ్మ నెత్తిన పెట్టుకొని ఆటలాడే బైండ్లవాండ్లూ ఉన్నారు. జనం ఇసుకవేస్తే రాలకుండా ఉంది.

ఆ జనంలో నుంచి వెళ్ళింది ఊరేగింపు. యువకులు జనాన్ని పక్కకు నెట్టి దారిచేస్తున్నారు. ఊరేగింపు యావత్తూ మహాకాళి గుడికి ప్రదక్షిణం చేసింది. గుడిముందు బిందెల్లోని నీరు ఆరబోశారు. వేప మండలు తీసుకొన్నారు. కొబ్బరికాయలు కొట్టారు. జనంలోంచి తోసుకొనిపోయి తల్లి దర్శనం చేసుకున్నారు. పూజారి యిచ్చిన కుంకుమ తీసుకున్నారు. కొందరు పేలాలు కొన్నారు. కొందరు బొమ్మలు కొన్నారు. కొందరు గాజులు వేయించుకున్నారు. అంతా ఇండ్లకు చేరేవరకు రాత్రి తొమ్మిది గంటలైంది.

కల్లుకుండలు వచ్చాయి. సారాయి సీసాలు దిగాయి. కొన్ని బాలయ్య ఇంటిముందూ, కొన్ని పిచ్చయ్య ఇంటిముందూ దిగాయి. బాలయ్య ఇంటిముందు మగవాళ్ళు కూడారు. పిచ్చయ్య ఇంటిముందు ఆడవాళ్ళు కూడారు.

సురాపానం ప్రారంభం అయింది రెండు చోట్లా. దానితోపాటువచ్చే ఆటలూ, పాటలూ ప్రారంభం అయినాయి. చప్పట్లు కొడ్తూ గౌరమ్మ పాటలు సాగించారు ఆడవారు.

"ఛమ్ ఛమ్ బాజే పాయ్‌లయా"తో మొదలై, "శ్రీరామ నీనామ మెంత రుచిర! ఓ రామ నీ నామమెంత రుచిరా" వరకు సాగిస్తున్నారు మగవారు.

కొందరు వాగుతున్నారు. కొందరు తిట్టుకుంటున్నారు. కొందరు కేకలేస్తున్నారు. కొందరు మాట్లాడుకుంటున్నారు. ఆడుతున్నారు కొందరు. పాడుతున్నారు కొందరు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు గొణుగుతున్నారు. అంతా తాగుతున్నారు. అంతా మత్తులో ఉన్నారు.

"ఇంతకు గుడిసె చూపకపోతివి" అని లేచాడు బాలయ్య. అతనిని అనుసరించారు మరి కొందరు.

గుడిసె తడక లోపల్నించి వేసివుంది. ఏవో గుసగుసలు వినిపించాయి.

"ఎవర్రా లోపల? తడక తీస్తవ? తన్నమంటవ?" అరిచాడు బాలయ్య.

జవాబు రాలేదు.

తన్నాడు బాలయ్య.

తడికె చిరిగిపోయింది.

లోన చీకటి.

"ఎళ్ళుండి బైటికి" – అరచాడు బాలయ్య.

శారద బయటికి వచ్చింది.

అంతా నిర్విణ్ణులైనారు.

తలవంచుకొని, తప్పుకొని సాగిపోయింది.

వార్త అగ్గిలా పాకింది. మైసమ్మ మహాకాళి అయి ఉరికి వచ్చింది. తోవలోనే పట్టుకుంది శారదను. జుట్టుపట్టుకొని గుబ్బగుబ్బ గుద్దింది. "మిండని కాడికి పోయినావే? గంటెకాల్చి వాతలు పెడ్త. పైసు ఇరగపడ్తాన్నాది, గా అడుక్క తినెటోడే దొరికినాడు" అని బాది జుట్టుపట్టుకొని లాక్కుపోయి గుడిసెలో పడేసింది.

రామారావును చూచి మండిపోయాడు బాలయ్య. "ఒరి గాడ్దికొడక, ఇజ్జతుగ బతుక నిచ్చేటట్లు లేవేమిరా?" అని సింహంలా లంఘించాడు. బాదసాగాడు. కిక్కురు మనలేదు రామారావు. అతని మౌనం చూచి రోషం హెచ్చింది బాలయ్యకు. ఇంకా బాదసాగాడు. చర్మం చిట్లింది. రక్తం కారసాగింది. పిచ్చయ్యా, పుల్లయ్యా వచ్చి బాలయ్యను లాక్కోపోయారు, "పోరణ్ణి చంపుతావే" అంటూ. "చావాలె లంజకొడుకు, చస్తే పోరల్లేరనుకుంట" అని విడిపించుకోవడానికి గింజుకోసాగాడు, బాలయ్య.

మైసమ్మ పిడుగులా పడింది. "ఏడి ఆ భాడ్ఖావ్‌గాడు?" అని రామారావు మీదపడి కొట్టింది, రక్కింది, గీరింది. "పెద్దోళ్లైతే ఇండ్లల్ల ఉండాలె. మంది పోరిలెంబడి పడ్తావుర! నా బిడ్డే దొరికినాదిర నీకు? బువ్వకు గతిలేదు. ఆడది కావాలెర?" అని గుద్దసాగింది.

విడిపించుకొని ఉరికివచ్చాడు బాలయ్య. మైసమ్మను దూరం లాగాడు. "మైసమ్మక్క! నీ కాల్మొక్తనే. బాంచనైత. పోరడే తప్పుచేసిండు. చంపమంటావా చెప్పు. బొండిగ పిసుకుత. ఇగ పోనియ్యనే పోరణ్ణి. పోతే పూడ్చిబొందపెడ్త" అని బ్రతిమిలాడాడు.

మైసమ్మ శాంతించలేదు. కాని, తిట్టుకుంటూ చేతులార్చుకుంటూ సాగిపోయింది.

నేలమీద చతికిలపడి మోకాలు మీద తలపెట్టుకొని మౌనంగా ఏడుస్తున్నాడు రామారావు.

అది చూచాడు బాలయ్య. అతని గుండె చెరువైంది. కొడుకుమీద పడి పెద్దగా ఏడ్చేశాడు.

అమ్మవారి పండుగ తుదకు ఇలా పరిణమించడంతో ఏదో ఆపద రానున్నదని శంకించారు గూడెపువారు. నానా రకాలుగా చెప్పుకున్నారు. తెల్లవారి తల్లి రంగం ఎక్కినపుడు అడగాలనుకున్నారు.

తెల్లవారి గూడెమంతా మహాకాళి మందిరానికి చేరింది. ఇసుక వేస్తే రాలకుండా ఉంది జనం. కుమ్మరివాడు అప్పుడే చేసిన పచ్చికుండ తెచ్చి బోర్లించాడు. గజ్జలు గల్లుమన్నాయి. ఎరుకులది పోతురాయమ్మ రంగంమీదికి వచ్చింది. ఆమె వయసులో ఉంది, జుట్టు విరియపోసుకుంది. పసుపుపచ్చని చీర, రవిక వేసుకుంది. ముఖం నిండా కుంకుమ ఉండడాన అగ్గిలా ఉంది. మెడలో గువ్వల దండలూ, బంతిపూల దండలూ ఉన్నాయి. ఒకే కాలిగజ్జ గల్లుమనేట్లు నడుస్తూంది. ఆవిడను చూచి జనం అంతా మ్రొక్కారు, పూలదండలు వేశారు.

ఆమె నిర్దేశస్థలానికి వచ్చింది. పూనకం పూనింది. తల గుండ్రంగా తిప్పింది. ఊఁ ఊఁ ఊఁ అంటూ పూనకం పూనింది. పచ్చికుండమీద కుడికాలు పెట్టి నుంచుంది. అంటే – మహాకాళి ఆవేశించిందని అర్థం.

"ఆఁ ఆఁ ఆఁ" చేతుల్లోని వేపమండలు ఝూడించింది. కళ్ళు నిప్పులు కక్కాయి. "ఏం చెప్పమంటరు? వచ్చేకాల మెట్లుంటదో చెప్పమంటరు" అని తల గుండ్రంగా తిప్పుతూ "కలిగ్రంల పాపం పెరుగుతుంది. నేనంటే బకితిలేకుండ పోతాంది," అన్నది.

"తల్లీ! అట్లనకు. మా అందరికి భక్తి ఉన్నది. రక్షించు తల్లీ!" అన్నాడు పూజారి.

తల తిప్పింది. వళ్ళు వణికించింది. "ఏం రచ్చించమంటార్రా! ఎండలెక్కు వైతె. వానలు తక్కు వైతె. పంటలు పండవు. పండింది దోచుకుంటరు, గరీబోని నోట్ల మట్టికొడ్తరు. అమీర్లు బంగ్లలు కడ్తరు. బంగారం దోచ్క పోతరు. బూడిద మిగులుతది. పెద్దోడు చిన్నోని నెత్తికొడ్తడు. సిన్నోడు కూలికి చస్తడు. మడుసులను అమ్ముకునే కాలం వస్తది. మానం కాపాడుకోటం కష్టమైతది."

పూనకం పూర్తిగా వచ్చేసింది. ఉద్రేకం హెచ్చింది. "హ......హ.......హ" వగరుస్తూంది. నిప్పుమీద గుగ్గిలం వేశారు. అది భగ్గున మండింది. ఆ మంట ముఖంమీద కనిపించింది. పళ్ళు పట పట కొరికింది. "లేదురా దరమం. లేదురా నాయం. ఇగో మింగుతా. దోచుకుంటో ల్లెక్కు వైను. మింగుతా అందరిని. ఎందుకురా ఎగుర్తరు? ఎందుకురా మిడిసిపడ్తరు?"

"తల్లీ, కోపం రానీయకు. మేమంతా నీ బిడ్డలం. ఆగ్రహం రానీయకు తల్లీ! ఏం కావాలో చెప్పు?" అన్నాడు పూజారి.

"ఏం కావాల్నో చెప్పమంటవుర? నీకెరుక లేదుర? కావలె పదివేల కొబ్బరికాయలు. ఇరవైవేల గుమ్మడికాయలు. రెండు లారీల పూలు. నూరు బస్తాల అన్నం కావలెర. ఇస్తరా, ఇయ్యండి. లేకుంటే లస్కర్ను బూడిదచేస్త. దానిమీద గాలి లేపుత. బూడిద సుత మిగలదురో!"

"తల్లీ, శాంతించు. రేషను కాలం – బియ్యంలేవు. వంద కొబ్బరి కాయలు, అయిదు గుమ్మడికాయలు, ఇంతతో తృప్తిపడు తల్లీ. మహాకాళీ!" అన్నాడు పూజారి.

గుగ్గిలం మండింది. తల్లికి కోపం వచ్చింది. తుష్ అన్నది. జుట్టంతా ముఖంమీద పడింది. ఊగసాగింది. "తగ్గను, ఒప్పను, అంతా కావలె. కాకుంటే మింగుత. వస్తున్నరా. వస్తున్న" పళ్ళూ, వేపమండలూ, కాళ్ళూ, తలా వడకాయి.

గుగ్గిలం మండింది. పఠీల్ పఠీల్ మని కొబ్బరికాయలు పగిలాయి. గుమ్మడికాయలు బద్దలైనాయి.

తల్లికి ఉగ్రం తగ్గింది.

"బియ్యం ధరెట్లుంటది తల్లీ?" అడిగాడు బొర్ర సాహుకారు.

"ధరలు తగ్గుతైరో. తగ్గి తగ్గి ఎక్కుతైరో. పెట్టరా నిల్వ– పడతవ్ర బాగు."

"రేషనున్నదిగ తల్లీ?"

"అంత మనోళ్ళేరా, ఆడరా నాటకం."

ఇలా అనేకమంది అనేక ప్రశ్నలడిగారు. పరమయ్య అడిగాడు – కొబ్బరికాయ కొట్టి.

"తల్లీ! మా గుడిసెల గతి ఏమి?"

"గుడిసె లేదుంటైరా?"

"ఏమైతయి తల్లీ! బంగ్లలైతాయా?"

"అవ్ మల్ల, బంగ్లలే అవుతాయి"

గూడెపువారు చిన్నపోయారు.

నాటక రంగం నుంచి వేషం విరమించినట్లు పూనకం దిగింది. పచ్చికుండ మీదినుంచి కాలు తీసింది. గజ్జలు గల్లుమన్నాయి. రంగస్థలం నుంచి విరమించింది.

★ ★ ★

# పదకొండు

అద్దం ముందు కూర్చొని జడ అల్లుకుంది రజని. ముందు ఉన్న జడను వెనుకకు విసిరింది. అలంకరణ ప్రారంభించింది. కళ్ళకు సన్నని కాటుక రేఖ దిద్ది, వాటిని తూపులుగా మార్చింది. నొసట జ్యోతిలాంటి తిలకం దిద్దింది.

అలంకరణ ఆమె అందానికి వన్నె తెచ్చింది. తన ప్రతిబింబాన్ని చూచి తానే మురిసిపోయింది. ముగ్ధలా ముద్రవేసి కూర్చుంది. తన అందాన్ని తానే తాగేయాలనుకుంది. అద్దంలోని ప్రతిబింబాన్ని ముద్దు పెట్టుకుంది.

స్నానం చేసి బుజంమీద తువాలుతో గదిలో అడుగుపెట్టిన రాజారావు అది చూచాడు. "మరి మా గతి?" అన్నాడు.

రజని ముఖం మీద ఎరుపు తరంగం ఎగిసి దిగిపోయింది. చిరునవ్వు నవ్వి "రజని" అన్నది.

"అంటే రాత్రి అనా?"

రజని బుగ్గల్లో సిగ్గులు నిండాయి. తాను అర్థం రావాలని అనలేదు. జవాబు చెప్పడానికి తడబడింది. "చిలిపివారు అవుతున్నారండీ!" అన్నది.

"అవుతున్నానా? చేస్తున్నావా?"

అతనిలో ఉద్రేకం పరవళ్ళు తొక్కింది. అంత అందాన్ని చూస్తూ ఊరుకోలేకపోయాడు. అడుగు ముందుకు వేశాడు. ఇంతలో అర్థం చేసుకున్నాడు. అడుగు వెనక్కు వేసి కుర్చీలో కూలబడ్డాడు.

కాశ్మీరం నుంచి కన్యాకుమారి అగ్రం వరకూ తిరిగి బెంగుళూరు వచ్చారు. అయినా, రంజనిలో ఏ మార్పూ కనిపించలేదు. తిరిగిన చోటనల్లా డాక్టర్లకు చూపించాడు. అంతా వంట్లో ఎలాంటి జబ్బు లేదన్నారు. వ్యాధి మనసునకు సంబంధించిందన్నారు. స్వతహాగా తగ్గాలన్నారు. రజని ప్రవర్తన చూస్తే నటన అనడానికి కూడా వీలులేకుండా వుంది. కొంత విసుగు కూడా కలిగింది. అయినా సహించాడు. ఏనాటికైనా రజని తనది అవుతుంది అనుకున్నాడు. రజని తనతో సిరులు తెచ్చింది. ఆమె అందంతోపాటు అవీ పెరుగుతున్నాయి.

రజనిని చూచాడు. ఆమె పసి వాడింది. అలాంటప్పుడు ఏం చేయాలో అతనికి తెలుసు.

"రజనీ, కాశ్మీరంలో మంచు గుర్తుందా?"

మంచు తివాచీ మీద పొడవైన చీనార్ వృక్షాలు, వాటి మధ్య నుంచి రాజారావు తాను నడవడం, ఒక్కోసారి పరిగెత్తడం గుర్తువచ్చాయి. రజని ముఖం కళకళలాడింది.

"చీనార్ చెట్లల్లో పరిగెత్తాం. తెల్లని మంచు. పచ్చని చెట్లు – ఎంత అందమైన చోటండీ!!"

"జైనుద్దీన్ తల్లి సమాధి గుర్తుందా?"

"లేకేం? దోసిళ్ళతో పూలు పోశాంగదా ఆ సమాధి మీద!"

కన్యాకుమారి అగ్రంలో సాయం సంధ్య సౌందర్యాన్ని గురించి పదాలు అందినంతవరకూ వర్ణించుకున్నారు.

"కోతి" అన్నాడు రాజారావు.

రజని తలతిప్పి చూచింది. సర్వర్ కాఫీ తెస్తున్నాడు. అచ్చం కోతిలాగే ఉన్నాడు.

"కోతి కాఫీ తెస్తూంది" అని కిలకిలా నవ్వేసింది రజని.

ట్రే అక్కడపెట్టి కోపంగా వెళ్ళిపోయాడు సర్వర్.

"కోతి సారాయి తాగింది" అని నవ్వసాగాడు రాజారావు.

తెరలు తెరలుగా వచ్చే నవ్వును అపుకుంటూ "నిప్పు......అమ్మ......నిప్పు తొక్కింది" అన్నది రజని.

ఇద్దరూ విరగబడి నవ్వుతుండగా టెలిఫోను మ్రోగింది.

"హలో! ఎక్కణ్ణుంచి? హైదరాబాదు నుంచా? ఏమి? పార్వతి ప్రసవ వేదనలో ఉందా? ప్రమాదం లేదుగదా? ఆఁ......వెంటనే రావాలా? సరే. కారు ఇక్కడే వదిలేసి ప్లేనులో వస్తా. ఆఁ ఆఁ ఉందనుకుంటా ప్లేను, ఒక గంటలో సరి. జాగ్రత్త. నేను వచ్చేస్తున్నా."

ఆ టెలిఫోను రాజారావులో పెద్ద మార్పును తెచ్చింది. ముందెన్నడూ పార్వతి విషయంలో అంత ఆతురత కనబర్చలేదు.

"రజనీ! పార్వతికి బావుండలేదు. నేను అర్జంటుగా వెళ్ళాలి. తల్లి కాబోతూంది. ప్లేనుకు వెళ్తా. కార్లో వస్తావా?"

మూతి ముడుచుకుంది రజని. తలవంచుకుంది. తానూ వస్తానంది. విసుక్కున్నాడు రాజారావు. పార్వతి! గుండె దడదడ లాడింది. "సరే, తయారుకా" అన్నాడు. తన బట్టలు సర్దుకున్నాడు. తన పెట్టెతో తయారైంది రజని. గబాగబా సాగిపోయాడు. వెనుక నడిచింది రజని. కారులోను, ప్లేనులోనూ ఇద్దరూ మాట్లాడలేదు.

బేగంపేటలో ప్లేను దిగి ఇంటికి వచ్చేశారు ఇద్దరూ. రజనికి ఆ ఇల్లు కొత్తేమీ కాదు. అయినా, ఆ ఇంట్లో కొత్తదనం కనిపించింది. ముడుచుకున్న మొగ్గలా ఉండిన ఇల్లు అమాంతంగా పొద్దు తిరుగుడు పూవులా వికసించింది. కారు దిగి మెట్లెక్కడంలోనే హుషారు కనిపించింది రాజారావులో. పయ్యెద సవరించుకొని వెనుక నడిచింది రజని. ఇద్దరూ మేడ మెట్లెక్కారు – ఒకరు వేగంగా, ఒకరు మెల్లగా. రాజారావు చరచరా వెళ్ళిపోయాడు. రజని తన గదిదాకా వచ్చి ఆగిపోయింది. అతడు వెనక్కు తిరిగి వస్తాడనుకుంది. నుంచుంది. రాజారావు మళుపు తిరిగేదాకా చూసింది. బూట్ల చప్పుడు వినిపించనంతసేపు బొమ్మలా నుంచుంది. గిర్రున తిరిగి గదిలోకి వెళ్లిపోయింది. కనీసం చెప్పులైనా విప్పకుండా మంచంమీద వాలిపోయింది. రాజారావులో వచ్చిన పరివర్తన ఆమెకు ఆశ్చర్యాన్ని కాక దుఃఖాన్ని కలిగించింది. దుఃఖం పొంగింది. దాన్ని అణచుకుంది. ఏవేవో ఆలోచనలు ఆవిడ మెదడులో ముసిరాయి.

"తానెవరు? ఎక్కణ్ణుంచి వచ్చింది? ఇక్కడికి ఎందుకు వచ్చింది? రాజారావు ఎవరు? తనకూ అతనికీ ఉన్న బాంధవ్యం ఏమిటి?"

ఇలాంటి ఆలోచనలు ఆమెకు పూర్వం రాలేదని కాదు. కాని, రాజారావు అనురాగం వాటిని తలెత్తనివ్వలేదు. ఈరోజు పిడుగుపడిం దావిడమీద. రాజారావు తనను విస్మరిస్తున్నాడు. తనను వదలి వెళ్ళిపోయాడు. తాను లేకుండా క్షణం ఉండలేనివాడు హుషారుగా సాగిపోయాడు. అలా ఎందుకైనాడతను? తన గతేమి? ఎందుకుండాలి తానిక్కడ? ఎక్కడికి వెళ్ళాలి తాను? ఎవరున్నారు తనకు? నారాయణరావుగారిని తలచుకుంది. అతడు పార్వతికి తండ్రి. తనకు తండ్రి లేడు తల్లీ లేదా? వారు తనను గురించి పట్టించుకోరా? తానంటే ఆసక్తిలేని రాజారావుతో తనకేం పని?

ఆలోచనలలో మునిగి, నౌకరు గదిలో ప్రవేశించింది కూడా గమనించలేదు. నౌకరు చూచాడు. కన్నీటిధారలు కనిపించాయి. వళ్లు జల్లుమన్నది. ఆవిడ దుఃఖించాల్సిన అవసరం ఏమిటో అర్థం కాలేదు అతనికి.

"దొర రమ్మన్నడు" అన్నాడు మెల్లగా చేతులు కట్టుకొని నుంచొని.

లేచి కూర్చుంది. "ఎందు కొచ్చావ్" అడిగింది.

"దొర రమ్మన్నడు."

"వస్తా నడువ్."

"బిర్న రమ్మన్నడు."

"వస్తానన్నాగా నడువ్" – గద్దించినట్లు మాట్లాడింది. తలవంచుకొని వెళ్లిపోయాడు.

రాజారావు పిలుస్తే తానెందుకు వెళ్లాలి? అదీకాక మనిషిని పంపిస్తాడా! తాను రాగూడదూ? వెళ్ళరాదని నిశ్చయించుకుంది. వేయి విధాల ఆలోచించింది. తుదకు వంటరితనం భరించలేక వెళ్ళడానికే నిశ్చయించుకుంది. బాత్‌రూముకు వెళ్లింది.

☆ ☆ ☆

పార్వతి మగబిడ్డను కన్నదని రాజారావుకు విమానాశ్రయంలోనే తెలిసింది. హృదయం గంతులు వేసింది. పాపను చూడాలనే ఉబలాటంతోపాటు పార్వతిని చూడాలనే ఆతురత ఎక్కువైంది. కారులో ఎక్కాడనేగాని అతని మనసంతా పార్వతిమీదా పాపమీదనే ఉంది. కారు చీమలా నడుస్తున్నట్లనిపించింది. అతని మనోఫలకంమీద పార్వతి, పసిబిడ్డ – తన బిడ్డ – మసలారు. అతనికి తన బిడ్డను గురించి అనేక ఊహాలొచ్చాయి. బిడ్డకు పెట్టాల్సిన పేరు, వేయాల్సిన దుస్తులు, నియమించాల్సిన నర్సు, చదివించాల్సిన స్కూలు – ఇంకెన్నెన్నో.

కారు పోర్టికోలో ఆగగా చివాలున దిగి చరచరా మెట్లెక్కాడు. వాస్తవానికి తన వెంట రజని ఉందనే విషయం మరచిపోయాడు. వేగంగా నడచి పార్వతి గదిలో ప్రవేశించాడు. అతన్ని చూడగానే బట్ట కాళ్ళనిండా కప్పుకొని, పయ్యెద సవరించుకొంటూ, మంచంలో లేచి కూర్చుంది పార్వతి. రాజారావు మంచం ప్రక్కన కూర్చోబోయి, పక్కనున్న ఊయల చూచి తొంగి చూచాడు. పల్చని గుడ్డ పొట్టమీద కప్పి ఉన్న బాబు కనిపించాడు. తన గుండెలోని ఒక ముక్క ఊయలలో

ఉన్నట్లనిపించింది. పాప నిద్రపోతున్నాడు. గుండ్రని ముఖం, కళ్ళు పార్వతివి; ముక్కు తనది. సృష్టి విచిత్రం అయింది అనుకున్నాడు. నర్సు పాపను తీసి అందించింది. ముద్దులు కురిపించాడు. కుర్చీలో కూర్చుంటూ "పార్వతీ, నువ్వెంత మంచిదానివి!" అన్నాడు.

ఆవిడ హృదయం పులకించింది. భర్తను చూచింది. అతని ముఖంలో ఆనందం తాండవిస్తూంది. తన నోములు ఫలించా యనుకుంది. భగవానుని దయగా భావించింది. అంతలో సిగ్గు ఆవహించింది. తలవంచుకుంది.

"పార్వతీ! చూడు, పాపకళ్ళు అచ్చం నీ కళ్లే" అన్నాడు.

తాను బిడ్డను చాలాసార్లు చూసింది. కాని, అప్పటి వరకూ ఈ విషయం గమనించలేదు తాను.

"ముక్కు చూశారా?"

మాట పూర్తికాకుండానే "నా ముక్కు కనిపించడంలా పొట్టిగా" అని, "పార్వతీ! చాల కష్టపడ్డావా?" అడిగాడు.

"బాధా! చచ్చిపోతాననుకున్నాను. మీరు పక్కన లేకుండా చనిపోవడం ఇష్టంలేక టెలిఫోన్ చేయించాను. మరిచాను, రజని రాలేదా?" అడిగింది.

"అవును. మరచిపోయాను, రజని నా వెంట వచ్చిందనే విషయం. ప్లేన్ దిగ్గానే నిన్ను చూడాలనే ఉబలాటమే ననుకో." పార్వతి ముఖంలో ఒక ఎరుపు తెర పైకి లేచి వాలిపోయింది. "నేరుగా యిటే వచ్చేశాను. పిలిపించు రజనిని" అన్నాడు.

నౌకరును పిలిచి రజనికి కబురంపింది పార్వతి.

తాము చూచివచ్చిన విశేషాలను గురించి పార్వతికి చెబుతుండగా నారాయణరావు గుమ్మంలో ప్రవేశించాడు. తూలి పడబోయి, దర్వాజా పట్టుకున్నాడు.

"అల్లుడూ! గుడ్ నైట్....సారి......గుడ్ మార్నింగ్. ఎంతకాలమయిందో విస్కీ తాగి! పార్వతి వట్టి పిసినారి – ఇరవైనిమించి ఇవ్వడంలేదు. చాల అప్పయింది. అదీ నువ్వే తీర్చాలి."

పార్వతి గుండె జల్లుమంది. అప్పు ఎలా పుట్టిందో అర్థం కాలేదు రాజారావుకు.

"చూడు, ఎంత తాగినా మత్తు రావడంలేదు. మార్ఫియా తీస్కుంటే తప్ప మత్తు ఎక్కడంలేదు" – దగ్గు పొర వచ్చింది. సుడిబడ్డాడు రాజారావు. అతణ్ణే పట్టుకొని తెచ్చి కుర్చీలో కూర్చోబెట్టాడు.

దగ్గుపొర నుంచి తెములుకొని "అలా అని మార్ఫియా తీసికొని నిద్రపోతాననుకో, అందులో ఏం మజా ఉంటుంది?" త్రేన్చాడు. సారావాసన గుప్పుమంది. పార్వతీ, రాజారావు ముక్కులు మూసుకున్నారు.

"ఆకల్లేకుంటే మందుందనుకో, దాంతో నాలుకరుచి తీరుతుందా? తాగుడులో మజా నీకేం తెలుసు పారూ! యోగం చేయలేనివాడల్లా తాగాలన్నాడు మహర్షి. అల్లుడూ, ఇవ్వాళ జల్సాగా ఉండాలోయ్ – ఇస్తావా ఏమన్నా? అప్పే చేయమంటావా? నీ యిష్టం" అని నవ్వేశాడు నారాయణరావు చేయిచాచి.

నివ్వెరపోయాడు రాజారావు, అతని ముఖంలోని రక్తం యావత్తు దిగిపోయింది. ఈ అప్పేమిటి? ఏం చూచి యిస్తున్నాడు, ఎవడిస్తున్నాడు? రహస్యం ఎవడికయినా

తెలిసిపోయిందా? అని ఆలోచిస్తూనే పర్సులోంచి పచ్చకాగితం తీసి ఇచ్చేశాడు మామగారికి. బై బై అని తలూపుతూ వెళ్ళిపోయాడు నారాయణరావు.

ఇక పార్వతి బాధ చెప్పలేం. తాను బిడ్డను కన్నది. తండ్రి ఒక్కసారి ఇలా వచ్చి మనవణ్ణి చూచిపోలేదు. ఇప్పుడు గదిలోకి వస్తే తన బిడ్డను చూస్తాడనీ, ఎత్తుకొని ముద్దు పెట్టుకుంటాడనీ ఆశించింది. తండ్రి మాటలు విని వ్యవహారం తన చేయి దాటిపోతూందని గ్రహించింది. ఇటీవల తానా విషయాల్లో అట్టే శ్రద్ధ తీసుకోలేకపోతూంది. ఆమె కంటినుంచి రెండు బాష్పబిందువులు రాలాయి.

నారాయణరావు వెళ్ళిపోతూంటే. రాజారావు భార్యవైపు చూచాడు సార్థకంగా. ఆవిడకూడా తనకేమీ తెలీదన్నట్లు చూచింది. ఆ దశలో ప్రవేశించింది రజని. రజని గదిలో ప్రవేశించగానే రాజారావుతో తనను మరచిపోయినందులకు నిష్ఠురంగా మాట్లాడాలనుకుంది. కాని, పరిస్థితి చూచి ఏమీ మాట్లాడలేకపోయింది, తన నీరసానికి తనలో తానే నిందించుకుంది. తన అధికారం ఏదో జారిపోతున్నట్లు భావించింది.

రాజారావు ఆవిణ్ణి చూచాడు. "రా రజనీ! చూడు పాపను. పార్వతి ఎలాంటి బిడ్డను కన్నదో చూడు!" అన్నాడు పేలవంగా.

రజని ఊయల దగ్గరికి వెళ్ళించి. బిడ్డను చూచింది. ఎత్తుకుంది. ముద్దుపెట్టుకుంది. తొట్టెలో పడుకోపెట్టి గుడ్డకప్పింది. బిడ్డ ఏడ్చాడు. నర్సు తీసుకొని పాలు పట్టించింది. పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది రజని.

"వొళ్ళెలా ఉంది?" అడిగింది రజని.

"భగవంతుని దయవల్ల బాగానే ఉంది. మరిచేపోయావే. పిలిచేదాకా రానేలేదు."

"ఏదో.......బట్టలు.......మార్చుకొని......." తడబడింది రజని.

"కోపం వచ్చి ఉంటుంది" అన్నాడు రాజారావు.

"నాకెందుకు కోపం? ఏదో కాస్త.....ఆలస్యం! అయినా మేమెందుకు....." అని మాట మింగేసింది.

రాజారావుకు రజని ప్రవర్తన వింతగా కనిపించింది. ఆవిడ మనసులోని మాటేమిటో గ్రహించాలని ప్రయత్నించాడు. ముఖంలో అట్టే మార్పేమీ కనిపించలేదు. కాని, ప్రసన్నంగా ఉండే ముఖంలో చికాకు కనిపించింది. బాగా ఆలోచించగా బహుశః పార్వతంటే ఈర్ష్య ఏమో. అనుకున్నాడు. అందులో అట్టే అర్థం ఉన్నట్లు కనిపించలేదు. నర్సు పాలు తాగించి పాపను పడుకోబెట్టడం కనిపించింది. పాప అంటే ఈర్ష్య కాదు కదా? అనుకున్నాడు. అతని ఆలోచన అక్కడ ఠపీమని ఆగిపోయింది. ఇక ముందుకు కదల్లేదు. రజని కళ్ళల్లోకి చూచాడు. వాటిల్లో ఈర్ష్య ఎక్కడా కనిపించలేదు. కాని, చూపులు తాను అనుకున్నంత ప్రసన్నంగా లేవు. తానలా చూస్తే చిరునవ్వు నవ్వేయాల్సింది రజని – కనీసం కళ్ళతో. అలా జరగలేదు! అతని చూపులవాడికి తట్టుకోలేకనా అన్నట్లు తలవంచుకుంది.

రాజారావుకు ఏమీ తోచలేదు. సిగరెట్టు కోసం జేబులు తడుముకున్నాడు. అగ్గిపెట్టె ఉంది కాని, సిగరెట్టుపెట్టె ఖాళీగా ఉంది. ఖాళీ పెట్టె నేలక్కొట్టాడు. "వస్తా" అని లేచి చరచరా వెళ్ళిపోయాడు. ఇద్దరూ వింతగా చూచారు రాజారావును.

అతని ముఖం కనిపించలేదు వారికి. అతని నడకలో ఏదో చిరాకు గోచరించింది వారికి. రజనీ, పార్వతీ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. ఆ చూపుల్లో ప్రశ్నలున్నాయి కాని, జవాబులేదు. ఏం మాట్లాడాలో ఇద్దరికీ అర్థం కాలేదు. ఇద్దరి మనసుల్లో ఏదో కలత కల్లోలం చెలరేగింది. అప్పుడే వికసించిన గులాబి తోటమీద అగ్నివాన కురిసినట్లనిపించింది పార్వతికి. తాను నాటి, పెంచి పోషించుకున్న గులాబి తోటలోంచి తన నెవరో గెంటివేస్తున్నట్లూ, పూలన్నింటినీ నలిపి కుప్పలు పోస్తున్నట్లు అనిపించింది రజనికి. ఇద్దరి మనసుల్లో ముళ్ళపొదలు మొలచాయి.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చున్నారు. పార్వతి కూర్చున్నదల్లా దిండు సర్దుకొని మేను వాల్చింది. రజని లేచినుంచుంది. నాలుగడుగులు ముందుకు వేసి వెనక్కు తిరిగింది. ఊయల దగ్గరికి వెళ్ళింది. పాప నిద్రపోతున్నాడు. నిద్రలోనే చిరునవ్వు నవ్వుతున్నాడు. లిప్తపాటు పసిపాప నవ్వులో లీనం అయిపోయింది. ఎంత అందంగా ఉన్నాడు పాప అనుకుంది. అవిడ ముఖం వికసించింది. పార్వతి పాప బుగ్గ అందుకొని ముద్దు పెట్టుకుంది. మళ్లీ పార్వతితో చెప్పి వెళ్ళిపోసాగింది. "వస్తుండు" అనే పార్వతి మాటలు అవిడకు వినిపించనేలేదు.

రజని గదిలోకివెళ్ళి కూర్చుంది. కళ్ళు మూసుకొని తల కుర్చీ పైకివాల్చి ఆలోచించసాగింది. ఆవిడకు ఇదివరకే ఉన్న వ్యధలు రెండు. ఒకటి తానెవరు అనే విషయమై తపన. రెండవది రాజారావు దూరమైపోతున్నాడనే బాధ. ఇప్పుడు మరొకటి నెత్తినపడింది. పార్వతి పాప. పాప వెన్నెల్లాంటి నవ్వు అవిడకు తాత్కాలికంగా ఆనందం కలిగించినా రాజారావు తన నుంచి దూరం అవుతున్నది పాపవల్లనే అని గ్రహించింది. రాజారావు తనను ప్రేమించడం కాదు – పూజిస్తున్నాడు. తనవల్ల అతనికి శారీరకమైన ఆనందం ఏమీ లభించడంలేదు.

రాజారావు అంటే తనకూ అభిమానమే. కాని, రాజారావు తనను కౌగిలిలోకి తీసుకుంటే ఏవో ఇనుపచేతులు తనను బంధిస్తున్నట్లనిపిస్తుంది. ఎవరో తననూ తన మనసునూ దొంగిలిస్తున్నట్లు అనిపిస్తుంది. దూరంగా ఉన్నప్పుడు రాజారావు తనవాడే అనిపిస్తుంది. కాని, తనను తాకుతే ఎవరో పరపురుషుడు తాకినట్లనిపిస్తుంది. అది తాను కావాలని అనుకుంటున్నది కాదు – స్వతస్సిద్ధంగా వచ్చేస్తూంది. ఎందుకు వస్తుందో తనకే తెలీదు. రాజారావుకు తనవల్ల ఏం సుఖం ఉంది? రాజారావు తనను మరచిపోతే? తనను వెళ్ళగొట్టే? ఆ ఊహ సైతం భరించలేకపోయింది. గుండెలో వేల బాకులు గుచ్చుకున్నట్లనిపించింది. కుర్చీమీదినుంచి లేచి మంచం మీద పడుకుంది. మౌనంగా ఏడ్చింది. కన్నీరు ధారలుగా ప్రవహించింది. శరీరం ఇదివరకే అలసిపోయింది. ఇప్పుడు మనసూ అలసిపోయింది! నిద్రపట్టింది.

☆ ☆ ☆

రాజారావు పార్వతి గదిలోంచి చరచరా నడిచి తన గదిలోకి ప్రవేశించాడు. డ్రా లాగి చూస్తే సిగరెట్టు పెట్టెలు లేవు. ఇదివరకైతే సిగరెట్లు ఉన్నదీ లేనిదీ చూచి తెప్పించి ఉంచేది పార్వతి. కాని, ఇన్ని రోజుల్నుంచి రాజారావు లేడు. పైగా, పార్వతి మామూలు మనిషి కాదాయెను. అసలే చిరాగ్గా ఉన్నమనిషికి సిగరెట్లు లేకపోవడం మరీ చిరాకు వేసింది! కేకలువేసి పనివాళ్ళందరినీ పిల్చాడు. అంతా

హడావుడిగా గదిలోకి ప్రవేశించారు. "సిగరెట్లు ఎందుకు లేవు?" అని అరచాడు. ఎందుకులేవని అరుస్తే వాళ్ళేం చేయగలరు? తెమ్మంటే తేగలరుగాని. ఎవడూ సిగరెట్టు తెచ్చిపెడ్తాననడు. అంతా మొద్దుల్లా నుంచున్నారు. తాను లేకపోవడం వల్లనే ఇలా అయిపోయిందనుకున్నాడు!

"ఎవడూ మాట్లాడ్డేం?"

"ఏం మాట్లాడమంటావ్ దొర?" అడిగాడొకడు.

"సిగరెట్లు తెమ్మని మొత్తుకోవడంలే."

"పైసలిస్తే తెస్తం గద?"

అప్పుడర్థం అయింది రాజారావుకు – డబ్బివ్వకుండా, తెమ్మనకుండా వాగడం తనదే తప్పని! అలా తన తప్పు పనివాళ్ళముందు వ్యక్తపరచడం ఇష్టంలేక "వెధవలు, చెప్పొద్దూ డబ్బు కావాలని" అంటూ డ్రాలోంచి డబ్బుతీసి పారేశాడు. అది అందుకొని వెళ్ళిపోయారు సిగరెట్లు తేవడానికి నౌకర్లు.

వ్యవహారం అంతా అస్తవ్యస్తం అయినట్లు కనిపించింది రాజారావుకు. నారాయణ రావు అప్పుచేయడం విషయంలోనే అతనికి అనేక ఆలోచనలు వచ్చాయి. ఏ ఒక్కదాన్నీ స్థిరపర్చలేకపోయాడు. గదిలో పచారు చేస్తూ ఆలోచించసాగాడు. కాని, సిగరెట్టు లేనిదే ఆలోచనంటూ వచ్చేట్టు లేదు. ఇంతలో సిగరెట్టు పెట్టెలు తెచ్చి డ్రామీద పెట్టి వెళ్ళిపోయాడు ఒకడు. వెంటనే సిగరెట్టు వెలిగించాడు. గట్టిగా దమ్ములాగి కుర్చీమీద కూర్చొని పొగమబ్బులు వదిలాడు. పొగతోబాటు, మనసులో అంతసేపటి నుంచి కూడిన జిడ్డు, ఏదో చిరాకు వెళ్ళిపోతున్నట్లనిపించింది. రెండు దమ్ముల్లాగే వరకు బుర్ర తేలికైనట్లనిపించింది.

ఆ పొగ మబ్బుల్ను చూస్తూ కూర్చున్నాడు. అతనికి రజని గుర్తుకువచ్చింది. రజని ప్రవర్తన వింతగా తోచింది. ఒక్కసారి రజని దగ్గరికి వెళ్ళివస్తే కొంత ఆహ్లాదం కలుగుతుంది. ఆవిడ దగ్గర ఏముందో తెలియదు ఆవిడ నవ్వుతే ఇతని గుండెలో వెన్నెల చేలు పండుతాయి. సిగరెట్లు త్రాగుతూనే గదిలో అడుగుపెట్టాడు. రజని నిద్రపోతూంది. చెక్కిళ్ళమీద కన్నీటిధారలు ఎండిపోయిన చారలు కనిపిస్తున్నాయి. అయినా, ఆవిడ ముఖంలో ఏదో ఆకర్షణ కనిపించిందతనికి. ముఖంమీదికి పడివున్న వెంట్రుకల్ను పైకి నెట్టాడు. కాసేపు అక్కడే కూర్చున్నాడు. తర్వాత లేచి తన గదిలోకి వెళ్లిపోయాడు.

★ ★ ★

# పన్నెండు

శ్రామికుల రక్తంతో డొక్క నింపుకొని కుంగిపోయాడు సూర్యుడు. బాలయ్య గుండెలోలా చీకట్లు లోకమంతటా వ్యాపించాయి. ఫ్యాక్టరీలు వగైరాలు మనిషి శక్తిని పీల్చుకొని పంపించివేయగా, కళకళలాడుత్తా వెళ్ళినవారు డీలాపడిపోయి తిరిగి వచ్చేస్తున్నారు! పరమయ్యా వచ్చేశాడు. రావడం రావడమే బాలయ్య ఇంటికి వచ్చాడు. "బాలయ్యన్నా! రాముడి కాణ్ణుంచి కారటొచ్చింది" అంటూ లోపల ప్రవేశించాడు. ఆ మాటలు అమృతవృష్టిలా పనిచేశాయి బాలయ్యమీద. దూరంగా ఉన్న కొడుకు గుర్తుకు వచ్చాడు. కబురులేదు అక్కణ్ణుంచి, ఇవ్వాళ వాడి దగ్గరనుంచి వార్త అందింది.

"పరమయ్యన్న, సత్తెం గొచ్చినాదె?"

"అగ్గా, ఇగనేనబద్దమాడినట్లనా? చూస్కోరాదు! నీకు సుత చదువత్తదికద" అని ఒక ఇన్లాండ్ లెటర్ ఇచ్చాడు.

ఉత్తరం మడత విప్పింతరవాతకాని దీపం అవసరమనే విషయం తెలియలేదు బాలయ్యకు. ఒక నిట్టూర్పు విడిచాడు. ఉత్తరం మడిచాడు. దీపపుబుడ్డి అందుకొని ఊపిచూచాడు. ఏదో గలగలా అంది తప్ప నూనె లేదు. అది గ్రహించాడు పరమయ్య. బుడ్డి తీసికెళ్ళి కుర్రాడికి డబ్బిచ్చి కిర్సనాయిలు తెప్పించాడు.

నూనె వచ్చి, దీపం వెలిగే లోపల బాలయ్య బుర్రలో అనేక ఆలోచనలు ముసిరాయి. రాము తనకెందుకు ఉత్తరం రాయలేదు? ఆ ఆలోచనతోపాటే కోపం వచ్చేసిందతనికి. పెళ్ళాం – ఛీ – పెళ్ళాం ఏమిటి – అమ్మాయి దొరగ్గానే తనతో పనితీరిపోయినట్లేనా? తనకంటే పరమయ్య దగ్గరవాడైపోయాడా ఉత్తరం రాయడానికి! పెంచి పెద్దవాణ్ణి చేశాడు తాను. ఇంతలోనే మరచిపోయాడు – అబ్బ! ఎంత కృతఘ్నుడు! అయినా, పక్షులకు రెక్కలు వస్తే ఉంటాయా?

పరమయ్య దీపం వెలిగించాడు. ఇల్లు యావత్తు వెలిగిపోయింది. మడతవిప్పాడు బాలయ్య. అతనికి అట్టే చదువురాదు. ఏదో గుణించుకొని మెల్లగా చదవగలడు. అలా చదివే ప్రతి అక్షరంలోనూ అతనికేదో ఆనందం, ఉత్సాహం, శక్తి, సత్తువ కనిపించాయి. అతని వదనం వికసించింది. హృదయం పొంగింది. ఉత్తరం మొత్తం చదివాడు. తండ్రికి రాయడానికి భయంగావుంది కాబట్టి పరమయ్యకు రాస్తున్నానని రాశాడు రాముడు. ఆ వాక్యాలు చదివి కళ్ళు తుడుచుకున్నాడు బాలయ్య. త్వరలో శలవుమీద వస్తానన్న వాక్యాలు అతనికి అంతులేని ఆనందాన్ని కలిగించాయి.

☆ ☆ ☆

రామారావూ శారదా బొంబాయి రైలెక్కారు. రైల్లో ఒకతను కనిపించాడు. అతడు బట్టల మిల్లులో పనిచేసేవాడు. మిల్లు పనివారికి నాయకుడు. రామారావు కథ విన్నాడు. ఈ విషయం తలితండ్రులతో చెప్పి ఉండాల్సిందన్నాడు. రామారావు

తన ఇబ్బందులు వ్యక్తపరచాడు. అతడు ఆ యువ దంపతులను బొంబాయిలో మురికివాడలోని తన గుడిసెకు తీసికెళ్లాడు.

అన్యాయాన్ని చూచి సహించలేకపోవడం అతనిలోని మొదటి లోపం. అమాంతంగా దాన్ని ఎదిరించడానికి ఉరకడం రెండో లోపం. బాధలో ఉన్నవాణ్ణి చూచి కరిగిపోవడం మూడో లోపం. తన సర్వస్వం ఒడ్డి వాణ్ణి కాపాడ్డం అతని నాలుగో లోపం. ఈ లోపాలుండడం వల్ల అతనికి అనేకసార్లు అనేక శిక్షలు పడ్డాయి. అల్లాంటివాడు రామారావు దంపతులకు సహాయపడ్డాడంటే ఆశ్చర్యమేమి?

పూలదండలు వేయించి వారి పెళ్లి చేసి మురిసిపోయాడు. వారి పెళ్ళిని రిజిస్టరు కూడా చేయించాడు. ఒక బట్టల మిల్లులో కొలువు ఇప్పించాడు. అతని ప్రభావం రామారావు మీద బాగా పడింది. మనిషి పూర్తిగా మారిపోయాడు. అతనిలో ఉన్న బలహీనతలన్ని అంతరించాయి. శక్తిమంతుడైనాడు. అన్యాయాన్ని ఎదుర్కొనే ధైర్యం వచ్చిందతనికి. అతణ్ణి నాయకుడుగా గుర్తించారు కార్మికులు.

దేశం కరువు వాత పడింది. పరాయి దేశాలకు మస్లిన్ ఎగుమతి చేసిన దేశంలో పత్తి కొరత ఏర్పడింది. ఈజిప్టు, అమెరికా మున్నగు దేశాలనుంచి పత్తి దిగుమతి చేసుకోవాల్సిన దౌర్భాగ్యం ఏర్పడింది. ధరలు విపరీతంగా పెరగసాగేయి. బీహారు, ఉత్తరప్రదేశ్‌లలో అన్నం కరువేకాక నీటి కొరత ఏర్పడింది. దాహానికి నీరు దొరక్క అలమటించి పసిబాలలు సహితం ప్రాణాలు వదిలారు. బెంగాలు కరువును తలదన్నిన కరువు వచ్చినా దేశం కదల్లేదు.

అల్లాంటి పరిస్థితిలో పత్తి కొరత సాకుమీద కార్మికుల్ను ఉద్యోగాల్లోంచి తొలగించారు యజమానులు. రామారావు అది సహించలేకపోయాడు. మొత్తం బట్టల మిల్లుల్లో సమ్మె చేయించాడు. సమ్మె విజయవంతంగా సాగింది. యజమానులు రాజీకి రాక తప్పిందికాదు. తుదకు తీసివేసిన పనివారి నందరినీ పనిలోకి తీసుకున్నారు. రామారావును బట్టల మిల్లుల కార్మికులంతా నాయకుణ్ణి చేశారు. అతణ్ణి ఊరేగించారు. పూలదండలు వేశారు. జయ జయధ్వానాలు చేశారు.

శారద అదంతా చూసింది. పొంగిపోయింది.

కొద్దిరోజుల్లో వీలుచూసుకొని వస్తానని రాశాడు రామారావు.

బాలయ్య పొంగిపోయాడు. అతని ఆనందానికి అంతులేదు. కథంతా పరమయ్యకు చెప్పాడు. పరమయ్య భార్య వచ్చింది. పిచ్చయ్య వచ్చాడు. ఒక్కొక్కరే అంతా అక్కడ కూడారు. పరమయ్య సగర్వంగా అందరికీ అల్లుని కథ వినిపించాడు. అంతా రామారావులోని మార్పును విని ఆశ్చర్యపోయారు. సంతోషించారు.

☆ ☆ ☆

సూర్యుడు ఉదయించడమూ ఆకాశాన పాకడమూ జరిగాయి. ఎవరో వచ్చారని లేపుతేకాని లేచాడుకాదు బాలయ్య. కళ్ళు నలుచుకుని చూచాడు. ఎదురుగా యిద్దరు యమభటుల్లా కనిపించారు. గుండె జల్లుమంది.

ఇద్దరిలో ఒకడు పొడవైనవాడు. బాగా బలంగా ఉన్నాడు. నెత్తిమీద వెంట్రుకలు చాలా చిన్నవిగా కత్తిరించి ఉన్నాయి. గుండ్రని మాంసలమైన ముఖం, కళ్ళు చిన్నవి. ముక్కు పొట్టిది. మెడలో తాయెత్తుగల నల్లని దారం కట్టుకున్నాడు.

బాగా పైకివున్న బిగువైన లాల్చీ పైజమా వేసుకున్నాడు. చేత కఱ్ఱ పట్టుకున్నాడు. పేరు మహమ్మద్ హుసేన్. రెండోవాడు పొట్టిగానూ బలంగానూ ఉన్నాడు. నల్లగా బొగ్గులా ఉంది అతని ముఖం. వెంట్రుకలు బాగా పొడుగ్గా ఉన్నాయి. వెంట్రుకల్లోంచి నూనె కారుతూంది. ముఖం కోలగా ఉంది. బలిష్ఠమైన శరీరం. కళ్ళు చిన్నగానే ఉన్నా ముక్కు బాగా లావుగా వుంది పెద్దపెద్ద చారల బుషర్టు, బిగుతైన పాంటు తొడుక్కున్నాడు. అతని చేతులో కూడా కఱ్ఱ ఉంది. పేరు రామ్ మనోహర్‌సింగ్. వీరిద్దరూ దాదాలు. ఉస్మాన్ సైనికవర్గంలోనివారు. వీరేమీ పనిచేయరు. గుడిసెల సంఘం డబ్బుతో పోషించబడుతుంటారు.

బాలయ్య లేచి బయటికి వచ్చి సలామ్ చేశాడు.

"లీడరువు నువ్వేనా?" అడిగాడు వెటకారంగా హుసేన్.

బాలయ్య కేమీ అర్థంకాలేదు. వెర్రిగా చూచాడు. "లీడరేంది?" అడిగాడు.

"ఏందో ఎరికచెప్పేటందుకే వచ్చినం. గుడిసెల కిరాయెందుక్కట్టలేదు?"

"కిరాయా? యాడ్డి?"

ఈలోగా పిచ్చయ్య, పరమయ్య మరికొంతమంది కూడారక్కడ.

"యాడిదా? ఎట్లెరికైతది. మస్తెక్కింది. దాన్ని దింపేటండ్కె వచ్చినం."

"అయ్యనీ జాగీ రనుకున్నవ ఈ జాగ. కిరాయాడిదంటవు. మొన్నటిదాక కట్టిందేది? హడ్డీ నరమైతే ఎరికైతది" అన్నాడు రామ్‌మనోహర్ సింగ్, చొక్కా చేతులు కిందిదాకా లేకున్నా, పైకి తీస్తున్నట్టు నటిస్తూ.

"జర మాటలు సీదరానియ్యి. ఏమో ఎట్లనో మాట్లాడ్తవూ?" అన్నాడు పిచ్చయ్య కాస్త కోపంగానే.

"నీ నెత్తి సీదాచేస్తే తెలుస్తది. ఎవరనుకున్నవ్?" అని పైకి ఉరకబోయాడు సింగ్. హుసేన్ చేయిపట్టుకుని లాగితే, పిల్లిలా వెనకడుగు వేశాడు గుడ్లురిమి పిచ్చయ్యవైపు చూస్తూ.

"కిరాయి యాడిదంటావేమయ్యా, జాగకు కిరాయి కట్టలేదా మీరు?" అడిగాడు హుసేన్.

బాలయ్యకు ఒళ్ళు మండింది. అయినా తమాయించుకున్నాడు. "అన్నా! కిరాయెన్నడు కట్టినమే మేము? సంగపు చందన్నరు. కట్టినం. ఇప్పుడెల్లలేదు. కట్టలేం. అందుకొచ్చినారు?"

"ఇగో, లడాయి వడాయి నక్కో. మూడునెల్ల కిరాయి గుడిసెకు పంద్రా ఇచ్చేయిరి, ఎళ్ళిపోతాం. ఎక్కి తక్కి మాట్లాడిన్రా – ఇగ మీరున్నరు, మేమున్నం, నా పేరెరికనా – మహమ్మద్ హుసేన్ పహెల్వాన్!"

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు గుడిసెలవాళ్ళు.

పిచ్చయ్య వళ్లు జల్లుమంది. బాలయ్యకూడా జంకాడు. అయినా, ధైర్యంగా అన్నాడు: "చందకోసం జబర్దస్తేంది. మర్జి ఉంటే ఇస్తం, లేకుంటే లేదు."

"చందేంది బే, బిచ్చమిస్తాన్నవా? జాగమీదుంటాను, కిరాయియ్యాలి. అఁ – ఇదంత నద్వద్ – ఏమనుకుంటున్నవో" అన్నాడు సింగ్.

"జాగేఁ ఉస్మాన్ సాబ్‌దా?"

"కాకుంటే నీ అబ్బదా?"

"జర సంబ్లాయించక మాట్లాడు" అన్నాడు పిచ్చయ్య.

"నఖ్రాలు చేస్తున్నావ్‌బే. హరామ్జాదే" అని పిచ్చయ్యమీదికి ఉరికాడు సింగ్. పిచ్చయ్యకూడా సిద్ధమై నుంచున్నాడు. పిచ్చయ్యకు సహాయంగా ఇద్దరు ముగ్గురు వచ్చి నుంచున్నారు. ఊపులో వచ్చాడు సింగ్. ముగ్గురు కలిసి వెనక్కు నెట్టారు. వెనక్కు పడిపోయాడు. అక్కడున్న పిల్లలంతా నవ్వారు. దులుపుకొని లేచి మళ్ళీ మీదికి ఉరకపోయాడు సింగ్. హుసేన్ అతని జబ్బ పట్టుకొని వెనక్కు లాగాడు. ఒక్క మొగ్గు మొగ్గి వెనక అడుగు వేసి స్థిరంగా నుంచున్నాడు సింగ్.

"నువ్వే మురవ్వత్ చూపిస్తాన్నవు. వీండ్లు...ఇట్ల ఇంటారు. నరమ్ చేయాలె నరమ్. ఛోడిబే పోయి ఉస్మాన్‌సాదిక్‌తో చెప్త, నువ్వు సుత వీళ్ళతోనే ఉండు" అని ఎగిరి జబ్బ విడిపించుకోవడానికి ప్రయత్నించి విడిపించుకోలేక రొప్పుతూ అక్కడే ఉండిపోయాడు.

"ఖాముష్, బక్‌బక్ నై" అని బాలయ్య నుద్దేశించి, "ఈ జాగ ఉస్మాన్‌సాబ్ పేరైంది. కాయితాలు సుతునై. సీద కిరాయిలిచ్చేయిరి. లేకుంటే ఒకడు బచాయించడు" అన్నాడు.

"సంగం పెట్టి బచాయిస్త నన్నడే ఉస్మాన్‌సాబ్?" బాలయ్యన్నాడు.

"అదంత నైజానై. ఉస్మాన్‌సాబ్ జాక్కొన్నడు. మీరు కిరాయి బాకి పడ్డరు. ఇప్పుడు లేదంటరా? ఎప్పుడిస్తరో చెప్పుని. ఎక్కొబైతంద్రు చూసిన్రా జోఁడ్లీలు బచాయించవ్. మీరు బచాయించరు. ఏమన్నా ఇన్నావున్నదా కిరా యియ్యమంటే ఎగనూకుత మంటరు."

బాలయ్య కుడితిలోపడ్డ ఎలికలా అయిపోయాడు. అంతా అయోమయంగా ఉందతనికి.

"ఎప్పుడిస్తరో చెప్పుని."

"ఇయ్యం" అన్నాడు పిచ్చయ్య.

"ఏమ్ దిమాగ్ గిమాగ్ ఫిరాయిస్తున్నాదిబే. చూస్త ఊరుకుంటే బడాయిస్తాన్నవ్. ఉస్మాన్‌సాబ్‌కు పుట్టినావ్‌బే. ఒక్క దెబ్బకు నెత్తి పగుల్తది – ఏమనుకున్నవ్?"

ఆ తిట్టు భరించలేకపోయాడు పిచ్చయ్య. బాలయ్య మండిపోయాడు.

"ఏంబే ఏమన్నవ్? కుయ్ మల్ల" అని పిచ్చయ్య హుసేన్ మీదికి ఉరికాడు. హుసేన్ కర్ర పైకెత్తాడు. వెనకనుంచి ఒకడు కర్ర లాగేయడంతో పిచ్చయ్య ఊపుతో హుసేన్ మీద పడ్డాడు. హుసేన్‌కు పట్టు దొరక్క క్రింద పడిపోయాడు. పిచ్చయ్య వాడిమీదపడి మెడ పట్టుకున్నాడు. పిచ్చయ్య మీదికి దూకపోయిన సింగ్‌ను నలుగురు కలిసి పట్టుకొని వెనక్కు లాగి, తలా ఒకటి బాదారు.

హుసేన్ రొమ్ముమీద కూర్చున్న పిచ్చయ్య రెండు చేతుల్తోనూ మెడపట్టుకుని ఊపి తల నేలకొట్టసాగాడు. హుసేన్ బలం తక్కువ వాడనికాదు. కాని, పట్టు దొరక్క అతని బలం తగ్గిపోగా, ఉద్రేకంలో పిచ్చయ్య బలం హెచ్చింది. గుడ్లు తేలవేయసాగాడు హుసేన్. బాలయ్య మిగతావాళ్లు వచ్చి విడిపించగా లేచి

నుంచున్నాడు హుసేన్. అతని గుడ్డలన్నీ పాడైనాయి. మెడమీద పిచ్చయ్య గోళ్ళుదిగి రక్తం వస్తాంది. చేత్తో రక్తం తడుచుకొని చూచుకున్నాడు. కర్ర అందుకోబోయాడు. బాలయ్య కర్రను అదిమిపెట్టాడు.

"సరే చూస్త" అని "రాబే సింగ్" అని సింగ్‌ను పిల్చుకొని బైల్దేరి, "ఈ జోప్డీల్నుంచి ఎల్లగొట్టకుంటే నా పేరు హుసేన్ కాదు" అన్నాడు కొంతదూరం పోయి వెనక్కు తిరిగి.

"పోబే హిజ్డే పో" అన్నారు గుడిసెలవాళ్ళు. మిర్రి మిర్రి చూస్తూ వెళ్లిపోయారు ఇద్దరు దాదాలున్నూ.

"అడు పైనున్నోడు. మనం గరీబోల్లం. గుండల్ను పంపించిండియాల. గుడిసెలు పీకిస్తడు రేపు. ఏందో ఇదంత మంచికొచ్చినాది?" అన్నాడొకడు.

"అరె ఎవడ్రా గట్ల బకాయిస్తాండు. పైనున్నోడైతే పల్లకెక్కి ఊరేగమను. పేదోల్ల మీద జులం చేస్తడా? ఉఖ్డాయిస్తడు; ఉఖ్డాయిస్తడంటే గుడెస్నె కాదు – నిన్ను కూడ ఉఖ్డాయిస్తడు. చూస్తం ఎట్ల పీకుతడో?" అని చేయి మలిచి కండ చూపించాడు ఒకడు.

"అన్నదార బలం. బలం ఉంటే నెత్తురు కూడు తింటావుర? వాని జాగలుంటవ్. వాన్నే కొడ్తనంటే. నాయముండాల్ర నాయం. వాడికి కిరాయన్నియ్యాలె. గుడిసెలన్న పీక్కోనిపోవాలె. అన్యాయం నిలుస్తాదిర, అన్నాయం! దరమరాజులోరు ఎన్ని కష్టాలు పడ్డాడు నాయంకోసం?" అన్నాడు ఒక వృద్ధుడు.

"ఒహో ఒహో! నీతులు చెపుతాండయ్య! గీ ముసలోళ్ళున్నరే అందరు గిట్లనే! జాగెవనిదో వాడికే ఎరికెలేదాయె. నేను పుట్టకముందు నుంచె ఉంటాన్నరాయె! అడి జాగైతే ఇన్నాళ్ళసంది ఎందుకురాడాయె? దొంగలు యాడికి చాలదు. బంగ్లమీద బంగ్ల కడ్తరు. గుడిసెలున్నోల్లే ఎల్లగొట్టేటందుకు చూస్తరు. ఏమన్న కానియ్యే బాలయ్యన్న, గుడిసె లొదిలెడ్డి లేదు" అన్నాడొక యువకుడు.

"ఈ లడాయిల నా కాలు వూడ్తది. యాణ్ణన్న ఏరే చూస్కుంట – నీ తల్లి – ఎవరికి పట్టిందిదంత" అని మెల్లిగా జారుకోవడానికి కదిలాడు పరమయ్య.

పట్టి లాగాడు పిచ్చయ్య. "ఏందో నఖ్రాలు చేస్తాన్నవు. నీ కాలు వూడ్తదని మా అందర్ని కొరత కేస్తవా? గూడెంనుంచి కదిల్నవో కాళ్ళిరక్కొడ్తం. ఏమనుకొంటున్నవో? చస్తే ఈడనే చావాలె. ఒరే పరిమిగా! మడిసి ఒక్కపాలె పుడ్తడు. ఒక్కపాలె చస్తడుర. ఎట్లెళ్ళ గొడ్తరో చూస్తం. రాబే నిలబడు. కొలువూడ్తే చంద చేసి ఇస్తం బే. కంజూస్ మా........" అన్నాడు. తరువాత అందరిని ఉద్దేశించి "బాలయ్య ఎట్లచెప్తె అట్ల చెయ్యాలె. చస్తే చస్తం. బతుకుతె బతుకుతం. ఏమంటవే బాలయన్నా?" అని అడిగాడు.

బాలయ్యకు అంతా అయోమయంగా ఉంది. రిక్షాకు బాకీ ఉంది. ఈ రోజు వాడు రిక్షా ఇస్తాడో లేడో తెలీదు. రాత్రి తిండి తినలేదు. ఇప్పటికి చాయ్ లేకున్నా, ఇంత గొడవ జరుగుతున్నా, పిల్లలు వీధిలో కూర్చొని ఒకరి నెత్తిమీద ఒకరు దుమ్ముపోసుకుని ఆడుకుంటున్నారు. చేతికందిన కొడుకు రామారావు లేచిపోయాడు. ఇవన్ని ఉండగా ఈ గుడిసెల పోట్లాట వచ్చింది. ఆ విషయంలోనన్నా

అందరూ కలిసికట్టుగా ఉన్నారా అంటే, ఒకడు కూటికి లాగితే మరొకడు కాటికి లాగుతున్నాడు. ఇద్దరు దాదాలు వచ్చేవరకు ఇలా నీరు కారిపోతున్న జనంతో ఎలా నెగ్గడం? ఏం చేయాలి? తోచలేదు.

పిచ్చయ్య చూచాడు. బాలయ్య గుండెలో వున్నబాధ అతనికి తెలుసు. ఊగిసలాడాడు అతనుకూడా. అయినా ధైర్యం తెచ్చుకొని, "బాలయ్యన్నా! ఇట్లా సోచాయిస్తే ఫాయిద లేదు. అడుగు ముందుకువేసినమా! అంతే! బతకాల్నంటే బయటపడొద్దె. నేనున్ననే. నా పానం అడ్డమేస్త. అఖరికి నతేజేమెల్లుతదొ ఎరికేనా?" అని పెద్ద క్వశ్చన్‌మార్కు వేశాడు.

బాలయ్య తేరుకున్నాడు. తన కష్టాల్ను మరిచాడు. పిచ్చయ్య లాంటివాడు తన వెంటనుండగా అగ్గిలోకైనా ఉరకవచ్చు ననుకున్నాడు. కళ్లలో దృఢ నిశ్చయం గోచరించింది.

"ఇగో చూడండి. సురుల్నే. పుల్లన్న కిల్లిచ్చిన్నాడే లడాయి సురు అయింది. ఉళ్ళల్ల నుంచి దొర లెల్లకొడ్తే పట్నమొచ్చినం. ఈడ కూడ బతకనిస్తలేరు. లడాయి సురు అయింది. దాదాలు వచ్చిర్రు. తోక ముడిచిపోయిర్రు. ఇప్పుడు గిట్ట మనం కిరాయిలిచ్చినమా తెల్లోరే సర్కోల్ల గుడెసె లూడపీకుతరు. మనమే పోయిన మనుకోరి. యాడున్నా ఆడ పీచా చేస్తరు. పట్నంల నుంచి ఎళ్ళకొట్టెదన్క నిద్రపోరు. ఈ జాగ వానిది కాదాయె. మనది కాదాయె. జగా దొచ్చిందనుకో వానికిస్తే నాయంగాని పరాయోనికిస్తే నాయం అయితాదె! ఈడి ఆటలు సాగనియ్యకుంటె నాయం చేసినట్లయితది. కలిసి కట్టుగుంటారే మరి?"

"ఉంటం" అన్నాయి గొంతులు ఒక్కుమ్మడిగా.

ధైర్యం వచ్చింది బాలయ్యకు. ఉత్సాహం పొంగింది. "ఈ దాద లియ్యాల్టితోటి పోయెటోల్లు కారు. మల్లొస్తరు. ఏ రాత్రికొస్తరో ఏ పగలొస్తరో తెల్వదు. హమేష తయారుగుండాలె. లాఠీలు తెచ్చి పెట్టుకోవాలె. ఎవనిమీద హమ్లా అయినా మందంత కలిసి కొట్టాలె. పానాల్తియ్యొద్దు. భగాయించాలె. ఒప్పుకుంటారా?" అడిగాడు.

"ఒప్పుకుంటం" – ముక్తకంఠంతో పలికారంతా.

"సరే. అయితే పన్లకు పోరి. వచ్చేటప్పుడు లాఠీలు పట్టుకొచ్చుకోరి" అన్నాడు బాలయ్య.

"బాలన్నకీ జై" అన్నారంతా.

ఈ విషయమే మాట్లాడుకుంటూ ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోయారు. కొందరు బాలయ్యను మెచ్చుకున్నారు. కొందరు పిచ్చయ్యను మెచ్చుకున్నారు. బాలయ్య చేసిన నిర్ణయాన్ని సహితం కొందరు విమర్శించారు. కాని, అంతా పోరాటానికి సిద్ధపడ్డారు.

మైసమ్మ బువ్వకుండా, కారంముద్దా తెచ్చి బాలయ్య ఇంట్లో పెట్టిపోయింది. పిచ్చయ్యా, బాలయ్యా ఆశ్చర్యపడి ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

★ ★ ★

# పదమూడు

సూరి సోఫాలో చేరగిలబడి సిగరెట్టు వెలిగించాడు. పక్కనే ఉన్న మ్యాగజైన్ తీశాడు. అది నగ్న యువతుల పటాలున్న ఆంగ్లపత్రిక. ఒక్కొక్కటే తిరగేస్తుండగా వెయిటర్ వచ్చాడు. శాల్యూట్ కొట్టి ఒక ఆల్బం అందించి మరొకమూలన కూర్చున్న బట్టతల ఖద్దరు ఆసామీ దగ్గరికి వెళ్ళాడు. అతడు పత్రిక ముఖానికి చాటు పెట్టుకొని చదవడానికి ప్రయత్నిస్తున్నాడు. వెయిటర్‌ను చూచి అతనివెంట వెళ్ళిపోయాడా ఖద్దరు సామి.

సన్నగా "ఐ లవ్ యు" అనే మాట వినిపిస్తూండగా ఆల్బం తిప్పుతున్నాడు సూరి. ఒక బొమ్మను చూచి క్షణంలో సగం చకితుడైనాడు. దీక్షగా చూచాడు అదే బొమ్మ. ఆ బొమ్మ అక్కడ ఉంటుందని అతడు ఊహించనైనాలేదు. క్రింద రాత చూచాడు. "డెయిజీ" అని వ్రాసి ఉండడమేకాక, ఆమె వయసూ, జాతి మొదలైనవి కూడా వ్రాసివున్నాయి. డెయిజీ ఇక్కడికి రావాల్సిన అవసరంలేదు. మైకేల్ మంచి మంచి గిరాకీలు సంపాదించగల దిట్ట. ఇక్కడికి ఎందుకు వచ్చిందీ అర్థంకాలేదతనికి. ఇంకా ఎన్నో ముఖాలు అంతకంటే అందమైనవి కనిపించాయి. వాటిల్లో ముసల్మానులు, హిందువులు, పారసీలు, ఇరానీలు, ఆంగ్లో ఇండియన్లు, గోవన్లు ఉన్నారు. అవన్నీ యువతుల పటాలు. సూరిని ఎంచుకోవలసిందిగా కోరుతూ వెయిటర్ అందించిన ఆల్బం అది.

అంతమంది ఉన్నప్పటికీ డెయిజీనే ఎంచుకున్నాడు సూరి. ఆల్బం అక్కడపెట్టి ఏదో ఆలోచనలో నిమగ్నుడై సిగరెట్టు పీల్చి పొగ వదలుతున్నాడు. అంతలో వెయిటర్ వచ్చి నుంచున్నాడు. "ఫార్టీవన్" అని చెప్పాడు. వెయిటర్ ఆల్బం తీసుకొని నలభైఒక్కటి తీసి చూచాడు. "మంచి సెలక్షన్ సార్, నిన్ననే వచ్చింది. భలే సరుకు" అని వెళ్ళిపోయాడు.

నలభై ఒకటవ నెంబరు గదిలో కిర్రుమని గంట మోగింది. మంచంలో పరుపుమీద బోర్లాపడుకొని దిండులో ముఖం దాచుకొన్న డెయిజీ తలెత్తి చూచింది. ఆకుపచ్చ బల్బు మూడుసార్లు వెలిగి ఆరిపోయింది.

కొంతసేపటికి తలుపు తెరుచుకుంది. సూరినిచూచి ముఖంలోని రక్తం మొత్తం దిగిపోయింది డెయిజీకి. 'గుడ్ ఈవినింగ్' అన్న సూరి మాటలు ఆవిడకు వినిపించలేదుగాని యాంత్రికంగా లేచి "గుడ్ ఈవినింగ్ సూరి!" అని చేయి అందించింది. సూరి కరస్పర్శ చేసిన మాట నిజమే కాని, కరస్పర్శవల్ల కలగాల్సిన ఆనందం కలుగలేదు. డెయిజీ చేతులు చల్లగా మంచులా ఉన్నట్లనిపించిందతనికి. ముఖం పాలిపోయింది. డెయిజీని ఎన్నుకొని పొరపాటు చేశాననుకున్నాడు. అయినా ఆవిడలో ఉత్సాహం కల్పించడానికి అన్నాడు: "రంభ, మేనక, ఊర్వశీ కూడా దుఃఖిస్తే స్వర్గం గతి ఏంకాను?"

డెయిజీ పేలవంగా నవ్వింది. విధిగా నవ్వాలన్నట్లుంది ఆ నవ్వు. సిగరెట్టు అందించాడు సూరి. యాంత్రికంగా అందుకుంది. సిగరెట్టు అంటించుకొని పొగ

ఊదుతూ మరొకసారి నవ్వింది డెయిజీ. ఆ నవ్వు మరీ కృత్రిమంగా అనిపించింది. సూరి చిరాకు పడ్డాడు. తాను ఇక్కడికి వచ్చింది వేడెక్కిన బుర్రకు విశ్రాంతి ఇవ్వడంకోసం. అమ్మాయిలతో హాయిగా నవ్వుతూ మాట్లాడి, వాళ్ళ కిలకిల నవ్వుల్లో అన్నీ మరిచిపోవాలని. డెయిజీని మంచి మూడ్స్‌లోకి తేవడానికి బెల్లుకొట్టి బ్రాందీ తెప్పించాడు.

గుక్క మింగుతూ అడిగాడు: "మిస్ డెయిజీ! ఏదో కాలుజారి ఆకాశం నుంచి అవనికి అవతరించిన అందాలరాశివి. నీ చిరునవ్వు కోసం నిఖిల సంపదలను నిలువునా దోచి ఇవ్వడానికి సిద్ధం అయ్యేవారు లక్షలమంది ఉన్నారు. అసలు నీవు ఉన్నావు కాబట్టే ఇంకా అందమూ ఆనందమూ ఉన్నాయి. నువ్వెందు కొచ్చావ్ ఈ కూపంలోకి?" అడిగాడు.

డెయిజీ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. జేబు రుమాలుతో తుడుచుకుని, "మిస్టర్ సూరి! నాలో మరో ప్రాణి మసలుతూంది" అన్నది.

వంట్లో ఉన్నరక్తం యావత్తూ జారి చీలమండల్లో చేరినట్లైంది సూరికి. ముఖం తెల్లబడిపోయింది. ఆకాశం నేలకూలినట్లూ, హిమాలయం కృంగిపోయినట్లూ, సముద్రం ఇంకిపోయినట్లూ, సూర్యచంద్రులు రాలిపోయినట్లూ అనిపించింది. ఏదో జరగరాని, జరగగూడని పని జరిగిపోయిందనిపించింది. స్త్రీకి ప్రాణమూ హృదయమూ ఉంటాయనే విషయం మన పూర్వీకులు అంగీకరించలేదు. ఆధునిక సాధారణ స్త్రీకి అవి ఉంటే ఉండచ్చనే విషయాన్ని అంగీకరించడానికి సిద్ధపడ్డారు కాని డెయిజీలాంటిది సహితం గర్భం దాల్చిందంటే ఎలా నమ్మడం? ఆవిడ అందరి చేతికి అందే ఆటబొమ్మలాంటిది. లేదా, ఆనందం ఇచ్చే యంత్రం లాంటిది. ఆవిడకు కడుపేమిటని ఆశ్చర్యం సూరికి.

"అదేమిటి డెయిజీ!" ఎంతో ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును విచిత్రమే. అయినా, అది వాస్తవం. మా మైకేల్ లేడూ?"

"మీ డాడీ!"

"వాడా! వాణ్ణి నిజంగా నా తండ్రిలా చూచాను. కాని, వాడు తండ్రి కాదు రాక్షసుడు అని తేలింది. వాడికి చెపితే నాలోని ప్రాణిని నాశనం చేస్తాడని చెప్పలేదు. మిస్టర్ సూరి! ఐ హ్యావ్ ఎ స్ట్రాంగ్ డిజైర్ టు బికమ్ మదర్. నేను ఆడదాన్ని! తప్పా ఆ కోరిక ఉండటం? నాకు పాప కావాలి సూరీ! నేను తల్లిని కావాలి. అందుకే ఆ రాక్షసునితో ఈ విషయం చెప్పలేదు. సుస్తీగా ఉందన్నాను. ఎక్కడికో వెళ్ళమన్నాడు. వెళ్ళలేనన్నాను. నానా బూతులు తిట్టాడు. నన్ను ఇంతదాన్ని చేసి చదివించినందుకు ఫలితం ఇదేనా అని ఏడ్చాడు. బతిమిలాడాడు. కాళ్ళు పట్టుకున్నాడు. మాట ఇచ్చి వచ్చానన్నాడు. నేను వినలేదు. ససేమిరా వెళ్ళనన్నాను. అతనికి కోపం వచ్చింది. కొట్టాడు. సహించుకున్నాను. కనీసం ఏడ్వలేదు. దాంతో అతనిలో కోపం ఎక్కువైంది. చావబాదాడు. సహించలేక ఏడ్చాను. ఏడుస్తే మరీ బాదాడు. గదిలో వేసి బయటినుంచి తాళంవేసి వెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళాడో తెలియదు."

"ఎవరికో ప్రామిస్ చేసి వుంటాడు బ్రూట్!"

డెయిజీ ఆ మాటలు వినిపించుకున్నట్లే లేదు. సాగిపోతూంది; "గదిలో

కూర్చున్నాను. వళ్ళంతా నొప్పులు. వంటి నొప్పులను లెక్కచేయలేదు. నేను గెలిచాను. అదే సంతృప్తితో అన్నీ భరించాను. ఆలోచించాను, ఏంచేయాలని? ఈ రోజు తప్పుకున్నమాట నిజమే కాని, మైకేల్ బారినుండి తప్పుకోటం సాధ్యమా? ఎంతకాలమని సుస్తీగా ఉందనే నెపం చెప్పగలను? తెలిసిందా, మైకేలు నాలోని ప్రాణిని బ్రతకనియ్యడు. వేరే ఎక్కడైనా ఉండిపోదామనుకున్నాను. కాని, ఎక్కడున్నా వస్తాడు మైకేలు. బ్రతిమలాడో, కాళ్ళు పట్టుకొనో, బెదిరించో తీసికెళ్తాడు. లేదా, తానే వచ్చి నా దగ్గర మకాం చేస్తాడు. ఏదైనా ఆశ్రయం దొరికితే బావుండు ననుకున్నాను. రాజారావు దగ్గరికి వెళ్ళాను. విషయం వివరంగా చెప్పాను. తన ఆశ్రయంలో ఉండనిమ్మన్నాను. 'గెట్ అవుట్' అన్నాడు."

రాజారావు చేసింది మంచిపనో, చెడ్డపనో నిర్ణయించుకోలేక పోయాడు సూరి. కాని, గ్లాసు ఖాళీచేసి "అంతపనీ చేశాడూ బాస్టర్డ్!" అనేశాడు. అన్న తర్వాత తనలోతానే ఆశ్చర్యపోయాడు. ఎందుకన్నాడో అర్థంకాలేదు.

డెయిజీ విచిత్రంగా చూచింది సూరి కళ్ళల్లోకి. అయినా, తనమీద సానుభూతితో ఆ మాటలన్నాడో, రాజుమీది అసూయతో అన్నాడో అర్థం కాలేదు. "నేను నమ్మిన రాజా నన్ను గెంటేశాడు. నేనెంత బాధ పడ్డానో చెప్పలేను సూరీ! తరువాత బాగా ఆలోచించాను. నా మెదడులో ఎన్నో పడకగదులు, ఎన్నో రూపాలు మెరిశాయి. వాటిలో బహుశః నువ్వుకూడా ఉండి వుంటావు. ఫ్రాంక్‌గా చెపుతున్నాను, నిన్ను ఆశ్రయించాలనే విషయం నాకు తోచలేదు. తరువాత అనుకున్నాను,. ఎవరు మాత్రం ఎందుకు ఆశ్రయమివ్వాలి నాకు? అని. నేను హృదయం యిచ్చానా ఎవరికైనా? ఎవరినైనా ప్రేమించానా? వ్యాపార వస్తువులా వారిదగ్గరకు వెళ్ళాను. కృత్రిమపు నవ్వులు నవ్వాను. డబ్బు తీసుకున్నందుకు మురిపించాను. వారూ నన్ను ఒక యంత్రంలా వాడుకున్నారు. నాటకం చూడ్డానికి ప్రేక్షకులు డబ్బిచ్చిపోతారు. నాటకం చూస్తారు. ఆనందిస్తారు. వచ్చేస్తారు – అంతే."

డెయిజీ సుమారు ఉపన్యాసం ఇస్తూంది. ఉక్కిరి బిక్కిరి అయినాడు సూరి. బ్రాందీ ఒక గుటక వేశాడు.

డెయిజీ గ్లాసు ఖాళీచేసింది. ఆవిడకు సిగరెట్టు కాల్చా లనిపించలేదు. బాధలు వినేవాడు దొరకాడని ఆనందించింది. తనకు సహాయం చేస్తాడని ఆశించనే లేదావిడ. అయినా, సూరి అందించిన సిగరెట్టు అందుకొని నోట్లో పెట్టుకుంది. సిగరెట్టు కాల్చి పొగ ఊదింది.

"నాది నీచమైన వృత్తి. ఈ వృత్తి దేశంలో ఉండకూడదంటున్నారు. కాని, దాన్ని నిర్మూలించడానికి ప్రభుత్వం ఏం చేస్తూందో నాకు తెలియదు. ఎవరూ సహాయం చేయరని నాకు తెలిసిపోయింది తరువాత ఆలోచించాను. ఈ సంఘం నన్ను ఒక విషపు పురుగులా చూస్తుంది. దూరదూరంగా ఉండాలనుకుంటుంది. జీవించే శక్తి ఉన్నా నన్ను జీవించ నివ్వటంలేదు మైకేలు. మైకేలుక్కావలసింది డబ్బు. నా శరీరాన్ని ముక్కలు ముక్కలుగా కోసి బజారులో అమ్మితే డబ్బువస్తే అందుకూ వెనుదీయడు. కాని, అది బంగారు గుడ్లుపెట్టే బాతును కోయడం. చేరదీయగలవాడూ, నన్ను మనసారా ప్రేమించినవాడూ ఒక్కడే ఉన్నాడు – జార్జి. జార్జిని నేను ప్రేమించాను సూరీ! జార్జి ఎంత మంచివాడంటే, ఈ పరిస్థితిలోనూ

నన్ను స్వీకరించగలడనే విశ్వాసం ఉంది నాకు. ఏం ఆశ్చర్యంగా ఉంది కదూ! కాల్ గర్ల్‌ను ప్రేమించేవారు సహితం ఉన్నారని! జార్జిని నాకు దక్కకుండా చేశాడు మైకేల్" అని జార్జి కథంతా వినిపించింది డెయిజీ.

"జార్జి ఎక్కడున్నాడిప్పుడు?"

"అది తెలిస్తే ఈ కథంతా నీకు చెప్పాల్సిన అవసరం ఉండేది కాదు. ఇక్కడ్నుంచి వెళ్ళిం తరువాత జార్జి ఉత్తరాలు కూడా వ్రాశాడనీ; మైకేలు, మా యజమాని వాటిని నాకు అందకుండా చేశారనీ తెలిసింది. నేను జార్జితో వెళ్ళిపోయి ఉండాల్సింది. పాపం, జార్జి నేనంటే ప్రాణమిస్తాడు. నేను అతణ్ణి ప్రేమించాను. ప్రేమ మొక్కలాంటిది. శిథిల హృదయంలో కూడా దాని పచ్చదనం వాడదు. అతణ్ణి ప్రేమించాననే పచ్చదనంతోనే జీవిస్తున్నాను. ఏముంది నాకీ లోకంలో? బ్రతికి చేయాల్సిందేమి? జీవితానికి లక్ష్యం ఏమి? ఉన్న వయసును, అందాన్ని, సొగసును అణా పైసల క్రింద మార్చుకుంటూ బ్రతకటం బ్రతకడమేనా? అందుకే చనిపోదా మనుకున్నాను. ఎలా చనిపోవాలని ఆలోచించాను. హుసేన్ సాగర్‌లో పడాలనుకున్నాను. అది బాగనిపించలేదు. పోలీసులు శవాన్ని బైటికి తీస్తారు. కట్టమీద వేస్తారు. వచ్చే పోయేవాడల్లా కడుపు చేసుకొని చచ్చింది అని తిడ్తారుకాని, సానుభూతి ఎవడూ చూపడు."

డెయిజీ ముఖంలో ఏదో విషాదం గోచరించి, ఆమె కళ్ళలో ఏదో బాధ కనిపించింది. చివరి వాక్యం విని చిరునవ్వు నవ్వుకున్నాడు సూరి. చావు తరవాత ఏముంది? ఎవడు చూచాడు తరువాత ఏముందో! అయినా, మనిషికి ఎంత ఆశ! ఆ చావు తరువాత సైతం తనకు అవమానం జరగరాదు, జనం తనను కీర్తించాలి. తనపేరు నిలిచి ఉండాలి. ఏమిటో పిచ్చి! ముందున్న గ్లాసు ఖాళీగా ఉంది. నింపుకున్నాడు. డెయిజీ గ్లాసు నింపాడు. సిగరెట్టు వెలిగించి "ఆ తరువాత?" అన్నాడు.

"చావడానికి నిశ్చయించుకున్నాను. ఎలా చావాలన్నదే ప్రశ్న. సూరీ! ఈ దశలో సైతం నా జార్జి వస్తే జీవించగలను. నేను అతనికి ఏమీ ఆనందం ఇవ్వలేకపోవచ్చు. నాలో మరొకని రక్తంతో పెరుగుతున్న బిడ్డ ఉండవచ్చు. అయినా, నన్ను పరిగ్రహిస్తాడు జార్జి. నాకా విశ్వాసం ఉంది సూరీ! అతడు వాస్తవంగా నన్ను ప్రేమించాడు. ప్రేమ హృదయానికి సంబంధించింది. కానీ, నాకా అదృష్టం లేదని తెలుసు. నేను పాపాత్మురాలిని. ఆ మేరీమాత కూడా నన్ను క్షమించదు. అమాంతంగా నాకు సైనాయిడ్ గుర్తుకు వచ్చింది. సైనాయిడ్ సాధించడం కష్టం. అయినా సాధించాను. ఆ రోజు చర్చికి వెళ్ళాను. ప్రతి ఆదివారం చర్చికి వెళ్తాను సూరీ! మైకేలు నన్ను వదిలి చర్చికి వెళ్ళాడు. అయితే, ఆ రోజు చర్చికి వెళ్ళడంలో నాకేదో పవిత్రత కనిపించింది. చర్చిలో కళ్ళు మూసుకొని మేరీమాతను ప్రార్థించాను. నన్ను క్షమించాల్సిందని వేడుకున్నాను. మేరీమాతను చూచి నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. 'తల్లీ! ఇది నా చివరి రోజు. రేపు నీ దగ్గరికి చేరుకుంటాను' అన్నాను. హృదయంలో దుఃఖం పొంగింది. కళ్ళలోకి నీళ్ళు వచ్చి నిలిచిపోయాయి. చర్చినుంచి ఇంటికి వచ్చాం. మైకేలు బట్టలు మార్చుకొని ఎక్కడికో వెళ్ళిపోయాడు. గదిలో చేరి తలుపు వేసుకున్నాను. బట్టలు మార్చాను.

కుర్చీమీద కూర్చొని మేరీమాత పటాన్ని టేబుల్‌మీద పెట్టుకున్నాను. బైబిల్ అందుకొని చదివాను. అప్పుడు నా హృదయం ఎలా ఉండిందో చెప్పలేను సూరీ! ప్రపంచం అంటే ఏవగింపు కలిగింది. ఇదంతా చీకటివలె కనిపించింది. చావు – అదే ముక్తి అనిపించింది. చావు తరువాత ఏదో వెలుగు కనిపిస్తుం దనిపించింది. ఎక్కడో దూరాన ఒక వెలుగు కనిపించినట్లైంది. నా శరీరాన్ని ఇక్కడే వదిలేసి, మెల్లగా అడుగులు వేస్తూ, ఆ వెలుగు వైపు పోతున్నట్లనిపించింది. సైనాయిడ్ తెచ్చి ముందు పెట్టుకున్నాను. మరు సెకండులో డెయిజీ ఉండదు. డెయిజీ దేహం పూడ్చబడుతుంది. డెయిజీని తల్చుకునే వాడెవడూ ఉండడు. సైనాయిడ్ అందుకున్నాను. డొక్కలోంచి ఎవరో, 'అమ్మా' అని పిలుస్తున్నట్లనిపించింది. ఒళ్ళంతా వణికింది. చేతులు వణికాయి. సైనాయిడ్ క్రింద పడిపోయింది. 'బిడ్డా' అని కేకపెట్టి టేబుల్‌కు ముఖం కొట్టుకున్నాను. ఎంతసేపు ఏడ్చానో తెలియదు. ఎందుకు ఏడ్చానో తెలియదు. సైనాయిడ్ ఎందుకు క్రింద పడిపోయిందో తెలియదు. ఏడ్చి ఏడ్చి కళ్ళు తుడుచుకున్నాను."

తనకు తెలియకుండానే సూరి జేబురుమాలును తీసి కళ్ళు వత్తుకున్నాడు. టేబుల్ మీద ఉన్న గ్లాసులు అలాగే ఉన్నాయి.

"ఆలోచించాను. ఇంత స్థిర నిశ్చయాన్ని పటాపంచలు చేసిందెవరు? 'అమ్మా' అన్న ఒక కేక. అదీ ఊహ. అవును. ఆ పిలుపు ఏదో ఒక కర్తవ్యాన్ని నాకు చూపింది. నా ముందున్న మేరీ తల్లే అలా అన్నదేమో! ఎంత హాయిగా ఉండిందా పిలుపు! అప్పుడు నేననుకున్నాను. నేను చనిపోయే హక్కు నాకు లేదు. నా బిడ్డను నేను చంపగలనా? ఛా! పాపం, బతకాలి. మళ్ళీ బతుకు మీద ఆశ జనించింది. నా కొక శిశువు జన్మిస్తాడు. వాడికి నేను తల్లిని అవుతాను. ఆ పాప నన్ను 'అమ్మా' అని పిలుస్తాడు. నేనా పాపను గట్టిగా రొమ్ముకు హత్తుకుంటాను. నా పాప పెద్దవాడౌతాడు. వాణ్ణి డాక్టర్ను చేస్తాను. అప్పుడు జనం ముక్కుమీద వేలేసుకుంటుంది. తెల్లనికోటు చేతపట్టుకొని స్టెతస్కోపు మెడకు తగిలించుకొని వస్తుంటే, జనం అంతా వాణ్ణి డెయిజీ కొడుకని వేలెత్తి చూపుతారు. ఎంత ఆనందిస్తాను నేను? ఎంత భవిష్యత్తుంది నాకు? అల్లాంటప్పుడు చావడం ఎందుకు? అని ప్రశ్నించుకున్నాను. అవును. చావకూడదు అని నిశ్చయించుకున్నాను."

"డెయిజీ! నీకు కలుగబోయేది ఆడపిల్లైతే?" అన్నాడు సూరి. ఎండమావులు చూచి పరిగెత్తి పరిగెత్తి ప్రాణాలు వదిలే లేడిలా కనిపించింది డెయిజీ అతనికి.

ఆ మాటలు విని వణికిపోయింది డెయిజీ. ఆమె కళ్ళల్లో నీరు నిండింది. ఆమె గొంతు బొంగురుపోయింది. "అలా అనకు సూరీ! నాకు మగబిడ్డ కలుగుతాడు. ఆడపిల్ల పుడుతుందనే ఆలోచన సైతం భరించలేను నా జీవితం చూచిం తరువాత."

పొరపాటు చేశాననుకున్నాడు సూరి. "క్షమించు డెయిజీ. నీకు మగపిల్లవాడే కలుగుతాడు. తరవాత ఏమైంది?" అడిగాడు. గ్లాసు వంక చూస్తే అది నిండి అలాగే ఉంది. ఒక్క గుటక వేశాడు. సిగరెట్టు వెలిగించి వినడానికి సంసిద్ధుడై కూర్చున్నాడు.

"ఏమైందంటున్నావా? ఏమి అవుతుంది? మామూలే. ఎప్పుడు జరిగేదే జరిగింది. నేను గదిలో ఉండగా మా ఇంటిముందు ఒక కారు ఆగిన చప్పుడైంది.

కిటికీలోంచి చూచాను. కార్లోంచి మైకేలు దిగాడు. అతని వెనుక ఒక యువకుడు దిగాడు. ఆ యువకుడు టై కట్టుకున్నాడు. కొద్దిగా మైకంలో ఉన్నాడు. అతణ్ణి చూచి నాకు ఏడుపు వచ్చింది. కాని, నిగ్రహించుకున్నాను. గుండె దడ దడ కొట్టుకుంది. మైకేలు అతన్ని ముందు వరండాలో కూర్చుండబెట్టి నా గది తలుపు తట్టాడు. తలుపు తీశాను. నా ముఖం చూచి నిర్విణ్ణుడైనాడు మైకేలు. కాని, క్షణంలో తమాయించుకున్నాడు. చిరునవ్వు నవ్వాడు. నేను ఎక్కడికీ వెళ్ళనన్నాను కాబట్టి ఇంటికే తీసుకొచ్చానన్నాడు. బట్టలు వేసుకొని సిద్ధంగా ఉండమన్నాడు. నేను ఒప్పుకోలేదు. బ్రతిమిలాడాడు. విన్నాడు కాదు. బెదిరించాడు, ఇంట్లోంచి వెళ్ళగొడ్తానని. అయినా, లొంగలేదు నేను. దెబ్బలు కొట్టాడు. అప్పటికీ వినలేదు. 'నీమీద సైతాను ఆవేశించింది. దింపుతా నుండు' అని తలుపువేసి బయటినుండి గొళ్ళెంపెట్టి వెళ్ళిపోయాడు. నేను ఏడుస్తూ కూర్చుండిపోయాను. యువకుడూ, మైకేలూ ఏదో పోట్లాడుకున్నారు. బహుశః డబ్బుకోసం తగాదా అయివుంటుంది. కొంతసేపటికి యువకుడు వెళ్ళిపోయాడు. మైకేలు కూడా వెళ్లిపోయాడు. 'నీవు లొంగలేదు. జయించావు' అన్నది నా మనసు. అవును, జయించాను అనుకున్నాను. మనసు తేలికైంది. మంచంమీద పడిపోయాను. బాగా అలసి ఉన్నానా - నిద్ర వచ్చినట్లైంది. నిద్రపోయాను.

"మైకేలు తలుపుతీసి గదిలో లైటు వేసి నన్ను లేపాడు. లేచిచూస్తే బాగా రాత్రి అయిపోయింది. నాముందు మైకేలు సైతానులా కనిపించాడు. మళ్ళీ ఏదో ప్రమాదం మూడుతుందని శంకించాను, 'లే! తయారుకా. బజారుకు వెళ్దాం, టాక్సీ తెచ్చాను' అన్నాడు మైకేలు. 'ఎక్కడికి?' అడిగా నేను. 'డెయిజీ! మంచిపిల్లవు, నిన్నింక వ్యాపారంలోకి దింపనుగా. అలా బజారుకు వెళ్ళివద్దాం. చూడు, ఎంత అలసిపోయావో' అన్నాడు మైకేలు. మైకేలు నాకు తండ్రి, అతడు నా నిశ్చయాన్ని అర్థం చేసుకున్నాడనుకున్నాను. సంతోషించాను. క్షణంలో తయారయి వచ్చేశాను. పొద్దుణ్ణుంచీ ఏమీ తినలేదు. ఆకలిగా ఉంది. ఇద్దరమూ హోటల్లో తిన్నాం. తరవాత ఇక్కడికి తీసుకొని వచ్చి దింపి వెళ్ళిపోయాడు. నా ఏడుపులు, ప్రార్థనలూ వమ్మైనాయి సూరీ! ఇదీ జేలుకంటే అధ్వాన్నమనుకో. అవసరాలన్నీ గదిలోకి వస్తాయి. ఇక్కణ్ణుంచి కదలడానికి వీల్లేదు. మరో ప్రపంచం ఉందనే విషయం ఇక్కడివారికి తెలియదు. పచ్చలైటు వెలిగింది. ఏం చేయాలో అర్థంకాలేదు. గుండె దడ దడ కొట్టుకుంది. నువ్వు వచ్చావు. కొంత ఊరట లభించింది. సూరీ! ఇదీ నా పాపపు కథ. ఇక ఆలోచించు. నామీద ఏమాత్రం సానుభూతి ఉన్నా నన్ను రక్షించు" అని సోఫామీద వాలిపోయింది డెయిజీ.

సూరి గ్లాసందుకొని రెండు గుటకలు వేశాడు. సిగరెట్టు పొగ వదులుతూ సోఫామీద తల వెనుకకు వాల్చి ఫ్యానువైపు చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు. ఫ్యాన్ తిరుగుతున్న ధ్వని తప్ప గదంతా మౌనంగా ఉంది. విన్న వాటన్నింటిని గురించీ ఆలోచించసాగాడు సూరి. అతనికి డెయిజీ మీద సానుభూతి కలిగిన మాట వాస్తవం. అతనిలోని మానవత క్షణక్షణానికీ డెయిజీని రక్షించమని పురికొల్పుతూంది. రక్షించాలి - నిజమే! అందువలన ప్రయోజనం ఏమి? మనిషిలోని వ్యాపారం

ప్రశ్నించింది. మానవత మేను వాల్చింది. వ్యాపారం తలెత్తింది. ఎంత ఆలోచించినా అతనికి ప్రయోజనం కనిపించలేదు. తటాలున ఒక మెరుపు మెరిసింది. ఏదో ఆలోచన వచ్చేసింది. ఉరుము ఉరిమింది. కుండపోతగా వాన మొదలైంది. ఫ్యాను ఉన్నా ఉక్కపోత మొదలైంది.

ఉస్మాన్‌తో ముఖం వాచేట్లు చీవాట్లు తిన్నాడు లక్ష్మిని - రజనిని - సాధించలేకపోయినందుకు. రజని ప్రపంచానికి రాజారావు రాజై కూర్చున్నాడు. డెయిజీతో సాధించవచ్చు ననుకున్నాడు.

"డెయిజీ!"

ఉలిక్కిపడి చూచింది డెయిజీ.

"డెయిజీ! నీ కథ విని నా హృదయం కన్నీరై కరిగిపోయిందనుకో. మట్టి గుండెలో సైతం మానవత కలిగిస్తుంది నీ కథ. నిన్ను ఆదుకోవడమూ అందలాల్లో ఉంచడమూ మానవమాత్రుని కర్తవ్యం. రాజారావు వట్టి మూర్ఖుడు. బండ. బాస్టర్డ్. ఇదిగో, నా చేయి అందిస్తున్నా అందుకో. లే! నాతో నడువ్. ఈ సూరి ఉన్నాడే - మహిళా సమాజానికి సేవ చేయాలనే దీక్ష బూనాడు ఈనాడు" అన్నాడు.

డెయిజీ సూరి చేయి అందుకుంది. ఇద్దరూ గది దాటారు. మెట్లు దిగారు. గుమ్మం దాటారు. వీధిలోకి వచ్చారు. కారెక్కి వెళ్ళిపోయారు.

★ ★ ★

# పధ్నాలుగు

"అరె ఆల్లింక బజన్లు చేస్తాన్రు. ఇంకో చప్టి కొట్టొద్దామెళ్ళండి." విసురుగా అన్నాడు రామమనోహర్ సింగ్.

ఉస్మాను, వస్తాదులు గూడానికి వచ్చి నాటినుంచి చాలా రాత్రి దాకా భజనలు చేస్తూ మెలుకువతో ఉంటున్నారు గూడెంవాళ్ళు. గూడెం వాళ్ళను బెదరకొట్టడానికి వచ్చిన గుండాలు దూరంగా ఒక గుంతలో కూర్చొని సమయానికై చూస్తున్నారు.

"పైకమేద్దిరా! ఖర్చుచేస్తిగద సొంతం. తాగేటాన్కి హద్దున్నాది? ఎంత తాగుతవ్ బే సింగ్?" అన్నాడు హుసేన్.

"దారెంతిచ్చిండు?" అడిగాడింకోడు.

"ఎంతిస్తే నీకెందుకుబే. పోయించిన. తాగినౌ. చెయ్యమన్నది చెయ్. బస్. బక్వాస్ బంద్."

"సగం కొట్టిండు కమీసన్." సింగ్ అంటించాడు.

"ఇచ్చిందెంతో చెప్పటాన్కి బుగులెందుకే?" అడిగాడు మరొకడు.

"మనం గరీబోల్ల నోరు కొడ్తాన్నం. మన నోరీ హుసేన్‌గాడు కొడ్తాండు. హుసేన్‌గాడి నోరు ఉస్మాన్‌గాడు కొడ్తాండు. ఉస్మాన్‌గాని నోరు కొట్టెటోడెల్ల లేడురా ఇయ్యాల్టికి."

"చుప్, ఎంటిబే బక్వాస్. పనిచేయాలె. పైసల్లేతు లేస్కోవాలె. ఎందుకుబే లబ్‌లబ్ ముహి ఖరాబ్" అన్నాడు హుసేన్. దాదాల్లో పొరపులు వస్తే తన అస్తిత్వానికి భంగం అని గ్రహించాడు హుసేన్. "అబే సాలే! కామ్‌హోనే దే బే ఏక్ నైదో చప్టి లగానా" అన్నాడు.

"అట్లను దాదా! ఇదో తయార్" అని రెట్టమీద చేయి చరిచాడు వస్తాదు మనోహర్‌సింగ్.

"అగా చూసినవా? బజన బందైంది. గుడిసెల్లోకి పోతాన్రు బద్మాషులు" అన్నాడొకడు.

"బైఠో అభీనై. అందర్నీపోని. ఆధా ఘంటా" అన్నాడు. హుసేన్.

భజన ముగించి ఎవరి గుడిసెల్లోకి వారు వెళ్ళిపోయారు.

అరగంట గడిచింది. బాలయ్య తప్ప మిగతావారంతా నిద్రపోయారు. హుసేన్ "నిక్లో" అని సైగచేశాడు. చీకట్లో బైల్దేరింది నిశాచర వర్గం. కొంతదూరం వచ్చి చెదిరిపోయారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క గుడిసెముందుకు వెళ్ళారు. దుడ్డు కర్రల్తో తలుపుల్ను బాదసాగారు. "రండిబే. మంది జొగల్ల ఉంటార్ర! ఎళ్ళండి మొగోళ్ళైతే....తడాఖా తెలుస్తది ఉస్మాన్ సాబ్‌ది. మీ పెళ్ళాలను....అక్కల్ను....అమ్మల్ను..." వాగేస్తున్నారు గుండాలు. విచ్చలవిడిగా బాదేస్తున్నారు తలుపుల్ను, తడకల్ను.

ప్రతి గుడిసెలోనూ కలకలం బైల్దేరింది. అంతా అయోమయంగా ఉంది. ఒకరి విషయం ఇంకొకరికి తెలియడం లేదు. ఈలోగా పెద్ద కేక వినిపించింది. అది పొలికేక. అది పిచ్చయ్య వేసినకేక – "కొట్టండి!"

అమాంతంగా అన్ని తలుపులూ, తడకలూ తెరుచుకున్నాయ్. ప్రతి గుడిసె ముందున్న వాని ముఖాన కారపు నీళ్ళు కొట్టారు ఆడవాళ్ళు. దుడ్డు కర్రలు తీసుకొని బైటికి వచ్చారు గుడిసెలవాళ్ళంతా.

వస్తాదుల కళ్ళలో కారం పడింది. కళ్లు మండుతున్నాయ్. అంతా చీకటి. అయోమయం. ఎటుపోయినా దెబ్బలు పడుతున్నాయి. పరుగెత్తబోయి ఒకరినొకరు గుద్దుకున్నారు. వాళ్ళల్లో వాళ్ళే కొట్టుకున్నారు. తల మీద ఎవర్నీ కొట్టవద్దనే బాలయ్య ఆదేశాన్ని అంతా పాటించారు. కాళ్ళమీదా, వీపులమీదా చావబాదారు. కకావికలై పారిపోయారు వస్తాదులు. వెంటబడి తరిమారు గుడిసెలవాళ్ళు. కొంతదూరం తరిమిం తరువాత తిరిగి వచ్చేయమన్నాడు బాలయ్య.

అంతా ఒకచోట కూడారు. బాలయ్యను ఎత్తుకొని "బాలన్నకూ జై" అంటూ గుడిసెల వద్దకు వచ్చి బాలయ్య ఇంటిముందు కూడారు.

"పైనున్నాడితో లడాయి ప్రాణం మీదికొస్తది. ఆకు ముల్లుమీద పడినా ముల్లు ఆకుమీద పడినా నుఖ్సాన్ ఆకుకే అయితదే. నేననేడి దేదంటే – ఉస్మాన్‌కు కిరాయ కడ్డం. చూసింద్రుకద. ఇయాల గుండా లొచ్చిర్రు. రేపు పోలీసులొస్తరు. సర్కార్ వాల్లదే గదనే. మనం ఏం చేస్తం?" అన్నాడు పుల్లయ్య.

"అబ్బే! ఆడికెందుకు కట్టాల్నురా, జాగేమన్న వాని తాత దనుకున్నావా? బెదిరించి అదిరించి జాగ మింగాల్నని చూస్తాండు. నెలకైదు మనమే కూడేద్దం, నెలకు పాంచ్ సౌ జమైనది!" అన్నాడు పిచ్చయ్య.

"ఏం చెప్పినవే పిచ్చయ్యన్న. అయిదు కాదు పదిస్తం" అన్నాడొకడు.

జనంలో గుసగుసలు బైల్దేరాయి. పది రూపాయలు ఒక్కసారి ఎవడిస్తాడు? అందరూ సాధ్యపడదని తేల్చుకున్నారు. "బువ్వకు లేనోళ్ళు పది యాణ్ణించిస్తరే. అయిదియ్యటమే ఎక్కువాయె. ఆడికిస్తే చాలు" అన్నాడు మరొకడు.

"కిరాయి కట్టాల్నె. నువ్వే మన్నను నేనైతే కడ్త" అని తన నిశ్చయం చెప్పి లేచి నుంచున్నాడు పుల్లయ్య.

"ఎనకొచ్చిన కొమ్ములే తేజున్నయ్‌రో" అన్నాడొకడు.

"ఏమన్న మరి. మీరియ్యకుంటే నేనైతే కడ్త" అని లేచాడు పుల్లయ్య.

"యాడికిబే పోతవ్. కిరాయి కడ్తడట! కిరాయ్! వచ్చిండు తీస్‌మార్‌ఖాం" అని లాగి కూర్చోపెట్టాడు పిచ్చయ్య. "నఖ్రాల్జేస్తే లాతుకొట్టి ఎళ్ళకొడ్త గుడిసెల్నుంచి" అన్నాడు.

పుల్లయ్యకూ కోపం వచ్చింది. కాని, మింగాడు. "ఎళ్లకొడ్తే నువ్వెట్లుంటవో నేను చూస్త" అన్నాడు.

"గదే బే నేననేడిది. ఉంటే అందరముండాలె. పోతే అందరం పోవాలె. ఒక్కణ్ణిపోయి కిరాయి కడ్తనంట వేమ్రా?"

"అనుకుంటె కట్టండి కిరాయి. నేనైతే పోను వాడి తానికి. అందరిస్తే నేనుగూడిస్త. గంతే" అన్నాడు బాలయ్య. "చావండిర కొడుకులు" అని పళ్ళు పటపట కొరికాడు పిచ్చయ్య. "కిరాయి కట్టుకోండి, హుసేన్ సాగర్ల పడుండి" అని, "రాబే బాలయ్యన్న, పోదం" అని బాలయ్యను లాక్కుపోయాడు.

పుల్లయ్య వీరుడైనాడు. ఇక అతణ్ణి అడ్డేవారు ఎవరూ లేరు. పరమయ్య అతనికి తోడైనాడు.

"పైసున్నోడితోని లడాయంటే దిల్లకా? ఆడు పైస గుమ్మరిస్తడు. మనతాన యాడున్నది పైకం? నిద్దర్లు లేవాయె. కాపలాలు కాస్తుంటిమి. అట్లయిన వచ్చిన్రా గుండాలు. ఇగ పోలీసుల్ను తెస్తడు. యాడికిపోతం? యాడికి పోయినా కిరాయియ్యాల కదనే. గందుకే చెప్తాన్న. అని కాళ్ళు కడుపులు పట్టుకుందం. మనకేం తప్పేదా? ఎట్లనన్న చేస్తం. కష్టమైతే తప్పుతది గద....ఏమంటరు?" అన్నాడు. అందరూ సరేనంటే సరే అన్నారు. డబ్బు వసూలు చేసి ఇస్తే పుల్లయ్యా, నరసయ్యా వెళ్లి కట్టిరావాలని నిశ్చయించబడింది.

తెల్లారి పదిగంటల సమయం. గుడిసెముందున పందిట్లో మంచం మీదపడి "న్యూసాంగ్స్" చదువుతున్నాడు దీర్ఘాలుతీస్తూ పిచ్చయ్య. తనను పిల్చినట్లనిపించి తలెత్తి చూస్తే పోలీసు కానిస్టేబుల్ వచ్చాడు. పుస్తకం మడిచి లేచి కూర్చున్నాడు పిచ్చయ్య. పోలీసు సలాం చేశాడు. పిచ్చయ్య ప్రతి నమస్కారం చేసి పోలీసును మంచంమీద కూర్చోబెట్టాడు.

"కనిపిస్తలే వేమన్న ఇయ్యాల్రేపు?" అడిగాడు పోలీసు.

"అగ్గా ఎన్నడు కండ్లబడకపోతి? దినాం నాకతానికొస్తనే ఉంటిని."

"నేనే బీమారయిన్లే. రుక్సతు మీదుంటి. సరేగని, దొరపిల్చిండు. తోల్కరమ్మన్నడు."

"యేం కత? ఖాన్ మాటున్నదా?"

"నేనెట్ల చెప్పు? అరె, పొయ్యి పిచ్చయ్యను పట్కారా అన్నాడు. నేను వచ్చిన."

"శీన్వసరావుకు పైన మీదా శేందన్న. ఏమ్ కొడ్తాండనుకున్నవ్. రెండు బంగ్లలుండెనో ఉన్నయా, మొన్న మల్లొక బంగ్ల కట్టిండు కద. అగ్గా ఎరికెనో లేదా నీకు? జవాన్లతో సుత రాళ్ళు మోపించుండే. ఎప్పటికీ పదిమంది జవాన్లుంట రింటిమీద. లెస్స ఎట్టిసేయిస్తడనుకో. చెప్పకుంటే నంమగాని చీరెల్బుత ఉతికిస్తడే. సరేగాని, జల్దెల్లు, మల్ల గరమైతడు."

చొక్కా వేసుకొని బైల్దేరాడు పిచ్చయ్య.

"నాస్తకు సుత పైసల్దొరకలేదే ఇయ్యాల" అన్న పోలీసు కిషన్ మాట విని గ్రహించాడు పిచ్చయ్య. తిన్నగా హోటలుకు నడిచాడు. తిన్నంత తిని తేన్చాడు పోలీసు. పిచ్చయ్య బిల్లు చెల్లించడానికి లేచినప్పుడు, "పిచ్చయ్యన్న! పోరలు లడ్డుండలని ఏడుస్తాన్రే; నేనేమొ కాయిలవడ్డనా – తేలేకపోయిన. నాల్గు లడ్లిప్పిస్తే కొనపోతింటికి" అన్నాడు. పిచ్చయ్యకు ఒళ్ళుమండింది. పోలీసు అప్పటికే ప్యాకింగు కూడా చేయించుకొని వచ్చేశాడు. విధిలేక బిల్లుచెల్లించి బైటికి రాగానే కిళ్లీకొట్టుకూ వెళ్ళి డబుల్ పాన్, రెండు "చార్‌మినార్" పెట్టెలూ, అగ్గిపెట్టె పుచ్చుకొని సిగరెట్టు కాల్చి బైల్దేరాడు రక్షకభటుడు.

"నట్టెట్ల నడుస్తాందే" అడిగాడు పిచ్చయ్య.

"నట్టకేం ధూమ్‌గ నడుస్తోందిగని, మనమే అందరైతాన్నం."

"అగ్గా! గట్లకాకుంటే నీకొస్తాది? గదంత మార్వడోండ్లకే. నే నడిగేడ్డి మామూళ్ళొస్తున్నాయా అని."

"ఇంకాడి మామూళ్ళిరే. దొరలకే మింగెటందుక్కు చాల్తలేవ్. మాకాడికొస్తాయ్? సరేగాని, గుడిసెల్లేమో గడిబిడైందట గదవే?"

వివరాలన్నీ చెప్పాడు పిచ్చయ్య.

"గుడిసెల్ల కూడుండకుండ చేస్తాన్రులే. గరీబోల్లు బతికేడ్డే కష్టమై పోతాంది. గుండాల హడ్డీ సరమ్ చేయకపోయినారు?"

"చేస్తే మీరొచ్చి మమ్మల్నే పట్కపోతరు గద!"

"పోలీసోల్లను గరీబులకోసం కాదు భై - అమీర్లకోసమే పెట్టింది సర్కార్."

ఈలోగా పోలీసు స్టేషన్ వచ్చేసింది. శ్రీనివాసరావు ముందుకు వెళ్ళి "ఠక్"మని సలామ్ కొట్టాడు కానిస్టేబుల్.

"అబే భంచత్, ఇంతసేపాబే? ఏడిబే పిచ్చిగాడు?" అడిగాడు శ్రీనివాసరావు.

"పట్టుకొచ్చిందొరా!"

"ఏడివాడు? పొగరెక్కిందిరా జవాన్లకు."

"జీ సర్కార్!" అని వెళ్ళి పిచ్చయ్యను ప్రవేశపెట్టి నుంచున్నాడు కానిస్టేబుల్.

పిచ్చయ్య నమస్కరించాడు. "ఏంబే సాలే, పిచ్చిగా! తేరీ మాఁకీ నఖ్రాలు చాల చేస్తున్నవట, ఏం?" అని ఉరిమాడు శ్రీనివాసరావు.

ఏమీ అర్థంకాలేదు పిచ్చయ్యకు. గుడ్లప్పచెప్పి చూశాడు.

"మాట్లాడవేంబే మాదర్‌చత్" అని కానిస్టేబులు నుద్దేశించి "ఇక్కడేం గానాబజానా అవుతుందనుకున్నావా? నికల్‌బే సాలే" అన్నాడు శ్రీనివాసరావు.

లా అండ్ ఆర్డర్ పోలీసు - నిష్క్రమించాడు.

"ఏం మాట్లాడ్త దొరల ముంగల?"

"బతికేది జేబులు కొట్టి. లీడరీ చేస్తున్నావుట కదర లీడరీ!"

"పెద్దపెద్దోలు లీడరైతరు. మేమైతాం దొర? బుట్టఫకీరోల్లం. మీ మెహర్బానుంటే బతుకుతం. లేకుంటే చస్తం."

"బాలిగాడెవడ్రా. వాడు లీడరీ చేస్తున్నాట్ట. నువ్వేమో మద్దతు ఇస్తున్నావుట?"

"బాలయ్య....." అని చెప్పబోయాడు పిచ్చయ్య.

"బాలయ్య! బాలిగాడనుబే. వాడేమైనా దొరైపోయాడనుకున్నావా? వాడి చమ్డాలు వలుస్తా."

ఈ పరిణామం పిచ్చయ్య అనుకున్నదికాదు. కాస్త తికమకపడ్డాడు.

"రిక్షా నడిపిస్తడుండి."

"గుడంబ అమ్ముతాడట. జేబులు కొడ్తాడట. నాకు తెల్సుబే. నలుగురు చూడ్డానికి రిక్షా తొక్కుతాడు."

"కాదుండి. బాలయ్య నిప్పుషువంటోడు. గుడంబ తాగనన్న తాగడు. అమ్మట మాడిదుండి? బాలయ్య దొంగతనం చేస్తే దున్యనిలువదుండి."

"ఓహో! నీకూ ఏమైనా భాగం ఉందా అందులో."

"కాద్దొరా! సత్తెం చెపుతాన్నా. బాలయ్యన్న నిప్పండి."

"అయితే ఏమిరా! ఈ శ్రీనివాసరావు నిప్పునుకూడా పట్టేస్తాడ్రా! సరేగాని, గుడిసెలోదిలి వెళ్తామంటారా బొక్కలో తొయ్యాల్నా?"

పిచ్చయ్య వళ్ళు మండింది. అయినా నిగ్రహించుకున్నాడు. "ఏం తప్పు చేసినని నూకతరుని. పుట్టిందాడనే, పెరిగిందాడనే. చస్తే ఆడనే చస్తంగని, పొమ్మంటే యాడికి పోతమ్రని?" ఎంత నిగ్రహించుకున్నా ఆవేశం ఆగింది కాదు.

"అబే పిచ్చిగా! నీ వ్యవహారాలన్నీ నాకు తెలుసురా! బొక్కలోకి తోస్తినా బతికుండగా మళ్ళీరావు. పెళ్ళాం పిల్లలు అడుక్కు తినాల్సొస్తుంది. ఆలోచించుకో. అయినా ఉస్మాన్ జాగా మీకెట్లా అవుతుందిరా?"

"ఉస్మాన్ తాతదానుండి ఆ జాగ? సంగమని పెట్టిండు, చందాలు మొదలుపెట్టిండు. గిప్పుడేమో జాగ మింగేటందుకే తయారైతాండు."

"అబే, నోరు కొవ్వెక్కిందిరా! కోరి చావు నెందుకు తెచ్చుకుంటార్రా? ఉస్మాన్ దగ్గర కాగితాలున్నాయి. కోర్టులో సైతం నిరూపించగలడు. మీరు కోర్టులకేం తిరుగుతార్రా? అయినా, మీ తల్లులు ఉస్మాన్ దగ్గర పడుకుంటే పుట్టార్రా మీరు....."

భరించలేకపోయాడు పిచ్చయ్య. కాళ్ళూ చేతులూ వడికాయి. కళ్లు నిప్పులు కురిశాయి. ఏ తిట్టయినా భరించగలడు కాని, మాతృమూర్తికి సంబంధించిన తిట్టు భరించలేకపోయాడు.

"ఏమన్నవుబే సాలె? మీ అమ్మ అటువంటిదేమో! మా అమ్మనే అంటవుబే" అంటూ దూకాడు. చొక్కాపట్టుకొని శ్రీనివాసరావు (సర్కిల్ ఇనెస్పెక్టరు)ను లాగాడు. అమాంతంగా లేచాడు శ్రీనివాసరావు. ఊపాడు పిచ్చయ్య. పిచ్చయ్యను లాగికొట్టాడు శ్రీనివాసరావు. కళ్ళు తిరిగినంత పనైంది పిచ్చయ్యకు. కాని, తేరుకున్నాడు. అతనూ అంటించాడొకటి.

శ్రీనివాసరావు కేకవేశాడు.

టక టకా బూట్ల చప్పుడైంది.

అనేకమంది పోలీసులు వచ్చారు.

పిచ్చయ్యను పట్టుకున్నారు.

శ్రీనివాసరావు ఆ చెంప ఈ చెంపా వాచేట్టు కొట్టాడు పిచ్చయ్యను. కానిస్టేబుల్ దగ్గరి కర్ర లాక్కొని బాదాడు. పిచ్చయ్య వాంతి చేసుకున్నాడు. పడిపోయాడు.

"గాడిదకొడుకును లాకప్‌లో వేయండి" అని చెప్పి, గబగబా వెళ్ళిపోయి స్కూటర్ స్టార్ట్ చేశాడు శ్రీనివాసరావు.

హెడ్ కానిస్టేబుల్ పరిగెత్తాడు శ్రీనివాసరావు దగ్గరికి. "లాకప్‌లో చస్తడేమో సార్!" అన్నాడు.

"చావనీ లంజాకొడుకును" అని వెళ్ళిపోయాడు సర్కిలినస్పెక్టర్ లా అండ్ ఆర్డర్ శ్రీనివాసరావు.

★ ★ ★

# పదిహేను

"నమస్కారమండీ. నాపేరు రాజారావు. కంట్రాక్టరును" తనను తానే పరిచయం చేసుకున్నాడు చీఫ్ ఇంజనీరు జగన్మోహనరావుకు.

రాజారావు హైద్రాబాదు తిరిగి వచ్చేవరకు వ్యవహారాలన్నీ అస్తవ్యస్తం అయినాయి. నారాయణరావుగారు విపరీతంగా అప్పులు చేశారు. కంట్రాక్టులు పెరిగాయి. కాని లాభాలు లేవు. పైగా లెక్కలు నష్టాలు చూపెడుతున్నాయి. ఏ విషయమూ అర్థం కావడంలేదు. ఎవరి లోపమో తెలుసుకోలేక పోతున్నాడు. చాల చికాకులో ఉండగా, తికమక పడుతుండగా చీఫ్ ఇంజనీర్ ఇనస్పెక్షనుకు వచ్చాడని వార్త అందడంతో పరిగెత్తుకుని వచ్చాడు.

"ఓహో, మీరాండి కంట్రాక్టరు! చాల చక్కగా పని చేయిస్తున్నారండీ!" వెటకారంగా అన్నాడు జగన్మోహనరావు.

"ఈ మధ్య నేను నగరంలో లేనండీ. సరేగాని చంద్రయ్యా! ఏమిటలా చూస్తూ నుంచున్నావ్? దొర నుంచొని ఉన్నారు, కనిపించడంలా? కుర్చీలు వేయించు నీడకు. కాఫీలు తెప్పించు. రండి జగన్మోహనరావుగారూ, కూర్చుందాం. సిగరెట్టు కాలుస్తారా? ఇదో సిగరెట్టు."

"థాంక్స్. క్షమించండి నేను సిగరెట్టు తాగను. కాఫీ పుచ్చుకోను. ఇది నా డ్యూటీ. మీరు అతిథి సత్కారం చేయాల్సిన అవసరం లేదు. నాకు కావలసింది పని – కాఫీ కాదు." అని సిమెంటు స్టోరుకు సీలు వేయవలసిందని ఆజ్ఞాపించాడు తన పనివారికి.

"తాము డ్యూటీమీద వచ్చారు. ఆ విషయం తెలుస్తూనే ఉంది. అయినా కర్టసీ అనేది ఒకటి ఉంది కదండీ. మర్యాద చూపడం మా కర్తవ్యం. నీడకు కూర్చొని కాఫీ పుచ్చుకోండి. తరవాత మీరు చేయదలచుకున్నదే చేయండి."

రాజారావు చెప్పిన మాటలు వినిపించుకున్నట్లే లేదు జగన్మోహనరావు. "రూఫ్ మెటీరియల్ పరీక్ష చేయించాలి. తవ్వి తీయించండి. నాకు చాల పనులున్నాయి. వెళ్ళాలి. అవును రాజారావుగారూ! మీరు చదువుకున్న వారని విన్నాను. ఇంజనీరింగ్ పట్టా సైతం పుచ్చుకున్నారట! ఇంత అన్యాయం అవుతే ఎలా చెప్పండి? సిమెంటులో బలపపుపొడి కలుపుతే కట్టడం నిలుస్తుందా? ప్రజల సొమ్మును ఇలా దుర్వినియోగం చేస్తే దేశం ఎలా బాగుపడుతుంది, చెప్పండి? రెండవ ప్రపంచ యుద్ధంలో సర్వనాశనం అయిపోయిన జపాను, జర్మనీ దేశాలను చూడండి. బ్రహ్మాండ పునర్నిర్మాణ కార్యాలు జరిపి, ఇతర దేశాల తల దన్నేశారు అప్పుడే. ఇరవై రెండు సంవత్సరాలైంది మనకు స్వాతంత్ర్యం వచ్చి. అధోగతి తప్ప పురోగతి లేదాయె. మీలాంటివారే ఇలాంటి పనులకు దిగుతే దేశం ఏం బాగుపడుతుంది, చెప్పండి?"

ఉపన్యాసం విని ఉక్కిరి బిక్కిరి అయినాడు రాజారావు. సన్యాసి కావల్సినవాడికి చీఫ్ ఇంజనీర్ పదవి యిచ్చినందుకు ప్రభుత్వాన్ని తిట్టాడు.

"మిస్టర్ జగన్మోహనరావ్? మీకు నా విషయం తెలియనట్లుంది. కొత్తగా వచ్చారు, పాపం. మంత్రులకు మాతో పనిపడని రోజంటూ లేదు. నా నిజాయితీని గురించి వారికి తెలిస్తేచాలు. ఈ మధ్యనే తుఫాను సహాయనిధికి యాభైవేలిచ్చాను. ఉచితంగా ఒక స్కూలు కట్టించి యిచ్చాను. ఆస్పత్రిలో ఒక వార్డు నా పేరనే వుంది. నా సహాయం లేకుండా ఎన్నికైన ఎమ్మెల్యే ఒక్కడులేడు ఈ నగరంలో. అలాంటి నేను కల్తీ చేశానంటున్నారు. సీలు వేస్తానంటున్నారు స్టోరుకు. అది మాది కానే కాదంటాను. ఏం చేస్తారు? మీరు లంచం అడిగారు, ఇవ్వకుంటే కేసు బనాయించానంటాను – ఏంచేస్తారు? రూఫ్ మెటీరియల్ పరీక్షిస్తామంటున్నారు. తెల్లవారేవరకు ఈ రూఫ్ కూల్చి కొత్తది వేయిస్తాను. లక్ష పారేస్తాను. అది నాకు లెక్కలోనిదికాదు. మీరు నన్నేదో చేయగల్గుతాననుకుంటున్నారు. అది వట్టి భ్రమ. ఈ కల్తీలో పెద్దవారి దగ్గరనుంచి చిన్నవారిదాకా అందరి వాటాలు వున్నాయి. ఇది ఒక కో–అపరేటివ్ ఎంటర్ప్రైస్. మీరు నన్ను ఒక్కణ్ణే నిందించి ప్రయోజనం లేదు."

రాజారావు ఉపన్యాసం శాంతంగా విన్నాడు జగన్మోహనరావు. అదివిని అదిరిపోతాడనుకున్న రాజారావు ఆశలు, అడియాసలైనాయి. పైగా చిరునవ్వు నవ్వాడతను "మిస్టర్ రాజారావ్! మీరు ఎంత గొప్పవారో ఇప్పుడు నాకు తెలిసింది. అయినా నేను డ్యూటీ నిర్వర్తించాల్సిందే. మీరు గొప్పవారని తెలిసే పోలీసులను కూడా రమ్మన్నాను."

"పోలీసులు" అనే పదం విని గుండె జల్లుమంది రాజారావుకు.

ఆ విషయం గ్రహించే ముగించాడు. "పోలీసులు వస్తూనే వుండాలి. వారు పంచనామాచేసి హస్తగతం చేసుకుంటారు. తాము బెదిరిస్తున్నారు. కాబట్టి మెజిస్ట్రేటును కూడా రమ్మంటాను. నాకు ఈ విషయంలో ద్వేషంలేదు. దేశానికి మేలు చేయాలనుకునే వాళ్ళల్లో నేను ఒకణ్ణి. మీరు బలవంతులు, నా ఉద్యోగం ఊడగొట్టారా? అందువల్ల నాకు నష్టంలేదు. అదీ దేశానికే నష్టం."

డబ్బుకు లొంగనివాడంటూ ఉంటాడని రాజారావు కనీసం ఊహించలేదు. అతనికి డబ్బు విషయంలో చింతలేదు. కాని, అపఖ్యాతిని గూర్చి భయం పట్టుకుంది. డబ్బు ఆశచూపి లొంగతీద్దామనుకున్నాడు. జగన్మోహనరావును పక్కకు రావలసిందని పిలిచాడు. అతను నిరాకరించాడు. అయినా, బేరం పెట్టాడు. 50 వేల నుంచి 3 లక్షలదాకా. కాని, ఫలించలేదు. లంచం తీసుకోవడమేకాక ఇవ్వడం కూడా ఒక నేరమేనని, లంచం ఇవ్వజూసిన నేరంలోకూడా రాజారావును ప్రాసిక్యూట్ చేయించవచ్చుననీ అన్నాడు జగన్మోహనరావు.

రాజారావుకు జగన్మోహనరావు విషయంలో ఉండిన ద్వేషం మాయం అయింది. అతని నిజాయితీ రాజారావును ఆశ్చర్యంలో ముంచింది. ఒకవైపు భయంతో వణికిపోతున్నాడు. మరొకవైపు సిగ్గుతో కుంచించుకు పోసాగాడు. అతని కోపం దుఃఖంగా మారింది. గొంతుక డగ్గుత్తుక పడింది. తాను చేస్తున్నది మోసం అని,

ద్రోహం అనీ గ్రహించాడు. కాని, ఈ పనికి తానొక్కడు మాత్రమే కారణం కాదనీ ఈ విషవలయంలో తానొకభాగం మాత్రమేనని వివరించడానికి ప్రయత్నించాడు. టెండరు వేసినప్పణ్నుంచీ గుమాస్తాలకు ఇవ్వాల్సిన లంచాల్నుంచి ఇన్‌స్పెక్షన్‌చేసి అది సరిగ్గా వుందని రాసేదాకా ఇంజనీరు వరకూ ఇవ్వాల్సిన లంచాలను గురించి వివరించాడు. ఇందులో అట్టే మిగలదనీ తనను రక్షించవలసిందనీ ప్రాధేయపడ్డాడు.

జగన్మోహనరావుకు అతని విషయంలో జాలి కలిగింది. సానుభూతి కూడా కలిగింది. రాజారావును వదిలేస్తే ఆ విషవలయం విచ్ఛిన్నం కాదు. ఈ ప్రయత్నంలో తన ఉద్యోగం ఊడినా ఊడవచ్చు. తాను అమెరికాలో చదువుకున్నాడు. విదేశాలు పర్యటించాడు. రష్యాకు వెళ్లాడు. అక్కడి ఆర్థిక విధానం అతనికి నచ్చింది. డబ్బు సర్వాన్ని సాధించగలదనే భావన ఆ సమాజంలో లేదు. అన్ని దేశాలు చూచి, అక్కడి పరిస్థితులను అధ్యయనం చేసి తనదేశం కూడా బాగుపడాలని, అందుకు తాను కృషి చేయాలని నిశ్చయించుకున్నాడు. కాని, తనకు ప్రమోషను రాలేదు. తనకంటే జూనియర్లకు ఎంతో మందికి ప్రమోషన్లు వచ్చాయి. తనతోటివారు అనేకమంది కెనడాలోను, అమెరికాలోనూ, ఇంగ్లాండులోనూ స్థిరపడిపోయారు. లక్షలు సంపాదించారు. తానూవెళ్తే లక్షలు సంపాదించగలిగేవాడే. కాని, స్వదేశంలో వుండి జన్మభూమికి సేవ చేయదలచుకొని వుండిపోయాడు.

తనను గుర్తించినవాడు లేడు. సూపర్వైజర్లు లక్షలు సంపాదించారు. తాను వచ్చిన జీతంతో సంతృప్తి చెందుతూ తన విధులను నిజాయితీగా నిర్వహిస్తున్నా న్యాయంగా తనకు రావాల్సిన ప్రమోషను సైతం రాలేదు. కోర్టులో కేసుపెట్టి సాధించాడీ ప్రమోషనును. మంత్రులకు మస్కాకొట్టే జూనియర్ ఇంజనీర్లు బాగుపడిపోతున్నారు. ఆ విషయం తనకు తెలుసు. అయినా తానా పనిచేయలేదు. ఈ కేసులో మంత్రులు సహితం రాజారావు పక్షం వహించినా ఆశ్చర్యంలేదు. తాను ఒంటరిగా పోరాడాలి. తోడివారు తనను "మూర్ఖుడు" అంటారు. అన్నా పరవాలేదు. తాను మంచిపని చేస్తున్నాననే సంతృప్తి తనకు వుంటుంది. ఈ కేసులో తన ఉద్యోగం ఊడుతే ఇక ఈ దేశంలో ఉండి ప్రయోజనంలేదని నిశ్చయించుకున్నాడు. ఒక స్థిర నిశ్చయానికి వచ్చేసి రాజారావుతో చెప్పేశాడు: "రాజారావుగారూ! మీ విషయంలో నాకు సానుభూతి ఉంది. అది వ్యక్తిగా మీమీద నాకు కలిగిన సానుభూతి. ఇంజనీరుగా నేను నిర్వహించవలసిన విధులున్నాయి. వాటిని నేను వదులుకోలేను."

పోలీసు వ్యాను వచ్చేసింది. రాజారావు గుండె జల్లుమంది. వ్యానులోంచి శ్రీనివాసరావు దిగాడు. కొంత ధైర్యం వచ్చింది. ఎదురు వెళ్ళాడు. శ్రీనివాసరావు కృతజ్ఞకమైన చిరునవ్వు నవ్వి కరచాలనం చేశాడు. "ఏం కనిపించడంలేదే, బుల్బుల్ ఎలా ఉంది? పార్టీలో కూడా కనిపించడం లేదు. పరారైనావా ఏం?" అడిగాడు.

"అబ్బ నీ హాస్యానికి అంతులేదోయ్!" అది హాస్యం కాదనీ, ఆ మాటల వెనక ఏదో నాటకం ఉందనీ తెలుసు రాజారావుకు. అయినా "పార్వతి మగబిడ్డను కన్నది" అన్నాడు శ్రీనివాసరావు మీరిపోకుండా ఆకట్టడానికి.

"కంగ్రాచ్యులేషన్స్. అయితే పార్టీ ఉందన్నమాట. పరేగాని ఏమీ వ్యవహారం?"

శ్రీనివాసరావుని లాక్కుపోయాడు రాజారావు. జరిగిందంతా వివరించాడు.

ఏదోవిధంగా పరువు కాపాడే పద్ధతి చూడమన్నాడు. శ్రీనివాసరావు బాగా ఆలోచించాడు. శ్రీనివాసరావు రాజారావుకు క్లాస్‌మేట్. ఇద్దరూ ఒరే అంటే ఒరే అని పిలుచుకునేవాళ్ళు. ఇద్దరూ ఎవరివృత్తిలో వారు ప్రవేశించాక పూర్వపు ఆ స్నేహం ఆట్టేలేదు. ఉభయులూ వ్యాపార పద్ధతిలోనే ఆలోచిస్తున్నారు. రాజారావును ఈ గండం నుంచి తప్పించి పుణ్యం కట్టుకుందామనే ఆలోచన శ్రీనివాసరావుకు లేదు. ఆ మాటకొస్తే ఏ పోలీసువాడికి ఉండదు. రాజారావు ఘనంగా ముట్టజెపుతాడని తెలుసు. అందుకే అతనంత దీర్ఘంగా ఆలోచించాడు. కాని, అతని కేమీ ఉపాయం తోచకపోగా "జగన్మోహనరావు విషయం నీకు తెలియదు. కర్కోటకుడు. దేవుడు దిగివచ్చినా వినేబాపతు కాదు. అతడు వచ్చినప్పణ్ణుంచీ అనేక కేసులు పట్టేశాడు ఇలాంటివి. కంట్రాక్టర్లంతా మేలుకున్నారు. నీకెలా తెలియకుండా ఉందీ విషయం?"

"నేను పట్నంలో లేకుంటేనిగా? ఎలా తెలుస్తుంది? ఇలాంటి ఖచ్చితమైన వాళ్ళుంటే మాకూ మంచిదే."

"చంద్రయ్య ఏదో మోసం చేశాడని నాకు అనుమానంగా ఉంది. అందరికీ జగన్మోహనరావును గురించి తెలిసినపు డతనికి తెలియకుండా ఉంటుందా? చేయాలనే చేశాడని నాకు అనుమానం. పోలీసువాణ్ణికదూ?"

రాజారావు ఆలోచించాడు. శ్రీనివాసరావు చెప్పిందానిమీద అతనికి నమ్మకం కుదరసాగింది. కాని, చంద్రయ్య ఇలాంటి ద్రోహం తలపెడ్తాడని కలలోనైతం అనుకోలే దతను. చంద్రయ్యను పీక నులిమి చంపెయ్యా లనిపించింది. కాని చంద్రయ్యకు తన రహస్యాలన్నీ తెలుసు. అతణ్ణేమన్నా అన్నాడంటే మునుగుతాడు.

"చంద్రయ్యకూడా స్వంతంగా కంట్రాక్టులు తీసుకుంటున్నాడు, తెలుసా?" అడిగాడు శ్రీనివాసరావు.

ఆశ్చర్యం వ్యక్తపరచాడు రాజారావు. ఇంతలో ఒక కానిస్టేబుల్ వచ్చి శాల్యూట్ కొట్టి చీఫ్ ఇంజనీర్ పిలుస్తున్నాడని చెప్పాడు. శ్రీనివాసరావు రాగానే రూఫ్ తవ్వించడానికి వెళ్ళాడు జగన్మోహనరావు. ఆ పని పూర్తికాగానే అతణ్ణి పిలిపించాడు.

"వస్తున్నా పద" అని కానిస్టేబుల్‌ను పంపించేసి "ఏం, ఏం చేద్దామంటావు?" అడిగాడు రాజారావును.

అంతసేపణ్ణుంచీ అనవసరం అయిన ఆలోచనల్లో మునిగిపోయామనే విషయం గుర్తుకు వచ్చింది రాజారావుకు. "సరే, ఒకపని చెయ్యి. కొద్దిగా ఆలస్యం మాత్రం చెయ్యి. నేనిప్పుడే వస్తా"నని కార్లో వెళ్ళిపోయాడు.

రాజారావు నేరుగా మంత్రి దగ్గరికి వెళ్ళాడు. స్నేహంగా పలకరించాడు. రాజారావు తానిచ్చిన విరాళాలూ, చేసిన ఉపకారాలూ ఏకరవు పెట్టి, తనకు సహాయం చేయాల్సిందని కోరాడు. మంత్రిగారు తన నిస్సహాయత వ్యక్తపరచాడు.

జగన్మోహనరావు ఉన్నప్పుడు తానేం చేయలేనన్నాడు. మంత్రిగారి ఎన్నికలకు చందా మాత్రమే కాక తన మనుషులు కాపుసారాయి అందజేసిన విషయం వర్ణించి, చెడామడా మాటలు వినిపించి వచ్చేశాడు రాజారావు – ఇక ఏమైనా ఎదుర్కోవాలనే స్థిరనిశ్చయంతో. ఒక్క నీతిపరుడు ఎంత మందిని గడగడ లాడిస్తున్నాడు!

స్థలానికి వచ్చేవరకూ అతనిలో ఉన్న భయం, నీరసం అన్నీ జారిపోయాయి. అతని వదనంలో దృఢ నిశ్చయం కనిపించింది. రావడం రావడమే "జగన్మోహనరావుగారూ, కానివ్వండి. అన్నింటికీ సిద్ధంగా ఉన్నాను. న్యాయానికీ ధర్మానికీ ఎంతబలం ఉందో నేనూ పరీక్షిస్తాను" అన్నాడు.

జవాబుగా ఉపన్యాసం ఇవ్వదలచలేదు జగన్మోహనరావు. చిరునవ్వు మాత్రం నవ్వాడు. తన పనిలో తాను నిమగ్నుడైనాడు. అయిదు నిమిషాల్లో పంచనామా వగైరా జరిగింది. "లాట్"లో అప్పగించడానికి పోలీసు వ్యానులోనే వెళ్లిపోయాడు జగన్మోహనరావు.

చింతచెట్టు నీడన వాలుకుర్చీలో కూలబడ్డాడు రాజారావు. జగన్మోహనరావు, పోలీసులు నిష్క్రమించారు. తండోపతండాలుగా కూడిన జన సమూహం చెదిరిపోయింది. వారు వెళ్ళిపోయినా వారు చేసిన వ్యాఖ్యానాలు ఇంకా తలలో రింగుమంటూనే ఉన్నాయి. తుఫాను తరువాత ఏర్పడిన ప్రశాంతతలా ఉంది. భయంకరంగా ఉంది. భరించరానట్టుంది.

రాజారావు మనసులో మనసులేదు. అతనికి ఎన్ని ఆలోచనలు వచ్చాయో చెప్పలేం. భయంకరమైనవి. మనిషి చేయరానివి, చేయలేనివి కూడా వచ్చాయి. రజని అతని మనోఫలకంమీద వెలిసింది. ఆవిడ చిరునవ్వులో అతడు మునిగిపోయేవాడు. కరిగిపోయేవాడు. లోకం మరచేవాడు. అది పూర్వస్థితి, నేడు ఆమె చిరునవ్వు అతనికి వెక్కిరింతగా కనిపించింది. కృతకమైనదిగా కనిపించింది. వికటంగానూ, వికృతంగానూ కనిపించింది. రజని-పూర్వపు లక్ష్మి. ఇక్కణ్ణే ఆమె పడింది. దానితోపాటు తననూ లాగింది. పాతాళంలోకి తోసింది. దీనంతటికీ రజనే కారణం అనుకున్నాడు. ఆవిడ లేకుంటే తాను పట్నం వదిలేవాడుకాదు. ఈ దుష్పరిమాణాలు కలిగేవికావు. రజని రాక్షసిలా కనిపించింది. రజనిని గెంటెయ్యాలనుకున్నాడు. గెంటెయ్యాలి. కాని, ఎక్కడికి? ఎక్కడినుంచి?

పాప కనిపించాడు. వాని చిన్నచేతులు, కాళ్ళు, పసిడి నవ్వు క్షణం ఆనందాన్నిచ్చాయి. ఇంతలో అనుమానాలు వచ్చాయి. బుడుతడు భూమిమీద పడుతూనే కష్టాలు కొనితెచ్చాడు. కొందరు పుట్టుకతోనే సంపదలు తెస్తారట! కొందరు ముళ్ళ పొదలతో పుడతారట! పచ్చని సంసారానికి చిచ్చుపెట్టాడు వెధవ. మళ్ళీ ఎందుకో తన పాప అలాంటివాడు కాడనుకున్నాడు. అయినా, జాతకం చూపించాలనుకున్నాడు. అంతవరకూ లేని కొత్త నమ్మకాలు కలిగాయి. మనిషి అశక్తుడైనప్పుడు గ్రహాలు శక్తివంతాలౌతాయి.

అసలు చంద్రయ్యేనేమో వీటన్నింటికీ కారణం? చంద్రయ్య నిక్కరుతో తట్ట మోసేందుకు తన దగ్గరికి వచ్చాడు. తాపీ పని వాడైనాడు. తరవాత కోటు తొడిగి, టోపీ తగిలించి మేస్త్రీ అయినాడు. నమ్మకస్తుడని అన్నీ అతనికి అప్పగించాడు తాను. తన రహస్యాలలో అతనికి తెలియనివంటూ లేవు. నారాయణరావు చేసిన అప్పులకు కూడా చంద్రయ్యే కారకుడయ్యాడు. తనను నిలువునా ముంచాలని చూస్తున్నాడా? ఏం చేయాలి చంద్రయ్యను? పిలిపించాడు చంద్రయ్యను.

ఉద్రేకంగా మాట్లాడాడు. చెడమడా తిట్టాడు. ఎన్ని మాటలన్నా నిన్నటివరకూ తల వంచుకొని విన్న చంద్రయ్య తిరుగుబాటు ధోరణిలో మాట్లాడాడు. రోడ్డు

వేయించకుండా కాజేసిన డబ్బును జగన్మోహనరావు కక్కించాడన్నాడు. డబ్బు తిన్న కౌన్సిలరు మన్నుతిన్న పామైనాడన్నాడు. ఒకరికోసం ఎముకలు నుసి చేసుకోవడం వలన ప్రయోజనం లేదని తేల్చుకున్నాననీ, తానూ కంట్రాక్టులు చేస్తున్నాననీ చెప్పడమే కాక నారాయణరావుకు అప్పులు ఇప్పించింది తానేనని కూడా స్పష్టం చేశాడు.

రాజారావు కాళ్ళక్రింది నేల జారిపోసాగింది. అణచి ఉంచాల్సిన స్ప్రింగు మీదినుంచి కాలు జారినట్టనిపించింది. కోపంతో మండిపడ్డాడు. తన చేతికింద బాగుపడినవాడే తన నెత్తికి ఎక్కుతున్నా డన్నాడు. తెల్లవారి వచ్చి లెక్కలు అప్పచెప్ప మన్నాడు.

చంద్రయ్య గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. అగ్గిలో ఆజ్యం పోసినట్లయింది రాజారావు స్థితి. కుర్చీలోంచి లేచాడు, లాగి చంద్రయ్యను నాలుగు బాదాలని. కాని, కుర్చీలో కూలబడ్డాడు. చంద్రయ్య వెళ్ళిపోవడాన్ని నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు.

రాజారావు కుర్చీలోంచి లేచాడు. కారెక్కాడు. స్టార్టు చేశాడు. గమ్యం లేకుండా కారు సాగిపోతుంది. ఆ రోజు అతను వెళ్ళని మిత్రుడు, బంధువు అంటూ లేడు. అతనిని ఆదుకుంటా నన్నవాడు ఒక్కడూ లేడు. రజని విషయంలో అతను అందరికీ దూరం అయినాడు. అయినా, ఒక్కడూ ఆ విషయం ప్రస్తావించలేదు.

అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః!

రాజారావు పిచ్చి స్పీడుతో సాగిపోతున్నాడు. అతడు ఎక్కడికి పోతున్నదీ అతనికి తెలియదు. పోలీసు విజిల్ విని చూస్తే ట్రాఫిక్ సిగ్నల్ చూడకుండా వచ్చేశాడని గ్రహించి బ్రేక్ వేశాడు. పోలీసువాడు సలాం కొట్టాడు. అది దీపావళి మామూలు సలాం అని అతనికి తెలుసు. చూస్తే బషీర్‌బాగ్ చౌరాస్తాకు వచ్చేశాడు. కారు వెనక్కు తీసుకొని లైనులో నుంచోబెట్టాడు. పచ్చలైట్లు వస్తే సాగించాడు. వెంటనే అతనికి నౌబత్ పహాడ్ స్ఫురణకు వచ్చింది. అక్కడికే పోనిచ్చాడు కారు.

నౌబత్ పహాడ్ మీద ఉద్యానం నిర్మింపచేసినవాడు మహమ్మద్ ఖులీ ఖుతుబ్‌షా (1580–1611). దండోరా వేసి అక్కడినుంచి రాజాజ్ఞలు ప్రకటించబడేవట. ఔరంగజేబు తన సైన్యాలను దింపినచోటు దాని ప్రక్కనున్న ఫతేహ్ మైదాన్. తన విజయ చిహ్నంగా దానికా పేరుపెట్టాడు పాదుషా.

కారు దిగి చరచరా మెట్లెక్కుతున్న రాజారావుని చూచింది డెయిజీ. వెంటనే ఆమెలో ఒక విద్యుత్తు ప్రవహించింది. ఏదో కోల్పోయిన వస్తువు కనిపించినట్లయింది. పక్కనే ఉన్న సూరికి చూపింది. ఇద్దరూ చూస్తూ నుంచున్నారు.

రాజారావు మెట్లెక్కి మంటపంలో చేరాడు. నగరంలో దీపాలు వెలిగాయి. చుక్కల్లా మిలమిలా మెరుస్తున్నాయి. నగరం ప్రశాంతంగా కనిపించింది. అందంగా కనిపించింది. సుందరంగా ఉంది. రోజూ చూచేదానిలో కూడా ఒక్కొక్కప్పుడు వింత సోయగం గోచరిస్తుంది. దానిలో లీనం అయినవానికి మరోవిషయం గుర్తుకు రాదు. ఆనందం లాంటిది కలుగుతుంది. అలాంటిదేదో ఒక క్షణంపాటున కలిగింది రాజారావుకు. అదే సౌందర్యంలో ఉన్న ప్రత్యేకత. అదే అందంలో ఉన్న మహత్తు.

భుజంమీద ఎవరిదో చేయిపడితే ఉలిక్కిపడి చూచాడు రాజారావు. సూరి! వళ్ళు జల్లుమంది. లేచి నుంచున్నాడు. ఇద్దరూ ఒకరి నొకరు చూస్తూ నుంచున్నారు క్షణం. ఇంతలో డెయిజీ వచ్చింది. చిరునవ్వు నవ్వింది. జవాబు రాలేదు రాజారావునుంచి. ప్రతిమలా నుంచుండిపోయింది.

"హలో రాజారావ్! లేడిలా ఎగురుతూ, పూవులా నవ్వేవాడివి పాషాణంలా మారిపోయావేమి? గ్రహాలను, ఉపగ్రహాలను సైతం బంతుల్లా కాళ్ళతో తన్నేవాడివి ఇలా ఉన్నావేమి? ప్రళయం రానున్నదా? సముద్రం ఇంకనున్నదా? నౌబత్ పహాడ్ కూలనున్నదా?" అన్నాడు సూరి.

హాస్యం అసహ్యం అనిపించింది రాజారావుకు. రెండు మహాసర్పాలు ఎదుట నిలిచినట్లనిపించింది. తన విషయం వీరికి చెప్పడమా? అని ఆలోచించాడు. ఎందరికి చెప్పలేదు? ఏ పుట్టలో ఏ పాముందో అనుకొని "బ్రదర్ సూరీ! ప్రళయం నెత్తిన కూలింది" అని కథంతా ఓపిగ్గా వినిపించాడు.

ముగ్గురూ మంటపంలో కూర్చున్నారు. కోకాకోలా చప్పరిస్తున్నారు. ముగ్గురూ దీర్ఘాలోచనలో ఉన్నారు. రాజారావు కథ విని డెయిజీ వాస్తవంగా క్షోభపడింది.

"ఏ దశలో ఉంది కేసు?" అడిగాడు సూర్యారావు.

"అనాలిసిస్ కోసం లాబ్‌కు తీసికెళ్ళారు."

మళ్ళీ ఆలోచనలో మునిగిపోయాడు సూరి. అమాంతంగా ఏదో ఉపాయం స్ఫురించినట్లు "రాజ్! దొరికింది ఉపాయం. డెయిజీ సహాయం చేస్తానంటే పని జరిగిపోయినట్లే" అన్నాడు.

రాజారావు ప్రాణం లేచివచ్చింది. డెయిజీ వైపు చూచాడు. ఆ చూపులు దీనంగా ఉన్నాయి. ఏదో యాచన ఉంది వాటిలో.

డెయిజీ కనులు చెమ్మగిల్లాయి. "నేను దేనికైనా సిద్ధమే" అన్నది జీరపోయిన గొంతుతో.

రాజారావు కరిగిపోయాడు. "డెయిజీ! ప్లీజ్ హెల్ప్‌మీ" అని చేతులు పట్టుకున్నాడు.

డెయిజీ తలవంచుకుంది. కన్నీరు చెక్కిళ్ళదాకా వచ్చింది. "అయామ్ హియర్ ఫర్ యూ, డోంట్ వరీ" అన్నది. ఆమె గొంతు బొంగురుపోయింది.

"నేను సర్వదా రుణపడి ఉంటాను మిస్ డెయిజీ!" అన్నాడు రాజారావు.

"ఏమి ఈ మాత్రానికి రుణాలూ, గుణాలూ అంటున్నావు. పని అయిపో యిందనుకో. పద మందుకొడ్దాం, విచారం విరిగిపోతుంది. ఈల కొట్టుకుంటూ ఇంటికి వెళ్దువుగాని."

ముగ్గురూ నయాగరాకు వెళ్ళారు. ముగ్గురూ త్రాగారు. కాని ఇద్దరు ఒకదోవన, రాజారావు మరొక దోవన వెళ్ళిపోయాడు.

రాజారావు మళ్ళీ తాగాడు. అతని మెదడు మొద్దుబారింది. ఏదో మరో ఆనందంకోసం అర్రులు చాచింది. రజని అతనికి గుర్తుకు రాలేదు. మహబూబ్‌కీ మెహెందీకి చేరాడు.

నగరంలో గానాబజానా ఇంకా నిలిచివున్నది మెహెందీలోనే. కారు దిగగానే పాటలూ, వాద్యాలూ స్వాగతం పలికాయి రాజారావుకు. ఒక ఇంటివైపు నడిచాడు.

గుమ్మంముందు పూలమాలలు అమ్ముతున్న కుర్రాళ్ళు కనిపించారు. పూలదండలు కొనుక్కుని లోన అడుగుపెట్టాడు.

ఒక ఇంట్లోకి ప్రవేశించాడు. రాజారావు. గుమ్మం దగ్గర పూలమాలలు పట్టుకొని ఒక కుర్రాడు నుంచున్నాడు. "మాలలు కావాలా?" అని అడిగాడు. ఎందుకో ఏమిటో అర్థం కాలేదు రాజారావుకి. అయినా, రెండుమాలలు కొనేశాడు రెండు రూపాయిలిచ్చి.

గదిలోని తివాచీ మీద తెల్లని చలవచేసిన గుడ్డ పరచి ఉంది. గోడకు బాలీసులు అమర్చి ఉన్నాయి. రసికులు బాలీసులకు ఆనుకుని కూర్చున్నారు. హాలు నిండుగా ఉంది. వారి ఎదుట ఒక యువతి కూర్చొనివుంది. ఆవిడ అందంగానే ఉందనాలి. తలలో పూలున్నాయి. మెడలో హారాలున్నాయి. ఉచ్చైస్వరంతో పాట పాడుతూంది. "సాయినారా" వెనక తబలా, హార్మోనియం వాయించే వారున్నారు. వాయిద్యాల ధ్వని ఆవిడ పాటను మించిపోతూంది.

ఆవిడ రాజారావును చూచింది. పాట ఆపకుండానే కుడిచేయిని మొగ్గలాచేసి గడ్డంవదాకా పోనిచ్చి సలాంచేసి స్వాగతం పలికింది. కొందరు సర్దుకొని అతనికి చోటిచ్చారు. రసికుల్లో ఒకడు పైజామా ధరించి, భుజంమీద అల్లకం పనిచేసిన లాల్చీవేసుకొని కూర్చున్నాడు. కనులు ఎర్రగా ఉన్నాయి. తలమీద ఉండాల్సిన లక్నవీ టోపీ మడిచి జాగ్రత్తగా పక్కన పెట్టుకున్నాడు. ఎడమ కాలు మడిచి నేలకు ఆనించి ఉండగా కుడిపాదం నేలమీద నిలిచి మోకాలు వరకు మడిచి కూర్చున్నాడతను. కుడి మోకాలు మీద కుడి మోచేయి ఆనించి చేయిచాచి ఉంచాడు. అతని ముందు రూపాయిల కట్ట ఉంది. ఎడంచేత్తో ఒక రూపాయి తీసి ముందు వేశాడు. గాయిక ఆ స్థలం నుంచి లేచివచ్చి అతని ముందు కూర్చొని ఒక చరణం చదివి లేవబోయింది. మళ్ళీ రూపాయి వేశాడు.

రూపాయి వేసినప్పుడల్లా ఒక చరణం చదువుతూందామె. తుదకు లేవబోయింది. రెండు మోకాళ్ళు నేలకానించి కొద్దిగా లేచి ఆవిడ చేయిపట్టుకొని కూర్చోపెట్టడానికి ప్రయత్నించాడు. ఆవిడ ఎర్రని కళ్ళతో చిరుబురుమని చూచింది. జేబులోంచి మరొక రూపాయి నోట్ల కట్టతీసి బయటపడేశాడు. ఆవిడ అతని ఎదుట కూర్చుంది. అతడు బుగ్గ గిల్లబోయాడు. చాకచక్యంగా చేయి దూరంగా జరిపింది. అతడు రూపాయి కాగితాలు చిటికెన వేలుపెట్టి మిఠాయి పొట్లంలా చుట్టి ఆవిడ సిగలో దూర్చసాగాడు. ఆవిడ సిగనిండా రూపాయి కాగితాలైనాయి. పూలదండల కుర్రాణ్ణి పిలిచాడు. ఆవిడ పాట సాగుతూనే ఉంది. కళ్ళు ఆడుతున్నాయి. ఏవో చెప్పుతున్నాయి. పది పూలదండలు ఆవిడ మెళ్ళోవేశాడు. "బిస్తర్ బిఛాదియా హై తేరే ఘర్‌కే సామ్నే" అనే పాట విని లేచి విడిపూలు దోసిటితో ఆమె నెత్తిన గుమ్మరించి వెళ్ళిపోయాడు.

చాలసేపు ఆ రసికుని వద్దనే ఉండిపోయింది. లేచి పూలు దులుపుకొని మిగతా వాళ్ళందరినీ ఒక చిరునవ్వు చూపుతో చూచి తన స్థానానికి వెళ్ళిపోయింది. కొప్పులో రూపాయిలు, తన రూపాయిలూ అక్కడ పడేసింది. కొన్ని పూలదండలు తీసేసి నిముషం ఊరుకొని సాగించింది పాట – రెండుచేతుల రెండేసి వేళ్ళతో తమాషాగా చప్పట్లు కొడుతూ నేలమీద జరుగుతూ.

అక్కడున్నవాళ్ళంతా తమ ముందు రూపాయిలు వేశారు. ఎవరి ముందు కూర్చొని పాట పాడాలి అని ఆలోచిస్తుండగానే పది రూపాయలు వేశాడు రాజారావు. అతనిముందు వెళ్లి కూర్చుంది. పూలదండలు వేశాడు. చాలాసేపు పాట పాడింది. తర్వాత లేచింది. అతడు ఆమెచేయి పట్టుకున్నాడు. ఆవిడ విదిలించుకుంది. వయ్యారంగా, చిరుకోపంగా ఒక నవ్వు నవ్వింది. అక్కడినుంచి లేచింది. వేరేవాని ముందు కూర్చుంది. పాట సాగించింది.

రాజారావు లేచాడు. వేరేచోటికి వెళ్లాడు. కాలికి గజ్జెకట్టి ఆడే ఆడవారిని చూచాడు. శ్రావ్యమైన సంగీతంతో అలరించే అంగనలను చూచాడు. వాద్యాలు పక్కనుంచుకొని గ్రాహకుల కోసం ఎదిరి చూస్తున్న రమణులను చూచాడు. కనుచూపులతో కరిగించే కన్నెపిల్లలను చూచాడు.

మెడలో పూలదండలతో మెహెందీ నుంచి బయలుదేరాడు. కారు ఎక్కి స్టార్టు చేశాడు. ఇంటికి చేరుకొని సాయంకాల పత్రిక చూచాడు.

"జగన్మోహనరావు సాధించిన మరొక విజయం – రాజారావు కల్తీ సిమెంటు పట్టుకోవడం!"

పతాక శీర్షిక చూచాడు.

గుండెలో హైడ్రోజను బాంబు ప్రేలింది.

★ ★ ★

# పదహారు

మహమ్మద్ ఉస్మాన్ సాహెబ్ భవనం ముందు పచ్చిక మైదానం కల్పించబడింది. చుట్టూ ఉండే బార్డర్‌లో సాధారణంగా గోరంటాకు లాంటివి కాక, రకరకాల పూలమొక్కలున్నాయి. లాన్ మధ్యన అగడ్తలాంటి హౌజుంది. అందులో పన్నెండు ఫౌంటెన్లున్నాయి. వాట్లోంచి నీరు సర్వదా చిమ్ముతూనే ఉంటుంది. రాత్రిళ్ళు ఆ ఫౌంటెన్లలో నుంచి చిమ్మే నీరు రంగురంగులుగా కనిపిస్తుంది.

లాన్ పక్కన పోర్టికో ఉంది. పోర్టికోలోంచి మెట్లెక్కగానే వ్రేలాడకట్టిన పంజరాలు కనిపిస్తాయి. వాట్లో రామచిలుక లున్నాయి. మెట్లు ఎక్కేవానిని చూచి ఒక చిలుక "ఆదాబేఅరజ్" అంటుంది. రెండవది "శుక్రియా" చెబుతుంది. పోర్టికోకు ఎడమ పక్కన పెద్ద హాలుంది. అది విజిటర్స్ హాల్. ఉక్కు మడత కుర్చీలు చాలా వేసి ఉన్నాయి. గోడల మీద పెద్ద పెద్ద ఉస్మాన్‌సాబ్ పటాలున్నాయి. అనేక మంది నాయకులతో తీయించుకున్న పటాలవి. ఆ హాలు మధ్యన ఒక గుమ్మం ఉంది. అది ఉస్మాన్‌గారి ఆఫీసు గది. గుమ్మానికి కుడివైపు గోడకు దగ్గరగా రివాల్వింగ్ చేర్. దానిముందు పెద్ద టేబులు లున్నాయి. ఎదురుగా గోడకు అనుకొని సోఫాలున్నాయి. అష్‌ట్రేలు టీపాయ్‌ల మీద ఉన్నాయి. టీపాయ్ మీదగల ఇత్తడి అర్ధచంద్రాకారం మీద సన్నని వెండి గొలుసులతో కాళ్ళు కట్టబడిన ఒక చిలక వుంది. అది ఉస్మాన్‌గారికి ప్రియమైంది. అతడు మాట్లాడితేనే మాట్లాడుతుంది. ఒక్కొకసారి దానితోనే మాట్లాడుతూ పొద్దుపుచ్చుతాడు ఉస్మాన్. ఆ గదికి అనుకొని ఒక చిన్న గది వుంది. అది రహస్య మందిరం. అందులో సోఫాలూ, కుర్చీలూ ఏమీ వుండవు. గదినిండా పరుపు పరిచి వుంటుంది. దానిమీద తెల్లని శుభ్రమైన బట్టపరచి ఉంటుంది. మధ్యన "గుల్‌గాన్" – అంటే, పుష్పపాత్ర ఉంటుంది. అగర్‌బత్తీలు ఆ గదిలో ఎప్పుడూ వెలుగుతూనే ఉంటాయి.

ఉస్మాన్ రోజూ తొమ్మిది గంటలకుగాని మేల్కొనడు. స్నానం చేసి చలువ ఖద్దరు బట్టలు ధరించి హాల్లోకి వచ్చాడు. అతణ్ణి చూచి "సలామలేకు" అన్నాయి చిలుకలన్నీ. ఒక కాలు గూడా ఎత్తి నమస్కరించాయి. ట్రేలో పళ్ళ ముక్కలూ అవీ పట్టుకొచ్చింది దాసీది. చిలకలన్నింటికీ అవి వేశాడు. ఒకసారి తొంగి లాన్‌లోకి చూచాడు. రంగురంగుల పూలమొక్కలు కనిపించాయి. మాలీ రెండు గులాబీపూలు అందించాడు. అవి తీసుకొని వాసన చూస్తూ విజిటర్స్ రూములోకి ప్రవేశించాడు. కుర్చీలమీద కూర్చున్నవారంతా లేచి నుంచున్నారు. అందరికీ షేక్‌హాండిచ్చి ఆఫీసుగదిలో ప్రవేశించాడు. అతడు నయాగరా ఉపాహారం తప్ప సేవించడు, పైగా ఒంటరిగా సేవించడు. అతనికోసం వచ్చినవారే ఉపాహారం తెప్పించాలి. అతడు తినేది రెండు ఆమ్లెట్లు, రెండు ఉడికిన గుడ్లూ, మూడు స్లైసులు మాత్రమే. అతనికి మిత్రులు పెక్కురు. అంతా ఆ సమయానికి వాల్తారు.

నయాగారా నుంచి ఉపాహారాలు వచ్చాయి. అంతా స్వీకరించారు. ఉస్మాన్ సిగరెట్టు కాల్చి ఒక ఇంజనీరును పిలిచాడు. ఇంజనీరు వచ్చి సలామ్‌చేసి కూర్చున్నాడు. అతడు శ్రీకాకుళం జిల్లాలో ఎక్కడో వున్నాడు. హైదరాబాదుకు బదిలీ కావాలి. ప్రమోషన్ రావాలి. ఆ విషయం విన్నవించాడు ఇంజనీరు.

"నెలకెంత గిట్టుందక్కడ?" అడిగాడు ఉస్మాన్.

"జనమంతా తెలివిపొరారండీ. ఏమిస్తారు? ఏదో 500 గిడ్తాయి."

నవ్వాడు ఉస్మాన్ పెద్దగా. తెల్లబోయాడు ఇంజనీరు, "ఇంజనీరుకు అయిదొందలేమిటయ్యా, సూపర్వైజర్లు బంగళాలు కట్టేస్తుంటే!" అన్నాడు.

ఇంజనీరు నసిగాడు. "అక్కడ ఎవడిస్తాడండీ? వేయిరూపాయల కంటే ఎక్కువ చిల్లిగవ్వ రాలేదండీ ఎన్నడు."

"సరే దాచుకోవయ్యా. పదివేలైతేగాని పని జరగదు. నీ ఇష్టం" అని మరొకణ్ణి పిలవడానికి ఉద్యుక్తుడుకాగా ఉస్మాన్ చేతులు పట్టుకున్నాడు ఇంజనీరు. "కర్చులోపడి ఉన్నాను సార్, అయిదువేల్లో నెగ్గించండి" అని బతిమాలాడాడు.

"నా కేమొచ్చేదుందయ్యా అందులో? తలా ఇంత తగలెయ్యాలి. ఏదో ఉపకారం చేద్దామని తప్ప. సరే, ఏడు వేలిచ్చెయ్యి. తేల్చు త్వరగా, చాలామంది వున్నారవతల" అన్నాడు. బ్యాగులోంచి తీసి అయిదు వేలిచ్చాడు ఇంజనీరు. మిగతావి తరువాత ఇస్తానన్నాడు. అతనికి సంబంధించిన వివరాలన్నీ కాగితం మీద వ్రాసియిచ్చి "త్వరగా చేయండి సార్! మీకెంతో రుణపడి వుంటాను" అని లేచి నుంచున్నాడు. "సరే అలాగే నయ్యా! వారం తరువాత కనిపించు" అన్నాడు ఉస్మాన్.

ఒక మందుల దుకాణంవాడు వచ్చాడు. ఇతడు క్లోరోమైసిటిన్ బదులు సీసాల్లో సున్నం పోసి సరఫరా చేశాడు ఆస్పత్రులకు. ఎంత కాలంగా జరుగుతూందో, ఆ వ్యాపారం మొన్న పోలీసులు పట్టుకున్నారు. ఆ వ్యవహారంలో వచ్చాడతను ఉస్మాన్ దగ్గరికి. అతనికి బస్ బ్రాందీ దుకాణానికి లైసెన్సూ, ఒక స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రల ఫ్యాక్టరీకి పర్మిటూ ఇప్పించింది ఉస్మానే.

విన్నవించాడు మందుల దుకాణంవాడు. దీర్ఘంగా ఆలోచించాడు ఉస్మాన్. ఈ పని తనకు సాధ్యపడదని చెప్పేశాడు. దుకాణంవాడి గుండె పగిలింది. చేతులు పట్టుకొని మహా ఇదిగా బ్రతిమిలాడసాగాడు. "ఫ్యాక్టరీలేంది స్టెయిన్లెస్ స్టీల్ కోటా సంపాదించారు. అదీ ఎప్పుడో పట్టుబడుతుంది" అనేశాడొక ఉస్మాన్ మిత్రుడు, సోఫాలో కూర్చొని ఫిల్మ్‌ఫేర్ చదువుతున్నవాడు. అంతా నవ్వేశారు. దుకాణం వాడి ముఖం మాడింది.

ఈ లోగా డెయిజీ మెరుపులా ప్రవేశించింది – వెనుక సూరి! క్షణం తబ్బిబ్బైనారంతా, పత్రికలు చదివేవాళ్ళు పారేశారు.

నమస్కార ప్రతినమస్కారాలు జరిగింతరవాత ఇద్దరూ ఉస్మాన్ ముందు కూర్చోగా మందుల దుకాణంవాడు తోకముడిచాడు. ఉస్మాన్ పొగ వదుల్తూ అన్నాడు – 'అప్సరసలకు' – ఏదో అనబోయాడు. మాటకు అడ్డం వచ్చి, "ఇప్పుడు నేను భూలోకానికి దిగివచ్చాను మిస్టర్ ఉస్మాన్!" అన్నది డెయిజీ.

నవ్వాడు ఉస్మాన్. "ఎంతకాలం అయింది?" అని "ఏదో పనిమీద వచ్చినట్లున్నావ్?" అడిగాడు.

"ఇదివరకు ఎప్పుడు వచ్చినా నీ పనిమీదనే వచ్చాను. ఇప్పుడు నా పనిమీద కాకున్నా మరొకరి పనిమీద వచ్చాను. నా పనే అనుకొని సహాయం చేయాలి."

"చిలక చాల మాటల్ నేర్చింది. సరేగాని, పనేమి టన్నట్లు? డాక్టరుతోనా?"

డెయిజీ కనులతో సైగచేసింది. సోఫా సెట్లమీద కూర్చున్న మిత్రులున్నారని.

"ఓహ్! అదా? సిగ్గు ఎంతటిదానికైనా తప్పదేమో! సరే రా" అని ప్రైవేటు గదిలోకి తీసికెళ్ళాడు. సూరి కూడా వెంట వెళ్ళాడు.

ముగ్గురూ పరుపులమీద కూర్చున్నారు. ఎలా ప్రారంభించాలో తెలియలేదు. డెయిజీ సూరివైపు చూచింది. గ్రహించాడు సూరి.

"ఈ రోజు పేపరు చూచారా?"

"లేదే. పేపరు చూడ్డం మానేశాను. ఏముంటూంది పేపర్లో? విమానం కూలడం. రైలు ప్రమాదం, ఆకలి చావులు – ఇవేగా!"

"రాజారావుగారి సిమెంటు పట్టుబడింది. ఆ వార్త మీదాకారాలేదా?"

"ఏమీ? రాజారావు కంట్రాక్టరు సిమెంటా? ఎవడూ పట్టుకుంది? వాడికేం చావుమూడిందో?"

"జగన్మోహనరావు!"

"జగన్మోహనరావే! వాడు రాక్షసుడు, వాడి పిచ్చి వాడిది. ఎవడు చెప్పినా వినడు. ఒక కేసులో 50 వేలిప్పిస్తా నన్నాను. నన్నే పోలీసుల కిస్తానన్నాడు వెధవ. రాజారావు గట్టివాడేనే – పెద్ద పెద్దవాళ్ళు తెలుసు నతనికి. ఏమీ చేయలేకపోయాడా?"

"ఊహూఁ – ఏమీ చేయలేకపోయాడు. అందుకే మీ దగ్గరికి వచ్చింది."

"ఆహాఁ – జగన్మోహనరావు విషయంలో నేనేమీ చేయలేను. క్షమించాలి. వాడికి వెర్రి బాగా తలకెక్కిందింది. ఎప్పుడో దించాలి. చూస్తున్నా సమయంకోసం."

"ఆలోచించాను ఉస్మాన్‌సాబ్! జగన్మోహనరావు దగ్గరికి మిమ్మల్ని వెళ్ళమం టానా? అనలిస్టు దగ్గరుంది సిమెంటు. దాన్ని పట్టిస్తేసరి. జగన్మోహనరావు చచ్చి ఊరుకుంటాడు."

"అవును, మంచి ఆలోచనే. కాని, అనలిస్టు అంత రిస్క్ తీసుకుంటాడా అని."

"డబ్బిద్దాం ఎంతైనా. ఒక పెద్దమనిషి పరువు..."

"మంచిది, డెయిజీ వచ్చింది. తప్పుతుందీ. వెడదాం."

"వెడదాం అంటేకాదు. ఇప్పుడే బయలుదేరాలి" అన్నాడు సూరి.

"సరే, కారుందా?" తన కారును ఇలాంటి వాటికోసం వాడడు ఉస్మాన్.

"ఉంది టాక్సీ."

"అయితే పదండి" అన్నాడు.

సూరీ, డెయిజీ బయటికి వచ్చారు. ఉస్మాన్ లోపలే ఉండి డెయిజీని పిలిచాడు. సూరి బైటే ఉండిపోయాడు. "డెయిజీ మై లా వన్ కిస్" అని డెయిజీని ముద్దు పెట్టుకున్నాడు ఉస్మాన్.

డెయిజీ కళ్ళతో చిరునవ్వు నవ్వేసింది. ఉస్మాన్ కరిగిపోయాడు.

ఇద్దరూ వచ్చారు. అయిదు నిమిషాల్లో వస్తానని అక్కడున్నవారికి చెప్పి వెళ్ళిపోయాడు ఉస్మాన్.

ముగ్గురూ అనలిస్టు దగ్గరికి వెళ్ళారు. అతడు తన పిల్లలతో ఆడుకుంటున్నాడు. ఉస్మాన్‌ను చూచి ఆశ్చర్యపడ్డాడు. డెయిజీని చూచి కాలరు సవరించుకున్నాడు. పిల్లల్ని లోపల వదలివచ్చి కూర్చున్నాడు. ఉస్మాన్ అతణ్ణి వరండాలోకి తీసికెళ్ళాడు. తాపీగా జరిగిందంతా చెప్పేశాడు. ఏ విధంగానైనా సిమెంటు మార్చాలన్నాడు. జగన్మోహన రావంటే తికమక పడ్డాడు అనలిస్టు. ఉద్యోగానికి ఏమీ హానికలక్కుండా హామీ ఇస్తానన్నాడు ఉస్మాన్. పైగా, 50 వేలు ఇప్పిస్తానన్నాడు. 50 వేల మాట వినేవరకు గుండె పగిలింది అనలిస్టుకు. జీవితాంతం ఉద్యోగం చేసినా అంత డబ్బు రాదు. 50 వేలను మించి అతడు ఆలోచించలేకపోయాడు కాని, లక్షన్నా ఇచ్చేవాడు ఉస్మాన్. బేరం నిశ్చయం అయిపోయింది. మిగతావన్నీ తానే చూచుకుంటానన్నాడు అనలిస్టు. డబ్బు గంటలో పంపిస్తానని చెప్పి బైల్దేరాడు ఉస్మాన్.

ముగ్గురూ టాక్సీ ఎక్కారు.

"ఏమైంది?" డెయిజీ అడిగింది.

"మొండి ఘటం."

"ఒప్పుకోలేదా?" సూరి అడిగాడు.

"జగన్మోహనరావంటే జంకుతున్నాడు."

"ఎలా మరి?" డెయిజీ ఆత్రంగా అడిగింది.

"ఒప్పించాన్లే."

"ఎంతకు?" అడిగాడు సూరి.

"లక్షకు."

"లక్షా?" సూరి గుండె పగిలింది.

"నవ్వాడు ఉస్మాన్. "సూరీ! నువ్వు వట్టి వెధవ్వి. ప్రిస్టేజి అంటే నీకేం తెలుసు. అదీ రాజారావు వంటి వానిది. లక్షకాదు – పదిలక్షలిచ్చినా తక్కువే. అంతకు వప్పించే వరకు నా తలప్రాణం తోకకు వచ్చింది. ఇందులో నా కొచ్చేదేముంది? డబ్బు గంటలో అందాలి. నన్ను ఇంటి దగ్గర డ్రాప్‌చేసి వెళ్ళండి" అన్నాడు.

నీళ్ళు నమిలాడు సూరి. గురువుగారు పెద్దదెబ్బే కొట్టాడనుకున్నాడు.

ఉస్మానును ఇంట్లోదింపి రాజారావు ఇంటివైపు సాగింది కారు.

"లక్ష అడిగాడంటావూ అనలిస్టు? అనలిస్టుకు అసలు వేయి కూడా ఇస్తాడని నమ్మకం లేదు. పెద్ద దెబ్బేకొట్టాడు ఉస్మాన్! మన కేమైనా ముట్టచెపుతాడో లేదో?" మనసులో మాట నిలుపుకోలేక కక్కేశాడు.

డెయిజీ నవ్వింది. "మిస్టర్ సూరీ! ఉస్మాన్ విషయం తెలియనిదాన్ని కాదు. కాని, రాజారావు పరువు కాపాడితే ఇది ఒక లెక్కకాదు. రాజారావు నాకు ఆశ్రయం ఇవ్వడానికి నిరాకరించాడు. నన్ను మెడపట్టి గెంటినంత పనిచేశాడు. అయినా, అతడంటే నాకేదో అభిమానం ఉంది. ప్రపంచ దొంగిలించినవానికి

చొక్కా కూడా ఇచ్చెయ్యమన్నాడు క్రీస్తు. రాజారావుకు ద్రోహం చేయలేను. నన్ను నేను అమ్ముకోగలను కాని, కమీషన్ తీసుకోలేను."

సూరి ఉక్కిరి బిక్కిరైనాడు. ముఖం తెల్లబడింది. డెయిజీ పేర రాజారావు దగ్గర నుంచి కొంత కాజేదామనుకున్నాడు. ఆ ప్లాను భగ్నం అయింది.

రాజారావూ, చంద్రయ్య తీవ్రంగా వాదించుకుంటున్నప్పుడు ప్రవేశించారు డెయిజీ, సూర్యారావులు.

"వెధవ! ఇల్లు గుల్ల చేశాడు. పో అవతలికి" అని గర్జించాడు రాజారావు చంద్రయ్య నుద్దేశించి.

చంద్రయ్య తలవంచుకొని నిష్క్రమించాడు.

ఇద్దరూ కూర్చున్నారు.

"ఏమైంది?" అని ఆతురతగా అడిగి, "నా పరువు ప్రతిష్టలు గంగలో కలిపాడు జగన్‌గాడు. వాడి అంతు తేల్చందే నిద్రపోను" అన్నాడు రాజారావు.

"పని జరిగింది" అన్నాడు సూరి.

రాజారావు కళ్ళల్లో ఆశ వెలిగింది. మిక్కిలి ఆత్రంగా అడిగాడు – "ఎలా జరిగింది? ఎక్కడ జరిగింది? ఏం జరిగింది?"

జరిగిందంతా పూస గుచ్చినట్లు చెప్పాడు సూరి. తన ప్రతాపాన్ని కొంత పెంచి చెప్పినా, డెయిజీ వల్లనే ఇదంతా సాధ్యపడిందని చెప్పాడు.

లక్ష!!!

అదిరిపోయాడు రాజారావు. మిన్ను విరిగి మీద పడినట్లయింది. తన చుట్టూ వున్న వాతావరణం గిరగిరా తిరుగుతున్నట్లనిపించింది. కొన్ని క్షణాలు ఆలోచించలేకపోయాడు. మొదటి తడవ అతని ఆలోచనకు అందింది డెయిజీ. డెయిజీ పగ తీర్చుకుంటూంది అనుకున్నాడు. ఉస్మాన్ అంత అడిగి ఉంటాడని విశ్వాసం కలుగలేదు. భోగం ముండ! దానికే ఇందులో ఎక్కువపాలు ఉండవచ్చు అనుకున్నాడు. సమయం వచ్చింది కాబట్టి జుట్టు పట్టూంది అనుకున్నాడు.

లక్ష!!!

ఇవ్వడమా? మానడమా? పోయిన తన పరువు, జగన్మోహనరావు గుర్తుకు వచ్చారు. లక్ష కాదు – మరో లక్ష ఇచ్చయినా వాడి పని పట్టాలనుకున్నాడు. తన సిమెంటు మంచిదని తేలుతే జగన్మోహనరావును పూడ్చడం తేలికే.

"అల్లుడూ! పిలిచావుట?" నారాయణరావుగారు తూలుతూ గుమ్మంలో అడుగుపెట్టి గదిలోకి తీక్షణంగా చూచి, కొత్త వ్యక్తులున్నారని గుమ్మం పట్టుకొని నుంచొని ఖంగు ఖంగుమని దగ్గాడు.

అసలే ఆలోచనలతో సతమతం అవుతున్నాడు రాజారావు. నారాయణరావుగారిని చూచి వళ్ళు మండింది. వాస్తవంగా అతకుముందు పిలిచాడు తాను. అయినా కసిరాడు – "పో ఇక్కణ్ణుంచి, పిలవలేదు" అని.

"ఓ! అలాగా! నాకు పిలిచినట్లనిపించిందిలే. పోతాలే అల్లుడూ!" అని ఖంగు ఖంగుమని దగ్గాడు. రక్తం ఉమిశాడు. "ఎవరైనా పోయేదే" అని వెనక్కు అడుగువేసి పడిపోయాడు తాను ఉమ్మిన దాంట్లోనే.

రాజారావు గుండె మండింది. లేచి నారాయణరావుగారిని చెడమడా బాద్దామనుకున్నాడు. కాని అదీ చేతకాలేదు. రెండు చేతులతోనూ తల పట్టుకొని కూర్చుండిపోయాడు.

సూరీ, డెయిజీ నారాయణరావుగారి దగ్గరికి పరిగెత్తి లేవనెత్తారు. పార్వతీ, రజనీ, పనివాళ్ళూ సహాయం చేయగా నారాయణ రావును అతని గదిలో పడుకోబెట్టి సూరీ, డెయిజీ వచ్చేవరకు ఇంకా తలపట్టుకొని అట్లాగే కూర్చుని ఉన్నాడు రాజారావు.

వారిద్దరూ కూర్చున్నారు.

నిశ్శబ్దంగా గడియారపు ముల్లు తిరుగుతూంది.

ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

ఇద్దరికీ ఏమీ తోచలేదు.

సూరి సిగరెట్టు వెలిగించాడు. అగ్గిపుల్ల భర్ మంది.

రాజారావు కళ్ళుతెరిచి చూచాడు. డెయిజీ కనిపించింది. రక్తం కళ్ళల్లోకి తన్నింది.

"నేను నాశనం అయినాను. లక్ష ఇవ్వలేను!" అన్నాడు రాజారావు. ఆ ధ్వనిలో దుఃఖమూ, కోపమూ రెండూ ఉన్నాయి.

తెల్లబోయి చూచింది డెయిజీ.

"నీకు ఉపకారం చేయాలని వచ్చాం. నీ ఇష్టం" అని లేచాడు సూరి. డెయిజీ మెదడు శూన్యం అయింది. ఆమె అలాగే కూర్చుండిపోయింది.

"లే డెయిజీ, వెళ్దాం!" అన్న సూరి మాటలు విని ఉలిక్కిపడి లేచినుంచుంది.

ఇద్దరూ విసవిసా గది దాటారు.

అప్పుడుగాని అర్థంకాలేదు రాజారావుకు – లక్షకోసం తనను తాను నాశనం చేసుకుంటున్నానని. "మిస్టర్ సూరీ!" అని అరుస్తూ పరిగెత్తాడు. ఎదురుగా వెళ్ళి వారిద్దరికీ అడ్డంగా నుంచున్నాడు. "క్షమించు సూరీ! ఏమేమో అనేశాను. నా మనసు మనసులో లేదు. రా డెయిజీ! లక్ష ఇస్తాను. నన్ను రక్షించు..." అని కాళ్ళా వేళ్ళాపడి వారిని గదిలోకి తెచ్చాడు.

రాజారావు డబ్బు తీసుకొని బయలుదేరాడు. ముగ్గురూ సాగిపోతున్నారు.

రజని గది తలుపు తెరిచి ఉంది. శూన్యంలోకి చూస్తూంది. డెయిజీ క్షణం ఆగింది. చిరునవ్వు నవ్వింది.

రజని మనసులో ఏదో తళుక్కుమన్నది.

ఆమె పెదవిమీద చాలాకాలం తరువాత చిరునవ్వు చిందింది.

డెయిజీ సాగిపోయింది.

రజని మళ్ళీ శూన్యంలోకి చూడసాగింది.

★ ★ ★

# పదిహేడు

పిచ్చయ్య అరెస్టు కావడంతో బాలయ్య విలవిల లాడాడు. పుల్లయ్య వీరుడైనాడు. గూడెంలోని జనం యావత్తు పుల్లయ్య చెప్పిందే నమ్మారు. అద్దె కట్టడం వినా గత్యంతరం లేదని పరమయ్య ఇంటింటా చాటాడు. అందరి వద్దా డబ్బు వసూలు చేశాడు. పరమయ్యా, పుల్లయ్యా ఉస్మాన్ వద్దకు వెళ్ళాలని నిర్ణయం అయింది.

ఆ రోజు ఇద్దరూ స్నానాలు చేసి కొత్త బట్టలు వేసుకున్నారు. డబ్బు భద్రంగా జేబుల్లో పెట్టుకొని ఉస్మాన్ ఇంటికి బయలుదేరారు. గూడెం వారంతా వారిని సాగనంపారు. ఉస్మాన్‌వంటి వాని దగ్గరికి వెళ్ళేప్పుడు టాక్సీలో పోవాలనుకున్నారు టాక్సీ ఎక్కారు. కాని, ఉస్మాన్ గేటు లోపలికి వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. బయటనే దిగి గేటుముందు నుంచున్నారు.

ఆ రోజు ఉస్మాన్ ఇల్లు అల్లకల్లోలంగా ఉంది. కార్లల్లో వచ్చిన జనం తిరిగి వెళ్ళిపోతున్నారు. కొందరి ముఖాలమీద చిరాకు, మరి కొందరి ముఖాలమీద విచారం కనిపిస్తున్నాయి. ఏదో అడావుడి. జనం అటునుంచి ఇటు పరిగెత్తుతున్నారు. కనిపించిన వాడల్లా ఎదుటివాణ్ణి ఏదో అడుగుతున్నాడు. మళ్ళీ సాగిపోతున్నారు. టెలిఫోన్లు మోగుతున్నాయి. వచ్చే టెలిఫోన్లకు, ఇచ్చే టెలిఫోన్లకు అంతులేదు. విరబోసిన వెంట్రుకల్లా పడివుంది లాన్. పూలు రాలేయి. గడ్డి కత్తిరించలేదు. అప్పటికి గడ్డి మొత్తం తడిసి ఉండాల్సింది. నీటి చుక్క లేదు. ఊడ్పు పని కూడా జరిగినట్లు లేదు. చిందర వందరగా పడి ఉన్నాయి వస్తువులు. ఇంత అడావిడీ, గందరగోళం ఉన్నప్పటికి పంజరాల్లోని చిలకలు అవి అనాల్సిన మాటలు అనేస్తూనే ఉన్నాయి.

అసలు జరిగిందేమంటే – ఆ రోజు ఉస్మాన్ చిలకకు జబ్బు చేసింది! చిలకంటే మామూలు చిలక కాదది, పంచవన్నెల చిలక. చిలక చిన్నది కాదు, పెద్ద చిలక. ఉస్మాన్ లక్నో వెళ్ళినప్పుడు కొన్నాడు. దాన్ని అమ్మినవాడు దాన్ని పర్షియా నుంచి తెచ్చానన్నాడు. చిలక అందంగా ఉందని మాత్రం కొనలేదు ఉస్మాన్. ఆ చిలక పలకగల చిలక. చిలకంటే చిలకా? అది బంగారు చిలక. మాయల మరాఠీ ప్రాణాల్లా ఉస్మాన్ తన ప్రాణాలను ఆ చిలకలోకి దించేశాడు. ఆ చిలకే ఉస్మాన్ ఆఫీసు గదిలో ఉండేది. అది అతనితో మాట్లాడుతుంది. ఉస్మాన్‌కు భార్యాబిడ్డలు అన్నీ చిలకే. అలాంటి చిలకలో ఉస్మాన్ ప్రాణం పెట్టాడంటే ఆశ్చర్యమేం? ఇస్లాం మతం ఒప్పుకుంటే, అసలా చిలకను పూజా మందిరంలో పెట్టి పూజించేవాడే!

ఉస్మాన్ ప్రాణం ఉన్నటువంటి చిలకకు జబ్బు చేస్తే మరి ఉస్మాన్‌కు జబ్బు చేయడం సహజం. కాని, ఉస్మాన్‌కు జబ్బు చేసినంత పని మాత్రం అయింది. మంచం మీద పరుపు వేసి, మఖమల్ మడత పరచి పడుకోబెట్టాడు చిలకను.

అమాంతంగా తిండి మానేసింది చిలక క్రితం రాత్రి. అజీర్ణం చేసిందేమో అదే తింటుందనుకున్నారు. ఉస్మాన్ లేనప్పుడు నిజానికి చిలకంటే అంత శ్రద్ధ

ఎందుకుంటుంది? వారి ప్రాణాలున్నాయా దాన్లో? అయితే, చిలక్కూ కోపం వచ్చివుంటుంది. తనను గురించి పట్టించు కోవడం లేదని, ఉస్మాన్ వచ్చేవరకూ మూర్ఛపోయింది. మూర్ఛ పోయిన చిలకను చూచి మూర్ఛపోయినంత పనిచేశాడు ఉస్మాన్. అయితే, మూర్ఛపోక పోవడానికి కారణం ఏమంటే – చిలకకు చికిత్స జరగాలని. ఆ రాత్రి ఎంత గందరగోళం చేశాడో! ఇల్లంతా ఒకటి చేయడం కాదు, పట్టణం అంతా ఒకటి చేశాడు.

"జూ" నుంచి వచ్చారు స్పెషల్ డాక్టర్లు – అంటే, పక్షుల డాక్టర్లు. అయితే జంతువుల డాక్టర్లే కాక, మనుషుల డాక్టర్లు కూడా అనేకమంది చేరారక్కడ. వాళ్లంతా చికిత్స చేయడానికి వచ్చినవాళ్ళు కారు – చిలక పరిస్థితి చూచి ఉస్మాన్ స్థితి అస్తవ్యస్తం అవుతే చికిత్స చేయడానికనివచ్చినవారు. అసలు వారు వచ్చింది ఈ సంకట సమయంలో సహితం ఉస్మాన్ దగ్గరే ఉన్నామనే విషయం అతనికి తెలియపరచాలని.

చిలక మంచం పక్కనే కూర్చున్నాడు రాత్రంతా ఉస్మాన్. చూస్తున్న డాక్టరు ఒకడు కాని, డాక్టర్లంతా పరీక్షచేసి ప్రత్యేకమైనగదిలో సమావేశం జరిపారు. అర్ధగంట హోరా హోరీ చర్చ తరవాత వారు ఏకగ్రీవంగా తీర్మానించిన దేమనగా, "శుకరాజము–రాజ రాజము–జీవించియే యున్నది. దాని వ్యాధిని గూర్చి తెలుసుకొనవలెనన్న ఎక్స్‌రే మున్నగు పరీక్షలు చేయవలెను. అవసరమైన శస్త్రచికిత్స జరుపవలెను. శుక రాజరాజమ్మున కెట్టి ప్రమాదమును లేదు. కాన, జనాబ్ ఉస్మాన్ సాహెబ్ ఆహారము స్వీకరించవలెను. అట్లు చేయకున్నచో వారును మూర్ఛిల్లు ప్రమాదము కలదు. ఏలనగా, వారికి అనేక వ్యాధులు గలవు."

ఈ తీర్మానం ఉస్మాన్ మీద ప్రభావం ఏమీ వేయలేదు. ఉస్మాన్‌కు ఉన్న జబ్బులు అనేకం. అతనికి అజీర్ణం ఉంది. ఊపిరితిత్తుల వ్యాధీ, మధుమేహమూ, మూలవ్యాధీ ఉన్నాయంటారు. అతడు మింగే మందులకూ తీసుకునే ఇంజక్షన్లకూ లెక్కలేదు. అయినా డాక్టర్లు అతనివారు. డబ్బు ఆట్టే ఖర్చుకాదు. సర్కారీ దవాఖానా లున్నాయిగా!

అల్లాంటి ఉస్మాన్ పళ్ళు సైతం ముట్టకుండా ప్రాయోపవేశం చేశాడంటే పట్నం కదలిపోదూ! నగరంలో వున్న పెద్దలంతా వచ్చారు. నాయకులు, మహా నాయకులు కూడా వచ్చారని చెప్పుకున్నారు. పాత్రికేయులంతా ఆ రాత్రి అక్కడే వుండిపోయారు. చిలక ఆరోగ్యం తెలుపడానికి పత్రికలు అచ్చు వేయడం ఆపివేసి వుంచారు. కెమేరాలు ఎన్ని వెలిగాయో తెలీదు.

తెల్లవారి పత్రికల్లో ఈ వార్త ప్రకటించబడింది. కొన్ని పత్రికలు చిలక మువ్వన్నె చిత్రాలూ, ఉస్మాన్ చిత్రమూ ప్రకటించాయి. చిలకను గురించిన చిత్ర విచిత్రములైన కథలు అల్లి ప్రకటించబడినాయి. ఉస్మాన్‌కున్న పక్షి ప్రేమను గురించీ, అతని కళా హృదయాన్ని గురించీ వ్యాసాలు వచ్చాయి. ఒకానొక ఉర్దూ దిన పత్రికలో పద్యాలూ, సంపాదకీయం కూడా ప్రకటించబడింది.

అయితే పుల్లయ్యగాని, పరమయ్యగానీ పత్రికలు చదివే వాళ్ళుకారు. వాళ్ళకెలా తెలుస్తాయి ఈ విషయాలన్నీ? ఉస్మాన్ ఇంటికి చేరిం తరవాత వారికి తెలిసిందల్లా చిలకకు జబ్బు చేసిందని! చిలకకు జబ్బు చేయడం వల్ల ఇల్లాంటి పరిణామాలు జరుగుతాయనీ వారికి తెలియదు. వారికెలా తెలుస్తుంది? వారికి తెలిసిందల్లా చావూ

పుట్టుకలాంటిదేనని. ఎలా పుట్టారో అలా చస్తారని. ఎంత మంది చచ్చారో ఆ గూడెంలో! ఏ డాక్టరు వచ్చాడక్కడికి?

మూర్ఖులు వారు. వారికేం తెలుసు చిలక విలువ! అందుకే నుంచున్నారు ఉస్మాన్ బంగళా ముందు, ఎప్పుడో ఒకసారి బయటికి వస్తాడని. పొద్దెక్కుతూంది. మధ్యాహ్నం అయింది. కడుపులో సురసుర మంటూంది. ఇంటికి వెళ్ళడం వారికి ఇష్టం లేదు. ఏదో సాధిస్తామని మొనగాళ్ళలా వచ్చి చేతులు ఊపుకుంటూ వెళ్ళడం మనస్కరించలేదు. ఏ రాత్రి అయినా కార్యం సాధించుకునే వెళ్ళాలనుకున్నారు. రిక్షా మీద వెళ్ళి డొక్కనింపుకొని సిగరెట్టు దమ్ములు కొడుతూ వచ్చి మళ్ళీ బంగళా ముదర కూలబడ్డారు. ఓపిక తగ్గుతున్నకొద్దీ ఉస్మాన్‌మీద వారికుండిన గౌరవం తగ్గుతూంది. అసలు ఉస్మాన్ వారి మాటలు వింటాడా? తాము నలుగురిలో నవ్వులపాలు కావలసివస్తుందా? ఇల్లాంటి ఆలోచనలు ఎన్నో మసిలాయి వారి మనసుల్లో. పని పూర్తికాకుండా గూడెంవారికి ముఖం చూపదలచలేదు వారు. అసలు పరిస్థితులే అలా వచ్చాయి. బాలయ్య చెప్పిందే నిజమేమో అనిపించింది. బాలయ్య చెప్పింది నిజమైతే తాము ఓడిపోయినట్లు అవుతుంది. తమ నాయకత్వం, ఆ మాట వారికి తోచలేదనుకోండి – తమ పెత్తనం ఊడుతుందని భయం. ఏం చేయాలో, ఎలా చేయాలో తోచలేదు. గేటుముందు చుట్ట కాల్చుకుంటూ నుంచున్న మాలీ కనిపించాడు. అలా తీరిగ్గా చుట్ట కాల్చుకుంటూ నుంచోడం వారికి పొద్దుణ్ణుంచీ కనుపించలేదు. ఇద్దరూ అతని దగ్గరికి వెళ్ళారు. నమస్కరించారు. నమస్కారాలు అందుకొని ఠీవిగా నుంచున్నాడు మాలి.

"దొర ఎప్పుడొ స్తడు ఇవుతలికి?" అడిగాడు పరమయ్య.

"ఇగ వస్తడేమో! చిలక బేహోష్షైంది కద! హోషొచ్చిందంటున్నారు."

ఇద్దరూ తమ కథంతా వివరంగా చెప్పారు.

అటూ ఇటూ చూచి ఎవ్వరూ వినడం లేదని విషయం ధృవపర్చుకొని చెప్పాడు మాలి – "ఇంటాడు ఈడు? పట్నమ్లున్న జాగలన్ని గడప్ చేసి అమ్ముకుంటున్నడు. కిరాయి తీస్కోని ఊర్కుంటడని అనుకుంటులేను, గుడిసెలు మీయ్యైతే కిరాయెందుక్కడ్తరు? నిలుపడురి గట్టిగా, అడే దిగొస్తడు."

గొంతులో కరక్కాయ పడింది ఇద్దరికీ. గుండెలు దడదడ కొట్టుకున్నాయి. తమ ఇబ్బందులన్నీ చెప్పారు. "సరే, మీమార్జీ" అని చుట్ట పారేసి వెళ్ళిపోయాడు మాలి.

మళ్ళీ దుమ్ములో కూలబడ్డారు ఇద్దరూ. మాలీ చెప్పిందాన్ని గురించి తర్జన భర్జనలు చేసుకున్నారు. ఈ తర్జన భర్జనల్లోనే సాయంకాలం అయింది. అప్పటికి చిలక మామూలు స్థాయికి వచ్చింది. ఉస్మాన్‌కు ప్రాణం వచ్చేసింది. ప్రాణం పోయి మళ్ళీ వచ్చినంత పని అయింది. నయాగరాలో పార్టీ ఏర్పాటు అయింది. ఆహ్వానా లందాయి అందరికి.

చీకటి పడ్డాక పోర్టికోలో కారు స్టార్ట్ అయిన ధ్వని వినిపించింది. ఇద్దరూ పరిగెత్తారు. కారు వారి ప్రక్కనుంచే సాగిపోతూంది. లోన ఉన్న ఉస్మాన్‌కు ఇద్దరూ వంగి సలాములు చేశారు. చూడనట్లే నటిస్తాడు ఉస్మాన్. ప్రతి నమస్కారం సైతం చేయలేదు. కారు సాగిపోతూంది. అది వారిమీదనుంచే పోతున్నట్లనిపించింది వారికి.

జనం వీరికోసరమే ఎదురుచూస్తున్నారు. వారి ఇద్దరి గుండెలూ జారేయి. ముందు మనసులో, తరవాత బహిరంగంగా తిట్టారు ఉస్మాన్‌ను. ఉదయం నుంచీ పడిగాపులు కాసి అలసి ఉన్నారు. రాత్రి కావడంతో తాగాలనుకున్నారు. పరమయ్య తన డబ్బుతో తాగడు. అది అతని నియమం. పుల్లయ్య దగ్గర తన డబ్బంటూలేదు. వారిలో వారికి తర్జన భర్జనలు సాగాయి. నాటి కూలికి వచ్చినంత డబ్బుతో తాగాలనుకున్నారు. తాము ఆ రోజు గూడెం పనికోసమే ఉండిపోయారు. కాబట్టి అది న్యాయం అనుకున్నారు. రిక్షాలో సాగిపోయారు "ధెధెల్" వేటకు.

అది రాత్రి అంగడి. చీకట్లతో ప్రారంభం అయి వెలుగుతో అంతం అవుతుంది. అసలు అది అంగడికాదు – సంత. ఆటలు పాటలే కాక ప్రణయాలూ, యుద్ధాలు కూడా జరుగుతుంటాయి అక్కడ. లక్క పూసిన గుడంబా కుండలకు పూలమాలలు చుట్టుకొని వరుసగా కూర్చున్నారు వ్యాపారులు. పక్కనే తమలపాకులు అద్దెలుగా పెట్టివున్నాయి. శాసనబద్ధమైన తమలపాకుల వ్యాపారపు అండన శాసన విరుద్ధమైన గుడంబా వ్యాపారం సాగుతూంది.

పరమయ్యా, పుల్లయ్యలు ఒక కుండదగ్గరికి చేరారు. తలలో మల్లెలు తురుముకున్న పిల్ల వారినిచూసి నవ్వింది. ఇద్దరూ అక్కడే కూలబడ్డారు.

"ఎంత?" అడిగిందా పిల్ల – మరొకసారి నవ్వి.

"చప్టీ – చప్టీ" అన్నాడు పుల్లయ్య.

"బస్" అని కిలకిలా నవ్వింది నల్లని పిల్ల.

పౌరుషం దెబ్బతిన్నది పుల్లయ్యకు. "ఒక్కసారి తాగుతమా! కుండ ఖాళీ చేస్తం చూడు" అని గ్లాసు అందుకున్నాడు.

ఇంతలో ఒక కుర్రాడు వచ్చాడు. వాణ్ణి చూచి పుల్లయ్య "తే బే! గుడ్లు, కబాబులు, మామ్సం" అని పదిరూపాయల కాగితం అందించి, పిల్లవైపు తీవిగా చూచాడు. ఈ తడవ పిల్ల నవ్వలేదు. గ్లాసు అందించింది.

ఈ కుండలకు ఎదురుగా లాంతర్లు పెట్టుకొని రొట్టెల మడతలు, జర్మన్ సిల్వర్ గిన్నెలలో మాంసం వగైరా అమ్మే దుకాణాల వరుస ఉంది. ఆ కుర్రాడు అక్కడికి పరిగెత్తి, పదార్థాలు మోదుకాకులలో తెచ్చి వారి ముందు ఉంచాడు. చిల్లర పైసలు అందిస్తుంటే అన్నాడు పరమయ్య – "తే బే ఇంక, పైకి మేవిఁస్తవ్" అని.

కుర్రాడు మళ్ళీ పరిగెత్తాడు.

"రొండో ఆటకు పోతి
సైకాలు మీన
రొండో సిల్మకు పోతి
సైకాలు మీన."

కూనిరాగం మొదలు పెట్టాడు పుల్లయ్య. అందుకున్నాడు పరమయ్య తాళం వేస్తూ. పాటలు సాగించారు. గ్లాసులు ఖాళీ చేస్తున్నారు.

పటకాతో ఫెళ్ళుమని కొట్టిన చప్పుడు పెద్ద కేక విని పాటనిలిచి పోయింది. ఇద్దరూ లేచి నుంచున్నారు.

ఒకడు ఒకదానిని పటకతో కొడుతూ "చినాల్, గిదా నువు చేసేది" అని జుట్టు పట్టి లాక్కుపోతున్నాడు. జనం చాలామంది కూడారు. పుల్లయ్య కూడా

ఒక అడుగు ముందుకు వేశాడు.

నల్లపిల్ల పెద్దగా నవ్వేసింది.

వెనక్కు తిరిగి చూచాడు పుల్లయ్య.

"కూకో. ఏమున్నదాడ? ఎప్పుడుండేడిదే. ముండ మిండనితో వచ్చింది. మొగడొచ్చిండు. గుంజుకపోతాండు" అన్నది.

కూలబడ్డాడు పుల్లయ్య. పరమయ్యకూడా కూలబడ్డాడు. మళ్ళీ గ్లాసులు, మోదుగాకులు ఖాళీ అయినాయి.

బాగా తాగేశారు ఇద్దరూ. ఇద్దరికీ స్పృహలేదు. ఒకరిని ఒకరు పట్టుకొని లేచారు. తూలుతూ కూనిరాగాలు తీస్తూ సాగిపోయారు. కొంత దూరం వెళ్ళి ఒక ఫుట్ ఫాత్ మీద పడిపోయారు. స్పృహలేకుండా నిద్రపోయారు.

తెల్లవారి బాగా పొద్దెక్కిం తరవాత పోలీసువాడు లేపితే లేచారు. లేచి జేబులు చూచుకున్నాడు పుల్లయ్య. ఖాళీ!! గుండె పగిలింది "పైకం పోయింది" అని ఏడ్చేశాడు. పరమయ్య నిర్విణ్ణుడైనాడు. ప్రతిమలా నుంచున్నాడు.

"యాడ్ది బే పైకం? జేబులు కొట్టిన్రా" అని బెదిరించాడు పోలీసు.

పరమయ్య కూడా ఏడ్చేశాడు.

ఇద్దరినీ బెదిరించి పోలీసువాడు పట్టుకుని పోయాడు. కొంతదూరం వెళ్ళిం తరువాత అదిరించి బెదిరించి ఏమైనా రాలుతుందేమోనని చూచాడు. జేబులన్నీ వెతికాడు. ఏమీ కనిపించలేదు, చిల్లర పైసలు తప్ప. అవి వదిలించుకొని ఇద్దరినీ వదిలేశాడు పోలీసు.

వారు రాకపోయేవరకు గుడిసెల్లో గుసగుసలు బయలుదేరాయి.

"బాలయ్యన్నైతే ఇట్ల పోయేటోడు, అట్ల కట్టేటోడు, ఇట్ల వచ్చేటోడు. ఏమైరీ ముండకొడుకులు?" అని ఒకడు అడిగాడు.

"అఁ ఏమైతరు? పిత్తితాగి పడుంటరు" అన్నాడు ఇంకొకడు.

"అట్టకాదన్న, పైస తీస్కొని యాడికన్న సట్కాయించిన్రేమొ!"

"పుల్లిగా డసువంటోడేమో, పరమయ్యన్న సుత పోతాడే?"

"ఏమో! పైస శాన చెడ్డదే. ఎట్ల చెప్పతం?"

"పైక మెవడన్న కొట్టేసిండేమొనే?"

"ఏమో! ముండకొడుకులు. పిచ్చయ్యన్నంటే వానిమీద నూకెటోల్లు. పాపం, జేల్లపడ్డడు, మనకోసరమేకాదే.?"

ఇలాంటి గుసగుసలు అనేకం బయలుదేరాయి. గూడెమంతా ఉడికిపోయింది. ఆబాల గోపాలం అందరూ వారిని తిట్టారు. బాలయ్యను పొగడారు, కాని, బాలయ్య దగ్గరికి వెళ్ళేధైర్యం ఎవరికీ లేకపోయింది. ఎక్కడున్నా వారిద్దరినీ పట్టుకొని రావాలనే నిర్ణయం జరిగింది. డబ్బు పోవడమేకాదు, వారు గుడిసెల వారికి ద్రోహం చేశారనుకున్నారు. ఆ సాయంకాలం ఇద్దరినీ తన్నుకుంటూ లాక్కొని వచ్చారు. ఇద్దరూ హోరు హోరుమని ఏడ్చారు. డబ్బు పోయిందన్నారు. అందరికాళ్ళు పట్టుకున్నారు, అయినా ఒక్కడూ వినలేదు.

"ఎవని పైకమని తాగిన్రురా!" అని ఒకడు బాదాడు.

"లంజకొడుకులు లెచ్చర్లు కొట్టిన్రు. చావున్రి" అని ఇంకొకడు బాదాడు.

లేస్తే బాదారు. పడ్తే బాదారు. వళ్ళంతా రక్తం అయింది. నోళ్ళల్లో రక్తం ఉముస్తున్నారు. అయినా, గుడిసెలవాళ్ళకోపం చల్లారలేదు. కాస్త ఊపిరితో మూలుగుతున్న సమయంలో బాలయ్య వచ్చాడు గుంపులోంచి దూసుకొని పోయి వారికి అడ్డం నిలిచాడు.

బాలయ్య మీద కూడా రెండు చేతులు పడ్డాయి.

అప్పుడు అర్థం అయింది వారికి.

అంతా ప్రతిమల్లా నుంచుండి పోయారు.

తలలువంచి మౌనంగా నుంచున్నారు.

"పానాల్తీస్తాన! మనుసులా! సైతాన్లా? చంపుండిరా. నన్ను చంపుండి. వాల్ల మీదెందుకుపడ్డరు? కొట్టుండి, ఊఁకొట్టుండి."

"అట్ల కాదే బాలయ్యన్న! పైకం తీస్కపోయి..."

"అవ్ నే. పైకం తీస్కపోతే చంపుకుంటారే. అయ్యయ్యో చూడండి, పెయ్యంత చిట్లింది, పొరి. తేరి నీలు. చూస్త నిలబడ్తరేం?"

ఒక్కొక్కరూ ఒక్కొక్క పనికి పరుగెత్తారు. వారిని చావబాదిన వారే చికిత్స చేయడం ప్రారంభించారు. ఒకడు నీళ్ళు తెచ్చాడు. ఒకడు గాయాలు కడిగాడు. ఒకడు కట్టు కట్టాడు. ఒకడు చమురు రాశాడు.

"బాలయ్యన్నా! నువ్వు మడిసివి కావే, దేవునివే" అని కాళ్ళ మీదపడి ఏడ్చేశారు పరమయ్య, పుల్లయ్యలు.

అక్కడక్కడ నుంచున్నవారంతా కంట తడిపెట్టారు.

కన్నీటితో బాలయ్య కాళ్ళు కడిగారు.

★ ★ ★

# పద్దెనిమిది

రజని ఇంట్లో ఉందనే విషయమే మరచిపోయినట్లున్నాడు రాజారావు. నాటి రాత్రి తరవాత మళ్ళీ వెళ్ళలేదు ఆవిడ దగ్గరికి. పూవును తీగ నుంచి తెంపేసి నట్లుంది రజని స్థితి. ఆ ఇంట్లో ఎవరూ ఆవిణ్ణి గురించి పట్టించుకోవడం లేదు. ఆవిడతో మాట్లాడే వారూ లేరు. భోజనం, ఫలహారం మాత్రం అందుతున్నాయి. అవి తెచ్చి అందించే పనివాళ్ళు సైతం ఆవిడ విషయంలో ఒక రకంగా ప్రవర్తిస్తున్నారు. ఒకనాడు ఆమె స్పష్టంగా విన్నది ఒక దాసిది అంటూండగా "గుడిసెల్ల ముండ దొర సాని కూకున్నది" అని. చిలకను పంజరంలో పెట్టి వేళకింత తిండి వేస్తున్నట్లుంది. అప్పుడప్పుడు పార్వతి దగ్గరికి వెళ్తుండేది. కాని, పార్వతి మనసిచ్చి మాట్లాడలేదు. కాక ఈవిడతో మాట్లాడాల్సిన విషయాలూ లేవు ఆవిడకు. రాజారావు తనను ఇలా ఎందుకు చేస్తున్నాడో అర్థం కాలేదు. అతనిమీద కోపం వచ్చింది. అది ద్వేషంగా మారింది. అతనిని తిట్టాలనుకుంది. రక్కాలనుకుంది. ఇంట్లోకి వెళ్ళి తన రొద వినిపించాలనుకుంది. రాజారావుకు తెలిసిన వాళ్ళెవరు? ఎక్కడ చెప్పాలి? ఎలా చెప్పాలి? ఏమని చెప్పాలి? అసలా ఇల్లే ఒక చెరలా అనిపించిందావిడకు. ఇల్లు వదలి వెళ్ళిపోవాలనిపించింది. కాని ఎక్కడికి? ఎవరు తీసికెళ్తారు? ఒకనాడు పబ్లిక్ గార్డెన్‌కు వెళ్దామనుకుంది. ఒక్క డ్రైవరూ ఆవిడ మాట వినలేదు. పార్వతి చెపితే కూరగాయలకోసం, పాలడబ్బాల కోసం కూడా కార్లు ఉరుకుతాయి. ఎవరో గుండెలో బాకు గుచ్చి నట్లనిపించింది.

ఒకనాటి అర్ధరాత్రి నారాయణరావు వచ్చాడు రజని గదిలోకి. నారాయణరావు తాగే వుంటాడు. సోలుతూనే వస్తాడు. కాని, అర్ధరాత్రి అతను ఎక్కడికీ వెళ్ళలేదు. వెన్నుదట్టి లేపాడు. రజని మేల్కొంది. కళ్ళు తెరిచి చూచింది. కెవ్వుమని కేక వేయాలనుకుంది. కాని, ధ్వని పెగల్లేదు. ముక్కు మూసుకుంది. వెర్రి వెర్రిగా చూడసాగింది. నారాయణ రావు నవ్వాడు. "నీకు చదరంగం వచ్చా? వాడు గుర్రాన్ని పెట్టి 'షా' అనేశాడు. గుర్రపు నడకకు మంత్రి అందుతున్నాడు. మంత్రిని ఎలా రక్షించాలి? చెప్పు మరి, ఎలా రక్షించాలో మంత్రిని."

రజని గుడ్లప్పచెప్పి చూస్తూ వుండిపోయింది. జవాబేం చెబుతుంది? ఆవిడకు చదరంగం ఏమిటో తెలీదు. సణుకుతూంది. నారాయణరావును చూస్తే ఏమిటో భయం భయంగా ఉంది. ఏం చేస్తాడో ఏమో!

"ఏం, మాట్లాడవేం? నన్నేం దయ్యమనుకున్నావా? నేను నారాయణరావును. ఈ ఇల్లంతా నాది. ఈ ఆస్తి అంతా నాది. ఓహ్! ఏం మెరిసిపోతున్నావే! ఏది ఒక ముద్దు – ఒక్కటి – ఒకే ఒక్కటి" అన్నాడు, చేతులు చాచాడు.

దూకింది రజని. తూలుతూ లేచి చేయిపట్టుకున్నాడు నారాయణరావు. చేయి విదిలించుకుంది. నారాయణరావు దబాల్న పడిపోయాడు.

చెమటలు పోశాయి రజనికి. ఏమీ తోచలేదు. ప్రాణం అనే పదార్థం లేచిపోయినట్లనిపించింది క్షణం సేపు. తరువాత గుండె దడ దడ కొట్టుకుంది. గదిలోంచి నెమ్మదిగా బయటికి నడిచింది.

నారాయణరావు నేలమీదనే పడి నిద్రపోయాడు.

రజని రాజారావుగదికి వెళ్ళింది. తలుపు వేసివుంది. లైట్లు ఆర్పేసి వున్నాయి. బహుశః నిద్రపోతున్నాడు, లేపుదా మనుకుంది. అతనివల్ల సహాయం లభించదని తేల్చుకుంది. తానంటే లెక్కచేయనివాడు తనకేం సహాయం చేస్తాడు? తాను చెప్పిందివిని నవ్వి ఊరుకుంటాడు. పార్వతికి చెప్పకుందా మనుకుంది. ఆవిడా నిద్రపోతూంది. లేపి చెపుదామనుకొంది. ఏమని చెపుతుంది? నారాయణరావు ఆవిడ తండ్రి. ఆవిడ మాత్రం ఏం చేస్తుంది? వరండాలో కూర్చుంది వంటరిగా. లైట్లు సైతం లేవు. చీకటి. తన గతి యిలా అయినందుకు మౌనంగా ఏడ్చింది. ఎంతసేపు ఏడుస్తుంది? లేచింది. తన గదివైపు నడిచింది. నారాయణరావు నేలమీద పడి గుర్రు కొట్టి నిద్రపోతున్నాడు. ఆ రాత్రి ఆవిడ మనసు ఎంత బాధపడిందో, ఎంత కృంగిందో, ఎంత వేదన పడిందో, ఎందరిని తిట్టిందో!

తెల్లవారి నారాయణరావు మంచం మీద పడుకొని వున్నాడు. ఇంట్లో ఉన్న దాసదాసీలు, ఇంటివాళ్ళు అనేక రకాలుగా వ్యాఖ్యానించారు. రాజారావును వదలి నారాయణరావును పట్టుకుందన్నారు ఒకరు. ఇక నారాయణరావును గుల్ల చేస్తుందన్నా రొకరు. అంతా ఆవిడను అసహ్యించుకున్నారు. పామును చూచినట్లూ, ఆటంబాంబును చూచినట్లు చూశారు.

చెరవలె ఉండిన ఇల్లు రజనికి నరకంగా అనిపిస్తూంది. విచ్చుకత్తుల బోనులో ఉంచినట్లనిపించింది. ఉరి మెడకు బిగించినట్లూ, ఉక్కిరి బిక్కిరి అయినట్లూ అనిపించింది. ఒక్క సానుభూతి వాక్యం లేదు సరికదా, కనీసం మాట్లాడేవాళ్ళు లేరు. పనివాళ్ళు సైతం అన్నం తెచ్చిచ్చినప్పుడూ, టిఫిన్ వగైరాలు తెచ్చినప్పుడూ విసుక్కుంటున్నారు. తనకు ఇంకా ఇవి ఎందుకు తెచ్చిస్తున్నారో అర్థం కాలేదు. రాజారావు వచ్చి అమాంతంగా గొంతు పిసికి ఎందుకు చంపడు? అసలు రాజారా వెవరు? తా నెవరు? ఈ ఆలోచనల్తో కృంగి కృశించిపోయింది. కనీసం ఏడవడానికి కన్నీరు లేకుండా పోయింది. అయినా, సానుభూతి చూపే వాడుంటేగా ఏడుపంటూ రావడానికి?

అలాంటి దశలో వచ్చింది డెయిజీ అక్కడికి. వాస్తవానికి డెయిజీ రజని దగ్గరికి రావాలనిగాని, ఆమె విషయంలో సానుభూతి చూపాలనికాని వచ్చింది కాదు. ఆ రాకకు ఉస్మాన్ కారణం. ఉస్మాన్‌కూ కొన్ని నియమాలున్నాయి. వాటిని తప్పడు. అల్లాంటి నియమాల్లో తనకు వచ్చిన డబ్బులో అందుకు కారకులైనవారికి కొంత కమీషన్ ఇవ్వడం. అలాగే ఇచ్చాడు డెయిజీకిన్నీ. ఆ ఇవ్వడము చాటుగా ఇచ్చాడు – సూర్యరావుకు తెలియకుండా ఇచ్చాడు. డెయిజీ వెనుకా ముందూ చేసింది. కాని, బలవంతంగా చెయి లాక్కుని డబ్బు చేతిలో పెట్టాడు ఉస్మాన్. కాదనలేక పోయింది. కాని, హరించుకోలేకపోయింది. ఆ డబ్బు రాజారావుకు ఇచ్చెయ్యాలనే ఉద్దేశంతో వచ్చింది. అయితే, రాజారావు దగ్గరికి వెళ్ళేప్పుడు రజని గదిలోకి చూడాలనే చూచింది. రజని మంచంలో వాడిన మల్లెలా పడి ఉంది. అనుకోకుండా

ఆ గదిలోకి ప్రవేశించింది. డెయిజీని చూడగానే లేచి కూర్చుంది రజని. డెయిజీ మంచం పక్కకు కుర్చీ లాక్కొని కూర్చుంది.

రజని కళ్ళలో దుఃఖం, బాధ, వ్యథ – ఇంకేమేమో గూళ్ళు కట్టుకున్నట్లు కనిపించాయి డెయిజీకి. మొన్న తాను చూచిన రజనీకి, నేటి రజనీకి ఏమాత్రం పోలిక కనిపించలేదు. ఏమిటీ మార్పు? రాజారావు ఈవిడను కాల తన్నాడా? ఈవిడతో అతని అవసరం తీరిందా? రాజారావు స్వభావం డెయిజీకి తెలుసు. అయినా, రజని నతడు ప్రేమించాడనుకుంది. ఎంచేతనంటే, రజనిలో ఆ ఆకర్షణ వుంది. కాని, రాజారావుకు ఆ ఆకర్షణ మొఖం మొత్తి ఉంటుంది. అతడు ఆడదాన్ని వాసన చూచిన పువ్వులా నేలకు కొట్టగల ధీరుడు–మగవాడు.

రజని వింతగా చూచింది డెయిజీని. డెయిజీ వాస్తవంగా ఆవిడకు తెలీదు. గ్రహించింది. డెయిజీ పరిచయం చేసుకుంది తనను. పలుకరించింది, "ఏ అలా వున్నావు" అని.

రజని కళ్ళు చెమ్మగిల్లాయి. "ఏం లేదు, ఏదో సుస్తీగా వుంది."

"ఓహో! డాక్టరుకు చూపించలేదా?"

"ప్రతిదానికి డాక్టరెందుకూ. అదే తగ్గిపోతుంది."

ఏదో అషామాషీ కబుర్లు చెప్పుకున్నారు ఇద్దరూ కొంతసేపు. డెయిజీ ఎంతో సానుభూతి కనబర్చింది. అది ఒయాసిస్సులా ఉంది. పరిణామాల్ను గురించి మాత్రం చెప్పలేదు. తాను ట్యాంక్‌బాండ్‌కు వెళ్తున్నానంది డెయిజీ. వస్తే తోడుగా వెళ్దామంది. రజని ఎన్ని రోజుల్నుంచో అనుకుంటూంది, బయటి ప్రపంచంలోకి వెళ్ళాలని. వస్తానన్నది. వెంటనే తయారైంది. ఇద్దరూ టాక్సీలో ట్యాంక్‌బండ్ చేరారు. అప్పటికి సాయంకాలం అయింది. హుసేన్ సాగరం ఎర్ర వారింది. మింట్ పొగగొట్టంలోంచి వస్తున్న పొగ సంధ్యారాగాన్ని కప్పేస్తున్నది. ఆ దృశ్యం, కిలకిల లాడే పిల్లలు, ఉషారుగా చెట్టపట్టాలు పట్టుకొని నడిచే పడుచు జంటలూ రజని మనసుకు కొంత ఉల్లాసం కలిగించాయి. ఇద్దరూ రోటరీ క్లబ్బువారి పిల్లల పార్కులో కూర్చున్నారు. మౌనంగా హుసేన్ సాగర్ అందాన్ని చూచింది కొంతసేపు రజని.

"అక్కా!" డెయిజీని సంబోధించింది. అలా సంబోధించినందుకు ఆవిడ స్వయంగా ఆశ్చర్యపడింది. అనుకొని అన్నమాట కాదది. దానంతట అదే వచ్చేసింది. మనసులోంచి వచ్చిన మాట. డెయిజీ కూడా అంత ఆశ్చర్యంతోనూ చూచింది.

"ఎంత సొగసుగా ఉంది ఈ హుసేన్ సాగరం? ఇది లేకుంటే ఎంతమంది చచ్చేవాళ్ళో" అన్నది.

"చెల్లాయి" అందామనుకుంది డెయిజీ. కాని, అనలేక పోయింది. "రజనీ! చావు బతుకుల్లో ఉండిన ఒక రాకుమారుడు జీవించినందుకు నిర్మించిందీ హుసేన్ సాగరం. ఈ చెరువే బ్రతుక్కు చిహ్నం. కాని, ఇంతవరకు ఎందరిని బలిగొన్నదో ఈ చెరువు!"

"ఎలా?"

"జంట నగరాల్లో ఆత్మహత్య చేసుకోదల్చుకున్నవారు సగంమంది ఈ హుసేన్ సాగరంలోనే పడి చస్తారు."

ఒక నిట్టూర్పు విడిచింది రజని. "ఇంత అందం చూస్తూ కూడా ఎలా చస్తారో!"

'ఎంత పిచ్చిదానివి!' అన్నట్లు చూచింది డెయిజీ. "జీవితాన్ని రోసి చావదల్చుకొని వచ్చినవారికి అందం ఏమిటి రజనీ, పిచ్చిదానివి కాకపోతే?"

రజని మళ్ళీ మాట్లాడలేదు. రాగరంజితమైన పశ్చిమాకాశాన్ని చూస్తూ ఏదో ఆలోచిస్తూ వుండిపోయింది. మరేదో ఆలోచనలో మునిగిపోయింది డెయిజీ.

"అక్కా!" అనే పిలుపువిని ఈ లోకంలోకి వచ్చింది. "అక్కా, నువ్వెంత మంచిదానవు. మనసులు కలిసిన మనుషులు వెంట ఉంటే చావ తల్చుకున్నా బ్రతుకుతారే జనం" అన్నది.

"ఎందుకలా అంటున్నావ్. మనసిచ్చిన రాజారావుండగా నీకు చావాలని ఎందుకనిపించింది?"

రజని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అక్కా చెప్పనా?" అని తన మనసులో మసలుతున్నదంతా వెళ్ళగక్కింది. నారాయణరావు వృత్తాంతం, తన హైన్యం, దైన్యం అన్నీ ఎరుకపర్చింది.

డెయిజీ విస్తుపోయింది. ఏం చేయాలో ఆవిడకు తోచలేదు. రజనిని సూర్యారావు దగ్గరికి తీసికెళ్దా మనుకుంది. సూర్యారావు ఆవిడకు స్వాగతం చెబుతాడు, నిజమే. కాని, వాడు తుచ్ఛుడు. అయినా అంగీకరిస్తుందా అందుకు? ఏవేవో ఆలోచనలు వచ్చాయ్. ఒక నిర్ణయానికి రాలేకపోయింది.

అప్పటికి బాగా రాత్రి అయింది. ట్యాంక్‌బండ్ మీద జనం పల్చబడ్డారు. ఇద్దరూ లేచారు. కొంతదూరం నడిచి టాక్సీ పుచ్చుకొని వెళ్ళిపోయారు. రజనిని ఇంటిదగ్గర దింపి వెళ్ళిపోయింది డెయిజీ. తానలా వెళ్ళినందుకు ఎవరైనా ఏమన్నా అంటారేమో అనుకుంది రజని. గదిలో ప్రవేశించిన తరువాత ఆవిడకు తెలిసిందేమంటే – ఆ ఇంట్లో తన విషయం ఎవరికీ అవసరం లేదని. టేబుల్ మీద భోజనం మాత్రం పెట్టివుంది. ప్లేటు మీద మూత పెట్టేసింది. బట్టలైనా మార్చకుండా మంచంలో పడిపోయింది. ఈ పూట ఆవిడ మనసు కొంత తేలిగ్గా ఉంది. అందువల్ల ఏవేవో తేలికైన ఆలోచనలు వచ్చాయి.

రజని ఆలోచనల్లో తేలిపోతున్నప్పుడు గడపలో అడుగుపెట్టాడు రాజారావు. వెంటనే వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. అతడలా ఎందుకు అడుగుబెట్టాడు? వెంటనే ఎందుకు వెళ్ళిపోయాడు? అంటే, మనకు తెలీదు. పోతే, రజని ఆ విషయం గమనించనేలేదు.

రజనీకి డెయిజీకి స్నేహం నానాటికి పెరిగిపోసాగింది. ఇప్పుడు వారిద్దరూ సుమారు అక్క చెల్లెళ్ళైపోయారు. ఆ విషయమూ హేళనగానే చెప్పుకున్నారాఇంట్లో. రాజారావుదాకా పోయిందా వార్త. అయితే, అతడా విషయం పట్టించుకోలేదు. పార్వతికి డెయిజీ రోజు ఇంటికి రావడం ఇష్టంలేదు. వేశ్యగా తయారవుతున్న

దనుకుంటున్న రజని ఇంట్లో ఉండడం సహించలేకపోయింది. రజనిని ఎక్కడికి ఎలా వెళ్ళగొట్టాలో అర్థం కాలేదు. ఆవిడకు డొంక తిరుగుళ్ళు చాతకావు. రజనికి పూర్వజన్మ వృత్తాంతమంతా చెపితే సరిపోతుందనుకుంది. కాని రజని దగ్గరికి పనికట్టుకొని పోయి ఆ విషయం చెప్పడం ఆవిడకు ఇష్టంలేదు. రజని ఈమధ్య పార్వతి దగ్గరికి రావడం లేదు.

ఒకనాడు డెయిజీ వచ్చింది. రజని బైల్దేరింది. కార్లో సూరి ఉన్నాడు. డెయిజీ సూర్యారావుని పరిచయం చేసింది. ముగ్గురూ నౌబత్ పహాడ్‌కు వెళ్ళారు. సూరి సొగసుగా మాట్లాడాడు. రజని అట్టే మాట్లాళ్ళేదు. కాని, సూర్యారావు విషయంలో ఆవిడకు ఒక సదభిప్రాయం ఏర్పడింది. సూర్యారావు మంచివాడే అనిపించింది. పైగా, తన అక్కడెయిజీ సూర్యారావు దగ్గర ఉంటూంది. సూర్యారావుతో మాట్లాడ్డంలో, అతనితో కలిసి తిరగడంలో నష్టం లేదనుకుంటూంది. తనను గురించిన గుసగుసలు రాజారావు ఇంట్లో ఎక్కువైనాయి. ఆ విషయమే గమనించ లేదావిడ. ఒకనాడు ఒక దాసీది ముఖాన్నే అనేసింది – "ఆ సూర్యారావుతో కులక్క ఇక్కడెందుకూ ఉండటం?" అని. రజని మనస్సు చివుక్కుమంది.

సూర్యారావు ఎవరు? తానేమైనా తప్పు పని చేసిందా? రాజారావు తన భర్త. అతడు తనను విస్మరించాడు. నిజమే. అంతమాత్రంతో సూర్యారావు వెంట తిరగాలా? రాజారావు ఇది తప్పు అని ఎందుకు చెప్పడు? తప్పుపని చేస్తున్నావని తనను ఎందుకు దండించడు? అలా మౌనం వహించడం ఆవిడ సహించలేకపోయింది. రాజారావు దగ్గరికి వెళ్ళి కాళ్ళ మీద పడి ఏడవాలనుకుంది. సూర్యారావు అంటే ఆవిడకు అసహ్యం అనిపించింది. రాజారావు ఆవిడకు చేయించిన చికిత్సా, చూపిన దేశాలూ, కనబర్చిన ప్రేమా గుర్తుకు వచ్చాయి. తానేమైనా ఇవ్వగలిగిందా అతనికి? తాను చిరునవ్వు నవ్వితే స్వర్గం దిగివచ్చినట్లు ఆనందించేవాడే, అతని అండన తాను జీవిస్తూందే, అలాంటి వాడి కాళ్ళు పట్టుకుంటే ఏం?

నిశ్చయించుకుంది; అతని రాకకు ఎదురు చూస్తూ కూర్చుంది. వచ్చాడు రాజారావు. అతని గదిలోకి వెళ్ళిపోయాడు. క్షణం తర్వాత వెళ్ళింది. తలుపుదగ్గర నుంచుంది. బూట్లు విప్పి చూచాడు రజనిని. అతని కళ్ళు నిప్పుల్లా కనిపించాయి రజనికి. వణికిపోయింది.

"ఏం, ఎందుకు వచ్చావ్?"

ఏమనాలో అర్థం కాలేదు ఆవిడకు. దుఃఖం ముంచుకొచ్చింది. కన్నీరు జలజలా రాలింది. కాళ్ళమీదపడి ఏడ్చేసింది. రాజారావు మనసు కరగాల్సింది. కరగలేదు. పాషాణం అయింది. లేచి నుంచున్నాడు. కాలితోనే ఆమెను పక్కకు నెట్టేశాడు. పడిపోయింది రజని. మళ్ళీ లేచింది. గుమ్మందాకా వెళ్ళిన రాజారావుకు అడ్డంగా పరుగెత్తి మళ్ళీ కాళ్ళచుట్టేసుకుంది.

"నేనేమైనా తప్పుచేస్తే నన్ను దండించండి. ఎందుకలా ప్రవర్తిస్తారు? నేను మీ భార్యను కానా?" అని ఏడ్చింది.

"నువ్వు నా పెళ్లానివా? బజారుముండవు" అని నెట్టి వెళ్ళిపోయాడు.

అహం దెబ్బతిన్నది రజనికి. గదిలోకి వెళ్ళి కొంతసేపు ఏడ్చింది. తరవాత ఆ ఇల్లు వదిలి రోడ్డునపడి వెళ్ళిపోయింది.

# పందొమ్మిది

బెంగుళూరు నుంచి రాగానే అన్నీ సమస్యలే ఎదురైనాయి రాజారావుకు. డబ్బు, ప్రతిష్ఠ, వ్యాపారం – అన్నీ మంటకలిసిపోతున్నంత పనైంది. సముద్రంలో ఓడ పగిలి మునిగిపోతున్నట్లనిపించింది. కాని, అన్నీ చక్కబెట్టాడు రాజారావు. అందుకు తన సామర్థ్యమే కారణం అనుకున్నాడు రాజారావు. తాను తిరుపతి వెంకటేశ్వరునికి మొక్కడం, ముడుపు కట్టడమే కారణం అంది పార్వతి. అంతేకాక, పుట్టిన పాప అదృష్టవంతుడనీ, రజని ఇంట్లో అడుగు పెట్టడంతో కష్టాలు వచ్చాయనీ, పాప పుట్టగానే పోయాయని అన్నది. తన సామర్థ్యాన్ని అంత తేలిగ్గా చూడ్డం ఇష్టంలేకున్నా అదంతా ఏడు కొండలవాని దయ అనే విషయం అంగీకరించాడు రాజారావు.

ఇప్పుడు రాజారావు పట్టిందల్లా బంగారం అవుతూంది. అతడు అనుకున్నట్లు జగన్మోహనరావు బదిలీ అయింది. అతడు ఈ దేశం విడిచి విదేశానికి వెళ్ళాడని కూడా తెలిసింది. నారాయణరావు విషయంలో కట్టు దిట్టాలు చేశాడు. చంద్రయ్య విధేయుడుగా వుంటున్నాడు. ఉస్మాన్ సహకార సద్భావాలు లభించాయి. కంట్రాక్టులు అప్పటికంటే ఎక్కువగానే సంపాదిస్తున్నాడు. పని సాఫీగా జరిగిపోతూనే వుంది.

ఇవన్నీ నిజమే. అయినా, అతని మనసును బాధిస్తున్న విషయం మరొకటుంది. సిమెంటు కల్తీ విషయంలో అనేక రాద్ధాంత సిద్ధాంతాలు జరిగాయి. గండం తప్పి, పడాల్సిన శిక్ష తప్పినమాట వాస్తవమే. కాని, అతని ప్రతిష్ఠ దెబ్బతిన్నది. కాస్త ఓరచూపు చూస్తున్నారు జనం. పోయిన ప్రతిష్ఠను ఖరీదు చేయాలని ఆలోచిస్తున్నాడు. ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటుచేసి, నగరంలో ముఖ్యులందరినీ ఆహ్వానించాలనుకున్నాడు. అందుకు నెపంగా బాబు బారసాల దొరికింది. ఆ కారణంగా చాలామందిని కలుసుకొని పరిచయాలు పెంచుకోవచ్చునని అతని ప్రణాళిక. విందు ఏ హోటల్లోనో ఏర్పాటు చేయదలచలేదు. ఎంతైనా ఇంట్లో ఇచ్చినట్లు వుండదు. అయితే, ఇంట్లో తాగుడూ వగైరాల ఏర్పాటు చేయడానికి పార్వతి అంగీకరించదు. అయినా, అడిగి చూచాడు. ఇంట్లో తాగి తందనాలాడ్డం సహించనన్నది. అందు విషయంలో ఇద్దరికి తర్జన భర్జనలు జరిగాయి. అయినా, రాజారావు తన మంకు వదిలాడు కాడు. పార్వతి ఆ రోజు యాదగిరి గుట్టకు వెళ్ళిపోవడం నిశ్చయం అయింది.

విందుకు కావాల్సిన ఏర్పాట్లన్నీ జరిగాయి. వేయిమందికి ఆహ్వానాలు పంపారు. చాలామందికి స్వయంగానే ఆహ్వానాలిచ్చి వచ్చాడు. విందు రాత్రి ఎనిమిదిగంటలకు ప్రారంభం అయింది. ఒక్కొక్కరే వస్తూ మొత్తం బంగళా నిండిపోయింది. మత్తు పానీయాలు గండిపేట నీళ్ళలా ప్రవహించాయి. అరుపులు, కేకలు, కేరింతలు, నవ్వులు – వీటితో బంగళా ప్రతిధ్వనించింది. ఒక్కొక్కరి దగ్గరికే వెళ్ళి కలుసుకొంటున్నాడు రాజారావు. జోరుగా సాగుతూంది పార్టీ. ఒక ఆంగ్లో ఇండియన్ యువతి డ్యాన్సు

ఏర్పాటు చేయబడింది. వాద్యాలు మ్రోగాయి. యువతి స్టేజీమీదికి వచ్చింది. లైట్లు ఆరిపోయాయి. వర్తులాకారమైన వెలుగు ఆవిడ ముఖంమీద పడి క్రమంగా క్రమంగా దిగుతూ కాళ్ళ దగ్గరికి వచ్చి మాయం అయింది. మరొక లైటు వెలిగింది. స్టేజీ పొంతం వెలిగిపోయింది. ఆవిడ డ్యాన్సు ప్రారంభించింది. కొందరు చూస్తున్నారు. కొందరు తాగి తూలుతున్నారు. కొందరు నవ్వుతున్నారు. కొందరు చప్పట్లు కొడుతున్నారు.

రాజారావు ఉస్మాన్ దగ్గరికి వెళ్ళారు. ఉస్మాన్ అట్టే తాగలేదు. కరచాలనం చేసి పక్కనే కూర్చున్నాడు రాజారావు.

"చాల థాక్సండి. మీ ఉపకారం మరిచిపోలేను!" అన్నాడు రాజారావు.

"ఆ! దానికేం గాని, ఆ వెధవ అనలిస్టు మంకుపట్టు పట్టాడు. మీతో డబ్బు ఖర్చుపెట్టించానే అని బాధగా వుంది. ఒకరి కొకరం సహాయం చేసుకోకుంటే ఎలా?"

"డబ్బుకేంలెండి, వెధవది! వస్తుంది, పోతుంది. మీరేం చేస్తారు? మీరేమన్నా పుచ్చుకున్నారా? సరేగాని, మీ చిలక ఎలా ఉంది?"

"చిలక ససీమా? చాల బాధ పెట్టిందండీ. పాపం! ఎలా ఓర్చుకుందో ఆ బాధ? అల్లా మెహర్బానీ ఉంది. అది బ్రతికి పడింది. లేకుంటేనా?"

"అవును, నాకు తెల్సు, మీకు అదంటే ప్రాణం అని. చిలకలు ఎంత మంచి పక్షులండీ. పచ్చని పక్షికి ఎర్రని ముక్కు. పలుకుతాయి పైగా. మనం చెప్పినవే అప్పగించినా ఎంత ముద్దుగా ఉంటాయండీ ఆ మాటలు!"

"నా ససీమ్ పచ్చనిది మాత్రమేకాదు. పంచవన్నెల చిలక. ఏంచక్కా మాట్లాడుతుందనుకున్నారు! సరేగాని, మీ వ్యాపారం ఎలా వుంది?"

"మీకు తెలియందే ముంది? ముంచేస్తున్నారు అధికారులు."

"మంచి వ్యాపారం చూపనా?"

"చెప్పండి."

"ఈ మధ్య ఇండ్లస్థలాల గిరాకి ఎలా ఉందో చూస్తున్నారుగా! ఏమాత్రం రిస్కులేని వ్యాపారం. ఇవ్వాళ కొని, రేపు అమ్మేయండి. రూపాయికి కనీసం రూపాయి లాభం వస్తుంది. ప్లాట్లు చేసి అమ్మేవారికి ఇంకా ఎక్కువే గిట్టుందనుకోండి. ఈ మధ్యనే ఒక స్థలం అమ్మాను, లక్షా 50 వేలకు. ఖరీదు చేసినవారు మళ్ళీ లక్ష సంపాదించుకున్నారు."

రాజారావుకు ఆశ కలిగింది. పోయిన డబ్బు ఇలా సంపాదించుకొన వచ్చునుకొన్నాడు. అది మంచి వ్యాపారమని తోచిందతనికి.

"మీ దృష్టిలో ఇంకా అల్లాంటి..."

"ఉంది. కాని, కొద్దిగా శ్రమపడాలి. చౌగ్గా ఇస్తాను."

"ఏమా శ్రమ?"

"ఆ స్థలంలో కొన్ని గుడిసె లున్నాయి. అవి తీసేయించుకోవాలి. అంతే. రెండెకరాల స్థలం ఉంది. లక్ష కిస్తాను. మీకు ఐదు లక్షలైనా వస్తాయి. నేనే ఎందుకు తొలగించలేదు అంటారేమో! వెళ్ళగొడ్తే హిందూ ముస్లిం రంగుపూసి పెద్దగోల జరుగుతుంది. చాలా మంది వచ్చారు దానికోసం. మీరు నష్టపడి ఉన్నారు.

మంచివారు. మీకు ఇవ్వాలని నా అభిప్రాయం. ఐనా ఆలోచించుకోండి. గుడిసెల్ను తొలగించడానికి నా బలం అంతా సహాయంగా ఇస్తా."

"థ్యాంక్సండీ. మీరు అండగా ఉంటే ఆకాశానికి చిల్లిపెట్టగలను ఎప్పుడు తేలుస్తారు వ్యవహారం?"

"మీ యిష్టం. ఐనా తొందరెందుకు? ఆలోచించండి."

ఆలస్యం అవుతే ఈ ఛాన్సు కాస్తా పోతుందనుకున్నాడు రాజారావు. మరొకరు ఎవరైనా దృష్టిలో ఉన్నారేమో ఉస్మాన్‌కు అనుకున్నాడు. త్వరగా వ్యవహారం ముగించడం మంచి దనుకున్నాడు.

"రేపు కుదురుతుందా?"

"నాకేమీ అభ్యంతరం లేదు."

స్టేజీమీద యువతి బట్టలు ఒక్కొక్కటే లాగేస్తూంది. జనం మహదానందంగా చూస్తున్నారు. అది నృత్యానికి పరాకాష్ట. చివరిబట్ట లాగేస్తున్నప్పుడు లైట్లు ఆరిపోయాయి. జనంలో గోల మొదలైంది. ఈలలు వేశారు కొందరు. లైట్ లైట్ అని కేకలు పెట్టారు కొందరు. ఎలక్ట్రిసిటీబోర్డువాళ్ళను తిట్టారు కొందరు. బోర్డు ఛైర్మన్ అక్కడే ఉన్నాడు; చల్లగా గదిలోకి జారుకున్నాడు.

చీకటి – ఒకరి ముఖాలు ఒకరికి కనిపించడం లేదు. ఉన్నవారంతా పెద్దమనుషులే, ఐనా ఈలలు, కేకలు, ఆడవాళ్ళ తిట్లు వినిపిస్తున్నాయి. ఎవరు ఎవరిమీద పడుతున్నారో అర్థం కావటం లేదు. అంతా తూలుతున్నారు, సోలుతున్నారు. ఒక కేక వినిపించింది – "నారాయణరావుగారు పడిపోయారు" అని. లేచి పరిగెత్తాడు రాజారావు. ఈలోగా క్రొవ్వొత్తులు వచ్చాయి. కొద్దిగా వెలుగు వచ్చింది. రాజారావు నారాయణరావు గదిలోకి వెళ్ళాడు. నారాయణరావు చేతిలో సీసాతో పడిపోయి ఉన్నాడు. కళ్ళు తెరిచే ఉన్నాడు. కాని, నోటమాట రావడం లేదు. చేత్తో సీసా చూపించి ఇంకా కావాలని సంజ్ఞ చేశాడు. ఐనా, ఎవరో తెచ్చి అందించారు. గది నిండా జనం మూగారు. డాక్టర్లు వచ్చారు. కాని, వారిదగ్గర స్టెతస్కోపు ల్లేవు. థర్మామీటర్లు లేవు. అంతా ఏదో తడిమి చూచారు. అంతా బయటికి వచ్చి సంప్రదించుకున్నారు. అసలు వాళ్లేమి ఆలోచిస్తున్నదీ వాళ్ళకు అర్థం అయ్యే దశలో లేరు. ఐనా, అంతాకలిసి నిర్ణయానికి వచ్చిందేమంటే – అది ఒకరకపు గుండెజబ్బనీ, వెంటనే హాస్పిటల్‌కు తీసికెళ్ళాలనీ.

రాజారావు మహా చిరాకుపడ్డాడు. జరుగుతున్న ఉత్సవానికి అడ్డు వస్తున్నాడు నారాయణరావు. నలుగురిలో తనకు తలవంపులు చేశాడు. ఐనా, జరుగుతున్న విందులో ఎలాంటి లోపం రానీయరాదనుకున్నాడు. ఏర్పాట్లలో పడిపోయాడు. లైట్లు వచ్చేశాయి. డ్యాన్సు మళ్ళీ మొదలైంది. జనంలో మామూలు సంరంభం, సంబరం వచ్చేశాయి. నారాయణరావుకు జబ్బు చేసిందనే విషయం సహితం ఎవరికీ గుర్తులేదు, అంతా నాట్యంలో నిమగ్నులైనారు. త్రాగుడులో లీనమైపోయారు.

చంద్రయ్య నారాయణరావును ఆస్పత్రికి చేర్చాడు. నారాయణరావుకు సక్రమంగా చికిత్స జరిపించాడు. స్పృహ వచ్చిన తరువాత నారాయణరావు మొట్టమొదట

అన్న మాట – వకీలును పిలిపించమని. రెండవది బ్రాందీ కావాలనీ. చంద్రయ్య వకీలు కోసం కబురంపాడు, బ్రాందీ అందించాడు.

మహబూబ్ కిషన్ వకీలు వచ్చాడు. నారాయణరావు ఆ దశలోనూ వీలునామా వ్రాయించాడు. తన ఆస్తినంతా ఒక వృద్ధుల గృహం, ఒక అనాథుల గృహం నడిపించడానికిగాను వ్రాసి ఇచ్చాడు. వాటికి తన పేరు పెట్టరాదన్నాడు. ప్రభుత్వం అందుకుగాను ఒక ట్రస్టు ఏర్పాటు చేయాలన్నాడు. రాజారావుకు గాని, తన కుమారునకుగాని దానితో ఎలాంటి సంబంధం ఉండరాదన్నాడు. రాజారావు ఇంటిని ఆస్పత్రిగా మార్చవలసిందన్నాడు. తాను చనిపోయిన తరువాత తన కళ్ళు గుడ్డివాళ్ళకు దృష్టి తెప్పించడానికి వాడమన్నాడు.

వీలునామా పూర్తయింది, చదివించుకున్నాడు. సంతకం చేశాడు. తీవ్రమైన గుండెపోటు వచ్చింది, విల విల లాడాడు. నర్సు అక్సిజను తెచ్చింది. నెట్టేశాడు. అంత బాధలోనూ బ్రాందీ కావాలన్నాడు. చంద్రయ్య అందించాడు.

సీసాతో గట గట త్రాగుతున్నాడు–

కొంత త్రాగాడు.

చెయి విడి పడిపోయింది.

సారాయి శవం మీద పడిపోయింది. శవం సారాయితో తడిసిపోయింది.

రాజారావు నెత్తీ, నోరూ బాదుకొని ఏడ్చాడు.

★ ★ ★

# ఇరవై

పగలంతా రిక్షాతొక్కి ఇంటితోవ పట్టాడు బాలయ్య. బాగా అలసి ఉన్నాడు. విధిలేక తొక్కుతున్నట్లు తొక్కుతున్నాడు రిక్షా.

బాగా రాత్రి అయింది. చీకటి గొంగళి పరచింది. వీధిలైట్లు ఆరిపోవాల్సిన సమయంకాదు. కాని, కొత్త పథకం ప్రకారం అవి పగలు వెలిగి, రాత్రి ఆరిపోతున్నాయి. బాలయ్య సాగిపోతున్న బాట అట్టే జన సమ్మర్దం కలది కాదు. కాలి నడకవారు వంటిగా వెళ్ళడానికి జంకే బాట అది. అప్పుడప్పుడు ఒక రిక్షా కాని, కారు కాని పోతుంటాయి.

ఆ బాటన విసుగ్గా తొక్కుతూ సాగిపోతున్నాడు బాలయ్య. అమాంతంగా రెండు వైపులనుంచీ ఇద్దరు వచ్చి ఆపేశారు. బాలయ్య గుండె ఆగినంత పనైంది. కళ్ళు చీకట్లు కమ్మాయి. తలమీద బలమైన దెబ్బ తగిలింది. కెవ్వున కేకపెట్టి పడిపోయాడు బాలయ్య. రెండు రిక్షాలు వస్తున్నాయి అటువైపే. వారు కేక విన్నారు. కేకలు వేస్తూ రిక్షాల వేగం పెంచారు. గూండాలు అది చూచారు. కాలికి బుద్ధి చెప్పారు, కర్రలు కూడా అక్కడే పారేసి. పారిపోయే వారిని చూచి "పక్డో పక్డో" అని వెంబడించారు రిక్షావారు. గూండాల్లో ఒకడు పారిపోయాడు. ఎదురుగా వచ్చే కారులైటు వాడి కళ్ళల్లో పడింది. కళ్ళు చీకట్లు కమ్మి పడిపోయాడు.

ఎదురుగా వస్తున్న కారు వెనుకగా వస్తున్న రిక్షాలూ పడిపోయిన వాని వెనుకా ముందు ఆగేయి. లేచి పరిగెత్తడానికి ప్రయత్నించాడు రామమనోహరసింగ్. రిక్షాలనుంచి దూకివచ్చి పట్టి బాదుతుండగా కారులో మనిషి దిగాడు. జరిగిన వృత్తాంతం తెలుసుకున్నాడు. వాణ్ణి పోలీసు స్టేషనుకు తీసికెళ్ళమని, బాలయ్య పడివున్న చోటికి కారు పోనిచ్చాడు. బాలయ్యను కారులో వేసుకొని ఆస్పత్రికి వెళ్లాడు.

అతడు ఇక్బాల్. యాభై సంవత్సరాలవాడు. అతనిది దబ్బపండు లాంటి ఛాయ, ముడతలు పడిన శరీరం. చెవులకు పొడవైన వెంట్రుకలు, డాక్టరు. డాక్టరు ఇక్బాల్ న్యూరో సర్జన్. ఏదో కేసు చూసి వస్తుండగా ఈ అవాంతరం ఎదురైంది.

"బాలయ్య తల పగిలింది" – ఈ వార్త అగ్గిలా గూడెంలో పాకింది. గూడెం ఆస్పత్రిముందు కూడింది. ఆ వార్త క్షణంలో అంచెలమీద రిక్షా వాళ్ళందరికీ అందింది. వందలు, వేలాది రిక్షాలు ఆస్పత్రి ముందు చేరాయి. జనసాగరం ఉప్పెనలా పొంగింది. "బాలయ్య జిందాభాద్" "గూండా జులుం ముర్దాబాద్" అనే నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి.

బాలయ్య వార్త ఏమీ తెలియడం లేదు. ఎవడో ఒకడు కీడు శంకించాడు. అదే ధ్రువపడిన వార్తగా పుకారు లేచింది. జనానికి ఓపిక చచ్చింది. పోలీసులను నెట్టారు, రాళ్ళు కొట్టారు. లారీలకు లారీలు పోలీసులు దిగారు. లాఠీఛార్జీ చేశారు.

జనం చెదిరిపోతున్నారు. మళ్ళీ కూడుతున్నారు. పోలీసులతో దాగుడుమూత లాడుతున్నారు. టియర్ గ్యాస్ షెల్స్ పేలాయి. జనం పారిపోయారు. రిక్షాలతో ఆవరణ నిండిపోయింది. ఎంతా? కొన్ని నిముషాలే. మళ్ళీ జనం కూడారు. పోలీసు వారు లౌడ్ స్పీకర్లలో చెప్పారు – "బాలయ్య క్షేమంగా ఉన్నాడు. అతనికి ఎట్టిప్రమాదం లేదు" అని.

"బాలయ్య జిందాబాద్" అనే నినాదాలు మారుమ్రోగాయ్. మళ్ళీ వేలకొద్ది జనం కూడారు. ఈ తడవ వారు శాంతంగా ఉన్నారు. అయినా, ఆతురతగా ఉన్నారు. గుంపులు గుంపులుగా చేరి చర్చలు జరుపుతున్నారు.

"ఇక్బాల్ బాలయ్యగారికి ఆపరేషన్ చేశారు. ఆపరేషన్ విజయవంతం అయింది. ప్రమాదం తప్పిపోయింది. బాలయ్యగారికి విశ్రాంతి అవసరం. మీరంతా వెళ్ళిపోండి. సాయంకాలం వారిని చూడవచ్చు." అని ఎనౌన్స్ అయింది.

జనం కరిగిపోయింది. గూడెం వాళ్ళు మాత్రం చుట్టలు కాలుస్తూ, బీడీలు తాగుతూ అక్కడక్కడే కూర్చుండిపోయారు.

☆ ☆ ☆

ఆపరేషన్ థియేటరునుంచి వచ్చి వాలుకుర్చీలో కూర్చొని కళ్ళు మూసుకున్నాడు ఇక్బాల్. బాలయ్యను ఎవరు, ఎందుకు కొట్టారు? తాను సమయానికి అక్కడ లేకుంటే బాలయ్య చనిపోవాల్సినవాడే! సలు ఈ బాలయ్య ఎవరు? అంత జనం ఎందుకు కూడింది అక్కడ? ఎందుకు వారు లాఠీ దెబ్బలు తిన్నారు? ఇలాంటి ప్రశ్నలు అనేకం అతనిని వేధించాయి. కళ్ళు తెరచేవరకు ఒక చిరునవ్వు నవ్వి "గుడ్ మార్నింగ్" చెప్పిన నర్స్ పేపరు అందించి వెళ్ళిపోయింది. గబాగబా పుటలు తిప్పాడు. రాత్రి జరిగిన వార్త తన పేరు సహితంగా కనిపించింది. సంగ్రహంగా గుడిసెలు, వాటి తగాదాకూడా పత్రికలలో పడింది – అందుకు బాధ్యులైనవారి పేర్లు తప్ప.

బాలయ్య విషయంలో ఆదరం ఏర్పడింది ఇక్బాల్‌కు. వెంటనే బాలయ్య మంచం దగ్గరికి వెళ్ళాడు. బాలయ్యకు ఇంకా స్పృహ రాలేదు. నాడి చూచాడు. స్టెతస్కోపుతో పరీక్ష చేశాడు. బాలయ్యను రక్షించడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నించాలనుకున్నాడు. అంతలో అతని చుట్టూ నర్సులూ, హౌస్ సర్జన్లూ కూడారు. అందరికీ ఆనాటి పత్రిక చూపి, బాలయ్యను గురించి వివరంగా చెప్పాడు. అతనికి తగిలిన గాయాన్ని గురించీ, తాను చేసిన ఆపరేషన్ను గురించీ వివరించి, 'మనిషిని మృత్యు ముఖం నుండి కాపాడ్డం వైద్యవృత్తి ధర్మం. ఇతనిని కంటికి రెప్పలా కాపాడండి...' అని చెప్పాడు.

☆ ☆ ☆

రామారావు రైల్లో చూచాడు పత్రిక. మిన్ను విరిగి మీద పడ్డట్లయింది. ఎదలో ఏడుపు నిండింది. ఏమీ తోచలే దతనికి. అంతమందిలోనూ ఏడ్చేశాడు పెద్దగా. శారదకు ఏమీ అర్థం కాలేదు. పెట్టెలో ఉన్న వారంతా అతనిని ఓదార్చారు. కొంతసేపటికి ఊరడిల్లి జరిగిందంతా చెప్పాడు డగ్గుత్తికతో. ఈ తడవ శారద భోరుమంది. రామారావు ఓదార్చవలసి వచ్చింది.

వారి దుఃఖపు వేడికి బండివేగం హెచ్చింది. హైద్రాబాదు చేరింది. టాక్సీలో ఆస్పత్రికి చేరారు. ఇద్దరూ బాలయ్యా మీదపడి భోరున ఏడ్చారు. బాలయ్య కళ్ళు తెరిచి చూచాడు. కొడుకు – తన కొడుకు! తన రామారావు!! తల నిమిరాడు "కొడుకా! వచ్చినవా? నువ్వు కండ్ల బడకుండనే చస్తననుకున్న! రాముడూ! నువ్వొస్తవ్. నాకు చింతలేదు రామన్నా! నీకేమిచ్చి పోతాన్నరా! మా అమ్మ నాకు జమీనిచ్చి పోయిండు. అదిపోయె. మా అన్న పోయె. మా అవ్వ పోయె, మీ అవ్వ పోయె. నీకు గూడాన్ని, గూడెపోల్లను ఇచ్చి పోతాన్న. ఇగ గూడెపోలున్నరు. నువున్నవు అని కన్నీరు రాల్చి, "తల్లీ శారదమ్మా! రామునికి మద్దత్తుండు, నేను పోతాన్న. నువ్వే వానికి అయ్యవు, అమ్మవు!" అని శారదను దగ్గరికి తీసుకొని ఏడ్చాడు.

శారద గొంతు బాష్పరుద్ధం అయింది. ఏడుస్తూనే అన్నది: "అట్లనకు మామ! నువ్వు బతుకుతవ్. బాగైతవు. మనవడిని ఎత్తుకుంటవు."

బాలయ్య కళ్ళు వెలిగాయి. "తల్లీ! నీలు పోసుకున్నవా?" అడిగాడు ధ్వనిలో ఏదో ఆశ వ్యక్తం అయింది.

వంచిన తల అలాగే ఉంచి ఊపింది.

శారద తలను గుండెకు హత్తుకున్నాడు. బాలయ్య ఎండిన చెక్కిళ్ళలో కన్నీరు నిలిచింది. రామారావు కళ్ళు తుడుచుకున్నాడు.

"అమ్మా శారదమ్మా! బతుకత. చావ. ఎత్తుకుంట నీ కొడుకును" అన్నాడు.

ఇదంతా చూస్తున్న ఇక్బాల్ కనులూ చెమ్మగిల్లాయి. రామారావును దూరంగా తీసుకెళ్ళాడు. బాలయ్యకు ఎలాంటి ప్రమాదం లేదన్నాడు. తన ప్రాణం అడ్డు వేస్తానన్నాడు. రామారావు కరిగిపోయాడు. ఇక్బాల్‌మీద పడ్డాడు. ఇక్బాల్ లేవనెత్తాడు. "ఛ. తప్పు నాయనా! ఏడవరాదు" అని, కన్నీరు తుడిచి జరిగిందంతా చెప్పాడు. "నువ్వు సమయానికి వచ్చావు. గూడెపువారు రెక్కల్లేని పక్షులైనారు. నీవు వారిని కాపాడు. మీ నాయన బాధ్యత నాది" అని, గూడానికి వెళ్ళమన్నాడు.

తండ్రి దగ్గర శారదను ఉంచి గూడానికి వెళ్లాడు రామారావు. గూడెంలో ఒక్క పురుగు లేదు. బాలయ్యతల బద్దలు చేసిన గూండాను వదిలివేశారని తెలిసి అంతా పోలీసు స్టేషనుకు వెళ్ళారని తెలిసింది. అతనూ పోలీసు స్టేషనుకు వెళ్ళాడు. రామారావును చూడగానే గూడెంవారికి ప్రాణం లేచివచ్చింది. అంతా అతనిని చుట్టి వేశారు. బాలయ్య పరిస్థితిని గురించి అడిగారు. తరువాత జరిగిందంతా సంగ్రహంగా చెప్పారు. వారిని అక్కడే వుండమని చెప్పి స్టేషనులో ప్రవేశించాడు రామారావు.

శ్రీనివాసరావు ఆలోచిస్తున్నాడు తలవంచి. "నమస్కారమండీ" అనే మాట విని తలెత్తి చూచాడు.

కొత్తవాడు. యువకుడు. చూపుల్లో దీక్ష కనిపించింది. ఎవరు? ఎందుకు వచ్చాడు? అర్థం కాలేదు శ్రీనివాసరావుకు. చేయెత్తాడు ప్రతి నమస్కారం చేస్తున్నట్లు. కాని, రామారావును కూర్చోమనలేదు. అయినా, కుర్చీ లాక్కొని కూర్చున్నాడు రామారావు.

శ్రీనివాసరావు చకితుడైనాడు. మోచేతులు బల్లకు ఆనించి రెండు చేతుల వ్రేళ్ళు విరుచుకున్నాడు.

రాత్రి నుంచి మనసులో మనసులేదు శ్రీనివాసరావుకు. నేరం చేసినవాణ్ణి వదిలివేయాల్సి వచ్చింది. ఉస్మానూ, రాజారావూ ఇంటికి వచ్చి బ్రతిమిలాడితే ఏం చేయగలడు? బ్రతిమిలాడడమే కాక బెదిరించారు. తనలో లక్ష లోపాలున్నాయి; వారిని కాదని ఉద్యోగం చేయగలడా? తానెంత? తన జీతమెంత? ఎన్ని ఇండ్లు కట్టాడు తాను! అవన్నీ దాగాలంటే వారిమాట వినాల్సిందే. రామమనోహర్‌సింగ్ మళ్ళీ దొరకడతనికి. అలా సతమతం అవుతున్నప్పుడు వచ్చాడు రామారావు. పెనుభూతంలా ముందు కూర్చున్నాడు.

"నేరస్తులు కస్టడీలో వున్నారా?" అడిగాడు రామారావు.

సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు తల తిరుగుతున్నట్లనిపించింది. "నువ్వెవరయ్యా అడగటానికి? చేయాల్సిందేదో చేస్తాం. వెళ్ళు ఇక్కణ్ణుంచి" అనేశాడు.

"తల బద్దలు కొట్టింది మా నాన్నను. నాకు హక్కు లేకుంటే మరెవరికి ఉంటుంది? చెప్పండీ, నేరస్తులు కస్టడీలో వున్నారా?"

శ్రీనివాసరావు అయోమయంలో పడ్డాడు. బాలయ్య కొడుకా వీడు! ఇలా మాట్లాడుతున్నాడేమి అనుకున్నాడు.

"షటప్, అట్టే పేలకు. నడువ్ ఇక్కణ్ణుంచి" అని కసిరాడు.

"నేరం చేసిన వారిని వదలి పిచ్చయ్యమీద నేరం మోపడం – ఇదేనా పోలీసు డ్యూటీ?"

మితిమీరి పోతున్నాడనుకున్నాడు శ్రీనివాసరావు. "యూ ఫూల్, షటప్" అని లేచి మెడపట్టి బయటికి నెట్టుతున్నప్పుడు స్టేషన్‌లో అడుగు పెడుతున్న ఇక్బాల్ కనిపించడంతో నిర్విణ్ణుడైనాడు శ్రీనివాసరావు. రామారావును వదలి, కృతకమైన చిరునవ్వు తెచ్చుకొని నమస్కరించాడు ఇక్బాల్‌కు.

"ఏమిటి? రామారావునే గెంటుతున్నావే!"

రామారావు ఇక్బాల్‌కు తెలుసునని గ్రహించిన శ్రీనివాసరావు గుండె దడదడలాడింది.

"మాకు పాఠాలు నేర్పుతున్నాడండీ!"

"మిస్టర్ శ్రీనివాసరావ్, రామారావు విషయం నీవు నాకు చెప్పాల్సిన పనిలేదు. ఈ కేసు చాలా సీరియస్ అయింది. నగరం యావత్తు ఉడికి పోతూంది. ఈ విషయంలో తల క్రిందులు చేశావో – ఉద్యోగానికే ఎసరు వస్తుంది. మిగతా విషయాలు కమీషనర్‌తో మాట్లాడుతా. ప్లీజ్ డూ జస్టిస్ ఇన్ దిస్ కేస్" అని "రా రామారావు, మనం వెళ్దాం" అని, కార్లో తీసుకువెళ్ళిపోయాడు.

శ్రీనివాసరావు గుడ్లప్పచెప్పి చూస్తూ అలాగే నుంచుండిపోయాడు.

★ ★ ★

# ఇరవై ఒకటి

తలుపు తట్టిన చప్పుడు వినిపించింది, నిద్రలో వున్న డెయిజీకి. లేచి, లైటువేసి తలుపు తెరిచింది. రజని!

"రజని"

ఇ॰

చకితురాలై తలుపులను పట్టుకొని అలానే నుంచుండిపోయింది.

డెయిజీని చూడగానే దుఃఖం పొంగింది రజనీకి. డెయిజీ భుజాల మీద పడి బావురుమన్నది.

ఏమనాలో తెలియలేదు డెయిజీకి. గుమ్మంలో రజని తన మీదపడి ఏడుస్తూంది.

"రజనీ! ఏమిటా ఏడుపు గుమ్మంలో? పద లోపలికి" అని చేతులు విడిపించుకుంది.

డెయిజీ ధ్వనిలో ఏదో అధికారం కనిపించింది రజనికి. అమాంతంగా భజం మీదినుంచి తల తీసి డెయిజీని చూచింది. ఆమె కళ్ళలో కోపం కనిపించలేదు. ఎదలో సానుభూతి కనిపించింది. "ఛ, ఏమిటా ఏడుపు గుమ్మంలో? రా లోపలికి" అని లోపలికి తీసికెళ్ళింది డెయిజీ. తలుపు వేసింది.

ఇద్దరూ ఒకరికి ఎదురుగా ఒకరు కూర్చున్నారు.

"తిన్నావా?" అడిగింది డెయిజీ.

మళ్ళీ దుఃఖం పొంగింది రజనికి. టేబులుకు తల ఆనించి ఎక్కి ఎక్కి ఏడవసాగింది.

డెయిజీ రజనీ తల నిమిరింది, కన్నీరు తుడిచింది. అడిగింది, "ఏం జరిగింది" అని.

మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది. "అక్కా! నేను నాశనమైనాను అక్కా! నేనెవరు? అందరూ నన్ను ఎందుకిలా కోసుకొని తింటున్నారు? ఒక్కసారే ఎందుకు చంపరు? అక్కా, ఇంత విషం పెట్టి పుణ్యం కట్టుకో" అని మళ్ళీ ఏడ్చేసింది.

డెయిజీ విల విల్లాడింది. అనేక సాంత్వన వాక్యాలు పలికింది. ఐనా, కన్నీరంతా ఒలికి పోయిన తరువాత గాని శాంతించలేదు రజని. అప్పుడు తన గోడు వెళ్ళ బోసుకుంది. జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పింది. "ఇంక నేనా నరకంలోకి పోలేను. నన్నిక్కడ ఉండనిస్తావా అక్కా? వెళ్ళగొట్టవుకదా!" అని బెదురుతూ అడిగింది.

"పిచ్చి పిల్లా! నువ్వు నా చెల్లెలువు. నిన్ను వెళ్ళగొడ్తానా? భయపడకు. పడుకో. తెల్లవారిం తరువాత మాట్లాడుకుందాం" అని పడుకోపెట్టి దుప్పటి కప్పింది. తానూ అదే మంచంలో పడుకుంది.

ఇద్దరిలో ఎవరికీ నిద్రరాలేదు. డెయిజీ తన కథ సాంతం వినిపించింది.

రాజారావు ప్రసక్తిని తొలగించి, తానెలా చావడానికి తయారైందీ, సూర్యారావు తనను ఎలా కాపాడిందీ వివరించింది. సూరి బొంబాయి వెళ్ళాడని, వచ్చిన తరువాత రజనిని గురించి మాట్లాడుతానని చెప్పింది.

రజని మనసులో ఒక అగ్నికొండ రగులుతూందని గ్రహించింది డెయిజీ. తనను తాను తెలుసుకోవాలని ఆమె పడుతున్న యాతనను అర్థం చేసుకుంది. రజనిని గురించి అంతా తెలియదు తనకు. తెలిసినంత వరకు చెపుతే రజని మనసుకు శాంతి ఏర్పడుతుందేమో అనుకుంది. కాని, తనకు తెలిసిందీ రజని వెనక్కి రాదని! అందువలన ప్రయోజనం లేకపోగా మనో వేదన ఎక్కువ కావచ్చు. ఐనా, రజనిని మళ్ళీ గుడిసెలకు పంపడం ఇష్టంలేదు డెయిజీకి. రాజారావుకు రజనిద్వారా గట్టిగా బుద్ధి చెప్పించాలనుకుంది. రజని అందానికి ఒక అంగడి ఏర్పర్చాలనుకుంది. సూర్యారావు అనేకసార్లు అన్నాడు - రజనిని ఆ విషవలయంలోంచి తొలగిస్తే సినీతారను చేస్తానని, తారా పథానికి ఎక్కిస్తాననీ. సూర్యారావు దుష్టుడు, నీచుడు. ఆ విషయం ఆమెకు తెలుసు. అందుకే రజనిని రాజారావు బంగారుపంజరంనుండి తప్పించదలచలేదు తాను. కాని, ఈ మధ్య సూరి మారినట్టు కనిపిస్తున్నాడు. ఆమెలో ఏదో వెర్రి నమ్మకం కలిగించాడు. తాను లేకున్నా రజని స్వయంగా వచ్చేసింది. మళ్ళీ ఆమెను రాజారావుకు అప్పగించడం కాదు చేయాల్సింది. ఆమెను తారా పథానికి ఎత్తి, రాజారావు కళ్ళలో నిప్పులు పోసుకునేట్లు చేయాలి అనే నిశ్చయానికి వచ్చి, "చెల్లీ! రాజారావుకు బుద్ధి చెప్పాలి, సినీ రంగంలో చేర్తావా? బోలెడు డబ్బు వస్తుంది. కీర్తిప్రతిష్టలు! ఎక్కడ చూచినా నీ బొమ్మలే వుంటాయి! నీ అందాన్ని చూస్తే ప్రొడ్యూసర్లు నీ కాళ్ళు కడిగి నెత్తిన పోసుకుంటారు." అన్నది.

రజనికి ఆ మాటలు అర్థం కాలేదు. ఏదో అయోమయంగా కనిపించింది. ఏవేవో ఆలోచనలు వచ్చాయి. సినిమాలు - వాల్‌పోస్టర్లు - తన బొమ్మ - పత్రికలు - టైటిల్‌మీద ఏమేమో ఆలోచించింది. కొంతసేపు ఆ రంగంలో దూరా లనుకుంది. కొంతసేపు దూరంగా ఉండాలనుకుంది. కాకుంటే తానేం చేయాలి? అసలు తానెవరు? మళ్ళీ రంపపుకోత ప్రారంభం అయింది. జీవితంలో వెనుకకు తిరిగి నడువసాగింది. అప్పటి వరకు పోయి ఒక రాతిగోడ కొట్టుకుంది. ఆ గోడకి తల కొట్టుకుంది. నొసలు చిట్లింది. రక్తం కారింది. కాని గోడ కూలలేదు. గోడకు ఆవల ఏముందో ఆవిడకు గోచరించలేదు. ఆ గోడ దెబ్బలకు అలిసిపోయింది. నిద్రపట్టింది.

తెల్లవారి డెయిజీ మొదట లేచింది. కాఫీ కాచింది. రజనిని లేపింది. రజని లేచింది. ముఖం కడుక్కుంది. ఇద్దరూ రెండుకప్పుల్లో కాఫీ తీసుకొని టేబుల్ మీద పెట్టుకొని చప్పరిస్తూ కబుర్లు చెప్పుకున్నారు. రజనికి ఈ జీవితం కొత్తగా కనిపించింది. ఆత్మీయత కనిపించింది. అనురాగం గోచరించింది. ఆ ఇల్లే తనను గురించి బాధపడుతున్నట్లనిపించింది. డెయిజీలో ఆమెకు మాతృత్వం గోచరించింది. ఆమెను చూచి కరిగిపోయింది. ఆమెను అలా కౌగలించుకొని ఉండిపోవాలనిపించింది.

ఇద్దరు కలిసి వంట చేసుకున్నారు. భోజనాలు చేశారు. ఆ భోజనం రజనికి వింతగా వుంది. అయినా, కబుర్లలో బాగానే తినేసింది. వారు ఎడతెగని ముచ్చట్లు చెప్పుకున్నారు. ఎంతకాలంగానో అడుగంటి వుండిన ఆశలు, ఆలోచనలు, ఊహలు,

భావాలు రెక్కలు కట్టుకొని ఎగిరాయి. ఇల్లు నిండింది. కలిసి బజారుకు వెళ్ళారు. కూరగాయలు కొన్నారు. సినిమాకూడా చూచారు ఆ రాత్రి.

అర్ధరాత్రికి దిగాడు సూరి బొంబాయినుంచి. తలుపు తెరచిచూసి జంకింది డెయిజీ. సూర్యారావు భయంకరంగా వున్నాడు. చీల మండలకు తాకుతున్న కోటు, ఫెల్టు. చేతిలో పెద్ద సూట్ కేసు - గుర్తుపట్ట రాకుండా ఉన్నాడు. డెయిజీ నిర్విణ్ణురాలై గుమ్మంలో ప్రతిమలా నిలిచిపోయింది. తలుపు తీయడమే తరువాయి డెయిజీని పక్కకునెట్టి పెద్ద పెద్ద అంగలు వేస్తూ తనగదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. అరాటంలో రజని వుందని గమనించనైనా లేదు.

డెయిజీ, రజనీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఎందుకో వారి గుండెలు దడదడలాడేయి. తలుపువేసి ఇద్దరూ మౌనంగా మంచం మీద కూర్చున్నారు. ఎవరినోటా మాట రావడంలేదు. ఏదో భయంకరమైన నిశ్శబ్దం ఆవరించింది. వాతావరణం ఏదో అవాంతరాన్ని సూచిస్తూంది. బిక్కు బిక్కుమంటూ కూర్చున్నారు. గుండెలు పీచు పీచుమంటున్నాయి. బెదురు చూపులు చూస్తున్నారు.

ఎక్కడో గుడ్లగూబ కూసినట్లనిపించింది.

ఇద్దరూ అదిరిపడి లేచారు.

కెవ్వున కేక వేయాలనుకున్నారు.

కాని, గొంతు పెగల్లేదు.

సూర్యారావు మామూలు మనిషి అయి వచ్చాడు, అయినా, అతని ముఖంలో ఏదో భయం, బెదురు కనిపిస్తున్నాయి. "డెయిజీ మైడాల్! ఎవరు తలుపు తట్టినా తీయకు. తీస్తే నేను ఉన్నట్లు చెప్పకు. వివరాలు ఉదయం చెపుతా" అని, గుసగుస చెప్పినట్లు అని రజనిని చూసి "హో, రజని వచ్చేసింది! నాకు తెలుసు డెయిజీ తెస్తుందని" అని "ఉదయం మాట్లాడుదాం, నిద్రపోండి" అని తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఇతరులకు మాట్లాడే అవకాశం సహితం ఇవ్వకుండా.

"అక్కా! ఏమైంది?" రజని ధ్వనిలో భయం వ్యక్తం అయింది. కళ్ళతో జవాబు చెప్పింది డెయిజీ తెలీదన్నట్లు.

"ఖూనీ చేశాడా?" చెవిలో చెప్పినంత మెల్లగా అన్నది రజని.

డెయిజీ చేత్తో రజని నోరు మూసింది.

రెండు గుండెల్లోనూ గుబులు ప్రవేశించింది. చీమ చిటుక్కుమంటే అదరిపడుతున్నారు. బిక్కు బిక్కుమంటూ అలాగే మంచంమీద కూర్చున్నారు.

సూర్యారావు గదిలో ఏదో లాగినచప్పుడు. ఏదో సర్దినచప్పుడు! అదేమంత పెద్ద ధ్వనికాదు. రోజూ అలాంటివి అనేకం వింటుంటారు. కాని, వారికి భూకంపం వచ్చినట్లు అనిపిస్తూంది.

ఎంతసేపని కూర్చుంటారు? మేను వాల్చారు. అయినా, నిద్ర రాందే. రేయి చీకటి సాంతం వారి గుండెల్లో చేరింది.

పాలవాడు తలుపు తట్టాడు. ఉలిక్కిపడి లేచింది డెయిజీ. పాలవాని గొంతు వినిపించే వరకూ తలుపు తీయలేదు. పాలు పోయించుకొని తలుపు వేసింది. తెల్లవారుతున్నప్పటికీ దుప్పటి కప్పుకొని పడుకుంది.

బాగా పొద్దెక్కిం తరవాత వచ్చాడు సూరి బయటికి. "ఇంకా పడుకునే వున్నారేం? ఇవ్వాళ కాఫీ అదీ ఏమీలేదా?" అన్నాడు.

అతని స్వరం మామూలుగా వుంది. అయినా, అది హ్రస్వంగా వుంది.

డెయిజీ మంచంలో లేచి కూర్చుంది. రజని ముఖం నుంచి దుప్పటి తొలగించింది. కాని, రజని లేవలేదు.

"రాత్రి మా ప్రాణాలు తీశావు. ఏం జరిగింది?" అడిగింది డెయిజీ ధైర్యం చేసి.

వినడానికా అన్నట్లు లేచి దుప్పటి కప్పుకొని కూర్చుంది రజని.

"డబ్బు తెస్తున్నాను బొంబాయినుంచి. చాలా వుంది దగ్గర – ప్రొడ్యూసరుది. సినిమా తీయడానికని ఇచ్చాడు. బొంబాయినుంచి వెంటపడ్డారు దొంగలు. క్షేమంగా చేర్చేవరకు ప్రాణం పోయిందనుకో."

"చెప్పొద్దూమరి ఆ విషయం?"

"ఏం చెప్పమంటావ్? ఏ రాత్రి ఇంటిమీద పడ్తారోనని బిక్కు బిక్కు మంటుంటే! సరి. అయిపోయిందిగా – లే. ఇంత కాఫీ పెట్టు."

డెయిజీ ముఖంలో భయం మాయం అయింది. రజని ముఖం వికసించింది. ఇద్దరూ వంటింట్లోకి వెళ్ళిపోయారు.

పొయ్యి ముందు కూర్చున్న రజని అడిగింది: "నిజమే నంటావా? నాకేమో అనుమానంగా ఉంది" అని.

వాస్తవానికి డెయిజీ సైతం నమ్మలేదు సూరిమాట. ఏదో దాచి పెడ్తున్నాడని గ్రహించింది. అతని కళ్ళల్లో బెదురు చూస్తుంటే ఏదో ఘోరకృత్యం చేసినట్లే అనుకుంది. హత్య చేసేంత ధైర్యం కలవాడు కాదు సూరి! ఏం చేశాడో ఆమెకూ అనుమానంగానే ఉంది. అయినా, అది రజనికి కనిపించనివ్వలేదు. రేపు రజనిని సినిమాల్లో చేర్చాల్సినవాడూ, తారా పథానికి ఎక్కించవలసినవాడూ అతడే కదా! అతని విషయంలో రజనికి గౌరవం ఏర్పడాలి అనుకొని, "నిజం కాదనడానికేముంది? డబ్బు తెస్తూ ఉండి ఉంటాడు. దొంగలు వెంట పడటంలో ఆశ్చర్యమేముంది? పైగా, సూరి కాస్త పిరికి" అనేసింది.

"అంతేనంటావా?..." అన్నది రజని తనకప్పు అందుకుంటూ. రెండు కప్పులు పట్టుకొని డెయిజీ వచ్చేసింది. ముగ్గురూ కాఫీ చప్పరిస్తూ కూర్చున్నారు.

"మిస్టర్ సూరి! రజనిని తెరకెక్కించాలి."

"తెరకేమిటి – తారాపథానికి ఎక్కిస్తాను. రజని ఊఁ అంటే నందన వనాన్ని నేలకు దించుతాను. చంద్రుణ్ణి బంతిగా అందిస్తాను. అఖిల భారత దేశంలోని అందరు తారలనూ హడలకొట్టేస్తాను. రజనిని చంద్రుణ్ణి చేస్తాను. తారలన్నింటినీ రాలకొట్టేస్తాను. రజని వెండి తెరమీద కనిపించిందంటే మహా మహా తారలు సైనాయిడ్ వెతుక్కోవలసిందే. రజని! ఓహో ఏం చక్కని పేరు? పేరు మార్చాల్సిన పని లేదు. అందం? ఓహో! ప్రేక్షకులు దోసిళ్ళతో జుర్రేస్తారు. ఏదీ ఒక్క చిరునవ్వు"

ఉక్కిరి బిక్కిరైంది రజని. సిగ్గు దొంతరలు ముఖంలో కనిపించాయి. వాస్తవంగానే నవ్వేసింది.

"ఓహో! వరాలు రాలేయి. ఏం నటన! ఏం నటన! అంతే కావల్సింది. అమాంతంగా హిందీ ఫిల్ముకు లాగేస్తాను. కొద్దిగా నాట్యం నేర్చుకుందంటే గుండెల్లో నాట్యం చేస్తుంది. ఇవ్వాళే వస్తున్నాడు ఒక ప్రొడ్యూసరు – మార్వాడీ! ఈ రాత్రికే పరిచయం చేస్తా. అయ్యో, కాఫీ ఆరిపోతూంది – తాగెయ్యండి" అని కాఫీ గబగబా తాగి సిగరెట్టు ముట్టించాడు.

"ఇప్పుడే, ఈ క్షణంలో మీ రొక పని చేయాలి. ఫోటో స్టూడియోకు వెళ్ళి ఫోటోలు దిగి వెంటనే తీసుకురావాలి. నెక్ట్స్ షాట్ మువీ కెమెరాముందే. నేను చాల అలసి ఉన్నాను. కాస్త రెస్టు తీసుకుంటాను. రాత్రికి రజనిని తయారు చేయాలి. అది డెయిజీ డ్యూటీ. కానివ్వండి త్వరగా..."

"రాత్రికెందుకు, పగలే వెళ్ళగూడదా?" రజని అడిగింది.

"పిచ్చి రజనీ! నీకింకా సినీరంగం తెలీదు. చీకటికి రెండో పేరు సినిమా, నియోన్ లైట్ల వెలుగులో అందం అనేకరెట్లు కనిపిస్తుంది. రాత్రి అంటే భయం ఎందుకు – నీ పేరే రాత్రి అయినప్పుడు! నేనుంటాగా నీ వెంట. అలా దేవిలా నుంచొని ఒక్క చిరునవ్వు నవ్వు. అంతే, నీ పాదాల మీద పసిడి చిమ్ముతారు."

"అక్కా! ఇద్దరం వెళ్దాం. నువ్వూ రా" అన్నది రజని.

"పిచ్చిపిల్ల! నే నెందుకు? ఒంటరిగా వెళ్ళడం అలవాటు చేసుకోవాలి. ఒక్కసారి తెరమీద కనిపించావంటే వందలు, వేలు నీ వెంట పడ్తారు."

"ఏమోనమ్మా! వంటరిగా వెళ్ళలేను. ఏదో గుబులుగా ఉంటుంది. ఈ ఒక్క సారీ నువ్వురా."

డెయిజీ అనేక మాటలు చెప్పింది. సూరి తన వాగ్ధారతో ఆమెను ఒప్పించాడు. ఇద్దరూ ఫోటోలు దిగడానికి వెళ్ళిపోయారు.

సూరి గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. మంచం మీద మేనువాల్చాడు. కళ్ళు మూసుకుంటే కుండెడు రక్తం తనమీద బొర్లించినట్లైంది. దిగ్గున లేచి కూర్చున్నాడు. కళ్ళు తెరిస్తే ఏమీలేదు. కాని, గుండె దడ, భయం, భీతి, బుగులు, ఆరాటం!

అవును, తాను స్వతంత్రుడు కాదలచుకున్నాడు. ఎన్నాళ్ళని ఆ సింధీవానికీ, ఈ ఉస్మానుకూ సంపాదించి పెట్టడం? ఒక్క వందకోసం అర్రులు చాచాలా? చేసేది తాను, కులికేది వాళ్ళా? కృషి తనది, ఫలం వాళ్ళది. పైగా, బంగారు పళ్ళు ఇకిలిస్తూ, మాట్లాడితే పోలీసుకు పట్టిస్తానంటాడు. దాదాలతో చంపిస్తా నంటాడు. మూర్ఖుడు, ఇప్పటికి సముద్రం అట్టడుక్కు చేరి ఉంటాడు.

సూరి ప్లాటు సిద్ధం చేసి బయలుదేరాడు ఆ రోజు. సింధీ స్మగ్లర్‌తో సరంగును కట్టుకున్నాడు. నడిరేయి సముద్ర మధ్యానికి చేరుకున్నారు. అనుకున్నట్టే ఓడ వచ్చింది. పెట్టె నిండా బంగారం. కళ్ళు జిగేలు మన్నాయి. ఈ దెబ్బతో బొంబాయిని కొనేస్తా నన్నాడు సింధీవాడు. ఓడలోనే తాగాడు. జాగ్రత్తపడ్డాడు సూరి. ఇద్దరూ ఓడ దిగారు. పడవ ఎక్కారు. అమావాస్య చీకటి. చుక్కల వెలుగుతప్ప వేరే వెలుగు లేదు. పడవలో సరంగు తనవాడు. సింధీవాడు తాగుతున్నాడు. త్రాగుడంటే పడిచస్తాడు. సమయం కోసం కాచుకొని ఉన్నాడు. వెన్నులోంచి పేల్చాడు పిస్తోలు.

ఒక్క మూలుగు మూలిగి కూలాడు సింధీ. సముద్రంలో తోశాడు. సరంగు నవ్వాడు. సూరి గుండె దడదడలాడింది. సరంగును చూచాడు. ఆశ వేయి పడగలు విప్పింది. సరంగు వంటిరిగా కనిపించాడు. వంటరిగాడు. వానికి దిక్కెవరు? వాడికి భాగం ఇవ్వాలా? అంతే – మరొక పిస్తోలుగుండు పేలింది. సముద్రంలోకి తోశాడు. పడవ సాగింది. క్షేమంగా వేరే ఒడ్డుకు చేర్చాడు. పెట్టెతో బయలుదేరాడు. హైద్రాబాదుకు చేరాడు.

తనను సిరి వరిస్తూంది. రజనిని సాధించాలన్నది ఉస్మాన్ ఆదేశం. ఎంతకాలంగానో వల పన్నుతున్నాడు. తానుగా వచ్చి వలలో చిక్కుకుంది. ఇప్పుడు తాను స్వతంత్రుడు. ఉస్మానుకు బానిస కాడు. బంగారం. పెట్టెనిండా బంగారం ఉంది. తాను ఉస్మాన్ను మించాడు. ఒక బంగారుపిట్ట దొరికింది. ఉస్మాన్ వశం కానివ్వరాదు. కాని, బెదిరించరాదు. మచ్చిక చేయాలి. రజనితో రాళ్ళను కరిగించవచ్చు. ఆమెతో బొంబాయికి ఉడాయించాలి. ఈ రాత్రి! నయాగరా!! రజని! ఆమె అందం!! తాను!!! జారవిడుచుకోవాలా? ముందు తాను, తరవాత ఇతరులు. తన్నుమాలిన ధర్మం ఉంటుందా?

నయాగరా! రజని, తాను! ఏదో వెన్నెల విరిసింది. మందానిలం వీచింది. ఊహల ఊయలలో నిద్రించాడు.

ఫోటోలు తీసుకొని ఇంటికి వచ్చేవరకు సాయంకాలం అయింది. తన పటాలు చూచి తానే ఆశ్చర్యపోయింది రజని. నిజంగా తానెంత అందంగా ఉంది! అలా చూస్తూ ఉండిపోయింది, ఒక్కొక్క పటాన్నే. చాలా పోజుల్లో తీశాడు ఫోటోలు ఫోటోగ్రాఫరు. డెయిజీ తానూ కలసి దిగిన ఫోటో చూచింది. తాను అందకత్తెనని తేల్చుకుంది. గర్వపు రెక్కలు కూడా మొలిచాయి. సూరి అన్నది వాస్తవం అనుకుంది. తన పాదాల ముందు పసిడి పడిగాపులు కాస్తుంది అనుకుంది.

ఏదో ఆలోచనలలో ఉండగా డెయిజీ పిలిచింది అలంకరణకని. తనను డెయిజీకి అర్పించింది రజని. కరవాలానికి పదును పెట్టినట్లు అలంకరించింది. "చెల్లీ! నాకే నిన్ను ముద్దు పెట్టుకోవాలనిపిస్తూంది" అని ముద్దుల వర్షం కురిపించింది.

ఈలోగా సూరి లేచాడు. రజనిని చూచి ఆశ్చర్యపడ్డాడు. ఎంత అందం! "రతీదేవి దిగి వచ్చినట్లుంది" అన్నాడు.

రజని చెక్కిళ్ళు కుంకుమ పులుముకున్నాయి. తలవంచుకుంది. వేలితో టేబులు మీద ఏవో గీతలు గీయసాగింది. "ఇప్పుడే వస్తా" అని సూరి వెళ్ళి, బట్టలు వేసుకొని వచ్చేశాడు.

ఇద్దరూ నయాగరాకు చేరారు. మేడమెట్లు ఎక్కుతుండగా పైన రాజారావు కనిపించాడు రజనికి. మెట్టు మీద ప్రతిమలా నిలిచిపోయింది. చెమటలు పట్టాయి. ప్రాణాలు ఎగిరిపోయినట్లయింది.

మరొకమెట్టు ఎక్కిన సూరి మీద పిడుగులు కురిశాయి. ఇద్దరు బొంబాయి దాదాల వీపులు కనిపించాయి. ఒకడు పొట్టిగా బలంగా ఉన్నవాడు, బక్కగా పొడుగ్గా ఉన్నవాడు మరొకడు. వారిని చూచి వెనక్కు చూచాడు. రజని గబగబా మెట్లు

దిగి పరిగెత్తుతూంది. సూరి కూడా పరిగెత్తాడు. ఇద్దరూ వగరుస్తూ టాక్సీలో కూలబడ్డారు.

టాక్సీ ఇంటికి చేరింది. వారిద్దరిని చూసి ఆశ్చర్యపోయింది డెయిజీ. రజని గుండె ఇంకా వేగంగా కొట్టుకుంటూంది. రావడం రావడమే మంచంలో పడిపోయింది. సన్నగా ఏడుపు సాగించింది.

సూరి గబ గబా తన గదిలోకి వెళ్ళి, రాత్రిలాంటి దుస్తులు వేసుకొని పెట్టె చేతులో పెట్టుకొని బయటికి వచ్చి "డెయిజీ! అర్జంటు పని ఉంది, వెళ్తున్నాను. వారానికిగాని తిరిగిరాను. రజని జాగ్రత్త!" అని చెప్పి జవాబు కోసం కూడా ఎదురు చూడకుండా టాక్సీలో పడ్డాడు.

డెయిజీ నిర్విణ్ణురాలై గుమ్మంలో అలాగే నుంచుండి పోయింది. టాక్సీ దాటిపోయినా కదలలేదు. కొన్ని క్షణాలకు తనను తాను తెలిసికొని వెనక్కు చూచింది. రజని మంచంలో పడి ఎక్కెక్కి ఏడుస్తూంది. తలుపువేసి రజని మంచంమీద కూర్చుంది. "ఏమైంది?" అని అడిగింది. బావురుమన్నది రజని. "వారు కనిపించారు. నేను నాశనం అయినాను. అసలు నేనిక్కడికి ఎందుకు వచ్చాను? ఈ సూరి నన్ను చంపేస్తాడు. ఏం చేయను?" అని ఏడ్చేసింది.

డెయిజీ ఎన్నో మాటలు చెప్పింది. రాజారావును చూచి భయపడాల్సిన అవసరం లేదన్నది. రజని అందాన్ని అనేక రకాలుగా వర్ణించింది. సినిమారంగాన్ని గురించిన ఒక రంగుల వల పరచింది. సూరిని గురించి రజనికి సదభిప్రాయం కలిగించడానికి ప్రయత్నించింది – స్వయంగా తనకున్న సదభిప్రాయం జారిపోతూండగా. అయినా రజని మళ్ళీ రాజారావును చేరకుండడానికి అంతకన్నా ఉపాయం కనిపించలేదు డెయిజీకి.

ఇద్దరూ పడుకున్నారు. కాని, ఎవరూ నిద్రపోలేదు.

సూరి నిజంగానే ఏదో అఘాయిత్యం చేసి వచ్చాడనే నిశ్చయానికి వచ్చింది. డెయిజీ. రజనిని అతనికి అప్పగించి అపకారం చేయడం లేదు కాదా, ఆలోచించింది. సూరి ఏదో మారినవానిలా కనిపించాడు. తనకు రక్షణ కల్పించాడు. రజనికి ఒక దారి చూపి రాజారావుకు బుద్ధి చెపుతాడనుకుంది. ఆ ఆశ అడియాసగా కనిపించింది. ఏం చేయాలి రజని విషయంలో? అనే ఆలోచనలు ఆమె మెదడును చీల్చసాగాయి.

రజని డెయిజీని అనుమానించింది. సూరితో కలసి తన విషయంలో ఏదో కుట్ర పన్నుతూంది అనుకుంది. సూరి రాక్షసుడుగా కనిపించాడు. తనను ఎందుకా హోటలుకు తీసికెళ్ళాడు? రాజారావు కనిపించడం, తాను పారిపోవడం సూరి తన వెంటనే వచ్చి ఎక్కడికో వెళ్ళిపోవడం, తన విషయంలో జాగ్రత్త పడవలసిందని డెయిజీని హెచ్చరించడం మనసులో మసిలాయి. దాంతో సూరి, డెయిజీ ఇద్దరిమీద ఎనలేని కోపం వచ్చింది. రాజారావును తలచుకుంది. దేవతలా కనిపించాడు. అతడు ఎంత మంచివాడు! తాను అతనికి ఏమి ఇవ్వగలిగింది? అయినా పల్లెత్తుమాటన్నాడా తనను! తాను ఎందుకెళ్ళి వచ్చింది? ఎవరు పొమ్మన్నారు తనను? అసలు ఈ డెయిజీ ఎక్కణ్ణించి వచ్చింది రాక్షసి! దీని వల్లనే రావలసి వచ్చింది. కాకుంటే తన పీనుగ తప్ప తాను వెళ్ళలేకపోయేది. మళ్ళీ వెళ్తే? అదే మంచిది. అతడు తన పాలిట దేవత. కాళ్ళు పట్టుకుంటుంది. బ్రతిమాలుతుంది. అతడు తిడ్తాడు.

కొడ్తాడు. అవును, తాను తప్పుచేసింది ఎంత ఘోరమైన తప్పు! ఎవరితోనో కడుపు చేసుకున్న దాని దగ్గరికి వచ్చింది. అది తనను అడకత్తెరలో ఇరికిస్తుంది. విచ్చుకత్తుల బోనులో పెడ్తూంది. తాను రాజారావు భార్య! ఆ సంపదను, ఆ మేడలను, ఆ దేవతను వదిలి ఈ సూరిగానివెంట బోగం ముండగా పోవడం ఏమిటి? తాను ఎంత నీచురాలు, ఎంత ఘోరపాపం చేసింది? వెళ్ళాలి. రాజారావు కాళ్ళ మీద పడాలి. అంతవరకూ తనకు శాంతిలేదు అని నిశ్చయించుకుంది. కళ్ళుతెరిచి చూచింది. డెయిజీ నిద్రపోతూంది. తలుపు తెరిచింది. బయట అడుగు పెట్టింది.

"ఎక్కడికీ అర్ధరాత్రి?" అన్న డెయిజీ ప్రశ్న విని నిలిచిపోయింది. వెనక్కు చూస్తే డెయిజీ వచ్చేసింది.

"నన్ను వెళ్ళనీ."

"ఏం? ఎందుకు?"

"ఇక్కడ ఉండలేను."

"నేను నీకేమైన అన్యాయం చేశానా?"

"విడువు, వెళ్ళిపోతా" విదిలించుకుంది రజని.

"వీల్లేదు." పట్టు గట్టిచేసి అన్నది డెయిజీ. "నీకు నేను చేసిన అపకారం ఏమిటో చెప్పి వెళ్ళు" – లోపలికి లాక్కుపోయి మంచమ్మీద పడేసి అడిగింది: "చెప్పు నేను చేసిన అపకారం ఏమిటో?"

"నేనిక్కడ ఉండలేను. ఇక్కడ ఏదో కుట్ర జరుగుతూంది. నువ్వూ ఉన్నావందులో. నా రాజా దగ్గరికి వెళ్ళిపోనీ, అతడు నన్ను చీల్చి చెండాడినా భరిస్తాను!" ధ్వనిలో దుఃఖం, దృఢనిశ్చయం వ్యక్తం అయినాయి.

డెయిజీ గుండె చిల్లిపడింది. ఇన్నాళ్ళుగా రజని విషయంలో పెంచుకున్న మమకారం కర్పూరంలా కరిగిపోయింది. ఉజ్జ్వల భవిష్యత్తు చూపాలనుకున్న తనని అపార్థం చేసుకుంది. తాను ఏది చెప్పినా అపార్థం చేసుకునే స్థితిలో ఉంది. ఈ దశలో ఆమెకు సంబంధించిన వాస్తవ విషయాలు చెప్పినా నమ్మదు అనుకొని "మంచిది. ఉదయం వెళ్ళు. ఈ స్థితిలో వెళ్ళడం మంచిదికాదు" అని దుప్పటి కప్పుకొని పడుకుంది, కుమిలిపోతూ.

అప్పుడుగానీ అర్థం కాలేదు రజనికి, అర్ధరాత్రి రాజారావు ఇంటికి వెళ్ళడం సమంజసంకాదని. ఆమె సైతం కళ్ళు మూసుకుంది, కాని, ఎప్పుడో తెల్లవారుజాము వరకు నిద్ర రాలేదు.

* * *

# ఇరవై రెండు

"నేరం ఒప్పుకుంటావా?" జడ్జీ త్ర్యంబకరావు కాలేకర్ పిచ్చయ్యను అడిగాడు.

పదిరోజులు రిమాండులో ఉంచి, బాలయ్య తల బద్దలు కొట్టాడనే నేరం మోపి పిచ్చయ్యను కోర్టులో ప్రవేశపెట్టాడు శ్రీనివాసరావు.

"తెల్వందే ఎట్ల ఒప్పుకుంటమండి? అమీన్ సాబ్, పోలీసోల్లు సావకొట్టి కొట్లపెట్టిరి. బాలయ్యన్నను కొట్టిన్నని కొట్లనే ఉంటిని. బాలయ్యన్న మా దేవుడు కాదుండి. అయినను కొడ్తే పురుగులుబడి చావనుండి! బాలయ్యన్నను కొట్టినోల్లను పట్టుకొచ్చిరి. ఇడిచిపెట్టిరి. నన్నేమొ ఇరికిస్తాండిరి, నాకేమి ఎరకలేదు సర్కార్. తెల్వందే ఎట్ల ఒప్పుకుంట?" అన్నాడు పిచ్చయ్య.

శ్రీనివాసరావుకు చెమటలు పట్టాయి. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌తో ఏదో గుసగుసలాడాడు.

అడ్జర్న్‌మెంట్ ఇప్పించవలసిందని కోర్టువారిని అర్థించాడు సర్కారువారి వకీలు.

"మైలార్డ్! నేరం జరిగింది. నేరస్తులు చిక్కారు. కాని, పోలీసు వారి మాయలు మనకు అర్థంకావు. నేరస్తులను వదిలారు. పిచ్చయ్యను ఇరికిస్తున్నారు. నేరం జరిగినప్పుడు పిచ్చయ్య లాకప్‌లో ఉన్నాడని సాక్ష్యాధారాలున్నాయి. అసలు ఈ నేరానికి గుడిసెల తగాదాతో సంబంధం ఉంది. ఆ తగాదాలో సబిన్‌స్పెక్టరుకు ప్రమేయం ఉంది. అందుకు తగిన సాక్ష్యం నా దగ్గర ఉంది. కాబట్టి అతనిని బదిలీచేసి, వేరు వారిని నియమించందే న్యాయం జరుగదు. కాబట్టి మైలార్డ్! పిచ్చయ్యను వదిలేసి, వేరే సబిన్‌స్పెక్టరుద్వారా విచారణ జరిపించవలసిందని ఉత్తరువు ఇవ్వవలసిందని మనవి" అన్ని విన్నవించాడు మహబూబ్ కిషన్.

హోటలువాడు, రామారావు, ఇక్బాల్ సాక్ష్యం ఇచ్చారు.

"ప్రజల ప్రాణ మాన ధనములను రక్షించవలసిన పోలీసు శాఖ ప్రజలను పీడించడం శోచనీయం. పిచ్చయ్యను విడుదలచేయ నైనది. శ్రీ శ్రీనివాసరావు సబిన్‌స్పెక్టరు పక్షపాతవైఖరి అవలంబిస్తున్నాడనీ రుజువు అయింది. కాబట్టి, అతనిని బదిలీచేసి, వేరే సబిన్‌స్పెక్టరుతో విచారణ జరిపించి అసలు నేరస్తులను హాజరు పెట్టవలెను" అని జడ్జీ తీర్పు ఇచ్చాడు.

శ్రీనివాసరావుకు తేళ్ళు, జెర్లు పాకినట్లైంది.

గుడిసెల జనం ఉత్సాహంతో గంతులు వేశారు. పిచ్చయ్యను కౌగలించుకున్నారు. అతనిని ఎత్తుకొని కేకలు పెట్టారు. ఇంతలో ఇక్బాల్, మహబూబ్ కిషన్, రామారావు వచ్చేశారు. వారికి పూలదండలు వేసి జయ జయ ధ్వానాలు చేశారు. కార్లో వారిని కూర్చోపెట్టి ఊరేగింపుగా హాస్పిటల్‌కు బయలుదేరారు. రిక్షావాళ్ళు, ఇతర మురికి పేటలవాళ్ళు ఊరేగింపులో కలిశారు. ఊరేగింపు ఆసుపత్రికి చేరింది. "బాలయ్యకూ జై" అనే నినాదాలు దిక్కులు పిక్కటిల్ల చేశాయి.

జన సముద్రం బాలయ్య దగ్గరికి చేరింది.

పిచ్చయ్య బాలయ్యను కౌగలించుకున్నాడు.

ఇద్దరూ కన్నీరు రాల్చారు.

"ఇక్బాల్ భాయ్! ఎన్నో కేసుల్లో వాదించాను. హంతకులను సహితం విడుదల చేయించాను. కాని, ఇంత ఆనందం ఎన్నడూ కలుగలేదు భాయ్!" అన్నాడు మహబూబ్ కిషన్.

"నేనెంత ఉబ్బిపోతున్నాననుకో చెప్పలేను మహబూబ్ భాయ్!" అన్నాడు ఇక్బాల్.

జనం ఈ విజయం తమదేననుకున్నారు. అనేక రకాలుగా చెప్పుకున్నారు.

రామారావు టీ తెప్పించాడు. అంతా సేవించారు.

"ఇందులో అమృతం కలిసినట్లుంది భాయ్!" అన్నాడు ఇక్బాల్.

"అవును. ఇలాంటి టీ ఎన్నడూ తాగలే"దన్నాడు మహబూబ్ కిషన్.

☆ ☆ ☆

శ్రీనివాసరావు కోర్టునుంచి నేరుగా ఉస్మాన్ ఇంటికి వెళ్ళాడు. జరిగిందంతా చెప్పాడు. తీర్పులో జడ్జీ తనను నిందించాడని చెపుతూ జడ్జీని తిట్టాడు. ఇక్బాల్ మీదా, మహబూబ్ కిషన్ మీదా దుమ్మెత్తి పోసాడు. తాను ఇక్కణ్ణుంచి బదిలీ అవుతే తన పరువంతా మంటకలిసి పోతుందన్నాడు. తన ట్రాన్స్‌ఫర్ నిలిపించవలసిందని ఉస్మాన్ కాళ్ళు పట్టుకున్నాడు– కన్నీరు కూడా కార్చాడు.

ఉస్మాన్‌కు క్షణం ఏమీ తోచలేదు. అతడు నిర్విణ్ణుడైపోయాడు. ఇంతలో కోపం ప్రకోపించింది. "ఏమీ, ఒక జేబులు కొట్టేవాడికోసం నిన్నే ట్రాన్స్‌ఫర్ చేస్తారూ? చూస్తా నేనుకూడా. సరే, సంగ్రామం మొదలైందిగా – నేనూ కత్తులూ, కఠార్లూ పట్టుకొనే దిగతా. శ్రీనివాసరావ్! నిర్భయంగా ఉండు. కలెక్టర్లను ట్రాన్సుఫర్లు చేయించాను. చీఫ్ ఇంజనీరును దేశం నుండి వెళ్ళగొట్టించాను. నీ ట్రాన్స్‌ఫర్ జరగడానికి వీల్లేదు. నువ్వు ఇక్కడే వుంటావు. ఉస్మాన్ ఓటమి ఎరుగడు" అని పంపించేశాడు శ్రీనివాసరావును.

శ్రీనివాసరావునైతే పంపించాడు కాని, గుండెలో సూదులు గుచ్చుకొన్నాయి ఉస్మాన్‌కు. శ్రీనివాసరావు ట్రాన్స్‌ఫర్ తనకే అవమానం అనిపించింది. టెలిఫోనులు తిప్పాడు. ఎన్ని తిప్పాడో లెక్కలేదు. కొందరు లేరు. కొందరు కోర్టుతీర్పు అమలు పర్చాల్సిందే నన్నారు. ధైర్యం చెప్పినవాళ్ళు చాలా కొద్దిమంది.

కారు వేసుకొని బయల్దేరాడు. తొక్కని గడపంటూ లేదు. మాటలు సాంత్వనంగా చెప్పారంతా. ట్రాన్సుఫర్ అయితే మునిగిపోయిందేమన్నారు. ఎవడు వచ్చినా ఉస్మాన్ను ధిక్కరించేవాడు రాలేడన్నారు. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. ఎందరు ఉద్యోగుల్ని మార్పించాడు తాను? ఎందరికి ప్రమోషన్లిప్పించాడు? ఎందరిని ఉద్యోగాల్లోంచి తీసివేశాడు? ఏమిటి తనకీ ఓటమి? గ్రహచారం బాగుండలేదనుకున్నాడు. చిలక "మియాఁ మిఠ్ఠూ" అన్నది. చిరాకుపుట్టి అక్కణ్ణుంచి లేచిపోయాడు.

ఉదయమే లేచి మంత్రిగారి దగ్గరికి బైల్దేరాడు ఉస్మాన్. కారు గేట్లోకి

ప్రవేశించగానే సలామ్ పెట్టాడు పోలీసు. మంత్రిగారి అంతరంగిక కార్యదర్శి నమస్కరించాడు. కుశల ప్రశ్న వేశాడు. అప్పటికే చాలమంది వచ్చేశారు మంత్రిగారి దర్శనానికి. బంట్రోతులు వచ్చి నమస్కరించి "ఏమ్‌సార్, వస్తలేరు" అని పరామర్శించి, ప్రత్యేకమైన గదిలో కూర్చొండబెట్టారు. "అయ్య శానమకుంటున్నరండి వస్తరేలేరని. శాన మస్రూ వున్నట్లున్నరు. నువ్వు బందైన కాణ్ణుంచి చా పైసలు ఇచ్చెటోళ్ళు వస్తలేరు. అగో పిలుస్తాండట అయ్య" అని గుమ్మం నుంచి కదిలాడు బంట్రోతు. అయిదు రూపాయల కాగితం బంట్రోతు చేతిలో పెట్టి, మంత్రిగారి గదిలో ప్రవేశించాడు ఉస్మాన్. గుమ్మం చాటగానే వంగి చేతిని నేలకంటించి ఒక సలామ్ చేశాడు. రెండడుగులు వేసింతరవాత మళ్ళీ అలాగే సలామ్ చేశాడు. మరొక్క అడుగువేసి మళ్ళీ మూడుసార్లు సలామ్ చేశాడు.

టేబుల్ మీద ఉన్న గాంధీజీ పటం ముందున్న అష్‌ట్రేలో సిగరెట్టుంచి ప్రతి నమస్కారం చేసి క్షేమం అడిగారు మంత్రిగారు.

"మీ దయవల్ల సర్కార్" అని చేతులు కట్టుకొని ఎదురుగా నుంచున్న ఉస్మాన్ను చూసి కుర్చీ చూపించారు మంత్రిగారు.

"ఎంతమాట! మీ ముందు కూర్చునేంత స్తోమత ఉందా మాకు? మీ మోచేతి క్రింది గంజితాగి జీవించే వాళ్ళం. సర్కార్ కోసం చాలసార్లు వచ్చాను. దర్శనం లభించలేదు. సర్కార్ టూర్‌మీద వెళ్ళారని తెలిసింది."

"అవును, ఏవో వ్యవహారాలు. సరేగాని, ఇప్పుడు వచ్చిన పనేమి?"

"సర్కార్! ఎంతో కష్టపడి మన గ్రూపు తయారు చేశానని తెలుసుగదా! ఇప్పుడా గ్రూపు కాస్త విచ్ఛిన్నం అయ్యే దశ వచ్చింది. అసలు మన పార్టీలోనే ఉండం వెళ్ళిపోతామంటున్నారు. నాకు మనపార్టీ అంటే వున్న భక్తి ఆలీ జనాబ్‌కు తెలియంది కాదు. ఈ చేతులమీద పెంచి పెద్ద చేసిందానికి ఈ గతి పడ్తే సహించలేకున్నాను."

పొగపీల్చి పక్కనున్న ఫైలు చూస్తూ అడిగారు మంత్రిగారు "ఏమైంది?"

"సబినస్పెక్టరు శ్రీనివాసరావును బదిలీ చేయవలసిందని కోర్టువారు తీర్పిచ్చారు."

"అయితే?"

"ఎన్నో ఉంటాయి. మీకు చెప్పవచ్చేవీ చెప్పరానివీ. అతనికి మన రహస్యాలు అనేకం తెలుసు. ఇంకెవడన్నా వస్తే హుజూర్, నేను మాత్రం గ్రూపును చూడలేను. ఎల్లాగైనాచేసి ఆ ట్రాన్సుఫర్ ఆపించాలి."

"చూస్తాం."

"సర్కార్! చూస్తాం అంటే కాదు. అతని ట్రాన్సుఫర్‌కూ, నా మర్యాదకూ లంకె ఉంది. అతను మారాడో – నా పరువు మంటిపాలు అవుతుంది. ఏదో విధంగా మీరు ఆపుచేయిస్తేనే బ్రతుకు. లేకుంటే ఏ విషమో..."

"ఆలోచిస్తాం."

"నేను ఊరకనే అనడం లేదు సర్కార్! తిండికి లేనోడుసైతం కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. మీరు ఈ పని చేయకపోతే ఇవాకతం ఆటలు చెప్పడానికి వీలుండదు. అంతా ఎదుటి పార్టీలో చేరిపోయి మన పార్టీనే మంట కలుపుతారు."

"పరిశీలిస్తాం."

"అచ్ఛా సర్కార్! మరి శలవు తీసుకుంటా. మళ్ళీ ఎప్పుడు దర్శనం చేసుకోమంటారు?"

"మంచిది."

వెనక్కు జరిగి మళ్ళీ పూర్వంలాగే సలాములు చేస్తూ నిష్క్రమించాడు ఉస్మాన్. లోపల్లోపలే తిట్టుకున్నాడు. ఇంత ఇదిగా ఎన్నడూ ఉండలేదు మంత్రిగారు. ఎంత సహాయం చేశాడు తాను మంత్రిగారికి? అసలు అతని ఎన్నికకు కారణం తానేగా? ఎన్నిసార్లు వచ్చాడు తన ఇంటికి! ఎన్ని సభల్లో తనను పొగిడాడు! ఏమిటీ మార్పు? అయినా, పని తనది. అవసరం వస్తే గాడిదకాళ్ళు పట్టుకోవాలి. పి.ఏ. తో నవ్వి మాట్లాడాడు. చాటుగా తీసికెళ్ళి ఏదో గుస గుస చెప్పాడు. అతనికో సిగరెట్టిచ్చి తానొక సిగరెట్టు కాల్చాడు. తనకేమీ తెలియదన్నట్లుగా సంజ్ఞలు చేసి చెప్పాడు పి.ఏ. అయినా, తెలుసుకొమ్మని అక్కణ్ణుంచి నిష్క్రమించాడు.

నిష్క్రమించనైతే నిష్క్రమించాడు కాని, అతనికి సంతృప్తి కలుగలేదు. మంత్రిగారిమీద వత్తిడి చేయడానికి యెంతమంది వగ్గరికి వెళ్ళాలో అంతమంది దగ్గరికీ వెళ్ళాడు. కాళ్ళా వేళ్ళా పడ్డాడు. ఎన్నో ఆశలు చూపాడు. సాయంకాలానికిగాని ఇంటికి చేరలేదు. ఇంటికి వచ్చేవరకు సిగరెట్టు పొగ వదుల్తూ, కర్ర ఆడిస్తూ డ్రాయింగు రూములో కూర్చుని ఉన్నాడు శ్రీనివాసరావు. అతణ్ణి చూడగానే అప్పులవాణ్ణి చూసినట్లనిపించింది ఉస్మాన్‌కు. అయినా, ధైర్యం తెచ్చుకొని కూర్చున్నాడు ఉస్మాన్.

"చూశారా! అప్పుడే బలం వచ్చేసింది గుడిసెల వాళ్ళకు. ఆ రామారావు గుడిసెల వాళ్ళందరికి పురి ఎక్కిస్తున్నాడు. పట్టణంలో ఉన్న గుడిసెల వాళ్ళందర్నీ ఒక్కటి చేస్తున్నాడు. తానే నన్ను ట్రాన్స్‌ఫర్ చేయించానని సభలు పెట్టి చెపుతున్నాడు. ఆ ఇక్బాల్ ఒకడు! డాక్టరట వాడి ముఖం. అసలు ఆ రామారావుకు వాడివల్లనే బలం. సరే, ఇంతకూ వెళ్ళినపని ఏమైంది?" అడిగాడు శ్రీనివాసరావు.

"ఏమి అవుతుంది? ఉస్మాన్ వెళ్ళిం తరవాత ఖాళీ కావడం అంటూ ఉంటుందా? మంత్రిగారితో చెప్పాను. నువ్వు చెప్పిం తరవాత చేయకపోవడం ఏమిటి? అయినా, కోర్టుతీర్పు అంటున్నావు కాబట్టి, నాలుగు రోజులు శ్రీనివాసరావుతో శలవు పెట్టించు. తాత్కాలికంగా మరొకర్ని వేద్దాం. నాలుగు రోజుల్తరవాత మళ్ళీ శ్రీనివాసరావును వేస్తే తీరిపోతుంది అన్నాడు. శలవు పెట్టేయ్ ఒక నెల" అన్నాడు.

"అంతేనంటారా?"

"ఏం చేస్తాం మరి? ఎంతైనా కోర్టు తీర్పుకదా! అయినా, నీకు ఉద్యోగం ఎందుకయ్యా? మానెయ్యరాదూ? వ్యాపారంలో భాగం చేరు. భాగం ఇస్తా!"

"సరే, ఆలోచిస్తాను. అయితే, శలవు పెట్టమంటారు? రేపుణ్ణుంచే శలవు పెట్టేస్తా. అదీ మంచిదే. జడ్జీ మొఖాన కొట్టినట్లుంటుంది. పెద్ద నీలుగుడూ వాడూను. సరే, వస్తా" అని లేచాడు శ్రీనివాసరావు. అతడూ లోపల్లోపల తిట్టాడు ఉస్మాన్ను. 'చేతకాని వేషం కాకుంటే శలవు పెట్టమనడం ఏమిటి? వీడి పని తేలినట్లే ఉంది' అనుకొని మోటారు సైకిలుమీద వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

శ్రీనివాసరావు శలవు పెట్టాడు. శలవు మంజూరైంది. జోసెఫ్ మురుగన్‌ను అతని స్థానంలో నియమించారు.

జోసెఫ్ మురుగన్ గుండ్రని ముఖానికి బుర్ర మీసాలొక అందం. అతనిది భయంకర మూర్తి. ఎత్తుకు తగిన లావైనవాడు. అతనంటే హడల్ పోలీసులకు. పోలీసువాడే అయినా న్యాయం జరగాలని ఏదో కోశాన అనుకుంటుంటాడు.

ఆనాడే డిన్నరుకు పిలిచాడు ఉస్మాన్ జోసెఫ్ మురుగన్ను. మురుగన్‌కు వెళ్ళక తప్పింది కాదు. ఉస్మాన్ తన ప్రతాపం అంతా వెళ్ళగ్రక్కాడు. తన సిఫార్సుమీదే జోసెఫ్‌ను ఇక్కడికి పోస్టు చేశారని చెప్పాడు.

బాలయ్య కేసును పరిశీలించాడు జోసెఫ్. కేసంతా అవకతవకలుగా కనిపించింది. పిచ్చయ్యనూ, రామారావునూ పిలిపించి తెలుసుకున్నాడు. ఆ సాయంకాలమే హాస్పిటల్‌కు వెళ్ళి బాలయ్యనూ ఇక్బాల్నూ కలుసుకున్నాడు. సంఘటన జరిగిన చోటును పరిశీలించాడు.

మరుసటి రోజునుంచి సాక్ష్యాలు సేకరించసాగాడు. ఇక్బాల్ ఆదేశం మేరకు ఏ ఒక్కరూ ఉస్మాన్‌పేరు ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ పేర్కొనలేదు. అతని పేరు చెపితే సబినస్పెక్టర్ బెదిరిపోతాడని ఆ జాగ్రత్త వహించాడు ఇక్బాల్.

ఎవరెంత జాగ్రత్తపడినా గ్రహించేశాడు జోసెఫ్. ఇందులో ఉస్మాన్ హస్తం ఉందని తెలుసుకున్నాడు. అసలు తగాదా అంతా గుడిసెల స్థలానిదని తేల్చుకున్నాడు. కాని, రికార్డులో ఎక్కడా ఆ విషయం రాకుండా చూశాడు. జోసెఫ్ తన విషయంలో జాగ్రత్త పడుతున్నాడని గ్రహించిన ఉస్మాన్ ఇందువిషయంలో జోక్యం కలిగించుకోక పోవడం క్షేమం అనుకున్నాడు.

మహమ్మద్ హుసేన్, రామమనోహర్ సింగులను అరెస్టు చేయడానికి వారెంటుతో వాళ్ళ ఇళ్ళకు వెళ్ళాడు జోసెఫ్.

ఇద్దరూ ఇళ్ళలో లేరు.

పరారైనారు.

★ ★ ★

# ఇరవై మూడు

బాగా పొద్దెక్కిన తరువాత లేచింది రజని. ఆమెకు డెయిజీ కనిపించలేదు. ఇల్లంతా వెదకింది. ఎక్కడా కనిపించలేదు. గుండె దడదడ లాడింది. డెయిజీ ఏదో కుట్ర చేస్తూంది. అనుకుంది. అందుచేతే తనను కనీసం లేపకుండా వెళ్ళిపోయిందనుకుంది. గబగబా ముఖం కడుక్కొని బయలుదేరింది.

రాజారావు ఇంటికి చేరేవరకు ఉస్మానూ, రాజారావూ డ్రాయింగు రూములో కూర్చొని మాట్లాడుకుంటున్నారు. తలవంచుకొని సాగిపోయింది. రాజారావు రజనిని చూచాడు. మండిపోయాడు. తన ఇష్టం వచ్చినప్పుడు రావడానికీ, ఇష్టం లేకుంటే పోవడానికి ఇదేం సత్రమా అనుకున్నాడు. ఉస్మాన్ ఉండడం వలన నిగ్రహించుకున్నాడు.

ఉస్మాన్ రజనిని చూచాడు. తటిల్లత కనిపించినట్లనిపించింది.

"ఎవరు?" అడిగాడు.

"రజని." చిరాకుగా బదులు చెప్పాడు.

"పేరు కాదు నేనడిగింది." నవ్వి అడిగాడు.

"అందానికి మురిసి ఇంట్లో పెట్టుకున్నాను. మొన్నపోయింది, ఇవాళ వస్తూంది." విసుగ్గా జవాబు చెప్పాడు.

"ఇప్పుడేం చేస్తారు?"

"ఏం చేస్తాను? వెళ్ళగొడ్తాను. ఇదేం సత్రమా?"

"ఆడవాళ్ళ విషయంలో అంత ఉద్రేకం పనికిరాదు. నీకు అక్కర్లేకుంటే నా కిచ్చేయ్. ఎక్కడికి పోతుంది పాపం?"

రజని విషయమంతా విడమర్చి చెపుదామనుకున్నాడు. అయినా, తనకెందుకు? అతడే చూచుకుంటాడు? అనుకొని, అలాగే అనేశాడు. రజనిని పిలిపించాడు. ఆవిడకు ఉస్మాన్ను పరిచయం చేశాడు. ముగ్గురూ కలిసి తేనీరు పుచ్చుకున్నారు. టీ ముగిసింది.

"వస్తా" అన్నాడు ఉస్మాన్.

"రజనీ, వస్తావా అలా వెళ్ళొద్దాం?"

రజనికి వెన్నెల విరిసినట్లయింది. అలాంటిమాట వినక చాలా కాలం అయిపోయింది. రాజారావు ఎంత మంచివాడు అనుకుంది.

"ఇలాగే రానా? బట్టలు మార్చుకొని..."

"ఏం? బావున్నాయి బట్టలు. పద" అన్నాడు రాజారావు.

ముగ్గురూ కారెక్కారు.

కారు ఒక సౌధం ముందు ఆగింది. దాన్ని చూడగానే ఏదో శంక కలిగింది

రజనికి. కారు దిగక తప్పిందికాదు. రాజారావు వెనక నడిచింది. ఆవిడ వెనుక నడిచాడు ఉస్మాన్. గూర్ఖా గేటు తెరచి సలాం కొట్టాడు. ముగ్గురూ లోనికి ప్రవేశించారు. లోనికి వెళ్ళగానే ఆగిపోయాడు రాజారావు. గ్రహించాడు ఉస్మాన్. ముందు నడిచాడు. రజనిని అతని వెనుక నడువమన్నాడు రాజారావు. గుండె బిక్కు బిక్కు మంటూనే నడిచింది రజని. రజని వెనుక రాజారావు నడిచాడు.

ముగ్గురూ కలిసిసాగారు. మూడో అంతస్తును చేరారు. అక్కడ ఇద్దరమ్మాయిలు బల్లముందు కూర్చొని ఏదో మాట్లాడుకొంటున్నారు. ఉస్మానును చూచి లేచి నుంచున్నారు. అతని సైగ ప్రకారం గదుల్లోకి వెళ్ళిపోయారు.

వాతావరణం వింతగా కనిపించింది రజనికి. ఆవిడ గుండె వేగంగా కొట్టుకోసాగింది. కాళ్ళు తడబడసాగాయి. నాలుక అనుకొనిపోయింది. ఏవేవో ఆలోచనలు వచ్చాయి. తననెందుకు ఇక్కడికి తీసుకొని వచ్చినట్లు? ఒకసారి సూర్యారావు ఇలాంటి చోటుకే తీసికెళ్ళాడు. ఉస్మాన్ విషయంలో ఏదో అనుమానం కలిగింది. ఆ అమ్మాయి లెవరు? ఈ గదులేమిటి? ఛాఛాఛా – ఈ పటా లేమిటి? ఎందుకు వచ్చినట్లు తాను? వలలో చిక్కిన పక్షిలా గిల గిల తన్నుకుంది ఎద.

"ఎలా ఉంది?" అడిగాడు ఉస్మాన్. వెటకారం ధ్వనించింది. వళ్ళు మండింది రజనికి. జవాబు చెప్పలేదు. చిరునవ్వు నవ్వాడు ఉస్మాన్. రాజారావు వైపు చూచింది. రాజారావు హృదయం క్షణం కరిగి, మళ్ళీ పాషాణం అయిపోయింది.

"ఎన్నాళ్ళలా తాగకుండా ఉంటావు? తాగు" అన్నాడు రాజారావు. మాటల్లో కర్కశత్వం గోచరించింది. ఇద్దరు కసాయివాళ్ళు తనను వధ్యస్థానానికి తెచ్చినట్లని పించింది రజనికి.

ఇంతలో బేరర్ వచ్చాడు. విస్కీ తెమ్మన్నాడు ఉస్మాన్. గ్లాసులు, విస్కీ సీసా వగైరా వచ్చేశాయి. ఉస్మాన్ మూడు గ్లాసుల్లో తయారు చేశాడు. ఇద్దరూ చెరొక గ్లాసు తీసుకున్నారు. "తీసుకో రజనీ, ఆనందం ఉందందులో" అన్నాడు ఉస్మాన్. "తాగను" అనేసింది రజని. ఆ ధ్వనిలో దృఢనిశ్చయం గోచరించింది. కళ్ళు ఎర్రవారేయి.

"ఓహోహో, కోపం ఎంత బాగుంది! నేను తాగిస్తా–నీ చేతుల్తో ఇదిగో" అని గ్లాసు పెదవులదాకా తీసుకెళ్ళాడు ఉస్మాన్.

వళ్ళు మండిపోయింది రజనికి. రక్తం వేడెక్కింది. లాగి గ్లాసును కొట్టేద్దా మనుకుంది. కాని, లేచి దూరంగా వెళ్ళిపోయింది. మూల నుంచుంది. "సరే నుంచో అక్కడే. నన్ను తాగనివ్వు ముందు" అని గ్లాసు ఎత్తుకొని గడగడా త్రాగేశాడు ఉస్మాన్. రాజారావు మెల్లగా చప్పరిస్తూ త్రాగేస్తున్నాడు. మరొక గ్లాసు వేసుకున్నాడు.

రాజారావు సిగరెట్టు కాల్చాడు. లేచి నుంచున్నాడు. రజని గుండె విలవిల్లాడింది. ఒక అడుగు గుమ్మం వైపు వేశాడు. రజని కూడా అతని వెంట సాగింది. "ఎక్కడికి?" ఉరిమాడు ఉస్మాన్. రాజారావు వెనక్కి తిరిగి చూచాడు. రజని తనవెంట వస్తోంది. "ఉండు, ఎక్కడికి" అరిచాడు రాజారావు.

"ఉండను. వచ్చేస్తా" అని ముందడుగు వేసింది.

"ఎక్కడికి?"

"ఇంటికి."

"నీకేం తాళికట్టానా? ఉండు."

"వస్తున్నా" అని వీరావేశంతో సాగింది.

ఉస్మాన్ లేచి అడ్డుకున్నాడు. పక్కకు నెట్టింది. తూలి పక్కకు జరిగాడు. ముందుకు సాగింది. చేతులు చాచి గుమ్మానికి అడ్డం నుంచున్నాడు రాజారావు. "నీ ఆటలు ఇక్కడ సాగవు. ఉండిపోవాల్సిందే. కదిలావంటే ప్రాణాలు పోతాయి" అన్నాడు.

బొమ్మలా నుంచుండి పోయింది. క్షణం ఆవిడకు ఏమీ తోచలేదు. ఉస్మాన్ను నెట్టినట్లు పక్కకు నెట్టలేకపోయింది రాజారావును. మరుక్షణంలో ధైర్యం వచ్చింది. "చస్తాను. కాని, ఇక్కడుండను" అనేసింది.

"ఉండు" అని లాగికొట్టాడు రాజారావు. సహజంగా దెబ్బ తగిలిన చోటు చూచుకోవాల్సిన చేయి ప్రతీకారానికి లేచింది. వెనుక నుంచి ఉస్మాన్ పట్టుకున్నాడు చేతిని. "రాజారావు! నువ్వెళ్ళు, నేను చూసుకుంటా" అన్నాడు. రాజారావు కోపంగా తలుపు తెరుచుకొని వెళ్ళిపోయాడు. ఉస్మాన్ చేతినుండి విడిపించుకోవడానికి గిజ గిజలాడింది.

"ఉస్మాన్ చేయి తగిలిన ఆడది కదల్లేదు. ఏది, ఒక్క ముద్దు" అని పెదవుల్ని చెంపలదాకా పోనిచ్చాడు. మరో చేత్తో లాగి లెంపకాయ కొట్టింది. చేయి వదల్లేదు ఉస్మాన్. పెద్దగా నవ్వాడు. దగ్గరకు లాక్కున్నాడు. కాలితో తన్నింది. చేయి విడిచి దూరంగా పడబోయి తమాయించుకొని నుంచున్నాడు.

"ఎంత పొగరుంది నీకు?" అని బుసలు కొడుతున్న రజని మీదికి వచ్చాడు. రజని సీసా విసిరింది. అది గోడకు తగిలి ముక్కలు ముక్కలై పోయింది. గదినిండా సారాయి వాసన. ఎక్కణ్ణుంచో కిలకిల నవ్వులు వినిపించాయి. ఆ నవ్వులను వినిపించుకోలేదు రజని. ఉస్మాన్ బారినుండి తప్పుకోవడానికి బల్లకు మరొకపక్కకు చేరింది. ఉస్మాన్ లైటు ఆర్పేశాడు. కటిక చీకటి కాకున్నా చీకటిగానే వుంది. ఉస్మాన్ మాత్రం రజనికి కనిపిస్తూనే వున్నాడు. ఉస్మాన్ ఆవిడ మీదికి ఉరికాడు. అడుగు వెనక్కు వేసి తప్పుకోవాలనుకుంది. ఉస్మాన్ ఆవిణ్ణి పట్టుకోడానికి ప్రయత్నించాడు కాని నెట్టివేసింది. వెల్లకింత పడిపోయింది. పగిలిన సీసామీద పడిపోయింది. గ్లాసు తలలో గుచ్చుకుంది. కెవ్వుమని కేకవేసింది. స్పృహ తప్పిపోయింది. ఉస్మాన్ అదిరిపోయి లైటు వేశాడు. రక్తపు మడుగులో పడివుంది రజని. అతనికి కళ్ళు తిరిగాయి. గబ గబా అక్కడున్న వాళ్ళంతా ఉరికి వచ్చారు. గదిలోనూ, గదిముందూ పెద్ద గుంపు ఏర్పడింది.

రజని చనిపోతే హత్యా నేరం. పోలీసులు. జేలు. ఎందుకు తెచ్చి పెట్టుకున్నానా ఈ బెడద అనుకున్నాడు. జనం అంతా చూడ్డంతో రహస్యం కాస్తా ప్రదర్శనం అయిపోయింది. "ఏముందిక్కడ చోద్యం, వెళ్ళిపోండి" అని ఉరిమాడు. ఒక్కరూ

కదల్లేదు. అక్కడ తన ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ. ఈ రోజు దాన్ని ధిక్కరిస్తున్నారు వీరు. సహించలేకపోయాడు. మళ్ళీ కేకవేశాడు. "కదుల్తారా, అందర్నీ కాల్చివేయనా?" అని జేబులో చేయిపెట్టాడు. జేబులో పిస్తోలు లేదు. అలా ఉందని చూపి వారిని బెదిరించాలని అతని ప్రయత్నం. ఒక అమ్మాయి గుంపును దూసుకొని ముందుకు వచ్చింది. ఆవిడ తెలుగు యువతి మాత్రం కాదు. వెంట్రుకలు కత్తిరించి ఉన్నాయని ఆంగ్లో ఇండియన్ యువతి అనుకోవడానికి వీల్లేదు. వచ్చీరాని ఉర్దూలో అన్నది: "మేక తోలు కప్పుకున్న నక్కలు. ఆవు తోలు కప్పుకున్న పులులు. మీరు నాయకులు. ఎందరి ప్రాణాలూ, మానాలూ హరిస్తారు? ఎన్నాళ్ళిలా ఆడవాళ్ళను చంపుకు తింటారు? మేం కదలం. ఇక నీ ఆజ్ఞ చెల్లదు."

రక్తం మడుగులో తెలివిలేక పడి ఉంది చూడు. గుండెలేదా? రాతిగుండె పెట్టాడ దేవుడు? అని రజని పక్కన కూర్చొని తల ఎత్తి ఒళ్ళో పెట్టుకుంది ఆమె. గాజుపెంకు లాగేసింది. రక్తం ఇంకా పొడ పొడ కారుతూనే ఉంది. "ఏమిటి, నుంచొని తమాషా చూస్తున్నారు? ఫోను చేయండి ఆస్పత్రికి, అంబులెన్సు తెమ్మని" అని అరిచింది.

నుంచున్న గుంపులో సంచలనం బైల్దేరింది. పరిగెత్తారు కొందరు టెలిఫోను దగ్గరికి. ఉస్మాన్‌కు చెమటలు పోశాయి. పరిగెత్తాడు. అప్పటికి డయల్ చేస్తున్న ఒక అమ్మాయి చేతులోంచి రిసీవరు లాక్కున్నాడు. క్షణం నిర్ఘాంతపోయిన అమ్మాయిలు మరుక్షణంలో రిసీవరుకోసం అతనిమీద పడ్డారు. ఎదుటి వారి బలం ఎక్కువగా ఉందని తెలుసుకున్నాడు ఉస్మాను. రిసీవరు నేలకేసి కొట్టాడు. అది ముక్కలై పోయింది. టెలిఫోనుకోసరం క్రిందికి పరిగెత్తారు అమ్మాయిలు. వారికి ఎదురుగా ఆస్పత్రి వాళ్ళు స్ట్రెచర్ పట్టుకొని వస్తూ కనిపించారు. వాళ్ళను చూచి వెనక్కు తిరిగారు! వారివెంట పైకి వెళ్ళారు.

సోఫాలో తల పట్టుకొని కూర్చున్న ఉస్మాన్ వారిని చూచాడు. పిచ్చివాడైపోయాడు. "ఎవరు పిలిచారు. మిమ్మల్ని?" అని అరచాడు. స్ట్రెచర్ తెచ్చిన వాళ్ళు "టెలిఫోన్ వచ్చింది" అన్నారు. "వెళ్ళిపోండిక్కణ్ణుంచి. ఇక్కడేమీలేదు" అన్నాడు. "వీడు కసాయివాడు. మీరు రాండి, ఈ గదిలో రక్తం మడుగుల్లో పడి ఉంది అమ్మాయి" అని తోవచూపారు అమ్మాయిలు. "అడుగు ముందుకు వేశారా – కాల్చేస్తా. ఇది నా యిల్లు. వెనక్కు తిరిగిపోండి" అని అరిచాడు లేచి నుంచొని జేబులో చేయిపెట్టి, ఉస్మాన్. "అతనికి పిచ్చి లేచింది. రాండి. అతని దగ్గర తుపాకీ లేదు. మిమ్మల్ని కాల్చనూ కాల్చడు" అని గదిముందుకు తీసికెళ్ళారు అమ్మాయిలు.

తానేమీ చేయలేనని గ్రహించాడు ఉస్మాన్. ఆ చోటువదలి పోవడమే క్షేమం అనుకున్నాడు. మెట్లుదిగుతుంటే ఎదురుగా వస్తున్న పోలీసులు కనిపించారు. ఉస్మాన్ గుండె జారిపోయింది. "హలో మిస్టర్ ఉస్మాన్! మీ దగ్గరేదో క్రైం జరిగిందని వార్త. అందుకే వచ్చాం. ఏమదీ?" అడిగాడు సబిన్‌స్పెక్టర్.

ఉస్మాన్ వెంటనే తడుముకోకుండా జవాబు చెప్పేశాడు – "అవును, నేనే మీకు రిపోర్టు చేయడానికి వస్తున్నా. ఒక అమ్మాయి ఇంకో అమ్మాయిని హత్య చేసింది, రండి" అని వాళ్ళను తీసుకొని గది దగ్గరకు వెళ్ళేవరకు రజనిని

స్ట్రెచర్‌లో పడుకోబెట్టి ఎత్తుతున్నారు. రక్తపు చేతుల్తో నళిని అక్కడే నుంచోని వుంది. "ఇదిగో, ఈ అమ్మాయి" అని చెప్పాడు ఉస్మాన్. వెంటవచ్చిన పోలీసులకు అరెస్టు చేయవలసిందని ఆజ్ఞాపించాడు సబిన్‌స్పెక్టర్.

నళిని కస్టడీకి, రజని ఆస్పత్రికీ చేరారు.

☆ ☆ ☆

డెయిజీ కూరగాయలు తీసుకొని ఇంటికి వచ్చేవరకు రజని లేదు. రజని కనీసం తనకు చెప్పకుండా వెళ్ళిపోయినందుకు బాధపడ్డది. రాజారావు రజనికి స్వాగతం చెపుతాడనుకోలేదు డెయిజీ. రాజారావు వృత్తాంతం యావత్తూ చెప్పి రజని నిర్ణయాన్ని మార్చిద్దా మనుకుంది. కాని, ఇంటికి వచ్చేవరకు రజని లేదు. ఆమె మనసు ఏదో కీడు శంకించింది. అయినా వంట చేసింది. భోజనం రుచించలేదు. కాలు నిలువలేదు. రాజారావు ఇంటికి పరిగెత్తింది. పిడుగులాంటి వార్త తెలిసింది. ఉస్మాన్ చేతికి చిక్కిన ఆడదాని గతి ఏమౌతుందో డెయిజీకి తెలుసు. ఉస్మాన్ అమ్మాయిలను ఎక్కడ ఉంచేదీ ఆవిడకు తెలుసు. అక్కడికే పరిగెత్తింది. స్థలం నిర్మానుష్యంగా ఉంది. కళకళలాడుతుండే బంగళా నిర్మానుష్యంగా కనిపించింది. భయంకరంగా కనిపించింది. పీనుగు వెళ్ళిపోయిన ఇల్లులా కనిపించింది.

ఆ యింటిని చూడగానే డెయిజీ గుండె "డక్కు" మన్నది. కాలి చల్లారిన కాటిమీద నడిచినట్లు నడిచింది. మెట్లెక్కింది. మూడవ అంతస్తు చేరింది. అబలలు అంతా చేరి చర్చించుకుంటున్నారు. తమలో ఒకతె చచ్చింది. రెండవది జేలుకుపోయింది. తమ గతి ఏమికానున్నది? జరిగిన దానికి ఏం చేయాలి?

వారంతా డెయిజీని చూచారు. "ఉస్మాన్ రజనిని హత్య చేశాడు. నళినిని పట్టించాడు పోలీసులకు" అని కోరస్‌లా పలుకుతూ ఆమెను చుట్టుముట్టారు.

డెయిజీ కళ్ళముందు చీకటి తరంగాలు కనిపించాయి. కాళ్ళు చేతులు వణికాయి. నోటమాట పెకల్లేదు. కన్నీరు రాలలేదు. కష్టంగా అడిగింది – "రజని చనిపోయిందా?" అని.

"తెలియదు, ఆస్పత్రికి తీసికెళ్ళారు."

డెయిజీకి ప్రాణం వచ్చింది. కాళ్ళు వాటంతట అవే కదిలాయి. గబగబా మెట్లు దిగింది. టాక్సీలో పడి ఆస్పత్రికి చేరింది. తలనిండా కట్లతో మంచంలో పడివుంది రజని. రజనిమీద పడి భోరున ఏడవాలనిపించింది. కాని, అలా చేయలేదు. మంచం పక్కన ప్రతిమలా నుంచుంది. కన్నీటి చుక్కలు రెండు రాలాయి.

ఇక్బాల్ రజనిని చూడడానికి వచ్చాడు. మంచంవరకు వచ్చాడు. ఎదురుగా స్ఫటికపు బొమ్మలా నిలిచి కన్నీరు రాల్చుతున్న డెయిజీని చూచాడు. తానూ ఒక ప్రతిమయ్యై అలాగే నుంచుండిపోయాడు. ఆమె కన్నీటిని చూచి అతని కనులూ చెమ్మగిల్లాయి.

డెయిజీ జేబు రుమాలుతో కన్నీరు తుడుచుకున్నప్పుడు ఇక్బాల్ కనిపించాడు. ఒక సిగ్గు దొంతర వచ్చి మాయం అయింది. నమస్కరించింది. ఇక్బాల్, డెయిజీ అక్కణ్ణుంచీ కదిలారు. మౌనంగానే వారొక గదికి చేరారు. కుర్చీమీద కూర్చుంటూనే అడిగాడు – "ఆమె మీకు తెలుసా?" అని.

"తెలుసు. రజని మా చెల్లి." బాణం వదిలినట్లు జవాబు చెప్పింది.

"అలాగా అయితే వివరంగా చెప్పాలి." అన్నాడు.

రజని పడిపోయిన నాటినుంచి నిన్నటి వరకు జరిగిన విషయాలన్నీ సంగ్రహంగా చెప్పింది.

"ఇది విచిత్రమైన కేసు. రజనికి ఇప్పుడేమీ భయంలేదు. సరే, పాపం – నళిని ఏమైంది?"

"రజని వార్త విన్నాక నళినిని గురించి ఆలోచించలేకపోయాను. పోలీసులు తీసికెళ్ళారట."

"ఈ ఉస్మాన్ రాక్షసుడులా వున్నాడు. భోగం కొంపలు సైతం నడిపిస్తున్నాడు. ముందు నళినిని విడిపించాలని నా ఉద్దేశం. మీరేమంటారు?"

డెయిజీ చిరునవ్వు నవ్వింది. "నళినికి దిక్కెవ్వరు?" దాన్ని ముక్కలు ముక్కలుగా కోసి కాకులకు గద్దలకు వేసినా ఉస్మాన్ను అడిగేవాడు లేదు" అన్నది.

"నళినికి దిక్కెవ్వరా? దీనులకు దేవుడే దిక్కు, నడవండి నేనూ వస్తాను."

"మీరా!" చకిత అయి అడిగింది డెయిజీ. నోరు తెరచింది తెరిచినట్లే ఉండిపోయింది. ఆమె ఆశ్చర్యంలో మునిగిపోయింది.

"నడవండీ. వకీలు దగ్గరికి వెళ్దాం" అని అడుగు ముందుకు వేశాడు ఇక్బాల్. వెంట నడిచింది డెయిజీ. ఇద్దరూ కారెక్కారు. కారు మహబూబ్ కిషన్ ఇంటిముందు ఆగింది. వకీలుగారు కోర్టుకు బయలుదేరుతున్నారు. ఇక్బాల్‌ను చూచి నమస్కరించాడు. ప్రతి నమస్కారం చేసి వకీలు గారిని ఆఫీసు గదిలోకి తీసికెళ్ళాడు. డెయిజీకూడా వెళ్ళింది. డెయిజీని పరిచయం చేసి, నళిని వృత్తాంతం యావత్తూ చెప్పాడు ఇక్బాల్.

మండిపడ్డాడు మహబూబ్ కిషన్. "రాక్షసుడులా ఉన్నాడు ఉస్మాన్. ఇలా ఎంత మందిని బలి ఇస్తాడు? సరే, బెయిలుమీద రిలీజ్ చేయించుదాం, తరవాత విషయాలు చూదాం" అని, 'ఏమంటావ్?' అని డెయిజీని అడిగాడు.

ఇక్బాల్ విషయంలో గౌరవంతో డెయిజీ గుండె నిండిపోయింది. అతడు దేవతగా కనిపించాడు. ఎవరో తెలియని అనాథకోసం రెక్కలు కట్టుకొని వచ్చాడు. ఆమెకు తెలిసిన లోకంలో జనులంతా స్వార్థపరులు, నీచులు, కుత్సితులు, లుబ్ధులు. ఆమె నేటివరకు వేరే లోకం చూడలేదు. అసలు ఇలాంటివారు వుంటారని ఊహించలేదు. మహబూబ్ కిషన్ ఎలాంటివాడో ఆవిడకు తెలియదు. తనను ఆ ప్రశ్న ఎందుకు వేశాడో కూడా అర్థం కాలేదు.

"ఇప్పుడు చిల్లిగవ్వలేదు. మీ రుణం ఉంచుకోను, నళినిని విడిపించండి ప్లీజ్... ప్లీజ్" అని బ్రతిమిలాడింది.

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. "మిస్ డెయిజీ! నన్ను అంత నీచుడనుకోకు. మనం డబ్బును సంపాదిస్తాం. డబ్బు మనను సంపాదించదు. భగవంతుడు నాకు కావలసినంత యిచ్చాడు. ఈ విషయంలో నయాపైసా పుచ్చుకోను. ఈ రాక్షసుని హతమార్చగలుగుతే సంతోషిస్తాను" అన్నాడు మహబూబ్ కిషన్.

డెయిజీ గుండె పొంగింది. అనుకోకుండానే మహబూబ్ కిషన్ కాళ్ళమీదపడి కన్నీరు జలజలా రాల్చింది. "మీరు మానవులు కారు, దేవతలు! ఇక్బాల్‌గారినీ మిమ్ములనూ చూచిం తరవాత భూమిమీద సైతం దేవతలుంటారని తెలుసుకున్నాను" అన్నది బొంగురుపోయిన గొంతుతో.

"కాళ్ళు పట్టుకో కూడదమ్మా!" అని దూరం జరిగాడు మహబూబ్ కిషన్.

డెయిజీ లేచి కన్నీరు నిండిన కళ్ళతో చేతులు జోడించి వారిని భక్తిగా చూచింది.

"పద, కోర్టుకు టైమౌతుంది" అని మహబూబ్ కిషన్ సాగిపోయాడు. ఇద్దరూ అతనిని అనుసరించారు.

బెయిలు తేలిగ్గానే మంజూరైంది. ఇక్బాల్ జమానతుయిచ్చి నళినిని విడిపించాడు. నలుగురూ కాంటీనుకు వెళ్ళి కాఫీ తెప్పించుకున్నారు. నళినికి ఇద్దరినీ పరిచయం చేసింది డెయిజీ. నళిని హృదయం వారి విషయంలో కృతజ్ఞతతో నిండిపోయింది. మాటలు చాలలేదు వ్యక్తపరచడానికి. "మీ మేలు ఎన్నటికి మరిచిపోలేనండీ!" అని మాత్రం అనకలిగింది.

"అదిసరేకానీ, కేసు విషయంలో జాగ్రత్తపడాలి. చూచిన వారంతా గట్టిగా సాక్ష్యం చెప్పేట్లు చూడాలి" అన్నాడు మహబూబ్ కిషన్.

"అంతా చెప్తారండీ!" అంది నళిని.

"పిచ్చిపిల్లా! నీకు తెలియదమ్మా! ఉస్మాన్ కాలాంతకుడు. వారిని తన వైపుకు తిప్పుకోవచ్చు. కోర్టుకు కళ్ళుండవు, చెవులే వుంటాయి. విన్నదానినిబట్టి తీర్పు లిస్తాయి. మీరు ఆ విషయంలో జాగ్రత్తపడండీ, మిగతా విషయాలు మేము చూసుకుంటాం" అన్నాడు కిషన్.

అంతా లేచారు."మీరు మీ వృత్తిని మార్చుకోవడం మంచిది" అన్నాడు ఇక్బాల్.

"ఇక్బాల్ గారూ! మీకు జవాబు చెప్పేంత శక్తిలేదు. కాని మేమూ బుద్ధిపూర్వకంగా ఈ వృత్తి చేయడంలేదు. పరిస్థితులు మమ్మల్ని లొంగదీస్తున్నాయి. సంఘం మమ్మల్ని చెడుదోవలు పట్టిస్తూంది" అన్నది డెయిజీ.

"అల్లా తలచుకుంటే మీకు మంచిబాట చూపుతాడు" అని, "ఏమంటావ్ మహబూబ్ భాయ్?" అని అడిగాడు.

"ఈ సమస్యలు ఈనాటివి కావు. మనం వాటిని పరిష్కరించలేము. ఇందు విషయమైన చర్చ ప్రస్తుతం అనవసరం. మీరు మీ పని చూచుకోండి" అని డెయిజీ, నళినీలకు చెప్పి వెళ్ళిపోయాడు మహబూబ్ కిషన్.

ఇక్బాల్ ఆస్పత్రివైపూ. నళినీ, డెయిజీ బ్రాతెల్‌వైపూ సాగిపోయారు.

డెయిజీ, నళిని అక్కడికి చేరేవరకు "ఇన్ఖిలాబ్ జిందాబాద్, ఇత్తెహాద్ జిందాబాద్" అనే నినాదాలు వినిపించాయి లోపలినుంచి.

గబ గబా మేడ మెట్లెక్కారు ఇద్దరూ. వంటల మైసయ్య ముందు నిలిచి, గరిట చేతులో పట్టుకొని, చేయెత్తి నినాదాలు ఇస్తున్నాడు. విరబోసిన వెంట్రుకలతో అమ్మాయిలంతా నినాదాలు చేస్తున్నారు.

డెయిజీ గొంతు కలిపింది.

నళిని గొంతెత్తి నినాదం ఇచ్చింది.

నళినిని చూచి అంతా కౌగలించుకున్నారు.

జరిగిన వృత్తాంతం తెలుసుకున్నారు. చేయవలసిన పని నిర్ణయించుకున్నారు. విరబోసిన వెంట్రుకల ఊరేగింపు సాగింది. ముందు మైసయ్యా, డెయిజీ; వెనుక బారులు తీరిన బాలికలు సాగిపోతున్నారు.

"ఇత్తేహాద్ జిందాబాద్"

"ఇన్ఖిలాబ్ జిందాబాద్"

"ఉస్మాన్ ముర్దాబాద్!"

ఇది కొత్త ఊరేగింపు. జనం దానిని వింతగా చూచారు ఊరేగింపు "నయాగరా"కు చేరింది.

అబలలు నయాగరాలో దూరారు.

పనివారిని బయటకు తెచ్చారు.

నయాగరా కార్మికుల మెరుపు సమ్మె!

నయాగరా కార్మికుల సహితంగా అబలల ఊరేగింపు సాగింది. పోలీసు స్టేషనుకు చేరింది.

"ఉస్మాన్ కో గిరఫ్తార్ కరో."

"ఖూన్ కిస్‌నే కియా"

"ఉస్మాన్‌నే" నినాదాలతో దిశలు మారుమ్రోగాయి.

జోసెఫ్ బయటికి వచ్చాడు. విచారణ జరుగుతూందన్నాడు. తప్పక న్యాయం చేస్తానన్నాడు.

న్యాయంతోపాటు సూర్యుడు అస్తమించాడు.

తెల్లవారి బోగంకొంపకు "నారీ సుధార్ గృహ" అనే పెద్ద బోర్డు కనిపించింది.

★ ★ ★

# ఇరవై నాలుగు

రాజారావుకు కోర్టునుంచి నోటీసు వచ్చింది, ఇల్లు ఖాళీ చేయాల్సిందని. కాళ్ళ క్రింది భూమి కదిలిపోయి నట్లనిపించింది. కూర్చుండిపోయాడు. ఆ నోటీసునే పదిసార్లు చదివాడు. కన్నీరు నిండింది. గుండె పగిలిపోతున్నట్లనిపించింది. పెద్దగా ఏడవాలనుకున్నాడు. ఏడవలేకపోయాడు. ఇంతలో కోపం వచ్చింది. ముందు నారాయణరావు మీద, తరవాత పార్వతి మీద. పార్వతి గదిలోకి వెళ్ళి ఆమెను నానా చీవాట్లూ పెట్టాడు. పాప కనిపించాడు. పాప పుట్టినప్పణ్ణించే ఇవన్నీ జరుగుతున్నాయని పాపనూ తిట్టేశాడు. పార్వతి పల్లెత్తుమాట అనలేదు. వింటూ కూర్చున్నది. వేసారి బయటికి వచ్చేశాడు.

పోర్టికోలో నుంచొని చూశాడు. లోకం రిక్తంగా, శూన్యంగా కనిపించింది. పోర్టికో ముందు లాన్. పచ్చగడ్డి పక్కకు దిశాంబరాల బార్డరు. తాను ఇష్టంగా వేయించుకున్నాడు. వీటన్నిటినీ వదలి వెళ్ళాల్సిందే? గుండె కలుక్కుమంది. నారాయణరావును తిట్టుకున్నాడు, కనీసం తనను ట్రస్టీని చేయలేదని! బంగళా వైపు చూచాడు. అంత అందమైన ఇంటిని – తన ఇంటిని వదలి వెళ్ళాలా? తప్పదా?

ఇంతలో ఉస్మాన్ గుర్తుకు వచ్చాడు. బయలుదేరాడు. తాను మున్నెన్నడూ ఎరుగనంత పరాభవం జరిగింది ఉస్మాన్‌కు. దాంతో అతనికి పిచ్చెక్కినంత పనయింది. ప్రతీకారాన్ని గురించి పలువిధాల ఆలోచిస్తున్నాడు. అతని బుర్ర వేడెక్కి ఉంది. అలాంటి సమయంలో వచ్చాడు రాజారావు. సలామ్ చేశాడు. పెర పెరలాడుతూనే అందుకున్నాడు ఉస్మాన్. నోటీసు విషయమంతా వివరించి చెప్పాడు రాజారావు.

"అవును, నోటీసు రాకుండా ఎలా ఉంటుంది?"

"ఏదైనా ఉపాయం?"

"ఉపాయం చెపితే విన్నావా? నేను చెప్పినట్లు చేసివుంటే నీకీ గొడవ ఉండేది కాదుగా?"

మహబూబ్ కిషన్ను హత్యచేసి, వీలునామా తగలబెట్టమని సలహా ఇచ్చాడు ఉస్మాన్. హత్యానేరం నుండి తాను తప్పిస్తానని హామీ యిచ్చాడు. రాజారావును అందుకు తయారు చేశాడు. తీసికెళ్ళాడు. కాని, తీరా మహబూబ్ కిషన్ ఇంటి దగ్గరికి వెళ్ళిన తరువాత ధైర్యం చాలలేదు. పారి వచ్చాడు రాజారావు.

"ధైర్యం చాలలేదు. ప్రస్తుతాన్ని గురించి ఆలోచించండీ!"

"నేనేమీ చేయలేను."

"మీరే చేయాలి. మరెవరు చేస్తారు?"

"ఏమీ చేయలేను."

"నేనేం నష్టం చేశానని అంత మొండికేస్తున్నారు? మీ రేది కావాలంటే అది ఇస్తాను. ఇప్పుడు చితికిపోయినా, ఎప్పుడూ ఇలాగే ఉంటుందాస్థితి?"

"ఇప్పుడు నా చేతిలో ఏమీ లేదు. ఏమీ చేయలేను."

రాజారావుకు కాస్తకోపం వచ్చింది. "పోనీ, నా డబ్బు ఇచ్చేయ్యండి."

"ఎక్కడిది?"

"స్థలం బాపతు మీరు పుచ్చుకున్నది."

"నా కెప్పుడిచ్చావ్?"

మండిపోయాడు రాజారావు. "ఏమీ, డబ్బే పుచ్చుకో లేదూ? నీదేం నాలుకా తాటిపట్టా! ఇలా ఎందరి గొంతులు కోశావు, ఏదీ నా మొఖం చూసి చెప్పు? పుచ్చుకోలేదూ డబ్బు?"

"ఏం ప్రేలుతున్నావ్? తెలుసా, ఎవరింట్లో ఉన్నావో? నిన్ను నరికి ముక్కలు ముక్కలు చేసినా అడిగే వాడెవడూ లేడిక్కడ. పో ఇక్కణ్ణుంచి. నీ భార్య ముఖం చూసి వదలుతున్నా."

"ఓరి రాక్షసుడా! నన్ను చంపిస్తావురా?" గొంతు చించుకొని మాట్లాడాడు రాజారావు. ఉద్రేకం హెచ్చింది. నరాలు పొంగాయి. కళ్ళు నిప్పులు కురిశాయి. ఆలోచనాశక్తి నశించింది. కాళ్ళూ చేతులూ వణికాయి. "తురకాణ్ణి నమ్మొద్దన్నా రిందుకే. చండాలుడు నయం నీకంటే. గొంతులు తడిబట్టల్తో కోసి నంజుకు తింటావురా దుర్మార్గుడా..." మాట పూర్తి చేయకముందే చెంప ఫెళ్ళుమంది.

అగ్గిమీద గుగ్గిలం వేసినట్లైంది. అమాంతంగా పడ్డాడు ఉస్మాన్ మీద. పడిపోయాడు ఉస్మాన్ – పెద్ద కేక పెట్టి. గుండెలమీద కూర్చొని గొంతుమీద చేతులు పెట్టి నొక్కసాగాడు రాజారావు. కళ్ళు తేలవేస్తున్నాడు ఉస్మాన్. రామమనోహరసింగ్, మహమ్మద్ హుసేన్ రాజారావును లాగివేశారు. చావబాదారు. ఆ పెనుగులాటలో రాజారావు చొక్కా సాంతం చిరిగిపోయింది. పాంటు కూడా చిరిగింది. "బాదండి లంజాకొడుకును. ఏమనుకున్నాడు ఉస్మాన్ అంటే!" అన్నాడు ఉస్మాన్. రాజారావును నేలమీద పడేసి తల నేలకువేసి కొట్టారు. "వదిలెయ్యండి గాడిదను – చస్తే మన మీదికి వస్తుంది. తీసికెళ్ళి కార్లో పడేసి రండి" అన్నాడు ఉస్మాన్. ఇద్దరూ ఎత్తుకెళ్ళి కార్లో పడేసి వచ్చారు.

ఇంటికి చేరేవరకు భయంకరంగా వుంది రాజారావు రూపం. పార్వతి గుండె పగిలింది. "ఏమండి! ఏమిటండీ ఇదంతా? ఎక్కడికి వెళ్ళారండీ? ఎవరు కొట్టారండీ?" విరామం లేకుండా ప్రశ్నలు వేసింది.

"పార్వతీ! చేసిన పాపాలకు ఫలితం అనుభవిస్తున్నాను, బాధ పడాల్సిందేమీ లేదు. మోసం చేసి, దుర్మార్గం చేసి సంపాదించిన సంపాదన ఎలా పోవాలో అలా పోయింది. నా ప్రాణం కూడా పోతే" – చేత్తో నోరు మూసింది పార్వతి. ఆమెకు కన్నీరు ధారగా ప్రవహించింది. "అలా అనకండి. ఆ భగవంతు డున్నాడు. వాడే రక్షిస్తాడు" అన్నది.

"పార్వతీ! ఇక నీ మంచితనమే నన్ను రక్షించాలి. చచ్చేంతగా దెబ్బలు తగల్లేదు. జీవిస్తాను. అవును, అనుభవించాలి చేసిందంతా. అప్పుడే చస్తే ఎలా? పారూ! ఇంక తగాదాలూ పోట్లాటలూ అనవసరం. మీ నాన్న మంచిపని చేశాడు. నా కళ్ళు తెరిపించాడు. రేపే ఈ ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోదాం. కాని, ఎక్కడికి వెళ్ళడం? ఏమిటి చేయడం?"

"నీటిలోని చేపలకు, ఆకాశంలోని పక్షులకు, అడవిలోని జంతువులకు ఎవడు రక్షణ కల్పిస్తున్నాడో వాడే మనలను రక్షిస్తాడు.

అర్థమనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖ లేశస్సత్యమ్ –

అన్నారు పెద్దలు. డబ్బు ఎన్ని అనర్థాలకు కారణమో కళ్ళారా చూశాం. రేపటివరకూ ఎందుకూ? నడవండి ఇప్పుడే" అని పాపను ఎత్తుకుని బయలుదేరింది.

రాజారావు బిత్తరపోయాడు. పార్వతి విషయంలో అతనికి భక్తి ఏర్పడింది. ఆమె అనాసక్తతకు ఆశ్చర్యం కలిగింది. చిరిగిన బట్టలతో, రక్తసిక్త శరీరంతో ఆమెను అనుసరించాడు.

గేటు దాటారు. కనీసం వెనుతిరిగి చూడకుండా సాగిపోతూంది పార్వతి.

రాజారావు వెనుకకు తిరిగి తన మేడను ఒక్కసారి చూచాడు. అతని కళ్ళనుండి బాష్పబిందువులు రాలేయి.

చూస్తే పార్వతి సాగిపోతూంది.

తానామెను ఈ జీవితంలో అందుకోలే ననుకున్నాడు.

ఆమెవెంట సాగిపోయాడు.

అర్ధరాత్రి – అమావాస్య చీకటి. ఏ సంచలనమూ లేదు. నిర్జనమైన శ్మశాన వాటికలా ఉంది నగరం – ముఖ్యంగా ఆ మురికివాడ చీకటి. నక్షత్రాల వెలుగుంది కొద్దిగా. కీచురాళ్ళ ధ్వని. ఎక్కడో కుక్క ఏడుస్తూంది. చెట్టూ, చేమా, మిట్టా, పల్లం ఏవీ కనిపించడం లేదు. పెద్ద గొంగళి పరిచినట్లుంది.

పిచ్చయ్య తడక తీశాడు. బయట అడుగు వేశాడు. ఏదో అలికిడి వినిపించింది. మరుక్షణంలో నలువైపులా భగ్గున మంటలు లేచాయి. కొంపలు అంటుకున్నాయి, బరబరా మండుతున్నాయి. భగ్గుమని లేస్తున్నాయి మంటలు. "కొంపలు అంటుకున్నాయి, లేవండి" అని పెద్దగా కేక వేశాడు పిచ్చయ్య. గూడెం దిగ్గున లేచింది. ఇద్దరు వ్యక్తులు పారిపోతున్నట్లు కనిపించింది. "దొంగలు దొంగలు" అని కేకలు వేస్తూ వెంటపడ్డాడు. కొంత దూరం పోయింతరవాత ఒక్కడే పారిపోతున్నట్లు కనిపించింది. వెంటపడ్డారు. గుడిసెల వాళ్ళంతా లేచారు. కల్లోలం. పరిగెత్తారు కేకలు వేస్తూ.

కొందరికి మురికి గుంతలో పడి కొట్టుకుంటున్నవాడు కనిపించాడు. మూతినిండా, ముఖంనిండా, వంటినిండా బురద, మురికి అంటింది. మనిషి మురికి మయం అయినాడు. గుంతలోంచి లాగారు. బయటికి తీసి అందరూ తన్నారు. కొందరు గుద్దారు, కొందరు బాదారు, కొందరు పొడిచారు. వాడు ఏడవడం మొదలుపెట్టాడు. కాళ్ళు పట్టుకొని ఏడ్చాడు. తనదేం తప్పు లేదన్నాడు. బుద్ధి గడ్డి తిన్నదన్నాడు. వాణ్ణి కట్టేశారు. నలుగుర్ని కాపలా ఉంచి మిగతా వాళ్ళు ముందుకు పరిగెత్తారు. పట్టుపడ్డవాడు రామ్‌మనోహర్‌సింగ్.

పిల్లల ఏడ్పులు, ఆడవాళ్ళ కేకలు, తిట్లతో ప్రతిధ్వనించిందా ప్రాంతం. పిల్లలనూ సామానులను బయటికి లాగసాగారు. అందినంతవరకు బట్టలు, బోళ్ళు, మంచాలు

లాగి పడేస్తున్నారు. కల్లోలంగా ఉంది పరిస్థితి. మంటలు, మంటలు! మంటలు!! మంటలు!!! ఒక పక్కనుంచి గుడిసెలను లాగేస్తున్నారు. మంట లార్పడానికి నీరు లేదు. పంపు పీకేశారు మున్సిపాలిటీవారు. కుండలు పట్టుకొని దూరంగా ఉన్న పంపుల దగ్గరికి పరిగెత్తారు జనం. పంపుల్లో నీళ్ళులేవు. పంపు లెండిపోయినాయి. నిస్సహాయంగా ఆకసాన్ని అంటుతున్న మంటలను చూస్తూ నుంచుండిపోయారు జనం. మంటలు వెదురుబొంగులకు అంటుకొని పేలుతున్నాయి వెదుళ్ళు.

పసిపాపల ఏడ్పులు – వృద్ధుల ఆర్తనాదాలు – ఆడవారి సాపెనలు... మంచాలు పోయాయని ఒకరు – బట్టలు కాలిపోయాయని ఒకరు – ఒళ్ళు కాలిందని ఒకరు – గుండాలను తిట్టూ ఒకరు – అంతా ఏడ్పుల మయం.

పారిపోతున్నవాడు తాగివున్నాడు. కాళ్ళు వణకుతున్నాయి. భయం. అయినా పరిగెత్తుతున్నాడు. వెంబడిస్తున్నవారు అనేకమంది. ప్రాణభయంతో పరిగెత్తుతున్నాడు. గుప్పెట్లో ప్రాణాలున్నాయి. గుండె దడ దడలాడుతూంది. చెమట కారిపోతూంది. నోరు ఆర్చుకుపోతూంది. అయినా పరిగెత్తుతున్నాడు.

దూరంగా వినిపించిన కేకలు దగ్గర అవుతున్నాయి. అవి దగ్గర అవుతుంటే చావు దగ్గరపడినట్లు పరిగెత్తుతున్నాడు. ఒడలు తూలుతూంది. శక్తి జారి కారిపోతూంది. ప్రాణభయం. తాను కొంపలు కాల్చాడు. కాళ్ళను లాక్కొనిపోతున్నాడు. దగ్గర్లోకి వచ్చేశారు వెంబడించేవాళ్ళు, ఏం చేయాలి? చుట్టుపక్కల ఏమీ కనిపించలేదు. దాగడానికి తావులేదు. తప్పుకునే బాటలేదు. ఒకటే మార్గం – పారిపోవడం. శక్తి క్షీణించింది. పరిగెత్తలేకపోతున్నాడు. పరిగెత్తడంలో కాలికి ఒక పెద్దబండ తాకింది. పడిపోయాడు.

లేవడానికి ప్రయత్నించాడు. లేవబోయేవరకు చుట్టేశారు జనం. బోనులో ఇరుక్కున్న ఎలకలా అయిపోయింది. చూశాడు. చుట్టూ జనం!!! తలమీదా, వీపుమీదా దెబ్బలు పడుతున్నాయి. అంతా అయోమయం! కేకలు!!! మనసులో చీకటి, మెదడులో చీకటి, బయట చీకటి, లోపల చీకటి, అంతా చీకటి, అంతా అంధకారం.

మెరుపులా ఆలోచన తట్టింది. బొడ్లోంచి జంబియా లాగి చంగున ఎగిరాడు. చేయిచాచి ఒంటి కాలిమీది గిర్రున తిరిగాడు. కొందరి ముక్కులూ, కొందరి బుజాలూ, కొందరి నొసళ్ళూ గీరుకుపోయాయి. రక్తం బొటబొట కారింది. అంతా దూరం జరిగారు. వలయం వెడల్పు అయింది.

"ఆగే మత్ బడో చాఖూ మారుఁగా. నాకు ప్రాణం మీద ఆశ లేదు. నలుగుర్ని చంపి చస్తా. ముందుకు అడుగు వేయకండి, పొడిచేస్తా" అని రొప్పుతూ కత్తి పట్టుకొని నలువైపులా తిప్పుతున్నాడు.

పరమయ్య లాఠీ చేతిమీద పడింది. జంబియా పడిపోయింది. "యా అల్లా" అని పడిపోయాడు హుసేన్.

హుసేన్నూ, రామమనోహర్‌సింగ్‌నూ పట్టుకెళ్ళారు గుడిసెల దగ్గరికి.

ఇద్దరూ తలలు వంచుకున్నారు. ఒక్కడూ మాట్లాడలేదు. పరమయ్య ఒక్కపోటు పొడిచాడు. విలవిల తన్నుకున్నాడు మహమ్మద్ హుసేన్. పిచ్చయ్య

ఒక్కగుద్దు గుద్దాడు. బోర్లా పడిపోయాడు సింగ్. గూడెపువాళ్ళు వీళ్ళ ప్రాణాలు తీస్తారని గ్రహించాడు రామారావు. అవును, వారి గుండెలు మండుతున్నాయి. వారి కొంపలను పొట్టన పెట్టుకున్నారు. కోపంతో కాలిపోతున్నారు. వద్దనడం తన వశం కాదనుకున్నాడు. "పోలీసుస్టేషనుకు తీసికెళ్దాం పదండి. అక్కడ వీరి పని పట్టించాలి" అన్నాడు. వాళ్ళను తీసుకొని పోలీసుస్టేషనుకు వెళుతుంటే ఫైర్ బ్రిగేడ్ గంటలు వినిపించాయి. అప్పటికి గూడెం కాలి కూలిపోయింది.

స్టేషన్‌లో జోసెఫ్ లేడు. అతనిని కమీష్నర్ పిలిస్తే వెళ్ళాడు. అక్కడ విజిలెన్స్ డిపార్టుమెంటుతో చర్చలు జరుపుతున్నాడు. జరిగిందేమంటే – సూరి దొంగబంగారం సహితంగా కలకత్తాలో పట్టుబడ్డాడు. దాంతో బొంబాయిలో స్మగ్లింగ్ రాకెట్ భగ్నం అయింది. బొంబాయిలో మొత్తం మందిని చుట్టేశారు. వారు చెప్పిన అచూకీ ప్రకారం హైదాబాదు వచ్చారు విజిలెన్స్‌వారు. వారి రేపటి కార్యక్రమాన్ని గురించి చర్చించుకుంటూ వుండగా టెలిఫోను వచ్చింది పోలీసు స్టేషన్‌నుంచి.

శలవు తీసుకొని బయలుదేరాడు జోసెఫ్. అతడు స్టేషనుకు చేరుకునేవరకు ఇక్బాల్, మహబూబ్ కిషన్‌కూడా చేరుకున్నారు. పోలీసుస్టేషను ఆవరణ జనమయంగా ఉంది. జోసెఫ్ వకీలునూ, డాక్టరునూ, రామారావునూ సంప్రదించాడు. గూండాల విషయంలో చర్య తీసుకోవడం జరుగుతుందని హామీ ఇచ్చాడు జోసెఫ్. వారు ముగ్గురూ బయటికి వచ్చి జనాన్ని సమాధానపరిచి పంపించేశారు. వారూ వెళ్ళిపోయారు. తెల్లవాగి సాయంకాలం వరకు గూడెం మళ్ళీ యధాతథంగా తయారు కావాలన్నాడు ఇక్బాల్. తాను అందుకు పూర్తి సహాయం చేస్తానన్నాడు. మహబూబ్ కిషన్‌కూడా అందుకు సమ్మతించాడు. సాయంకాలం అంతా గూడెంలో సమావేశం కావాలని నిర్ణయం అయింది.

జోసెఫ్ దాదా లిద్దరినీ పిలిపించాడు. అట్టే కష్టం లేకుండానే ఉస్మాన్ రహస్యాలన్నీ బయటపెట్టారు వారు.

ఇంకా తెల్లవారకుండానే పోలీసు లారీలు ఉస్మాన్ ఇంటిముందు ఆగేయి. క్షణంలో పోలీసులంతా దిగారు. గేటులో ప్రవేశించాడు జోసెఫ్. అతన్ని వెంబడించారు పోలీసులు. గూర్ఖావాడు పరిగెత్త ప్రయత్నించాడు. వాణ్ణి పట్టుకొని, అక్కడ నలుగురు పోలీసుల నుంచాడు. ముందుకు సాగాడు జోసెఫ్. ఇంటిని చుట్టేయవలసిందని సంజ్ఞ చేశాడు. పది, పదిహేనుమంది పోలీసులు మాత్రం అతని వెంట ఉన్నారు. గుమ్మం దగ్గరికి వెళ్ళి బెల్లు నొక్కాడు. ఒక వ్యక్తి వచ్చి తలుపు తీశాడు. పోలీసులను చూచి నిర్విణ్ణుడైనాడు. ఉరకడానికి ప్రయత్నించాడు. ఒక చేత్తో చేయి పట్టుకొని, మరొక చేత్తో నోరుమూసి బయటికి లాక్కొని వచ్చాడు జోసెఫ్. ఇద్దరు పోలీసులకు అప్పగించి, లారీలో కూర్చుండ పెట్టవలసిందని ఆజ్ఞాపించాడు. తాను పోలీసులను తీసుకొని నేరుగా ఉస్మాన్ గదిలోకి వెళ్ళాడు. బూట్ల చప్పుడు విని ఉస్మాన్ ఉలిక్కిపడి లేచాడు.

ఉస్మాన్‌కు యమ దూతలు కనిపించారు. లిప్తపాటు గుండె ఆగిపోయింది. మరో లిప్తలో దిండు కిందికి చేయి పోనిచ్చాడు.

"మిస్టర్ ఉస్మాన్!" గర్జించాడు జోసెఫ్. "చెయ్యి అలానే ఉండనివ్వు. కదిలించావో, గుండు గుండెలోంచి దూసుకుపోతుంది." పిస్తోలు గురిపెట్టి కేకవేశాడు.

గది ప్రతిధ్వనించింది. ఉస్మాన్ ఉలిక్కిపడ్డాడు. అతని చేయి కదల్లేదు. జోసెఫ్ ముందుకు ఉరికి చేయి పట్టేశాడు. పోలీసులు వచ్చి ఉస్మాన్ను పట్టేశారు. దిండు కింద పిస్తోలు ఉంది. లాగేశాడు జోసెఫ్. కళా విహీనం అయిపోయింది ఉస్మాన్ ముఖం.

"మిస్టర్ ఉస్మాన్! వాటీజ్ దిస్? మేము డ్యూటీ చేయడానికి వచ్చాం. మీ ఇల్లు సోదా చేస్తాం. ముందు ఈ అలమరా తాళాలు ఇవ్వండి. ఎదిరించి లాభంలేదు. ఇంటిచుట్టూ పోలీసులు ఉన్నారు. ఇచ్చెయ్యండి" అని చేయి చాచాడు జోసెఫ్.

"నాన్సెన్స్. మీకేం అధికారం ఉంది నా ఇల్లు సోదా చేయడానికి? నేనేం దొంగనా? ఖూనీ కోరునా? ఇవ్వను తాళం చెవులు" అనేశాడు ఉస్మాన్. ముఖం ఎర్రవారింది.

"మిస్టర్ ఉస్మాన్! మీరు దొంగలనీ కానీ, హంతకులనీ కానీ నేననలేదు. సస్పిషన్ మీద వచ్చాం. మెజిస్ట్రేటు దగ్గర్నుంచి ఆర్డర్సు తెచ్చాం. నేరం లేకుంటే మీకు మాత్రం భయం ఎందుకు? మేము అధికారం లేకుండా వస్తే తరవాత కేసు పెట్టవచ్చు. తాళాలివ్వండి. అనవసరంగా అలమరా బద్దలు కొట్టాల్సి వస్తుంది. ఊఁ – ఇచ్చెయ్యండి."

"ఈ బొందిలో ప్రాణం ఉండగా ఇవ్వను. చూస్తా ఏం చేస్తారో. తోళ్ళు ఒలిపిస్తా ఒక్కొక్కరినీ."

"అనవసరంగా ఉద్రేకపడుతున్నారు. వెదకండి తాళాల కోసం." ఆజ్ఞాపించాడు జోసెఫ్.

పోలీసులు గది అంతా గాలించారు. దొరకలేదు. జేబులో వెతకడానికి ముందుకు సాగాడు జోసెఫ్. విఫల ప్రయత్నం చేశాడు ఉస్మాన్. జేబులోంచి తాళం చెవి తీశాడు జోసెఫ్.

అలమరా తెరవడానికి ముందడుగు వేశాడు జోసెఫ్ మురుగన్. పిచ్చి కేకలు పెట్టాడు, తిట్టాడు, తన్నడానికి ప్రయత్నించాడు ఉస్మాన్. గట్టిగా పట్టేశారు పోలీసులు. ఎన్ని కేకలు వేసినా ఒక్కడు రాలేదు గది దగ్గరికి. ఇంట్లో ఎక్కడున్న వారు అక్కడ ఉండేట్లూ, ఒక్క వస్తువుగాని, మనిషిగాని కదలకుండేట్లూ కట్టుదిట్టాలు చేశాడు జోసెఫ్.

జోసెఫ్ అలమరా తలుపులు తెరిచాడు. మూడు అరల్నిండా నోట్లున్నాయి. మరొక మూడు అరల్లో బంగారపు ఇటికలు మెరుస్తున్నాయి. నోట్లకట్టలు ఒక్కొక్కటే తీసిచూశాడు జోసెఫ్. అన్నీ దొంగనోట్లే!!!

అక్కణ్ణుంచి ఒక్కొక్క గది సోదా చేయడానికి బయలుదేరాడు. ఒక గదినిండా విదేశీ సారాయి సీసాలున్నాయి. కొన్ని కాగితాలూ, కొన్ని పుస్తకాలూ ఉన్నాయి.

మరొక గదికి వెళ్ళాడు. ట్రాన్సిస్టర్లు, రేడియోలూ, గడియారాలూ కనిపించాయి.

అక్కణ్ణుంచి మిగతా గదులన్నీ వెదికి, ఒక గదిలోకి ప్రవేశించాడు. గదంతా తిరిగి చూచాడు. నడిచేప్పుడు ఒక భాగం బోలుగా ఉన్నట్లు ధ్వని వినిపించింది. తివాచీ

తీసి చూశాడు. ఒక తలుపు ఉంది. తలుపు తీశాడు, మెట్లున్నాయి లోపలికి! మెట్లు దిగాడు, చీకటిగా ఉంది. టార్చి వెలిగించాడు, విచిత్రం - ట్రాన్స్‌మీటర్ ఉంది!! ఏదో కొన్ని కాగితాలు పడి ఉన్నాయి చిందర వందరగా.

మళ్ళీ పైకి వచ్చేశాడు. ఉస్మాన్ దగ్గరికి వెళ్ళాడు. "మిస్టర్ ఉస్మాన్! ఇక నిన్ను మిస్టర్ అనాల్సిన పని లేదు. దేశభక్తుణ్ణనే ముసుగులో నువ్వేమేమి చేస్తున్నావో బట్టబయలై పోయింది. నీవు దేశ ద్రోహివి అని తేలిపోయింది. అందుకు నీ ఇల్లే సాక్ష్యం. పట్నంలో ఉన్న గుడుంబా బట్టీలన్నీ నీ అండనే నడుస్తున్నాయి. సిగ్గు లేదు? ఒక వేశ్యా గృహం నడిపిస్తున్నావు. రజనిని హత్య చేయడానికి ప్రయత్నించి, ఆ నేరం నళిని మీద తోశావు. నీకే మాత్రం సంబంధం లేని స్థలంలో ఉన్న గుడిసెల వాళ్ళను నానా యాతనలు పెట్టి, కొంపలు తగలపెట్టించావు. దొంగనోట్ల వ్యాపారం చేస్తున్నావు. అన్నింటినీ మించి ట్రాన్స్‌మీటరు పెట్టి, శత్రు దేశాలకు వార్త లందిస్తున్నావు. నీవు ద్రోహివి, హంతకుడవు, దుర్మార్గుడవు. నిన్ను అనడానికి సరిపోయే పదాలు నా దగ్గరలేవు. నీలాంటి చెదపురుగులు దేశాన్నీ, సంఘాన్ని నాశనం చేస్తున్నారు. ఇదిగో, నీకు బేడీలు వేస్తున్నాను. నిన్ను విచారించి శిక్ష విధించాల్సింది న్యాయస్థానం కాని, మనకున్న చట్టాలన్నింటిలోనూ నీకు విధించదగిన శిక్ష ఉందనుకోను" అని బేడీలు వేశాడు.

ఉస్మాన్ తలవంచుకొని అంతా విన్నాడు. పొంగివస్తున్న దుఃఖాన్ని, ఆగ్రహాన్ని దిగమ్రింగుతూ నుంచుండిపోయాడు.

మరొక అర్ధ గంటలో నగరంలో ఉన్న పోలీసులు అధికారులంతా ఉస్మాన్ ఇంటికి వచ్చేశారు. పోలీసు లారీలతోనూ కార్లతోనూ నిండిపోయింది రోడ్డు.

చేతి బేడీలతో ముఖం నేలకు వేసుకొని కుర్చీలో కూర్చున్నాడు ఉస్మాన్. వచ్చిన వాళ్ళంతా అతనికి పరిచితులే. నిన్నదాకా అతనిని ఆదరించినవారే; ఈ రోజు అతన్ని ఏహ్యపు చూపుల్తో చూస్తుంటే గుండెలో బల్లాలు గుచ్చుకున్నట్లు అవుతూంది. అమాంతంగా ప్రాణాలుపోతే బాగుండును అనిపిస్తూంది. మనోవేదన, యాతన, హింస భరించలేకపోతున్నాడు.

అగ్గిలా పాకిందీ వార్త పట్నం నిండా. వేలకొద్దీ జనం గుమికూడారు. వారిని అరికట్టడం పోలీసులకు సాధ్యం కాకుండా పోతూంది. కార్లు నిరంతరాయంగా వస్తున్నాయి, పోతున్నాయి.

అన్ని జాబితాలు వ్రాసి పంచనామా చేసేవరకు సాయంకాలం అయింది. అభినందలనతోనే కడుపు నింపుకున్నాడు జోసెఫ్.

☆ ☆ ☆

ఉస్మాన్ ఇంటి ముట్టడి విషయం చెప్పడానికి ఆస్పత్రికి వెళ్ళాడు రామారావు. బాలయ్య విని ఎగిరి గంతేశాడు. ఇద్దరూ బయలుదేరారు, ఇక్బాల్‌తో చెప్పడానికి. ఆడవాళ్ళ వార్డుకు వెళ్ళేవరకు ఒక మంచం చుట్టూ జనం కూడి ఉన్నారు. ఇక్బాల్ చాలా బిజీగా ఉన్నాడు. వీరూ ఆ జనం వెనుక నుంచున్నారు.

"అయితే మీ ఇల్లెక్కడంటావు?" అడిగాడు లక్ష్మిని. లక్ష్మికి అప్పుడప్పుడే స్పృహ వస్తూంది.

ఆమె ఆస్పత్రి కప్పు చూచింది. చుట్టూ చూచింది. జనం ఉన్నారు. అందరినీ కలయచూచింది. డాక్టరు ప్రశ్నకు జవాబు చెప్పలేదు.

"ఇక్కడ ఉన్నవారిలో ఎవరైనా తెలుసా?"

ముందుకు వెళ్ళి తొంగి చూచాడు రామారావు. "లక్ష్మత్తా" అని కేక వేసినంత పని చేశాడు. ముందుకు దూసుకు పోయాడు. బాలయ్య అనుసరించాడు.

లక్ష్మి దిగ్గున లేచి కూర్చున్నది.

"రాముడు! బాలయ్యన్న" అన్నది. "ఆయనేడి?" అడిగింది.

డాక్టర్ సంజ్ఞ ప్రకారం బొంకారు – "వస్తున్నాడు" అన్నారు.

డెయిజీ, నళిని కనిపించారు. వారిని గుర్తించింది. జరిగిన కథంతా విన్నది. డెయిజీని కావలించుకుంది. "అక్కా! నిన్ను అపార్థం చేసుకున్నాను. నీవు నాకు ప్రాణదాతవు" అని కన్నీరు రాల్చింది.

డాక్టర్ ఇక్బాల్‌ను ఆమెకు పరిచయం చేశాడు రామారావు.

"అమ్మా లక్ష్మీ! నీవు దేవతవమ్మా! ఎంత క్లిష్ట పరిస్థితుల్లో అయినా నీవు నీ శీలాన్ని రక్షించుకున్నావు. గెలిచావు. నిన్ను అవమానించిన రాజారావు సర్వనాశనం అయి వెళ్లిపోయాడు. ఉస్మాన్, సూరి ఇద్దరూ అరెస్టయినారు. ఇంకా ఉస్మాన్ ఇల్లు సోదా జరుగుతూంది. అతనిది కుక్క చావు అవుతుంది" అన్నాడు డాక్టర్.

"అయితే, నేను ఉస్మాన్‌ను చూడాలి."

"ఈ పరిస్థితిలోనా!"

"నాకేమైంది? బాగున్నాను. పదండి వెళ్దాం" అని లేచి నుంచొని నడుం కట్టింది. నాలుగు అడుగులు వేసి కాస్త తూలింది! డాక్టర్ స్ట్రెచర్ తెప్పించాడు. లిఫ్టులో కిందకు దిగి, కారెక్కి వారంతా ఉస్మాన్ ఇంటికి వెళ్ళారు. జనం తండోపతండాలుగా ఉన్నారు. ఉస్మాన్ ముఖం చూడాలని వేగిరపడుతున్నారు జనం.

చేతులకు బేడీలు వేసి ఉస్మాన్ను బయటికి తెచ్చారు పోలీసులు. జనంలో ఉద్రేకం పొంగింది, కేకలు పెట్టారు. పాత చెప్పులు, టమాటాలు, కోడిగ్రుడ్లు విసిరారు ఉస్మాన్‌మీద. ముఖం నిండా కోడిగ్రుడ్లు సొన కారింది. టమాటాల గింజలూ, గుజ్జూ అంటుకున్నాయి. అక్కడక్కడా చెప్పులు తాకిన గుర్తులున్నాయి.

డెయిజీ టమాటా విసిరింది.

నళిని రాయి విసరబోయింది. లక్ష్మి చేయి పట్టుకొని రాయి తీసేస్తూ "జనానికి తగులుతుంది" అన్నది.

ఉస్మాన్ను లారీలో ఎక్కించారు. జనంలో కోలాహలం పెరిగింది. పోలీసు వలయాన్ని ఛేదించటానికి ప్రయత్నించారు.

లారీ కదిలింది.

లారీమీద రాళ్ళు పడ్డాయి.

లారీ సాగిపోయింది.

జనం చెదిరిపోయింది.

రోడ్డు రాళ్ళు, టమాటాలు, పాత చెప్పులతో నిండిపోయింది.

"గూడానికి వెళ్దాం" అన్నది లక్ష్మి.

"లేదు. ఆస్పత్రికి రావాలి" అన్నాడు ఇక్బాల్.

"రాను. ఇంక నేను ఉండాల్సింది. గూడెంలో" అని మంకుపట్టు పట్టింది.

అంతా గూడెం చేరారు. కారు దిగుతున్న లక్ష్మిని రిక్షా దిగుతున్న పోచయ్య చూచాడు.

"లచ్చీ!" అని కేకవేశాడు.

"బావా!" అని పరిగెత్తింది లక్ష్మి.

"లచ్చీ!" అని గట్టిగా కౌగలించుకున్నాడు పోచయ్య, జనం చూస్తున్నారనే విషయం సైతం గమనించకుండా.

పోచయ్య బుజాన్ని కన్నీటితో తడిపేసింది లక్ష్మి.

★ ★ ★

# తమసోమా జ్యోతిర్గమయ

"చరిత్ర" పాలకుల చేతి మైనపుముద్ద. ఆ మైనపు ముద్దతో పాలకులు తమ ఇష్టం వచ్చిన రూపాన్ని తయారుచేస్తారు. అదే చరిత్ర అని ప్రజలకు సంపూర్ణ విశ్వాసం కలిగిస్తారు. జనం - చరిత్రకారుల సహితంగా ఎంత భ్రమలో పడిపోతారంటే - వాస్తవ చరిత్ర చెప్పినా వారు నమ్మరు!

మానవ జాతి భూమండలం మీద అవతరించిన నాటినుంచీ ఇదే జరిగింది - జరుగుతున్నది - జరుగుతుంది. ఇది మానవునికి సంబంధించిన మూల సూత్రం. మతాలు - సిద్ధాంతాలు - రాజకీయాలు - వాదాలు - వివాదాలు ఈ సూత్రాన్ని మార్చలేకపోయాయి!

మానవుని మౌలిక తత్వం మారటం దుర్లభమే కాదు - అసంభవం!

భారతదేశానికి సంబంధించినంతవరకు ఒక మతం మరో మతాన్ని నిర్మూలించి, దాని నామరూపాలు లేకుండా చేసిన ఉదంతాలు లెక్కకు అందవు. ఆంధ్రదేశంలో జైన మతాన్ని - అందుకు సంబంధించిన సాహిత్యాన్ని - వారి దేవుళ్ళనూ నిర్మూలించి, వాస్తవంగా ఈ ప్రాంతంలో జైనమతం ఉండిందా అనే అనుమానం కలిగేట్లు చేసింది శైవం. చేసింది శైవం మాత్రం కాదు - శైవం ఆశ్రయించిన రాజరికం!

రాచరికం రాక్షసం. అది దేన్నయినా నిర్మూలించ గలదు! మానవుణ్ణే మసి చేసినా ఆశ్చర్య పడనక్కరలేదు!!

జైన మహాభారతాన్ని తగల పెట్టించి నన్నయ్యతో ఆంధ్ర మహాభారత రచన ప్రారంభింపచేశాడు రాజరాజనరేంద్రుడు!!!

ఇలాంటివి మానవజాతి చరిత్రలో కో కొల్లలు! క్రైస్తవానికి, ఇస్లాంకు పూర్వం ఉండిన వాటిని అవశేషాలు సహితం లేకుండా అంతమొందించారు.

క్రైస్తవాన్ని రాజకీయం చేసి మోసుకొని వచ్చిన ఆంగ్ల పాలకులు భారతదేశ చరిత్రను తమ అక్కరకు సృష్టిస్తే, బానిసలం అయిన మనం ఈనాటికీ దాన్నే నమ్ముతున్నాం. ఆర్యులు భారతదేశం మీద దండెత్తలేదు. అనార్య నాగరకతలు ఉండిన మాట నిజం. కాని, ఆంగ్లేయులు కల్పించినట్లు ఆ రెండు తెగల మధ్య "వర్గ ద్వేషం" ఉన్నట్లు కనిపించదు. అయినా ఎక్కువ మంది చారిత్రకులు - మేధావులు ఇంకా అంగ్రేజులు చెప్పిందే నిజమని మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నారు.

స్వాతంత్ర్యం అనేది వచ్చి యాభై ఏళ్లయింది. మన చరిత్ర రాసుకోలేక పోయాం!

ఈ దేశానికి స్వాతంత్ర్యం అహింసాయుత పోరాటం వల్లనే వచ్చిందా? సాయుధ విప్లవాలు స్వాతంత్ర్య సమరానికి తోడ్పడలేదా? లేనట్లే చరిత్ర రాసింది కాంగ్రెస్

సర్కారు! తామే స్వరాజ్యం తెచ్చాం – తమకే పాలించే హక్కు ఉందన్నారు కాంగ్రెసువారు!

ఒక రాష్ట్రంలో ప్రభుత్వానికి వచ్చిన ఒక పార్టీవారు కొన్ని నెలల్లోనే చరిత్రను తమకు అనుకూలంగా వ్రాయించుకున్నారు!

తెలంగాణాలో ప్రపంచ ప్రఖ్యాతం అయిన సాయుధ పోరాటం జరిగింది. పాలకులు దానిని చరిత్ర పుటలకు ఎక్కనీయలేదు. ఆ పోరాటానికి అక్షర రూపం ఇవ్వడానికే నేను "చిల్లరదేవుళ్లు" "మోదుగుపూలు" "మాయాజలతారు" "జనపదం" నవలలు వ్రాశాను. నా ఆత్మకథ "జీవనయానం" ప్రజల చరిత్రకు ప్రతిరూపమే.

ఇంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే – మానవజాతికి అమృత ప్రాయమైన సోషలిజాన్ని మింగిన రష్యా నరహంతకులు రష్యాలో సోషలిజానికి సంబంధించిన లెనిన్ విగ్రహాల సహితంగా తొలగించి, సోషలిజం నామరూపాలు లేకుండాచేసి – కనీసం అవశేషాలు మిగల్చలేదు!

ఇది నిన్న మొన్నటి కథ. మన కనుల ఎదుట జరిగిన కథ. మనం చూస్తుండగానే చెదిరిపోయిన కల!

విచిత్రం ఏమంటే – రష్యాను 'త్వమేవ శరణం మమ' అన్న ప్రపంచ వ్యాప్త కమ్యూనిస్టు పార్టీలు కన్నీటి బొట్టు సహితం రాల్చకపోవడం! 'పద్మపత్ర ఇనాంభసా' – తామరాకు మీది నీటి బొట్లు కావడం!! ప్రపంచ మేధావులు వ్యధ చెందినంతగా చెందక పోవడం!!!

మానవ జాతిని మరగా – పెట్టుబడి చేతి కీలు బొమ్మగా మార్చిన హీన చరిత్ర 17,18 శతాబ్దాల్లో ఇంగ్లండులో పుట్టిన పారిశ్రామిక విప్లవం అనే ముద్దుపేరు పెట్టిన పారిశ్రామిక నరమేధం!

పారిశ్రామిక రాక్షస నాగరికతను దాని పురిట్లోనే ఇంగ్లండులోని మేధావులు నిరసించారు – ధిక్కరించారు – వ్యతిరేకరించారు. వర్డ్స్వర్త్ – షెల్లీ – బైరన్ – గోల్డ్స్మిత్ కవితలు వ్రాయగా, డెఫో "రాబిన్సన్ క్రూసో" అనే అజరామరమగు నవలను సృష్టించారు. మరొక రచయిత డాన్‌క్విక్సాట్‌ను సృష్టించి, యాంత్రిక నాగరికతను అపహాస్యం పాలు చేశాడు.

షెల్లీ ఈ రాక్షస నాగరికతకు వ్యతిరేకంగా కోర్టులో కేసుపెట్టి, తానే వాదించాడనీ – అతని వాదన నిత్య సత్య సాహిత్యమనీ అంటారు. నాకు మాత్రం అది చదివే అదృష్టం కలగలేదు.

అదిగో, అలాంటి కటిక చీకట్లో కారల్‌మార్క్స్ అనే జర్మన్ మేధావి ఇంగ్లండులో తన జీవితాన్ని కొవ్వొత్తిగా వెలిగించి, 'శాస్త్రీయ సోషలిజం,' అనే వెలుగు బావుటాను – మానవజాతి కల్యాణం కోసం – శ్రామిక వర్గ శ్రేయస్సు కోసం – శ్రమించే వారి రాజ్యం కోసం – ఎగురవేశాడు. అది మేధావులకు అరుణోదయం – శ్రామికులకు ఎర్రజండా అయింది.

'అధికారం శ్రామికులది. ఆస్తి సమాజానిది' అనే నినాదం ప్రపంచంలో సకల దిశలందు ప్రతిధ్వనించింది. ఆ ధ్వనికి ప్రతిరూపమే లెనిన్ మహాశయుడు. అతడు

రష్యాలో 'జార్ ప్రభువు'లను కూలదోసి – మానవజాతి చరిత్రలో – తొలి సోషలిస్టు శ్రామిక ప్రభుత్వాన్ని స్థాపించి, సుత్తీ కొడవలి ఎర్ర జెండాను ఎగురవేశాడు.

1917లో రష్యాలో విజయవంతం అయిన శ్రామిక విప్లవం ప్రపంచ ప్రజలను – మేధావులను – నేతలను చైతన్య వంతులను చేసింది. ప్రపంచ ప్రజసాంతం సోషలిజం కోసం పరితపించింది – పోరాటాలు సాగించింది.

భారతదేశానికి సంబంధించినంత వరకు ఆ విప్లవ చైతన్యంతోనే భగత్‌సింగ్ ఉరికంబాన్ని అలింగనం చేసికొన్నాడు. జవహర్‌లాల్ నెహ్రూ, రవీంద్రనాథ్ టాగూర్, శ్రీపాద అమృత్ డాంగే, ఎమ్.ఎన్. రాయ్ వంటి ఎందరో ఎంతో ఎంతో ప్రభావితులైనారు.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ అవిర్భవించి, స్వాతంత్ర్యం కోసం తన రీతిలో – పోరాటాలు జరిపింది.

నాలుగవ దశకంలో తెలంగాణంలో కమ్యూనిస్టులు ఆంధ్ర మహాసభలో చేరి నిజాం వ్యతిరేక ఉద్యమం నిర్వహించారు. నేనూ; మా అన్నయ్య దాశరధి కృష్ణమాచార్య ఆ ఉద్యమంలో సగర్వంగా పాల్గొన్నాం.

కౌమార దశలోనే నేను ఆ ఉద్యమంతో ఎంతో ఎంతో ప్రభావితుణ్ణి అయినాను. అనేక ఉద్యమాల్లో పాల్గొనడమే కాక ఎంతో సాహిత్యాన్ని అధ్యయనం చేశాను. 'అమ్మ', 'రక్తాక్షరాలు', 'ఇంద్రధనుస్సు', 'బీళ్లు దున్నేరు', 'జనగాం ప్రజల వీరోచిత పోరాటాలు', 'గదర్ వీరులు', 'ఇండియా టుడే' గ్రంధాలు నన్ను విప్లవంకోసం ప్రాణాలను తృణప్రాయంగా భావించేటట్లు చేశాయి. ఆ రోజుల్లో ఎర్రజండాను తప్ప మరొక దానిని సహించకుండా చేశాయి. అది తప్పే కావచ్చు కాని, విప్లవానికి అంత మూఢనమ్మకం అవసరమేమో!

కాలానికి కనికరం లేదు. అది దేని కోసమూ అగదు. తెలంగాణా వీరోచిత సాయుధ పోరాటం – హైదరాబాదు రాజ్యం మీద పోలీసు చర్య – సాయుధ పోరాట విరమణ – నేను భుక్తి కోసం ఉద్యోగంలో చేరడం – తెలంగాణా ప్రజా జీవితాన్ని "చిల్లర దేవుళ్లు" మున్నగు నవలల్లో చిత్రించడం లాంటివి గిరగరా దొర్లి పోయాయి.

1972 నాటికి మనకు స్వాతంత్ర్యం వచ్చి పాతిక సంవత్సరాలయింది. అప్పుడు జరిగిన ఉత్సవాలు ఇప్పుడు 50 సంవత్సరాలకు జరుగుతున్నంత చచ్చుగా, పుచ్చుగా లేవు.

ఇందిరాగాంధీ ప్రధానిగా ఉంది. ఆమె ఒక మహాశక్తిగా రూపుదాల్చింది. బ్యాంకులను జాతీయం చేయడం, రాజ భరణాల రద్దు వంటి ప్రగతిశీల చర్యలే కాక బంగ్లాదేశ్‌కు సైనిక సహాయంచేసి – పాకిస్తాన్ను చీల్చి ఇందిర ఒక అంతర్జాతీయ శక్తిగా వెల్లుబికింది.

స్వాతంత్ర్య ఫలితాలు సామాన్యులకు అందడం లేదు. వానిని సామాన్యులకు అందించాలి అనే నినాదంతో ఇందిర స్వాతంత్ర్య రజతోత్సవాలు నిర్వహించింది.

ఇందిర నినాదం – తుఫాను వంటి ఆమె చలనం నాకు స్ఫూర్తి నిచ్చాయి. నిరాశాంధకారంలో ఒక చిరు దివ్వె అయినాయి. మోడు వారిన ఆశలు

చిగురించాయి. భారత దేశంలో సామ్యవాద కాంతులు పరచుకుంటాయి అనిపించింది! అది అనిపించడమే!!

అదిగో, సరిగ్గా అప్పుడే 'విశాలాంధ్ర' దినపత్రిక వారు నన్ను ఒక నవల వ్రాసి ఇమ్మన్నారు. అది అవకాశంగా నేను కలలుగన్న భారతదేశాన్ని గురించి బొమ్మ గీయాలనుకున్నాను.

సృజన సామాన్యం కాదు. అదీ ఒక ఊహాచిత్రం గీయడం. ఎంతో ఆలోచన – మరింత తపస్సు – కొంత అక్షర సంగ్రామం తరువాత "రానున్నది ఏది నిజం?" రంగులకల సిద్ధం అయింది. నా నవల పేరు మహాకవి దాశరథి గేయంలోనిది. ఇదిగో ఆ గేయం:–

*"రానున్నది ఏదినిజం?*
*అది ఒకటే సోషలిజం.*
*కలపండోయ్ భుజం భుజం*
*కదలండోయ్ గజం గజం*
*అడుగడుగున ఎడద నెత్రు*
*మడుగులుగా విడవండోయ్*
*పడిపోయిన గుడిగోడలు*
*విడిచిపెట్టి నడవండోయ్*
*ఉదయాకాశ పతాకం*
*యెదలో కదలాడె నేడు*
*హృదయావేశ తటాకం*
*నదిలా పొరలాడె నేడు"*

"రానున్నది ఏది నిజం?" విశాలాంధ్ర దినపత్రికలో 1973లో వారం వారం సీరియల్‌గా వచ్చింది. రెండోవారం నుంచే పాఠకుల ఆసక్తి, స్పందన కనిపించాయి. "చిత్రం బాగుంది, ఎలా ముగిస్తావు?" అని చాలమంది మిత్రులు ఆతురతగా అడిగారు. నవల ముగిసిం తరువాత కల్పనలోంచి వాస్తవంలోకి రావడాన్ని నాటకం ముగియడంగా పేర్కొన్నారు! మెచ్చుకున్నారు.

విచిత్రం ఏమంటే – నేను సోషలిజాన్ని కలగా చిత్రించగా అనంతర కాలంలో సోషలిజం వాస్తవంగా కలగానే మిగిలి పోవడం! ఇది యాదృచ్ఛికం మాత్రమే! ఒక ఊహకు కళారూపం ఇవ్వడం కోసం మాత్రమే నేను దాన్ని కలగా చిత్రించాను. నా ఊహాచిత్రంలో వలెనే సోషలిజానికి బెదిరినవారే సోషలిజాన్ని అంతం చేశారు!

"రానున్నది ఏది నిజం?" వెలువడిన ఇరవైనాలుగు సంవత్సరాల తరువాత ప్రపంచ మానవాళి భవితవ్యం అంధకార కుహరమై, అగ్రరాజ్యపు గుప్పిటలో విలవిలలాడుతున్నది!! దశాబ్దాల పోరాటాల తరువాత సాధించుకున్న స్వాతంత్ర్యాలు ఆర్థిక బానిసత్వానికి అమ్ముడు పోయాయి. రాజకీయ స్వాతంత్ర్యం నేతిబీర – పెరుగుతోట అయింది.

భారతదేశం ఇందుకు మినహాయింపుకాదు. ధనస్వామ్యపు ఉత్పత్తి విధానం ప్రజలను మురిపిస్తుంది. మెరుపులు చూపుతుంది. కాని, అది ప్రజలను జీవంలేని

వినియోగదారులను - ప్రాణం లేని మరలను చేస్తుంది. ఈ విషయం జనాన్ని గుర్తించనీయదు. వారిని దివాళా తీయిస్తుంది.

ధనస్వామ్యంలో ఉత్పత్తి డిమాండు ననుసరించి జరుగదు. ఉత్పత్తి డిమాండును పెంచుకోవాలి. ఎప్పుడూ అది సాధ్యపడదు. అప్పుడు ఆర్థికమాంద్యం ఏర్పడుతుంది. ఈనాడు ఆసియా దేశాలు - జపాను సహితంగా - ఆర్థిక మాంద్యపు కౌగిలిలో గిజగిజ లాడుతున్నాయి!

విద్య, వైద్యం వ్యాపారంగా మారిన సమాజం వర్థిల్లదు. ఆ రెంటిలో సేవాభావం కావాలి. అది ధనస్వామ్యంలో సాధ్యపడదు.

ధనస్వామ్యపు పేక మేడ - ఫైనాన్స్ కంపెనీల వలె కూలక మానదు. ఇది సత్యం. ఇది తథ్యం. సమయం పట్టవచ్చు. కాని, ఇది తప్పదు. అప్పుడు -

*రానున్నది ఏది నిజం?*
*అది ఒకటే సోషలిజం!*

సికింద్రాబాదు. — దాశరథి రంగాచార్య
23.12.97

# మామాట

ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్య మీకు అందించు ద్వితీయ కానుక "రానున్నది ఏది నిజం?" నవల. తెలుగు సాహితీ లోకానికి సమర్పించుకోగలుగుతున్నందుకు సంతసిస్తున్నాము.

పాఠకులకు కేవలం ఉద్రేకపరచే కాలక్షేప గ్రంథాలు విరివిగా వెలువడుతున్న ఈ రోజుల్లో సాహిత్యానికిగల విశ్వజనీనమైన ప్రయోజనం విస్మరించబడుతూంది. ఆ ప్రయోజన పరిపుష్టికోసం మంచి పుస్తకాలను అధ్యయన పరిధిలోకి తీసుకురావడం యువజన సమాఖ్య తన లక్ష్యంగా పెట్టుకొన్నది.

యువజన సమాఖ్య కేవలం పుస్తక ప్రచురణ సంస్థకాదు. శాస్త్రీయ సోషలిజం తన ధ్యేయంగా పెట్టుకొని యువజన విద్యార్థులను సమీకరించి, వివిధ సమస్యలపై ఉద్యమాలను నిర్వహిస్తూ, సాంస్కృతిక, సాహిత్య విషయాలపై ఆసక్తిగల యువజనులతో చక్కని రచనారీతులను, నాటక, కళారీతులను అనుసరింపజేసి, వారిలోని సృజనాత్మక శక్తిని నిర్మాణ కార్యక్రమాలవైపునకు మళ్ళించడానికి కొన్ని సంవత్సరాలుగా కృషిచేస్తున్నది.

గ్రంథ ప్రచురణను చేపట్టడానికి యువజన సమాఖ్య ధనాఢ్యమైనదికాదు. యువజనుల ఉత్సాహ ప్రోత్సాహాలే సమాఖ్య నిధి నిక్షేపాలు. ఒక్కమాటలో చెప్పాలంటే – మంచి గ్రంథాలను చౌకగా అందించడం, యువ రచయితలను వెలుగులోకి తీసుకురావడం, యువ కళాకారులకు సహకరించి ప్రజా నాట్యమండలిని తిరిగి పూర్వస్థాయికి తీసుకురావడం యువజన సమాఖ్య ఆశయం.

1973 మే లో ప్రథమంగా అందరి ఆదరాభిమానాలను అందుకున్న "ఎర్రజండా" పాటల సంకలనాన్ని ప్రచురించి, ఆ పాటల ద్వారా యువతను వెన్నుతట్టి లేవగొట్టి, కొంతలో కొంత ప్రజాసమస్యలపై విప్లవ కార్యాచరణకు సంసిద్ధం చేశాము.

యువజనుల కోరికపై శ్రీ దాశరధి రంగాచార్య వ్రాసిన ఈ "రానున్నది ఏదినిజం?" నవల యువతలో ఒక నూతనోత్తేజాన్ని, స్ఫూర్తిని కలుగజేస్తుంది.

దేశంలోని పెట్టుబడిదారీ వ్యవస్థను భూస్థాపితం చేయడానికి కార్మికులు, కర్షకులు, యువజనులు, విద్యార్థులు, మహిళలు సమష్టిగా నిర్వహించే సమరశీల పోరాటాల హోరులోంచి "అది ఒకటే సోషలిజం" అనే సంకేతం తప్పనిసరిగా వినబడుతోంది. వ్యక్తిని మరొకవ్యక్తి దోచుకొనని సోషలిస్టు వ్యవస్థ ఏర్పడుతుంది.

ఈ "రానున్నది ఏదినిజం?" నవలను యువజన సమాఖ్య తరఫున ప్రచురించుకోడానికి అవకాశమిచ్చిన శ్రీ దాశరధి రంగాచార్యగారికి, అడగ్గానే ముఖ చిత్రం వేసియిచ్చిన శ్రీ చంద్రగారికి, అందంగా ముద్రించి యిచ్చిన స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ఈ ప్రయత్నములో మాకు సూచనలు, సలహాలు, సహకారము అందించిన అనేకులకు మా కృతజ్ఞతలు.

ఎ. పుల్లారెడ్డి

తేది: 4–8–1973 కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్య.

అంకితం

సమ సమాజ నిర్మాణానికి

సమరం జరిపే శూరులకు

# రానున్నది ఏది నిజం?

"వచ్చింది స్వాతంత్ర్యం మనకు. మనకు స్వాతంత్ర్యం వచ్చింది. స్వాతంత్ర్యం మనకు వచ్చి పాతికేళ్ళు అయింది. ఇరవై అయిదేళ్లు నిండాయి. ఏళ్ళు ఇరవై అయిదు నిండిన సందర్భంగా రజతోత్సవం చేసుకుంటున్నాం. రజతోత్సవం అంటే వెండిపండగ. వెండి పండగ అంటే మనం వెండిదశకు చేరుకున్నా మన్న మాట. స్వాతంత్ర్య రజతోత్సవం జరుపుకోవడం మన అదృష్టం. మనకు 1947లో స్వాతంత్ర్యం వచ్చింది. ఆ విషయం మీకందరికీ తెలుసు. అప్పటినుండీ మనదేశంలో ప్రజాస్వామ్యం వుంది. ప్రజాస్వామ్యం అంటే మాటలుకాదు. అదొక వ్యవస్థ. అదొక విశ్వాసం. రాజ్యం ప్రజలనుండి ఏర్పడుతుంది. ప్రజలే పాలిస్తారు. ప్రజలకోసమే పాలన సాగుతుంది. అలాంటి వ్యవస్థ వుంది ఈ దేశంలో పాతిక సంవత్సరాలుగా. ప్రజాస్వామ్యంలో అందరూ సమానులే, అందరికీ ఓటుంది, ఓటువేసే హక్కుంది. ఈ హక్కు అమూల్యం అయింది. దీనికోసం మనం నిరంతరం పోరాడాం, పోరాడి సాధించాం. అరవై ఏళ్ళ పోరాటం తరువాత లభించిందా హక్కు. లభించిన హక్కును కాపాడుకోవడం గొప్ప. అనేక దుష్టశక్తులు మన ఈ హక్కుకు వ్యతిరేకంగా పనిచేస్తుంటాయి. అయినా, మనం ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుకున్నాం. దీన్ని పాతికేళ్లుగా కాపాడుకున్నాం. ఇది మామూలు విషయం కాదు. తరతరాలుగా వస్తున్న భారతీయ సంస్కృతి ఇందుకు తోడ్పడ్డది. గీత మనకు ప్రజాస్వామ్యాన్ని బోధించింది. అది మన రక్తంలో జీర్ణించింది. అందుకే మన దేశంలో ప్రజాస్వామ్యం పాతికేళ్ళు నిలువగలిగింది. చూస్తున్నాంగా పొరుగు దేశాల్ను! ఏ దేశమైనా చూడండి. అది ప్రజాస్వామ్యాన్ని నిలుపుకోలేకపోయింది. ఆ దేశాల్లో అసలు ప్రజాస్వామ్యం నెలకొననేలేదు. నెలకొన్నా, మూణ్ణాళ్ళ ముచ్చట అయింది. అక్కడి ప్రజలకు హక్కులు లేవు. లేకుండా చేశారు నియంతలు. ప్రభుత్వాలు నియంతల చేతుల్లో పడ్డాయి. నిరంతరం పదవుల కోసం పోట్లాటలు – యుద్ధాలు సాగేయి – సాగుతున్నాయి. సైన్యం తిరగబడి ప్రభుత్వాల్ను కూలదోస్తుంది. కొత్త ప్రభువులను ఏర్పరస్తాంది. ఈ ప్రభుత్వాల ఏర్పాటులో ప్రజలకు ఆసక్తిలేదు–ప్రసక్తిలేదు.

మధ్య యుగాలనాటి ప్రభుత్వాలే ఇంకా కొనసాగుతున్నాయి అక్కడ ఆ దేశాల్లో – మన దేశంలో అలాకాదు. ప్రజాస్వామ్యం స్థిరపడింది. ఇది ప్రపంచంలో కెల్ల పెద్ద ప్రజాస్వామిక దేశం! ఇంత పెద్ద దేశంలో మనం యింత కాలంగా ప్రజాస్వామ్యం నిలుపుకున్నాం. ఇదొక గొప్ప విషయం, మహత్తర విషయం. ఇలా జరుగుతుందని ప్రపంచంలో ఏ దేశమూ అనుకోలేదు. అది జరిగింది. మనం ప్రజాస్వామ్యాన్ని స్థిరపరచి చూపించాం. ఇది మన దేశపు మహత్తు. మన ప్రజల మహత్తు. మన నాయకుల మహత్తు."

సభలో చప్పట్లు.

అది సభ. మహాసభ. మహాసభ అంటే ప్రజాసభ కాదు. మహామహుల సభ. మహాసభలో మహామహులే ఉన్నారు. మహామహుల మహాసభకు తగిన మహా మహా భవనం అది. ఆ భవనాన్ని వర్ణించడానికి పదాలు చాలవు. అందుకు వాక్పతి దిగిరావాలి – అతను వుంటే. ప్రస్తుతానికి అతడు లేడు. కాబట్టి వర్ణన అసాధ్యం. కాని మయసభను గురించి ఎవరైనా చదివివుంటే, ఈ భవనాన్ని చూస్తే అది కొంచెం అనిపించవచ్చు. భవనంలో జరుగుతున్న సభ అలాంటిది. సభకు విచ్చేసిన మహాశయులు అలాంటి వారు. అందుకని భవనం అలా ఉంది. భవనంలో కూర్చున్న పెద్దలకు అసౌకర్యం కలిగించనట్లుగా ఉన్నాయి ఆసనాలు. మెత్తగా – పాములా – నాగసర్పంలా మెత్తదనంతో పాటు పరిమళమూ వ్యాపించి ఉంది. పరిమళం సరే, అక్కడ వెలుగు సైతం మెత్త మెత్తగా ఉంది. అది బయటి వెలుగుకాదు, దిగ్బంధనం జరిగింది. బయటి వెలుగురాదు. దిగ్బంధనం ఎందుకు జరిగిందంటారేమో – వాయుబంధనానికి. వాయుబంధనంలేకుండా కూర్చోలేరు పెద్దలు. బయట అగ్గి కురుస్తూంది. లోన మంచులా ఉంది. చల్లగా ఉంది. శీతలీకరణం అంతటితో ఆగలేదు. శబ్ద బంధం జరిగింది. అవతలి శబ్దం ఇందులోకి రాదు. ఇందులోని శబ్దం మెత్తగా వినిపించే ఏర్పాటుంది. అనేక బంధనాలు జరిగాయి ఈ భవనానికి. అన్ని బంధాలమధ్య జరుగుతూంది సభ.

సభ గొప్పది!

బంధనాలూ గొప్పవే!

“మనకు స్వాతంత్ర్యం వచ్చింది, వచ్చి పాతికేళ్ళు అయింది, ఆ సందర్భంలో మనం రజతోత్సవం జరుపుకుంటున్నాం. ఈ పాతిక సంవత్సరాల్లో మనం చాల అభివృద్ధి చెందాం. ఒకసారి పాతిక సంవత్సరాల క్రితపు పరిస్థితిని అవలోకించండి. పెద్దలు వున్నారిక్కడ – వారికి తెలుసు, ఆంగ్లేయులు మనను ఎలా దోచుకున్నారో! మన దేశంలో పరిశ్రమలు లేకుండా చేశారు. మన దేశం నుంచి ముడిసరుకు తీసుకువెళ్ళారు. వాళ్ళ దేశపు కర్మాగారాల్లో వస్తువులు తయారు చేయించారు. వారి కార్మికులకు పని కల్పించుకున్నారు. వాటిని మళ్ళీ మనకే అమ్మారు. అమ్మి, తమ పెట్టుబడిదారులకు లాభాలు సంపాదించి పెట్టారు. మన దేశంలో పరిశ్రమలు ఎదగనీయలేదు. అయినా, దేశభక్తులైన మన పారిశ్రామికులు స్వదేశ పరిశ్రమలు స్థాపించారు. కాని, అవి చాల కొద్ది. 1947 లో స్వాతంత్ర్యం వచ్చేవరకు సూదులవంటి పదార్థాలనుంచి మనం పరాయి దేశాలమీదనే ఆధారపడ్డాం. స్వాతంత్ర్యం రావటంతో స్వదేశ పెట్టుబడికి ప్రాధాన్యతను ఇచ్చింది ప్రభుత్వం. ప్రయివేటు రంగంకాక ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలు స్థాపించబడ్డాయి. మీరే చూస్తున్నారు. సూదులు దిగుమతి చేసుకొన్న దేశం ట్రాక్టర్లు, విమానాలు – మహా యంత్రాలు సిద్ధం చేస్తూంది. అంతేకాదు, ఎగుమతి చేస్తూంది. ఇది ఎంతో గొప్ప విషయం, వ్యవసాయరంగంలో మనం ఎంతో ముందడుగు వేశాం, ఒక గ్రీన్ రివల్యూషనూ, ఒక వైట్ రివల్యూషనూ తెచ్చాం. వీటికి పేర్లు పెట్టాం. కాబట్టి విప్లవాలని తెలుస్తూంది. మనం ఒక విద్యుద్విప్లవాన్ని తెచ్చాం. కిరసనాయిలు వీధి దీపం సైతం తెలియని గ్రామాలకు విద్యుత్తు సరఫరా చేస్తున్నాం. మన

గ్రామాలు ఇప్పుడు పూర్తిగా మారిపోయాయి. అక్కడా నాగరికత విలసిల్లుతూంది. విద్యుద్దీపాలు, ఆసుపత్రులు, పాఠశాలలు వెలిశాయిక్కడ. రైతులు ఆధునికమైన వ్యవసాయం చేస్తున్నారు. వారికోసం పెద్ద పెద్ద ఆనకట్టలు నిర్మించబడినాయి. రైతులు కొయ్యనాగళ్ళు కాదు – ట్రాక్టర్లు వాడుతున్నారు. వారు కరెంటు పంపులు వాడుతున్నారు. రసాయనికపు ఎరువులు వాడుతున్నారు, గిడ్డంగులు కట్టుకుంటున్నారు. ధాన్యం నిలువచేసుకుంటున్నారు. మనం ఆహారధాన్యాల్లో స్వయం సమృద్ధి సాధించాం. మీరే ఆలోచించండి. పత్రిక ముఖం సహితం చూడని పల్లెల్లో ఈనాడు రేడియోలు మోగుతున్నాయి. ఇది సామాన్యమైన విషయం కాదు. ఇది సామాన్యమైన ప్రగతి కాదు. కొన్ని దేశాల్లో ఒక విప్లవం రావడమే గగనం అయింది. మనం మన దేశంలో శాంతియుతంగా అనేక విప్లవాలు తెచ్చాం. ఇది మనకు గర్వకారణం."

సభలో కరతాళధ్వనులు చెలరేగెను.

అవియును మెత్తగానే నుండెను.

సభాభవనం, వేదిక, వేదికకుముందున్న సీట్లు, సీట్లలో కూర్చున్న పెద్దలు, అధికారంలో పెద్దలు, అంతస్తులో పెద్దలు, సమాజంలో పెద్దలు, బ్యాంకుల్లో పెద్దలు దేహంలో పెద్దలు, పెద్దలంతా వేదికకు ముందు ఆసీనులయినారు. వారివి తొలి ఆసనాలు, ఆ తరువాతనే అందరు. పెద్దలు తెల్లని దుస్తుల్లో ఉన్నారు. అందరు ఖద్దరు ధరించే ఉన్నారు. అందరి తలలమీదా టోపీలున్నాయి. గాంధీ టోపీలు, ఎవరో వారికి పెట్టినవికావు. వారు స్వయంగా పెట్టుకున్నవి. ఇతరులకు టోపీలు పెట్టడానికి ఆ టోపీలు అవసరం. ఆ కీర్తి గాంధీ టోపీలకు వచ్చేసింది. గాంధీని చంపి టోపీలను బతికించుకున్నారు జనం, కాదు – పెద్దలు. అలాంటి పెద్దల్లో ఒక మంత్రిగారున్నారు. ఆయన ఆ సీట్లలోని ఒక దాంట్లో కూర్చున్నారు. కాని, ఆయనకు అంత సౌకర్యంగా లేదు. ఎందుచేతంటారా, ఆ సీటు వారికి సరిపోవడంలేదు ఇరుగ్గా కూర్చున్నారు. చిరాకు పడుతున్నారు. అటు పక్కకూ ఇటు పక్కకూ సర్దుకుంటున్నారు. కాళ్ళు చాచుకొని కూర్చోడానికి ప్రయత్నిస్తున్నారు, వారికి ప్రత్యేకాసనం కల్పించాల్సింది – కల్పించలేదు. అయినా, కూర్చున్నారు వారు. వారి దేశభక్తి అంతటిది! అందుకే కూర్చున్నారు. ఉపన్యాసాలు బాగనిపిస్తున్నాయి వారికి, అలా ఉపన్యాసాల్లో మునిగిపోయారు. ఈ దేశం ఇలా అభివృద్ధి చెందడానికి వారే కారణం అనుకున్నారు, అలా అనుకోవడంతో వళ్లు మరి కొంత పెరిగింది. సీటు మరీ ఇరుకు అయింది. దాంతో బాధ మరింత ఎక్కువయింది. మంత్రి పదవికోసం ఆ మాత్రం మూల్యం చెల్లించాల్సిందే. అంతకంటే వారు చేసిందీ లేదు. అయినా ఉపన్యాసం జాగ్రత్తగా వింటున్నారు. చాలు! మరి మహామంత్రి కావాలని ఉంది!!

"స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్ళయింది. పాతికేళ్ళూ అయిందని జనానికి ఎలుగెత్తి చాటి చెప్పాల్సిన దుస్థితి వచ్చింది. ఈ వచ్చిన స్వాతంత్ర్యం విషయంలో జనానికి ఎంత శ్రద్ధవుందో మనం చేస్తున్న ఉత్సవాలనుబట్టి, మనం పెడ్తున్న ఖర్చును బట్టి, వాటికి వస్తున్న జనాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. పాతతరం ప్రజలు మన

రాజ్యంకంటే ఆంగ్లేయుల రాజ్యమే బాగుందనుకునేటట్లు పాలించాం. తెల్ల దొరలు పోయి నల్ల దొరలు వచ్చారనుకుంటున్నారు జనం. మనుషులు మారారేగాని పద్ధతుల్లో మార్పురాలేదు. ప్రజాస్వామ్యం స్థిరపడిందని గొప్పలు చెప్పుకుంటున్నాం. నిజమే. కాని, ఎన్నిక అవుతున్నవారు ఎవరు? ప్రజల్ని మోసగించగలవారు. మభ్యపెట్టగలవారు. డబ్బు పోసి ఓట్లు కొనగలవారు. ఇందుకోసం దొంగనోట్లు అచ్చువేసే పెద్దలు లేకపోలేదు. నోట్లను చూపి ఓట్లు కొన్న నాయకులకు ప్రజల పరిస్థితులు ఎలా తెలుస్తాయి? మంత్రులయిన మరుక్షణం నుంచీ తమ పదవుల్ని నిలుపుకోడం గురించి, తమ ఆస్తుల్ని పెంచుకోవడం గురించీ ఆలోచించే పెద్దలు జన సామాన్యాన్ని గురించి ఆలోచించారా? వాళ్ళ దృష్టిలో జనం అంటే, రాజులు, మహారాజులు, తాబేదారులు, భజనపరులు, కంట్రాక్టర్లు, బ్రోకర్లు, పెద్ద పెట్టుబడిదారులు. వారి సంక్షేమమే తమ సంక్షేమంగా భావించుకున్నారు. అందుకే మంత్రులు కాకముందు ఏమీలేవు వారికి. కోట్ల ఆస్తి వచ్చి చేరింది. వారిపేర్ల ఆస్తులున్నాయి – ఫ్యాక్టరీ లున్నాయి, భూములున్నాయి – వారి కొడుకులు కుబేరులైనారు. ఇదేనా ప్రజాస్వామ్యం? దీన్నేనా మనదేశం పరిరక్షించింది? కూటికి లేనివాడు కృంగి కృశించి నశిస్తున్నాడు. చేయాలంటే పని లభించదు. పనిలేక పస్తులుంటున్నా జనాభా పెరుగుతూంది. వారికి కడుపునిండా తిండిలేదు. వంటినిండా బట్టలేదు. ఉండడానికి నీడలేదు – రోగానికి వైద్యంలేదు, పసిపాపలకు పాలులేవు, వారి పిల్లలకు చదువుల్లేవు. వారిని మూర్ఖులుగా, మూఢులుగా ఉండమంటున్నాం. ఇదేనా ప్రజాస్వామ్యం? మరోవైపు వున్నవాడు కోట్లు ఆర్జిస్తున్నాడు. ఉత్పత్తి పెంచడం అనే పేరుతో ప్రభుత్వం అతన్ని ప్రోత్సహిస్తోంది. వాళ్ళు ప్రభుత్వం కళ్ళలో దుమ్ముకొట్టి సరుకులకు కల్పిత కరువులు కల్పిస్తున్నారు. దేశాన్నీ, ప్రజల్నూ, ప్రభుత్వాన్నీ కొల్లగొడ్తున్నారు. వీళ్ళకు సహాయంచేయడమేనా ప్రజాస్వామ్యం? ఈ వ్యత్యాసాలు పెంచడమేనా ప్రజాస్వామ్యం? అగాథాలు పెంచి, అంతరాలు సృష్టించి, అట్టడుగున వున్నవాణ్ణి అణచడమేనా ప్రజాస్వామ్యం?"

సభలో కరతాళధ్వనులు మోగలేదు.

ఒక గంభీరమైన నిశ్శబ్దం ఏర్పడ్డది.

మంత్రిగారు తమ సీట్లో కూర్చోలేక పోతున్నారు.

ఎక్కడో లోపం జరిగిందనుకున్నారు. కాకుంటే తమలోనే ఇలాంటివాళ్ళు ఎలా పుట్టుకొని వచ్చారు? పుట్టుకొని వచ్చారుపో, వారికి ఇలాంటి సభల్లో అవకాశం ఇవ్వడం ఎలా జరుగుతుంది? ఇలాంటివాళ్ళు ఉపన్యాసాలిస్తుంటే తాము ఇలా వింటూ కూర్చోవడమేనా? అనుకున్న మంత్రిగారు తమ రెండు పక్కలకూ చూశారు. అందరూ వింటూనే ఉన్నారు. కాని, అందరి ముఖాల్లోనూ ఏదో చిరాకు కనిపిస్తూనే వుంది. ఉపన్యాసం ఆపుచేయించడానికి పెద్దగా కేక వేద్దామనుకున్నారు. అది తన హుందాతనానికి లోపం అనుకున్నారు. ఎవరూ కేకలు వేయడంలేదు. విసుగనిపించింది. కుర్చీలోంచి జారాలనుకున్నారు. సాధ్యపడలేదు. కుర్చీలో ఇరుక్కుపోయి కూర్చున్నారు. వద్దన్నా వినిపిస్తూంది ఉపన్యాసం.

"ఈ పల్లెల ప్రగతిని గురించి మనం చాలా చెప్పుకున్నాం. పల్లెలకు కరెంటువస్తే లాభం ఎవరికైంది? పెద్ద భూస్వాములకు! చిన్నవారి నెత్తిన పన్నుతప్ప ప్రయోజనం

లేదు. పాఠశాలలూ, వైద్యశాలలూ వచ్చినమాట నిజమే – వాటిని వాడుకోగల స్తోమత ఉన్నవారెవరు? పాఠశాల అందరిదీ అంటే పస్తుండేవాడు తన పిల్లల్ని పంపగలడా? తనకు వైద్యం చేయించుకోగలడా? వాడికి కావలసినవి వైద్యం, పని, ఉద్యోగం. మనదేశంలో కోట్ల జనం పనిచేయడానికి సిద్ధంగా ఉన్నారు. వారికి అందుకు తగిన స్తోమత ఉంది. శక్తి ఉంది. వారికి పని ఇప్పించడం లేదు మనం. పాఠశాలలు పెడ్తున్నాం – వైద్యశాలలు నిర్మిస్తున్నాం. బలహీన వర్గాలు మరీ బలహీన పడుతున్నాయి. బలవంతవర్గాలు బలాన్ని పుంజుకుంటున్నాయి. ఈ పద్ధతి పోవాలి. బలహీన వర్గాలకు ప్రాతినిధ్యం రావాలి. వారు ప్రభుత్వానికి రావాలి. వారికి అవకాశాలు కల్పించాలి. వారికి తిండి, బట్ట ఇల్లు, చదువు, వైద్యం కల్పించాలి. బహుజనులు సుఖపడనిది స్వరాజ్యం కాదు. వారు సుఖపడకుంటే మనకు వచ్చింది స్వరాజ్యం కాదు."

మంత్రిగారికి గుండెదడ పట్టుకుంది. ఏదో లేని నీరసం ఆవహించి నట్లుంది. ఎందుకో వారి దృష్టి తమ పాదంమీదికి పోయింది. పాదం పచ్చగా, నున్నగా లావుగా ఉంది. ఎన్నడూ పాదాన్ని అంత ధ్యాసగా చూడలేదు వారు. అది అందంగా కనిపించింది వారికి. చూస్తూ కూర్చున్నారు.

ఒక చీమ కనిపించింది.

అది వారి పాదం మీదికి ఎక్కుతూంది.

దాన్ని చూచారు మంత్రి, ఎందుకో భయం అనిపించింది. చీమను చూచి దడుచుకోవడం ఏమిటో అర్థం కాలేదు. భయం చీమను చూచిందో, ఉపన్యాసం విన్నదో వారికి అర్థంకాలేదు.

చీమ పాదంమీద పాకుతూంది.

అది కుడ్తుందేమో అనిపించింది మంత్రికి.

దాన్ని నలిపేయాలనుకున్నారు. అవును, నలిపేయడమే మంచిది. కాకుంటే కుట్టగలదు, అవును కుట్టినా కుట్టవచ్చు. అది చీమ. తాను మంత్రి. మంత్రి చీమకు భయపడ్డమా? మంత్రి ప్రజలకూ, వారి విమర్శలకూ, తిట్లకూ, ఉద్యమాలకే భయపడరాదు. చీమకు భయపడ్తే ఎలా?

చీమ పాకుతూంది–

మంత్రిగారి కుడిపాదంమీద.

అది మంత్రిగారి ఆలోచనలను గమనించలేదు.

వారి ఆగ్రహాన్ని గ్రహించనేలేదు – పాకుతూంది కుడిపాదంమీద.

మంత్రివారి ధ్యాస చీమమీద వుంది. చీమ ఎంతపని చేస్తోంది అనుకున్నారు. ఎందుకో వారికి సుమతీ శతకంలోని పద్యపాదం గుర్తుకు వచ్చింది.

*బలవంతమైన సర్పము*
*చలిచీమలచేతజిక్కి చావదె సుమతీ!*

అవును, చీమలు చాలా ప్రమాదకరం అయినవి. అవి పాముల్నే చంపుతాయి అనే ధ్యాస వచ్చేవరకు వంటినిండా చీమలు పాకినట్లుయింది మంత్రికి. వళ్ళంతా చీమలు పుట్టలు, పుట్టలుగా పట్టి పీకుతున్నట్లనిపించింది. విముక్తికి మార్గం

కనిపించలేదు. కాల్పులు జరిపింతా మనుకున్నారు. ప్రయోజనం లేదనిపించింది. చీమలు ఉన్నవి తన వంటిమీద, తూటాలకు చీమలు చస్తాయో లేదో కాని తనకు ప్రమాదం ఖాయం.

చీమ –

ఎంత చిన్న ప్రాణి!

ఎంత మహాప్రమాదం తెచ్చిపెట్టగలదు!

అవును, చీమలు ప్రమాదకరములు – ముఖ్యముగా మంత్రులకు!

అందుకేంచేయాలి? సైంటిస్టులను చీమలు పెరగకుండే మందు కనిపెట్టమనాలి!

చీమలు తిరుగరాదు!

వాటి జనాభా పెరగరాదు!

అందుకు ఎంత ఖర్చయినా వెనుదీయరాదు–

అవసరం అయితే అమెరికా సైంటిస్టులను దిగుమతి చేయాలి.

"చీమలమీద యుద్ధం" – మంచి శీర్షిక. అమెరికాలో బహుళ ప్రచారం లభిస్తుంది తనకు. అమెరికాలో ఘనమైన గౌరవం లభిస్తుంది. అసలు అమెరికాలో చీమ లున్నాయా?

కుడి పాదంమీద చీమ పాకుతూనే ఉంది.

చీమ నిలచింది.

కాస్త వళ్ళు విరుచుకుంది.

కోరలు సరిచేసుకుంటూొంది.

కుట్టడానికి సిద్ధం అవుతూంది.

మంత్రి దాన్ని నలిపేద్దామనుకున్నారు. చేయికూడా కదిపారు. కానీ వంగలేకపోయారు, చీమ చేతికి అందలేదు.

మంత్రి కంటికి చీమ భూతంలా కనిపించింది.

ఎందుకో అది కుట్టక మానదనిపించింది.

ఏం చేయాలో తోచలేదు మంత్రికి. చీమలు మంత్రులను కుట్టరాదు అని ఒక శాసనం చేయాలనుకున్నారు. శాసనంలో వర్డింగ్ గట్టిగా వేయాలనుకున్నారు – న్యాయస్థానంవారు కొట్టివేయకుండా. అందుకొక కమిటీని నియమిస్తే? కమిటీలు పరిష్కారం చేయదలచని సమస్యలకు! యిది తమ స్వంత సమస్య కాదు. మంత్రులందరికి సామూహికంగా వున్న సమస్య. ఇందుకు కమిటీలు పనికిరావు. తక్షణచర్య తీసుకోవాలి.

ఆర్డినెన్సు జారీ చేయాలి!

అదే మంచిది.

ఇంతలో చీమ కుట్టనే కుట్టింది. మంత్రికి ఎంత బాధ అయిందో చెప్పలేం. ఆయన సుకుమారుడు – అంటే తొలినుంచీ అని కాదు. పదవి వచ్చింతరువాత అయినారు. ఆ బాధకు కోపం వచ్చింది. కళ్ళెర్ర చేశాడు. అక్కడే నుంచున్న చప్రాసీని చూశాడు.

చప్రాసీకేమీ అర్థం కాలేదు.

అతడు గడ గడా వణకాడు!

మంత్రి మళ్ళీ చూశాడు.

చప్రాసీకేమీ కనిపించలేదు.

మంత్రి తన పాదాన్ని కళ్ళతో చూపాడు.

బంట్రోతుకు కనిపించింది – మంత్రి కాలిమీద చీమ!

ఇహ బంట్రోతు నిలువలేదు.

లంఘించాడు – చీమ మీదికి.

చీమను రెండు వేళ్ళతో పట్టుకొని నలిపేశాడు

మంత్రికి చూపించాడు.

మంత్రి చాలా సంతోషించాడు.

బంట్రోతు అక్కణ్ణుంచి తప్పుకున్నాడు!

మంత్రికి మరో ఆలోచన వచ్చింది. చీమని చంపడానికి కూడా బంట్రోతే కావాలా – మరి తానెందుకు...?

మరో ఉపన్యాసకుని ఉపన్యాసం సాగుతూంది:

"స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్ళయిందంటున్నారు. అది వచ్చి ఏం ఒరిగింది పేదలకు, సామాన్యులకు? దొరతనం మారింది. తెల్ల దొరలు పోయి నల్ల దొరలు వచ్చారు. దేశంలో వ్యత్యాసాలు పెరిగి పోయాయి. లంచగొండితనం హెచ్చింది. నీతి చచ్చింది. అవినీతి రాజ్యం చేస్తూంది. న్యాయం న్యాయస్థానాల్లో సహితం కరువయింది. దొంగలు, మోసగాళ్ళు, దగాకోర్లు, వంచకులు ప్రభుత్వాలను వంచించి, లక్షలు, కోట్లు సంపాదించి, విదేశాల్లో విహరిస్తుండగా – శ్రమించి చదివి దేశంకోసం జీవితాలు అంకితం చేయదలుచుకొన్న శాస్త్రజ్ఞులకు జీవన భృతి దొరక్క పరాయి దేశాలకు వెళ్ళిపోతున్నారు. నల్ల బజారును నమ్ముకున్నవాడు నల్ల డబ్బుతో కులుకుతుండగా కష్టించేవానికి పని దొరక్క, పని దొరికితే చాలినంత జీతం దొరక్క అలమటిస్తున్నాడు – ఆక్రోశిస్తున్నాడు. పంటలు పండించే ఉత్పత్తిదారుకూ, పంటను వాడే వినియోగదారుకూ తెలియకుండా ధరలు పెంచే మధ్య దళారులు మిలియన్లార్జిస్తుండగా అటు పండించేవాడూ, ఇటు వాడకందారూ రోజు రోజుకూ అణగారిపోతున్నారు. ఈ దోపిడీలకు ఎందరు బలి అవుతున్నారో తెలియడంలేదు. ఎక్కడచూచినా కల్పిత కొరత – లంచాలు – దుండగాలు, పాఠశాలల్లో, కళాశాలల్లో సీట్లుండవు. అవి సామాన్యునికి లభించవు. లభించినా ఆ సోపాన పటంలో ఎక్కడో పాము మింగుతుంది. నిచ్చెన లెక్కేవారు పరమపదం చేరుకుంటారు. పాము మింగినవాడు తోకదగ్గరికి చేరుకుంటాడు. జీవితపు కర్కశత్వం అతనిని అలా చేస్తుంది. ఉద్యోగం కోసం బయల్దేర్తాడు. అడుగడుగునా దెబ్బలుతిని నొసలు బద్దలవుతాయి.

లంచం ఇచ్చినవారికీ, అమ్మాయిలను తార్చినవానికీ, మంత్రి సిఫార్సు ఉన్నవానికే ఉద్యోగం. నిరుద్యోగికి ఇంట్లో పస్తులుంటున్న తల్లీ, పిల్లలూ! తనకు ఆశ్రయంలేదు. ఆధారంలేదు. ప్రభుత్వం అతన్ని గురించి పట్టించుకోదు. ప్రజలకు అతడు అవసరం లేదు. సమాజాన్ని స్వార్థపరులు, లంచగొండ్లు, నల్ల వర్తకులు, జమీందార్లు కుళ్లగొట్టారు.

ఇదీ ఈనాటి యువకులు ఎదుర్కొంటున్న సమస్య. వారు చూస్తున్నది కుళ్ళిన సమాజాన్ని. కంపుగొడ్తున్న అవినీతిని.

ఈ సమాజాన్ని చూస్తే అసహ్యం అనిపిస్తూంది వారికి! ఈ కుళ్లు, ఈ కంపు, పోవాలంటే సమాజాన్ని సమూలంగా నాశనం చేయాలనుకొంటున్నారు. అందుకే తిరుగుబాటు చేస్తున్నారు. యువకులు తిరుగబడని స్థలమంటూలేదు. పాఠశాలలు, కళాశాలలు, సినిమా హోళ్లు, హోటళ్ళు, రైళ్ళు, బస్సులు, అంతటా తిరగబడుతున్నారు. వారిలో ఉన్న అగ్గిని మనం గ్రహించడంలేదు. అణచడానికి ప్రయత్నిస్తున్నాం. వారు రెచ్చిపోతున్నారు. ఆయుధాలు ధరించి అడవుల్లో దూరుతున్నారు. తద్వారా సమాజాన్ని మార్చాలనీ, విప్లవం తేవాలని తహతహ లాడిపోతున్నారు. ఈ సమాజాన్ని మనం మార్చలేకుంటే వారు మారుస్తారు. వాస్తవాన్ని మనం గుర్తించాల్సిన సమయం వచ్చింది. ఈ అసమానతలను రూపుమాపాలి. పేదరికాన్ని నిర్మూలించాలి. సమాజంలో అట్టడుగున ఉన్నవారికి తిన తిండీ, చేసుకోవడానికి పనీ, కట్టుకోవడానికి బట్టా, ఉండడానికి ఇల్లూ సమకూర్చే ఉపాయం చూడాలి. ఇది కేపిటలిస్టు పంథాలో సాధ్యపడదు. సోషలిజం రావాలి – మనం తేవాలి. మనం ఆ పని చేయకుంటే చరిత్ర మనను క్షమించదు – సమాజం మనసు మన్నించదు – ప్రజలు మనను మరిచిపోరు."

మంత్రికి గుండెదడ పట్టుకుంది.

భయం భయంగా వుంది.

ఏదో ఆపదలో చిక్కుకున్నట్లుంది.

పక్కకు చూస్తే తలుపు తెరుచుకున్నట్లనిపించింది. బయట వెలుగు, గాలి, ప్రకృతి సిద్ధమయినవి లోన ప్రవేశించాయి. గేటులో ఒక పోలీసు అధికారి కనిపించాడు.

తలుపు మూత పడింది. అధికారి మెట్లు దిగి ఇటూ అటూ చూచాడు. ముందు వరుసలో వున్న మంత్రి కనిపిస్తే అక్కడికి వెళ్ళాడు. మంత్రిముందు నుంచొని శాల్యూట్ కొట్టాడు మంత్రి అధికారిని అపాదమస్తకం చూపుల్తో కొలిచాడు. ఏమి టన్నట్లు చూపుల్తోనే ప్రశ్నించాడు.

"కాస్త బయటికి వస్తారా? మీతో పనుంది." అధికారి విన్నవించాడు.

"నన్నా? నాతోనా!"

"అవును. మీతోనే. అర్జంటు పని ఉంది." ఉండాల్సిన వినయం కనిపించలేదు అధికారి ధ్వనిలో.

"నాతో పని ఉంది, బాగానే ఉంది కాని, లేవడం నాకు సాధ్యమా? ఒంటిగా లేవలేనే! లేపాలి!"

చేయూత నిచ్చాడు అధికారి – చప్రాసీ ఒకవంక పట్టాడు. ఇద్దరి ఆశ్రయంతో కష్టంగా లేవగలిగాడు మంత్రి. ఇద్దరి భుజాలమీద రెండు చేతులూ పూన్చి నడిచాడు మంత్రి భారంగా. మంత్రి అధికార చిహ్నం, అధికారం బరువైంది కాబట్టి బరువుగా ఉన్న మంత్రిపుంగవులు భారంగా నడుస్తున్నారు. వారు హోలు

దాటారు. వరండాలోకి వచ్చారు. మంత్రికి నడక అలవాటు లేదు. మరి – వారికీ, వారి ప్రభుత్వానికీ ఎప్పుడూ పడకే!

వరండాలోకి వచ్చాడు మంత్రి – వచ్చి వగర్చాడు మంత్రి. వచ్చి గోడకు ఆనుకున్నాడు మంత్రి. నుంచొని అడిగాడు మంత్రి. "ఏం పని? ఎందుకు పిలిచావు? ఇంత కష్టపడి ఎందుకు వచ్చానో తెలుసా? నువ్వు పోలీసు అధికారివి. మేము ఇంకా యిలా వున్నమన్నా – ఈ ప్రభుత్వం నిలిచిందన్నా మీ ఆధారంమీదనే, మీరు లేకుంటే మాకేముంది? సరే, చెప్పు. ఎందుకు పిలిచావ్?"

"క్షమించాలి, మీరు నిర్బంధంలో వున్నారు, యూ ఆర్ అండర్ అరెస్ట్!"

"ఏమి? ఏమన్నావ్!! ఏమిటి!!" మంత్రికి చెమటపట్టింది. వళ్ళు తూలసాగింది. సూర్యుడు నేలమీద దొర్లుతున్నట్లనిపించింది భూమి అతని చుట్టు గిరగిరా తిరుగుతున్నట్లనిపించింది. అయినా ధైర్యం తెచ్చుకొన్నాడు. మంత్రికదా! మరి కోపం తెచ్చుకొన్నాడు! రక్తం మండింది. వళ్ళు వణికింది. నాలుక ఆరుకుపోతూంది. అయినా అరిచాడు – కేకలేశాడు అధికారిమీద –

"తెలుసా? నీకు నేను ఎవరో? – మంత్రిని నన్నే అరెస్టుచేస్తానంటావా? అనటం పొరపాటునే అయ్యుండవచ్చు – అయినా ఇహ నీ ఉద్యోగం దక్కదు. తెలియదింకా నే నెవరో నీకు – అందుకే అంత ధైర్యంగా అలా నుంచున్నావు. విన్నావా – నా కారుకు అడ్డంగా గేటు వేశాడొకడు – ఎవడు? రైల్వేగేటు మనిషి. తీయమంటే తీశాడుకాడు– ఏమనుకున్నాడో – వాడికి తెలియదు నేనెవణ్ణో! ఏం చేశానో తెలుసా? ఉద్యోగం ఊడపీకించాను. అప్పుడు తెలిసింది నేనంటే ఎవరో? విను ఇంకా విను. రైలుదిగి వస్తుంటే టిక్కెట్టు అడిగాడయ్యా – ఎవడు? అదే ఆ టిక్కెట్టు కలెక్టరు – గేటు దగ్గర టిక్కెట్లడుక్కునేవాడు. చెప్పాను నన్ను గురించి. విన్నాడనుకున్నావా – ఉహూ ససేమిరా – టిక్కెట్టు డబ్బు కట్టించుకున్నాడు – నాతోని! ఏమైందో తరువాత తెలుసా? ముందు జరిమానా వేయించి – తరువాత సస్పెండు చేయించి, ఆ తరువాత ఉద్యోగం నుంచి ఊడపెరికించాను. విన్నావా నేనంటే ఎవరో? విన్నావా నా అధికారమెంతో?"

"విన్నానండి."

"అయితే క్షమాపణ కోరుకో. ఇంతటితో వదిలేస్తా – నీవు పోలీసు అధికారివి కాబట్టి."

"మీరు ఆయాస పడుతున్నారు – అనవసరంగా ఉద్రేకపడుతున్నారు. ప్రభుత్వం మారిపోయింది! మీ రిప్పుడు మంత్రికాదు. నా విధులను నేను నిర్వర్తించాను – ఇది ప్రభుత్వ ఆదేశం, మీరు సిద్ధంగా ఉండండి, కారు వస్తుంది."

"ఏమి! ఏమన్నావు? ప్రభుత్వం మళ్ళీ మారిందా? ఈ మధ్యనే పార్టీ మారానుకదయ్యా! ఇంతలోనే మారిందా మళ్ళీ ప్రభుత్వం? వింతగా ఉంది. ఇది మాకంటే తొందరగా మారుతుంది. ఇదిగోచూడు ఒక్క సహాయం చేసిపెట్టు – తరవాత నీకు ఎన్నో సహాయాలు చేయగలను. కాస్త, ఒక్క గంట వదులు చాలు. పార్టీ మార్చుకొని మంత్రి అవుతా. ఎన్ని ప్రభుత్వాలు మారినా నేను మంత్రిని కావడం ఖాయం – విన్నావా! కాస్త అవకాశం ఇచ్చావంటే చాలు – నీవు

పెద్ద అధికారివి అయిపోతావు. ఆలోచించుకో – అవకాశం వదులుకోకు, నేను మంత్రికావడం ఖాయం. నాకు అందులో పాతికేళ్ళ అనుభవం ఉంది! ఏమంటావ్?"

"క్షమించాలి. ఇది పార్టీలు మారిన ప్రభుత్వంకాదు, ప్రజలు వశపరుచుకున్నారు ప్రభుత్వాన్ని. మీ మీద లంచగొండితనం, విద్రోహం, హత్య మున్నగు నేరాలు మోపారు. అందుకు...."

"ఏమి! ప్రభుత్వం మారిందా! ప్రజలు వశరపుచుకున్నారా? ప్రజలు వశపరుచుకోవడం... ఏమిటీ వింత! ... ఈ దేశంలో... ఇలా అవుతుందనుకోలేదు... ప్రజలు... ప్రభుత్వాన్ని... వశ... నా వళ్ళు తూలుతూంది. ఏవీ, ఇక్కడ సోఫాలేవి! ఒక్కటీ కనిపించదు... ఎక్కడికి పోయాయి... ఎన్నో కొన్నాం... మెత్తనిది... అందమయినవి... ఏవీ అవి?... ఎక్కడ పోయాయి?... వళ్ళు తిరుగుతూంది... ఒక సోఫా తెప్పించండి."

"క్షమించాలి. ఇక్కడ సోఫాల్లేవు. సోఫాలన్నీ ఆస్పత్రులకు పంపించారు. అవి అక్కడి రోగులకు ఎక్కువ అవసరం అనుకుంది ప్రభుత్వం."

"అంటే! మంత్రులకేం లేవా? నేనెక్కడ కూర్చోవాలి? వళ్ళు తూలుతూంది నుంచోలేను" అని నేలమీద కూలబడ్డాడు మంత్రి, చతికిల పడి కూర్చున్నాడు. తల పట్టుకున్నాడు. ఇంత కాలంగా మంత్రి–ఇప్పుడు పాత మంత్రి.

అసలు జనం వేలు, లక్షలు, జనసాగరం పొంగుతుంది. పొర్లుతున్నది, హోరు పెడుతున్నది.

"ప్రజాప్రభుత్వం వర్ధిల్లాలి."

"ప్రజా ద్రోహులు నశించాలి."

"పాత మంత్రుల్ని పాతరవేస్తాం."

ముందుకు సాగుతున్నది, మాజీ మంత్రికే కనిపించింది. వస్తున్నది–ఉరుకులు పెడ్తున్నది. నురుగులు కక్కుతున్నది. తనవైపే వస్తూంది జనప్రవాహం. జనం అంటే భయం పాత మంత్రికి. అతని ప్రాణాలు పైపైనే పోతున్నాయి. కళ్ళప్పగించి అటువైపే చూడసాగాడు.

జనం ముందుకు సాగుతున్నారు.

మాజీమంత్రి గుండె దడదడలాడుతూంది.

ఇంకా దగ్గరికి వచ్చింది జనం – కేకలు! అరుపులు! నినాదాలు! పెడబొబ్బలు!

పాత మంత్రి పిడికిళ్లు బిగించి – కళ్ళు మూసుకొని గట్టిగా కేక పెట్టాడు. "ఫైర్... ఫైర్... ఫైర్.. . కాల్చండి తుపాకులు... తుపాకులు కాల్చండి... బుల్లెట్లు తుపాకులు... జనం చావాలి... ఒరగాలి... కూలాలి."

"పాత మంత్రిని పట్టివ్వండి."

"కాలుస్తాం, చీలుస్తాం, గద్దలకు వేయిస్తాం."

జనం గేటుదాకా వచ్చేశారు.

గేటు మూసివుంది.

గేటు బద్దలు కొట్టేస్తున్నారు.

పాత మంత్రి ప్రాణాలు ప్రాణాల్లో లేవు, ఊపిరి అవిరిగా వస్తూంది. తల

మొద్దుబారింది. జనం వచ్చేస్తున్నారు, తనను తొక్కేస్తారు, చీల్చేస్తారు. ఎక్కడికి తాను పోవడం? ఎటు పరుగెత్తటం? ఏవైపు పారిపోవటం? ఏది దిక్కు?

లేవలేకపోయాడు పాతమంత్రి, బోనులో చిక్కిన ఎలుకలా వుంది ఆయన స్థితి.

జన ప్రవాహం ముంచుకొని వస్తున్నారు.

కదల్లేని స్థితిలో ఉన్నాడు పాపం – అనుకున్నాడు – జనం వారే – ఆ జనమే – వారే జనం – ఎలా జరిగింది? ఏమైంది? ఎలా వచ్చింది విప్లవం!? ఎన్ని జాగ్రత్తలు పడ్డాం? మతంపేర, కులంపేర, భాషపేర ప్రాంతంపేర, విభజించిపెట్టాం. ఈ పుణ్యభూమిమీద – ఈ కర్మభూమి మీద విప్లవం రాకుండా ఎన్ని కట్టుదిట్టాలు చేశాం? అయినా వచ్చింది! జనం ఎలా చేశారు? ఎలా తిరుగబడ్డారు! ఎలా స్వాధీనం చేసుకున్నారు ప్రభుత్వాన్ని! ఇది తప్పనట్లుంది. ఎన్ని చేసినా ఆగనట్లుంది! విప్లవాన్ని అడ్డలేమా? ఆపలేమా? నిరోధించలేమా? నిలువలేమా? మనం ఏమీ చేయలేనట్లున్నాం. విప్లవం సజీవమైంది. అది పెరుగుతుంది. పారుతుంది – వ్యాపిస్తుంది – ముంచుతుంది – పెంచుతుంది – మనం ఏమీ చేయలేం – అదిగో వస్తున్నారు జనం... మీద పడేట్లున్నారు. ఉద్రిక్తంగా ఉన్నారు. రక్తం కళ్ళ చూసేట్లున్నారు. నన్ను ముక్కలకింద నరికేట్లున్నారు? ఎలా – ఏమీ – ఎటు ఎక్కడ!

జనం గేటు దగ్గరికి వచ్చేశారు. గేటు మూసివుంది దాన్ని బద్దలు కొట్టడం ఆ ప్రవాహానికి ఒక పనికాదు – తాకితేచాలు తునాతునకలు అయిపోతుంది గేటు. సరిగ్గా ఆ సమయానికి ఒక వ్యక్తి వచ్చాడు. వచ్చినవాడు పొడగరి, బక్కపల్చటి మనిషి. ముక్కు కొనదేరివుంది. చెంపలు లొట్టలు–కళ్ళు లోతున ఉన్నాయి–అయినా వాటిలో తేజస్సుంది. జుట్టు చెదరివుంది. ముతకబట్టను వేసుకున్నాడు. కనీసం చలవ చేయనివి. అతడు గేటు స్తంభంమీద ఎక్కాడు.

"ఆగండి, ఉద్రేక పడకండి, ముందుకు ఉరకండి" – ఉద్బోధిస్తున్నాడు జనాన్ని.

పా. మం.(పాతమంత్రి) ఆశ్చర్యపడ్డాడు. ఎవరతను? ఎంత నిర్భయంగా ఉద్రిక్త జనంముందుకు వచ్చాడు! బడబాగ్నిని గుప్పిట్లో పట్టడానికి సాహసించాడు! ఇలా జనంముందుకు తాను పోగలిగాడా! ఇలాంటి స్థితిలో తాను పోలీసుల్ని పిలిచేవాడు – కాల్పులు జరిగేవి – కొందరు కూలేవారు. తాను పోలీసులవెంట తప్పుకునేవాడు. ఇంత ధైర్యంగా ప్రజలను ఎదుర్కోవడం తనకు సాధ్యంకాదు – తాను ప్రజల్లోంచి వచ్చాడా మరి!

"అతను ఎవరు?" అడిగాడు పా.మం. పోలీసు అధికారిని.

"ప్రధాని" – పోలీసు అధికారి జవాబు.

"వీడా ప్రధాని! మా ఫ్యాక్టరీలో కూలీల నాయకునిలా ఉన్నాడు. కూలీలకు రాజ్యం చేయవస్తుందా? రాజ్యం కూలీల దయిపోయిందా? ఎంత అన్యాయం? కూలీచేసేవాడు రాజ్యం ఏలడమా? కూలీలు! పొట్ట కూటికి లేనివారు! కూటికై అర్రులు చాచేవారు!! వారా రాజ్యం చేస్తున్నది! అన్యాయం. అక్రమం, దౌర్జన్యం!"

"మీరు వశపర్చుకున్నారు ప్రభుత్వాన్ని. ఎందుకలా ఉరుకుతారు? అక్కడున్న వ్యక్తి పాత ప్రభుత్వం బాపతు – నిజమే. అతడు అన్యాయాలు చేశాడు, అక్రమాలు చేశాడు. దేశాన్ని తాకట్టుపెట్టి, తాను బాగుపడ్డాడు. అదీ నిజమే." – ప్రధాని.

"అందుకే చంపేస్తాం, చీల్చేస్తాం." జనం నిలిచిపోయారు. సహనం చస్తూంది. గేటుముందు గుంపులుగా నుంచున్నారు. ప్రధాని మాటలు వింటున్నారు.

"అతడు మీ కిప్పుడు బందీ. అతన్ని ఏం చేసినా కిమ్మనలేడు. నిన్నటి మంత్రి నేడు ఖైదీ. అతన్ని చంపి, చీల్చి, రక్తం పారించి మనకేం ప్రయోజనం? ఏం చేస్తాం అతని మాంసంతో? పనికిరాని పనికి మనం శక్తిని వృథా చేయడం దేనికి?"

"వాడు దొంగ. రక్తం తాగాడు."

"అవును, అందుకు శిక్షించాలి. మనిషి మనకు శత్రువు కాదు – విధానం మనం శత్రువు – వ్యవస్థ మనకు శత్రువు. ఆ విధాన్నాన్ని మార్చారు. వ్యవస్థను మార్చారు. మనిషిని మార్చలేమా?"

"మార్చగలం – మార్చిస్తాం."

"అయితే పదండి, మీకున్న ఈ ఉద్రేకం, ఈ ఉత్సాహం – ఈ కోపం దారిద్ర్యం మీదికి మళ్ళించండి. పేదరికాన్ని, పశుత్వాన్ని, అజ్ఞానాన్ని అవిద్యను, అమాయకతను నాశనం చేయాల్సివుంది. పదండి పోదాం. అక్కడ మురికి పేటల్ని బాగుచేయాలి. అక్కడ వేలాది కార్మికులు పనిచేస్తున్నారు. పదండి పోదాం. పేదరికాన్ని నిర్మూలింతాం. అసమానతలను అడుగంటింతాం. మానవతా రాజ్యం నిర్మింతాం."

"శ్రామిక రాజ్యం వర్ధిల్లాలి" – ప్రధాని ముగించారు.

"పేదరికాన్ని నిర్మూలిస్తాం."

"అసమానతలను అడుగంటిస్తాం."

"పదండి ముందుకు" – ప్రధానికేక,

"మురికివాడలను నిర్మూలిస్తాం."

"సమతారాజ్యం స్థాపించాం" – నినాదాలతో ప్రజలు సాగిపోయారు – ప్రధాని ముందు నడువగా.

పా. మం. గుండె కదలసాగింది. ఒక్క నిట్టూర్పు విడిచాడు. విన్న ఉపన్యాసంమీద ఏదో గురి ఏర్పడింది. వ్యక్తి – వ్యవస్థ పదాలు వింతగా కనిపించాయి. ద్వేషం వ్యక్తిమీదకాదు – వ్యవస్థమీద! మరీ విచిత్రం అనిపించింది. అది లిప్తపాటు మాత్రమే. ఎవరో తనను నాశనం చేస్తున్నట్లనిపించింది. చావు నల్లని ముసుగుతో అతని ముందు ప్రత్యక్షం అయి, మాయం అయింది.

చావు తప్పింది నిజమే. కాని నరకయాతన మిగిలింది. ముందేదో మహా కిరాతకం ఉన్నట్టు ఊహించుకున్నాడు. తనను ఏదో మహాయాతనలు పెట్టబోతున్నారు. చేసిన ఘోరాలు, చంపిన మనుషులు గుర్తుకు వచ్చారు. వచ్చిన జనం తనను చంపుతేనే బాగుండుననుకున్నాడు. నరికే వాళ్ళేమో – ముక్కలు ముక్కలుగా – అదే బాగనిపించింది. అది తప్పిందిప్పుడు – మనసుకు ఒక రంపపు కోత మొదలయింది. ఇది ఎంతకాలం? ఎలా సహించడం? ఎలా బతకటం? ఏమి ఉపాయం? తాను, తన బ్రతుకు? తన ప్రాణం? తన సంపద? ఎక్కడ ఏది? ఎటు? విలవిల్లాడాడు పా. మం.

కటకటాల కారు వచ్చి ముందాగింది.

"పదండి, కారు వచ్చింది. ఎక్కండి" పోలీసు అధికారి పురమాయించాడు.

పా. మం. కారును చూచాడు. గుండె గుభిల్లుమంది. కటకటాలవ్యాను కత్తుల బోనులా కనిపించింది.

"బాబూ!" అధికారిని అడిగాడు. "చూడు మేం విదేశాలనుంచి తెప్పించుకున్నాం. పొడవైనవి - ఇంపాలా, చెవర్లెట్ - అది ఉంటే ఒక్కటి తెప్పించరాదూ - ఈ బండ్లో ఎలా కూర్చోవడం?"

"క్షమించాలి. మీరు నేరస్తులనే విషయం మరచినట్లున్నారు!"

"అలాగా! అదిసరే! అసలాకార్లు ఉన్నాయా అని? మీ ప్రధానికి అవెందుకయ్యా!"

"అయ్యా! ఆ కార్లు ఉన్నాయి - కాని, మంత్రులకు లేవు. వాటిని పసిపాపలను శిశు కేంద్రాల్లోకి తీసికెళ్ళడానికి వాడుతున్నారు. కార్మికులు పనిలోకి వెళ్ళేప్పుడు వారి బిడ్డల్ని శిశు కేంద్రాలకు చేరుస్తారు. అక్కడ పసిపాపల సంరక్షణ చక్కగా జరుగుతుంది. కార్మికులు తిరిగి ఇండ్లకు వచ్చేటప్పుడు పిల్లలను ఇండ్లలో దింపుతారు."

"ఏడిసినట్లే ఉంది - కూలివాళ్ళకోసం వాడుతున్నారూ వాటిని! సరేలే మరి మంత్రులకూ!"

"కొందరికి మామూలు కార్లున్నాయి, మరికొందరు మోటారు సైకిళ్ళు, వట్టి సైకిళ్ళు వాడుతున్నారు."

"ఏమేమీ! మంత్రులు సైకిళ్ళు వాడుతున్నారా! బాగుందయ్యా ప్రభుత్వం, బాగుంది. ఈ ప్రభుత్వం ఎన్నాళ్లో నిలవదులే - మళ్ళీ మా రాజ్యం ఖాయం, ఏమంటావు! కాస్త మెత్తని బండి తెప్పించయ్యా. చూశావా, నీకు మంచి ప్రమోషను ఇప్పిస్తా."

"అయ్యా! నడవండి. మరో కారు రాదు. కలలు కనకండి. ఈ ప్రభుత్వం మాది. దీన్ని మా రక్తం ధారపోసి సాధించాం. మళ్ళీ దీన్ని తిమింగాలాలకు అప్పగించం. శ్రామికులు మేల్కొనాలి. రాజ్యం సాధించాలి. అంతవరకే కష్టం. శ్రామికునికి రాజ్యం వచ్చిందా అది లాక్కోటం బ్రహ్మతరంగాదు. ఈ రాజ్యం మాది. మేము నిలుపుకుంటాం. పదండి-సమయం వృథా అవుతూంది."

"అంతేనంటావా! అదే నిశ్చయంలా కనిపిస్తూంది. ఊరికే అన్నాలే, నాకు తెలియదూ మీ శక్తి. మీ శక్తి మీకు తెలియనంత కాలమే మా పెత్తనం. మీ శక్తి మీకు తెలుస్తే చాలు, మా పప్పులుడకవు- అది తెలుసు మీకు. అయితే తప్పదంటావ్" అని పా.మం. అధికారికి చేయి అందించాడు. అధికారి అతన్ని పట్టుకొని కష్టంగా లేపాడు. లేచి నుంచున్నాడు పా.మం. ఒక్క అడుగువేశాడు - అడిగాడు:

"బాబూ! ఒక్క సంశయం. ఏంలేదు, మేం ఉన్న ఇళ్ళున్నాయి చూశావూ - ఆ భవనాలు - అవి అన్ని సౌకర్యాలు ఉండేట్లు కట్టించుకున్నాంలే - డబ్బు ప్రభుత్వానిదే అనుకో - అయినా కట్టించుకున్నది మా కోసం. అవి ఏమయినా యంటావు?"

"ఓహో, అవా! వాటిల్లో కాలేజీలు పెట్టారు."

"పెట్టారూ! సరే. మరి మంత్రులు?"

"మంత్రులు చిన్న ఇండ్లకు మారారు. చిన్న ఇండ్లు మంత్రులకు ఎలా చాలుతున్నాయి అనే సంశయం మీకు కలిగింది, నాకు తెలుసు."

"అబ్బా! గట్టివాడివే. ఒక్క అధికారి నీలాంటివాడు దొరికి ఉంటే ఈ దేశాన్ని నందనవనం చేయకపోయామా!"

"మీరు ఎలాంటివారో మీకు అధికారులూ అలాంటివారే దొరికారు."

"అది సరే. మంత్రులకు చిన్న ఇండ్లు ఎలా చాలుతున్నాయో చెప్పావుకావు!"

"మీరు మంత్రులుగా వున్నప్పుడు పదవి నిలబెట్టుకోవడానికి రాజకీయ కుతంత్రాలూ, పరిమిట్లకోసం జరిగే పన్నాగాలు, ఆశ్రితులకోసం చేసే ఆడంబరాలు అన్నింటికీ మంత్రుల ఇండ్లే నిలయాలుగా వుండేవి. ఇప్పుడవన్నీ లేవు. మంత్రి ఇంటికి ప్రజలు పోవాల్సిన పనిలేదు. అవసరం వున్నవాడు ఆఫీసుకే వెళతాడు. నడవండి. డ్రైవరు వేచి వున్నాడు" అని వ్యానుదాకా నడిపించుకొని వెళ్ళాడు అధికారి. పా. మం. వ్యానులో ఎక్కాడు.

వ్యాను కదిలింది. సాగిపోయింది.

వ్యానులో కూర్చున్న పా.మం. చాలా బాధపడ్డాడు. సీట్లు కఠినంగా ఉన్నాయి. అప్పుడు అనుకొన్నాడు:

"గాంధీజీ అన్నారు, ఒకసారన్నా జేలుకు వెళ్లమని. అప్పుడేమో మనది అయనపార్టీకాదు. అయన చెప్పింది వినలేదు. విని ఒక్కసారి జేలుకు వెళ్ళి వచ్చివుంటే ఇప్పుడు ఇంత బాధ కలిగేదికాదు."

## రెండు

పా.మం.ని పరామర్శించడానికి ప్రధాని జేలుకు వచ్చారు. జేలు ఆవరణ సాంతం నిరామయంగా ఉంది. మనుషులున్న జాడలేదు. గబ్బిలాలు అక్కడక్కడా వేళ్ళాడి ఉన్నాయి. కొంత దూరంలో రంగురంగుల పూల మొక్కలు స్వాగతం పలికాయి. జేలు అధికారి ప్రధాని వెంట నడిచాడు. పా. మం. ఉన్న గదికి వచ్చారు.

ప్రధాని అతి సాధారణంగా ఉన్నారు. నిరాడంబరంగా ఉన్నారు. వారిని చూచాడు పా.మం. అతడు అనుకోలేదు. అయినా లేచినుంచున్నాడు. అనుకోలేదు. అయినా నమస్కరించాడు. ప్రధాని చిరునవ్వు నవ్వారు. ప్రతి నమస్కారం చేశారు. పా.మం.ని కూర్చోమని నియమించారు.

ఈలోగా కాఫీ వచ్చింది. ఇద్దరూ కాఫీ సేవిస్తున్నారు. పా.మం. ఏదో మాట్లాడాలనుకుంటున్నాడు. మాట్లాడ్డంలేదు. మాట్లాడాలనిలేదు. ఉన్నది జేల్లోనే అయినా, పోయిన మంత్రిపదవి టెక్కు ఇంకా వదల్లేదు. మళ్ళీ తమ రాజ్యం వస్తుందనే కల కరిగిపోలేదు.

నైజాం నవాబు పదవి ఊడింది. రాజ్యం పోయింది. అయినా అతడలా అనుకునేవాడు కాదట! తనకు రాజ్యం ఉన్నట్లే భావించేవాడట! దర్బారు తీర్చేవాడట, దర్బారుకు వచ్చేవారెవరు? కింగ్ కోఠీలో ఉండే సేవకులు! వారిలో వంధిమాగధులుండేవారు.

"మహాప్రభో! తమ రాజ్యంలో సుఖశాంతులు విలసిల్లుతున్నాయి" అనేవాడొకడు.

"జహాఁపనా! ప్రజలు తమను వేనోళ్ళ పొగడుతున్నారు" అనేవాడు మరొకడు.

"సర్కార్! తమకు నజ్రానా చెల్లించుకోవడానికి నవాబులు, రాజులు బయట వేచివున్నారు – ఏమి శలవు?" అనేవాడు యింకొకడు.

నవాబు దిగులుగానే కనిపించాడు – అతనికి నవ్వడం తెలీదు – అది రాజరికపు లక్షణం.

"మహా ప్రభూ! దిగులుగా వున్నారు, రాజ్యం శత్రుగతం అయిందనా ప్రభూ?"

"జహాఁపనా! మన శత్రువు రాజ్యం చేయలేకపోతున్నాడు. దేశంలో భీతావహం వ్యాపించింది. ప్రజలు మిమ్ములనే ప్రభువుగా పరిగణిస్తున్నారు."

"సర్కార్! ప్రజలు రాజ్యం ఎలా చేయగలరు? వారు మీ పాదముల కడకు రాకమానరు, వచ్చినారు ప్రభూ! రమ్మందునా లోనికి?"

ఇంతలో సభ యావత్తూ నినాదాలు చేసింది.

"మీర్ ఉస్మానలీఖాఁ బహద్దుర్ జిందాబాద్."

"రియాసతె హైద్రాబాద్ ఫామిందాబాద్" –

అలా నాటకంలో రాజుగా అంతకాలం జీవించగలిగాడట నవాబు! అలా అని మన శాస్త్రజ్ఞులు చెబుతారు, అలా కాకుంటే ఎన్నడో పోయేవాడట నవాబు!

ఆ నవాబులా ఉన్నాడు పా.మం. తన అధికారం చచ్చిందనీ, తాను మంత్రిని కాననీ ఇంకా అయనకు నమ్మకం ఏర్పడలేదు. అలాగే ఎదురుగా కూర్చున్న వాడిని ప్రధానిగా అంగీకరించడానికి అతని మనసు అంగీకరించడంలేదు. అలా ఉన్న పరిస్థితిలో ప్రధాని స్వయంగా మౌనాన్ని భంగం చేశాడు.

"ఇక్కడ మీకు సౌకర్యంగా ఉందా?"

ప్రశ్న వింతగా తోచింది పా.మం.కి. ప్రధాని వదనంలోని సౌమ్యత అతన్ని కదిలించింది. అయినా మొరటుగానే అన్నాడు.

"నేను నేరం చేశానన్నారు. నన్ను అరెస్టు చేశారు, తెచ్చి యిక్కడ పెట్టారు. ఇప్పుడు సౌకర్యంగా వుందా? అని అడుగుతున్నావు. ఇది మీ ప్రభుత్వ విధానమా? నేరస్తులకు సౌకర్యాలు కలిగించడం సబబా? పైగా, యిక్కడ అట్టే జనం లేరు. దొంగలను, హంతకులను సమాజం మీదికి వదలి, మాలాంటి వాళ్ళను యిక్కడ పెట్టి శిక్షిస్తున్నారా? నాకు అంతా అయోమయంగా వుంది. మీ పద్ధతే అర్థంకావడంలేదు."

"వివరాలు తరవాత చెపుతాను. మీ కేమైనా అసౌకర్యం ఉంటే చెప్పండి, అది దూరంచేసే యత్నం చేస్తాం. ఆ తరువాత వివరంగా మాట్లాడుకొందాం."

"ఇక్కడ నాకేమీ అసౌకర్యం లేదు. హాయిగా ఉన్నాను. ఇక్కడి అధికారులంతా మంచివాళ్ళు, మిత్రుల్లా వ్యవహరిస్తున్నారు. మంచి శిక్షణ యిచ్చారు. అందుకు మిమ్ము అభినందించాలి. నేరస్తులను గూర్చి చెప్పారు కారు."

"అయితే వినండి." ప్రధాని కుర్చీలో సరిగా కూర్చొని ప్రారంభించారు: "ప్రతిదీ మనం అవలంబించే దృక్పథంమీద ఆధారపడి వుంటుంది. దృక్పథాలు మారుతుంటే నేరాలు, వాటి స్వరూపాలూ మారుతుంటాయి. బానిసలను మనుషులుగా గాక వస్తువులనుగా వాడుకోవడం ఒకనాటి న్యాయం. బానిసల కళ్ళు పెరికించి వారిని పనుల్లో పెట్టేవారట. అనాటి సమాజం దాన్ని సహించింది. అది అప్పటి సామాజిక దృక్పథం. సమాజం మారుతూ వచ్చింది. ప్రగతి పథంలో పయనించింది. బానిసలు అనే పదమే మాయం అయింది. శాసనం ముందు వ్యక్తులంతా సమానులేననే విషయం సమాజం గుర్తించింది. నేరం బలవంతుడు చేసినా, బలహీనుడు చేసినా

శిక్షార్హుడని శాసనం చెప్పింది. నేరం చేసినవాణ్ణి శిక్షించి బాగుపరచాలని సంకల్పించింది. ఇది మీ కాలపు పని. అందులో అనేక అవకతవకలు ఏర్పడ్డాయి. డబ్బున్నవాడు శిక్షాస్మృతిని తప్పుకోగలిగాడు. డబ్బు లేనివాడు నేరం చేయకున్నా ఇరుక్కున్నాడు. వ్యక్తినేరం చేస్తాడనీ, అందుకతని వ్యక్తిగతమైన బలహీనతలు, పరిస్థితులు, పరిసరాలే కారణం అని నమ్మారు. అందుకే వ్యక్తిని శిక్షించారు. కాని, శిక్షనుంచి విముక్తుడయిం తరవాత అతడు మళ్ళీ నేరం చేశాడు. అతడు ఎందుకు చేశాడు అని మీరు ఆలోచించలేదు. అతన్ని మళ్ళీ శిక్షించారు. అది మీ దృక్పథం."

"మా దృక్పథాన్ని గురించి ఇంత వివరంగా నేనూ ఆలోచించలేదు. సరే మేం చేసిందంతా తప్పంటారా? మరి మీ దృక్పథం ఏమి?" వళ్ళు విరుచుకొని అడిగాడు పా.మం.

తానొక సిగరెట్టు వెలిగించి, పా.మం.కు ఒక సిగరెట్టు ఇచ్చి సాగించారు ప్రధాని:

"మనిషి మంచివాడు అనేది మా దృక్పథం. వర్షబిందువు నేలను తాకేదాకా అమృతం లాంటిదంటారు. అది నేలకంటగానే మలినం అయిపోతుంది వర్షబిందువు మలినం కావడానికి కారణం బిందువంటారా నేల అంటారా?"

"మట్టేకారణం కావాలి. అది నేలనంటవరకు స్వచ్ఛంగా, పవిత్రంగా ఉందికదామరి!"

"మలినం కావడానికి కారణం మట్టి అయినప్పుడు నీటి బిందువును శిక్షించిగాని, తిట్టిగాని ఏం ప్రయోజనం?"

"అయితే, మట్టిని లేకుండా చేస్తారా?"

"మట్టి, వర్షబిందువు ఉదాహరణలు మాత్రమే. పుట్టినప్పుడు పాప దైవసమానం. బిడ్డ పెరిగి పెద్దవాడు అవుతుంటే అన్ని తప్పులూ మనమే నేర్పుతాం. లేనిది ఉన్నదని చెప్పమనీ, ఉన్నది లేదని చెప్పమనీ అబద్ధాలు నేర్పుతాం. నీటి బిందువువలె బిడ్డను చెడగొట్టేది మనం. మనం అంటే మన సమాజం, మన వ్యవస్థ."

"మీరు చెప్పింది నిజం. మన బిడ్డలు చెడిపోవడానికి కారణం మనమే. కాని, నేరాలు చేయమని చెప్పమే!"

"బిడ్డను అవాస్తవ పరిస్థితికి అలవాటుపడేసి వదిలేస్తాం. ఆ తరువాత పరిస్థితులు నేరం చేయిస్తాయి. నేరం ఒక లక్ష్యం సాధించడానికి మార్గం మాత్రమే. దొంగతనాన్ని గురించి ఆలోచింతాం. దొంగతనం మార్గం, అందుకు లక్ష్యం ద్రవ్యం. మనిషి డబ్బుకోసం దొంగతనం చేస్తున్నాడు. ఏ పరిస్థితుల్లో చేస్తున్నాడు? సమాజంలోని పరిస్థితులు అతన్ని పురిగొల్పుతున్నాయి. నేరం చేయిస్తున్నది సమాజం. చేస్తున్నవాడు వ్యక్తి. మనం వ్యక్తిని శిక్షించాం. సమాజాన్ని గురించి ఆలోచించలేదు.

"ఒక వ్యక్తికి మీరు విద్యా సౌకర్యం కలిగించరు. అతడు సంస్కారం సంపాదించడానికి ఆస్కారం కల్పించరు. విద్యను వ్యాపారంగా చేసి ఏ కొద్దిమందికో అందుబాటులో ఉండేలా చేస్తారు. అసంఖ్యాకంగా వున్న పేద ప్రజలకు చదువు సంస్కారం వుండవు. వారికి విచక్షణా జ్ఞానం శూన్యం. పోటీలు పడి వున్నది అమ్ముకొనో, అర్చుకొనో చదివించిన తల్లిదండ్రుల గతేమి? చదువు ముగించి బయటికి వచ్చేవరకు అనేక భయంకర సత్యాలను ఎదుర్కోవాల్సి వస్తుంది. ఉన్నవానికి లేనివానికి వ్యత్యాసం, అధికారంలో వున్నవారి స్వార్థం. లంచాలు – సిఫార్సులు – తార్పుడుగాళ్ళు – పార్టీలు. చదువు చెప్పించరు. చదువుకున్నవాడికి ఉద్యోగాలు

లేవు. ఉద్యోగాల కోసం చేసిన ఊడిగానికి ఫలితం వుండదు. ఉద్రేకంతో ఎదిరిస్తే తొక్కేస్తారు. అన్యాయం, అక్రమం, దౌర్జన్యం దిసమొలతో ప్రత్యక్ష మవుతాయి. ఏం చేయాలి వీటన్నిటి మధ్య ఇరుక్కున్న యువకుడు - యువతి? ఇంట్లో ముసలి తల్లిదండ్రులు - వారికి వ్యాధులు - మందులకు డబ్బుకావాలి. తమ్ముళ్లో, చెల్లెళ్ళో వాళ్ళకు చదువు - అందుకు డబ్బు కావాలి - పెద్ద చెల్లెలుంటే పెళ్ళి - దానికి డబ్బు కావాలి. తనకు ఉద్యోగం - దానికి డబ్బు కావాలి. డబ్బు డబ్బు, డబ్బు! డబ్బు తప్ప మనిషికి విలువ కనిపించదు. చదువుకి విలువ కనిపించదు. విజ్ఞానానికి విలువ కనిపించదు. కళకు విలువ కనిపించదు. నీతికి విలువ కనిపించదు. నిజాయితీకి విలువ కనిపించదు.

డబ్బు!

అన్నీ డబ్బులోనే కనిపిస్తాయి.

అలాంటప్పుడు డబ్బుకోసం అతడు పతనం అవుతాడు. అది ఎవరి తప్పు? డబ్బుకోసం అతడు పొంగిపోతాడు. అది ఎవరితప్పు? డబ్బుకోసం అతడు దొంగతనం చేస్తాడు. అది ఎవరితప్పు? డబ్బుకోసం అతడు హత్యచేస్తాడు. అది ఎవరితప్పు? ఆలోచించండి. మనుషులను దొంగలు, దోపిడీదారులు, హంతకులు, వంచకులు కావడానికి అవసరం అయిన పరిస్థితులన్నీ సిద్ధంచేసి ఉంచి, తప్పుడు పనులుచేస్తే నేరస్తుడని శిక్షించడం న్యాయమా? న్యాయాన్ని సైతం ఖరీదు చేయడానికి అవకాశం కల్పించి, నేరస్తుణ్ణి సైతం విడిచిపుచ్చడం న్యాయమా? చెప్పండి. ఎందుకలా మౌనంగా కూర్చుంటారు?"

పా.మం. తికమక పడ్డాడు. అతడు వింటున్నదాన్లో ఏదీ అసత్యంగా కనిపించలేదు. ఇంతకాలంగా అందును గురించి ఎందుకు ఆలోచించలేక పోయాడో అర్థంకాలేదు. ఏదో పడిపోతున్నట్లూ ఓడిపోతున్నట్లూ అనిపించింది తనను కోర్టు బోనులో నుంచోబెట్టి అన్నింటికి నువ్వే బాధ్యునివని వేలమంది వేలుపెట్టి చూపుతున్నట్టనిపించింది. సిగరెట్టు కాల్చి కుర్చీలోంచి లేచి పచార్లు చేయసాగాడు. విన్నవాటినే నెమరువేసు కుంటున్నాడు. ఏం మాట్లాడాలో, ఎలా సమాధానపడాలో అర్థంకాలేదు. వచ్చి కుర్చీలో కూర్చొని సిగరెట్టు కాల్చి అడిగాడు:

"మేం చేసినవన్నీ అన్యాయాలని నిర్ణయించాలనుకుంటున్నారు సరే. అవకాశాలన్నీ ఉండి నేరాలు చేసేవాళ్ళను గురించి ఏం చెప్తారు? ఘరానా దొంగలున్నారు. గొప్ప హంతకులున్నారు. పెద్ద నేరస్తులున్నారు. వారికి మీరంటున్న తిండీ బట్టా వున్నాయి. అన్ని అవకాశాలూ వున్నాయి. అయినా వారు నేరాలు చేస్తున్నారు. వారిని ఎలా బాగుచేయగలరు?"

ప్రధాని సిగరెట్టు పొగ వూది ప్రారంభించారు:

"ముందేచెప్పాను దృక్పథం మారాలని. పరిస్థితులను మార్చడం వల్ల పరిస్థితులకు లొంగి నేరాలు చేసేవారు తగ్గిపోతారు. మాకు నేరస్తుల మీద ద్వేషంలేదు. నేరం విషయంలో ద్వేషం ఉంది. మేం ద్వేషించేది నేరాన్ని - నేరస్తులను కాదు. వ్యాధిని నిర్మూలించాలిగాని, వ్యాధిగ్రస్తుని కాదు. నేరం ఒక వ్యాధిలాంటిదని మా విశ్వాసం. వ్యాధి రాకుండా నిరోధించడానికి పరిసరాలను శుభ్రంగా ఉంచటం అవసరం. అందువల్ల వ్యాధి నిరోధింపబడుతుంది. అయినా, శరీరంలో వ్యాధి లక్షణాలున్న

వ్యక్తులుంటారు. వారికి చికిత్స అవసరం. మీరన్న నేరస్తులు అలాంటివారు. వారి వ్యాధిని కుదర్చడానికి మానసిక చికిత్స అవసరం. ప్రస్తుతం దేశంలో ఉన్న జైళ్ళన్నీ ఇలాంటి చికిత్సాలయాలుగానే ఉన్నాయి. పొరుగువాణ్ణి తనవలెనే ప్రేమించమనీ మానవులందరికీ సమానంగా జీవించే హక్కు ఉందని బోధించడం, శిక్షణ నివ్వడం జరుగుతూంది."

"ఏమీ మీరు ప్రేమను గురించి మాట్లాడుతున్నారా? మీకు రక్తం, హింస తప్ప వేరే ఏమీ తెలియదనుకున్నామే!" ఆశ్చర్యంగానే అడిగాడు పా.మం.

"అది మీరు మమ్మల్ని గురించి చేసిన ప్రచారం. మానవులంతా సమానంగా జీవించాలనడం మీకు హింస. మనిషి పుట్టినపుడు అదృష్టంగాని, దురదృష్టంగాని వెంట తెచ్చుకోలేదనడం మీకు హింస. మానవులంతా సమానంగా పుట్టినప్పుడు అందరికీ సమానావకాశాలు ఎందుకుండరాదు అంటే మీకు హింస. సంపద సృష్టిస్తున్నది శ్రామికుడు, అతని శ్రమను హరిస్తున్నది మరొకడు అంటే మీకు హింస. మమ్మల్ను గురించి విష ప్రచారం చేయడానికి మీకు ఉపకరించింది హింస.

"ప్రజలు మిమ్మల్ని ముక్కలకింద నరుకుతామని వస్తే మిమ్మల్ని రక్షించాం. మాకు మానవుడు గొప్పవాడు – అతన్ని మించిన దేవుడు లేడు. మీరు మీ మిల్లుల్లో ఎంతమంది కార్మిక నాయకుల్ని హత్యలు చేయించారు! మీ పలుకుబడి నిలుపుకోడానికి ఎంతమంది అమాయకులను బలి యిచ్చారు! కారు ముందుకు వచ్చిన అమ్మాయిని నిలువునా హత్యచేసి, డ్రైవర్‌ను జైలుకు పంపలేదా మీరు? జనం మీ మీదికి వచ్చిన స్థితిలో మీవద్ద ఆయుధం ఉంటే ఎందరిని కాల్చి చంపేవారో! అది మీ అహింస! మీకు ప్రపంచంలో అన్నింటినీ మించింది సంపద, అధికారం. అందుకోసం ఎన్ని హత్యలైనా చేస్తారు. ఎంత అవినీతికైనా పాల్పడతారు.

"మాకు లోకంలో అన్నింటినీ మించినవి మానవత, ప్రేమ. వాటిని రక్షించడానికి అడ్డు తగిలినవారిని తొలగించడం తప్పు కాదనుకుంటాం. ఒక్కణ్ణి తొలగించడంవల్ల సమాజం మొత్తానికి మేలు జరిగేట్లుంటే తొలగించడం తప్పు కాదనుకుంటాం. అవసరం అయినప్పుడు శస్త్ర చికిత్స చేయకుంటే రోగం ముదిరే ప్రమాదం ఉంది. ఇది 'అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శేషాంగ శ్రేణికి రక్షణ' కల్పించడం వంటిది.'

"అర్థం అయింది. బాగా అర్థం అయింది. హింసకూ అహింసకూ భేదం వ్యక్తమయింది. అవును చేశాను, నేనూ నేరాలు కొన్ని. అధికారం కోసం పార్టీలు మారాను. అధికారం సాధించడానికి, కావలసిన డబ్బు సంపాదించడానికి అన్యాయాలు చేశాను. ఇప్పుడు మరి అధికారం తొలగించారా? డబ్బు తొలగించారా? నన్ను తొలగిస్తారా?"

"మిమ్మల్ని తొలగించాల్సిన అవసరం లేదు. మీరు మాకు అడ్డుగా లేరు. మీరు వాస్తవాలను గుర్తించేటట్లు చేయటమే మేం చేస్తున్నది. పోతే అధికారం ఉన్నది. అది సంపాదించడానికి పూర్వంవలెనే ఎన్నికలూ ఉన్నాయి, అభ్యర్థులూ ఉన్నారు. పద్ధతి మారింది – అంతే. ఎన్నికవడానికి హత్యలూ, దోపిళ్ళు – అరచేత స్వర్గాలూ లేకుండా చేశాం. అవన్నీ వున్నాయి కాబట్టి మీరు నేరాలు చేశారు. అవిలేకుండా చేస్తే నేరాలు చేయడం వుండదు. దోమలను పారదోలాలంటే మురికిగుంటలు శుభ్రం చేయడం మా విధానం – దోమల్ని చంపడం కాదు."

"అన్నీ ఉన్నయ్యంటున్నారు. ఏదో మార్చామంటున్నారు. అంతా విచిత్రంగా వుంది."

"కొన్నాళ్ళు మీకు అన్నీ విచిత్రంగానే కనిపిస్తాయి. వినండి, ఎన్నికల్లో వ్యక్తులు పోటీచేయడాన్ని తీసేశాం."

"మరి?"

"పార్టీలే పోటీచేస్తాయి. పార్టీలు తమ విధానాన్ని, కార్యక్రమాన్ని ప్రజల ముందుంచుతాయి. ఎన్నికలలో పోటీచేస్తాయి. ఇందువల్ల వ్యక్తులకు ఎన్నికల్లో ఆసక్తి అంతగా ఉండదు. అందువలన వ్యక్తులు అవినీతికి పాల్పడడానికి వీల్లేదు. స్వంతలాభం ప్రత్యక్షంగా లేదుకాబట్టి హత్యలు, దోపిళ్లు జరగడానికి అవకాశాలు లేవు."

"పార్టీలే అవినీతికి పాల్పడితే?"

"అందుని గురించే నేను చెప్పబోతుంటే మీరే అడిగారు. పార్టీ దేశం మొత్తంమీద పోటీ చేయాల్సి ఉంటుంది. కాబట్టి వనరులు తక్కువ. అసలు మా ఆర్థిక విధానమే అంత. డబ్బు ఒకచోట కూడడానికిగాని, అవినీతికి పాల్పడడానికిగాని అవకాశం ఇవ్వదు. పైగా పార్టీ విషయంలో ఏ మాత్రం అవినీతినేరం నిరూపించబడినా, ఆ పార్టీ ఎన్నికల్లో పోటీచేసే అర్హత కోల్పోతుంది."

"బాగుంది, వాస్తవంగా కూడా ప్రజాస్వామ్యంలో పార్టీలే ప్రాముఖ్యత వహిస్తాయి. స్వతంత్ర అభ్యర్థి ఎంత గట్టివాడైనా ఏం చేయగలడు? స్వతంత్రులుగా అభ్యర్థులు పోటీచేయడం ఆపుచేశారన్నమాట. అయితే గెలిచేవి పార్టీలున్నారు. శాసనసభకూ, పార్లమెంటుకూ సభ్యులెలా వస్తారో చెప్పారుకాదు!"

"వినండి, ఎన్నికల్లో నాలుగు పార్టీలుపోటీ చేశాయనుకోండి. వాటిని అ ఆ ఇ ఈ అనుకుందాం. శాసనసభలో 100 సీట్లు ఉన్నాయనుకుందాం. అ కు ఓట్లలో 50 శాతం వచ్చాయనుకోండి. అ పార్టీ 50 మందిని సభ్యులుగా పంపవచ్చు. మిగిలిన 50 లో మూడుపార్టీలు 30 15 5 నిష్పత్తిలో సంపాదించాయనుకోండి. 30, 15, 5 సభ్యులను పంపించవచ్చు. అంటే, ఓట్ల నిష్పత్తిని బట్టి సభలలో గల సభ్యుల నిష్పత్తి సంఖ్యలో సభ్యులను పంపవచ్చునన్న మాట."

"అంటే, ఇక పార్టీ మారే అవకాశం లేదన్నమాట."

"పార్టీ మారితే సభ్యత్వం కోల్పోతాడు. అతని ప్రవర్తనకు, నీతి నియమాలకు పార్టీలే బాధ్యత వహించాలి. ఒక సభ్యుని తొలగించడానికి, మళ్ళీ నియమించడానికి పార్టీకి హక్కుటుంది. ఒక వ్యక్తి నియమితకాలం సభ్యుడుగా కొనసాగాలంటే సత్ప్రవర్తన, ప్రజాసేవ విషయంలో కొంత రికార్డు అవసరం."

"బావుందండీ, చాలా బావుంది. పార్టీలూ వున్నాయి. ఎన్నికలూ ఉన్నాయి. సభ్యులూ ఉన్నారు. శాసనసభలూ ఉన్నాయి. పద్ధతి మారే వరకు ఎంతమార్పు! మీరు చెప్పింది నిజం. పద్ధతి మారితే మనిషి స్వతస్సిద్ధంగా మారతాడు. అవునుగానీ మీకీ ఆలోచన ఎలా వచ్చింది?"

"ఆశయంవుంటే ఆలోచన దానంతట అదే వస్తుంది. సదాశయం సాధించని దంటూ లేదు. మహాత్ముని ది సదాశయం కావడంవల్లనే సాధించాడు. బుద్ధుడు,

జీసస్, లెనిన్ – వీరందరూ అలాంటివారే. సదాశయంతో సాధించినవారే."

"మీ పద్ధతి నాకు నచ్చిందండీ – ద్వేషం అనేది కన్పించడం లేదు."

"అలా అనబోకండి, మేమూ ద్వేషిస్తాం. కాని, వ్యక్తుల్ని కాదు – పేదరికాన్ని, అవిద్యను, దౌర్జన్యాన్ని, అన్యాయాన్ని, అక్రమాన్ని ద్వేషిస్తాం. మేమొక మహోద్యమం నడిపిస్తున్నాం. పెద్ద పోరాటం కొనసాగిస్తున్నాం. వాటిని ఓడిస్తున్న కొద్దీ మాకు సంతోషం. అది మాకు గెలుపు. మాకు గెలుపంటే మానవతకు గెలుపు – మంచికి గెలుపు."

"మీ పోరాటం చూడాలని ఉంది నాకు – చూపిస్తారా – మరి నేను ఖైదీని."

"దానికేం పదండి, మేము మిమ్ములను ఖైదీగా భావించడంలేదు. పదండి వెళ్దాం."

పా.మం, ప్రధాని బయలుదేరారు కారులో – వీధులు అవే – దుకాణాలు అవే. మనుషులూ వారే – కాని, వాతావరణంలో గొప్ప మార్పు కనిపించింది పా.మం.కి. ప్రజలు పూర్వంలా లేరు. వారి ముఖాల్లో ఆనందం కనిపిస్తూంది. ఆశ గోచరిస్తూంది. 'ముఖాలు వికసించివున్నాయి.' వాటిల్లో ఏదో విశ్వాసం కనిపిస్తూంది. భవిష్యత్తును గురించిన వెలుగు కనిపిస్తూంది.

కారు సాగిపోతూంది. ప్రధాని కారుగా కాదు. మామూలు కారుగానే సాగిపోతూంది. లాంఛనాల్లేవు. సాదా మనుషుల్లా సాగిపోతున్నారు ప్రధాని! భారత ప్రధాని!!

కారు ఒకచోట ఆగింది. అక్కడ బ్రహ్మాండమైన కట్టడపు పనికొనసాగుతూంది. యంత్రాలు గిరగిరా తిరుగుతున్నాయి రొదలుపెడుతూ. అధికారులు ఎండలో నుంచొని పర్యవేక్షిస్తున్నారు. కార్మికులు వందలు వేలు నిరంతరం పనిచేస్తున్నారు. పనిలో అందం వుంది. శ్రమలో ఆనందం వుంది. అక్కడ అందమూ, ఆనందమూ ఉన్నాయి. మనిషి తన బాగుకోసం శ్రమిస్తున్నాడు. తన శ్రమ పరులకోసం కాదని తెలుసుకున్నాడు. తన శ్రమ ఏ ఒక్కరికోసమో కాదని గుర్తించాడు. తాను శ్రమిస్తున్నది శ్రామికుల కోసం. సమాజంలో తనకోసంకాదు – తమ కోసం, ఆ విశ్వాసం శ్రామికునిలో రావాలి. అంతే, అది వచ్చిందా అతడు కొండలను పిండి చేయగలడు. నదులకు కట్టలుకట్టి నిలిపివేయగలడు. పసిడి పంటలు పండించగలడు. పాడితో నేలను తడుపగలడు, చంద్రునిమీద గూడు కట్టగలడు. సూర్యునితో ఊడిగం చేయించుకోగలడు. ఆ శ్రామికునికి ఆ విశ్వాసం వచ్చింది. అతడు సమాజ స్వరూపాన్ని మార్చ సంకల్పించాడు. శ్రామికుడంటే కూలి కాదు – ఇక్కడ అంతా శ్రామికులే! డాక్టర్లు, ఇంజనీర్లు, సైంటిస్టులు, ఉపాధ్యాయులు – అందరూ శ్రామికులే. అంతా శ్రమించేవారే. వారు తమ స్తోమత ననుసరించి శ్రమిస్తారు సమాజం కోసం. సమాజం వారి అవసరాలను తీరుస్తుంది.

ప్రధాని, పా.మం. కారు దిగారు.

"చూచారా? ఇదిగో, ఇక్కడ సాగుతున్నది మురికి పేటలపై యుద్ధం. చూచారా, శ్రామికులు యుద్ధం చేస్తున్నంత ఉత్సాహంగానూ, ఉద్రేకంగానూ పనిచేస్తున్నారు. దేశంలో మురికివాడలు లేకుండా చేసేందుకు జరుగుతున్న మహాయజ్ఞంలో ఇదొక భాగం, రండి చూతాం" అని ప్రధాని సాగిపోతున్నారు. పా.మం. వారిని అనుసరించాడు.

పని వడివడిగా జరిగిపోతూంది. ప్రధాని రాకను ఎవరూ గమనించలేదు. ఒక్క యంత్రం ఆగలేదు. ఒక్కమనిషి పని ఆపలేదు. ఒక్కవ్యక్తి స్వాగతం చెప్పడానికని పని నిలుపలేదు. పా.మం.కు ఇది వింతగా తోచింది. మంత్రిగా తాను ఎక్కడికి వెళ్ళినా ముందు పని ఆపి, తనకు స్వాగతం చెప్పేవారు. అంతేకాదు, ఒకడు ప్రమోషన్ కోసం, ఒకడు బదిలీకోసం, ఒకడు తన ప్రాపకం కోసం నానా గొడవ చేసేవారు. ఇంతైతే తాను మామూలు మంత్రే! ప్రధాని వచ్చాడంటే ఎంత అడావుడి ఉండేది!! ఎంతమార్పు!!! అవును, అన్నీ వ్యవస్థను అంటిపెట్టుకొని ఉంటాయి. వ్యవస్థ కూలితే అన్నీ కూల్తాయి.

ప్రధాని ఒక్కొక్కటే చూపుతూ సాగిపోతున్నాడు, పా.మం. చూస్తూ వెళుతున్నాడు.

ఒక కార్మికుడు కనిపించాడు కాలికి దెబ్బతగిలింది. రక్తం కారుతూంది. అయినా అది లెక్కచేయడంలేదు. సిమెంటు కట్టలు అందిస్తూనే ఉన్నాడు ప్రధాని అది చూచారు. అతని స్థానంలో నుంచొని తట్ట అందుకొన్నారు. కార్మికుడు వారించినా వినలేదు. దెబ్బతగిలిన కార్మికుడు చికిత్సకు వెళ్ళాడు.

ప్రధాని మట్టితట్టలు అందిస్తున్నారు!

పా.మం. చూస్తూ నుంచున్నాడు.

చుట్టూ చూచాడు. ఒక్కడూ వూరికే నుంచోలేదు.

పా.మం. సిగ్గుపడ్డాడు.

పక్కనున్నవాణ్ణి అడిగాడు. "బాబూ! నాకొక తట్ట ఇవ్వు."

పక్కవాడు ఒక తట్ట అందించాడు.

పా.మం. తట్ట అందుకున్నాడు - పక్కవానికి అందించాడు.

తట్టలు సాగిపోతున్నాయి.

## మూడు

రాజధాని రంగులు పులుముకుంది. పండుగ పరిమళం వ్యాపించింది. పచ్చని తోరణాలతో పచ్చపచ్చగా ఉంది. పతాకాలు రెపరెపలాడుతున్నాయి. బాటలమీద కమానులు కట్టారు. కమానులను పూలతో అలంకరించారు రంగురంగుల పూలు, ఎరుపు, గులాబి, తెలుపు, నీలం - పూల రంగులు చెప్పడం కష్టం. నానారంగుల పూలు వింతగా అలంకరించారు. అందంగా ఉంది. సుందరంగా వుంది. శోభాయమానంగా ఉంది.

రాజధాని సాంతం పూలచెట్లలా ఉంది. ఒకచోట పూలు, ఒకచోట మొగ్గలు మరొకచోట కొమ్మలు, వేరొకచోట రెమ్మలు - దూరంనుంచి వెరశి పూలచెట్లలా ఉన్నాయి. పచ్చని ఆకులు, రంగు రంగుల పూలు - కనుల పండువులా ఉంది. అవి కాగితపువ్వులు కావు. అందుకే కళ్ళకు హాయిగా ఉన్నాయి.

రాజధాని ఒకచోట పూలగోడలా ఉంది. ఒకచోట పూలగుట్టలా ఉంది. ఒకచోట పూలరాశిగా వుంది, ఒకచోట పూల కిరీటంలా ఉంది. ఒక చోట పూలపాన్పులా ఉంది. ఒకచోట పూలమేడలా ఉంది. ఒకచోట పూలరథంలా ఉంది. ఒకచోట పూలబావుటాలా ఉంది. ఒకచోట పూలబాలికలా ఉంది.

రాజధాని పూల బాణంలా ఉంది.

పూవిల్లుని అమ్ములా ఉంది.

అందంగా అలంకరించబడింది రాజధాని.

ఆ రోజు బాలల పండుగ – దేశం నలుమూలల నుంచీ పిల్లలు వచ్చేశారు. ఉదయం నుంచీ పిల్లల రద్దీ ఎక్కువగా కనిపిస్తూంది. పెద్దలు కనిపించడంలేదు. రోడ్ల మీద వాహనాల్లేవు. పూల బంతుల్లాంటి పిల్లలు ఆడుతూ, పాడుతూ, కేరింతలు కొడుతూ రోడ్లు నిండిపోయారు.

రబ్బరు బెలూన్లు రంగు రంగులవి ఎగరేశారు. అవి ఆకాశంలో ఎగురుతుంటే నేల మీంచి చప్పట్లు చరుస్తున్నారు.

పిల్లలు:

ఎల్లలు లేనివారు – ఎల్లలు ఎరగనివారు.

పిల్లలు:

కల్లలు లేనివారు. కల్లలు ఎరగనివారు.

పిల్లలతో నిండిన వీధులు ముచ్చటగా ఉన్నాయి.

అన్ని ప్రాంతాలనుంచి వచ్చిన వారున్నారు వారిలో – అయినా ప్రాంతీయ భేదాలు ఎరగనివారు వారు. అన్ని రాష్ట్రాల నుంచి వచ్చిన వారున్నారు అయినా రాష్ట్ర భేదాలు ఎరుగనివారు. అన్ని రంగుల వారున్నారు, అన్ని కులాల వారున్నారు. అన్ని మతాల వారున్నారు.

అందరూ రంగు రంగుల పూలలా ఉన్నారు!

అందరూకలసి పూల మాలల్లా వున్నారు.

పూలు! బాలలు! ఎంత సోయగం! ఎంత శోభ!

నాడు బాలల దినం. అవును బాలల దినమే, మరొకరికి తావులేదక్కడ.

అంతా పిల్లలు!

అన్నీ పూలు!!

ఆ సంబరం చూడ్డానికి వచ్చాడు పా.మం. అతనివెంట జేలు సూపర్నెంటు వచ్చాడు – మహబూబ్. ఆ పిల్లలను, వారి ఆరోగ్యాన్ని, వారి ఆనందాన్నీ చూచి ఆశ్చర్యపోయాడు పా.మం.

వారిలో ఎవరూ పీక్కుపోయిన చెంపలవాళ్లు లేరు, డోక్కుపోయిన కళ్ళవాళ్ళులేరు, జడలు కట్టిన వెంట్రుకలవాళ్ళు లేరు. నెత్తి గోక్కునేవాళ్ళు లేరు. పేలున్న తలలవారు లేరు. చీమిడి కారుతున్న ముక్కులవాళ్ళు లేరు. బానపొట్టలవాళ్ళు లేరు. పుల్లచేతులవారు లేరు. పొరకపుల్లకాళ్ళవాళ్ళు లేరు.

అందరి బుగ్గలూ ఏపిల్ పళ్ళలా ఉన్నాయి. అందరి కళ్ళల్లో తేజస్సుంది. బాల చాపల్యం ఉంది. వెంట్రుకలు చక్కగా అలంకరించి ఉన్నాయి. కత్తిరించిన వెంట్రుకలున్నాయి. పొడవైన జడలున్నాయి. జడల్లో పూలున్నాయి. వెంట్రుకలకు రిబ్బన్లున్నాయి. వారి వదనాల్లో వెలుగుంది. ఆరోగ్యం ఉంది. అంతా నిండుగా వున్నారు. రబ్బరుబొమ్మల్లా ఉన్నారు.

"ఏమిటీ వింత? ఎక్కణ్నుంచి వచ్చారీ పిల్లలు?

"ఏ దేశాలనుంచి పిలిపించారు!" అడిగాడు పా.మం. వీళ్ళంతా భారతీయ బాలలంటే నమ్మకం కలగలేదతనికి, అది సహజం. అతను చూచిన బాలలువేరు.

అయితే, వారిలో యిలాంటివారు లేకపోలేదు. ఉన్నారు. బహుకొద్దిమంది. వారూ పట్నాల్లో – పట్నాల్లోని మేడల్లో – కార్లున్నవాళ్ళ ఇళ్ళల్లో – కాన్వెంటు స్కూళ్ళల్లో – అవి దాటితే భారతదేశంలోని అధిక సంఖ్యాకులు ఎండిపోయిన ముఖాలు, బాన పొట్టలు, పొరకపుల్లల్లాంటి కాళ్ళు, చేతులు గలవాళ్ళే! అందుకే అతడు నమ్మలేకపోయాడు. అందుకే అలాంటి ప్రశ్నలు వేశాడు.

వెంటవున్న జైలుసూపర్నెంటు మహబూబ్ జైలువైపు నడుస్తూనే అన్నాడు:

"వీళ్ళంతా భారతీయులే. మీ భారతదేశానికీ ఈ భారతదేశానికీ ఎంతో భేదం ఉంది. ఇది సమాజ భారతం. మీది వైయక్తిక భారతం, అందువల్ల అనేక మార్పులు వచ్చాయి. వాటిని మీరు అర్థం చేసుకోవాలి."

"అంటే"?

"పిల్లల బాధ్యత తల్లిదండ్రులకు మాత్రం అప్పగించారు మీరు. పిల్లలు వారి తల్లిదండ్రులనుబట్టి పెరిగారు. ఇప్పుడలాకాదు. పిల్లల పోషణ బాధ్యత సమాజం వహిస్తుంది. అంటే, ప్రభుత్వం వహిస్తుంది. పిల్లల ఆరోగ్యం, వారి విద్య అందుకు సంబంధించిన పూర్తిబాధ్యత ప్రభుత్వం వహిస్తూంది."

"అర్థమైంది. తల్లి నుండి పిల్లలను వేరు చేస్తున్నారు. తల్లి తండ్రులకు పిల్లలకు మధ్యనుండే ప్రేమను మసి చేస్తున్నారు. అనుబంధాల్ని, అనురాగాల్ని కాల్చివేస్తున్నారు. పిల్లలను యంత్రంలా ప్రభుత్వం పోషిస్తూంది. వారికి తల్లితండ్రుల ప్రేమ తెలియకుండా చేస్తున్నారు. అంతేనా?"

మహబూబ్ పా.మం. ముఖంలోకి చూచాడు. కళ్ళు ఎర్రవారేయి ముఖం జేవురించింది. పెదవి ఇంకా అదురుతూనే ఉంది. అర్థం చేసుకున్నాడు. మాట్లాడలేదు. మౌనంగా నడక సాగించాడు. పా.మం. సహితం పలుకలేదు. అతనికి తానన్నది నిజమనే భావన ఏర్పడింది. కొంత విజయగర్వంకూడా పొడసూపింది. కాస్త ఠీవిగా నడిచాడు మహబూబ్ వెంట. ఇద్దరూ జేలుకు చేరుకున్నారు మహబూబ్ ఆఫీసులోనే కూర్చున్నారు. మహబూబ్ తానొక సిగరెట్టు తీసుకొని పా.మం.కి ఒకటిచ్చి, వెలిగించి, వెలిగించుకొన్నాడు. మహబూబ్ సిగరెట్టుపొగ గట్టిగా వదిలాడు. ఆ పొగ వదిలిన పద్ధతిచూచి పా.మం. గర్వం జారిపోయింది. పా.మం. మహబూబ్‌ను చూస్తూ కూర్చున్నాడు – ఏదో గంభీరం అయిన సమాధానంకోసం మహబూబ్ తీక్షణంగా ఒక చూపు విసరి ప్రారంభించాడు:

"పా.మం.గారూ! మీరు తల్లీ పిల్లలను కలిపి ఉంచితే మేమేనా విడదీస్తున్నది? కాస్త ఆలోచించి మాట్లాడండి. మీకు ద్వేషం తప్ప మరొకటి లేదు. కాబట్టి వాస్తవాల్ను గ్రహించలేక పోతున్నారు. తిండికి లేక తల్లితండ్రులు బిడ్డల్ని అమ్ముకోవడం కలిపి ఉంచడమే నంటారా? దరిద్రం భరించలేక బిడ్డలకు విషంపెట్టి తాను విషం తిని తల్లిచస్తే అది వారిని కలిపివుంచడం అవుతుందా? వచ్చేది చాలక, బిడ్డల్ని పోషించలేక తల్లితండ్రులు వారి బిడ్డల్ను బూట్ పాలిష్ చేయడానికి, బటాణీలు అమ్మడానికి, బిచ్చం ఎత్తుకోవడానికి పంపితే కలిపివుంచడం అవుతుందా? చదువులేక, సంస్కారం అబ్బక, వెర్రితలలు వేసిన నాగరికత విషపు కోరలకు లొంగి, బాల్యంలో జేబులుకొట్టి, పెద్దవారయి, హంతకులయి, సమాజానికి భారం కావడం ప్రేమతో పెంచడమా? అనురాగాన్ని అధికం చేయడమా? అనుబంధానికి మొగ్గలు తొడిగించడమా?

"ఏ తండ్రిగాని, తల్లిగాని తన కొడుకుగాని, కూతురుగాని చెడిపోవాలనుకుంటారా? తమ పిల్లలు పెరిగి పెద్దవారయి, బుద్ధిమంతులయి, ధనవంతులయి, అధికారం గలవారు కావాలని అనుకోని వారుంటారా? పరిస్థితులకు లొంగి, చదివించలేక, వారి మానసిక శారీరక ఆరోగ్యాలను సరిగా చూడలేని హీనస్థితిలో వుండి, బిడ్డలు దొంగలై, నీచులై, దుర్మార్గులై, పడపుకత్తెలై వీధులుపడుతుంటే, వారిని చూచిన తల్లితండ్రుల మనసులు ఎంత కృంగి కృశిస్తాయో ఎన్నడయినా ఆలోచించారా? అలా కాకుండా ఉండడానికి మీరు చేసిన ఏర్పాట్లేమి? ఇవేనా మీరు అనురాగాలు, అనుబంధాలు పెరగడానికి చేసిన ఏర్పాట్లు? మాట్లాడరేం? మౌనంగా కూర్చున్నారేం? పలకండి, సమాధానం చెప్పండి."

పా.మం. పలకలేదు. ఏదో ఆలోచనలో పడిపోయాడు. మహబూబ్ చెప్పినవన్నీ నిజమే – కాని, ఇవన్నీ తాము కావాలని చేశారా? వీటన్నింటికీ బాధ్యత తమదేనా? ఇవ్వాళ తాను చూచిన పిల్లలకీ, తాను పూర్వంచూచినవారికీ ఎంత వ్యత్యాసం ఉంది? తాము చేసిన లోపం ఎక్కడ?

"మేము కావాలని ఇవన్నీ చేశామంటారా?" పా.మం. ధ్వనిలో ఓటమి కనిపిస్తూంది. అయినా తాను వాటన్నింటికీ బాధ్యుణ్ణికాననే భావం ఎక్కడో ద్యోతకం అవుతూంది.

"క్షమించండి" – సిగరెట్టుముక్క యాష్ట్రేలో నలిపి అన్నాడు మహబూబ్. "మీ మనసు నొప్పించానేమో – కాస్త తీవ్రంగా మాట్లాడినట్లున్నాను. నన్ను మీరు ఎన్ని అన్నా అంతకోపం వచ్చేదికాదు – మా సిద్ధాంతాన్ని – మా విధానాన్ని అనేవరకు కొంత ఉద్రిక్తత వచ్చింది."

"మనిషికంటే సిద్ధాంతం ఘనమా?"

"అవును. ఒక సిద్ధాంతంవల్ల, ఒక జీవన విధానంవల్ల, ఒక క్రమ జీవనంవల్ల మానవుడు ఈ రోజు ఈ దశకు వచ్చాడు. మానవుడు పశుదశలో ఉండిన కాలం లేకపోలేదు. అతడు క్రమక్రమంగా ఈ దశకు వచ్చాడు. ఇప్పుడు మేము నమ్మిన సిద్ధాంతం అమలు పరుస్తున్నదీ ఇవ్వాళిటికీ ప్రపంచంలో తెలిసిన సిద్ధాంతాలన్నింటిలో మిన్న. దీనివల్లనే మనిషిని మనిషిగా చూడగలుగుతున్నాం – అతనికి ఉండే ఆస్తి పాస్తులనుబట్టికాదు. మనిషిని మనిషిగా చూసే ఈ వ్యవస్థపైనే దాడి జరిగితే సహించలేం. ఇప్పుడు మేం ఎంతగా మెత్తగా కనిపిస్తున్నామో అంత కర్కశం అవుతాం. ప్రాణాలొడ్డి అయినా ఈ వ్యవస్థను రక్షించుకుంటాం. మా ప్రాణాలు ఈ వ్యవస్థకు పెనవేసుకొని ఉన్నాయి."

పా.మం. అయోమయంలో పడ్డాడు. సిద్ధాంతాన్ని గురించి అతడు ఎన్నడూ ఆలోచించలేదు. అతనికి తెలిసిన సిద్ధాంతమల్లా ఏదో రకంగా పదవికి రావడం – వచ్చిం తరువాత దాన్ని దక్కించుకోవటానికి తన చుట్టూ చేరినవారికి ఏదోరకంగా సహాయం చేయడం, ఆ తరువాత తనకు అవసరమైన హంగులు ఏర్పరచుకోవడం–తన సంతానానికి తరాల తరబడి తరగని ఆస్తి సంతరించుకోవటం, ఒక ప్రభుత్వోద్యోగి సిద్ధాంతంమీద ఈగవాలనివ్వకపోవటం మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను చూచిన ప్రభుత్వోద్యోగులు అతన్నీ అతని ప్రభుత్వాన్నీ తూర్పారబట్టేవారు. అంతేకాదు, చాలమంది డబ్బుకోసం ఏ పని చేయాలన్నా చేసేవాళ్లు. ఈ మార్పు మంచిదనే

అనిపించింది పా.మం.కి. అయినా, అంగీకరించడానికి మనసొప్పలేదు. "ఈ సిద్ధాంతాలు నాకు అర్థం అయ్యేవి కావు. మనం చూసిన పాలబుగ్గల పసిపాపలు నాకెంతో బాగనిపించారు. వారిని చూస్తే ముచ్చటగా వుంది. వారి విషయంలో మీ ప్రభుత్వం ఏం చేసింది? చేస్తున్నది చెప్పారుకారు." మరో సిగరెట్టు వెలిగించి ధీమాగా అడిగాడు పా.మం. అతడు మహబూబుకు సిగరెట్టు అందివ్వలేదు.

మహబూబు చిరునవ్వు నవ్వాడు. తానూ సిగరెట్టు వెలిగించుకున్నాడు. స్థిరంగా కూర్చొని ప్రారంభించాడు, కాఫీకోసం ఆర్డరిచ్చి.

"వినండి. ముందు ఒక విషయం గమనించండి, కొందరు వ్యక్తుల సముదాయమే సమాజం, ఈ సమాజంకోసం, సమాజ నిర్మాణకోసం వ్యక్తులు తమ స్వేచ్ఛను కొంత సమాజానికి అప్పగించారు. సమాజం వ్యక్తికంటే బలీయం అయింది. వ్యక్తి గడ్డిపోచకాగా, సమాజం వాటితో పేనిన తాడు. గడ్డిపోచ ఏమీచేయలేదు. గడ్డితో పేనిన తాటితో ఏనుగును కట్టివేయగలం. వ్యక్తి నీటిబిందువు కాగా సమాజం మహాతటాకం నీటి బిందువు ఏమీచేయలేదు. మహాతటాకం నేలను సస్యశ్యామలం. చేయగలదు. వ్యక్తి నూలుపోగు కాగా, సమాజం నూలుతోనేసిన బట్ట. నూలు ఒంటరిగా ఏమీచేయలేదు. బట్ట మానం రక్షించగలదు. సమ్మానం కలిగించ గలదు. కాబట్టి వ్యక్తికంటే సమాజం ముఖ్యమైంది. విలక్షణమైంది. ప్రధానం అయింది. ప్రాణప్రదం అయింది-ఉన్నతం అయింది-ఉత్తమం అయింది. కాబట్టి దాని పరిరక్షణకు వ్యక్తి సౌకర్యాలను, సౌలభ్యాలను వదలుకోవాలి."

"అంటే, సమాజంకోసం వ్యక్తి బలికావాలన్నమాట?"

"కాదు. అన్ని విషయాల్లోనూ వ్యక్తికంటే సమాజానికి ప్రాధాన్యత ఇవ్వడం అవసరం. ఇది ఈనాటిది కాదు - భారతీయ శాస్త్రాలూ, సంప్రదాయాలూ దీనినే ప్రతిపాదించాయి, బలపరచాయి, అమలుపరచాయి.

'త్యజేదేకం కులస్యార్థే కులం జనపదస్యార్థే' అన్నాడు మనువు. కులంకోసం వ్యక్తిని, జనపదంకోసం కులాన్ని వదులుకొమ్మంటున్నాడు. అంటే, ఒక ఉన్నత లక్ష్యంకోసం అధమ లక్ష్యాన్ని వదులుకొమ్మంటున్నాడు. ఇక వేదం ఏమి చెపుతూవుందో చూడండి:

ఓం సహనావవతు సహనౌభునక్తు

సహవీర్యం కరవావహై -

మేము కలిసి మెలిసి రక్షించుకొందుముగాక, కలిసి మెలిసి అనుభవింతుముగాక!

"భారతీయ సంస్కృతికీ, సంప్రదాయానికీ వైయక్తిక జీవనం విరుద్ధం. 'సంఘం శరణం గచ్ఛామి' అని ప్రవచించాడు బుద్ధుడు. సామాజిక ప్రాధాన్యాన్ని గురించి తొలుత గుర్తించిన మహామహుడు బుద్ధుడు. మనం అనూచానంగా అనాదిగా సమాజానికే ప్రాధాన్యత ఇస్తూ వచ్చాం. ఇప్పుడు మాకు సమాజం ప్రధానం. సమాజం విలక్షణం. సమాజం ఉత్తమం."

"నేనడిగింది పిల్లల పోషణను గురించి."

"అది అర్థం చేసుకోడానికి ఈ విషయాలు తెలుసుకోవడం అవసరం. ఇక వినండి."

ఇంతలో కాఫీ వచ్చింది. ఉభయులూ కాఫీ తాగుతున్నారు. కాని, ఉభయుల మనస్సుల్లోనూ ఏదో ఆతురత ఉంది. చెప్పి ఒప్పించాలని ఒకరికి - ఏదో వినాలని, తెలుసుకోవాలని మరొకరికి.

"అయితే" అడిగాడు పా.మం. – కాఫీ కప్పు బల్లమీదపెడ్తూ తానొక సిగరెట్టు వెలిగించుకొని మహబూబ్ పా.మం.కి ఒకటి యిచ్చి ముట్టించాడు.

"ఇవ్వాళ్ళి పాపలే రేపటి పౌరులు. అంతేకాదు, వారే రేపటి ప్రభువులు. శాస్త్రజ్ఞులు, కవులు, కళాకారులు, అసలు రేపు వారిది. భవిష్యత్తు వారిది. భావిభారతం వారిది. అలాంటివారు నీరసంగా పెరుగుతే భవిష్యత్తు నీరసం. వారు అనారోగ్యులయితే భవిష్యత్తు అనారోగ్యం. వారు అవిద్యావంతులయితే భవిష్యత్తు అవిద్యాపూరితం – ఏమంటారు?

పొంగిపోయాడు పా.మం. "అబ్బ, ఎంత ఆలోచించారండీ! ఎంతటి నిశిత పరిశీలనండీ! ఇవన్నీ మేం వాస్తవంగా గమనించలేదు. ఆ అయితే చెప్పండి!"

"భవిష్యత్తును ఉజ్వలం చేయాలని పాపల పోషణ బాధ్యత పూర్తిగా ప్రభుత్వం తీసుకొంది."

"అంటే–"

"ఒక స్త్రీ గర్భవతి అయినప్పట్నుంచి ప్రభుత్వం ఆమెను గురించి శ్రద్ధ వహించడం ప్రారంభిస్తుంది. గర్భవతిని తప్పనిసరిగా నియమిత వ్యవధుల్లో వైద్యులకు చూపించాలి. ఆమె తప్పనిసరిగా ప్రభుత్వ ప్రసూతిశాలలో ప్రసవించాలి. అక్కడ నియమితకాలం ఉండాలి. ఆ తరువాత ఇంటికి వెళ్ళిం తరువాత ఆ బిడ్డ పోషణకు అవసరమయ్యే సామగ్రి సాంతం ప్రభుత్వం భరిస్తుంది. పాపను నియమితకాలంలో శిశు రక్షణ కేంద్రపు వైద్యులకు చూపించాలి. అవసరం అయిన ఆహారమూ, వైద్యమూ ప్రభుత్వమే సమకూరుస్తుంది. ఈ సరఫరా చేయడంలో విచక్షణ లేదు. దేశంలో ఏ మూలనున్న ఏ ప్రాణికైనా అందుతుంది. మారుమూల పల్లెల్లోనూ, పెద్ద పెద్ద పట్టణాల్లోనూ, సర్వత్రా ఈ సౌకర్యాలు లభిస్తాయి. వయసునుబట్టి వారి పోషణకు ఎలాంటి పదార్థాలు అవసరమో నిర్ణయించడానికి నిరంతరం పరిశోధన సాగుతుంది. ఆహార, విహారాల్లో పరిశోధనల ఫలితాన్నిబట్టి మార్పులు ఆసేతు హిమాచల పర్యంతం జరుగుతుంటాయి. అవసరమయినవన్నీ ప్రభుత్వం సమకూరుస్తుంది. తల్లిదండ్రులు చేయవలసిందల్లా వాటిని సక్రమంగా వినియోగించి, బిడ్డ ఆరోగ్యంగా పెరుగుతుంటే చూచి ఆనందించడం మాత్రమే."

"అయితే, బిడ్డ తల్లితండ్రుల దగ్గరే ఉంటారు, విడదీయడం అనేది లేదంటారు."

"నేను ముందే చెప్పాను. ప్రేమ పెంచడం మా ధ్యేయం, తుంచడం కాదు. పనికిపోయే తల్లులు ఉంటే – వారు పనిలోకి వెళ్ళేటప్పుడు ఉంచి వెళ్ళడానికి శిశురక్షణాలయాలు ఉన్నాయి. వాటిని సుశిక్షితులైన నర్సులు నిర్వహిస్తుంటారు. పని చేస్తున్నంతసేపూ తల్లులకు బిడ్డల విషయంలో ధ్యాస అవసరం లేదు. పని గంటలు అయిపోయిం తరువాత బిడ్డను తీసుకొని ఇంటికి వెళ్ళిపోవచ్చు."

"చదువు విషయం..."

"బిడ్డ, చదువు ఈడుకు రాగానే తప్పనిసరిగా స్కూలుకి పంపాల్సి ఉంటుంది. చదువు ఉచితం. పుస్తకాలు సహితంగా పూర్తి ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. చదువు భారం తల్లిదండ్రుల మీద బొత్తిగా లేదు. బిడ్డ చదువు కొంతదూరం సాగిం తరవాత బిడ్డ అభిరుచినిబట్టి విద్యా విషయం నిర్ణయించబడుతుంది. ఆ తరువాత వారు ఎంత పైచదువులు చదివినా ఉచితమే."

"ఏమి! ... ఉచితం? ... ఉచితమా! ... చదువు ఫ్రీ ... చదువే ... ఎంత చదివినా? నష్టం – నష్టంకాదూ ప్రభుత్వానికి! అబ్బ ఎంత ఖర్చు! ... ఎంత నష్టం?"

నవ్వాడు మహబూబ్. "నష్టం – లాభం వీటికి మీ నిర్వచనం వేరు, మా పద్ధతి వేరు. డబ్బు కొలమానంలో లాభనష్టాలు మీవి. అంటే, పదిమందికి బదులు అయిదుగురుకి చదువు ఏర్పాటు చేస్తే మిగిలిన ఐదుగురి డబ్బూ మీకు లాభం. పదిమంది చేసేపని అయిదుగురుతో చేయించి, అయిదుగురి డబ్బు మిగుల్చుకోవడం మీకు లాభం. అవిద్య పెంచడం, అనారోగ్యం పెంచడం, నిరుద్యోగం పెంచడం, తద్వారా మిగిలింది మీకు లాభం – విన్నారా!"

"మరి మీకు?"

"వినండి. మాకు లాభ నష్టాల కొలమానం డబ్బు కాదు. మానవ సంక్షేమం, విద్యావంతులైన పౌరులు మాకు లాభం. ఆరోగ్యవంతులైన ప్రజలు మాకు లాభం. ఆనందకరమైన జనం మాకు లాభం, పసిడి నవ్వులు నవ్వే పాపలు మాకు లాభం, వలపునవ్వుల యువతి మాకు లాభం, నిశ్చింతగా నవ్వుకునే వృద్ధులు మాకు లాభం. మనుషుల మనసుల్లో ఆనందాల పూలు పూయించడం మాకు లాభం. పాపలను చూచారుగా – వారెంత ఆనందంగా ఉన్నారు! ఎంత ఉల్లాసంగా ఉన్నారు! వారిని చూచి మీకు ఎంత ఆనందం కలిగింది!"

"అవును మహబూబ్ సాబ్, అవును. పూలబంతుల్లాంటి ఆ పాపల్ని చూస్తుంటే నా మనసు గంతులు వేసింది. బాలల విషయంలో మీరు ఇంత శ్రద్ధ తీసుకోవడం వల్లనే వారలా ఉన్నారు. లాభనష్టాల విషయం కూడా నాకెంతో నచ్చింది. ప్రజలు ఆకలితో, రోగాలతో, అవిద్యతో అలమటిస్తున్నప్పుడు బ్యాంకుల్లో డబ్బు మూల్గి ఏం ప్రయోజనం? మీరన్నది నిజం– దేశానికి సౌభాగ్యం ప్రజలు కాని, ధనం కాదు. ఒక దేశప్రజల ఆరోగ్య సౌభాగ్యాల్ని బట్టి ఆ దేశపుసంపదను లెక్కవేయాలి. డబ్బునుబట్టి కాదు. ఆరోగ్యవంతులైన ప్రజలే నిజమైన సంపద..."

"ఏమంటాను? ఏమీ అనను. నాకు నమాజుకు సమయం అయింది. సాయంకాలం బాలల ఊరేగింపు ఉంది, వస్తారా?"

"సరే వస్తాగాని, మీకు నమాజేమిటి? మీకు మతాలున్నాయా?"

"తరువాత మాట్లాడుకుందాం. సాయంకాలం వస్తారుగా" అని వెళ్ళిపోయాడు మహబూబ్.

సాయంకాలం...

పా.మం, మహబూబ్ ఇద్దరూ బాలల ఊరేగింపు చూడ్డానికి వెళ్ళారు.

బాల బాలికలు బారులు తీరారు. ఒక్కొక్క దళం ఒక్కొక్క రంగుదుస్తుల్లో ఉన్నారు. పావురం లాంటి తెలుపు, చిలకలాంటి పచ్చ, పాలపిట్టలాంటి నీలం – ఒకటేమిటి, అనేక రంగులు పరచినట్లుంది. రోడ్డు రంగు రంగుల సంద్రాలు పొంగుతున్నట్లుంది. ఇంద్రధనుస్సు నేలన పరచినట్లుంది. రకరకాల చేలు ఊగుతున్నట్లుంది.

తెల్ల దుస్తుల దళం ముందుంది. దాని దగ్గర బ్యాండు వాద్యం ఉంది. అది బ్యాండు వాద్యం మోగించింది.

"ధన్ ధన్ ధన్" ధ్వని

అడుగులు లేచిపడుతున్నాయి

వేల అడుగులు – పసి అడుగులు
క్రమబద్ధంగా పడుతున్నాయి
లయబద్ధంగా సాగుతున్నాయి
ఊరేగింపు కదిలింది
పాటలు వినిపిస్తున్నాయి–
"బాలలం – పసిబాలలం
ప్రపంచమంతా వ్యాపిస్తాం
శాంతి సుమాలను పూయిస్తాం"

పాటల ఊరేగింపు సాగిపోతూంది. పసిబాలల ప్రవాహం పారుకొంటూ పోతూంది.

ఆటల ప్రవాహం సాగింది.

బాలల ఆటలు – రకరకాల ఆటలు?

జానపద నృత్యాలు – దేశంలో అన్ని మూలల నృత్యాలు – అన్ని భాషల పాటలు – అన్ని వేషాల ఆటలు – అందరూ బాలలు – అందరూ భారతీయులు – భారతీయ బాలలు – భారతీయ నృత్యాలు – భారతీయ గీతాలు – బాలలు – భారత బాలలు – వాద్యాలు రకరకాలు – అన్ని భారతీయాలు. అనేకరకాల పూలు – ఒకే మాలలో, అనేక తీరుల నీరు ఒకే నదిలో.

బాలల వూరేగింపు
ఊరేగింపు సాగుతూంది
ఎంత పొడవో!
ఎంత దూరమో!
మైళ్ళకొద్ది సాగుతూంది
గంటల తరబడి సాగుతూంది.

పా.మం. ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతడు ఏకాగ్రంగా చూస్తున్నాడు. తన్మయుడై చూస్తున్నాడు. విచిత్రంగా చూస్తున్నాడు. వింతగా చూస్తున్నాడు.

ఊరేగింపు నిలిచింది.

రంగురంగుల దుస్తుల్లో బాలలు నిలిచారు. రకరకాల పూల మొక్కల్లా ఉన్నారు. వారందరి చేతుల్లోనూ పావురాళ్ళున్నాయి.

తెల్లని పావురాళ్ళు రెండు చేతుల్లో పట్టుకున్న బాలలు!
పల్లలు
పావురాళ్ళు!!
వాద్యాలు మంద్రస్థాయిని మ్రోగేయి.
శాంతిగీతం వినిపించింది.
వేల పసిగొంతులు – ఒకేపాట – శాంతిగీతం.
గీతం ముగిసింది.
పాపల చేతుల్లోని పావురాలు వదలబడ్డాయి.

"రెప, రెప – రెప, రెప – రెప, రెప – రెప, రెప – రెప" పావురాలు ఆకాశంలోకి ఎగిరాయి.

ఆకాశం పావురాళ్ళతో నిండిపోయింది.

పా.మం. చూచాడు.

ఉత్సాహంతో పొంగిపోయాడు.

చప్పట్లు చరిచాడు - పక్కనేవున్న మహబూబ్ వీపు చరిచాడు.

చూస్తే పిల్లలూ చప్పట్లు కొడుతున్నారు. ఆకాశంవైపు చూస్తున్నారు.

"అద్భుతం" అన్నాడు పా.మం.

మహబూబ్‌తో బయల్దేరాడు పా.మం. ఇద్దరూ సిగరెట్లు వెలిగించుకుని తాపీగా సాగిపోతున్నారు.

"మహబూబ్‌సాబ్! మీరేమన్నా అనండి, ఇంత తిండీ గుడ్డావుంటే చాలదండీ మనిషికి. మనిషికి ఒక ఆత్మ అనేది ఉంది చూడండి - దానికింత ఆధ్యాత్మికచింతన అవసరం. మతాల్ను దేవుడు సృష్టించాడు. మీరు మైనారిటీలో వున్నారు. మీకు మేం అనేక హక్కులు కల్పించామనే విషయం మీరూ ఎరుగుదురు. ఎంతయినా రెండు మతాలవాళ్ళూ కలిసి మెలిసి ఉండడం అసంభవ మండీ, ఏమంటారు? మిమ్మల్ని ఈ ప్రభుత్వం మైనారిటీగా గుర్తిస్తుందా? మీరు మనస్ఫూర్తిగా చెప్పండి - మీకు మేం కల్పించినన్ని అవకాశాలు కల్పించారా వీరు?"

"అయ్యా, దృక్పథాలు మారినప్పుడు దృక్కోణం మారుతుంది. మీరు పాత కొలబద్దతో కొలవాలని ప్రయత్నిస్తున్నారు. మతాలకు సంబంధించినంతవరకు మీ విధానమే యిప్పటికీ అమల్లో ఉంది. అయితే, చిత్తశుద్ధితో అమలు పరచబడుతూంది. రాండి, ఈ పార్కులో కూర్చుందాం. చల్లగా ఉంది. హాయిగా మాట్లాడుకోవచ్చు" అని మహబూబ్ పక్కనే ఉన్న పార్కులోకి దోవ తీశాడు. పా.మం. అనుసరించాడు. ఇద్దరూ పచ్చ గడ్డిమీద కూర్చున్నారు.

వాతావరణం శాంతంగా ఉంది. చల్లని గాలి వీస్తుంది. పక్కనున్న పూలమొక్కల నుంచి మెల్లని సువాసన వస్తూంది. చీకట్లో కమ్ముకున్న లైట్ల వెలుగుంది. ఆకాశంలో చుక్కలు మిలమిల మంటున్నాయి. పార్కులో పడుచు జంటలు ముచ్చట్లు పెట్టుకుంటున్నారు. వేరు వేరుగా కూర్చొని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటున్న పరువపు జంటలు పార్కు మొత్తానికే పరువం తెచ్చి పెట్టాయి. చూడ్డానికి అది ప్రమోదోద్యానంలా ఉంది.

ఆ వాతావరణాన్ని చూచాడు పా.మం.-ఏదో అడగాలనుకున్నాడు-కాని మింగేశాడు.

"వినండి." ప్రారంభించాడు మహబూబ్. "లౌకిక రాజ్యం అనే నినాదం మీరు లేవదీసిందేకదా! అదే యిప్పటి ప్రభుత్వ విధానంకూడా. మతం వ్యక్తికి సంబంధించింది-విశ్వాసానికి సంబంధించింది. విశ్వాసానికి సంకెళ్ళు సాధ్యపడవు. మతాన్ని నమ్మేవాళ్ళను వద్దనడంలేదు. నమ్మనివాళ్ళను నమ్మమనడంలేదు. గుళ్ళు, మసీదులు, చర్చిలు యధాతథంగా ఉన్నాయి. వాటిల్లో ప్రార్థనలు జరుగుతూనే ఉన్నాయి."

"అంటే, మైనారిటీలకు హక్కుల్లేనట్లేగా?"

"ప్రభుత్వం మతాలనే గుర్తించనప్పుడు మతపరంగా మైనారిటీ, మెజారిటీలెలా ఉంటాయి? అసలు ఈ మైనారిటీ, మెజారిటీ పదాలు మనను నిరంతరం బానిసలుగా ఉంచడానికి సామ్రాజ్యవాదులు సృష్టించిన పిడి పదాలు, బానిసత్వం పోయినా బానిస పదాల్ని మరచిపోలేదు మనం.

"ఇంగ్లీషువారు భారతదేశాన్ని పాలించేప్పుడు ప్రజలను చీల్చడానికి మతాలను

వాడుకున్నారు. ఒక మతంవారు మరో మతంమీద దౌర్జన్యం చేయడానికి పురికొల్పారు. తరువాత వారు దౌర్జన్యం చేశారని వీరిమీదికి ఉసిగొల్పారు. ఉభయ మతాలవారికి చిచ్చుపెట్టి తుదకు భారతదేశాన్ని చీల్చి వెళ్ళిపోయారు. వారు వెళ్ళిపోయినా వారి జిత్తుల్ని తెలుసుకోలేకపోయాం. ఇప్పుడు వాస్తవం గుర్తించడం జరిగింది. మానవులంతా సమానులు– మతపరంగా గాని, మరే విధంగా గాని అసమానతలు సృష్టించడానికి వీల్లేదు. ఇక్కడ అంతా సమానులే. మైనారిటీ, మెజారిటీలు లేవు."

"అంటే, మతాన్ని మసిచేసినట్లేగా?"

"మతాన్ని కాదు – మూఢ నమ్మకాల్ను నశింపచేశారు. అంధ విశ్వాసాలను కూల్చివేశారు. సామాజికంగా – సామూహికంగా మతానికి ప్రయోజనం లేదు. మతం ఉద్ధరించిన అధునిక సమాజం ఉందా! మతం పేరుమీద ఏర్పడ్డ రాజ్యాల్లో ప్రజలు పోరాటాలు జరపడంలేదా? మతం అన్నింటిని పరిష్కరించగలదంటే, మతరాజ్యాల్లో ఆకలి, దారిద్ర్యం, హింస, క్రౌర్యం ఎందుకున్నాయి? మతం స్వార్థపరుల చేతుల్లో చిక్కి, వారికి బానిస అయిపోయింది. ప్రజలను అజ్ఞానులుగా వుంచడానికి మతం ఉపకరిస్తోంది. మత్తుజల్లి ప్రజల రక్తం ప్రవహింప జేయడానికి మతం పనికివస్తుంది. ప్రజలలో గుడ్డినమ్మకాలు వ్యాపింపచేసి ప్రజలను దోచుకోవడానికి వినియోగపడుతుంది. మీరనుకునే మతం అలాంటిదే. అయితే, అది నశించింది. మతం ప్రజల మనసుల్లో వెలిగే జ్యోతి అనుకుంటే అది ఆరిపోలేదు, వెలుగుతూంది."

"అయితే, మతంతో మనకు పనిలేదంటారు?"

"అయ్యా! ప్రతిదాన్ని కాస్త సాకల్యంగా పరిశీలించాలి. నిన్నటి అమృతం యివ్వాళ్టి విషం కావచ్చు. నిన్నటి విషం నేటి అమృతం అయినా కావచ్చు. మానవుని పరిణామంలో అనేక దశలున్నాయి. వాటిల్లో మతం ఒకటి. మతం సమాజంమీద ఎంతో ప్రభావం వేసి సమాజానికి ఉపకారం చేసి ఉండవచ్చు. కాని, ఆ దశ చెల్లిపోయింది. మన ప్రగతిలో రాతి పనిముట్లు, పాకుడు జంతువులు, ఎద్దులబండ్లు ఎంతో ఉపకరించాయి. కాని, ఈ రాకెట్టు యుగంలో వాటిని పట్టుకొని వేళ్ళాడ్డం వెర్రివారి పని.

"ఒకప్పుడు మానవుడు పాశవిక దశలో ఉండేవాడు, అప్పుడు బలంగలవాడే రాజ్యం ఏలాడు. బలహీనుడు బతకటం దుర్భరం అయింది. అవిర్భవించింది మతం. పాలకులకు నీతి బోధించింది. పాపపుణ్యాలను సృష్టించింది. బలవంతునికి పాపభీతి కలిగించింది. తద్వారా బలహీనుణ్ణి ఆదుకుంది. అప్పుడు జనం మతాన్ని మన్నించింది.

"మంచి ఎందులోనూ కలకాలం నిలవదు. స్వార్థపరులు దాన్ని తమదిగా చేసుకొని పెత్తనం చలాయిస్తున్నారు. అలాగే మతాధికారులు గుత్తాధికారు లయినారు. రాజులను శాసించాలనుకుంది మతం. మతాన్ని గుప్పెట్లో పెట్టుకోవాలనుకున్నారు రాజులు. ఉభయులకూ మనస్పర్థలు వచ్చాయి. యుద్ధాలవరకు వచ్చింది. ఉభయులూ ప్రజలను ఉసికొల్పి తమ ప్రజలకోసం రక్తం ప్రవహింపచేశారు. అలా ఉభయులూ ప్రజలకు దూరమైనారు. ఉభయులూ పెత్తనానికై ప్రజలను వాడుకోసాగారు. ప్రజల పరిస్థితి దుర్భరం అయింది.

"అలాంటి సమయంలో ప్రజలపక్షం వహించింది రాజకీయ సిద్ధాంతాలు. అవి ప్రజలను మేల్కొలిపాయి. ప్రజలకు సత్యం చూపించాయి. ఆ సత్యాన్ని మతమూ–రాజులూ

ఎదిరించారు. ప్రజాబలం ఉన్న రాజకీయ సిద్ధాంతాలకు లొంగిపోయాయి రెండూ. ప్రజలు గెలిచారు. వారు తమ రాజ్యాలను స్థాపించుకున్నారు. ప్రజలలో వర్గాలు ఏర్పడ్డాయి పీడించే వర్గానికి వ్యతిరేకంగా శ్రామికులు పోరాటాలు సాగించారు. శ్రామికరాజ్యం స్థాపించుకున్నారు. శ్రమశక్తికన్న మిన్న ఏదీ లేని రాజ్యం ఇది. కాబట్టి, ఇక్కడ మీ రనుకునే మతానికి స్థానంలేదు."

"అబ్బ! ఎన్ని విషయాలు చెప్పావయ్యా! అన్నీ నిజమని నమ్మేట్లు చెప్పావు! ఇంత ఎక్కడ చదివావు? ఎందుకు చదివావు?"

"అధ్యయనం వల్ల అన్నీ తెలుస్తాయి. ఉద్యోగులందరికీ ప్రభుత్వ విధానాలు విషయంలో శిక్షణ యిస్తారు."

"అయితే, వారి చెప్పింది మాకు చెప్పావన్నమాట. నీకు నమ్మకం ఉండి కాదా?"

"చూడండి, కొన్ని వాస్తవాలు ఎవరు చెప్పినా నమ్మాల్సివస్తుంది. వారు చెప్పిందాన్లో అసత్యం నాకు కనిపించలేదు. అందుకే ఆ సిద్ధాంతాన్ని నమ్మాను. భూమి గుండ్రంగా ఉందని వారు చెపితే నమ్మకపోవడం ఎలా? భూమి చాపలా చదనుగా ఉందని చెబుదా మనుకున్నా వాదించడం ఎలా? వాళ్ళు పాలకు పాలు, నీళ్ళకు నీళ్ళు వేరుచేసి చూపిస్తున్నారు. వారి సిద్ధాంతాన్ని మించింది, ప్రజాశ్రేయస్సు కోసం, సమాజక్షేమం కోసం మరొకటి లేదని నేను త్రికరణశుద్ధిగా నమ్ముతున్నాను. నేను కాదు – జనంలో ముప్పాతిక మువ్వీసం నమ్ముతున్నారు."

"మతాన్ని గురించి వివరించావు. బాగానేవుంది. మరి కులాల విషయం? అవి వేదాలతో పుట్టాయి. హరిజనులున్నారు. చూచావూ! వారిని ఉద్ధరించాలన్నారు గాంధీజీ. వారి అడుగుజాడల్లో నడిచి హరిజనులకు ప్రత్యేక స్థానాలు ఏర్పరిచాం. వారికి మంత్రి పదవులిచ్చాం. విశేషమైన హక్కులిచ్చాం. అవైనా ఉంచారా?"

మహబూబ్‌ను విసిగించడానికి పా.మం. వేసిన ప్రశ్న అది. అయినా, మహబూబ్ విసుక్కోలేదు. వాతావరణం హాయిగా ఉంది. చంద్రుడు బాగా పైకి వచ్చేశాడు. వెన్నెల విరిసింది. పార్కులోని పచ్చగడ్డి మెరుస్తూంది. గాలిసైతం చల్లగా, మెల్లగా వీస్తూంది. పార్కులో ఉండిన పడుచు జంటలు వెళ్ళిపోయాయి. పార్కు ప్రశాంతంగా ఉంది. మహబూబ్ ఒకసారి చంద్రుణ్ణి చూచాడు. కాళ్ళు చాచుకొని కూర్చున్నాడు. పా.మం. సైతం కాళ్ళు చాచుకొని సర్దుకొని కూర్చున్నాడు. ఇద్దరూ చెరో సిగరెట్టు కాల్చుకున్నారు.

"ఆకలిగా ఉందా? హోటలుకి వెళ్ళి ఏమైనా తీసుకొని వద్దామా?" మహబూబ్ అడిగాడు.

"అక్కర్లేదు" – సిగరెట్టుపొగ గట్టిగా వదిలి అన్నాడు పా.మం. "అంతగా ఆకలిగా ఏమీలేదు. అడిగిన ప్రశ్నకు సమాధానం చెపితే చాలు."

"మంచిది, వినండి" – ప్రారంభించాడు మహబూబ్. "కులాలు వృత్తులనుబట్టీ, ఒకనాటి అవసరానికి అనుగుణంగానూ ఏర్పడ్డాయి. 'చాతుర్వర్ణం మయా సృష్టం గుణ కర్మ విభాగశః' అన్నాడు కృష్ణుడు. నాలుగు వర్ణాలు గుణవిభాగాన్నిబట్టి సృష్టించా నంటున్నాడు. నాటి ఉత్పత్తికి అవి అవసరం అయినాయి. రైళ్ళు, విమానాలు వచ్చి

ప్రపంచం దగ్గర అయిం తరువాత కులాలు వాటంతవే చెరిగిపోయాయి. వాటిని గురించిన చర్చ అనవసరం.

"హరిజనులకు సంబంధించి నంతవరకు వేల సంవత్సరాలనుండి అణగదొక్కబడిన తెగలవి. గాంధీజీ వాళ్ళకోసం చాలా చాలా చెయ్యాలని ప్రయత్నించారు. మీరు వారిలో కొందరికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించిన మాట వాస్తవం. కాని, అన్నీ వారిని వేరుగా ఉంచి చేసినవే. సమాజంలో వారిని ఎన్నడూ లీనం కానివ్వలేదు.

"శాసనసభల్లో ప్రత్యేక స్థానాలు కల్పించారు. సరే! వందమందిలో పదిమంది ఏం చేయగలరు? నిర్ణయాలన్నీ మెజారిటీనిబట్టే గదా జరిగేది?

"మీ కృషివల్ల కొందరు హరిజనులు మంత్రులు రావడమూ, కొందరు పెద్ద పదవులలోకి రావడమూ జరిగింది. అలాంటివారు వారి అంతస్తు పెరగ్గానే తాము హరిజనులమనే విషయమే మరిచిపోయారు. తోటి సోదరులను గురించి ఆలోచించనేలేదు."

"మీరేం చేస్తున్నారో చెప్పవయ్యా!"

"ఇప్పుడు సమాజంలో హరిజనులు వేరుకాదు. సమాజంతోపాటే వారు. సమాజ సంక్షేమం వారి సంక్షేమంతో పెనవేసుకొని ఉంది. ఈ ప్రభుత్వం కులాలతోనూ, మతాలతోనూ నిమిత్తం లేకుండా అందరికీ ఉచిత నిర్బంధ విద్య ఏర్పాటు చేసింది.

"హరిజనులు ఎక్కువగా వెనుకపడింది విద్యా విషయకంగానే. ఇప్పుడు వారికి ఇతరులతో పాటు ఉచితవిద్య లభిస్తూంది. ఎంతవరకు చదివినా విద్యార్థులకు అయ్యే మొత్తం వ్యయం ప్రభుత్వమే భరిస్తుంది. ఊరూరా పాఠశాల లున్నాయి. అక్కడికి విచక్షణారహితంగా అందరూ రావలసిందే. అది తప్పనిసరి. ఒక స్థాయి వరకు విద్య నేర్చుకోవాలని ప్రభుత్వం నిర్బంధిస్తుంది. ఆ తరువాత విద్య – విద్యార్థి అభిలాష మీద ఆధారపడి ఉంటోంది.

"విద్య మాత్రమేకాక వైద్యం సహితం ప్రస్తుతం ఉచితం. వైద్యం కోసం భారత పౌరుడయిన వాడెవరూ ఏమీ ఖర్చు చెయ్యాల్సిన పనిలేదు. ప్రజల ఆరోగ్య పరిరక్షణ ప్రభుత్వ బాధ్యత.

"ఒక్కసారి ఆలోచించండి! ఒక వ్యక్తికి, కుల మత వర్ణ వర్గ వివక్ష లేకుండా ఎంత నిశ్చింతయైన జీవితం ఏర్పరచిందో ప్రభుత్వం. అతని బిడ్డల చదువును గురించి అతనికి చింతలేదు. అది ప్రభుత్వ బాధ్యత. అతనికి బిడ్డల ఆరోగ్యాన్ని గురించి అతనికి చింతలేదు. అది ప్రభుత్వ బాధ్యత. అతని ఆరోగ్యాన్ని గురించి అతడు చింతించపనిలేదు. అది ప్రభుత్వ బాధ్యత. అతనికి అవసరం అయినవన్నీ సమాజం సమకూరుస్తుంది – సమాజానికి అతడు తన శక్తికొలది సాయం చేయాలి. ఎలా ఉందంటారు?"

"బాగానే ఉంది."

## నాలుగు

సంచలనం ఎక్కువగా ఉంది.

ఎండ తీక్షణంగా ఉంది.

జనం ఆగడం లేదు,

మరలు నిలవడంలేదు.

పని ఆగకుండా సాగుతుంది. పనిలో అందం ఉంది. వందలు వేలు ఒకచోట ఒకే పనికోసం శ్రమించడం – అందులో ఆనందం ఉంది.

మనిషి కాదు – మర పని చేస్తున్నప్పుడు చూడ్డానికి కనువిందుగా ఉంటుంది. అసలు శ్రమలో అందం ఉంది, ఆనందం వుంది. సంపదను సృష్టించడం అందం, శ్రమించడం, సంపదల సృష్టి – ఈ రెండూ సుందరమైనవి. ఈ సౌందర్యంపైనే జీవన సౌందర్యం ఆధారపడి ఉంది. జాతి సౌందర్యం, జాతి జీవనం, జాతి సౌభాగ్యం అన్నీ ఆ రెంటిపైనే ఆధారపడి ఉన్నాయి.

ఇక్కడ మహాసృష్టి జరుగుతుంది.

ఒక్కరు కాదు, అనేకమంది బ్రహ్మలు సృష్టిస్తారు.

ఈ బ్రహ్మలు దుఃఖాన్ని సృష్టించరు. జనంకోసం, వారి ఆనందం కోసం, వారి శ్రేయస్సుకోసం, వారి సంక్షేమంకోసం సృష్టిస్తున్నారు.

ఇక్కడ ఒక మహాయత్నం జరుగుతూంది.

ఇక్కడ ఒక మహాయజ్ఞం జరుగుతూంది.

ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులు, విద్వాంసులు గొడుగుల కింద తమ యంత్రాలతో నిరంతరం పని చేస్తున్నారు.

కంటిమీద రెప్పవాలడంలేదు.

ధ్యానం మరోవైపు మళ్ళడంలేదు.

ఎంత ఏకాగ్రంగా పనిచేస్తున్నారు?

అదిగో యంత్రాలు, అబ్బ ఎన్ని? ఎంత ధ్వని? ఎలా పని చేస్తున్నాయి?

కొన్ని మట్టిని తోడుతున్నాయి.

కొన్ని మట్టిని చేరుస్తున్నాయి.

కొన్ని నీళ్ళను చేరుస్తున్నాయి.

కొన్ని ఇసుకను మారుస్తున్నాయి.

అబ్బ, ఎంత కల్లోలం! ఎంత రొద! ఎంత ఆరాటం!

యంత్రాలూ ఆరాటపడుతున్నాయి. యంత్రాలు – వాటికి ప్రాణమున్నట్లు అవీ ఏదో సాధించనున్నట్లు.

శ్రామికులు – వందలు వేలు!

వేలకొద్దీ పనిచేస్తున్నారు.

తట్టలు – పారలు – గునపాలు!

కదులుతున్నాయి వారి చేతుల్లో!

ఆడుతున్నాయి వారి చేతుల్లో!

చమటలు కక్కుతున్నారు.

సూర్యుణ్ణి వెక్కిరిస్తున్నారు. లెక్కచేయడం లేదు. నిరంతరం శ్రమ – నిర్విరామ శ్రమ.

ఈ శ్రమ – యీ శ్రామికుల శ్రమ లోకాన్ని సృష్టించగలదు – లోకాన్ని మార్చగలదు.

ఈ శ్రమ – ఇప్పుడు వారు పడుతున్న శ్రమ – తమకోసం అని తెలుసువారికి, భావితరాల సౌభాగ్యానికి అని తెలుసు వారికి. ఈ రాజ్యం వారిదని తెలుసు వారికి – ఈ దేశం వారిదని గ్రహించారు వారు.

అందుకే అంతపని చేస్తున్నారు.

వారు ఒడలు దాచుకోడం లేదు.

ఓహో!

ఎంతమంది – ఎలా పనిచేస్తున్నారు!

పని చేస్తున్నారా? ఆడుతున్నారా!

పాట పాడుతున్నారా! నృత్యం చేస్తున్నారా!

అన్ని కళలకూ వీరేనా పుట్టిళ్లు!

ఓ రుద్రులారా!

ఓ నటరాజుల్లారా!

ఏమిటి చేస్తున్నారు?

దేన్ని మారుస్తున్నారు?

వినండి జవాబు –

గంగను మళ్ళిస్తున్నాం

కావేరిలో కలిపేస్తున్నాం.

అవును. అది గంగ నీటిని కావేరిలో కలిపే మహోద్యమం.

గంగానదిని దక్షిణానికి మళ్ళిస్తున్నారు. ఇక గంగ ఉత్తరాదిని మాత్రమే కాదు, గంగనీరు భారతదేశ మంతటా వ్యాపిస్తుంది. భారతదేశం యావత్తూ సస్యశ్యామలం అయిపోతుంది.

ఇక ఆ నదులు ఏ రాష్ట్రాలవీ కావు. నదులన్నీ భారతదేశానివి.

ఉత్తరాన గంగ నుంచి దక్షిణాన కావేరి వరకు ఒక వరద! ఒకే నది! ఒకే పాయ! ఒకే జీవం!

నాడు భగీరథుడు ప్రారంభించిన యజ్ఞం నేటికి పూర్తి కానున్నట్లున్నది.

ఇది తర తరాల కృషికి నిదర్శనం.

ఇది మానవుని మహత్తర శక్తికి నిదర్శనం.

పా.మం. అదంతా చూశాడు – ఆశ్చర్యపోయాడు.

"ఇంత మహోద్యమం దేనికి?" అని అడిగాడు పక్కనున్న జాన్సన్ను.

"ఇది గంగను కావేరితో కలిపే ప్రాజెక్టు! దేశంలో నిరుద్యోగాన్ని అంతం చేసే పథకంలో ఇదొక భాగం. నిర్మాణ దశలో నిరుద్యోగాన్ని – నిర్మాణం పూర్తి అయిం తరువాత కరువునూ పారదోలే కల్పవల్లి ఈ ప్రాజెక్టు" – వివరించాడు ఉద్యోగ విషయాల అధికారి ప్రొఫెసర్ జాన్సన్.

"జాన్సన్‌గారూ! ఇది గొప్ప పని! దీనికి ప్లానులు వేసింది మా ప్రభుత్వమే ననుకుంటా–ఏమంటారు?"

"అవును. ఇది మీ ప్రభుత్వం సిద్ధం చేసిన ప్లానే – మా ప్రభుత్వం అమలుపరుస్తాంది. ఏదీ ఆకాశంనుంచి ఊడిపడదు. మానవయత్నం నిరంతరం. నదికి ఏ అడ్డువేసో నీటిని మళ్ళించిన ఆదిమానవుని నాటి నుండి నేటిదాకా

జరిగిన కృషి కారణం. ఇది పూర్తి అయిన్నాడు భారతదేశ స్వరూప స్వభావాల్లోనే గొప్ప మార్పు వస్తుంది. భారతదేశం మళ్ళీ అన్నపూర్ణ అవుతుంది."

"ఇది చాల ఘనకార్యం, ఇందుకు మీ ప్రభుత్వాన్ని అభినందించాలి. నిరుద్యోగ నిర్మూలనకు ఇదొక కృషి అన్నారు. ఇప్పుడు అందరికీ ఉద్యోగాలున్నాయా?"

"రండి. ఆ కేంటిన్‌లో కూర్చొని మాట్లాడుకుందాం. ఇక్కడ ఎండగా ఉంది. మీరు ఎండ సహించలేరు" అని, ఇద్దరూ కేంటిన్ వైపు సాగారు. అక్కడ కూర్చొని 'చాయ్' తెప్పించి, అది చప్పరిస్తూ కూర్చున్నారు.

"వినండి" – జాన్సన్ ప్రారంభించాడు. "అందరికీ ఉద్యోగాలు లభింపచేసే బాధ్యత ప్రభుత్వం తీసుకుంది. అంటే, రాజ్యాంగం ప్రకారం ప్రతి పౌరునికీ ఉద్యోగపు హక్కు ఉంది. ప్రభుత్వం ఉద్యోగం ఇప్పించకుంటే అతడు కోర్టులో కేసుపెట్టి సాధించవచ్చు. ఇప్పుడు భారతదేశంలో నిరుద్యోగం లేదు."

"ఏమీ!" అన్నాడు పా.మం. అతని నోట్లోవున్న సిగరెట్టు బట్టమీద పడ్డది, అమాంతంగా లేచి దులుపుకున్నాడు. క్రిందపడిన సిగరెట్టు అందుకొని ఒక దమ్ములాగి కుర్చీలో కూర్చుంటూ "నమ్మలేను – నిరుద్యోగం మొత్తం పోయిందంటే ఎలా నమ్మడం? కాదు, ఇది అబద్ధం– వట్టి ప్రాపగాండా. వీల్లేదు – అలా జరగదు – ఇది భారతదేశం. ఎన్ని లక్షలులమందికి ఉద్యోగాలిస్తారు!? అంతా బూటకం – వట్టిభ్రమ, అరచేతుల్లో స్వర్గం చూపుతున్నారు..."" అన్నాడావేశంతో.

జాన్సన్ మాట్లాడలేదు, సిగరెట్టు దమ్ము గట్టిగాలాగి వదిలాడు. శ్వాస కాస్త వేడిగా – వేగంగా వదిలాడు. అయినా శాంతించాడు. అయినా ఓర్చుకోలేక పోయాడు.

"అవును, మీరు నమ్మరు. మీరు నమ్మలేనివి అనేకం చేసేస్తున్నాం మేము, కళ్ళతో చూస్తున్నారు మీరు. అయినా నమ్మరు, అసలు మీ కళ్ళను మీరు నమ్మరు, అలాంటి వాళ్ళను నమ్మించడం కష్టం. మీకు దేశంలో ఉన్న సమస్యలే తెలుసు. మరిన్ని సమస్యల్ని సృష్టించడం తెలుసు. సమస్యల పరిష్కారం తెలియదు. అందును గురించి ఆలోచించడం తెలీదు. స్వార్థం తప్ప మీరెరిగింది లేదు. నా పదవి ఎలా నిలుస్తుంది. నా ఆస్తి ఎలా పెరుగుతుంది – నా పిల్లలు తరతరాలు కష్టపడకుండా ఎలా బతుకుతారు? ఇదేగా మీరు ఆలోచించి – చేసింది. సమస్యలు పరిష్కరించబడ్డాయంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. నమ్మలేరు మీరు. మీరు కంటికి కనిపించనివాటిని తప్ప కనిపించేవాటిని ఎప్పుడు నమ్మారని?"

"చాలు చాలు. నన్ను తిట్టడంతో సరిపెట్టకండి, అసలు విషయం బయటపెట్టండి."

"అయితే వినండి, ఆలోచనా విధానంలో మార్పువస్తే అన్నీ మార్తాయి. అది సమంజసమై సమాజపరమైనపుడు అన్నీ సాధ్యపడతాయి. అడ్డంకులు దూరం అవుతాయి."

"ఆలోచన మారడం అంటే మంత్రమా? అది అన్నింటినీ మాయం చేస్తుందా?"

"కాదు. అది మంత్రం కాదు. కాని, విధానం మారినప్పుడు సాధించగలవి అనేకం ఉంటాయి. ఒక కుటుంబం విషయం తీసుకోండి, ఆ కుటుంబపు పెద్ద తాగుబోతు, జూదరి. సంపాదించింది సొంతం తనకే ఖర్చుపెట్టుకుంటాడు. ఆ కుటుంబం ఎలా ఉంటుందంటారు?"

"అలాంటి దుర్మార్గులు అంతా ఉంటారా?"

"ప్రశ్నకు ప్రశ్న సమాధానం కాదు. ఆ కుటుంబంలో సభ్యులు ఎలా ఉంటారో చెప్పండి?"

"పస్తు లుండాల్సి వస్తుంది, దారిద్ర్యంతో బాధలు అనుభవించాల్సి వస్తుంది. అది ఆ కుటుంబపు దౌర్భాగ్యం."

"దౌర్భాగ్యం అనాల్సిన అవసరం లేదు. ఆదాయం లేక ఆ కుటుంబం పస్తులుంటున్నట్లా?"

"కాదు."

"మరి?"

"ఒకని దురభ్యాసంవల్ల కుటుంబం పాడవుతుంది."

"అది మీ ఆలోచన. ఇక మా ఆలోచన ఇది: ఆ యజమానిది వైయక్తికవాదం – అంటే, తాను బాగుపడితే చాలుననుకునేవాడు – స్వార్థపరుడు, కట్టుకున్న పెళ్ళాం పిల్లల విషయంలో కూడా బాధ్యత తెలియని వాడు. అలాంటివారు బాగుపడ్డానికి మీరు దోహదం కలుగజేశారు."

"తప్పు, మేం తాగుబోతులను ఎన్నడూ ప్రోత్సహించలేదు. మద్యనిషేధం కూడా పెట్టాం కొంతకాలం – గాంధీజీ శతజయంతి దాకా."

"నేను కుటుంబానికి చెప్పింది దేశానికి వర్తింపచేయండి. తమ స్వార్థంకోసం దేశాన్ని తాకట్టుపెట్టగల సమర్థులకు అప్పగించి, వారిని దేశ సంపద సొంతం తమ గుప్పిళ్ళలో పెట్టుకునేటట్లు చేశారు. సంపద సొంతం కొందరి ఇండ్లల్లో మూలుగుతుంటే గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నారు. వీళ్ళందరూ ఆ కుటుంబ పెద్దల లాంటివారు కాదా? వారివల్ల కాదా దేశం పస్తుల పాలయింది! దరిద్రంలో అలమటించింది!"

"మీరు ఉపన్యాసం గట్టిగా దంచగలవారివలె ఉన్నారు. అసలు విషయాన్ని మరిపించాలని ప్రయత్నిస్తున్నట్లున్నారు. నిరుద్యోగం లేదంటున్నారు. దేశంలో అదెలా సాధ్యం అయిందీ సూటిగా చెప్పండి."

"కాస్త ఓపికగా వినండి. ఒక్కడు బాగుపడాలనే విధానంపోయి సమాజం బాగుపడాలనే విధానం వచ్చింది. అంటే, వైయక్తిక వాదం స్థానంలో సమాజవాదం వచ్చింది. ఒక్కడు డొక్కనిండా తిని గుర్రున త్రేన్పడానికి వీల్లేదిక్కడ – ఉన్నది నలుగురూ తినాలి."

"అంటే – ఒక్కని ఉద్యోగం నలుగురికి పంచిపెట్టారా?"

"సరే, విషయానికి వద్దాం. మీరు అర్థం చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నట్లులేదు. అయినా వినండి, వ్యక్తిగతమైన పరిశ్రమలవల్ల పారిశ్రామికులకు వచ్చిన లాభం లేకుండా చేస్తే ఎంతమందికి ఉద్యోగాలు ఇవ్వవచ్చో ఆలోచించండి."

"ఆఁ ఆఁ – ఏమి ఏమి, కాస్త వివరంగా చెప్పండి."

"ఒక పరిశ్రమ స్థాపించడానికి ప్రభుత్వం ఒక వ్యక్తికి అనుమతించింది అంటే, అతడు లాభాలు సంపాదించడానికి అనుమతించినట్లే కదా? సరే, ఆ పరిశ్రమలో ఎంతమంది కార్మికులను నియమించాలో ప్రభుత్వం చెప్పదుకదా? పారిశ్రామికుడు సాధ్యమైనంత తక్కువ మందితో పరిశ్రమ నడిపిస్తాడు కదా? అంటే, నియమించ వలసినంత మంది కార్మికులను నియమించలేదు కదా? మరి అతని లాభం నియమించకుండా వున్న కార్మికుల వేతనాలు! నియమించినవారికి తక్కువ వేతనాలు

ఇవ్వడంవల్ల మిగిలిన ధనం కాదా? పారిశ్రామికుడు లాభం అని చెప్పేకునేది కార్మికులకు చెందవలసినది కాదా? అది కార్మికులకు చెందింది అనుకోండి, ఉద్యోగాలు ఎన్ని వస్తాయి? కార్మికులకు ఎన్ని సౌకర్యాలు లభిస్తాయి? అనే విషయం ఎన్నడయినా ఆలోచించారా?"

"లేదు. ఆలోచించలేదు. ఆలోచించాల్సిన విషయంగానే కనిపిస్తూంది. అయితే, ఇప్పుడు వ్యక్తిగత పరిశ్రమలు లేవా?"

"లేవు. అన్నీ సమాజపరం అయినాయి. ఇప్పుడు పరిశ్రమల లక్ష్యం లాభాలు ఆర్జించడంకాదు. దేశానికి కావలసిన సంపద సృష్టించడం – ప్రజలకు ఉద్యోగావకాశాలు కల్పించడం మాత్రమే."

"అలా ఎంతమందికి ఉద్యోగాలొస్తాయి?"

"ఇదివరకే చెప్పాను – విధానం విషయంలో – ఇప్పుడు సమాజం యావత్తూ ఉద్యోగాలు కల్పించడాన్ని గురించి ఆలోచిస్తూంది.

"మేముకూడా ఆలోచించాము."

"ఆలోచించ లేదనను. మీది వ్యక్తి వాదం, ఏది ఆలోచించినా వ్యక్తిని గురించి ఆలోచిస్తారు. ఒక పారిశ్రామికుడు, కార్మికులను తగ్గించడానికి చేసే ప్రయత్నాల్లో అభివృద్ధిచెందిన యంత్రాలను ప్రవేశపెడ్తాడు. తద్వారా కొంతమంది కార్మికులను నిరుద్యోగులను చేస్తాడు."

"ఎట్లా ఎట్లా"

"ఒకే వ్యక్తికింద ఒక ఫ్యాక్టరీ ఉందనుకోండి. అందులో వందమంది పనిచేస్తున్నారనుకుందాం. ఒక యంత్ర సహాయంతో వారు వంద వస్తువులు ఉత్పత్తి చేస్తున్నారనుకొందాం. ఆ ఫ్యాక్టరీ యజమాని అభివృద్ధి చెందిన ఒక యంత్రాన్ని కొన్నాడు. అది 50 మందితో వంద వస్తువులు ఉత్పత్తిచేయగలదు. అప్పుడు ఆ యజమాని 50 మందిని నిరుద్యోగులను చేయాల్సిందేకదా?"

"అవును. చేయాల్సిందే. మీరయితే ఏం చేస్తారు?"

"మా లక్ష్యం లాభాల ఆర్జన కాదుకదా? అలాంటి అవకాశం వచ్చినప్పుడు ఫ్యాక్టరీలో వందమందినీ ఉంచి వారు ఇది వరకు ఎనిమిది గంటలు పనిచేస్తుంటే ఇప్పుడు నాలుగు గంటలే చేయిస్తాం. ఎంచేతంటే, యంత్రాన్ని కనుగొన్నవారు శ్రామికులు, తమ శ్రమవల్ల శ్రామికులకు సౌకర్యం లభించాలి."

"అయితే, ఆ విధంగా నిరుద్యోగం పోతుందంటారా?"

"దేశంలో సంపద ఉత్పన్నం కావలసిన అవసరం ఎంతోవుంది. కర్మాగారాలన్నీ రేయింబవళ్ళు పనిచేస్తున్నాయి. కార్మికుల పని గంటలు ఎనిమిదినుంచి ఆరుకు తగ్గించబడినాయి. మూడు షిఫ్టులకు బదులు నాలుగు షిఫ్టులు పనిచేస్తున్నాయి. తద్వారా ఉద్యోగావకాశాలు బాగా పెరిగిపోయాయి."

"అందరికీ కర్మాగారాల్లో ఉద్యోగాలివ్వించడం సాధ్యపడిందా?"

"ఉదాహరణకు కర్మాగారాలు చెప్పాను. ఉద్యోగావకాశాలకోసం మరికొన్ని చర్యలు తీసుకొనబడ్డాయి. చూడండి – ఒక కుటుంబంలో ఒక వ్యక్తి వ్యాపారం చేస్తాడు, ఒకడు వ్యవసాయం చేస్తాడు. ఒకడు పరిశ్రమ నిర్వహిస్తాడు: ఒకడు ఉద్యోగం చేస్తాడు. ఈ కుటుంబం ఎన్ని కుటుంబాల ఉద్యోగావకాశాలు లాక్కుందో చూడండి.

అందువల్ల ప్రస్తుతానికి ఒక కుటుంబానికి ఒక వ్యక్తికి మాత్రమే ఉద్యోగం లభిస్తుంది."

"అంత మాత్రంతో ఉద్యోగాలు అందరికీ లభిస్తాయంటారా"

"అంతేకాదు. ఒకసారి వూహించండి. దేశంలో ఉచిత నిర్బంధవిద్య ప్రవేశ పెట్టబడింది. నిరక్షరాస్యులు ఉండరాదనే ఉద్యమం కొనసాగుతూంది. దేశంలో వున్న ప్రతి బాల బాలికకు విద్య గరపాలంటే ఎంతమంది ఉపాధ్యాయులు అవసరం అయినారో ఆలోచించండి.

"అయిందా! ఇంతమందికి పుస్తకాలు వగైరా సరఫరాకు, ఉత్పాదనకు ఎంతమంది అవసరం అయినారో లెక్క వేయండి. ఇది విద్యకు సంబంధించింది. ఇక ఆరోగ్యం. ఇన్ని కోట్ల జనాభాకు ఎందరు వైద్యులు కావాలి? అదీ ఆరోగ్య పరిరక్షణ ప్రభుత్వ బాధ్యత అయినప్పుడు – పల్లెకొక వైద్యశాల, ఒక డాక్టరు, ఒక నర్సు, ఒక కాంపౌండరు. లెక్క వేయండి ఎంతమందికి ఉద్యోగాలు యివ్వగలిగామో! మందుల ఉత్పత్తి, అందుకు అవసరం అయిన కార్మికశక్తిని గురించి ఆలోచించండి. ఇలాంటి పథకాలు అనేకం సిద్ధం కావడం వల్ల– ముఖ్యంగా వ్యక్తిగత వ్యాపారం లేకపోవడంవల్ల నిరుద్యోగం నిర్మూలించబడింది. ఇప్పుడు దేశంలో నిరుద్యోగి లేడు. వ్యక్తిత్వం వచ్చిన ప్రతివానికీ ఉద్యోగం కల్పించే బాధ్యత ప్రభుత్వం స్వీకరించింది. ప్రజలందరికీ ఉచిత విద్య, ఉచిత వైద్య సదుపాయం, వ్యక్తిత్వం రాగానే ఉద్యోగం వసతి సమకూర్చడం, వార్ధక్యంలో వేతనం చెల్లించడం ప్రభుత్వ బాధ్యతలు. ఏ వ్యక్తీ విచారాలతో, బాధ్యతల బరువుతో కుంగిపోవాల్సిన అవసరం ఉండదు. తన బిడ్డల చదువు విషయం అతనికి చింత లేదు. వారి ఉద్యోగాల్ని గురించి అతనికి దిగులులేదు. వార్ధక్యంలో తన పోషణను గురించి అతడు ఇతరులపై ఆధారపడాల్సిన పని లేదు. అందుకే ఈ దేశపు ప్రజలు ఇప్పుడు సంపూర్ణ ఆరోగ్యవంతులై, దేశాభ్యుదయానికి కృషి చేయగలుగుతున్నారు."

"బావుందండీ, నిజంగా బావుంది. దిగులులేని జీవితంకంటే కావలసిందేమి? వాస్తవంగా భారత ప్రజకు గొప్ప సేవ చేశారు అందుకు మీ ప్రభుత్వాన్ని అభినందించాల్సిందే. అదిసరేగాని, డాక్టర్లు, లాయర్లు, శాస్త్రజ్ఞులవంటి మేధావులకు సొంత వృత్తి చేసుకునే స్వేచ్ఛ ఉందంటారా?"

"మీరు మళ్ళీ మొదటికి వచ్చారు. నలుగురిని చెడగొట్టి తాను బాగుపడే స్వేచ్ఛ ఈ సమాజంలో ఎవరికీ లేదు. స్వార్థానికి సమాధి కట్టేశాం. ఎవరు ఏదిచేసినా సమాజ శ్రేయస్సుకే. ఒక డాక్టరు విషయం ఆలోచించండి. అతని చదువుకోసం ప్రభుత్వం ఎంత ఖర్చుపెట్టింది?

"అదంతా ఎవరిసొమ్ము! ప్రజలదికాదూ? ప్రజల సొమ్ము వారిమీద ఖర్చుపెట్టి 'ఇక మీరు సంపాదించుకోండి – రోగులను పీల్చండి' అనడంలో న్యాయం ఎంత ఉందో ఆలోచించండి. అది కాకులనుకొట్టి గద్దలకు వేయడం కాదా! ఆ అన్యాయం ఇప్పుడు సాగడానికి వీల్లేదు. మీరు పేర్కొన్న మేధావులందరికీ ఉద్యోగా లివ్వడమే కాక తగు సౌకర్యాలు కల్పించాం.'"

"అసలు సిద్ధాంతంలోనే తేడా వుందని మీరన్నమాట ఎంతో సత్యం. సమాజం బాగుపడ్డమే కావలసింది. సమాజ శ్రేయస్సుకు అంతరాయం కలిగించే వ్యక్తి స్వేచ్ఛకు తావుండరాదు. సరే, వ్యవసాయం విషయం, పల్లెల సౌభాగ్యం గురించి వివరిస్తారా?"

"ఆ విషయాలు నాకు అంతగా తెలియవు. వాటిని గురించి తెలిసిన మరొకరిని పంపిస్తాం. ఇప్పటికి సెలవా మరి!"

ఇద్దరూ కలసి వెళ్ళిపోయారు.

## అయిదు

"మీ ఊళ్లోకి వచ్చేశాం" – కారు ఊళ్లోకి ప్రవేశిస్తుండగా అన్నాడు శ్రీకాంత్ అనే గ్రామ సంక్షేమాధికారి.

"అబ్బ! ఎంత మార్పు! ఇది మా ఊరా? పూర్తిగా మారిపోయిందే? పోలికలే కనిపించడంలేదు!! ఏమి తార్రోడ్డు! ఊళ్లోకిగూడా వేశారా! బావుంది. ఎంత శుభ్రంగా ఉందండీ ఊరు! ఏమైంది ఆ చెత్త – ఆ గలీజు ఏమైనాయి? ఆ మిట్టపల్లాలు దోవలు ఏమైనాయి? చీమిడి ముక్కుల్తో, కుండ పొట్టల్తో కారువెంట ఉరికి వచ్చే పిల్లలు ఎంత మారిపోయారు? నిజంగా ఇది మా ఊరేనా? విచిత్రంగా మారిపోయింది. వింతగా మారిపోయింది. ఎంత మంచి మార్పు! ఎంత గొప్ప మార్పు! నలుగురూ సుఖించాలి – అందరూ ఆనందించాలి. ఆ వాదంలోనే గొప్పదనం ఉంది. ఇంత మార్పు ఆ వాదం ప్రభావమే – ఆ సిద్ధాంత ప్రభావమే. నా పల్లెలో – నా గ్రామంలో ప్రజలు ఎంత హాయిగా ఉన్నారు! చూడండి, వాళ్ల ముఖాల్లో విచారరేఖలు లేవు. బాధలన్నీ అమాంతంగా మాయం అయినట్లు కనిపిస్తున్నారు. నిర్విచారంగా వున్నారు. వారి ముఖాల్లో ఏదో సంతృప్తి కనిపిస్తోంది. ఆశ కనిపిస్తోంది. ఆనందం కనిపిస్తోంది. ఇది నిజంగా మీకు విజయం – మీ విధానానికి విజయం. మీ సిద్ధాంతానికి ఘనవిజయం – మీకు అభినందనలు అందజేయ లేకుండా ఉండలేక పోతున్నాను. నా అభినందనలు మీ ప్రధానికి అందించండి.

"పల్లెల ప్రగతి ఎంత స్పష్టంగా కనిపిస్తోంది! పట్టణాల ప్రగతి కనిపించడం కష్టం" – పా.మం.

కారు అతిథి గృహం ముందు ఆగింది, ముందు శ్రీకాంత్, వెనుక పా.మం. దిగారు. ఉభయులూ లోన ప్రవేశించి కుర్చీలో కూర్చోగానే టీ తీసుకొని వచ్చాడు ఒకతను – రాములు. రాములు పా.మం.ను గుర్తించి నమస్కరించాడు. పా.మం. అతనిని గుర్తించలేదు.

"మీది ఈ ఊరేనా?" పా.మం. ప్రశ్న.

"అవునండీ!" రాములు జవాబు.

"ఎవరు మీరు?"

అదేం ప్రశ్న అన్నట్లు రాములు శ్రీకాంత్‌ను చూచాడు.

"కులమతాల ప్రసక్తినే తేబోకండి. వాటిని ప్రస్తావించి ఒకరు తక్కువ వారనీ, ఒకరు ఎక్కువ వారనే జ్ఞాపకం చేయడం ఎందుకు" శ్రీకాంత్ అన్నాడు.

రాములు మూడు ప్లేట్లు, మూడు కప్పులు టేబులుమీద పెట్టాడు.

ఉన్నది ఇద్దరేకదా మూడు ఎందుకు అన్నట్లు చూశాడు పా.మం.

శ్రీకాంత్ రాములును చూచాడు.

రాములు ఒక కుర్చీలో కూర్చున్నాడు.

పా.మం.కు కాస్త చిరాకనిపించింది. ముడుచుకొని కూర్చున్నాడు.

ముగ్గురు కప్పులు అందుకొన్నారు. చప్పరించడం ప్రారంభించారు.

రాములుతో ఏదో మాట్లాడాలనుకున్నాడు పా.మం. అతని నేదో అడగాలనుకు న్నాడు. కాని, రాములు తనతో సమంగా కూర్చోవడం సహించలేకుండా ఉన్నాడు లోలోన. బయటికి కనిపించ నివ్వడంలేదు.

రాములూ పా.మం.తో ఏదో మాట్లాడుదామనే అనుకున్నాడు. పా.మం. కనిపించగానే ఏదో ఆదరం అతనికి తెలియకుండానే మనసులో ప్రవేశించింది. పైగా, సరసనే కూర్చోవలసి వచ్చింది. అంతకూ కాస్త ఇరుగ్గానే కూర్చున్నాడు, ముడుచుకునే కూర్చున్నాడు.

రాములు పా.మం.ని చూస్తున్నాడు మాటిమాటికీ.

పా.మం. రాములును చూస్తున్నాడు తేపతేప.

వాళ్ళిద్దరి అయోాయం గమనిస్తున్నాడు శ్రీకాంత్.

ముగ్గురూ మాట్లాడడం లేదు.

మౌనం వెలిసింది.

గుండెల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి.

కప్పులు టేబుల్ మీద పెట్టిన చప్పుడయింది - అంతే.

పా.మం. సిగరెట్టు వెలిగించాడు, అగ్గిపుల్ల చర్రమన్న చప్పుడు.

శ్రీకాంత్ రాములుకు సిగరెట్టు అందించాడు. రాములు సిగరెట్టయితే అందుకు న్నాడు గాని, చేతిలో చాటుగా పెట్టుకొని లేచి వెళ్ళిపోయాడు. చివాలున లేచాడు - చకచకా నడిచిపోయాడు.

శ్రీకాంత్‌కు చిన్నపోయి నట్టయింది. సిగరెట్టు చేతిలో పట్టుకొని అలాగే నుంచున్నాడు. తరువాత కూర్చున్నాడు. నెమ్మదిగా పొగపీల్చి వదిలాడు.

పా.మం. గట్టిగా పొగపీల్చి వదిలాడు. అది మబ్బులా శ్రీకాంత్ ముఖంమీద వ్యాపించింది. మెల్లగా విడిపోయి గాలిలో కలిసిపోయింది.

"ఇది కొత్తగా కట్టించారా?" విషయం మార్చడానికి అడిగాడు పా.మం. ధ్వనిలో ఏదో విజయగర్వం ద్యోతకం అయింది.

"ఊరికి ఎవరైనా కొత్తవారు వచ్చినపుడు వసతి సౌకర్యం కోసం కట్టించాం. ఇలాంటివి సుమారు అన్ని గ్రామాల్లోనూ ఉన్నాయి."

"వస్తుంటారా ఎవరైనా?"

"వస్తూనే ఉంటారు మీలాంటివారు. ఇప్పుడు విదేశాల నుంచి గూడా వస్తున్నారు. మేం చెప్పేది నమ్మక దేశయాత్రల మిషమీద వచ్చి పల్లెలను చూసి పోతున్నారు."

"ఇక్కడి కెవరైనా విదేశీయులు వచ్చారా?"

"వచ్చారు" అని; వారి అభిప్రాయాల పుస్తకం అలమరలోంచి తీసి అందించాడు శ్రీకాంత్.

పా.మం. కాగితాలు తిరిగేసి చూడసాగాడు. అభిప్రాయాలు చూస్తుంటే చెమట పట్టసాగింది.

"సౌకర్యాల్లో పల్లెలకు, పట్నాలకు తేడాలేదు." ఒక అభిప్రాయం.

"ఇంతకు పూర్వం భారతీయ గ్రామాలూ చూచాను. ఇప్పుడు వచ్చిన మార్పు అపూర్వం" – మరొక అభిప్రాయం.

పా.మం. ముఖాన చెమటధార కడ్తోంది.

"ముఖ్యంగా నన్ను ఆకర్షించింది కుల మతాల పేర హెచ్చు తగ్గులు మాయం కావడం! భారతదేశంలో ఇది సాధ్యపడుతుందనుకోలేదు. దీన్ని సాధించిన ప్రభుత్వం అభినందనీయం." ఇంకొక అభిప్రాయం.

పా.మం. పుస్తకం బల్లమీద పెట్టి దస్తీతో ముఖం తుడుచుకున్నాడు. సిగరెట్టు వెలిగించాడు – మెల్లగా పొగ లాగాడు.

శ్రీకాంత్ సిగరెట్టు పొగ గట్టిగా ఊదాడు. అది మబ్బులా పా.మం. ముఖంమీద వ్యాపించింది. మెల్లగా విడిపోయి ముఖంమీద పొర ఏర్పడింది.

"స్నానానికి లేద్దామా?" విషయం మార్చడానికి అన్నాడు శ్రీకాంత్.

పా.మం. చప్పునలేచి స్నానాల గదిలో దూరాడు.

శ్రీకాంత్ లోలోన నవ్వుకున్నాడు.

ఉభయుల స్నానాలయినాయి. "బయల్దేర్దామంటారా? భోజనంచేసి బయల్దేర్దామా?" అడిగాడు శ్రీకాంత్.

"వెళ్దాం! భోజనం తరువాత చెయ్యొచ్చు."

ఇద్దరూ కార్లో కూర్చున్నారు.

"మీ ఇంటికే వెళ్దామా ముందు" – శ్రీకాంత్ అడిగాడు. పా.మం. కళ్ళల్లోకి చూస్తూ – మారుతున్న రంగుల్ని గమనించాడు.

పా.మం. గుండె దడదడ లాడింది. అక్కడేముందో? తన ఇల్లు ఏంచేశారో తాను స్వయంగా దాన్ని ఈ దశలో చూడాలనా వీళ్ళ పన్నాగం? అది తప్పదు అని తెలిసి "ఊఁ" అన్నాడు విధిలేక.

పా.మం. ఇంటిముందు కారు ఆగింది.

అది పెద్ద బంగళా – చెక్కుచెదరకుండా ఉంది.

ఒక్కసారి బంగళానంతా తన చూపుల్తో సర్వే చేశాడు పా.మం. చివరకు గేటుముందున్న బోర్డు కనిపించింది – "గ్రామ పాఠశాల" అని.

అది చూడగానే పా.మం. కళ్ళు చెమ్మగిల్లాయి. ఎన్నెన్ని స్మృతులు మనసులో మసలాయో చెప్పలేం. వాటిల్లో బాల్యానికి సంబంధించి తన ఆటలకు సంబంధించినవీ వుండచ్చు. పడుచుదనంలో సాగిన ప్రణయానికి సంబంధించినవీ వుండొచ్చు. అధికారం సాధించడానికి చేసిన దౌర్జన్య సంబంధాలూ వుండొచ్చు. అది నిలుపుకోడానికి చేసిన మోసాల దృశ్యాలూ కావచ్చు. పా.మం. కథే ఒక మహాగాథ. అది ఇక్కడ చెప్పకోలేం. అతని ప్రస్తుత దశ మాత్రం అలా ఉంది.... ఉభయులూ గేట్లో ప్రవేశించారు. పా.మం. ఉండినప్పుడు ఇంటి ముందున్న స్థలం ఖాళీగా ఉండేది. కళ్ళాపి చల్లి నున్నగా ఉంచేవారు; ఇప్పుడక్కడ మంచి పార్కు లేశారు. పచ్చని గడ్డిమీద మంచు బిందువులు ఇంకా ఆరిపోలేదు. రంగు రంగుల రకరకాల పూల మొక్కలకు విరగబూసి ఉన్నాయి పూలు. ఒక్క పూవు తెంపిన జాడ కనిపించలేదు.

పార్కును చూచాడు పా.మం. పార్కులోని పచ్చదనం గుండెలో చేరినట్లయింది.

పాత ధ్యాసపోయి కాస్త ఉల్లాసం వచ్చింది. ప్రకృతిలో ఉందా గుణం – పరమానందం కలిగించగలదు.

పార్కును చూస్తూ మెల్లెక్కాడు పా.మం. ఇంట్లో ఉన్నది స్కూలు – ఇంటి ముందున్నది పార్కు మొక్కల్నుంచి ఒక్క పూవు తుంచలేదు – విచిత్రం అనిపించింది.

వారు ప్రధానోపాధ్యాయుని గదిలో ప్రవేశించారు. శ్రీకాంత్ ఉభయులకూ పరిచయం చేశాడు.

"మీది ఈ ఊరేనా?" పా.మం. ప్రధానోపాధ్యాయుని అడిగాడు.

"కాదండి. పొరుగూరు – మీ పేరు మా ప్రాంతాల్లో పరిచయమే."

"ఇక్కడ ఈ ఊరు టీచర్లు లేరా?"

"చాలామంది ఇక్కడివాళ్ళేనండి. ముందు ఉన్న ఊరువాళ్ళకు వాళ్ళ ఊళ్లో ఉద్యోగాలివ్వడం ప్రభుత్వం పాలసీ. విద్యాయోగ్యతలు లేనివారిని బయటినుంచి రప్పిస్తారు. విద్యా యోగ్యతలు ఎక్కువవుండి, ఇక్కడ అవసరం లేనివారిని బయటికి పంపిస్తారు."

"ఒక విషయం మిమ్మల్ని అడగా లనుకుంటున్నాను."

"అడగండి."

"ఇంట్లో స్కూలుంది, ఇంటిముందు పార్కుంది. పార్కులో పూలమొక్కలు న్నాయి మొక్కల్నిండా పూలున్నాయి. ఒక్కటి తుంచినట్లు కనబళ్ళేదు. బడిలో పిల్లల్లేరా? వారటు రారా?"

"బళ్ళో పిల్లలున్నారు. వారు వేసిందే ఆ పార్కు. పిల్లలంతా అక్కడే తిరుగుతారు. ఒక్క పూవు తెంపరు. అది మా పిల్లల క్రమశిక్షణకు నిదర్శనం." అని గర్వంగా చూచాడు హెడ్‌మాస్టరు.

"అలాగా! పిల్లలను అంత క్రమశిక్షణలో ఉంచుతున్నారన్న మాట?"

"మేం ఉంచడం కాదు. వారు ఉంటున్నారు. వారు బాధ్యతలను గ్రహిస్తున్నారు."

"విద్యా విధానంలో మార్పు వచ్చిందా?"

"వచ్చిందనే చెప్పాలి. ఇప్పుడు విద్యార్థి స్కూల్లో మూడుగంటలే ఉంటాడు."

"అంటే, మిగతా కాలం?"

"మిగతా కాలం భవనంలో ఉండరు. బయట వదిలేస్తాం. అక్కడ వారికి నిర్బంధంలేదు. తోట, పొలం – దేన్లోనో ఒకదానికి వెళ్ళిపోతారు. వారివెంట టీచర్లుకూడా ఉంటారు. వారు అడిగిందానికి సమాధానం చెప్పడం టీచర్ల పని. ఆటలాడుతూనే అనేక విషయాలు నేర్చుకుంటారు. అంతేకాదు, కొన్ని పనులుకూడా చేస్తారు. కాయలు తెంపడం – తోటలు, దొడ్లు శుభ్రం చేయడం వగైరా."

"స్కూల్లో ఉన్నప్పుడేం చెప్తారు?"

"బయటిది కూడా స్కూలు చదువులోనే లెక్క. భవనంలో ఉన్నప్పుడు మూడు విషయాలు మాత్రం బోధిస్తాం ఒకటి భాష, రెండు గణితం, మూడు సాధారణ విషయాలు."

"చరిత్ర, భూగోళం, సైన్స్ చెప్పరా?"

"చరిత్ర, భూగోళం, పౌరశాస్త్రం చాలవరకు భాషకు సంబంధించిన పాఠ్య పుస్తకంలోనే వస్తాయి. అయితే, కుక్కకు నాలుగు కాళ్ళనీ, పిల్లి పాలుతాగునని చెప్పాల్సిన అవసరం వుండదు పుస్తకాల్లో. ఇవి పిల్లలందరికీ సాధారణంగానే తెలుస్తాయి. సైన్సు, వ్యవసాయం మున్నగు అంశాలు మూడవ విషయంలో ఉంటాయి. ఇదికూడా పుస్తకాలద్వారా కంటే రేడియో, సినిమాద్వారా ఎక్కువ బోధిస్తాం."

"అయితే, మీకో థియేటర్ కూడా వుందన్నమాట."

"మీ విశ్రాంతి గది ఉంది చూడండి. దాన్ని థియేటర్‌గా మార్చాం. పిల్లలకు అదొక పీరియడ్. రాండి చూద్దురుగాని" అని లేచినుంచున్నాడు హెడ్ మాష్టర్.

"అవసరంలేదు లెండి, వెళ్ళివస్తాం" అని బయలుదేరాడు పా.మం. శ్రీకాంత్ అనుసరించాడు.

"తోట కూడా చూచి వెళ్లండి" అని హెడ్ మాస్టర్ వెంట వచ్చాడు.

తోటలో ప్రవేశించారు. పిల్లలు గుంపులు గుంపులుగా చేరి ఏదో మాట్లాడుకుం టున్నారు. ఏవేవో పనులు చేస్తున్నారు. కాని, అల్లరి చిల్లర కుర్రాడుగాని, కుర్రదిగాని కనిపించలేదు. చెట్లనిండా పళ్ళున్నాయి. ఒక్కడూ వానివైపు చూడడంలేదు. వింతగా ఉంది పా.మం.కి. 'ఎంత మారిపోయారు పిల్లలు!' అనుకున్నాడు.

"వీరికేమైనా ఫీజుందా?" తెలిసినా అడగాలని అడిగాడు పా.మం.

వింతగా ఎగా దిగా చూచాడు హెడ్ మాస్టరు పా.మం.ని. "ఈ దేశంలో విద్య, వైద్యం పూర్తిగా ఉచితం అనే విషయం మీకు తెలియదా? ఫీజు అనేది మాకు తెలియదు. పైగా, పిల్లలకు పుస్తకాలు, పెన్సిళ్లు, కలాలు వగైరా అన్నీ ఉచితంగా యిస్తాం. మధ్యాహ్నం పుష్టికరం అయిన భోజనం ఉచితం. విద్యార్థుల ఆరోగ్య రక్షణకు స్కూలుకు సంబంధించిన హాస్పిటల్ ఉంది. అక్కడ నెలకోసారి విద్యార్థులందరినీ పరీక్షిస్తారు. అవసరం అయిన చికిత్స వాళ్ళే ఉచితంగా ఇస్తారు. తల్లిదండ్రులు చేయవలసిందల్లా వారి పిల్లలను తప్పకుండా స్కూలుకు పంపించడం. వారి బాధ్యత – అంతవరకే. మిగతా బాధ్యతలన్నీ మావి. హాస్పిటల్ చూస్తారా? మీ వంటిల్లు, భోజనశాల హాస్పిట లయింది."

"అవసరం లేదులెండి, వెళ్ళివస్తా" అని చిరాకుగా కదిలాడు పా.మం. వెంటనే సాగిన శ్రీకాంత్ సిగరెట్టు అందించాడు. సిగరెట్టు వెలిగించి గబగబా పొగ వదల సాగాడు పా.మం.

కార్లో కూర్చున్నాక "చూడండి, మీ ఒక్క కుటుంబం వాడుకున్న ఇల్లు ఇప్పుడు గ్రామం మొత్తానికీ ఉపయోగ పడుతోంది. మీకు హాయిగా అనిపించడంలేదూ!" అడిగాడు శ్రీకాంత్.

"మాదేముందిలేండి – చేసింది మీరేగా!" ధ్వనిలో ఏదో విసుగు కనిపించింది. గ్రహించిన శ్రీకాంత్ మాట్లాళ్ళేదు.

కారు సహకార వ్యవసాయ క్షేత్ర కార్యాలయం ముందు ఆగింది. ఉభయులూ కార్యాలయంలో ప్రవేశించారు. కార్యదర్శి వారికి స్వాగతం చెప్పాడు. ముగ్గురూ కూర్చున్నారు. శ్రీకాంత్ పరిచయం చేశాడు ఉభయులను.

శీతల పానీయాలు వచ్చాయి.

చప్పరిస్తూ కూర్చున్నారు.

ఎవరూ మాట్లాడలేదు.

"గ్రామంలో ఉన్న భూమి వ్యవసాయం చేసేవారికి సమానంగా పంచాం." కార్యదర్శి ప్రారంభించాడు.

"ఎంత భూమి వచ్చింది కుటుంబానికి?" పా.మం. ప్రశ్న.

"కుటుంబానికి మూడెకరాలు వచ్చాయి."

"మూడెకరాల్లో రైతు ఏం పండించగలడు? దేశానికేం అందించగలడు? తానేం తినగలడు? భూమి ముక్కలు కావడంవల్ల దేశానికి నష్టంతప్ప లాభంలేదని మేం మొదటినుంచీ వాదిస్తున్నాం. ఇది ప్రయోగాత్మకంగా జరుగుతూందనుకుంటా. చెప్పండి, ఎంతవరకు విజయం సాధించారో."

"పొరబడుతున్నారు, నేల చీలికలుగా లేదు. చూశ్శేదా ఎదుట వున్నబోర్డు? ఇది సహకార వ్యవసాయక్షేత్ర కార్యాలయం, అలా పంచిన ముక్కలన్నింటినీ కలిపి రైతులు ఉమ్మడిగా వ్యవసాయం చేస్తున్నారు."

"ఇందుకు పెట్టుబడి? ఫలసాయం?"

"మాకు ఉమ్మడిగా ట్రాక్టర్లున్నాయి. ఇతర వ్యవసాయ యంత్రాలున్నాయి. వీటిని ప్రభుత్వం అప్పుగా యిచ్చింది. వాయిదాలమీద రుణం చెల్లిస్తున్నాం. విత్తనాలు వగైరాలు వ్యక్తుల దగ్గర ఉన్నవి పోగుచేసి వాడుతున్నాం. శ్రమించడం అంతా సమానంగా చేస్తున్నారు. రైతులు యంత్రాలు నడపడం నేర్చుకున్నారు. పండిన పంటలో ఉమ్మడి ఖర్చులు పోను మిగతాది సమంగా పంచుకుంటాం. అలా పండిన పంటలో గ్రామ అవసరాలకు సరిపోయేవి నిలవ ఉంచుతాం. మిగతాది బయట అమ్ముతాం."

"ఇది సౌకర్యంగా ఉందనిపిస్తుందా మీకు?"

"కలిసివుంటే కలదు సుఖం కదండీ! మేం పంట బాగా పండించి బహుమతి గెల్చుకున్నాం. ఇప్పుడు మేం ఎంతో హాయిగా వున్నాం. అప్పులవాళ్ళ బెడదలేదు. ఆహారానికి కొరతలేదు. ఒకరికి పట్టెడు పెడ్తున్నాం - మేం తింటున్నాం - సుఖంగా ఉన్నామండీ ఇప్పుడు - ముఖ్యంగా మాలో మాకు హెచ్చుతగ్గులు లేవు, అంతా సమానం, కలిసి మెలిసి ఉంటున్నాం. నిశ్చింతగా ఉందండీ జీవితం."

"అలాగా! సరే - బైల్దేర్దామా మరి!" పా.మం. లేచి నుంచున్నాడు. శ్రీకాంత్ అనుసరించాడు.

"గోశాలకు వెళ్దామా!" శ్రీకాంత్ అడిగాడు.

"నాకు తలనొప్పిగా ఉంది. ఏదో భారంగా వుంది. విశ్రాంతి మంచిదనుకుంటా. అతిథి గృహానికే వెళదాం, తరువాత చూడొచ్చు అన్నీ."

"తలనొప్పిగా ఉందా? అయితే ఆస్పత్రికి వెళదాం."

"అంత ఎక్కువగా ఏం లేదు. వెళదాం పదండి."

"తలనొప్పిగా ఉంటే మందు తీసుకోవాల్సిందే. అది తప్పనిసరి - శాసనం అనుకోండి - ఎంతసేపు, పది నిమిషాలు" అని కారు ఆస్పత్రివైపు పోనిచ్చాడు శ్రీకాంత్.

ఊరికి కాస్తదూరంలో ఉంది ఆస్పత్రి. భవనం అట్టే పెద్దది కాదు. కాని, విడి స్థలం విపరీతంగా ఉంది. ఆవరణలో ముందర కొంతదూరం పచ్చని గడ్డి మొలిపించారు. గడ్డి అయిపోగానే మెట్లు. భవనానికి ఇరుప్రక్కలా దట్టంగా నీడనిచ్చే చెట్లున్నాయి. చెట్ల నీడన సిమెంటు బెంచీల మీద కొందరు రోగులు మాటా మంతీ జరుపుతున్నారు. మెట్లు ఎక్కగానే విశాలమైన హాలు – అందులో డాక్టర్లు కూర్చొని ఉన్నారు. రోగులు అట్టే లేరు. వారిని చూడ్డం అయిపోయిం తరవాత పా.మం.ని పరిచయం చేశాడు డాక్టరుకు శ్రీకాంత్.

"నమస్కారమండీ! మీలాంటివాళ్ళకు చికిత్స చేసే అవకాశం లభించినందుకు సంతోషం. మీ ఊరు చూశారా – ఎంత మారిపోయిందో! ఒక్క బిచ్చగాడు లేడు, ఒక్క దరిద్రుడు లేడు – అంతా హాయిగా ఉన్నారు. అది మీకు సంతోషంగానే ఉండాలి" అన్నాడు డాక్టరు.

"నాకు తల నెప్పిగా ఉందండీ!"

"అలాగా! ఇప్పుడే చూస్తా" అని టెంపరేచర్ చూచి స్టెతస్కోపు పరీక్ష వగైరా చేసి, "యూ ఆర్ పర్ఫెక్ట్లీ ఆల్రైట్! మీరు పరిపూర్ణంగా బాగున్నారు ఫిజికలుగా – మానసికంగా ఏదో కొంత కలత ఉన్నట్లు కనిపిస్తోంది. అందుకు మా దగ్గర మందుంది – ఇదిగో, ఈ మాత్ర వేసుకొని, గ్లాసెడు నీళ్ళు తాగండి, చప్పున తగ్గిపోతుంది" అని మాత్ర అందించాడు.

మాత్ర వేసుకొని నీళ్ళు తాగాడు పా.మం.

కొన్ని క్షణాలు మౌనంగా కూర్చున్నారు.

"ఎలావుంది?" డాక్టరు అడిగాడు.

"బావుంది" – తల పట్టుకుని చూచి అన్నాడు పా.మం. "తగ్గిపోయిందండీ – పూర్తిగా తగ్గిపోయింది – అబ్బా! ఎంత తేలిగ్గా ఉంది! ఏమిచ్చారు మీరు?"

"ఇచ్చింది మందు! చేసింది వైద్యం – వ్యాపారం కాదు. వ్యాపారం చేసి రోగుల్ను పీడించడం కాదు మా లక్ష్యం – వైద్యం చేసి మనిషిని రోగ విముక్తుణ్ణి చేయడం. మా లక్ష్యం మారింది కాబట్టి మీకంత త్వరగా తగ్గింది."

"డాక్టర్! మీరు బాగా మాట్లాడ్తారండి."

"సత్యం ఎప్పుడూ అందంగానే ఉంటుంది. చూస్తారా మా ఆసుపత్రిని ఒకసారి."

"అంతకంటేనా, పదండి" – ఉత్సాహంగా లేచాడు పా.మం.

ముగ్గురూ బయల్దేరారు.

"ఈ గ్రామంలో వయోజనుల, వృద్ధుల ఆరోగ్య పరిరక్షణ మా డ్యూటీ. నాతో పాటు మరో లేడీ డాక్టరుంది. పిల్లలకోసం వేరే ఏర్పాటుంది. మామూలు జబ్బులకు మాత్రం మంచి చికిత్స చేస్తాం, చూస్తాం. చూడండి, పది పడకలున్నాయి" అని పడకలు చూపించి "రెండు తప్ప అన్నీ ఖాళీగా ఉన్నాయి. ఆ ఇద్దరు మంచంలో ఉండాల్సిన రోగులు కాదు. మొదటి రోజుల్లో మంచాలు చాలేవి కావు. యిప్పుడు రోగులు ఉండడం లేదు. అంటే, గ్రామం ఆరోగ్యం అభివృద్ధి చెందిందని అర్థం. మామూలు జబ్బులకే ఇక్కడ చికిత్స అని చెప్పానుగా! కాస్త కాంప్లికేటెడ్ కేసులు

అవుతే జిల్లా కేంద్రానికి పంపుతాం. అక్కడ అన్ని రకాల స్పెషలిస్టులూ ఉంటారు అసలు రోగాలు తగ్గిపోయాయిలెండి. మన దేశంలో ముప్పావు కేసులు తిండిలేని రోగాలే. ఇప్పుడు తిండి చాలినంత దొరుకుతూంది. పైగా, చింతలేని జీవితాలండీ! రోగాలెలావస్తాయి?"

"మీకు పని తగ్గుతూందంటారు."

"అంతేకదండీ, డాక్టరు దగ్గరకు వెళ్ళాలనుకొనే వాడెవడండి – వెళ్ళకూడదనేగా అందరూ కోరుకునేది. అదిగో, ఆ పక్కనున్నది ప్రసూతి వార్డు – స్త్రీ గర్భం దాల్చినప్పణ్ణుంచి ప్రసవించి ఇంటికి వెళ్ళేదాకా మాదే బాధ్యత. బాధ్యత నిర్వర్తించడంలో ఆనందం ఉందిలెండి – కాఫీ తీసుకుంటారా కొద్దిగా?"

"అవసరం లేదులెండి, వెళ్ళివస్తాం. మీకు చాల చాల థాంక్స్!"

"ఇక్కడిదాకా వచ్చారు! పశువుల అస్పత్రికూడా చూచి వెళ్ళగూడదూ – పక్కనేగా ఉంది."

ముగ్గురూ అక్కడకు వెళ్ళారు. అక్కడ డాక్టరు లేడు. అర్జంటు కేసువస్తే వెళ్ళాడట. పశువైద్యశాలలో పశువుల వైద్యానికి, కృత్రిమ గర్భోత్పత్తికి ఏర్పాట్లున్నాయి.

డాక్టరువద్ద శలవు తీసుకొని కారెక్కి వెళ్ళిపోయారు పా.మం., శ్రీకాంత్.

భోజనాలుచేసి విశ్రమించాడు పా.మం. శ్రీకాంత్ పుస్తకం చూస్తూ కూర్చున్నాడు.

పడుకున్నాడనేగాని చిరాకుగావుంది పా.మం.కి. ఎదమీద ఏదో బరువు పెట్టినట్లుంది. చూస్తూ చూస్తూ తన ఆస్తి యావత్తూ గుంజుకున్నారు. ఊరు మొత్తంలో ముప్పావు ఆస్తి తనదే. అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్లు తన సొమ్ము అంతా దానం చేశారు. తనను సర్వనాశనం చేశారు. జనం బాగుపడ్డారని సంతోషించాలట! ఎవనిబాగు వానిది! తన్ను మాలిన ధర్మం ఉందా? పైగా, నా ఊరికే నన్ను తెచ్చారు! ఎంత నీచులు! నన్ను నాశనం చేశారు. కూలి చేసుకొమ్మని వదుల్తారేమో! ఇంకేముంది మరి నాకు! నా బిడ్డల గతి? ఎన్ని తరాల తిన్నా తరగని ఆస్తి సంపాదించాను. అంతా దోచేశారు – నన్ను బికారిని చేశారు! వీళ్ళు వట్టి దోపిడీ దొంగలు. దొంగలే రాజ్యం చేస్తున్నారు! పిండారీలు రాజ్యం చేస్తున్నారు!! ఏం చేయగలం మనం వీళ్ళను? ఏం చేయా లిప్పుడు? అలాంటి ఆలోచనలతోనే పొద్దుకుంకింది. శ్రీకాంత్ పిలిస్తేగాని ఈ లోకంలోకి వచ్చాడుకాడు పా.మం.

"ముఖం కడుక్కోండి – కాఫీ తాగుదాం" – శ్రీకాంత్.

విధిలేక లేచాడు పా.మం. ముఖం కడుక్కొని బయటికివస్తే నలిగిపోయినట్లున్నాడు. కళ్ళు పీక్కుపోయాయి. చెంపలు డొక్కుపోయాయి కళ్ళలో నీరసం కనిపిస్తూంది. గ్రహించాడు శ్రీకాంత్.

"అవల పచ్చికలో కూర్చుందామా?" అని దారితీశాడు శ్రీకాంత్... అనుసరించాడు పా.మం. ఉభయులు పచ్చికలో వేసిన కుర్చీల్లో కూర్చున్నారు.

వాతావరణం హాయిగా ఉంది. సూర్యుడు కుంగుతున్నాడు. పడమటి ఆకాశం పగడాలు పరచినట్లుంది. చల్లని గాలి మెల్లగా వీస్తూంది. రకరకాల పక్షులు గుంపులు గుంపులుగా ఆకాశంలో పరిగెడుతున్నాయి – గూళ్ళకు.

అయినా చిరాకుగానే ఉంది పా.మం.కి.

రాములు కాఫీ తెచ్చాడు.

అతనితో కాఫీ తాగుతుంటే ఏదో చిదుగుల మంటలాంటిది మండుతూంది, పా.మం. గుండెలో. అయినా మాట్లాడలేదు. అందువల్ల మాట్లాడలేదు.

ముగ్గురూ మౌనంగానే వున్నారు.

కాకుల కావు, కావు తప్ప వేరే శబ్దం లేదు.

"సినిమాకు వెళదామా?" మౌనాన్ని భంగం చేశాడు శ్రీకాంత్.

"సినిమాకూడా ఉందా ఊళ్లో!" పా.మం.

"అవును. ఒక సినిమా హాలుంది. ఒక నాటకాల శాల ఉంది. ఇవ్వాళ రాత్రికి ఇక్కడి యువకులు 'ప్రతాపరుద్రీయం' నాటకం వేస్తున్నారు. మీరు పడుకున్నప్పుడు ఆహ్వానించి వెళ్ళారు. కాదంటారా – క్లబ్బుకు వెళ్దాం. గ్రామస్థులు ఒక క్లబ్బు ఏర్పరచుకున్నారు."

"ఏర్పరచుకుంటారు. మందిసొమ్ము. ఎందుకు ఏర్పర్చుకోరు! నాశనం చేస్తానందర్నీ, నా సొమ్ముతిని బాగుపడాలనుకుంటున్నారేమో!" మంత్రిగారు పెద్దగానే పలవరిస్తుంటే పక్కసీట్లో ఉన్నతను తట్టిలేపాడు.

మంత్రిగారు కళ్ళు తెరచి చూచారు, సభ ముగిసింది. జనగణమన పాడే దశలో ఉంది. మంత్రికి గుండెదడ పట్టుకుంది వళ్లు చెమటలు పట్టింది. ఒకసారి చుట్టూ చూచాడు. తాను కన్నది కల మాత్రమేనని ధ్రువపరచుకున్నాడు. చుట్టు ప్రక్కల చాలమంది గాంధీ టోపీల వారున్నారు.

ప్యూనువచ్చి మంత్రిని చేయిపట్టుకొని లేపాడు. జనగణమన అవుతుంటే నుంచున్నాడనేగాని మనసు మనసులో లేదు. సమావేశం సమాప్తం కాగానే కార్లో బయల్దేరాడు. ఇంకా తాను కన్నది కల అనే విషయంపై విశ్వాసం కలగలేదు. గుండెదడ ఇంకా తగ్గలేదు ఆయాసం వస్తూనే ఉంది. అయినా, వీధుల్ను జాగ్రత్తగా గమనిస్తున్నాడు.

బిచ్చగాళ్ళున్నారు. బండ్లులాగే మనుషులున్నారు. వీపుమీద బస్తాలు మోసే ఆడవాళ్ళున్నారు. బూట్ పాలిష్ చేసే కుర్రాళ్ళున్నారు. గుడిసెలున్నాయి మురికిపేటలున్నాయి. అన్నీ చూచాడు మంత్రి. హమ్మయ్య అనుకున్నాడు. ఏదీ మారలేదని గ్రహించాడు. తానింకా మంత్రినేనని నమ్మాడు.

అది నిజమే గాని, ఎప్పటికైనా ఆ కాలం రావచ్చునేమో! తన ఆస్తి ఊడవచ్చునేమో! లక్షణాలు అలాగే కన్పిస్తున్నాయి. జనం తెలివి మీరుతున్నారు. శాసనాలూ అలాంటివే వస్తున్నాయి. తాను గుడ్డిగా వాటిని బలపరుస్తున్నాడు. ఏం చేయాలి మరి?

నగ్నసుందరుల సినిమా పోస్టర్లు కనిపించాయి.

పుస్తకాలు దుకాణాల్లో బూతు పుస్తకాలు కనిపించాయి.

రోడ్డుమీద హిప్పీ వేషపు యువకులు కనిపించారు.

"చాలు, ఇవివుంటే చాలు – జనం తెలివి మీరలేదు. జాతి నిర్జీవం కావడానికి ఇంతకుమించిన సాధనాల్లేవు. చాలు – మన ఆస్తి భద్రం, మన పదవి భద్రం, మనం భద్రం.

మరి కొన్ని బార్లు తెరిపించాలి.

వాటిల్లో నగ్న నృత్యాలు ఏర్పరచాలి.

సిరప్, గంజాయి విరివిగా అమ్మాలి.

యువకులను నిద్రపుచ్చాలి.

అంతే చాలు, మనం భద్రం, మన ఆస్తి భద్రం. మన పదవి భద్రం" – ఈ ఆలోచనలతోనే ఇల్లు చేరుకున్నాడు మంత్రి.

ఆ రాత్రి మంత్రికి నిద్రపట్టలేదు. అన్ని హంగులూ, హంగామాలూ ఉన్నా– తన పదవి ఊడే ప్రమాదం ఉందనుకున్నాడు. తన ఆస్తి పోయే ప్రమాదం ఉందనుకున్నాడు. ఆ ప్రమాదాన్ని అరికట్టాలి. వస్తున్న వెల్లువను అడ్డుకోవాలి – ఏం చేయాలి? ఎలా చేయాలి? ఎవరు చేయాలి??

మందు సీసాలు ఖాళీ అయినాయి.

సిగరెట్టు పీకల్తో గది నిండిపోయింది.

మెదడులో సూదులు గుచ్చుకుంటున్నాయి. అయినా ఆలోచన రావడం లేదు.

ఆలోచన?

ఆ–లోచన?

ఆలో–చన?

ఆలోచ–న?

న–న–న–!!!

వచ్చేసింది! ఆ! వచ్చేసింది. వచ్చింది గట్టి ఆలోచన!

"ప్రాంతీయాభిమానాలు రెచ్చగొట్టాలి!

భాష పేర జనాన్ని పురికొల్పాలి!

నదీజలాల వివాదాలు రేకెత్తించాలి!

సరిహద్దు తగాదాలు ఉసికొల్పాలి!

మత మహమ్మారిని వ్యాపింపజేయాలి!

"జనాన్ని దోవ మళ్ళించాలంటే ఇవే మంచి ఆయుధాలు! వీటికి మించిన ఆయుధాల్లేవు. అందుకే పూనుకోవాలి. మంత్రిపదవి పోయినా, ఆస్తిని రక్షించుకోవాలి. అంతే, రేపే రాజీనామా యిస్తాను.

"నా భాష, నా కులం, నా మతం, నా ప్రాంతం నా మంత్రి పదవికంటే పవిత్రం అని ప్రకటిస్తా!

జై మతానికి!

జై కులానికి!"

అంతటితో మంత్రిగారికి నిద్రపట్టింది.

"సహనావవతు

సహనౌ భునక్తు

సహవీర్యం కరవావహై!"

సమాప్తం

# పోరాటమే మహాఫలితం

1975 నుండి భారదేశ ప్రజాస్వామ్యానికి విపత్తు మొదలైంది. ఇప్పటికి ఇద్దరు ప్రధానులను బలిగొన్న ప్రజాస్వామ్యం ఇంకా ఆ విపత్తునుంచి బయటపడలేదు.

1975లో భారత ప్రజాస్వామ్యం కొన్ని వింత - విపరీత - వెర్రి పరిణామాలను చూచింది. అప్పటి ప్రధాని - నెహ్రూ కూతురు - ఇందిరా గాంధీ కొన్ని ప్రజోపయోగ సంస్కరణలను ప్రవేశపెట్టింది. ఆ సంస్కరణలను తన పదవిని కాపాడు కోవడానికి ప్రవేశపెట్టిందని బిజెపి సహితంగా అన్నిరాజకీయ పార్టీలూ వృద్ధ నేత జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వంలో హింసాయుత తిరుగుబాటు చేశాయి. జయప్రకాశ్ సైన్యాన్నీ, పోలీసులనూ తిరుగుబాటు చేయమని పిలుపునిచ్చాడు.

దేశభద్రతకే ముప్పు ఏర్పడిందని ప్రధాని ఇందిర 26-6-1975 నాడు అమాంతంగా అంతరంగ అత్యయిక స్థితిని - ఇప్పటికి భారత చరిత్రలో తొలిసారి - ప్రవేశపెట్టింది.

27-6-1975 నాటి నా డెయిరీ నుంచి :-

"నిన్న సాయంత్రం ఆంధ్రభూమి ప్రత్యేక సంచిక ప్రచురించింది. జయప్రకాశ్ నారాయణ్, మొరార్జీ దేశాయ్ వంటి Top Leaders అందరినీ అరెస్టు చేశారు. సివిల్ లిబర్టీస్ వెంకటేశ్వర రావును కూడా అరెస్టు చేశారు. ఈ వార్త రేడియోలో ఎక్కడా చెప్పలేదు. ఉదయం పత్రికల్లో కూడా వార్త రాలేదు. పత్రికల మీద సెన్సారు ప్రవేశపెట్టారు. వార్తలు - వార్తాపత్రికలు మనకు కళ్ళలాంటివి. అవిసరిగా లేకపోతే గ్రుడ్డి కళ్ళన్నట్లే! ఇప్పుడు ప్రభుత్వం అందించిన వార్తలే చదవాలి. పత్రికల నోరు నొక్కేశారు. యుద్ధాలు వచ్చినప్పుడూ ఇలా జరుగలేదు. నైజాం నవాబు కాలంలో మాత్రం జరిగింది. ఆంధ్రపత్రిక సంపాదకీయం రాయలేదు."

28-6-1975 నాటి నా డెయిరీనుంచి: "ఏదీ జాతీయం చేయడం లేదు - కంట్రోళ్ళు విధించడం లేదు అన్నది ఇందిర తన రేడియో సందేశంలో. మరి ఎందుకు ఈ అత్యయిక ప్రకటన?

తాటిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడగడ్డికి అన్నట్లుంది ఇందిర వాదన! ఎన్నడో మంత్రిహత్య జరిగినందుకు ఇప్పుడు ఎమర్జెన్సీ! ఎప్పుడో ఏదో పత్రిక మత కల్లోలాలు రేపిందట - అందుకట సెన్సార్!! చీమలున్నాయి కాబట్టి ఇల్లు తగలబెట్టు అన్నట్లుంది వ్యవహారం!!!

ఇందిర సోషలిజం తెస్తుందన్నది కలలోని మాట. The slogan is handy to her. Both Indira and oppossitions are feeding people on slogans."

లలిత్‌నారాయణ్ మిశ్రా అనే కేంద్ర మంత్రి బీహార్ బాంబుప్రేలుడులో మరణించాడు.

ప్రతి దానికీ కృష్ణ, శుక్లపక్షాలు – చీకటి వెలుగులు, ఉంటాయి. అత్యయిక పరిస్థితిలో సాధారణ ప్రజకు – గ్రామప్రజకు మేలు కలిగిన మాట వాస్తవం. బ్యాంకులు విరివిగా అప్పులిచ్చాయి. బ్లాక్‌మార్కెటీర్లు, స్మగ్లర్లు అరెస్టు కావడాన ధరలు బాగా తగ్గాయి. ప్రభుత్వ కార్యాలయాలు పనిచేశాయి. ఉత్తరాలు తొందరగా అందాయి. రైళ్ళు సమయానికి చేరాయి.

ముఖ్యంగా ఇందిర 20 సూత్రాల కార్యక్రమం నాకు నచ్చింది. సి.పి.ఐ. వారు బలపరచారు. "తూరుపు తెలవారింది" అనే రేడియో నాటకం రాశాను. అది ప్రసారం కాగా, "హిందూ" సహితంగా పలుపత్రికలు ప్రశంసించాయి.

అప్పుడు ఆకాశవాణివారు "అఖండదీపం" అనే శీర్షికన ఒక full length drama వ్రాయమన్నారు. సినీమా నటులతో ఆ నాటకాన్ని సీరియల్‌గా ప్రసారం చేస్తామన్నారు. కంట్రాక్టు మీద సంతకం చేశాను.

"నిరంకుశాః కవయః" కవులు – రచయితలు నిరంకుశులు. వారితో వ్రాయించడం కష్టం. నేను అంత శ్రద్ధ చేయలేదు. కాలం దొర్లిపోతున్నది. ఆకాశవాణి వారి వత్తిడి ఎక్కువవుతున్నది. నేను స్క్రిప్టు ఇచ్చేవరకు, 1977 మార్చిలో ఇందిర ప్రభుత్వం పడిపోయింది. మొరార్జీ ప్రధానిగా జనతా ప్రభుత్వం ఏర్పడింది."

ప్రభుత్వం మారగానే బట్ట మారినట్లే పాలసీలు మారిపోతాయి!

ఆకాశవాణి ఇరకాటంలో పడింది. కంట్రాక్టు ఉంది. రికార్డు చేయాలి. సినీమా నటులుకాక ఇతరులతో నాటకం రికార్డు చేయించింది. నాటకంలో వేషం నేను ఇప్పించిన నా మిత్రుడు సురమౌళి 'అఖండదీపం ఇందిరను పొగిడేనాటకం' అని ఢిల్లీకి వ్రాశాడు. అప్పటి సమాచార శాఖ మంత్రి లాల్‌కృష్ణ అద్వానీ – రేడియోలో షెడ్యూలైన – నాటకాన్ని నిలుపు చేయించాడు. నేను నాటకం వినడానికి రేడియో ముందు కూర్చున్నాను. కనీసం నాటకం ప్రస్తావన లేకుండా సంగీతకార్యక్రమం ప్రసారం అయింది. తరవాత రేడియో వాళ్ళ వల్ల కారణం తెలిసింది.

నేను పొగడ్తలు చాతకానివాణ్ణి. ఇవ్వాల్టికీ ఎవరి ముఖస్తుతీ చేయలేదు. నేను ఇందిరను పొగిడానంటే విలవిల లాడిపోయాను. అహం దెబ్బ తిన్నది. ఆ మచ్చ వదిలించుకోవడానికి ఉద్యమించాను.

అఖండదీపం, ధనస్వామిక వ్యతిరేకంగా జరిగిన కట్టుబానిసల పోరాటం. 'ప్రాణం లేని ఆస్తికన్న ప్రాణం ఉన్న మనిషి మిన్న' అని ధనస్వామికి కళ్ళు తెరిపించిన నాటకం. నాటకంలో ఎక్కడా ఇందిరను గురించిగాని ఇందిర ప్రభుత్వాన్ని గురించి గాని ప్రస్తావన సహితం లేదు.

ఈ విషయం వివరిస్తూ అద్వానీకి లేఖవ్రాస్తూ నాటక ప్రతీ, ఇంగ్లీషు సినాప్సిస్ పంపి ఊరుకోలేదు – ఇక్కడి జనతా ఎం.పీలను కలిసి వివరించాను. వారు నన్నూ, నాటకాన్నీ అర్థం చేసుకున్నారు. వారు అద్వానీకి గట్టిగా – 'ఇది ప్రజాస్వామ్య పద్ధతి కాదు' – అని వ్రాశారు. అద్వానీ ఆకాశవాణికి "అఖండదీపం" కుదించి గంట నాటకంగా ప్రసారం చేయవలసిందని ఆదేశించారు.

'అఖండదీపం', గంట నాటకం నాకు సంతృప్తి కలిగించ లేదు. కాని, నా మీది నీలాపనిందను తొలగించుకో కలిగినందుకు సంతోషించాను.

1977లో మా చిన్నమ్మాయి సుధ వివాహం చేసి, ఆర్థిక – ఆరోగ్య పరంగా క్రుంగి పోయాను. అప్పుడు మిత్రులు చలసాని ప్రసాద్‌గారు 'చతుర' మాసపత్రిక కోసం నవల వ్రాసి ఇమ్మని పట్టుపట్టారు. మానసికంగానూ, శారీరకంగానూ నవల వ్రాసే స్థితిలో లేను. చలసానివారు పట్టు విడవలేదు. 'అఖండదీపం' నవలగా వ్రాస్తానని చెప్పి, 'పావని' నవల వ్రాసి ఇచ్చాను. 1978 జూన్‌లో 'పావని' చతురలో నవలగా వచ్చి ప్రశంసలందుకుంది. ఇద్దరు 'పావని'ని చలన చిత్రంగా నిర్మించడానికి విఫల ప్రయత్నం చేశారు.

అఖండదీపం రేడియో నాటకం స్క్రిప్టు నాకు తెలియకుండానే – ఆకాశవాణి నుంచి దూరదర్శన్‌కు మార్చి ఒకతను దాని చిత్రీకరణకు అనుమతి సంపాదించాడు.

అలా సంపాదించిన అనుమతిని అతడు మరొకనికి అమ్ముకున్నాడు. ఆ మరొకడు మూడోవానికి అమ్ముకున్నాడు. ఈ మొత్తం లావాదేవీలలో రచయితగా నా ప్రమేయం లేకుండడమేకాదు, అసలు నాకు తెలియనే తెలియదు.

ఆ మూడవ వాడు నా దగ్గరికి వచ్చి ఇదంతా వివరించకుండానే – అతి కొద్ది డబ్బుకు – నా అనుమతి సాధించాడు. అతడు అసాధ్యుడు – నేను అమాయకుణ్ణి. అంతేకాదు, నేను జబ్బుతో ఉన్నాను – డబ్బు అవసరం.

19–4–1991 సాయంత్రం "అఖండదీపం" దూరదర్శన్‌లో సీరియల్‌గా ప్రారంభం అయింది. పేరు మాత్రం నాది – కథ ఏ అంశంలోనూ నాది కాదు! ఆనాటి నా ఆవేదన వెలిబుచ్చడానికి అక్షరాలు చాలవు. మళ్ళీ ఒక పోరాటం!

ఈ కథ నాదికాదు, ప్రసారం వెంటనే ఆపవలసిందని పత్రికాప్రకటన ఇచ్చాను. పత్రికలన్నీ – నాతో సహకరించి – ప్రచురించాయి.

నా పేరుతో నాదికాని దాన్ని ప్రసారం చేయడాన్ని విరసం సహితంగా సాహిత్య సంస్థలన్నీ ఖండించడమే కాక, దూరదర్శన్‌కు తీవ్రంగా తమ అసమ్మతిని వ్యక్తం చేశాయి. తెలంగాణ కిసాన్ మజ్దూర్ పంచాయత్ వారు దూరదర్శన్ ముందు ధర్నాచేయడమేకాక, డైరెక్టర్‌ను ఘెరావ్ చేశారు.

నేను కేంద్ర సమాచార, ప్రసార శాఖామంత్రి సుబోధ్ కాంత్ సహాయ్‌గారికి నిరంతరం లేఖలు, టెలిగ్రాములు పంపాను. రచయితల సంస్థలూ పంపాయి. రచయితలు వందల కార్డులు వ్రాశారు.

దిక్కుతోచని ప్రొడ్యూసర్లు కోర్టును ఆశ్రయించి, అఖండదీపం సీరియల్ నిర్మాణ, ప్రదర్శనాదులకు ఆటంకం కలిగించరాదని నా మీదకు ఇంజంక్షన్ ఉత్తరువులు తెచ్చారు.

కోర్టు ఆదేశాల దృష్ట్యా ప్రభుత్వం తమ నిస్సహాయతను తెలిపింది.

నేను వకీళ్ళ మాయాజాలంలో చిక్కుకొని, డబ్బు గుమ్మరించి, ఆసుపత్రి పాలైనాను. ప్రొడ్యూసర్లు అసాధ్యులు. వారు కోర్టు కేసు ఎటూ తేల్చకుండా చేసి పదమూడు వారాల సీరియల్ పూర్తి చేసుకున్నారు.

వారు నా మీద పెట్టిన క్రిమినల్, నష్టపరిహారపు కేసులనుండి బయట పడేవరకు నా ప్రాణం తోకకు చేరింది.

రచయిత పేరుతో అతనికథ కానిది సీరియల్ కావడం నాది మొదటిదీ కాదు – చివరిదీకాదు. అయితే, తెగించి పోరాటం జరిపినవాణ్ణిమాత్రం బహుశా నేనే మొదటివాణ్ణి. చివరివాణ్ణి అనడానికి మాత్రం వీల్లేదు.

కాలం అనంతం.

సమాజానిది విశ్వరూపం.

ప్రతి పోరాటానికీ ఫలితాలుండవు.

పోరాటమే మహా ఫలితం.

నా యీ పోరాటంలో వ్యక్తులూ, సంస్థలూ సహకరించాయి.

వారందరికి కృతజ్ఞతలు.

'పావని' నవల ప్రచురించారు 'చతుర' సంపాదకులు. వారికి కృతజ్ఞతలు.

'పావని' నవలను పుస్తకంగా ప్రచురిస్తున్నారు విశాలాంధ్ర ప్రచురణాలయం వారు. వారికీ కృతజ్ఞతలు.

సర్వేసి సుఖినస్సంతు – అందరూ సుఖంగా ఉండాలి!

దాశరథి రంగాచార్య

సికింద్రాబాదు,
25-12-1997.

# పావని

పొద్దు పొటమరించింది.

మల్లమ్మ - శివయ్య వాకిట్లో కళ్ళాపి జల్లింది. వాకిలి సాంతం పచ్చగా - పచ్చిగా ఉంది. మల్లమ్మ ముగ్గుబుట్ట అందుకుంది. ముగ్గులు దిద్దింది. పచ్చని వాకిట్లో తెల్లని ముగ్గు ముచ్చటగా ఉంది. మల్లమ్మ ముగ్గు ముగించి తలెత్తింది. నర్సిమ్మ కనిపించాడు.

బుర్ర మీసాలూ, తలపాగా, చేతిలో బల్లెం, కళ్ళలో నిషా - నర్సిమ్మ భయంకరంగా ఉండాలని ప్రయత్నిస్తుంటాడు. అతడు తొడుక్కున్నది శివయ్య విడిచి పారేసిన చొక్కా. వదులుగా ఉంది. అతనికంటే పొడుగ్గా ఉంది. అక్కడక్కడా మాసికలున్నాయి. అందులోనే ధీమా వలకబోస్తాడు నర్సిమ్మ.

మల్లమ్మ నర్సిమ్మను చూసింది. ముగ్గుబుట్టతో వెనక్కు మళ్ళింది - దొడ్లోకి వెళ్ళడానికి.

"ఒసే పోరీ! మారుమనుం కట్టుకోరాదే- వయసు నీ దగ్గరనే కాపురం ఉంటదనుకుంటున్నావా? ఇగ పరమిగా డొస్తదా? చస్తదా?" నర్సిమ్మకు మల్లమ్మను చూడగానే ఏదో ఒకటి అనాలనిపిస్తుంది.

"అన్నా! నీ కాల్మొక్త. అట్లనకె. వస్తడే. రాక యాడికిపోతడే" 'అన్నా' అనే వరుసను ఆశ్రయించింది. అదేదో కవచంలా కాపాడుతుందని ఆమె నమ్మకం.

"గట్లనే అనుకుంటుండవే. అట్లనేలేగని జర ఇంగలంఇయ్యి చుట్టకాల్చుకుంట." నర్సిమ్మదగ్గర అగ్గిపెట్టె ఉంది. అయినా, మల్లమ్మను నిప్పు అడిగాడు. ఆమెను మరోసారి చూడొచ్చని అతని ఆరాటం.

మల్లమ్మ పిడకమీద కణికవేసి తెచ్చిచ్చింది. నర్సిమ్మ చుట్ట కాల్చుకోలేదు. వెళ్ళిపోయే మల్లమ్మను చూస్తున్నాడు. ఆమె నడకలో వయారం ఉంది, వయసు పోకడలున్నాయి.

"దొర ఇంకలేవలేదే?" బ్రహ్మయ్య మాట విని నర్సిమ్మ ఈ లోకంలోకి వచ్చాడు.

"లేవలే. వస్తడు కూకో" అన్నాడు నర్సిమ్మ.

"బమ్మయ్యన్నా! కల్లోల్లకు పైసలిస్తనని ఎగ్గొట్తాన్నావులే. యాది ఉంచుకుంట ఏమనుకుంటున్నవో" - బెదిరించాడు.

"ఇస్తలే నర్సిమ్మా! ఇంట్ల ఆడదానికి బాగలేదు. జర బాగుకానియ్యి" - బ్రహ్మయ్య బతిమిలాడాడు.

"ఇచ్చినట్లే ఉన్నదిలే. చూస్కోక పోతనా?" అని చుట్ట వెలిగించాడు.

ఇంతలో కుమ్మరి కొమరయ్య, కమ్మరి బాలయ్య, మంగలి మల్లయ్యా ఒకరి తరవాత ఒకరు చేరుకున్నారు. ఆ ఊళ్ళో అందరిపొద్దూ శివయ్య ఇంట్లో పొడవాల్సిందే. అక్కణ్ణించే వారు తమ పనులకు వెళ్ళాలి. అందరూ శివయ్య రాక కోసం పడిగాపులు కాస్తున్నారు.

శివయ్య సిగరెట్టు పొగ వదులుతూ గడప దాటాడు. అక్కడ కూర్చున్న వారంతా చేతులు నేలకానించి దండాలు పెట్టారు. శివయ్య ప్రతినమస్కారం చేయడు. అక్కడున్న వాలుకుర్చీలో కూర్చున్నాడు. వాకిట్లో వాళ్ళంతా నేలమీద కూలబడ్డారు. నర్సిమ్మ చుట్టపారేసి నిటారుగా నుంచున్నాడు.

శివయ్య పక్కకు చూచాడు. అక్కడ చాప కాళీగా ఉంది. చాపమీద డస్కు ఉంది. డస్కుపక్క చిన్నబీరువా ఉంది. దానికి తాళం ఉంది.

"పంతులింక రాలే" – శివయ్య ఎవరిని అడుగుతున్నాడో తెలియకుండా అడిగాడు. నర్సిమ్మ ఉలిక్కిపడ్డాడు. "ఇప్పుడే వస్తిదొరా! పట్టుకొస్త, పిలిచొస్త" అని బల్లెం పట్టుకొని ఉరికాడు.

"పెండ్లాం లేకుంటేనే పొద్దెక్కేదాక లేవడు. ఇగ పెండ్లాముంటే పొద్దు కూకే దాక పండెటట్లున్నాడు పంతులు!" ఏదో చమత్కరించినట్లు అందరినీ చూచాడు శివయ్య. ఎవ్వరూ నవ్వినట్లు కనిపించలేదు.

"పంతులుకు పెండ్లయిందట కాదుండి?" బ్రహ్మయ్య తనకేదో అర్థం కానట్లు అన్నాడు.

"అయింది లేవయ్యా! పంతులుకు మన మీద నమ్మకం లేదు. పెండ్లాన్ని ఈ ఊరికి తేడు. బస్తీ పిల్ల. వయసులో ఉంటది, అక్కడ..."

"నమస్కారం శివయ్యగారూ! వస్తునే ఉన్న, నర్సిమ్మ ఎదురయిండు. రాత్రి సాంతం నిద్రపట్టలే–నల్లులు" అన్నాడు కృష్ణారావు.

అందరూ గొల్లున నవ్వారు. కృష్ణారావుకు సందర్భం అర్థం కాలేదు. వెలవెల పోయాడు. మెట్లమీద చెప్పులు విడిచి, వెళ్ళి చాపమీద కూర్చున్నాడు. బీరువా తాళం తీసి కాతాపుస్తకాలు డస్కు పక్కన పెట్టాడు. శివయ్యవైపు చూచాడు.

"కానియ్యవయ్యా పని – వచ్చుడే ఆలస్యం – పైనించి నసుగుడు." శివయ్య విసుక్కున్నాడు.

"ఎవరి లెక్క చూడమంటారు?"

"నా లెక్క చూడండి, మా ఇంట్ల బాగలేదు. పోవాలె." బ్రహ్మయ్య బతిమాలుతున్నట్లు అన్నాడు.

"వడ్ల బ్రహ్మయ్య కాతా – పనిముట్లు కొనడం వగైరాలకు తీసుకున్న అప్పు, అందుకు అయిన వడ్డీ మొత్తం ఒక వేయి నాలుగు నూర్ల పదిహేను రూపాయల ఇరవై ఆరు పైసలు. ఇందు యేంజమ్లే. నిన్న జమకట్టినవి ఆరు రూపాయలు. మళ్ళీ అప్పుగా తీసుకున్నవి అయిదు రూపాయలు. సారాయి దుకాణానికి చీటిరాసి ఇచ్చినవి రెండు రూపాయలు. మొత్తం మీద చెల్లుపడలేదు, ఖాతాలో ఒక్కరూపాయి పెరిగింది, దాని వడ్డీ చేర్చలేదు."

"రామ రామ, నేను సారా తాగినా నండి? తాగని సార లెక్కలోకి ఎక్కించి నారుండి?" బ్రహ్మయ్యకు ఏడుపు ముఖం పడింది. ఎముకలు మసిచేసుకొని

రోజంతా సంపాదించి తెచ్చి జమ కట్టేస్తే రూపాయి జమకాకపోగా ఖర్చు యేదో రూపాయి రాశాడు. అదీ అతని బాధ.

బ్రహ్మయ్య పనిముట్లకని శివయ్య దగ్గర కొంత పైకం తీసుకున్నాడు. దాంతో అతడు శివయ్యదగ్గర తాకట్టు పడిపోయాడు. అసలు డబ్బు హనుమంతుని తోకలాంటి వడ్డీతో అంత అయింది. పనిముట్లు రోజూ సాయంకాలం శివయ్యకు అప్పగించాలి. చేసిన కష్టం తెల్లవారి శివయ్యకు అప్పగించాలి. దిన బత్తానికి అప్పు తీసుకుకోవాలి. అప్పుడు గాని శివయ్య మళ్ళీ పనిముట్లు ఇవ్వడు. ఇదొక విషచక్రం. ఇదిలా తిరుగుతూనే ఉంటుంది. బాకీ పెరుగుతూనే ఉంటుంది. శివయ్య రుణం ఈ జన్మలో తీర్చలేడు బ్రహ్మయ్య.

"బ్రహ్మయ్యా! సారా దుకాణం నేనే గుత్తపట్టిన, మన ఊరి పైకం మందికి పోవుడెందుకని, ఇన్నవా? మల్ల మీ అసుటోండ్లు తాగకుంటె సర్కారు పైకం ఎట్ల ఎళ్ళుతది?" గ్రామాన్ని స్వయంసమృద్ధం చేసే దీక్ష వహించినట్లు మాట్లాడాడు శివయ్య.

"బ్రమ్మయ్య అనేది అది కాద్దొర! లెక్కల రాసుకుంటిరి. చీటి రాసియ్యక పోతిరి, అట్ల ఇస్తే ఇంత నోట్లపోసుకోక పోయిన్నా అంటాడు." కమ్మరి బాలయ్య కదిలించాడు, తుపుక్కున ముందు ఊసుకొని కాలితో దాన్ని రాస్తూ.

"వరే బాలిగా! మాటలు మంచిగ రానియ్యి – ఎన్నడన్న చూచినావుర తాగంగ?" తాగితే ఏవో జంధ్యాలు తెగిపోతాయన్నట్లు జంధ్యాన్ని గట్టిగా పట్టుకుని అన్నాడు బ్రహ్మయ్య.

"బమ్మయ్య అందరు చూడంగ తాగడుండి." మంగలి మల్లయ్య అంటించాడు, జంధ్యం ఉన్నవారు అందరూ చూడగా తాగరనే అర్థంతో.

అంతా గొల్లున నవ్వారు. బ్రహ్మయ్య వెలవెలపోయాడు. శివయ్య నవ్వుతూ "బ్రహ్మయ్యా! తాగని దానికి నీకెందుకయ్యా కోపం?" అన్నాడు.

"దొరవారూ! మేం విశ్వబ్రాహ్మలం. కావాల్నంటె చూడండి" అని జంధ్యం తీసి చూపించాడు.

మళ్ళీ అందరికీ నవ్వు వచ్చింది. కానీ ఎవరూ నవ్వలేదు. "ఇయ్యాల్రేపు బ్రాహ్మణులుకూడా తాగుతున్నారు. సర్లేగని, పైకమెంత తెచ్చినవో చెప్పు, సార సుంకం తప్పెడిది లేదు, నువ్వు తాగు. తాగకపో – ఇన్నవా?" చివరి వాక్యాలు కరకుగా అన్నాడు శివయ్య.

బ్రహ్మయ్య విశ్వబ్రాహ్మణ లోకం నుంచి అసలు లోకంలోకి వచ్చాడు. సారాయి సుంకం తప్పదని గ్రహించాడు. జేబులోంచి నోట్లు తీసి జాగ్రత్తగా లెక్క పెట్టాడు. అయిదున్నాయి – అవి చెమటతో తడిసి ఉన్నాయి. గట్టిగా పట్టుకున్నాడు– వదులుకోదలచనట్లు.

"అట్ల చూస్తవేం, జమకట్టు." నర్సిమ్మ హుంకరించాడు.

"పైకం కావల్నుండి. ఆడదానికి రోగం. లేస్తలేదు." బ్రహ్మయ్యకు దుఃఖం దుముకుతుంది. బుజాన ఉన్న జంధ్యం అక్కరకు రాలేదు. శివయ్య అనుగ్రహం కావాలతనికి. అప్పులిచ్చే వారి మెప్పుకోసం మహా మహా దేశాలే మోకరిల్లుతున్నాయి!

"పంతులూ! బెల్లం కొట్టిన రాయోలే కూచున్నవేం, పైకం తీసుకో." శివయ్య గద్దించాడు.

బ్రహ్మయ్య డబ్బు అందించాడు. కృష్ణారావు అందుకున్నాడు.

"దొరవారూ! నా గతేమంటారు?" బ్రహ్మయ్య కన్నీరు కళ్ళదాకా వచ్చి నిలిచి పోయింది.

"ఊరికె నసుగుతావు. ఎంత కావాల్నో ఏడవరాదు!" శివయ్య విసుక్కున్నాడు.

"అయిదు రూపాయలు కావాల్నండి." బ్రహ్మయ్య మాటల్లో కన్నీరు కనిపిస్తోంది – కళ్ళలో ఇంకా కనిపించలేదు.

"అయిదు కావల్నంటే ఏడు లెక్క రాయాల్సి వస్తది– రెండు సారసుంకం – ఇన్నవా?" పంతులు వ్యంగ్యంగా అన్నాడు.

"కావల్నంటె ముఖాన కొట్టు– పని ముట్లు ఇచ్చెడిది లేదు." శివయ్య సీరియస్‌గా అన్నాడు.

పనిముట్లు లేకుంటే తన పని ముగిసినట్లే! ఈ మాత్రం ఆధారం జారిపోతుంది అనుకున్నాడు బ్రహ్మయ్య.

"దొరా! అట్లంటె బతకటమెట్ల? ఆడది అగోరిస్తాందని అడిగిన. పానం కాపాడండి దొరవారూ– పని ముట్లు ఇప్పించండి." బ్రహ్మయ్య శివయ్య కాళ్ళు పట్టుకునేంత పని చేశాడు. కంటిలో నీరు ఆగలేదు. దుమికింది.

"పంతులూ! బ్రహ్మయ్య ఏడుస్తాండు. ఇయ్యి మరి ఏం చేస్తం – అయిదియ్యి – ఏడు రాసుకో – వడ్డీకట్టు వాటిమీద."

పంతులు బ్రహ్మయ్యకు అయిదు రూపాయలిచ్చి రాసుకున్నాడు.

"దొరవారూ! పనిముట్లు?"

"నర్సిమ్మా! పనిముట్లు తెచ్చి ముఖాన కొట్టు– పెద్ద బంగారంతో చేయించి పెట్టినట్లు నీలుగుతాడు." చేతులు ఊపుకుంటూ ఎగతాళి చేశాడు శివయ్య.

నర్సిమ్మ బాడిశ, దూగోడ, రంపం వగైరాలు తెచ్చి బయట విసుక్కున్నాడు.

"కూలి చేసుకునేటోండ్లకు బంగారం యాణ్ణించి వస్తదండి – కూటికెళ్ళెడిదే కష్టమయితాంది." గునుసుకుంటూ పనిముట్లు అందుకున్నాడు బ్రహ్మయ్య.

"పైస చేతుల పడెటాల్కల్ల నీతులు పలుకుతాండు. లీడరయితడేమొ బ్రహ్మయ్య. చెక్కకొని బత్కక నీతులెందుకయా నీకు – ఫో...ఫో" అని కసిరాడు శివయ్య

బ్రహ్మయ్య మాట్లాళ్లేదు. పైకం జేబులో వేసుకున్నాడు. బాడిశ బుజాన పెట్టుకుని వెళ్ళిపోయాడు.

కుమ్మరి కొమరయ్య ముందుకు వచ్చాడు.

"నీ కతేందిరా కొమరిగా?" శివయ్య అడిగాడు సిగరెట్టు ముట్టించుకుంటూ.

"అందరి కత ఒకటే కాదుండి, బాంచను – నాకు ఏరే కత యాణ్ణించి వస్తది? మా రాతలన్ని గా పుస్తుకాల్ల ఉన్నయి. తెరువుండి తెలుస్తది." కొమరయ్య గులిగాడు, బ్రహ్మయ్య స్థితి చూచి అతనికి అలా అనాలనిపించింది.

"ఓరి లంజకొడక! నీకెంత నెత్తి కెక్కినయిర కండ్లు! నీతులు చెప్తావుర గాడ్డి కొడక" అని చెప్పు విడిచి కొమరయ్య ముఖానికి కొట్టాడు శివయ్య.

విసిరిన కాలి చెప్పును చేత్తో అందుకున్నాడు కొమరయ్య 'హి...హి...హి...' అని ఇకిలించాడు. "మాకేం నీతులు, బాంచెను. కొడ్తె పడ్తం. పెడ్తె తింటం" అని చెప్పు తెచ్చి శివయ్య కాలు దగ్గర పెట్టి దండం పెట్టాడు కొమరయ్య.

"చెప్పుదెబ్బ తప్పించుకున్నావ్ గాడ్దికొడక! సార తాగినావుర రాత్రి?" అడిగాడు శివయ్య.

"ఫూర రొండ్రూపాయలది తాగిన, బాంచను. నిష ఎక్కుతలేదు. సర్కారేమన్న నీలు కలుపుతున్నాదుండి సారా?"

"ఓరి లంజకొడక! పిత్త తాగనేర్చినంక నిష యాడఎక్కుతదిర! సర్కారు సారల నీలుకలిపిందంటే జేల్లనూకుతరు – ఎరకయిందా?"

"మల్ల దొరే కలుపుతుండేమో!" అందామనుకున్నాడు గాని అనలేదు కొమరయ్య.

"అరే కొమరిగా! ఇంకెన్ని కుండలయితె వామి తయారయితదిరా!"

"ఇయ్యాల్రేపు చేస్తె సరింగ అయితయి, బాంచెను. ఇగ వామి పెట్టుడు–కాల్చుడే."

"పంతులూ! వీనిలెక్క...?"

"వాము కాల్చి పట్నం తీస్కపోయి అమ్ముకొస్తే వచ్చింది వడ్డీకి సరిపోతది. అసలు అట్లనే ఉంటది. కొమరయ్య సారె తిప్పుతునే ఉంటడు, నేను లెక్క రాస్తనే ఉంట."

"పంతులూ! మాటలు జర తగ్గించు, బాగుపడ్తవు." అని పంతులుకు ఉచిత సలహా ఇచ్చిన శివయ్య "కొమరిగా! ఎంత కావాల్రా?" అని అడిగాడు.

"ఎంతేమున్నది, బాంచను. సారపైసలు లెక్కరాసుకోండి, బత్తేనికి జగన్నాధం దుక్నానికి చీటి రాసియ్యండి. సారె బయటపెట్టించుండ్రి. సారేమో నేను తిప్పుతె తిరుగుతది. మా బతుకు సారె ఉన్నది చూసిన్రా – అది మీరు తిప్పుతె తిరుగుతది."

"మాటలు శాన నేర్చినవుగని రేపుటికి వామి తయారు కావలె. లేకుంటె బత్తెం బంద్."

"అట్లనే బాంచను" అన్నాడు కొమరయ్య. పంతులు రాసిచ్చిన చీటీ, నర్సిమ్మ తెచ్చిచ్చిన సారె అందుకుని బయటపడ్డాడు.

చీటీ రాసివ్వడంలో ఒక రహస్యం ఉంది. శివయ్య జగన్నాథాన్ని తెచ్చి ఊళ్ళో దుకాణం పెట్టించాడు. ఆ దుకాణానికి చీటీ రాసిస్తాడు శివయ్య. జగన్నాధం రూపాయికింత చొప్పున కమీషన్ సమర్పించుకుంటాడు శివయ్యకు. శివయ్యకు తన గ్రామసంపద బయటికి పోవడం ఇష్టం ఉండదు.

మంగలి మల్లయ్య పొది అందుకుని, శివయ్యకు గడ్డం గీకి, చీటి అందుకుని బయటపడ్డాడు. కమ్మరి బాలయ్య సుత్తె అందుకుని చీటీ రొంటిని దోపుకుని వెళ్తుండగా గేట్లో అడుగుపెడ్తున్న గౌరీనాథశాస్త్రిగారు ఎదురయినారు. బాలయ్య దండం పెట్టాడు పుత్రపౌత్రాభివృద్ధిగా దీవించారు శాస్త్రిగారు. శాస్త్రిగారు అలగాజనాన్ని ధన కనక వస్తువాహనాలు కలిగేట్లు దీవించరు. పొరపాటున తమ మాట తథ్యం అవుతుందేమోనని వారి భయం!

శాస్త్రిగారి దీవనలంది బాలయ్య నిర్గమించగా, శాస్త్రులవారు సశాస్త్రముగా శివయ్యగారి గేహంబున కుడిపాదంబుంచి బ్రవేశించిన యయ్యవసరంబున గ్రామ

ప్రభువరేణ్యులయిన శివ ప్రభువులు అభ్యుత్థానమొనరించి, నమస్కరించి, స్వాగతం బొసంగి, విప్రోత్తమునకు ఆసనంబు నిర్దేశించి, కుశలప్రశ్న లడిగిన తదనంతర కథాసంవిధానం బెట్టిదనిన:-

"అయ్యా! ఈ రోజు స్వస్తిశ్రీ చాంద్రమాన పింగళనామ సంవత్సర పుష్యబహుళ పంచమీ – ఆదిత్యవారం. పంచమి సాయంత్రం వరకున్నది. వర్జ్యము పగలు రెండున్నర మొదలు నాలుగు గంటల వరకున్నది."

గౌరీనాధశాస్త్రి ఆజానుబాహువు. దబ్బపండులాంటి ఛాయ, ముఖాన విభూతి, మెడలో రుద్రాక్షమాల. సాక్షాత్తు శివస్వామిలా ఉంటారు. పౌరోహిత్యం, మంత్రశాస్త్రం, కొంతలో కొంత వైద్యం వారి వృత్తి. తాంత్రిక విద్యలు వారికి బాగా వచ్చని ప్రతీతి. వారు తలచుకుంటే ఎదుటివాణ్ణి రక్తం కక్కించి గంటల్లో ప్రాణాలు హరించగలరని పేరుంది. అందుకే శాస్త్రిగారంటే శివయ్యకు జంకు. శాస్త్రిగారు తప్ప ఆ ఊరి జనం సొంతం శివయ్య పాదచ్ఛాయన జీవించవలసినవారే.

"శాస్తుర్లగారూ! నాకెరకలేక అడుగుత, సూర్యుడున్నడు చూచిన్రా – వాడు మీరు చెప్పినట్లే నడుస్తాడా? ఎప్పుడు రమ్మంటె అప్పుడొస్తడు. ఎప్పుడు పొమ్మంటె అప్పుడు పోతడు. శాస్త్రాన్ని చుట్టచుట్టి చంకన పెట్టిన్రు, మాకేమన్న ఎరక కానిస్తరా?"

"శివయ్యగారూ! ఈ సూర్య చంద్రాదులు, గ్రహనక్షత్రాలు, పంచభూతాలూ అన్నీ మీరు చెప్పినట్లే నడుస్తున్నయండి. శాస్త్రాలన్నీ డబ్బుకు ఊడిగం చేస్తున్నాయి. శాస్త్రిగారి చంకన మిగిలింది తాటాకుల కట్ట – శాస్త్రం కాదు. సర్వ ప్రపంచమూ మీ డబ్బుకు దాసోహం. అంతా జోహుకందార్లే – విన్నారా మహాప్రభూ!" కృష్ణారావు గబగబా చదివేసినా, నిత్య సత్యం వెల్లడించాడు.

"పంతులుగారు చాలా చక్కగా శలవిచ్చిన్రు. ఎంతయినా మీ ముందు చేయి చాపెటోండ్లంగాని, ఇచ్చేటోండ్లము కాము. మేము యాచకులం. మీరు దాతలు" శాస్త్రులవారు వినయం వలక బోశారు.

"శాస్తుర్లేమొ శాన పొగుడుతున్నాడియ్యాళ. చూడబోతే ఏదో పని మీద వచ్చినట్లు కనబడ్తాంది."

"మీతో పనిపడందెన్నడు? ఎప్పుడు పనులు పడ్తనే ఉంటాయి."

కృష్ణారావుకు అంతా వింతగా ఉంది. వాళ్ళిద్దరూ పరస్పరం పొగడుకోవడం చాలా సార్లు చూశాడు. కాని, శాస్త్రి ఇలా పనికట్టుకుని వచ్చి శ్లాఘించడం తొలిసారి చూస్తున్నాడు.

పెంటడు పశువులను తోలుకుని పోతున్నాడు. పశువులన్నీ తలవంచుకుని సాగిపోతున్నాయి. ఒక కర్రి ఆవు శివయ్యవైపు సాగింది – ముట్టె చాచింది – ఏదో అడుగనున్నట్లు. పెంటడు వచ్చి ఆవును మళ్ళించుకు పోయాడు. పెంటడు మల్లమ్మ తమ్ముడు – మరో బానిస.

"దొరవారూ! నా బిడ్డ– పావని – పట్నంలో మేనమామల ఇంట్లో చదువుకున్నది."

"శాస్తుర్లు గారూ! చెప్పేటప్పుడు ఒకటి చెప్పతరు- చేసెటప్పుడు ఒకటి చేస్తరు. ఆడపోరలకు చదువొద్దని అందరికి చెప్పతరు - మీ కాడికి వస్తే వాండ్లను చదివిస్తరు?"

"దొరవారూ! ధర్మం కాలాన్ని అనుసరిస్తుంది. యుగధర్మాన్ని ధిక్కరించి ధర్మం నిలువలేదు. సాక్షాత్తు శ్రీమన్నారాయణ మూర్తే యుగాలను బట్టి అవతారాలను మార్చిండు. పరశు రామావతారంలో గొడ్డలి పట్టి క్షత్రియులందరినీ వధించిండు. యుగం మారింది. క్షత్రియుడయిన రామావతారానికి లొంగి పోయాడు."

"ఇంతకు యుగధర్మం కింద ధర్మం దిగదుడుపే నంటరు?" కృష్ణారావు ఆసక్తిగా అడిగాడు.

"ధర్మం యుగధర్మాన్ని అనుసరించాలె. లేకుంటె ధర్మానికి నిలకడ లేదు. స్త్రీ పురుష భేదం లేకుండా విద్య నభ్యసించడం ఈ యుగధర్మం. కాలం ఒక వైపు గుంజుతున్నది. నేనింకో వైపు గుంజుతే నిలవగలనా? అందుకే పావనికి చదువు చెప్పించిన. బి.ఎ. అయింది."

"ఏందీ! పావని బి.ఏ. పాసైనాది? ఎంత ఉండెడిది? గింత పిల్ల. ఇంతల్నె అంత పెద్దదయినాది?"

"ఆడ పిల్లలు అంతే దొరవారూ! ఇట్ల చూస్తుంటె అట్ల ఎదిగి కూచుంటరు. మా పావనికి స్కూలు టీచరు ఉద్యోగం వచ్చింది."

"శాస్తుర్లూ! మీ పనే బాగున్నదయా! అ మాట చెప్పతరు ఈ మాట చెప్పతరు. పని ఎల్లదీసుకుంటరు. పిల్లకు కొలువిప్పించినవు, ఇగ ఈడెందుకుంటవుగని - పట్నం చేర్తరా!"

శాస్త్రిగారు పట్నం చేర్తారనుకుని సంబరపడ్డాడు శివయ్య, ఈ ఒక్క అడ్డంకి వదిలిపోతుంది. మంత్రాలకు జంకడం తన స్వభావం. ఇగ ఊరంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలవచ్చు. తనకు దండం పెట్టేవాళ్ళేగాని, తాను దండం పెట్టాల్సిన వాళ్ళు ఊళ్ళో ఉండరు అనుకున్నాడు.

"దొరవారూ! ఈ మట్టిలో పుట్టిన. ఇక్కడి మట్టిలోనే కలిసిపోవాలె. మా నాయనగారు, అమ్మగారు ఇక్కడనే పోయిన్రు. నా భార్య ఇక్కడనే గతించింది. నేనూ పెద్దవాణ్ణి అయిపోయిన. పావని ఇక్కడికి వస్తే దాన్ని చూచుకుంట నాలుగు నాళ్ళుంట. కాటికి కాళ్ళు చాచుకొని ఉన్న, మీరు దయ దలచాలె."

శివయ్య ఆలోచనలు తలకిందులైనాయి. పావనిని తెచ్చి ఈ ఊళ్ళో పెడ్తానంటున్నాడు శాస్త్రులు. అందువల్ల శివయ్యకు రెండు నష్టాలున్నాయి. ఒకటి - ఈ ఊరికి వచ్చిన పంతులల్లా శివయ్య లెక్కలు రాయాల్సిందే. చదువు చెప్పడానికి వీల్లేదు. చదువంటే బెదురు శివయ్యకు. పావని ఆడపిల్ల, లెక్కలు రాస్తుందనే నమ్మకం లేదు. రెండు - శాస్త్రిగారు కాస్త పలుకుబడి కలవాడు. వారి కూతురు బడి పెట్టి చదువు చెబుతానంటే తానేం చేయాలి? ఇవన్నీ దృష్టిలో ఉంచుకుని అర్థం అయినా కానట్లు అడిగాడు: "చల్లకొచ్చిన్రు ముంతెందుకు దాస్తరు? ఏం కావాల్నో చెప్పరాదండి సాఫ్ సీదగ."

"శివయ్యగారూ! ఇందులో దాచెడి దేమున్నది? శాస్త్రిగారు వాళ్ళ అమ్మాయిని ఈ ఊరికి బదిలీ చేయించమని వేడుకుంటున్నారు. చేయించండి. నాకు విముక్తి

కలిగించండి. పెళ్ళాం అక్కడ, నేనిక్కడ – వండుకోలేక చస్తున్నాను. శివయ్యగారూ! మీకు పుణ్యం ఉంటుంది." కృష్ణారావు బతిమలాడాడు.

"మీరు అనుగ్రహించాలె. కాదనరాదు. బ్రాహ్మణ్ణి, చేతులు చాపి అడుగుతున్న." శాస్త్రులువారు అర్థించారు.

"మీ సుఖం మీరు చూచుకుంటున్నారు. నాకు లెక్కలు ఎవడు రాయాలె?"

"శివయ్యగారూ! నాకు విముక్తి కలిగించండి. మీ కేదయినా ముట్టచెప్పత. కరుణించండి." కృష్ణారావు డస్కుముందు నుంచి లేచి వచ్చి శివయ్య పక్కగా నుంచొని, చేతులు జోడించి ప్రార్థించాడు.

"శాస్త్రుర్లూ! నీ బిడ్డను పట్నంలనే ఉండనియ్యి, ఆడపిల్లలు ఆడ చదువు చెప్పతెనె బాగుంటది. మీమంచి కోరి చెప్పతున్న – ఆడపిల్ల ఈడ ఉండటం మంచిది కాదు, విన్నారా?" శివయ్య మళ్ళీ ఎవరినీ మాట్లాడ నివ్వలేదు. చివాలునలేచి ధుమధుమలాడుతూ ఇంట్లో ప్రవేశించబోయాడు.

మల్లమ్మ గ్లాసులో చాయ్ తెస్తూంది శివయ్య కోసం. తెర చాటుంది, చూడలేదు. శివయ్య విసురుకు ఆమె చేతులోని చాయ్ సొంతం శివయ్యమీద ఒలికింది. గ్లాసు నేలమీద పడి పగిలింది.

శివయ్య చేయి చురుక్కుమంది. పంతులు మీదా శాస్త్రి మీదా ఉన్న కోపం పొంగింది. శివయ్య ఉగ్రుడైపోయాడు.

మల్లమ్మ గ్రహించింది. గడగడలాడి పోయింది.

"ముండా! చా పారపోస్తవటే" అని లాగి చెంపమీంచి కొట్టాడు. మల్లమ్మ మాట్లాడలేదు. కళ్ళల్లో నీళ్ళు దుమికాయి.

శివయ్య అంతటితో ఆగలేదు. మరో దెబ్బ కొట్టాడు. మరో దెబ్బ కొట్టాడు. బాదుతూనే ఉన్నాడు.

శాస్త్రి, కృష్ణారావు బొమ్మల్లా చూస్తూ నుంచున్నారు. "పాపం; దాన్నెం దుకు కొడ్తరు" అందామనుకున్నాడు కృష్ణారావు, అనలేక పోయాడు. అక్కణ్ణుంచి సాగిపోయాడు.

"ఈ ఊరికి ఒక రావణాసురుడు దాపరించిండు" అనుకుంటూ సాగిపోతున్న శాస్త్రిగారి మాటలు విని ఆశ్చర్యపోయాడు కృష్ణారావు.

మల్లమ్మ ఏడుపు ఇంకా వినిపిస్తూనే ఉంది. శివయ్య కొట్టేదెబ్బలు వినిపిస్తూనే ఉన్నాయి.

మల్లమ్మ శివయ్యకు బానిస. మల్లమ్మ భర్త పరమయ్య పెళ్ళికి అప్పచేశాడు. శివయ్యకు అమ్ముడు పోయాడు. చేసిన అప్పుకుగాను వడ్డీ కింద పరమయ్య చాకిరి చేయాలి. నిత్యం తిండికిచ్చే గింజలు మళ్ళీ అప్పు. పనిచేయనినాడు బత్తెం బంద్. ఆనాటి వడ్డీ పెరుగుతుంది. పరమయ్యకు జ్వరం వచ్చింది. చాకిరికి రాలేదు. శివయ్య గింజలు ఇవ్వలేదు. అంతటితో ఆగలేదు శివయ్య. నర్సిమ్మతో పరమయ్యను పట్టి తెప్పించాడు. చెట్టుకు కట్టేసి చితక్కొట్టాడు. వళ్ళు హూనం అయి పరమయ్య ఇంటికి చేరాడు. చెప్పాచేయకుండా ఊరు విడిచి పారిపోయాడు. శివయ్యకు ఆ వార్త తెలిసింది. మండిపోయాడు. గుడిసెకు నిప్పు పెట్టించాడు. మల్లమ్మను తెచ్చి

ఇంట్లో చాకిరికి పెట్టుకున్నాడు. ఆమెను పశువుకంటే హీనంగా బాదుతుంటాడు. మల్లమ్మకు ఎక్కడో నలుసంత ఆశ ఉంది – పరమయ్య వస్తాడు – విడిపిస్తాడు అని. ఆ ఆశతోనే జీవిస్తూంది.

మల్లమ్మతమ్ముడు పెంటయ్య కూడా శివయ్యకు అమ్ముడు పోయాడు. ఒక్కడేమిటి ఊరుసాంతం శివయ్యకు అమ్ముడు పోయినవాళ్ళే. ఆ ఊరి జనానికి కష్టాన్ని అమ్ముకునే కనీస హక్కులేదు. వాళ్ళకు కూలి దక్కదు. జీతాల్లేవు. బత్తెంకోసం పనిచేయాలి– అదీ కష్టానికి ప్రతిఫలం కాదు– తీర్చవలసిన అప్పు.

శివయ్య తండ్రి దొరకాడు. తాత దొరకాడు. శివయ్య కొద్ది సేద్యంతో జీవితం ప్రారంభించాడు. అతనికి అప్పులు ఇచ్చే నేర్పు – వసూలు చేసే ప్రతిభ వచ్చేశాయి. దాంతో ఊరు సాంతం కొనేశాడు. శివయ్యకు అట్టే చదువురాదు. అంతకంటె ప్రపంచ జ్ఞానం లేదు. అతనికి తన వ్యవహారం తెలుసు. తన వ్యవహారం సాగాలంటే ఊళ్ళోకి చదువు ప్రవేశించరాదు. అందుకే స్కూలు బిల్డింగును గిడ్డంగి చేసుకున్నాడు. వచ్చిన పంతులును గుమాస్తాగా మార్చుకున్నాడు.

అతని పెత్తనం అప్రతిహతంగా సాగిపోతూంది.

## 2

వేగుచుక్క పొడిచింది.

తొలికోడి కూసింది.

మల్లి ఉలిక్కిపడి లేచింది మల్లి పశువుల కొట్టం పక్కన కుక్కిమంచంలో పడుకుంది. ఆమెకు వళ్ళంతా నెప్పులుగా ఉంది. తల తిరిగిపోతూంది. రాత్రి సాంతం జ్వరంతో వళ్ళు మండిపోయింది. మూలిగింది. ముక్కింది. కుక్కిమంచంలో పొర్లింది. అంతకు ముందే జ్వరం జారినట్లుంది. కాస్త కునుకు పట్టింది. నిద్ర అన్నిటినీ మరిపిస్తుంది. కోడికూత నిద్రను తొలగదోసింది.

కోడికూతతో ఆమె లేవాల్సిందే. అది నియమం. దాన్ని ఉల్లంఘించడానికి వీల్లేదు. పశువుకు జబ్బుచేస్తే అరకకు కట్టరు. ఏదో వైద్యం చేయిస్తారు. మల్లి పశువుకాదు. అందువల్ల ఆమె చేసేపని ఆగడానికి వీల్లేదు. ఆమెకు వైద్యం చేయించాల్సిన పనిలేదు.

మల్లి కుక్కిమంచంలో కళ్ళు తెరిచింది. వళ్ళంతా దెబ్బలు కొట్టిపడేసినట్లుంది. కదలడం చేతకావడం లేదు. మెదిలే శక్తి లేదు, తల బరువుగా ఉంది. కళ్ళు మంటలు మండుతున్నాయి. పడుకోవాలనుకుంది. ముడుచుకొని పడుకుంటే బావుండు ననిపించింది. ఆ అదృష్టం ఆమెకు లేదు. తొలికోడి కూసింది. లేవాల్సిందే. లేవకుండా ఉండడానికి వీల్లేదు.

మల్లికి చలిగా ఉంది. చలిగాలి వీస్తూంది. వణుకు వస్తూంది. వణికి పోతూంది మల్లి. జ్వరం ఆమెను కుంగదీసింది. శక్తిలేదు. అయినా లేచి కూచుంది. లేవాలి తప్పదు.

మల్లి ముందుకు చూచింది. శివయ్య గారి బంగళా వెనుకభాగం కనిపించింది. బంగళా ఎత్తుగా ఉంది. సిమెంటుతో కట్టింది. తలుపులూ, కిటికీలూ మూసి

ఉన్నాయి. అంత పెద్ద బంగళాలో ఇద్దరే పడుకుంటారు– శివయ్య, సుభద్రమ్మ. బంగళాలో వెచ్చగా ఉంటుంది. బయట చలిగా ఉంది. తాను బంగళాలో దూరగలుగుతే ఎంత బావుండేదీ! లేదు. తను దూరలేదు. సుభద్రమ్మ అదృష్టవంతురాలు–తాను...???

మల్లిలో ఏవేవో ఆలోచనలు ముసిరాయి. అయితే, ఆమెకు ఆలోచించే సమయం లేదు. కోడి కూసింది. లేవాలి. ఆమె కోసం చాకిరి ఎదురు చూస్తూంది. ఆమె చాకిరి కోసం పుట్టింది. సుభద్రమ్మ సౌఖ్యం కోసం పుట్టింది. ఇది కర్మ సిద్ధాంతపు దేశం. ఈ సమాజానికి ఈ జన్మమీద నమ్మకం లేదు. పూర్వ జన్మమీద విశ్వాసం మెండు. మనం మనిషిని గౌరవించం. రాతి బొమ్మలను పూజిస్తాం.

మల్లమ్మ రాతిబొమ్మ కాదు, మనిషి.

మల్లమ్మ మంచంలోంచి లేచింది. నుంచుంది. ఆమె వళ్ళు తూలింది. నిలదొక్కుకుంది. తన చేయి పట్టుకొని తానే చూచుకుంది. వళ్ళు వేడిగా ఉన్నట్లు లేదు. జ్వరం తగ్గినట్లుంది. నీరసం హెచ్చింది. ఆమె నిలదొక్కుకుంది. కుక్కిమంచం ఎత్తి గోడకు పెట్టింది. చింపిరి తల వేళ్ళతో దువ్వుకుంది. కదలలేకుండా ఉంది; అయినా అడుగేసింది– ముందుకా? వెనక్కా? అది ఆమెకు తెలియదు. అడుగేయటమే ఆమెకు తెలిసింది. ఆమెకు కాదు, అనేక మందికి తెలిసిందీ అదే.

మల్లమ్మ నాలుగు అడుగులు వేసింది. కాస్త సత్తువ వచ్చినట్లనిపించింది. పడుకున్న దానికంటే పచార్లు చేయడం మేలు! కదిలిన మల్లి కోళ్ళ గూటి దగ్గరకు వెళ్ళింది. గూటి మూతలు తీసింది. కోళ్ళు బంధాలు తెంచుకుని బయటపడ్డాయి. ఎగిరి గంతులు వేసి వెళ్ళిపోయాయి. కోడిపుంజు గర్వంతో వళ్ళు విరుచుకుని "కొక్కొరోకో" అని కూత పెట్టింది.

కోళ్ళకు పగలంతా స్వేచ్ఛ. రాత్రికి బంధం. మల్లికి పగలూ రాత్రీ బంధమే. శివయ్యగారి ఇల్లు బందిఖానా. మల్లి చెరసాలలో ఉంది. మల్లి కోడి కూతతో లేస్తుంది. బాగా రాత్రి అయ్యేదాకా వళ్ళు విరుచుకుని చాకిరీ చేస్తుంది సుభద్రమ్మ పాసిందీ, పులిసిందీ ఆమె ముఖాన కొడుతుంది. తింటుంది. చాకిరీ చేస్తుంది. ఆమెకు జీతం లేదు. ఆమె భర్త పెళ్ళికి అప్పు చేశాడు. అమ్ముడు పోయాడు. చాకిరీ భరించలేక పారిపోయాడు. శివయ్య మల్లిని తెప్పించి ఇంట్లో పెట్టుకున్నాడు. బానిసను చేశాడు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. మల్లికి కాదు. మల్లి లాంటి వాళ్ళకు కాదు. స్వాతంత్ర్యం శివయ్యకు వచ్చిందందామా?

మల్లి పేడ తీయడానికి పశువుల కొట్టంలోకి పోయింది. పేడ తీస్తుంటే ఆమె వళ్ళు తూలుతోంది. అయినా, ఆమె ఆగడం లేదు. సత్తువ తెచ్చుకుంటోంది. పేడ తట్టలో వేసింది. పేడ పట్టుకొని బావి దగ్గరికి బయలుదేరింది. వళ్ళు తూలుతోంది. పడిపోతానేమోనని భయంగా ఉంది. నిలదొక్కుకుని నడుస్తోంది. అయినా వళ్ళు తూలింది. పేడతట్ట చేతిలోంచి పడిపోయింది. మల్లి కూడా పడిపోయేదే– "అక్కా!" అని ఉరికి వచ్చి పెంటడు పట్టుకున్నాడు.

పెంటడు పశువుల మనిషి.

"అక్కా! ఏమైందక్కా? ఎందుకట్లా సోలినవు?" అడిగాడు మల్లిని పట్టుకుని.

"ఏం లేదురా! వళ్ళు సోలినట్లయింది. యిడువు, నీళ్ళు చేదాలె, చాన్పి చల్లాలె. దొర్సాని లేస్తే బతక నీయది." మల్లి తమాయించుకుని ముందుకు సాగింది.

"అక్కా! నువ్వెట్లనో ఉన్నవు. చాతనయెటట్లు లేదు. నేను చేదిపోస్త నీళ్ళు. నువ్వు చాన్పి చల్లు." అన్నాడు.

"ఒరే వద్దురా. ఇడువు, నీపని నువ్వు చేసుకో. పొద్దుపోతే దొర కొడ్తడు. మనం మనుషులం గామురా – గొడ్లం. గొడ్డు ఒకదానికి ఒకటి సాయం చేస్తదా? ఇడువు పోత."

పెంటడు అక్కను వదిలిపెట్టాడు. కాని అక్కణ్ణుంచి కదల్లేదు. చూస్తూ నుంచున్నాడు. అతనికి అక్కమీద ధ్యాస ఉంది. పనిమీద ధ్యాసలేదు. అక్కను చూస్తుంటే అతని గుండె తరుక్కుపోతోంది.

మల్లి కదల్లేక కదల్లేక సాగుతోంది. కుండ అందుకుని సాగుతోంది. బావి దగ్గరకు పోతోంది. కుండను అతి జాగ్రత్తగా పట్టుకుంది. కుండ పడకూడదు, పగల కూడదు. కుండ తన కంటే విలువయింది. కుండ పగులుతే దొర సహించడు. తాను పడిపోతే దొర కేం బాధలేదు. తాను పడ్డా కుండ పడరాదు అన్నంత పదిలంగా సాగింది. బావి దగ్గరికి చేరింది.

పెంటడు చూస్తున్నాడు. అక్కణ్ణుంచి కదల్లేదు. అతనికీ పని ఉంది. అయినా అక్కణ్ణుంచి కదలడం లేదు. అక్కను ఆదుకోవాలని అతని ఆశయం. తన పని అలస్యాన్ని గురించీ, వాటి వలన జరిగే పరిణామాలను గురించీ అతడు అలోచించడం లేదు. అనుబంధాలు అలాంటివి. అవి పరిణామాలను గురించి ఆలోచించనీయవు.

మల్లి కుండను పదిలంగా బావి దగ్గర పెట్టింది. మల్లికి వణుకు వస్తూంది. కాళ్ళు వణుకుతున్నాయి. కళ్ళు మండుతున్నాయి తల బరువుగా ఉంది. అయినా బొక్కెన అందుకుంది. బావిలోకి విడిచింది. కాళీ బొక్కెన బావిలోకి అప్రయత్నంగా జారిపోతోంది. గిలక చప్పుడుతో బావిలోకి జారింది బొక్కెన. బొక్కెనలో నీళ్ళు నిండాయి. నీళ్ళు నిండిన బొక్కెనను పైకి లాగడం కష్టం.

మల్లి వంట్లో శక్తిలేదు. జవలేదు. బలంలేదు. అయినా లాగుతోంది. లాగడం కష్టంగా ఉంది. బతుకు లాగుతున్నట్లుంది. కాళ్ళు తేలిపోతున్నాయి. సగం దాకా లాగింది. చేతుల్లో బలం లేదు. చేద వదిలింది. గిలక గిరగిరా తిరిగింది. బొక్కెన బావిలో పడి చప్పుడు చేసింది. మల్లి తూలి పడబోయింది.

"అక్కా!" అని ఉరికి వచ్చాడు పెంటడు. మల్లిని పట్టుకున్నాడు. "అక్కా! ఏమైందియ్యాల నీకు?" పెంటడి పలుకుల్లో తడి ఉంది. అర్ద్రత ఉంది. ఆ పలుకులు విని మల్లి కరిగి పోవాల్సింది. తమ్ముణ్ణి కావిలించుకుని భోరుమనాల్సింది.

మల్లి అలా అనాల్సిందే. కాని అనలేదు. "తమ్ముడూ! బొక్కెన బాయిల పడ్డదిరా. దొర్సాని బతకనీయది. ఎట్లరా పెంటా, ఏం చేద్దమంటవు. చస్తె నాకేం లేదు. మీ బావ వచ్చినంక చస్తరా!" ఆమెలో దుఃఖం ఆగలేదు. కట్టలు తెంచుకోనూలేదు. కళ్ళలో కన్నీరు దుమికింది.

పెంటడు అక్కను ఓదార్చాల్సింది. బావను తీసుకుని వస్తానక్కా అని ప్రతిజ్ఞ చేయాల్సింది. కల్పనలో అలాగే జరుగుతుంది. సినిమా కథ అలాగే సాగుతుంది. ఇది నిజ జీవితం. కర్కశం అయింది. కంటక ప్రాయం అయింది.

పెంటడు బావిలోకి చూశాడు. బొక్కెన బావిలో పడింది. కాని, చాంతాడు బావి దూలానికి ఉన్న మేకుకు కట్టి ఉంది. పెంటడు ప్రాణం లేచి వచ్చింది. "అక్కా! బొక్కెన బాయిల పడలే. చేంతాడు దూలానికి కట్టి ఉన్నది" అన్నాడు.

"అట్లనా! బాయిల పడలే. దేవుడు కాపాడిండు. జరుగు నీళ్ళు చేదుకుంట." బొక్కెన బావింలో పడనందుకు ఆమెలో ఉత్సాహం పొంగింది.

"వద్దక్కా! నేను చేత్తా, నువ్వుకూకో" అన్నాడు పెంటడు. నీళ్ళు చేది కుండ నింపాడు. కూలబడ్డ మల్లి లేచింది. కుండ రెండుచేతులతో లేపబోయింది. కుండ లేవడం లేదు. పెంటడు సాయం పట్టాడు. ఇద్దరూ కలిసి కుండను ఇంటి ముందరికి తీసికెళ్ళారు – దొడ్డి దారినుంచి.

మల్లి కుండ అక్కడ పెట్టింది. పొరక అందుకుని ఊడ్పు సాగించింది.

శివయ్యగారి వాకిలి సువిశాలం అయింది. దాన్ని ఊడవడం కష్టమే. రోజూ ఊడుస్తూనే ఉంది మల్లి. ఈ రోజు శివయ్యగారి వాకిలి ఊరంత ఉన్నట్లు కనిపించింది. పెంటడు గ్రహించాడు. అక్కకు సాయం చేద్దా మనుకున్నాడు. కాని మరో పొరక లేదు. అక్క ఊడ్చే వరకు తన పని చేసుకుందామని కొట్టంలోకి వెళ్ళాడు.

పెంటడు కొట్టంలో దూడలను విప్పుతున్నాడు. దూడలు కట్లు తెంచుకుని చెంగుచెంగున గంతులేస్తూ ఉరుకుతున్నాయి తల్లుల దగ్గరికి. పెంటడు దూడలను విప్పుతున్నాడనేగాని అతని మనసంతా అక్కదగ్గరే ఉంది. వాకిట్లో అక్క ఎలా వుందో? పరధ్యానంగా దూడలను విప్పుతున్నాడు. అతనికి వాకిట్లో నుంచి ఏదో కేక వినిపించినట్లయింది. ఆపద విరుచుకు పడ్డట్లనిపించింది. ఉరికాడు.

వాకిట్లో మల్లి కళ్లాపి చల్లుతూంది. ఆమెకు ఏమీ కాలేదు. కాని నీరసంగా ఉంది. చల్లలేక చల్లలేక కళ్ళాపి చల్లుతోంది. కుండలో నీళ్ళు అయిపోయాయి. కుండెడు నీళ్ళు చాలవు – ఆ వాకిలికి. ఎన్నో కుండలు కావాలి. పెంటడు నీళ్ళు తోడి తెస్తున్నాడు. మల్లి కళ్ళాపి చల్లుతోంది. సాయం ఒకరుంటే శక్తి వస్తుంది మనిషికి. మల్లి పని చేసుకు పోతోంది. పెంటడికి అక్కకు సాయం చేయడమే అర్థం అవుతోంది. అవతలపని అతనికి గుర్తులేదు. పెంటడు కుండల్లో నీళ్ళు తెస్తున్నాడు, పేడ కలుపుతున్నాడు. మల్లి చాన్పి చల్లుతోంది, అంత పెద్దవాకిలి పచ్చిగా, పచ్చగా కనిపిస్తోంది. ఒకడు పచ్చగా కనపించడానికి ఎందరి ఎముకలు నుసి అవుతాయో!

సూర్యునికి ఎముకల్లేవు. అతనికి నుసి కావడం తెలియదు. లోకం చూడాలని అదుర్దా అతనికి. అన్నిటికీ సాక్షీభూతు డతను. అతనికి వెలుగుంది, నోరు లేదు. నోరే ఉంటే ఎన్ని అన్యాయాలు, ఎన్ని అక్రమాలు వివరించ గలిగేవాడో! అతనికి నోరులేదు. కన్నుంది. అందుకే అంత తపన! ఆగలేడు పాపం, ఉరికివస్తాడు. ఆకాశంలోకి వచ్చేశాడు సూర్యుడు అన్నీ చూడ్డానికి. చూసిన వాటిని చెప్పలేక మండిపోతూ వచ్చాడు.

సుభద్రమ్మ తనమీద ఉన్న భర్త చేతిని పదిలంగా జరిపింది. దుప్పటి కప్పింది. వళ్ళు విరుచుకుంది. జుట్టుముడి వేసుకుంది. లేచింది. గది తలుపు తెరుచుకుంది. బయటికి వచ్చింది. వెనక తలుపు తెరిచింది. కింది మెట్టుమీద అడుగు పెట్టింది. కొట్టంలోకి చూచింది. ఎండ కొట్టంలోకి వచ్చేసింది. దూడలు గేదెల పాలు కుడుస్తున్నాయి. నీళ్ళ పొయ్యి దగ్గర ఉండాల్సిన మల్లి లేదు. పాలు పితకాల్సిన పెంటడు లేడు.

ఉండాల్సిన ఇద్దరు లేరు. రావలసిన పాలు దూడలు కుడుస్తున్నాయి. సుభద్రమ్మకు లోకం తలకిందులయినట్లనిపించింది. తన పెత్తనం కూలిపోతున్నట్లనిపించింది. తన ఆస్తి హరించుకుపోతున్నట్లనిపించింది. సూర్యుడు కూలినట్లూ, కొండలు గిరగిర తిరిగినట్లూ, సముద్రం చెలియలి కట్ట దాటి పొంగినట్లూ అనిపించిది.

సుభద్రమ్మకు క్షణం ఏమీ తోచలేదు. మరుక్షణం కర్తవ్యం స్ఫురించింది. ఆమెలో కోపం పెల్లుబికింది. ప్రతీకార జ్వాల ప్రజ్వరిల్లింది. గదిలోకి ఉరికింది. శివయ్యను లేపింది.

"కొంప మునింగిందండీ. లేవండీ! పెంటడు, మల్లి పారిపోయ్నను. పాలన్నీ దూడలు తాగిపోతున్నాయి. ఇక మనకు పాలు లేవు. ఇంట్లో మనిషి లేడు. లేవండి, జల్దీ లేవండీ!"

శివయ్యకు శివం వచ్చింది. అమాంతంగా మూడో కన్ను తెరుద్దామనుకున్నాడు. ప్రళయ తాండవం చేద్దామనుకున్నాడు. లోకాన్ని కాల్చేద్దామనుకున్నాడు. శివయ్యకు మూడో కన్ను లేదు కాబట్టి సరిపోయింది.

శివయ్య ముసుగు తన్నేశాడు. లేచాడు. దొడ్లోకి ఉరికాడు. చూశాడు.

నీళ్ళ పొయ్యి దగ్గర మల్లి లేదు.

గొడ్లకాడ పెంటడు లేడు.

శివయ్యకు లోకం శూన్యంగా కనిపించింది. గ్రహాలూ–నక్షత్రాలూ రాలుతున్నట్లనిపించింది. కొండలూ కోనలూ అంటుకున్నట్లనిపించింది. ఆ అగ్గి తన మీదికే ఆవహిస్తున్నట్లనిపించింది.

పెంటడు గతిలేనివాడు. నిజమే. వానిలోనూ నిప్పుంది. అది రాజుకోరాదు. అంటుకోరాదు. అలుముకోరాదు. అల్లుకోరాదు. పెంటనికి బుద్ధి చెప్పకుంటే ఊరు తన చేతిలో ఉండదు. ఒక్కడు ఎదురు తిరుగుతే ఊరే ఎదురు తిరగవచ్చు. మంట రాజుకోకముందే ఆర్పేయాలి. కాలితో నలిపెయ్యాలి.

"పెంటా!" అరిచాడు శివయ్య. అరుపుకు ఇల్లు ప్రతిధ్వనించింది. సుభద్రమ్మ ఉరికి వచ్చింది. శివయ్య ఉరకబోతున్నాడు, ఉగ్రంలో ఉన్నాడు. ఆమె అదిరిపడింది. తన భర్తకు ఏదో ఆపద వస్తుందనుకుంది.

"ఇగో, ఉట్టి చేతుల్తో పోకండి. కట్టె పట్టుకుని పోండి. వాళ్ళను నమ్మలేం, ఏదైనా చేస్తారు" అని కట్టె అందించింది.

కర్ర అందుకుని అడుగు వేయబోయాడు శివయ్య. శివయ్య కేక విన్న పెంటడు ఉరికి వచ్చాడు. ఉరికి వచ్చిన పెంటడికి కొట్టంలో పాలుకుడుస్తున్న దూడలు కనిపించాయి. ఎదురుగా మండిపోతున్న శివయ్య కనిపించాడు.

పెంటడి ప్రాణాలు పైపైనే పోయాయి నోట మాట రాలేదు. ఒళ్ళంతా చెమటలు పట్టింది. పెనుగాలికి పండుటాకులా వణికిపోతున్నాడు.

పెంటడు రెండు చేతులా జోడించి మొక్కాడు. "దొరా! తప్పయింది, బతక నియ్యి, పానాలుతియ్యకు, బాంచాన్ని, గులామునైత."

వణకిపోతూ, చేతులు జోడించుకుని పలుకుతున్న అతని పలుకులు పాషాణాల్ని కరిగించేట్టున్నాయి. మూర్తీభవించిన దుఃఖంలా, నిరాశలా, నిర్వేదంలా, నిరాశ్రయంలా ఉన్నాడతను.

అతని ఆక్రందనకు దూడలు పాలు మాని చూస్తున్నాయి. పశువులు మోరలెత్తి తమ నిస్సహాయత వ్యక్తం చేస్తున్నాయి. మల్లి ఉరికివచ్చి దూరంగా నుంచుని చూస్తోంది, సుభద్రమ్మ ఆశగా చూస్తోంది.

శివయ్య శివం తొక్కుతూ ఉరికాడు. "లంజ కొడకా! దూడల్నిడిచి ఎళ్ళి పోతావు, నీ తోళ్లొలుస్త" అని కఱ్ఱ తీసుకుని ఉరికాడు.

"దొరా! బతకనీయండి. కాల్మొక్త, తప్పయింది, ఇగచెయ్యను."

పెంటడు అక్కణ్ణుంచి కదల్లేదు పారిపోవడానికి ప్రయత్నించలేదు. కనీసం దెబ్బ తట్టుకోవడానికి చేతులెత్తలేదు.

"చావు లంజకొడక!" శివయ్య కఱ్ఱ పెంటడి వీపుమీద పడింది.

"దొరా, తప్పయింది. చంపకు, కాల్మొక్త!" పెంటడు బతిమాల్తున్నాడు. కాళ్ళు పట్టుకుంటున్నాడు, దెబ్బలు పడుతున్నాడు, తప్పుకోవడానికి ప్రయత్నించడం లేదు.

పెంటడు లొంగుతుంటే శివయ్యకు శివం ఊగుతూంది. కొడుతున్నది మనిషిని కానట్లు, పశువునయినట్లూ బాదుతున్నాడు. కాదు, పశువయితే కనీసం పారిపోయేది.

"దొరా! తప్పయింది. చంపకు, కాల్మొక్త." పెంటడు కేకలు పెడుతున్నాడు. ఆ కేకలకు కొండలు కరుగుతున్నాయి. అధికారానికి గుండె లేదు, అది కరగదు.

మల్లమ్మ దూరంగా నుంచుంది. బొమ్మలా నుంచుంది. ఆమె మనిషి. ఆమెకు గుండె ఉంది, ఆవేదన ఉంది, ఆత్రం ఉంది, ఆత్మీయత ఉంది, అనురాగం ఉంది. అయినా ఏం చేయలేదు. ఎదురుగా తమ్ముణ్ణి బాదుతున్నాడు శివయ్య. తమ్ముడు కేకలు పెడ్తున్నాడు. మొత్తుకుంటున్నాడు. ప్రాణాలకోసం తల్లడిల్లుతున్నాడు.

మల్లి మనసులో చిచ్చురగలడం లేదు. ప్రతీకారజ్వాల ప్రజ్వరిల్లడం లేదు. ఆమె హృదయం ఆక్రోశిస్తూంది. తల్లడిల్లుతూంది. తపిస్తూంది. ఆమె శివయ్యకు ఎదురు తిరగాలనుకోవడం లేదు. తమ్ముణ్ణి కాపాడుకోవాలనుకుంటూంది. తనకోసం వాడు దెబ్బలు తింటున్నాడు. తనకోసం ప్రాణాలు వదులుకోడుగదా!

"అక్కా, చస్తి." అది పెంటని కేక. ఆ కేక మల్లి గుండెలో తుఫాను రేపింది అటు చూచింది. పెంటడి ముక్కులోంచి బళబళా రక్తం కారుతోంది.

రక్తం: నెత్తురు!!

రక్తం: నెత్తురు!!

పెంటడి ముక్కులోంచి కారిన రక్తం మల్లి కళ్ళల్లో కనిపించింది.

మల్లి ఉరికింది.

శివయ్య చేతిలోని కఱ్ఱను పట్టుకుంది.

శివయ్య బొమ్మలా నించున్నాడు.

తుఫాను నిలిచిపోయింది.

పెంటడు కాస్త అవతలికి జరిగాడు. ముక్కులోంచి రక్తం కారుతోంది. తుడుచుకోవడానికి గుడ్డ సైతం లేదు.

శివయ్య మల్లిని చూచాడు.

మల్లి కర్ర వదిలేసింది.

శివయ్య కాళ్ళమీద పడిపోయింది. భోరున ఏడ్చింది, కన్నీటితో కాళ్ళు కడిగింది.

"దొరా! మా తమ్ముణ్ని చంపకు. బతకనియ్యి. నన్ను కొట్టు, చంపు, చీరు." తల నేలకు కొట్టుకుని ఏడుస్తాంది మల్లి.

పెంటడు దూరంగా నుంచున్నాడు.

శివయ్య ఏమనుకున్నాడో తెలియదు. కాళ్ళు వదిలించుకున్నాడు. చరచరా ఇంట్లోకి నడిచిపోయాడు.

"అయ్యో! మీ అంగీమీద నెత్తురు." వాపోయింది సుభద్రమ్మ.

"అక్కా!" అని మల్లిని కావలించుకున్నాడు పెంటడు.

పెంటడి రక్తంతో మల్లి పయట తడిసింది.

చెట్టుమీది కాకి కావుకావుమని అరిచింది. అరిచిందో ఏడ్చిందో మనకు తెలియదు.

పిచ్చమ్మ చచ్చిపోయింది.

పిచ్చమ్మ గూడెంలో ఎవరూ లేనప్పుడు చచ్చిపోయింది.

పిచ్చమ్మ కుక్కి మంచంలో ప్రాణాలు విడిచింది.

గూడెంలో ఎవరూ లేరు. నిర్మానుష్యంగా ఉంది. గూడెం సాంతం శివయ్య పొలాల్లో పనిచేయడానికి వెళ్ళిపోయింది. గూడెంలో ఉన్నవాడు ధర్మయ్య ఒక్కడే. ధర్మయ్య ముసలివాడు. అతనికి కాళ్ళూచేతులూ పడిపోయాయి. అతడు లేవలేడు. మంచంలో పడి ఉంటాడు. పిచ్చమ్మ చచ్చిపోయిన విషయం అతనికీ తెలియదు.

పిచ్చమ్మ కుక్కి మంచంలో కన్ను మూసింది. గూడెంలోని బుడుతలు యాదాలాపంగా పిచ్చమ్మ గుడిసెలోకి వెళ్ళారు. అలా వెళ్లినపుడు ఆమె వారిని అదిలించేది. ఆమెకు ఉన్న ఆస్తి సాంతం రెండు కుండలు. పిల్లలు ఆ కుండలు బద్దలు కొడ్తారని ఆమె భయం. పిల్లలను గుడిసెలోనికి రానిచ్చేది కాదు.

ఆ రోజు పిల్లలు గుడిసెలోకి వెళ్ళారు. ఆమెను రెచ్చగొట్టడానికే ఆమెతో తిట్లు తినడానికే పిల్లలు గుడిసెలో దూరారు. అయినా పిచ్చమ్మ పలకలేదు. పిల్లలు నిరాశ చెందారు.

"అవ్వా, కుండలు పలగ్గొడుతున్నం, ఇగో." ఒక పిల్లవాడు బెదిరించాడు.

పిచ్చమ్మ పలకలేదు. ఆమె కుండ ఎప్పుడో పగిలిపోయింది. ఇహ అది అతుక్కోదు. నీరు సాంతం కారిపోయింది.

"అవ్వా! అవ్వా!!" కుక్క్ మంచంలోని పిచ్చమ్మను కదిలించారు. పిచ్చమ్మ కర్రలా ఉంది. చల్లగా ఉంది. పిల్లలకు భయం అయింది. బయటికి ఉరికారు.

కోడి పెట్టలు గుడిసెలోకి వచ్చాయి. మంచం మీదికి ఎగిరాయి. పిచ్చమ్మ మీద వాలాయి. పిచ్చమ్మ కదల్లేదు. మెదల్లేదు. కోడిపిల్లలు పిచ్చమ్మ కళ్ళలో పొడిచాయి. పిచ్చమ్మ కళ్ళు తెరవలేదు.

పిల్లలు బయట నుంచొని అంతా చూస్తున్నారు. ఎందుకో వారికి బాధ అనిపించింది. కోడిపిల్లలు పిచ్చమ్మను అలా పొడవడం చూడలేకపోయారు. కోడి పిల్లలను వెళ్ళగొట్టారు. ఆటలు ఆడుకునే పిల్లల్లో ఏదో ఉదాసీనత వ్యాపించింది. వారు మౌనంగా ధర్మయ్య తాత దగ్గరికి వెళ్ళారు.

"తాతా! పిచ్చవ్వ కదుల్తలేదు, పలుకుతలేదు, కోడి పిల్లలు పొడుస్తున్నాయి." ఒక బాలుడు చెప్పాడు.

"పిచ్చమ్మ కదుల్తలేదు, పలుకుతలేదా!" జరిగిపోయిందాన్ని గ్రహించినట్లు, వేదాంతిలా మాట్లాడాడు ధర్మయ్య.

ధర్మయ్య తనను తాను చూచుకున్నాడు. కాళ్ళు లేవు. చేతులాడవు. అతని మనసు తల్లడిల్లింది. గుండె ఏడ్చింది. ధర్మయ్య ఏడవగలడు. మరేం చేయలేడు.

"పిచ్చమ్మ చచ్చిపోయింది!" ఏదో కఠినమైన సత్యం చెపుతున్నట్లు చెప్పాడు.

"తాతా! పిచ్చవ్వ పలకదా?"

"పలకదురా! పలకదు, ఇంకెన్నటికీ పలకదు. బాధలనూ, బంధాలనూ తెంచుకుని వెళ్ళిపోయింది."

పిచ్చమ్మ బాధలను, బంధాలను తెంచుకొని వెళ్ళిపోయింది.

పిచ్చమ్మ ముఖాన సూర్యునిలా వెలిగే కుంకుమ చెరిగిపోయిన్నాడే పిచ్చమ్మ సగం చచ్చిపోయింది. పోచయ్యను వరించి పెళ్ళాడింది.

పోచయ్య కండలు తీరిన నిండు మనిషి, మగసిరి నిండిన మొనగాడు. గూడెంలో పడుచులంతా పోచయ్యంటే పడి చచ్చేవారు. పోచయ్యకు పిచ్చమ్మే నచ్చింది. పిచ్చమ్మ కళ్ళల్లో పరువం పడగవిప్పేది. పోచయ్యా, పిచ్చమ్మా పచ్చని పొలాలల్లో కలుసుకున్నారు, గలగలపారే సెలయేటిలా నవ్వుకున్నారు, బాసలు చేసుకున్నారు, బండల చాటున విహరించారు.

"బావా! నన్ను ఇడిచిపోవుకద!" అమాయకంగా అడిగింది పిచ్చమ్మ.

"చచ్చిపోతేనే" అన్నాడు పోచయ్య – పిచ్చమ్మ సిగలో ముద్దబంతి ముడుస్తూ.

"అట్లనకు, నేనూ నీతో వస్త" అన్నది పిచ్చమ్మ బెదురుకళ్ళతో.

"అట్లనా?" అని కౌగలించుకున్నాడు పోచయ్య, విడిపోతుందేమో పిచ్చమ్మ అనే భయంతో.

ఆమె విడిపోలేదు. అతనే మోసం చేశాడు, మొదలే వెళ్ళిపోయాడు పిచ్చమ్మను వదిలి. పిచ్చమ్మ మొదలు నరికిన చెట్టయింది. ఇవ్వాళ ఎండిపోయింది, ఇహ చిగిరించదు.

పోచయ్య, పిచ్చమ్మల ప్రణయాన్ని గూడెం సహించలేదు. ఆస్తులు అంతస్తుల పేర అగాధాలు సృష్టించింది. పిచ్చమ్మ అర్ధరాత్రి కట్లుతెంచుకుని వచ్చేసింది. పోచయ్యను

కావిలించుకుని ఏడ్చేసింది. పోచయ్య పిచ్చమ్మను వదలలేదు. గూడెం ముక్కుమీద వేలువేసుకుంది, ధర్మయ్య నీతులు చెప్పాడు, కనీసం పెళ్ళి చేసుకొమ్మన్నాడు, పోచయ్య అంగీకరించాడు.

పెళ్ళంటే ఈ సమాజంలో ఒక జీవితపు అప్పు. పేదలు బానిసలు కావడానికి పెళ్ళిళ్ళు, దినాలే ప్రధాన కారణాలు. పెళ్ళి పేరుమీద మనుషులు పశువుల్లా అమ్ముడు పోతారు. జీవితాంతం కాదు, తరతరాలు బానిసలు అయిపోతారు.

పోచయ్య పరువపు మైకంలో ఉన్నాడు శివయ్య దగ్గరికి వెళ్ళాడు, పెళ్ళికి అప్పు ఇమ్మన్నాడు. శివయ్య ఉదారంగా ప్రవర్తించాడు, అప్పు పెట్టాడు. పోచయ్యకున్న నేలచెక్క రాయించుకున్నాడు. ఒక్క అంగుష్టపు ముద్రతో రైతు వెట్టివాడిగా మారిపోయాడు. పోచయ్యకు ఉన్న నేల చెక్క పోయింది. వడ్డీకింద పోచయ్య బానిస అయినాడు. పోచయ్య తిండికి శివయ్య అప్పుపెడతాడు. ఆ అప్పు హనుమంతుని తోకలా పెరుగుతుంటుంది. ఆ అప్పు అతని జీవితకాలంలో తీరదు. శివయ్యకోసం పోచయ్య బానిసలను కొంటాడు.

బానిస అయినా బాధపడలేదు పోచయ్య. పిమ్మట వారి మనస్సులు కలిశాయి. మనసులు కలిసిన చోట మహా ప్రళయాన్నయినా ఎదిరించవచ్చు. జంటగా ఉన్న వారికి వెంకడు కలిగాడు. వెంకణ్ణి చూచి వారు మురిసిపోయారు. గంజి తాగినా పరమాన్నం తిన్నట్లు బతుకుతున్నారు.

గూడెంలో ఒక తగాదా పోచయ్య ప్రాణం మీదికి తెచ్చింది – తుదకు ప్రాణాలు తీసింది. బాసలు చేసిన పోచయ్య వెళ్ళిపోయాడు. వెంకణ్ణి వదల్లేక పిచ్చమ్మ మిగిలిపోయింది. ఇప్పుడు వెంకడిని వదిలేసి పిచ్చమ్మ వెళ్ళిపోయింది – పోచయ్యదగ్గరికి.

గూడెంలో కొత్తగా పెళ్ళయిన దంపతులు. మగనికి పెళ్ళాం మీది అనుమానం వచ్చింది. పెళ్ళానికి రంకు కట్టాడు. చావతన్నాడు, వెళ్ళిపొమ్మన్నాడు. పెళ్ళాం తనవల్ల తప్పులేదంది. ఏడ్చింది. మొత్తుకుంది. మగని కాళ్ళు పట్టుకుని బ్రతిమిలాడింది. మగడు వినలేదు, జుట్టుపట్టుకుని బయటికి ఈడ్చి గుద్దులు గుద్దాడు, వెళ్ళిపొమ్మన్నాడు.

పోచయ్య అది చూచాడు, భరించలేకపోయాడు, రంగంలోకి దిగాడు. మగణ్ణి లాక్కొచ్చాడు, మూలకు కూలబడేశాడు, కట్టుకున్నదాన్ని విడిచిపెట్టడం పాపం అని చెప్పాడు. పెళ్ళాం వల్ల దోషం లేదని వప్పించాడు. వాళ్ళిద్దరినీ ఏకంచేశాడు. గుడిశలోవేసి తలుపేసి బయటికి వచ్చాడు.

బయటికి వస్తున్న పోచయ్యను ధర్మయ్య చూచాడు. "ఒరే పోచిగా! పంచాయితులు చెప్పేటంతోని వైనావురా. గూడెంల పంచాయితులు దొరింట్లనే తెగలె. నువ్వెందుకు చేతులు కాల్చుకుంటావురా. మనం బాంఛోళ్ళం, మన జగడాలు దొరే తీర్చాలె. అట్లనే జరుగుతాందింత వరక, నువ్వెందుకు ఏలుపెట్టినవు?" అన్నాడు ధర్మయ్య. అతని స్వరంలో భయం గోచరిస్తోంది.

"తాతా! అన్నాలమేమన్న చేసినానే. న్యాలమే చెప్పినగద." పోచయ్య తనను రక్షించుకోవడానికి అన్నట్లు అన్నాడు.

"న్యాలమయినా, అన్యాలమయినా దొరలే చెప్పాలె, మనం ఇనాలె, ఇట్లనే నడిచింది ఇంతకాలం. దొరకు ఎరికాయెనా, పానం తీస్తడు. పదిలంగుండుఫో" అన్నాడు ధర్మయ్యతాత, ధర్మానికేదో విఘాతం జరిగిందనికాదు- పోచయ్య కేదో అపాయం రానున్నదని.

పోచయ్య ఆ రాత్రి నిద్రపోలేదు. "నువ్వెందుకు పోయినవు-ఆ పంచాయితి లోకి?" అని వాపోయింది పిచ్చమ్మ. ఆమె ఆ రాత్రంతా పీడకలలు కన్నది. పోచయ్యను లాక్కుపోతారేమోనని కరిచి పట్టుకు పడుకుంది.

శివయ్యకు ఊరంతటా వేగు ఉంది. తెల్లవారకముందే ఈ వార్త అక్కడికి చేరింది. నర్సిమ్మ బల్లెం పట్టుకుని పోచయ్య గుడిసెముందు ప్రత్యక్షం అయినాడు. నర్సిమ్మ శివయ్యకు కుక్క లాంటి బంటు. 'నర్సిమ్మంటే గూడేనికి భయం, యమభటుణ్ణి చూచినట్లే.

"ఒరే పోచిగా! ఎళ్ళు దొరపిలుస్తాండు. పొద్దెక్కిందిలే-ఇంకెంత సేపు పండుతవు పెళ్ళాంతన. దొర పిలుస్తాండు ఎళ్ళు."

పిచ్చమ్మ గుండెలో గునపాలు గుచ్చుకున్నాయి, ఆమె బయటికి ఉరికి వచ్చింది.

"ఏందే అన్నా - ఎందుకు పిలుస్తాండు దొర?"

"నీ మొగడు మొనగాడయితాండట - జర అర్సుకుందమని పిలిపించిండు."

"ఏందే నరసన్నా! ఎందుకు పిలుస్తాండే దొర?" పోచయ్య స్వరంలో భయం తాండవిస్తోంది.

"ఒరే పోచిగా! మనం బాంచోల్లంరా. బాంచోల్లంగానే బతకాలె, బలం చూపిస్తే బతకలేంరా! బతికితె బాంచెలోలె బతకాలె అంతె. ఇగ చెప్పలేను." ధర్మయ్య స్వరం రెక్కలు తెగిపడినట్లుంది.

"నాకేమో బుగులుగున్నది. పోవద్దనలేను. ఉండమనలేను. ఏం చేతు?" అనంతమయిన ప్రశ్న పోచమ్మ మనసులో పొటమరించింది.

"నడూవురా పోచిగా - ఏమో దొరలె నిలబడ్డవు." మెడపట్టి ముందుకు గెంటాడు నర్సిమ్మ - దొరకు నమ్మిన బంటు.

పోచయ్య ముందుకు తూలి నిలదొక్కుకుని నడక సాగించాడు. బల్లెం పట్టుకున్న నర్సిమ్మ వెనక నడుస్తున్నాడు. పోచయ్య వెనక్కు తిరిగి చూచాడు. గుడిసె కనిపించింది. గుడిసె ముందు పిచ్చమ్మ, వెంకడు కనిపించారు. ఇద్దరూ శోకమూర్తులుగా ఉన్నారు-ఏడుస్తున్నారు-ఇటే చూస్తున్నారు. గూడెంలో జనం సొంతం గుడిసెల ముందు నుంచున్నారు ధర్మయ్య తాత కాళ్ళ మీద లేవాలని ప్రయత్నిస్తున్నాడు.

పోచయ్య ఊళ్ళోంచి సాగిపోతున్నాడు. అతనికి ఎడారిలోంచి పోతున్నట్లనిపించింది. మండే ఇసుకలోంచి నడచి పోతున్నట్టుంది. మంటల గాలులు వీస్తున్నట్లుంది. తానేం తప్పు చేశాడు? ఏం నేరం చేశాడు? ఎందుకు తనకీ శిక్ష? విడిపోయే జంటను కలిపాడు. తప్పా? తాను తప్పు చేయలేదు. తాను తప్పు ఒప్పుకోడు. దొరేం చేస్తాడు?

పోచయ్య శివయ్య ముంగిట్లో అడుగు పెట్టాడు.

"దొరేం చేస్తడనుకుంటున్నావ్‌లే. నీ తోళ్ళొలిచి చెప్పలు కుట్టించుకుంట.

లంజకొడకా! కుక్కిన పేనోలె పడుండరా అంటే పంచాయితులు చెప్పతావు గాడ్డి కొడకా! దొరనయన్ననుకున్నవా?" శివయ్య గర్జించాడు.

పోచయ్య శివయ్యను – దొరను చూచాడు. శివయ్య పులిలా ఉన్నాడు. చేతిలో "హంటర్" ఉంది. పులి నాల్క చాచి రక్తం కోసం చప్పరిస్తున్నట్లనిపించింది. దొరేం చేస్తాడు, తాను అన్యాయం చేయలేదు అనుకున్నాడు. అధికారానికి కళ్ళుండవని తెలియని అమాయకుడు పోచయ్య. ప్రపంచంలో జరిగిన మారణ హోమాలన్నీ అధికారం కోసమే జరిగాయని తెలియనివాడు పోచయ్య.

శివయ్య పోచయ్య మీద లంఘించాడు. హంటర్‌తో కసికొద్దీ వేశాడు. హంటర్ వంటిమీద అంటుకుంది. దద్దు వచ్చింది.

పోచయ్య పలకలేదు. సహించుకున్నాడు.

పోచయ్య శిలాప్రతిమలా నుంచునున్నాడు. పెదవి కదపడం లేదు. మాట రావడం లేదు. అన్యాయం చేయలేదు. దొరేం చేస్తాడు? అనుకున్నాడు.

శివయ్య దెబ్బమీద దెబ్బ వేస్తున్నాడు పోచయ్య చర్మం చిట్లుతూంది. రక్తం కారుతూంది. రణరంగంలో ఓటమి ఎరుగని వీరునిలా నుంచున్నాడు పోచయ్య. పోచయ్య పూచిన మోదుగులా ఉన్నాడు.

"మాట్లాడవేం బే. తప్పయిందను. కాళ్ళ మీద పడు." కసిగా అంటున్నాడు కొడుతున్నాడు శివయ్య. చెమట్లుకక్కుతున్నాడు. శక్తి క్షీణిస్తున్నది. దెబ్బలు కొట్టలేక పోతున్నాడు. బాధలేక పోతున్నాడు అయినా బలం పుంజుకుని కొడ్తున్నాడు.

పోచయ్య పడిపోయాడు. మొదలు నరికిన చెట్టులా పడిపోయాడు. వంటి నిండా రక్తం, కళ్ళు ఉబ్బిఉన్నాయి, ముఖం వాచి ఉంది.

శివయ్య జడుసుకున్నాడు.

ఒక్క అడుగు వెనక్కు వేశాడు.

చేతిలోని కొరడా జారవిడిచాడు.

రొప్పుతూ నుంచున్నాడు.

భయంగా పోచయ్యను చూస్తున్నాడు.

"నేను అన్నాలం చెయ్యలే. దొరేం చేస్తడు?

నేను అన్నాలం చెయ్యలే. దొరేం చేస్తడు?" పలవరించినట్లు పలుకుతున్నాడు పోచయ్య.

పోచయ్య పలుకులు నినాదాల్లా ఉన్నాయి. అవి శివయ్య చెవుల్లో దూరి, గుండెలోకి చొచ్చుకొని పోయి మారుమోగుతున్నాయి. శివయ్య చకితుడయినాడు. క్షణం ఆశ్చర్య పోయాడు. శివయ్యా మనిషే – కాకుంటే ఆస్తి, అధికార తాపత్రయం అతనిలోని మానవతను అడుగంటించాయి. ప్రతి మనిషికీ మానవత మీద ఏదో ఒకలాంటి కవచం ఉంటుంది. ఆ కవటం బద్దలయిన్నాడు మానవత కనిపిస్తుంది. అయితే, ఆ కవచం మళ్ళీ అంటుకుంటుంది. మానవతను అణచివేస్తుంది. దాని వెలుగుకు మసి పూస్తుంది.

శివయ్య ప్రతిమలా నుంచున్నాడు. అతని ముందు పోచయ్య పడి ఉన్నాడు. అతని దేహం రక్తసిక్తంగా ఉంది. కురుక్షేత్ర సంగ్రామంలో శరతల్పం మీద ఉన్న

భీష్మ పితామహునిలా ఉన్నాడు. అతని వాక్కు సత్యం పలుకుతూంది. కఠిన సత్యం. కఠోరమైన సత్యం.

పోచయ్య తనను ఎదిరించలేదు. పల్లెత్తు మాట అనలేదు. తాను కొట్టిన చావు దెబ్బలు తిన్నాడు. ప్రాణం ఎక్కడో కడగంటింది. అయినా తనను ఓడిస్తున్నాడు. ఇప్పుడేం చేయగలడు తాను? – ప్రాణాలకు లక్ష్యపెట్టని పరమ యోధునిలా ఉన్నాడు. సత్యం కోసం, న్యాయం కోసం, ప్రాణాలు త్యజించడానికి సిద్ధంగా ఉన్నాడు. పోచయ్య రామునిలా కనిపించాడు. కృష్ణునిలా కనిపించాడు. జీసస్‌లా కనిపించాడు. శిలువనెక్కి సత్యం చెబుతున్నట్లు అనిపించింది –

"నేను అన్యాలం చెయ్యలే. దొరేం చేస్తడు?"

శివయ్యలోని మనిషి మళ్ళీ ఇనుపకవచం కప్పుకున్నాడు. నిరంకుశునికి పశ్చాత్తాపం పనికిరాదు. మానవత అతనికి చుక్కెదురు.

"నర్సిగా! వీణ్ణి తీసుకపోయి ఇంట్లో పడెయ్యి" అని వెనక్కు తిరిగి మెట్లెక్కాడు. "పోచిగాడు బాగయ్యేటట్లు చూడు. పైకం కావల్నంటె నేనిస్త" అని తిరిగి చూడకుండానే చరచరా నడిచి ఇంట్లో దూరాడు. తలుపు వేసుకున్నాడు.

పోచయ్యను గూడానికి తెచ్చినప్పుడు పిచ్చమ్మ వెర్రిదానిలా కేకలు పెట్టింది. గూడెం సాంతం కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. కాని ఒక్కరూ శివయ్యది తప్పనలేదు. పోచయ్య చేజేతులా చేసుకున్నాడనుకున్నారు.

పాలకులు ఎప్పుడూ తాము పరమేశ్వరులమనే అనుకుంటారు. ఆ అసత్యాన్ని పాలితులు అంగీకరించడమే బానిసత్వం. తమ హక్కులను కాక పాలకుల హక్కులను పరిరక్షిస్తారు బానిసలు.

పోచయ్య వెంటనే చచ్చిపోలేదు. చాలా రోజులు బాధ పడ్డాడు. అతనికి మందు లేదు. వైద్యం లేదు. తిండి లేదు. శివయ్య చేస్తానన్న సాయం నర్సిమ్మ కాజేశాడు. చివరి క్షణంలో కొడుకును పిలిచాడు పోచయ్య. "ఒరే ఎంకడూ! మనం బాంచోల్లంరా! బాంచ లోలెనే బతకాలె. దొరమాటకు తిరుగుచెప్పకు" అని వాణ్ణి పిచ్చమ్మకు అప్పగించి ప్రాణాలు వదిలాడు. పిచ్చమ్మ బావురుమంది. గూడెం గొల్లుమంది. అయినా పీనుగు ఆగలేదు. లేవడానికి ధర్మయ్యకు కాళ్ళు రాలేదు. చేతులు ఆడలేదు. భూమాత పోచయ్యను తన వడిలో దాచుకుంది.

శివయ్య దినవారాలకు అప్పు పెట్టాడు.

వెంకడు పుట్టు బానిసగా మారిపోయాడు.

పోచయ్య పోయిన్నాడే పిచ్చమ్మ ప్రాణాలు సగం ఎగిరి పోయాయి. పిచ్చమ్మ కంకాళంలా జీవిస్తాంది. జీవచ్ఛవంలా బతుకుతూంది.

వెంకడు పెద్దవాడయినాడు, శివయ్యకు చాకిరి చేస్తున్నాడు. మంచంలో ఎముకలబోనులా పడి ఉంది తల్లి. తల్లిని చూస్తే మనసు తరుక్కు పోతుంది వెంకడికి. తండ్రి చావు కళ్ళారా చూచాడు. తల్లి చావబోతూందని గ్రహించాడు. కర్మను నిందించాడు. దేవుని దూషించాడు.

బతికున్నన్ని రోజులు తల్లికి సేవ చేయాలని వెంకడి కోరిక. పిచ్చమ్మ కుక్కి మంచంలో పడి ఉంది. వెంకడు ఆమెకు పరిచర్యలు చేస్తాడు. అంబలి కాచి

పోస్తాడు. పొద్దు పొడిచే వరకు శివయ్య చాకిరికి పోవాలి. అతను బయలుదేరేపుడు పిచ్చమ్మ పిలుస్తుంది–

"కొడకా! మల్ల చూస్తనో లేదో అట్ల నిలబడు, కండ్లనిండా చూసుకుంట" అంటుంది. వెంకడికి దుఃఖం ముంచుకొస్తుంది. అయినా దిగమింగుతాడు. ప్రతిమలా నుంచుంటాడు. పిచ్చమ్మ అతని చేతులు పట్టుకు నిమురుతుంది. కొడుకును మొత్తం తాగేయాలన్నట్లు చూస్తుంది. తన కళ్ళలోనే దాచుకోవాలన్నట్లు చూస్తుంది. వెంకడు ఆమెను తప్పించుకుని బయటపడ్తాడు. బండ మీద కూర్చొని మోకాళ్ళ మీద తలపెట్టి భోరున ఏడుస్తాడు. ఏమి చేయగల డతను? ఏడవగలడు – అంతే.

తల్లి మంచం మీద తీసుకుంటూంది. రోజు రోజుకూ చావుకు దగ్గర పడుతూంది. తెలుసు ఆ విషయం అతనికి. అయినా ఏం చేయలేడు. తల్లికి వైద్యం చేయించాలని అతని తహతహ. తల్లిని బతికించుకోవాలని అతని తపన. ఒకనాడు గౌరీనాథశాస్త్రి దగ్గరికి వెళ్ళాడు. మందు ఇమ్మనీ, తల్లిని బతికించమనీ బతిమిలాడాడు.

"ఒరే వెంకడూ! మీ అమ్మను మీ నాయన పిలుస్తున్నాడ్రా – దానికి మందెందుకు?" అన్నాడాయన.

శాస్త్రిగారు మందివ్వదలచుకోక అన్నమాట అది. గూడెంలో చావు బతుకులు అంటరానివి. అక్కడిదాకా వెళ్ళరాయన. గూడెంలో పుట్టుకలాగే చావు అతి సహజం అయింది, అక్కడ రెంటికీ స్వేచ్ఛ ఉంది, అడ్డేవారు లేరు.

శాస్త్రిగారు ఎందుకన్నారో గ్రహించలేక పోయాడు వెంకడు. తల్లితో శాస్త్రిగారు చెప్పిన మాటలే చెప్పాడు, శాస్త్రులు చెప్పిందే వేదం. పిచ్చమ్మ పాపం నమ్మింది. పోచయ్య తనకోసం అక్కడ వేచి ఉన్నాడనుకుంది. బొందితో ఎలాగూ చేరలేదు బొంది విడిచి కైలాసం చేరుకోవాలనుకుంది. పోచయ్యను కలుసుకోవాలనుకుంది. బతికి సాధించలేని సుఖం చచ్చి సాధిద్దామనుకుంది.

బతకదలచని వారిని బతికించడం ధన్వంతరికి కూడా తరంకాదు. పిచ్చమ్మ పరిస్థితి విషమించ సాగింది. ఆమె వాంతి చేసుకుంటే ఒకనాడు రక్తం పడింది. ఆ రక్తం చూసి వెంకడి గుండె తల్లడిల్లింది. తల్లిదగ్గరే ఉండిపోవాలనుకున్నాడు. పనికి పోవాలి, పోకుంటే అంబలికి గింజలు రావు. మందుకాకున్నా ఇంత గంజి పోయాల్సిందే గొంతులో. ఆ బండమీద కూర్చుని మరింత ఏడ్చాడు. గుండె బరువు దిగేట్టు ఏడ్చాడు. బండలు కరిగేట్టు ఏడ్చాడు. నర్సిమ్మ గద్దించాడు. అరచేతులతో కన్నీరు తుడుచుకుని పనిలో ప్రవేశించాడు. అతనికి తల్లి కక్కిన రక్తమే కళ్ళలో ఆడుతూంది.

చివరిరోజు వెంకడు పిచ్చమ్మకు అంబలి కాచిపోశాడు. పిచ్చమ్మ తాగింది ఆమె కొస్త ఉత్సాహంగా ఉంది. "బిడ్డా, చేపల పులుసు తినాల్నని ఉన్నదిరా!" అన్నది. వెంకడికి ఏదో బరువు దిగుతున్నట్లనిపించి, "అమ్మా! వండి పెడ్తనే. మాపటికి చేపలు తెస్త" అన్నాడు. "అరే! అయ్య ఉన్నప్పుడు నేను వండి పెట్టేదాన్ని. నీకు వండొస్తాదిర" అన్నది. "వండొస్తదే. నీకెందుకు, వండి పెడతగద" అన్నాడు. "వండిపెట్టు కొడుక, చేపల పులుసు తిని చస్త" అన్నది. "వండి పెడతగద,

నువ్వెందుకు చస్తవే, అమ్మా! బతుకుతవు, నిన్ను బతికించుకుంట" అన్నాడు. అతని స్వరంలో ఆశ గోచరించింది. యమునికి తొడగొట్టి సవాలు చేస్తున్నట్లనిపించింది.

"ఒరే ఎంకా, ఎల్లవేమిరా! పెళ్ళామొస్తె అసలే ఎల్లెటట్లు లేవు." నర్సిమ్మ గొంతు వినిపించింది. తల్లిని వదిలి బయటికి వచ్చేశాడు. బయటకి వచ్చింతర్వాత తల్లిపిలుపు వినిపించింది. అది మామూలే అనుకున్నాడు వెంకడు. "కొడకా! మల్ల చూస్తనో లేదో, అట్ల నిలబడు, కండ్ల నిండ చూసుకుంటా" అంటుంది. ఆనాడు ఆ మాటలు వినదలచలేదు వెంకడు. పైగా నర్సిమ్మ తొందర పెడ్తున్నాడు.

ఆ రోజు వెంకడు బండమీద కూలబడి ఏడవలేదు. పనిలో ఉత్సాహంగా పాల్గొన్నాడు. తన తల్లి బతుకుతుంది. ఆమెకు చేపలపులుసు వండి పెడతాడు, తన తల్లి బాగుపడుతుంది, లేస్తుంది, తిరుగుతుంది, తనకు వండి పెడుతుంది, నవ్వుతుంది, ఏడుస్తుంది. పని చేస్తున్నంత సేపూ అవే దృశ్యాలు అతని మనోఫలకం మీద మసలుతున్నాయి. సూర్యుడు ఇంకా కుంగడు, పని ముగియదు, తాను ఇంటికి పోడు, విసుగు కలిగింది. కుంగే సూర్యుడు తల్లిప్రాణాలు కూడా తీసుకుని కుంగాడని అతడు ఎరుగడు.

పనిమాని జనం గూడానికి బయలుదేరారు. వెంకడు తల్లిని చూడ్డానికి ఉరికి వచ్చాడు. చేపలు తేవాలి, పులుసు వండాలి, తల్లికి తినిపించాలని అతడు ఎంతో ఉత్సాహంగా ఉరికి వచ్చాడు. గూడానికి దూరంనుంచే చూచాడు. అతని గుడిసెముందు పిల్లలు మూగి ఉన్నారు. మనసు కీడు శంకించింది. మరీ వేగంగా ఉరికాడు. కుక్కిమంచంలో పడిఉన్న ధర్మయ్య వార్త అందించాడు –

"వెంకడూ! మీ అమ్మ చచ్చిపోయిందిరా!"

వెంకడిమీద పిడుగులవాన కురిసింది. అతని గుండె తునాతునకలైపోయింది.

"అమ్మా!" అని కేకపెట్టి పిచ్చమ్మ శవం మీద పడిపోయాడు. గుండెలు అవిసేట్లు ఏడవసాగాడు. తల కొట్టుకుని ఏడ్చాడు, జుట్టు పీక్కొని ఏడ్చాడు, చేపల పులుసు తినకుండా పోయినందుకు ఏడ్చాడు. తన దౌర్భాగ్యానికి ఏడ్చాడు, తన అశక్తతను తిట్టుకున్నాడు, వెంకడు ఏడ్చాడు, రోదించాడు, విలపించాడు.

గూడానికి జనం చేరుకున్నారు. పెంటడు వెంకడిని ఓదార్చాడు. "పుట్టింది చావడం కోసమే. కలకాలం ఎవరూ జీవించరు, జీవితం నీటి బుడగలాంటిది, మీ అమ్మ అదృష్టవంతురాలు" – ఇలాంటి మాటల్తో ధర్మయ్య ఓదార్చాడు.

"పిచ్చమ్మ అదురుష్టం మంచిది, మంచంలో కించంలో పడకుండపోయింది. ఏడుస్తే తిరిగిరాదు, కావలసిన కార్యం జరిపించాలెరా" అని వెంకణ్ణి బయటికి తెచ్చాడు నర్సిమ్మ.

"పొద్దు గూకెయాల చచ్చింది, జాగారం చేయాలె, బజన జరగాలె, ఇన్ని సారనీల ఏర్పాటు చెయ్యాలె, ఎట్లమరి?" పెంటడు బయటపెట్టాడు.

"ఎట్ల ఏంది? దొరదగ్గరికి పోవాలె, పైకం తేవాలె, పదర వెంకడు, నేను ఇప్పిస్త." సారాయి దొరుకుతుందనే ఉత్సాహంలో వెంకడిని ముందుకు తోశాడు నర్సిమ్మ.

వెంకడు నర్సిమ్మవెంట శివయ్య ఇంటికి చేరుకున్నాడు. శివయ్య లోన ఉన్నాడు, నర్సిమ్మ పిలిస్తే వచ్చాడు.

"ఏందిరా ఇట్లొచ్చిన్రు?"

వెంకడు మాట్లాడలేదు. నర్సిమ్మ అందుకున్నాడు-

"దొరా! పిచ్చి చచ్చిందికద, కర్చుకు కావాలినాయె, పైకం అడిగెటందుకు వచ్చిండు."

"బెల్లంకొట్టిన రాయోలె ఉన్నవు, మాట్లాడవేమిర?" శివయ్య వెంకణ్ణి అడిగాడు.

"అరే! నువ్వేడ్వకుర" అని వెంకడిని కసిరి, "దొరా! దయదల్చాలె – ఎట్లయితది మల్లీ పీనిగ ఎల్లాలె గద – ఏదన్న మీరే చూడాలె" అని నర్సిమ్మ నసిగాడు.

"వానిదగ్గర ఏమున్నదని ఇయ్యమంటవుర! అయ్య చావుకు చేసిన అప్పు కింద వీడే నాకు వెట్టికుండె. ఇగేం చూసి ఇయ్యమంటవు?"

"అట్లంటె ఎట్ల బాంచను. ఎంకడు లగ్గం చేసుకోడా–వానికి పోరలు పుట్టరా–వాండ్లను మీ కాల్లకాడ పడేస్తడు."

"ఏమిరా ఎంకా! పెండ్లిచేసుకుంటవా?"

"ఏం చేసుకుంట బాంచెను–మా అమ్మ చచ్చింది." మళ్ళీ భోరుమన్నాడు ఎంకడు.

"వాడేం మాట్లాడ్తడుండి. నేనున్నగద, అన్ని చేస్త. సారదుకానానికి చీటిప్పించుండి, పొద్గాలొచ్చి చావుపైకం పట్కపోత."

"సరే, అట్లనే కానియ్యి. సారదుకాణంల నా పేరుచెప్పు" అని శివయ్య లోనికి వెళ్ళిపోయాడు.

వెంకడికి పుట్టబోయేబిడ్డల్ను తాకట్టు పెట్టి, సార దొరుకుతుందనే సంతోషంతో నర్సిమ్మ బయటపడ్డాడు–వెంకడిని తీసుకొని.

శివయ్య ఇంట్లోకి వెళితే మల్లమ్మ కనిపించింది. "దొర్సానీ! పిచ్చమ్మత్త చచ్చిందట – పొయ్యొస్త" అని సుభద్రమ్మ అనుమతి అడుగుతూంది.

"నువ్వు పోతే చచ్చింది లేచొస్తదా? పని తప్పించుకునే ఉపాయం బాగ నేర్చినవు. పో పనిచేయి పో!" సుభద్రమ్మ కసిరింది.

"పనిచేసి పోత దొర్సానీ! కాల్మొక్త, చచ్చిందాన్ని చూసొస్త–బాంచను–పొద్గాలనే మల్లొస్త" అని మల్లమ్మ సుభద్రమ్మ కాళ్ళు పట్టుకుంది.

"పొమ్మంటే ఇంటలేవు. ముంగలపోయి పనిచేయి–పోవటానికి వీల్లేదు – పనెవడు చేస్తడే నీ మిండడా!" సుభద్రమ్మ కాళ్ళమీద నుంచి నెట్టేసింది. మల్లమ్మ గుడ్లనీరు కుక్కుకొని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

అప్పుడే లోన అడుగుపెట్టిన శివయ్య అడిగాడు "ఏమిటే?" అని.

"మల్లి గూడేనికి పోయి చచ్చిందాన్ని బతికిస్తదట, పోతనంటున్నది."

"పోనియ్యరాదు, పాపం, చూసొస్తదేమో!" సానుభూతి కనబరచాడు శివయ్య.

"బాగున్నది. వెంటతీసుకపోయి పంపించిరాండి. అదంటె ఏందో మెత్త పడిపోతున్నరు. పనెవడు చేస్తడనుకున్నరు? పోతె మల్లొస్తదా? తాగి మిండల దగ్గర పంటది. మీకంత మనసుంటె వెంట పెట్టుక పోండి." సుభద్రమ్మ గొంతులో దుఃఖం దుముకుతున్నది.

"వద్దులే–నా కెందుకు–నీ ఇష్టం."

శివయ్య తనకేమీ పట్టనట్లు దొడ్లోకి వెళ్ళిపోయాడు.

సారాయి సీసాలతో గూడానికి చేరుకున్నాడు నర్సిమ్మ. సారాయి చూడగానే ప్రాణం లేచివచ్చింది గూడానికి. వెంకడు పిచ్చమ్మ శవం దగ్గర కూర్చొని పిచ్చెత్తినట్లు ఏడుస్తున్నాడు. అతన్ని ఎవరూ గమనించలేదు. గూడెం సొంతం కూడింది. కర్రా కంపా తెచ్చి నెగడు వేశారు. మంట భగ్గున మండింది. గూడేన్ని వెలిగించింది. మంట వెలుగుకు డప్పులు కాపుతున్నారు.

"తద్దిన తక్క – తద్దిన తక్క" – డప్పులు సాగేయి. నర్సిమ్మకు అప్పటికే తలకెక్కింది – దుకాణంలోనే దంచి వచ్చాడు. జనం సారాసీసాలమీద పడ్డారు. గూడెం సొంతం పిచ్చమ్మ గుడిసెముందే ఉంది.

"వరే! గాడ్దికొడుకుల్లార ఊగుకుంట కొడ్తా గ్రేమిరా మీ అమ్మల – సారపడ్డెనక డప్పట్ల సాగాలెరా!" అని డప్పందుకుని "ధనక–ధనక, ధనక–ధనక" సాగించాడు నర్సిమ్మ.

"ధర్మయ్యతాతా! సారనీలు పడ్డా సోలుగుతాన్ని వేందే. బజన కానియ్యి. ఊఁ కానియ్యి." డప్ప కొడుతున్నాడు నర్సిమ్మ.

"ఓ రామ – నీ నామా – మెంతారుచిరా" అందుకున్నాడు ధర్మయ్యతాత. అంతా వంత పలుకుతున్నారు. రాగాలు–తాళాలు సాగుతున్నాయి. ఎవరికీ స్పృహలేదు. వెంకడు ఏడుస్తూనే ఉన్నాడు. ఎవడూ వినడంలేదు. అందరూ వళ్ళు మరచారు– ఇళ్ళు మరచారు– ఎగురుతూనే ఉన్నారు.

నెగడు మండుతూంది.

వెంకడు ఏడుస్తున్నాడు.

పెంటడూ తాగి ఉన్నాడు. అయినా వెంకడి ఏడుపు విన్నాడు. పెంటడు వెంకడి దగ్గరికి వెళ్ళాడు. అతడూ తూలుతున్నాడు. అయినా ఓదార్చాడు.

"అరే వెంకడూ! ఓరి ఎంకడూ! లే, ఎందుకేడుస్తవు? ఒరే, మనం పుట్టిందే ఏడ్చెటందుకురా! వరే ఇన్నవా, అంత ఇప్పడే ఏడుస్తే బతుకంత ఏమేడుస్తవ్! లే నా మాటిను. ఒక్క గుటకేసుకో అరే! ఇది సారరా, సకల రోగాలకు మందు, పట్టు. ఒక్క గుటక. అఁ అట్ల కానియ్యి తాగు. తాగరా!" వెంకటికి తాగించాడు.

బయట నెగడు వెలుగుతూంది.

పాటలు సాగుతున్నాయి.

డప్పులు మోగుతున్నాయి.

"ఒరే ఎంకన్నా! మీ అమ్మ చచ్చింది. వరే మంచిదిరా! చచ్చినోల్లె మంచోల్లు. బతికి మనమేం చేస్తున్నంరా? మనం కూడా చస్తె మంచిది – దొరకు మనిషి తక్కువయితడని బతకాలె."

"మా అమ్మ చచ్చిందే – పెంటయ్యన్నా!" అని పెంటడిని పట్టుకుని బోరుమన్నాడు వెంకడు.

"అరె. ఊరుకో... ఊరుకొమ్మంటే – ఇగ ఏడ్వకు... ఏడ్వకుమంటే..." ఓదారుస్తున్నాడు పెంటయ్య.

కాలమే ఓదార్చింది అందరినీ. తెల్లవారే వరకు దుఃఖం దిగమింగాడు వెంకడు. తల్లిని మంట్లో కలిపి ఇంటికి తిరిగి వచ్చాడు. గుడిసె ముందు కూలపడి చేతులు నెత్తిన పెట్టుకున్నాడు.

గూడెం సొంతం ఖాళీ అయింది. శివయ్య చాకిరికి వెళ్ళిపోయింది. వెంకడు ఆ రోజు పనికి పోలేదు. నర్సిమ్మ రమ్మనలేదు.

గూడెం నిర్మానుష్యంగా ఉంది.

గుడిసె ముందు కూలబడి కుమిలిపోతున్నాడు వెంకడు.

"మీ అమ్మ నసీబు బాగుండి ఎల్లిపోయిందిరా! బతికినోళ్ళం ఏం చేస్తున్నాం? బాంచోల్లుగ బతుకుతున్నాం. అదే నసీబుగలిది–అరే ఏడ్వకురా!"

"తాతా! మా అమ్మ పోయింది" అని ధర్మయ్య తాతమీదపడి భోరుమన్నాడు వెంకడు.

పేదలు ఏదీ దాచుకోలేరు–దుఃఖాన్ని, సుఖాన్ని సైతం.

## 4

ఎండ ఎక్కుతూంది. శివయ్య వాకిట్లో ఎండ పరచుకుంది. ఎదురుచూచే జనం పడిగాపులు కాస్తున్నారు. వారి కళ్ళన్నీ శివయ్య వచ్చే గుమ్మం మీదే ఉన్నాయి. వారికి సూర్యుడు వస్తే తెల్లారదు. శివయ్య వస్తే తెల్లారుతుంది శివయ్య వాలుకుర్చీ ఖాళీగా ఉంది, శివయ్య ముందున్న డస్కు ఖాళీగా ఉంది.

శివయ్య వళ్ళు విరుచుకుంటూ ప్రవేశించాడు. అతని ముఖంలో నలత కనిపిస్తూంది. నీరసంగా ఉన్నట్లున్నాడు. శివయ్యను చూచి అంతా దండాలు పెట్టారు. శివయ్య చిరునవ్వు నవ్వలేదు, అతడు ప్రతినమస్కారం చేయడు. వాలుకుర్చీలో కూలబడ్డాడు.

"దొరవారూ! పొరుగూళ్ళ పని కుదిరింది, జర జల్ది ఇప్పిస్తే పోత." బ్రహ్మయ్య జంధ్యం బయటికి లాగి, తనను ముందు పంపించమని వేడుకున్నాడు.

"బ్రహ్మయ్యా! ఏందా తొందర? జరుండి. పంతులేడి? ఇంకా రాలే! ఏం చేస్తడో ఇంట్ల ఎరకలే. జరపోయి పిల్చుకరాపో."

"దొరవారూ, నన్నే పిలిచిరమ్మంటారా ఇక్కడ ఇంతముందున్నరు...."

"బ్రహ్మయ్య పిలుస్తే నీ జంధ్యలు తెగిపోతాయా? జంధ్యం ఉండంగనే మొగాణ్ణనుకున్నవా? పో పిల్చుకరాపో."

బ్రహ్మయ్య మారు పలకలేదు. కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు.

శివయ్య వళ్ళు విరుచుకున్నాడు. వాకిలి చూచాడు. మనుషులు అతనికోసం పడిగాపులు కాస్తున్నారు, వాళ్ళంతా తనకోసం బతుకుతున్నారు. ఇందుకు కారణం తన డబ్బు. డబ్బుతో వాళ్ళ జీవితాలను కొనేశాడు. డబ్బుతో వాళ్ళ ప్రాణాలను తన గుప్పిట్లో పెట్టుకున్నాడు. డబ్బుతో ఈ ఊరిని తనకు ఊడిగం చేసేట్లు చేశాడు. డబ్బు గొప్పది. అది వారి దగ్గర లేదు. తన దగ్గర ఉంది. అదే రహస్యం, ఇది ఇలాగే ఉండాలి. ఇది ఇలా ఉన్నన్నాళ్ళు తానే దొర–తానే ప్రభువు – తానే దైవం. ఇది ఇలా లేకుండా పోతే... పోతే... పోతే... ఆలోచనలు ముందుకు సాగలేదు.

మల్లమ్మ గ్లాసులో చాయ్ తెచ్చి ముందు నుంచుంది. ఆలోచనల్లో గమనించలేదు. ఆలోచన తెగుతే చూచాడు

"అట్ల నిలబడ్డావు - దయ్యమోలె - చాయ్ తెచ్చిన్నని చెప్పొద్దు?"

మల్లమ్మ మాట్లాడలేదు. గ్లాసు అందించింది. వెళ్ళిపోయింది. చాయ్ వేడిగా ఉంది. చప్పరిస్తే నాలుక చురుక్కుమంది.

"దొరవారూ! పంతుల్లేడు. తలుపులు బార్ల తీసున్నాయి. ఇల్లంత ఊడ్చినట్లున్నది. ఏమిలేదు. పంతులు పారిపోయినట్లున్నాడు. నా పనిముట్లు..." బ్రహ్మయ్య ఉరికి వచ్చాడు. అలిపిరి వస్తునే ఉంది. ఊపిరి పీల్చుకోకుండా అనేశాడు.

"ఏంది? పంతులు పారిపోయినాడా!" శివయ్య చేతులోని గ్లాసు వణికింది. గ్లాసు వేడిగా ఉండి, జారిపడేట్లుంది. చేయి కాలుతూంది. గ్లాసు మెల్లగా నేలమీద పెట్టాడు.

"యాడికి పోతడు? ఎట్ల పోతడు? సరిగ్గా చూచినవా? అరే బాలిగా! కొమరిగా! మల్లిగా! పొండిరా, చూచిరాండి. ఊళ్ళయాడున్నడో పట్టుకురాండి."

"చూచిన దొరవారూ! బాగా చూచిన, పంతులు లేడు. పారిపోయినట్లున్నడు."

"నోర్మూయ్యి." గట్టిగా కేక పెట్టాడు శివయ్య. ఆ కేక ఇంట్లో ప్రతిధ్వనించింది. బ్రహ్మయ్య గుండెలో చేరి గుబగుబ లాడించింది.

బ్రహ్మయ్య భార్యకు బావుండలేదు. పొరుగూళ్ళో పని దొరికింది. ఒప్పుకున్నాడు. పనిముట్లు త్వరగా తీసికెళ్ళాలని అతని ఆతురత.

శివయ్యకు అంతా అయోమయంగా ఉంది. శాస్త్రి గుర్తుకు వచ్చాడు. అతని వినతి గుర్తుకు వచ్చింది. తాను వాదించడం గుర్తుకు వచ్చింది. అయినా శాస్త్రులు సాధించినట్లున్నాడు! కృష్ణారావును బదిలీ చేయించినట్లున్నాడు! శివయ్యకు సూర్యుడు రాలిపడి నట్లనిపించింది. సర్వత్రా కటిక చీకట్లు కమ్ముకుంటున్నట్లు అనిపించింది. తన బలదర్పాలకు ఎక్కడో చిల్లి పడినట్లూ, అవి కారిపోతున్నట్లూ అనిపించింది. పంతులు బదిలీ తనకు తెలియకుండా ఇంత వరకు కాలేదు. తన పెత్తనం మీద ఎవరో దెబ్బ తీస్తున్నట్లు అనిపించింది. గౌరీనాథశాస్త్రి ప్రత్యక్షం అయినాడు. శివయ్య పళ్ళు పట పటా కొరికాడు.

జ్యోతుల్లాంటి కళ్ళు, విరబోసిన జుట్టు, చేతులో మనిషి పుర్రెతో కనిపించాడు గౌరీనాథశాస్త్రి. శివయ్యకు చలిచలిగా ఉంది. వణుకు వస్తూంది. నిగ్రహించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. నలుగురికీ కనిపించనీయరాదనుకున్నాడు.

"దొరా! పనిముట్లు ఇప్పించండి, పోతా. నాకు పొరుగూళ్ళ పని దొరికింది." బ్రహ్మయ్య అడిగాడు.

"వస్తయి పనిముట్లు! ఇక యిస్త! తిందురుగాని! లెక్క రాసెటోడు రానియ్యుండి. అప్పటి దన్క చావుండి లంజకొడుకులు. చావాలె గాడ్డి కొడుకులు. కడుపు మాడ్తె మీరే చస్తరు కుక్కల కొడుకులు" అని దిగ్గున లేచి వెళ్ళిపోయాడు శివయ్య.

అక్కడున్నవారు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. "మనమేం చేసిన మని?" అడిగాడు కొమరయ్య. "ఉపాసాలు పండ బెట్తాండు. ఉసురు తాకక పోతాది!" శివయ్య ఇల్లుదాటి చాలా దూరం వచ్చాక అన్నాడు బ్రహ్మయ్య.

శివయ్యకు ఆనాడు పులకరం తగిలింది. సుభద్రమ్మ గుండె గుబగుబ లాడింది.

పిల్లిని చూచి భూతం అనుకునే వాళ్ళుంటారు. అలాంటి భయమే పట్టుకుంది శివయ్య దంపతులకు.

శివయ్య వాలు కుర్చీలో కూర్చున్నాడు. అతని ఎదురుగా డస్కు వుంది. డస్కు ముందు కూర్చోవాల్సిన పంతులు లేడు. అతని స్థానంలో జగన్నాథం కూర్చున్నాడు. లెక్కలు పూర్తిచేశాడు. డబ్బు లెక్కపెడ్తున్నాడు. పనిముట్లు తీసుకుని అంతా వెళ్ళిపోయారు. ముంగిలి ఖాళీగా ఉంది. పావని ప్రవేశించింది.

శివయ్య–గుమ్మంలో అడుగుపెడ్తున్న పావనిని చూచాడు. పావని బక్కపల్చగా పొడుగ్గా ఉంది. ఆమె ముఖంలో అమాయకత్వం కనిపించింది. మామూలు ఆడపిల్లలా ఉంది. మహాకాళిలా లేదు. తాను భయపడినట్లు లేదు. పావని సౌమ్యంగా ఉంది. ఆమె పాములా లేదు. గోవులా ఉంది. పావని అంటే తాను ఎందుకు భయపడ్డాడో అర్థంకాలేదు.

"నమస్కారం శివయ్యగారూ!" పావని నమస్కరించింది.

"నమస్కారం, వచ్చినవా ఈ ఊరికి! శాన్నాళ్ళకు కనబడ్డవు. ఉంటావా నాల్గు రోజులు? బాగా చదువుకున్నవని చెప్పింద్రు మీ నాయన గారు. ఎందాక చదివినవు–ఏంది కత?"

పావని మెట్లెక్కి వచ్చింది. పక్కనున్న కుర్చీమీద కూర్చుంది. ఒక ఆడపిల్ల తనముందు వచ్చి అలా కూర్చోడం శివయ్యకు వింతగా ఉంది.

"బి ఏ దాకా చదువుకున్నాను. బడి పంతులు ఉద్యోగం అయింది. ఇప్పుడీ ఊరికి బదిలీ అయింది. వచ్చాను. ముందు మిమ్మల్ని చూతామని వచ్చాను."

"బాగున్నది, అంత చదువు చదివి ఈ ఊళ్ళ ఏం చేస్తావు? ఈ ఊళ్ళ చదువుకునేటోడు ఎవ్వడు?" శివయ్య కాస్త ఆగాడు.

"ఇగో పావనీ! నువ్వు ఈ ఊరికి రావటమే నాకు ఇష్టంలేదు. వచ్చినవు. ఇంకొకరు అయితే రానిచ్చేటోన్నికాను. మీ నాయనగారి మొకం చూసి ఊరుకున్న. వచ్చినవు. ఇంట్ల పండుండు. మీ నాయినకు ఇంత వండి పెట్టు. సర్కారు జీతం తీస్కో, ఊళ్ళ ఉండు. చదువుగిన చెప్తనంటవా ఇగబాగుండదు. ఇన్నవా?" అని లేచి లోనికి వెళ్ళిపోయాడు శివయ్య. ఒక ఆడపిల్ల వచ్చి తనను ఎదిరించి మాట్లాడ్డం నచ్చలేదతనికి.

"పావనమ్మా! ఇన్నవా దొరేమన్నడో? ఇగ పెండ్లి చేసుకుని పిల్లల్ని కను." జగన్నాథం నీతి బోధించాడు.

"నాకు జీతం ఇచ్చేది గవర్నమెంటు. నేను చదువు చెప్పక తప్పదు." పావని మెట్లుదిగి వెళ్ళిపోయింది.

జగన్నాథం నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడు.

లోన ఉండి పావని మాటలు విన్న శివయ్య సిగరెట్టుపొగ గట్టిగాలాగి, వదలాలా వద్దా అన్న సంశయంలో, ఉక్కిరిబిక్కిరి అయినాడు.

# 6

పావని ఇంటినుంచి బయల్దేరింది. భుజానికి సంచి, చేతిలో పుస్తకాలతో బయల్దేరింది. ఆమె వీధివెంట వెళ్తూంది. అంతా ఆమెను వింతగా చూస్తున్నారు. "పెళ్ళి కావలసిన పిల్ల, ఏందమ్మా ఇట్ల తిరుగుతాంది" – ఒక అమ్మ విస్తుపోయింది. "పట్నంల నయితె చెల్లుతది. ఊళ్ళల్ల ఇదేందమ్మా" – ఒక అక్క వ్యాఖ్యానించింది. "ఆడపిల్లలకు కొలువేంది!" ఒక తల్లి వ్యాఖ్యానించింది.

పావని చెవిని పడుతూనే ఉన్నాయి అన్నీ. అయినా ఆమె పట్టించుకోవడం లేదు, సాగిపోతూంది. ఆడదాన్ని అనాదిగా అణచిపెట్టడం జరుగుతూంది. ఆమెను ఆటవస్తువుగా వాడుకోవడం జరుగుతూంది. మగవారికి అవసరం కాబట్టి ఆడదానికి ప్రాణం ఉందని గుర్తించారు. కాకుంటే ఆమెనూ ఒక విలాస వస్తువుగా పరిగణించేవారు. ఇప్పుడిప్పుడే స్త్రీ కాస్త స్వేచ్ఛ సంపాదించుకుంటూంది, చదువుకుంటూంది, ఉద్యోగాలు చేస్తూంది. ఇందుకు ఆడవాళ్ళు సంతోషించాలి. తనతోటిది ముందడుగు వేస్తూంటే అభినందించాలి. అలా జరగడం లేదు. తన జాతివాళ్ళే తనను ఎత్తి పొడుస్తున్నారు, ముక్కు మీద వేలు వేసుకుంటున్నారు. బానిసజాతి అభివృద్ధిని కోరుకోలేదా? బానిసత్వంలోనే మురిసిపోతుందా? మురికిలోనే వారికి ఆనందం ఉందా?

పావని ఆలోచనలు పలురకాలుగా పయనిస్తుండగా ఆమె సాగిపోతూంది. ఆలోచనలు తెగడంలేదు. దారి తెగింది. ఆమె బ్రహ్మయ్య ఇంటికి చేరుకుంది. కాస్త ఆగింది. అటూ ఇటూ చూచింది. ఇంకా తనను అంతా వింతగానే చూస్తున్నారు. బ్రహ్మయ్య ఇల్లు అదే అని ధ్రువపర్చుకుంది. ఇంట్లో ప్రవేశించింది.

బ్రహ్మయ్య బాడిశతో ఏదో చెక్కుతున్నాడు. అతడు పావనిని చూసి, "రాండి, లోపలికి రాండి. అట్ల మంచం మీద కూర్చొండి" అని, పని వదిలివచ్చి మంచం పక్కన కింద కూలబడ్డాడు.

"బాగున్నారా బ్రహ్మయ్య మామా?"

"ఏం బాగమ్మా! ఇట్లున్నం. కలికాలం వచ్చిందమ్మా! బొక్కలిరుచుకున్నా కూటికి ఎల్తలే. ఎంత పనిచేసినా దొర వడ్డీకే చాల్తాంది. మీ అత్త బీమారయి మంచం పట్టింది. చేసెటోండ్లు లేరు. తల్లిగారింటికి పోయింది, ఎప్పుడు గుటుక్కుమంటదో ఎరకలే."

స్కూలు ప్రారంభించడంలో తనకు సహకరించవలసిందని బ్రహ్మయ్యను అడగడానికి వచ్చింది. అతని మాటలు వింటూంటే ఆమె తల తిరిగిపోతూంది. పట్నంతో పోల్చుకుంటె పల్లెలు నరకంగా కనిపిస్తున్నాయి. పట్నం స్వర్గంగా కనిపిస్తూంది. తన ఊళ్ళో కాస్త వెలుగు ప్రసరింపచేయాలనే సంకల్పంతో వచ్చింది. ఇక్కడి జనం చీకట్లో ఉండడమే సుఖంగా భావిస్తున్నారు. బ్రహ్మయ్య ఇబ్బందులను విన్నప్పుడు ఆకలిగొన్న వారికి అన్నం కంటే చదువు గొప్పది కాదని తేల్చుకుంది. అయినా తాను చదువు చెప్పడానికి వచ్చింది. అన్నం పెట్టే నాథుడు లేడు.

"అట్లెందుకంటరు? అత్తకి బాగవుతుంది, వస్తుంది. కటికచీకటి కలకాలం ఉండదు మామా!"

"పిచ్చిదానివమ్మా, నీకెరుకలే. మందు లేకుంటే రోగం తగ్గుతదా? తిండిలేనోండ్లకు మందులెట్ల వస్తయమ్మా? ఇగో చూడమ్మా, ఒక్కొక్కపాలి చావు మంచిదనిపిస్తది. మీ అత్త జల్ది చావాల్నని దేవునికి మొక్కుతున్న- ఇన్నవా?" బ్రహ్మయ్య కళ్ళు చెమ్మగిల్లాయి. గొంతులో దుఃఖపు జీరలు కనిపించాయి.

దారిద్ర్యం, ఆకలి, అశక్తత దిగంబరంగా కనిపించాయి పావనికి. ఎంత దుఃఖంలోనూ జీవించాలనుకుంటాడు మనిషి. ప్రాణం కంటే ప్రియతమ మయింది మానవునికి మరొకటి లేదు. చావు కోరుకుంటున్నాడంటే అతని దుఃఖాన్ని కొలవడం కష్టం. బాధలను అంచనా వేయడం తరంకాదు.

ఏం చెప్పాలో, ఎలా ఓదార్చాలో అర్థం కాలేదు పావనికి. తాను చాలా చదువుకుంది, లోకజ్ఞానం ఆర్జించింది. ఈ దరిద్రానికి మందేమిటి? ఈ బాధలకు నిష్కృతి ఎక్కడ? ఈ ప్రశ్నలకు జవాబు తాను చదివిన చదువులో కనిపించలేదు. విద్య తనకు అవాస్తవికతను బోధించింది. వాస్తవాలు తనముందు వికటాట్టహాసం చేస్తున్నాయి. ఏం చేయాలి? బ్రహ్మయ్యను ఎలా అడగాలి?

"అమ్మా పావనమ్మా, కోరి చిచ్చులో దునకకమ్మా! శివయ్య సంగతి నీకు ఎరుకలే. పచ్చినెత్తురు కుండలతో తాగుతడు. నెత్తుటి మరక పెదవిమీద కనపడనియ్యడు. అసలు పంతులు బదిలీ అయితె ఎట్ల ఊరుకున్నడో ఊరందరికి వింతగున్నది. నువ్వు ఈ ఊరికి ఎందుకొచ్చినవు? కొరివితో తలెందుకు గోక్కుంటున్నవు? పెండ్లి చేసుకో, కాపురానికిపో, సుఖపడు."

"మామా! మీరట్లంటే ఎట్ల? నేనీ ఊరికి చదువు చెప్పటానికి వచ్చా. అందుకు నాకు గవర్నమెంటు జీతం ఇస్తూంది. ఈ ఊళ్ళో చదువు చెప్పాలని ఉన్నది. కారుచీకట్లో కాంతిరేఖలు చూపాలని ఉన్నది. మామా! నాకు సాయం చేయలేవా? వెలుగు తేవడానికి ఉపకరించలేవా?" పావని ఆవేశంగా మాట్లాడింది. ఆమె ధ్వనిలో దృఢ సంకల్పం, దీక్ష కనిపించాయి.

"పావనమ్మా! అనుకునేటప్పుడు అన్ని బాగుంటాయి. తీరా చెయ్యబోతే తిప్పలొస్తది. నువ్వు అనుకునేది శానా బాగున్నది. కానీ నీ దారిలో ముండ్లకంచెలున్నాయి, మండే మంటలున్నాయి, ఎందుకమ్మా నీకీ బాధలు! మానుకో, నీకు మంచిది. మీ నాయన నీకివన్నీ ఎందుకు చెప్పతలేడు?"

"మామా! అందరూ సుఖపడాలనుకుంటే ఈ దేశం ఎలా బాగుపడాలి? ఈ సమాజం ఎన్నడు కళ్ళు తెరవాలి? ఈ అజ్ఞానపు చీకటి ఎలా దూరం కావాలి? మామా, కోరి నేనీ బాటను వరించాను. మీ సహకారం ఉంటే గెలుస్తాననే నమ్మకం ఉంది. నాకు సాయం చేయరా?"

పావని మాటలకు బ్రహ్మయ్య గుండె కరిగింది, ద్రవించింది, నీరయింది, కళ్ళలో కనిపించింది. బ్రహ్మయ్య తమకోసం సాయం అడిగిన వాళ్ళను చూచాడు. తాము బాగుపడడానికి మందిని ముంచిన వాళ్ళను చూచాడు. కాని ఊరికోసం, సమాజం కోసం తపించే పావనిలాంటి వాళ్ళను చూడలేదు. పరులకోసం, ప్రజల కోసం సాయం అర్థించే పావని అతనికి దేవతలా కనిపించింది.

"అమ్మా! పావనీ నువ్వు మనిషివి కావమ్మా దేవతవు. మా గురించి బాధ పడే తల్లివమ్మా నీవు, మంచి తనానికి మూర్తివమ్మా నీవు. ఇంత కాలానికి ఒకానొక తల్లి మమ్ములను గురించి ఆలోచిస్తున్నది. చాలుతల్లీ, ఇది చాలు మాకు, నిన్ను రక్షించుకుంటామమ్మా! నువ్వేం చెయ్యమంటవో చెప్పు చేస్తం."

"మామా! చాలు, ఎక్కువ అభిమానం చూపవద్దు. నేను దేవతను కాను. ఒట్టి మనిషిని. తోటివారి బాగుకోరడం మనిషి లక్షణం, తోటివారి బాగుకోసం ప్రయత్నించడం మనిషి గుణం. ఈ రెండూ లేనివాడు మనిషి కాడు. మీకు ఇంతకాలంగా మనుషులు కనిపించలేదు. ఒకవేపు రాక్షసులు, ఒక వేపు పశువులు కనిపించారు. అందరినీ మనుషులను చేయడమే మన పని మామా! ఎవరినీ దేవుళ్ళను చేయకు. వాళ్ళు నెత్తి నెక్కి కూర్చుంటారు. కానుకలు కావాలని కినుకలు వహిస్తారు."

"అమ్మా! పావనమ్మా! నీ మాటలు వింటుంటే అమృతం చిలికినట్లున్నదమ్మా! నువ్వు బండరాళ్ళలో గుండెలు పుట్టించగలవు. నువ్వు చెప్పింది నిజం. మేము గొడ్లం. గొడ్లకన్నా హీనం. మేము మనుషులం కాము. పురుగుల కన్న హీనంగ బతుకుతున్నం, మమ్ములను మనుషులుగా చేయటానికి అవతరించినవమ్మా! నిన్ను ఎట్ల పొగడాలె, ఎట్ల కాపాడుకోవలె అది మేం చూచుకుంటం. ఏం చెయ్యమంటవో చెప్పు, అది చేస్తం."

"చాలు బ్రహ్మయ్య మామా, చాలు. ఇప్పుడు నేను ఏకాకిని కాను. నాకు నీ సాయం ఉంది. మనిషికి మనిషి సాయం మహాపర్వతాలను కదిలిస్తుంది. మనం చేయాల్సిందేమీ లేదు. ఈ ఊళ్ళో స్కూలు ప్రారంభించటం. అదీ సర్కారు బడి. చదువు చెప్పమని గవర్నమెంటు నన్నిక్కడికి పంపించింది. నలుగురు పిల్లలను కూర్చు. చదువు చెప్పుత, చెట్టు కిందయినా సరే. అంతే నువ్వు చేయాల్సింది. ఆ పైన ఏం జరుగుతుందో చూతాం."

"అట్లనే నమ్మా! ఆ పని చేస్త. అది అంత చులకన అనుకోకు. శివయ్య బడి నడవనిస్తడా అని. అయినా చూస్త. అందరినీ అడుగుత, బడి మొదలు పెట్టిస్త. నీ అడుగు జాడన నడుస్తం. పోతదా పానమే – అది ఒక్క పాలే గద పోయేడిది."

"చాలు మామా! ఆ ధైర్యంతో ముందుకు సాగుదాం. వస్తామరి."

పావని బయల్దేరింది. ఆమెకు గాలిలో తేలిపోతున్నట్లుంది. తాను ఒక మనిషి సాయం సాధించ గలిగింది. చాలు. తన మార్గం సుగమం అయింది. తాను ఎడారిలో అడుగు పెట్టాననుకుంది. ఒక చెలిమి దొరికింది. ఇహ ఈ ఊరు ఎడారిగా ఉండదు. కేదారంగా మారుతుందా? చూడాలి.

"బమ్మయ్యింటికి పోయినట్లున్నరు?" ఆ మాటలు విని ఈ లోకంలోకి వచ్చింది పావని. చూస్తే నర్సిమ్మ బల్లెం పట్టుకుని కనిపించాడు.

"బమ్మయ్య పెండ్లాం కూడ లేదు. వయసులో ఉన్న ఆడపిల్లవు. అట్ల పోవటం మంచిది కాదు. ఊళ్ళో వాండ్లు ఏమనుకుంటరు? మీ నాయనగారితోని చెప్పనా?" అని వెకిలిగా నవ్వాడు.

పావనికి వళ్ళు మండింది. పరమ అసహ్యంగా చూచింది వాణ్ణి. పురుగును చూచినట్లు చూచింది కనీసం వాడితో మాట్లాడలేదు. చరచరా సాగిపోయింది.

కేదారం అవుతుందనుకున్న ఊరు వడగాలిలా అనిపించింది. తుఫాను హోరులా వినిపించింది.

ఇది రానున్న తుఫాను సంకేతమా? ఆమె కేమీ అర్థంకాలేదు. భుజాన సంచీ, చేతిలో పుస్తకాలతో చరచరా సాగి పోతూంది.

జగన్నాథం దుకాణం ముందుకు వచ్చేసింది.

ఒక చిన్నపిల్ల చింపిరి తలతో–చీమిడి ముక్కుతో, చిరిగిన చొక్కాలో పప్పు పట్టుకొని పరిగెత్తుతూ బోర్ల పడింది. పడడం పడడం నొసటికి రాయి తగిలింది. రక్తం వస్తూంది. ఆ అమ్మాయి లేచి కూర్చుంది. పప్పు సాంతం నేలపాలయింది. దెబ్బ తాకినందుకు కాదు – పప్పు నేల పాలయినందుకు ఎక్కెక్కి ఏడుస్తూంది.

పావని చూచింది. పరిగెత్తి వచ్చింది. ఆ పాపను లేవనెత్తింది. "అబ్బో! ఎంత దెబ్బ తగిలిందమ్మా!" అని పయ్యెదతో రక్తం తుడిచింది.

"పప్పు పోయింది – మా అమ్మ కొడ్తది."

"దెబ్బ తగిలిందిగద – నొప్పి లేదా?"

"ఈ నొప్పి గింతంతది – మా అమ్మ ఇంకా కొడ్తది – పప్పు పోయింది" అని ఏడుపు సాగించిందాపిల్ల.

జగన్నాథం గుమ్మంలో నుంచొని చూస్తున్నాడు.

"ఆగు. నేను ఎత్తిపెడ్తా" అని పావని నేల పాలయిన పప్పు సాంతం ఎత్తి చొక్కాలో పోసింది. అంగికి చిల్లి ఉంది. పప్పు కారిపోతుంది. ఏం చేయాలో అర్థం కాలేదు. సంచీ వెదికింది. కర్చీఫ్ కనిపించింది. పప్పు కర్చీఫ్‌లో మూట కట్టి అందించింది.

ఆ పాప ఆనందానికి అంతు లేదు. పోయిన పప్పు దొరికింది. కొత్త గుడ్డ కూడా దొరికింది. కృతజ్ఞత ఎలా చెప్పుకోవాలో తెలియదు. దానికి పదాలు రావు. దానికి కళ్ళల్లో కృతజ్ఞత వలకబోస్తూ చూసింది.

"నువ్వు శాన మంచి దానివి."

"అట్లనా?" అని దగ్గరికి తీసుకుంది పావని. సంచీలో చాకలెట్లున్నాయి. ఒక చాకలెట్టు తీసి చేతికిచ్చింది. "నీ పేరేంది?"

"ముత్యాలు." చాకలెట్టు అందుకుందేగాని ఏం చేయాలో తెలియలేదు ముత్యాలుకు. పావని చాకలెట్టు అందుకుంది. మీది కాగితం తీసేసింది. చాకలెట్టు ముత్యాలు నోట్లో పెట్టింది. "ఎట్లున్నది?"

"శాన బాగున్నది. మా అమ్మ కొడ్తది పోత." కింద పడిన చాకలెట్ కాగితం అందుకుని ఉరికింది. పావని చూస్తే– ముత్యాలు పరుగులో కూడా ఆనందం గోచరించింది. ఒక్క చాకలెట్టు దొరికితే రాజ్యం దొరికినంత సంతోషించింది– ఎంత అమాయకురాలు! అనుకుంది.

"మాల ముండను ముట్టుకుంటావు! శాస్త్రిగారి మర్యాద మంట గలిపెటట్టున్నవు."

పావని అటు తిరిగి చూచింది – జగన్నాథం! పావని సంతోషం ఆరిపోయింది. పావనికి కోపం పొంగింది.

"జగన్నాథంగారూ! వాళ్ళ డబ్బుకు మైల లేదు, వాళ్ళు తెచ్చే గింజకు

అంటరానితనం అంటదు. వాళ్ళు చేసే చాకిరీకి అస్పృశ్యత లేదు. వాళ్ళను మాత్రం అంటరాదు – అంతేనా?"

జగన్నాథం బిత్తరపోయాడు. అలాంటి జవాబు వస్తుందని అతను ఊహించలేదు. నోరు వెళ్ళబెట్టి చూస్తూ వుంచున్నాడు నోట మాట రాలేదు. పావని సాగిపోయింది.

ఇంటి ముందు శాస్త్రిగారు జంధ్యం సరిచేసుకుంటూ నుంచున్నారు. పావని దూరం నుంచే చూచింది. వారి వాలకం చూస్తే వడగాలి ఇక్కడిదాకా వచ్చినట్లు అనిపించింది.

పావని గుమ్మంలో అడుగు పెట్టింది. తల వంచుకుని గబగబా ఇంట్లో దూరింది. శాస్త్రిగారు ఆమె వెంటనే ఇంట్లోకి ప్రవేశించారు.

"బ్రహ్మయ్య ఇంటికి పోయినవా?" ధ్వనిలోనే కోపం కనిపిస్తూంది.

"అవున్నాన్నా! వెళ్ళాను. స్కూలు పెట్టాలిగా– సహకరించమని అడగడానికి వెళ్ళాను–వెళ్ళిన మాట నిజం– దానికింత రాద్ధాంతం ఎందుకు?"

"పెళ్ళి కావలసిన పిల్లవు..."

"నాన్నా! నా మీద నమ్మకం లేదా? నేను ఇక్కడికి ఒక ఉద్యోగం మీద వచ్చాను. నేను నీకు కూతుర్ని మాత్రమే కాదు నాన్నా – ఈ ఊరికి టీచర్ను, నా హద్దులు నాకు తెలియవంటావా? నువ్వూ నన్ను అనుమానిస్తావా?" తరువాత మాట రాలేదు. కళ్ళు చెమ్మగిల్లాయి. కను కొలకుల్లో నీరు నిలిచింది. ఎంత నిగ్రహించుకుందామనుకున్నా నిలవలేదు. ఒక కన్నీటి చుక్క బుగ్గమీద రాలింది. ఆ తరువాత జలజలా రాలాయి.

శాస్త్రిగారు కరిగిపోయారు.

"అమ్మా, ఏడవకు. మీ అమ్మ సరిగ్గా నన్ను ఇలాగే ఓడించేది." శాస్త్రిగారు పావనిని దగ్గరికి తీసుకున్నారు. పైపంచెతో కన్నీరు తుడిచారు. "అది కాదు తల్లీ, ఇది పల్లె. ఇక్కడ గోరంతలను కొండంతలు చేస్తారు. నాకు తెలుసు నువ్వు నిప్పులాంటి దానివి. అయినా జాగ్రత్తగా ఉండాలమ్మా!" పావనిని హెచ్చరించారు.

"నాన్నా, నువ్వెంత మంచివాడివి." పావని తండ్రి ముఖంలోకి చూచింది. శాస్త్రిగారి కళ్ళలో నీరు నిలిచింది. అది దుముకడం లేదు. వారికి గతించిన భార్య గుర్తుకు వచ్చింది. పట్టుదలకు ఆమె పెట్టింది పేరు. సరిగ్గా తల్లి లక్షణమే పుణికి పుచ్చుకుంది పావని.

"నాన్నా! నువ్వు ఏడుస్తావా? తప్పు కదూ?" అని పైట చెంగుతో తండ్రి కళ్ళు తుడిచింది పావని.

ఓదార్చే వారుంటే దుఃఖం పొంగుతుంది. శాస్త్రిగారి గుండె చెరువయింది. కూతురు ముందు కనిపించ నీయరాదు. పై పంచెతో దొడ్డి గుమ్మంవైపు నడిచారు స్నానానికి వెళ్తున్నట్లు.

పావని గ్రహించింది. పలకలేదు ఆమె. తుఫాను చెలరేగుతుందనుకుంది. తండ్రికి తన విషయంలో ఉన్న వాత్సల్యం తండ్రిని ఓడించింది. తనకు ఈ రోజు రెండు గెలుపులు. బ్రహ్మయ్య సాయం చేస్తానన్నాడు, తండ్రి తనను వారించలేదు.

ముత్యాలు కళ్ళు కనిపించాయి. కృతజ్ఞత తొణికిసలాడే చూపులు కనిపించాయి. ఆమెలోని ఆనందం కనిపించింది. ఉత్సాహం కనిపించింది.

పసివాళ్ళు ఎంత అమాయకులు! చాకలెట్టు దొరికితే రాజ్యం దొరికినంత సంతోషిస్తారు. పెద్దవాళ్ళు ఎంత మూర్ఖులు? రాజ్యం దొరికినా చాకలెట్టు దొరికినంత సంతోషించలేరు!

రాత్రి అయింది. పావని పడుకుంది. నిద్రపోలేదు. "మాలపల్లి" చదువుతూంది. శాస్త్రిగారు గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. తలుపు తట్టిన చప్పుడు అయింది. పావని పుస్తకంలో మునిగి ఉంది. వినలేదు. మళ్ళీ చప్పుడు అయింది. ఆలాపన అనుకుంది. మరోసారి చప్పుడు అయింది. పుస్తకం పక్కన పెట్టింది. లేచి కూర్చుంది. ఎవరు? ఎందుకొచ్చారు? ఈ రాత్రి వేళ రావలసిన పనేమిటి? ఏం చేయాలి? తండ్రిని చూచింది. గాఢ నిద్రలో ఉన్నారు. లేపాలా? వద్దా? ఎవరయి ఉంటారు? ఎందుకు వచ్చి వుంటారు? కాస్త భయం తొంగి చూచింది. ముందు భయాన్ని తొలగించాలి, తరవాత దేన్నయినా జయించవచ్చు అనుకుంది. లాంతరు పట్టుకుని బయలుదేరింది. గుమ్మందాకా వచ్చింది. గుమ్మం పక్కనే కిటికీ ఉంది. కిటికీ తెరిచింది. చూచింది.

"ఎవరు?"

"నేనే అమ్మగారూ!" కిటికీ దగ్గరికి వచ్చి అన్నది మల్లమ్మ.

"మల్లమ్మా! ఇంత రాత్రి వచ్చావు?" అని తలుపు తీసింది.

"పగటిపూట దొర రానియ్యడు. దొరసాని కదలనియ్యదు, మీరు ఊళ్ళకు వచ్చిన కాణ్ణించి వస్తమనుకుంటున్న. పడ్తలేదు."

"ఏమిటి? ఏం కావాలి నీకు?"

"అమ్మగారూ! పట్నంనించి వచ్చిన్రుకద, మా ఆయన కనబడ్డాడా! రిచ్చ తొక్కుతున్నడని చెప్పిన్రు. కనబడితె నన్నడిగిండా? ఎప్పుడు వస్తనన్నడు? ఏమన్న చెప్పిండా? ఆయన వస్తడు వస్తడనే బతుకుతున్న. లేకుంటే ఉరిపోసుక చచ్చెడిదాన్ని, వస్తడండి, ఉండడు. నన్నిడిచి ఉంటడనుకున్నా–ఉండడు. అప్పు తీరుస్తనని పోయిండు. దొర అప్పు తీరుస్తడు. నన్ను కొంచపోతడు. మీకెరకలే మా ఆయన సంగతి. వస్తడు. తప్పక వస్తడు. వస్తడులేగని మీకేమన్న కళ్ళపడ్డడా? ఎప్పుడొచ్చెడిది చెప్పిండా?"

మల్లమ్మ వసారా అరుగు కింద నిలబడింది. వెన్నెల పుచ్చపూవులా ఉంది. రాత్రి నిశ్శబ్దంగా ఉంది. దూరంగా ఎక్కడో కీచురాళ్ళ రొద వినిపిస్తోంది.

పావని అరుగుమీద ఉంది. చీకట్లో ఉంది.

మల్లమ్మ అరుగుకింద ఉంది. వెన్నెట్లో ఉంది.

మల్లమ్మ స్పష్టంగా కనిపిస్తోంది. నల్లని గుండ్రని ముఖంలో ఆవేదన, ఆతురత, ఆశ కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. పరమయ్య మల్లమ్మను పెళ్ళాడాడు. శివయ్య పెట్టిన బాధలు తట్టుకోలేక పోయాడు. పారిపోయాడు. పరమయ్య పెళ్ళాం అయినందుకు శివయ్య మల్లమ్మ మెడకు బానిస పాశం తగిలించాడు. అయినా మల్లమ్మ పరమయ్యను వదులుకోలేదు. ఆమెలో ఉన్న ప్రేమ బంధం విడిపోలేదు. పరమయ్య వస్తాడనే ఆశతో జీవిస్తోంది. తను సీత, సావిత్రి, అనసూయ, సుమతి కథలు కల్లబొల్లి కబుర్లనుకుంది. తన కళ్ళ ముందే ఒక సీత, ఒక సావిత్రి కనిపిస్తోంది. ప్రేమబంధం ఎంత ఉన్నతమయింది? ఎంత విశిష్టమయింది? ఎంత విచిత్రమయింది? ఎంత పవిత్రం అయింది? అది ఎంతటి త్యాగానికి పురికొల్పుతుంది? అనుకుంది.

"మల్లమ్మా! నువ్వు చాలా గొప్పదానివి. పట్నంలో ఉన్న పరమయ్య మీద ఆశ నిలుపుకొని జీవిస్తున్నావు. పరమయ్య కూడా పట్నంలో అలాగే ఉన్నాడు. నాకు కనిపించాడు. నిన్ను జ్ఞాపకం చేశాడు. వస్తానన్నాడు. నిన్ను విడిపిస్తానన్నాడు. నేను మళ్ళీ వెళ్ళినపుడు చెప్తుతా, తీసుకువస్తా."

"అమ్మా పావనమ్మా! పుణ్యం కట్టుకో. నీ కోసమే బతుకుతున్నదని చెప్పు. ఎట్లనన్న తీస్కరా! నీ కాళ్ళు పట్టుకుంట."

మల్లమ్మ పావని కాళ్ళు పట్టుకుంది. పావని గుండె చెమ్మగిలింది. "వస్తడు మల్లమ్మా పరమయ్యను నేను తీసుకొస్త, నిన్ను విడిపిస్త."

"అమ్మా పావనమ్మా! నువ్వు మనిషివేనా? మా కోసం దిగివచ్చిన దేవతవా?"

"ఎందు కట్లంటవ్?"

"ఈ ఊళ్ళ మమ్ముల మనుషులోలె ఎవడు చూచిండండి? మనసునిండ మాట మాట్లాడినోడెవడండి? అంటరానోండ్ల మనిరి, ఆమడ దూరం ఉంచిరి, నువ్వు మనసునిండ మాటమాట్లాడినవమ్మా. చాలు చాలునమ్మా!"

పావని పరిస్థితి అయోమయంగా ఉంది. మల్లమ్మ మాటలు ఆమె చెమ్మగిల్లిన గుండెను చెరువుచేశాయి. గొంతు పూడుకు పోయింది. మాట రాలేదు. మాట మాట్లాడినందుకు తనను మహిమాన్వితురాలనుకుంటున్నారు. ఎంత అమాయకులు పాపం!

"అమ్మా! నువ్వు బడిపెడ్తవట. మా పోరలకు చదువు చెప్తవట. చెప్పుతల్లీ! మా పోరలన్న బాగుపడ్తరు. ఇగ చూడు, ఒకమాట" అని చెవిలో చెప్పినంత మెల్లగా చెప్పింది: "దొరకు మీ నాయనంటె బయం. దొర్సానికి మంత్రాలంటె బుగులు. అందుకే నిన్నేమంటలేదు. అనరు. నేను ఇంకంత బయపెడ్త. దొర నీ జోలికి రాకుండ చూస్త. నువ్వు బడిపెట్టు, ఇన్నవా? పోరలకు చదువు చెప్పు. నర్సిగాడొస్తడు. వాడు మంచోడు కాడు. శానసేపు నిలబడటం మంచిదికాదు, పోతన్న."

పావని జవాబు కోసం కూడా చూడలేదు మల్లమ్మ. వెళ్ళిపోతూంది వెన్నెట్లో. వెలుగులో పావని చూస్తూ నుంచుంది. మంచితనం నడిచిపోతున్నట్లనిపించింది. మానవత మల్లమ్మ రూపంలో సాగిపోతున్నట్లనిపించింది. మంచిదనం, మానవత, ప్రేమ మనిషిలోంచి మాయం కావనుకుంది. బానిస బంధాల్లో ఉన్నా, చెరసాలల్లో మగ్గుతున్నా, నరకంలో నుగ్గవుతున్నా మనిషిలోని మానవతను మాయం చేయడం అసాధ్యం అనుకుంది.

ఈ ఊళ్ళో ప్రతి మనిషీ ఒక పుస్తకంలా కనిపించా డామెకు. ప్రతి వ్యక్తీ ఒక నవలలా కనిపించాడు. ఒక్కొక్కరికీ ఒక చరిత్ర ఉంది. ఒక్కొక్కరిలో వైవిధ్యం ఉంది. అందరిలోనూ అంతరాంతరాలలో వెలిగే వెలుగుంది.

ఉన్న వెలుగును పెంచడం తన పని.

వెలుగు పెరుగుతుందా?

తుఫానుకు అరిపోతుందా?

# 7

వేగుచుక్క పొడిచింది. ఇంకా తెల్లవారలేదు. శివయ్య ఇంట్లో మల్లమ్మ మేల్కొంది. శివయ్యా సుభద్రమ్మా ఇంకా నిద్రలోనే ఉన్నారు. మల్లమ్మ పొరకతో వాకిట్లోకి వెళ్ళింది. ఏదో చూచి దడుచుకున్నట్లు పొరక అక్కడ పారేసింది. గబగబ వెళ్ళి తలుపులు బాదసాగింది.

"దొరా! ఎవరో ఏమో పెట్టిన్రు, తలుపు తియ్యండి.

దొరా! తలుపుతీయి.

దొరసానీ తలుపుతీయి."

మల్లమ్మ తలుపులు బాదుతూంది. అరుస్తూంది, అడావుడి చేస్తూంది. మల్లమ్మ అరుపులు, కేకలు శివయ్యదాకా అందడానికి చాలసేపు పట్టింది. వారు శయనించిన గదికి ఇవతల చాలా ద్వారాలున్నాయి. అవన్నీ బంధించిగాని పడుకోడు శివయ్య.

శివయ్యా, సుభద్రమ్మా ఆ కేకలు విన్నారు. దొంగలు పడ్డారేమో అనుకున్నారు, భయంగా లేచారు. ఒక్కొక్క తలుపూ హడావుడిగా తీస్తూ సాగారు. తలుపులన్నీ భద్రంగా ఉన్నాయి. అతలాకుతలంఅయిన వారి మనస్సు కొంత కుదుటపడింది. మల్లమ్మ కేకలకు కారణం తెలియలేదు.

శివయ్య వాకిట తలుపు తీశాడు.

మల్లమ్మ వణికిపోతూ కనిపించింది.

"ఏందే దొంగముండ! అట్ల అరుస్తున్నవు. కొంపమునిగిందా? ఎవడన్న చచ్చిండా?" శివయ్య గట్టిగా అరిచినట్లు అడిగాడు.

"శివమెక్కినట్లు అరుస్తవేమె లంజముండ! ఏమైంది?" సుభద్రమ్మ సాయించింది.

"దొరా! ఇంటిముందరఏమో పెట్టిన్రు. నాకు బుగులుగున్నది. రండి చూపిస్త" అని దారితీసింది మల్లమ్మ.

శివయ్య గుండెలో బుగులు బయలుదేరింది. సుభద్రమ్మ గడగడలాడింది. వారు మల్లమ్మను అనుసరించారు.

"ఇగో చూడండి." మల్లమ్మ చూపింది. మౌనంగా నుంచుంది.

సరిగ్గా గుమ్మం ముందు వాకిట్లో నాలుగు నిమ్మకాయలు, ఎర్రని అన్నం కుప్ప పోసివుంది. దాని చుట్టూ నల్లని దారాలు పడి ఉన్నాయి.

శివయ్య అవాక్కయిపోయాడు.

సుభద్రమ్మ వళ్ళు తిరిగిపోయేంత పని అయి నిలదొక్కుకుంది.

శివయ్య పిచ్చివానిలా చుట్టూ చూచాడు. మల్లమ్మ పారేసిన పొరక తప్ప ఏమీ కనిపించలేదు.

అకాశం ఎర్రవారింది. ఈ రక్తపు కూడు ఆకాశంలో వ్యాపించినట్లు అనిపించింది.

"ఎవరో సేతబడి చేసిన్రు. ఈ ఇంటి కేదో మూడింది. నాకు కళ్ళు తిరుగుతున్నయి. నేను నిలబడలేను" అన్నది సుభద్రమ్మ. నిజంగానే పడిపోయేట్లుంది.

"చూస్తవేమె దొంగముండా! పట్టుకో" అన్నాడు శివయ్య మల్లమ్మతో. తాను ఉన్నచోట నుంచి కదల్లేదు.

మల్లమ్మ సుభద్రమ్మను పట్టుకుంది. మెల్లగా మెట్లెక్కించి లోనికి తీసికెళ్ళింది. సుభద్రమ్మ మంచి నీళ్ళడిగింది. మల్లమ్మ ఇచ్చింది. ఆమె అక్కడే నుంచుంది.

"ఈడ నిలబడ్డవేమే లంజముండా! ఆడికిపో, అయనొక్కడున్నడు. ఈ కొంపకేమో వచ్చిందమ్మో!" అని సన్నగా ఏడుపులంకించుకుంది సుభద్రమ్మ.

మల్లమ్మ వాకిట్లోకి వచ్చింది. పక్కగా నుంచుంది. శివయ్యను పరికిస్తూంది. ఊరిని గడగడ లాడించిన శివయ్య తాను గడగడలాడుతున్నాడు. మల్లమ్మ మౌనంగా నుంచుంది. ఆమెకు అంతరాంతరాల్లో ఎక్కడో సంతోషంగా ఉంది. శివయ్య వణుకుతున్నాడు. శివయ్య గడగడలాడుతున్నాడు.

శివయ్య స్థాణువులా నుంచొని ఉన్నాడు. అతను ఏమి ఆలోచిస్తున్నాడో చెప్పడం కష్టం. కాని, అతని అధికారానికీ, ప్రభుత్వానికీ గండిపడింది. పంతులు బదిలీ కావడంతో గండిపడింది. ఇప్పుడు తాను వణకిపోతున్నాడు. తన ఇంటిముందు ఏదో శవం ఉన్నట్లు అనిపిస్తుంది. వాకిట్లో ఊడుపులేదు, కళ్ళాపిలేదు. కళకళలాడే వాకిలి కళావిహీనంగా ఉంది. శ్మశానంలా ఉంది. తన ఇల్లు శ్మశానం అయినట్లూ, తన ఇంటిముందు తన శవమే ఉన్నట్లూ అనిపించింది. బలహీనతలు చాల చెడ్డవి. అవి మనిషిని కూల్చివేస్తాయి. మంత్రాల సంగతి తెలియదుగాని మనసు క్రుంగి మనిషి కూలిపోతాడు.

పెంటయ్య పాటకి తెరుచుకుని లోన ప్రవేశించాడు. అతడు పశువులను తోలుకు పోవడానికి వచ్చాడు. ఎదుట నిమ్మకాయలు, నెత్తుటి అన్నం, నల్ల దారాలు చూచాడు. ఉలికిపడి 'వామ్మో' అని అరచాడు. ఉరికి పోవడానికి ప్రయత్నించాడు.

పెంటయ్య కేకతో ఈ లోకంలోకి వచ్చాడు శివయ్య. ఉరికిపోతున్న పెంటయ్యను చూచాడు. "అరే! నిలబడు ఇట్లా!" అరచాడు.

పెంటయ్య శివయ్యను చూచాడు. అతని అరుపు విన్నాడు.

"దొరా! నాకు బుగులైతాంది. నేనుండను, బతకనీండ్రి" అని పరుగు లంకించుకున్నాడు.

శివయ్య అతని వెంటపడి పరిగెత్తలేదు. కనీసం అడుగు ముందుకు వేయలేదు. పక్కకు చూస్తే మల్లమ్మ కనిపించింది.

"దొంగముండా! నంగనాచోలె చూస్తవేమె! ఊడువు. అయ్యితీసెయ్యి. తీసెయ్యవే ముండా, నిలబడ్డవేమే ఇంకా! ఊఁ కానియ్యి, ఊడువు."

"దొరా! అయ్యినేంతాకను. నీ కాళ్ళు మొక్కుతా. వాటిని నేను అంటను నీబాంచనయిత. నన్ను ఊడువ మనకు. నీకు గులాం నైత. నన్ను కొట్టకు." మల్లమ్మ దీనంగా ప్రార్థిస్తూంది.

శివయ్య మల్లమ్మను చూచాడు. అతనికి జాలి కలుగలేదు. మల్లమ్మతో ఆ పదార్థాలను తొలగింపచేసే తన శక్తిని గురించి ఆలోచించాడు. అతనికి పోచయ్య కనిపించాడు. పోచయ్యను తాను చావబాదాడు. పోచయ్య పల్లెత్తు ఎదురుమాట అనలేదు. ప్రాణాలు విడిచాడు. మనిషిలో ఏదో అపారం అయిన శక్తి ఉంది. మనిషి ప్రాణాలయినా వదులుకుంటాడు. తాను చేయదలచని పని చేయడు. చంపినవాడు జయించాననుకుంటాడు. వాస్తవంగా ఓడేది అతనే, జయించేది చనిపోయిన వాడే! తాను ఒకసారి ఓడేడు. మళ్ళీ అదే అవలంబించలేదు. అర్థంకాక అటూ ఇటూ

తిరగసాగాడు. మల్లమ్మ అలాగే నుంచొని ఉంది. కదల్లేదు. పశువుల కొట్టంలో దూడలు, పశువులు "అంబా" అంటే "అంబా" అని అరుస్తున్నాయి. బిడ్డలను చేర్చుకోవాలనే తల్లుల ఆవేదనా, తల్లులను చేరాలనే దూడల ఆరాటం వాటి అంబారావాల్లో వ్యక్తం అవుతూంది. లోన సుభద్రమ్మ మూలుగుతూంది. ఆమెకు అనుమాన పిశాచం పట్టింది.

నర్సిమ్మ వాకిట్లో ప్రవేశించాడు. అప్పటికి ఆ వార్త అంతటా పాకింది. నర్సిమ్మను చూచి శివయ్యకు ప్రాణం లేచివచ్చింది. "నర్సిమ్మా! చూడు ఇయన్నీ ఎవడో పెట్టిపోయిండు. తీసి పారెయ్యి అవతల." శివయ్య మాటలు ఆజ్ఞలా లేవు. ప్రార్థనలా ఉన్నాయి. శివయ్య ధ్వనిలో నర్సిమ్మ మీద విశ్వాసం కనిపించింది. నర్సిమ్మ తన పెంపుడు కుక్క. తప్పక ఈ పని చేస్తాడనుకున్నాడు.

నర్సిమ్మ ఒకసారి వాకిలిని చూచాడు. అక్కడున్న నిమ్మకాయలను, నెత్తుటి కూటిరాసిని, నల్ల దారాలను చూచాడు. తన క్షేమం తలచుకున్నాడు, తన కుటుంబాన్ని తలచుకున్నాడు. ఒక్క అడుగు సైతం ముందుకు వేయలేదు, తిరిగి చూచాడు, మల్లమ్మ కనిపించింది.

"ముండా! తియ్యి వాటిని, నీకేమన్న పిల్లలున్నరా జల్లలున్నరా? మొండి మొదబారిన ముండ. ఊఁ తియ్యవే." నర్సిమ్మ అడుగు ముందుకు వేశాడు. మల్లమ్మను మెడపట్టి ముందుకు నెట్టి, ఆమెతో ఆ పని చేయించాలని అతని సంకల్పం. తనమీదికి వస్తుందనుకున్న పీడ మల్లమ్మ మీదికి తోలాలనుకున్నాడు.

మల్లమ్మ తనమీదికి వస్తున్న నరసిమ్మను చూచింది. "నర్సిమ్మన్నా! అడనే నిలబడు, అడుగు వేయకు, నేను తియ్యనని చెప్పిన ఇన్నవా?"

నర్సిమ్మ మల్లమ్మను చూచాడు. మల్లమ్మ మాటలు విన్నాడు. ఆమెలోని దృఢ సంకల్పం గమనించాడు.

"తియ్యనంటాంది ముండ – చూసిన్రా దొరా!" ఫిర్యాదు చేశాడు నర్సిమ్మ.

"నర్సిమ్మా! నిన్ను తియ్యమన్నా, మల్లిని కాదు–విన్నవా?" శివయ్యలో వచ్చిన మార్పు ఆశ్చర్యం కలిగించింది నర్సిమ్మకు.

"పిల్లలు గలోన్ని – నేనేం తీస్తనుండి?" దూరంగా నుంచున్నాడు. నర్సిమ్మ.

"హుఁ" నిట్టూర్చాడు శివయ్య. అతనికి ఏమీ తోచలేదు. సుభద్రమ్మ ఇంట్లో మూలుగుతూంది. కొట్టంలో పశువులు అంబారావాలు చేస్తున్నాయి. ఇంటి ముందు ఊడ్పు లేదు, ఇల్లు పీనుగును పెట్టుకున్న కొంపలా ఉంది. తనలో ఏదో నీరసం ప్రవేశించింది. తన అధికారం జారిపోతుంది. తాను ఈ చిన్న పని చేయించలేక పోతున్నాడు. ఊరుసొంతం ఒక్కటి అయినట్లుంది.. అంతా తన మోచేతికింద బతికినవారు. తాను ఆపదలో ఉన్నాడంటే ఒక్కడూ తొంగి చూడడం లేదు. జనం ఎంత కృతఘ్నులు అనుకున్నాడు. ప్రతిరోజూ అప్పులకోసం పడిగాపులు కాసినవాళ్ళలో ఒక్కడూ ఇటు తొక్కి చూడడం లేదు. వాళ్ళందరినీ మాడ్చి చంపాలి. ఒక్కడికీ డబ్బివ్వ రాదు. ఆకలికి అలమటించాలి జనం అనుకున్నాడు.

శివయ్య కుర్చీలోనే ఉన్నాడు. కదలలేదు. కాలం కదలకుండా నిలిచినట్లనిపించింది. అది అనుకోవడమే. కాలాన్ని నిలిపిన ఘనుడు ఇంతవరకు పుట్టలేదు. ఎండ

ఎక్కిపోతూంది, శివయ్య వాకిట్లో ఎండ పరచుకుంది. అయినా, అక్కడ ఊపిరి ఆడుతున్న జాడ కనిపించడం లేదు. అక్కడున్న ముగ్గురూ బొమ్మల్లా ఉన్నారు. వారిలో కదలిక లేదు.

గౌరీనాథశాస్త్రి ప్రవేశించడంతో కాస్త కదలిక వచ్చింది. శివయ్య లేచి నుంచుని నమస్కరించాడు. శాస్త్రి మౌనంగా వచ్చి శివయ్య ముందు కూర్చున్నారు. అంతా మూకీలా ఉంది, ఇవేమీ పట్టని పిచ్చుకల కిచకిచలుతప్ప చప్పుడు లేదు.

"శివయ్యగారూ! నేనే పాపమూ ఎరుగను. ఎవరు చేసిన్రో తెలువదు. విన్నరా? నామీద అనుమానం పెట్టుకోకండి" – ఏదో అప్పచెప్పాలని వచ్చి అప్పచెప్పినట్లు చదివారు శాస్త్రిగారు.

శివయ్య పేలవంగా నవ్వాడు. "అనుమానం ఎందుకుగని ఇప్పుడు ఏం చేస్తమంటారు?"

"ఏంలేదు. అది తీసివేయాలె. తరవాత నేను చేసేది చెయ్యగలను."

"ఊళ్ళ అందరు చచ్చిన్రు, ఒక్కడు తొక్కి చూస్తలేడు, అందరు నా ఉప్పు తిన్న లంజకొడుకులే. ఊరికంత అన్నం పెట్టిన, ఒక్కడు వస్తలేడు గాడ్దికొడుకు. వచ్చినోళ్ళు అట్ల నాటకం చూసినట్లు చూస్తాన్రు. ఏం చేయమంటరు?"

శాస్త్రిగారు మౌనం వహించారు కొంతసేపు. తరువాత అన్నారు: "శివయ్యగారూ! మనిషికి ప్రాణం కన్న ప్రియం అయింది లేదు, ప్రాణభయాన్ని మించిన భయంలేదు, జనం భయపడుతున్నట్టున్నరు. ఏం చేయాలెనో నాకూ తోచటం లేదు."

"అయితే మీరేమీ సాయం చేయలేరా?" శివయ్య అర్థించాడు.

శాస్త్రిగారు మాట్లాడలేదు. పొడుం కాయకోసం రొంటిన వెదికారు. కనిపించలేదు. ఏదో విలువయిన వస్తువును కోల్పోయినట్లు ముఖం పెట్టారు.

పావని రంగంలోకి ప్రవేశించింది. ఎందుకో ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది శివయ్యకు. అలాంటి సమయాల్లో మనిషి కనిపించడం మహాత్యంగానే ఉంటుంది.

"అమ్మా పావనమ్మా! చూసినవా, ఎవడో ఇట్లచేసి పోయిండు. ఊళ్ళ ఒక్కడు ఇటు వస్తలేడు. ఇట్లయింది నా పని. ఈ పీడ దూరం అయ్యేటట్లు లేదు, ఏం చేయాలెనో తోచటం లేదు. చూడమ్మా, అ నిమ్మకాయలు – నెత్తుటి కూడు. ఎవడో నా కొంపకే ఎసరు పెట్టిండు."

పావని ఒక్కసారి కలయ చూచింది. వాతావరణం ఏదో ముంచుకువచ్చినట్లుంది. మనుషులు ప్రాణంలేని బొమ్మల్లా ఉన్నారు.

"బాబాయిగారూ!" పావని పలకరింపులోనే ఏదో స్థైర్యం కనిపించింది శివయ్యకు. "ప్రాణంలేని మంత్ర తంత్రాలను చూచి బెదిరిపోతున్నారు. ప్రాణం ఉన్న మనుషుల్లోని శక్తి సామర్థ్యాలను గమనించలేకపోతున్నారు. మంత్రాలను నమ్ముకున్న వాడు బాగుపడడు. మనిషిని నమ్ముకున్నవాడు చెడిపోడు. మీరు మనిషిని దూరం చేసుకున్నారు. ఈ ఊళ్ళో ఉన్న మనుషులంతా మీకు చాకిరి చేస్తున్నారు, పడిగాపులు కాస్తున్నారు, వారంతా అన్ని పనులూ చేస్తున్నారు, మీరు సంపద పెంచుకుంటున్నారు, వారు తమ తమ అవసరాలకు లొంగి మీకు బానిసలయి ప్రవర్తిస్తున్నారు. మీ జీవితంలో వాళ్ళు చేయనన్న పని ఇదొక్కటే. చూడండీ! మీరు ఎంత బాధపడి

పోతున్నారో! ఇలా వాళ్ళు పనులు చేయకుండా ఉండిపోతారనుకోండి – మీ సంపద, మీ ఆస్తి నిలవడం కాదు – మీ ఇంట్లో పిల్లి లేవదు. మీరు పెట్టకుంటే వాళ్ళు ఆకలితో చావరా అనుకుంటారు మీరు. కానీ మనిషి లొంగదలచుకోకుంటే చావడానికయినా సిద్ధం అవుతాడు. మీరు నమ్ముకున్నది ఆస్తిని, అధికారాన్ని. ఆస్తికి ప్రాణం లేదు, అధికారానికి హృదయం లేదు. ఆస్తిగానీ, అధికారంగానీ తమకు తాము నిలువలేవు. వాటి నిలకడకు జనం అవసరం, మనిషి అవసరం. మీరు నమ్ముకున్న ప్రాణంలేని ఆస్తిగానీ, అధికారంగానీ ఇప్పుడు మీకు సాయపడలేవు. మీకు సాయపడాల్సింది ప్రాణం ఉన్న మనిషి. మీరు ఎన్నడూ మనిషికీ ప్రాణం ఉందని భావించలేదు. వారిని మరలనీ, యంత్రాలనీ భావించారు. వారికి ప్రాణం ఉందనీ, వారికీ చీమూ–నెత్తురూ ఉన్నాయనీ, వారికీ సుఖదుఃఖాలున్నాయనీ, వారికీ అభిమానాలు ఆత్మీయతలూ ఉన్నాయనీ భావించలేదు. కూలి చేయించుకుని కనీసం కూడు వేయలేదు. పశువులకంటే హీనంగా చూశారు, ప్రాణాలు తీశారు. ఇవ్వాళ వాళ్ళు మీకు సాయంగా రావాలని ఎలా ఆశిస్తారు? మీరు వాళ్ళతో ఆత్మీయత పెంచుకుని ఉంటే మీ కాలిలోని ముల్లును వారు పంటితో తీసేవారు. కానీ అలా చేయలేదు. ప్రాణంలేని ఆస్తిని నమ్ముకున్నారు. ప్రాణం ఉన్న మనిషిని వదిలేసుకున్నారు. మీకు సాయపడడానికి ఒక్కడూ రావడంలేదు."

పావని ఊపిరి సలుపుకోవడానికి నిలిచింది.

"అమ్మా! ఇన్ని విషయాలు ఎక్కడ నేర్చుకున్నవమ్మా?" శాస్త్రిగారు కూతురులోని విజ్ఞానానికి పొంగిపోయాడు.

"అమ్మా పావనమ్మా! ఈ పీడ వదిలే ఉపాయం చూడు. నువ్వు ఏం చేయమంటే అదే చేస్త."

పావని గ్రహించింది. తాను చెప్పినదంతా బూడిదలో పోసిన పన్నీరే. శివయ్యకు కావలసింది తన పని కావడం. అధికారం, సంపద – వీటిమీద నీతులు పనిచేయవు.

"బాబాయిగారూ! ఈ మంత్ర తంత్రాలు వట్టి కల్లబొల్లి కబుర్లు. నాకు వాటిమీద నమ్మకం లేదు. మనిషి మాటను మించిన మంత్రం ఉంటుందంటే నమ్మకం నాకు లేదు. తోడివానికి సాయం చేయడాన్ని మించిన ధర్మంలేదు."

"అయితే పావనమ్మా! ఆ నిమ్మకాయలు తీసేస్తవా?"

"శివయ్యగారూ! ఆ నిమ్మకాయలు మనం కాయించినవే, ఆ బియ్యం మనం పండించినవే. అన్నానికి రంగు వేయగానే అందరినీ మింగేస్తుందా? చూడండి తీస్తాను" – పావని నిమ్మకాయలవైపు బయల్దేరింది.

"అమ్మా పావనీ!" శాస్త్రిగారు లేచి నించున్నారు.

"అమ్మగారూ! పావనమ్మగారూ! మీరు తియ్యొద్దు" – మల్లమ్మ అడ్డం పోయింది.

పావని అడ్డు తొలగించుకుని పోయింది. నిమ్మకాయ అందుకుని శివయ్యగారికి చూపింది.

"శివయ్యగారూ! ఇది ఉట్టి నిమ్మకాయ. మిమ్మలను ఇందాక వణికించింది. మీరుకూడా అంతే. మీరంటే ఈ ఊరి జనం గడగడలాడుతున్నారు. వాళ్ళు ఎందుకు వణికిపోతున్నారు? మీ దగ్గర ఏదో శక్తి ఉందనుకున్నారు. మీ దగ్గర

ఆ శక్తి లేదని వాళ్ళు తెలుసుకున్నారనుకోండి – అప్పుడు మీరు ఈ నిమ్మకాయ లాంటివారే. ఇది నిమ్మకాయ–వట్టి నిమ్మకాయ. ఇది ఇప్పుడు ఎందుకూ పనికిరాదు, చూశారా?"

పావని ముఖం ఎండకు వెలిగిపోతూంది. ఆమె వాగ్దేవిలా ఉంది. అనంత మయిన సత్యాలను వెలువరిస్తూంది. మంచిని, మానవతను పెంచడానికి అవతరించిన పావనిలా ఉంది.

పావని ముఖం వెలిగిపోతూంది. కళ్ళు కనకాంబరాల్లా ఎర్రగా ఉన్నాయి. పెదవి అదురుతూంది. స్వేదబిందువు ముక్కుచివరకు వచ్చి నిలవనా, రాలనా? అని తటపటాయిస్తూంది.

పావని ప్రసన్నంగా ఉంది. ఆమెను చూచి ప్రసన్నుడు కావలసింది శివయ్య– భయపడుతున్నాడు. అతనికి పావని చెప్పిన వాస్తవాలు తలకెక్కలేదు నిమ్మకాయ పట్టుకుని నుంచున్న పావని మహా శక్తిలా కనిపించింది. మంత్రకత్తెగా కనిపించింది. తండ్రిని మించిన మంత్రాలు నేర్చిందనుకున్నాడు. శివయ్యకు చెమటలు పడ్తున్నాయి;

పావని నిమ్మకాయ పిండింది. విచిత్రం! అందులోంచి ఎర్రని రసం వచ్చింది.

"అమ్మా పావనమ్మా! ఇహ అగు. ఎరకయిందమ్మా! నీ శక్తి గ్రహించిన. ఏం కావల్నంటవో చెప్పు, ఇచ్చుకుంట. చాలు, నిమ్మకాయ పారెయ్యి. దూరంగా పారెయ్యి. పారెయ్యమ్మా – పారెయ్యి" – శివయ్య దూరం నుంచే చేతులు జోడించి అన్నాడు.

పావని ఆశ్చర్యపోయింది. తనలో ఉన్న శక్తులేమి? తాను సామాన్య స్త్రీ. తాను చేసిందీ అతిసామాన్య కార్యం. పావనికి ఏమీ అర్థంకాలేదు. ఆమె నిమ్మకాయ వాకిట్లోకి విసరికొట్టింది. అక్కడున్న అన్నాన్ని కాళ్ళతో తొక్కింది. ఆ తొక్కడం తాండవమాడినట్లుంది.

"నా తల్లికి శివం వచ్చింది. నిజంగానే శక్తి అయింది" అని శాస్త్రిగారు ముందుకురికాడు. పావనిని పట్టుకున్నారు.

పావని అలసినట్లుంది. "ఏమిటి నాన్నా, ఇదంతా?" అడిగింది.

"ఏంలేదమ్మా! పోదాంపా. నీకిప్పుడు తెలియదమ్మా! తరవాత తెలుస్తుంది." కూతురును నడిపించుకుని వెళ్ళిపోతున్న శాస్త్రిగారిని చూచిన శివయ్య చేతులెత్తి మొక్కాడు. చేతులు నేలకు అనించి దండాలు పెట్టాడు.

శివయ్య ఇటు చూచాడు. మల్లమ్మ నుంచొని ఉంది. "ఏందే! ఇగనన్న తీస్తవా?" శివయ్య పలుకుల్లో కాఠిన్యం లేదు.

మల్లమ్మ నవ్వుకుంది. మల్లమ్మకు నవ్వు వస్తుంది. నవ్వు కనిపించకుండా తల వంచుకుంది. పొరక తీసుకుని ముదుకు నడిచింది. పదార్థాలను దూరంగా తోసింది. వాకిలి ఊడ్చింది. కళ్ళాపి చల్లింది. పెంటడు వచ్చాడు. పశువులను విప్పుకుని వెళ్ళిపోయాడు. శివయ్య ఇంట్లో మళ్ళీ ఊపిరి సలుపుతున్నట్లు అనిపించింది.

ఆ సాయంకాలం శాస్త్రిగారిని పిలిచాడు శివయ్య. సుభద్రమ్మకు జ్వరం పట్టుకుంది. శాస్త్రిగారు సుభద్రమ్మకు బొట్టుపెట్టాడు. తగ్గిపోతుందని చెప్పి వెళ్ళిపోతూ, ఏదో కట్టుదిట్టం చేద్దామంటూ వెళ్ళిపోయాడు.

పావనిలో ఏదో శక్తి ఉందని నమ్మింది ఊరంతా!

# 8

ఊళ్ళో స్కూలు ఉంది. స్కూలుకో భవనం ఉంది. స్కూలు భవనం కట్టించడానికి డబ్బు గవర్నమెంటు ఇచ్చింది. బిల్డింగు కట్టించినవాడు శివయ్య. తానే స్వయంగా కట్టించుకున్నా నన్నాడు శివయ్య. అందులో తన ధాన్యం నిలువ చేసుకున్నాడు. ఆ ఊరికి అది శివయ్య గిడ్డంగి అనే నమ్మకం – ఎంచేతంటే, శివయ్యదికాని ఆస్తి ఆ ఊళ్ళో అరుదు.

ఆ ఊరుకు స్కూలుంది. స్కూలుకో టీచర్నీ నియమించింది ప్రభుత్వం. ప్రభుత్వం సొమ్ముతో స్కూలు కట్టించాడు శివయ్య. ఆ ఇల్లు తనదేనన్నాడు. గవర్నమెంటు నియమించిన టీచర్ను తన ఉద్యోగిగానే పరిగణించాడు శివయ్య. ఊరికి వచ్చిన టీచరు చదువు చెప్పకుండా ఉండడం శివయ్య ప్రధాన లక్ష్యం. శివయ్యకు చదువన్నా, వెలుగన్నా బెదురు. అతడు గుడ్లగూబ లాంటివాడు. చీకటి ఉంటేనే రాజ్యం చేయగలడు. నిద్రలో ఉన్న కాకుల కుత్తుకులు నులిమి అధికారం నిలుపుకో గలడు. శివయ్య రెండో లక్ష్యం–వచ్చిన టీచరుతో తన సొంత లెక్కలు రాయించుకోవడం. ఈ ఏర్పాటు అటు శివయ్యకూ ఇటు పంతుళ్ళకూ బాగానే ఉపకరించింది. పంతులూ, బడీ ఎవరికోసం ఉద్దేశించబడిందో వారికి ఉపకరించడంలేదు. అసలు వారికి వాటి అస్తిత్వం తెలియదు.

పావని తొలిసారి చదువు చెప్తాతానని ఊళ్ళో ప్రవేశించింది. అప్పుడు తెలిసింది ఊరికి, ఆ ఊరికీ ఒక టీచరు ఉందని. పావని శివయ్య ఇంట్లో లెక్కలు రాయడానికి నిరాకరించడం, స్కూలు చెపుతానని పట్టుబట్టడం వింతగా కనిపించింది ఊరికి. పావని స్కూలు నడిపించగలదని ఎవరూ ఆశించలేదు, వారికి ఆశ్చర్యం కలిగించిందల్లా శివయ్య మౌనం. పావని శివయ్య మాట విననందుకు అప్పటికే ఆ ఊరి నుంచి వెళ్ళిపోవాల్సింది. శివయ్య వెళ్ళగొట్టి ఉండాల్సింది. అలా జరక్క పోవడం వింతగా ఉంది. పావని వెనక ఏదో బలం ఉందని నిర్ణయించుకున్నారు జనులు. శివయ్యను ఎదిరించి ఊళ్ళో ఉంటూోంది పావని! శివయ్యను ఎదిరించగల పావని విషయంలో కొంత గౌరవం అభిమానం పెంచుకుంటున్నారు జనం.

పావని శివయ్యకు కొరకరాని కొయ్యగా తయారయింది. ఆమెను అక్కణ్ణించి పంపించడానికి ప్రయత్నం చేయకపోలేదు. కాని, అధికారులు అతనికి ఏమాత్రం సహకరించలేదు. స్కూళ్ళన్నీ నడవాలని పట్టుదలతో ఉంది ప్రభుత్వం అని చెప్పారు. శివయ్య చెప్పచేతలలో ఉన్న అధికారులు ఎవరూ కనిపించలేదు. శివయ్యకు తన పలుకుబడి అస్తమిస్తున్నట్లనిపించింది. ప్రభుత్వ వ్యవస్థలో ఏదో మార్పు కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది. డబ్బూ, పలుకుబడీ అధికారుల ముందు పనిచేయడం లేదు. శివయ్య ఓటమిని అంగీకరించి పట్నం నుంచి తిరిగివచ్చాడు. తాను చేసిన ప్రయత్నాలను గురించి మరొకరికి తెలియనీయలేదు. గౌరీనాథశాస్త్రి అంటే వారికి బుగులు. అందువల్ల పావని విషయంలో మౌనం వహించాడు శివయ్య.

పావని స్కూలు ప్రారంభించాలనుకుంది. కొంతలో కొంత ఊళ్ళో సానుభూతి సంపాదించింది. కాని, ఎక్కడ ప్రారంభించాలి స్కూలు? స్కూలుకు బిల్డింగుందని ఆమెకు తెలుసు. అది శివయ్య గిడ్డంగిలా ఉపయోగపడుతూోందనీ తెలుసు. కాని,

ఈ విషయంలో శివయ్యతో తగాదా పడదలచలేదు. పావని ఊళ్ళోకి రావడమే తనకు ప్రమాదకరం అనుకున్న శివయ్య పావని ఊళ్ళో ఉండడాన్ని సహిస్తున్నాడు. అదే తన తొలి విజయంలా భావించింది. బ్రహ్మయ్యలాంటి సానుభూతి మలివిజయంగా భావించింది. కోటలో ఉన్న మల్లమ్మ, ఆమె ఆత్మీయత తనకు ఆశీస్సులనుకుంది. ఇలాంటి విషయాల్లో ఒక్కొక్క అడుగు వేయడం మంచిది. ఒక్కసారే దూకుతే కాళ్ళు విరుగుతాయి. విరిగిన కాళ్ళతో ముందడుగు వేయలేం. ఒక్కొక్క అడుగు వేస్తూ సాగుతే ఎప్పటికయినా లక్ష్యం చేరుకుంటాం, ఊరిలో ఏదో కాస్త చైతన్యం కనిపిస్తూంది. బడి పెట్టడం విషయంలో అంతగా విముఖత చూపడం లేదు. బడిభవనం విషయంలో శివయ్యను కదుపుతే నిద్రలో ఉన్న పులిని రేపినట్లవుతుంది. అయినా, బడి అంటే భవనం మాత్రం కాదు – చదువుచెప్పే ఆసక్తి, సేవాభావం ఉన్న ఉపాధ్యాయులు, చదువు విషయంలో శ్రద్ధా ఆసక్తిగల విద్యార్థులు.

ఊరి మధ్యన ఒక పెద్ద చింతచెట్టు ఉంది. అది చక్కని నీడ నిస్తుంది. చెట్లు చక్కని నీడ నిస్తాయి. మనిషి ఇవ్వలేదు. పావని ఆ చెట్టు కిందనే, చెట్టు నీడనే స్కూలు ప్రారంభించింది. వేళకు ఇంటి నుంచి బయలు దేరుతుంది. ఒక కుర్చీ ఇంటి నుంచి తీసుకెళ్తుంది. అది వేసుకుని కూర్చుంటుంది. పిల్లల కోసం ఒకటి రెండు చాపలు సంపాదించింది. రెండు చాపలు, ఒక కుర్చీ, చింత చెట్టు నీడ – ఇదీ పాఠశాల!

పావని చింత కింద కూర్చుంటూంది. కాని. పిల్లలు ఎక్కువగా రావడం లేదు. తొలిరోజున నలుగురు, అయిదుగురు వచ్చారు. వారిని చూస్తే అనేక సమస్యలు ఎదురయినాయి. వారికి బట్టలు లేవు– చిరిగిన బట్టలు. శుభ్రంగా లేరు– చీమిడి ముక్కులు, ఆరోగ్యంగా లేరు– బానపొట్టలు. పట్నంలో తాను చదువుకున్న స్కూలు గుర్తుకు వచ్చింది – యూనిఫాంలు, కళకళలాడే ముఖాలు – ఎంత వ్యత్యాసం! ఇది ఒకే దేశం– అవి పట్నాలు – ఇవి పల్లెలు!

వచ్చిన పిల్లలకు చేతుల్లో పలకలు లేవు– పుస్తకాలు లేవు. వారెందుకు వచ్చారో తెలియదు. ముత్యాలు వారిని వెంట తెచ్చింది– పావని చాలా మంచిదని, చాకలెట్లు ఇస్తుందనీ పిలుచుకు వచ్చింది. పావనికి వాళ్ళను చూస్తే ఏడుపు వచ్చింది. వాళ్ళకు చదువంటే తెలియదు–అక్షరం తెలియదు.

"అమ్మగారూ! నాకిచ్చింది శాన బాగున్నది. వీండ్లకు గూడా యియ్యుండి." ముత్యాలు చెయ్యి చాచి అడిగింది.

పావని ముత్యాలును దగ్గరికి తీసుకుంది. చాకలెట్లు అందించింది. అందరికీ ఇమ్మంది– ముత్యాలు మురిసిపోయింది. అందరికీ తలా ఒకటి ఇచ్చింది – తాను రెండు మిగిలించుకుంది ఎవరికీ దానికి చుట్టిన కాగితం విప్పరాలేదు. గర్వంగా విప్పి చూపించింది ముత్యాలు. ఆ కాగితాలు అంతా జాగ్రత్తగా దాచుకున్నారు. అవి వింతగా ఉన్నాయి వారికి.

"అమ్మగారూ! దీన్నేమంటారు?" ముత్యాలు అడిగింది.

"చాకలెట్టు" – జవాబు చెప్పింది పావని. పావనికి వాళ్ళు తనను "అమ్మగారూ!" అని పిలవడం బాగని పించలేదు. వాళ్ళు తనను ఏమని పిలవాలి? తాను "టీచర్" అని పిలిచింది. వీళ్లను అలాగే పిలవమందా మనుకుంది. ఎందుకో ఆమెకది నచ్చలేదు.

అది ఇంగ్లీషు పదం. "పంతులమ్మా!" అనమందామనుకుంది. కాని, అలా అనమంటె వాళ్ళు "పంతులమ్మగారూ!" అంటారు. అంత కంటె "అమ్మగారూ!" అన్న పదమే బాగుందనుకుంది. ఆ పదంలో ఆత్మీయత ఉంది. అనురాగం ఉంది. అనుబంధం ఉంది. టీచర్ వాస్తవంగా తల్లి వంటిది. అజ్ఞానులు- నిరక్షరకుక్షులు అనుకునే వారు ఎంత చక్కని పదాలు వాడ్తారు! ఎంత సార్థకంగా వాటిని ఉపయోగిస్తారు?

"ముత్యాలూ! మీ అమ్మను ఏమని పిలుస్తావు?"

"అమ్మా అని పిలుస్తం."

"నన్ను కూడా అట్లాగే పిలువు. 'గారూ' అనకు. నేను మీ అమ్మలాంటి దాన్నికానా?"

"అమ్మా!" ముత్యాలు ముందుకు ఉరికి వచ్చి కాళ్ళను చుట్టేసుకుంది "అమ్మా! నువ్వు మా అమ్మకంటె మంచిదానివి. మా అమ్మ కొడ్తది. చాకిలెత్తు ఇయ్యది" అన్నది, తల ఎత్తి పావని ముఖంలోకి చూస్తూ.

పావని గుండె చెరువయింది. కనులు చేమ్మగిల్లాయని చెప్పనవసరం లేదు.

"ముత్యాలూ! అట్లనొద్దు. మీ అమ్మ మంచిది" అని ముత్యాలును దగ్గరికి తీసుకుని తల నిమిరింది.

పిల్లల ఆప్యాయత, అనుబంధం పావనిని ఉక్కిరి బిక్కిరి చేశాయి. తాను ఈ ఊరికి రాకుంటే ఇంత ఆత్మీయత వట్టిపోయేది కదా అనుకుంది.

పిల్లలకు ఆ కథా, ఈ కథా చెప్పి పంపించేసింది.

తెల్లవారి పలకలకోసం ప్రయత్నించింది. ఆ ఊళ్ళో అవి దొరకవు వాటితో అక్కడ పనిలేదు. వాటి కోసం తాను పట్నం పోలేదు. శాస్త్రిగారిని తెమ్మంటె నిరాకరించారు. పావని అంటరాని వారిని అంటుకోవడమే మహాపాపం అన్నారు. ఈ పాపంలో తాను పాలు పంచుకోనన్నారు. పావని తండ్రితో వాదనకు దిగుదామనుకుంది. అంటరాని వారిని సృష్టించింది ఎవరో అడుగుదామనుకుంది. కాని మానుకుంది. తండ్రి ఈ మాత్రం అనుమతిస్తున్నాడు - అదే చాలు ననుకుంది. బ్రహ్మయ్యకు డబ్బిచ్చి పలకలు తెమ్మని చెప్పింది.

ఒకనాడు చింతకింద కూర్చొని ఉంది. ఇద్దరు ముగ్గురు పిల్లలు చాపల మీద కూర్చున్నారు. వాళ్ళు కాస్త శుభ్రంగా ఉన్నారు. వారికి తాబేలూ-కుందేలు కథ చెపుతూంది. శివయ్య అటునుంచి వెళ్తూ పలకరించాడు. పావని లేచి నుంచుంది. పిల్లలూ లేచి నుంచున్నారు. ఆ క్రమశిక్షణా-ఆ వాతావరణం ఆశ్చర్యం కలిగించాయి శివయ్యకు.

"సాధించినవమ్మా! బడి పెట్టినవు" - శివయ్య.

"ఇదంతా మీ అనుగ్రహం."

"అవునమ్మా! ఈ పోరలు చదువుకుని ఏం చేస్తరు? ఊళ్ళేల్తరా?"

"మీ రట్ల అంటే ఎట్లా? చదువుకున్న వాళ్ళంతా ఊళ్ళేల్తున్నారా?"

"నీదంతా ఒక పిచ్చి. వీళ్ళకు చదువు ఎందుకమ్మా-సరే నీ ఇష్టం" అని వెళ్ళిపోయాడు. బడి కోసం కట్టించిన ఇంటి మీద ఆమె దృష్టి పడనందుకు సంతోషించాడు శివయ్య. చెప్పుకోనియ్యి చదువు అనుకుని సాగిపోయాడు.

శివయ్య అలా వెళ్ళగానే బ్రహ్మయ్య ప్రవేశించాడు – పలకలు పట్టుకుని. పలకలు పావనికి అందించి, "శివయ్య పగపట్టిండమ్మా, నా మీద" అన్నాడు. అతని స్వరంలో బాధల పర్వతాలున్నాయి. చీకటి కొండలున్నాయి. అకటి సంద్రాలున్నాయి.

"ఏమయింది మామా!" పావని అడిగింది. ఆమె చేతులు వణకుతున్నాయి. పలకలు పడిపోయేట్లున్నాయి. వాటిని కింద పెట్టింది.

"పావనమ్మా! శివయ్య నాకు అప్పు పెట్టటం బంద్ చేసిండు. పని ముట్లు ఇస్తలేడు బాకీ కింద ఇల్లు పట్టుకుంటడట. కూలి చేసుకుంటున్న, మీ అత్త ఇయాల్నో రేపో అనెటట్లున్నది."

"మామా! ఈ బడి బంద్ చేస్త. నిన్ను కష్టాల పాలు చేసి ఈ బడి నడిపించలేను"

"అట్లనకు పావనమ్మా! మేం కష్టాల్లనే పుట్టినం! కష్టాలతోనే పోతం. బడి పెట్టి బతుకేమిటో చూపినవు. నా తల నరికి ఈడ పెట్టమన్నా పెద్ద–బడి మాత్రం బంద్ చేయకు. పోరాటం మొదలయింది, మధ్యన ఆపెడిది లేదు. విజయమో–వీరస్వర్గమో – అంతే!"

బ్రహ్మయ్యలోని ఆవేశం చూసి పొంగి పోయింది పావని. "మామా...!" అని ఏమో అనబోతుండగానే నర్సిమ్మ ప్రత్యక్షం అయినాడు, బల్లెం పట్టుకుని యమదూతలా.

"పోరీ! ఈడ కూకుంటే తమ్ముఁన్నెవరెత్తుకుంటరే లే–పా" – ఉరిమాడు నర్సిమ్మ.

"అయ్యా! నేన్రానే. సదుకుంట ఓ అయ్యా! నన్నేమనకే, సదుకుంట" – ముత్యాలు గడగడ వణకుతూ లేచి నుంచుంది.

"పా లంజముండ. సదుకుంటదట, ఇంట్ల ఎవడు చేస్తడే!" అని నర్సిమ్మ ముత్యాలు చేయిపట్టి గుంజుకుపోతున్నాడు. రానని వెనక్కు గింజుకుంటూంది ముత్యాలు. నర్సిమ్మ దెబ్బలు కొట్టి లాక్కు పోతున్నాడు.

పావని ప్రతిమలా నుంచొని చూస్తూంది.

బ్రహ్మయ్య గుడ్లప్పజెట్టి చూస్తున్నాడు.

"ఓయ్యా! నన్ను కొట్టకే, నేను సదుకోను" – ముత్యాలు ఆక్రందన వినిపిస్తూంది.

మిగిలిన ఇద్దరు ముగ్గురు పిల్లలూ "మా అయ్య కొడ్తడు, మా అయ్య కొడ్తడు" అని పారిపోతున్నారు.

పావని పలకలు చూచింది నేల మీద పడి ఉన్నాయి. బ్రహ్మయ్యను చూచింది. అతని కళ్ళలో ఆవేశం కనిపించింది.

"పావనమ్మా! నువ్వు కృష్ణునివి – నేను అర్జునుణ్ణి. కురుక్షేత్ర సంగ్రామం షురు అయింది" అన్నాడు.

చింతచెట్టుమీది కాకులు కావు కావు మన్నాయి.

నేనూ మీకు తోడుంటానని ఒక కుక్క వచ్చి బ్రహ్మయ్య కాళ్ళు నాకింది.

# 9

నిండుపున్నమి. పండువెన్నెల. వెన్నెల పుచ్చపూవులా పరచుకుంది. గూడెం సందడిగా ఉంది. పగలంతా వళ్ళు విరుచుకొని వచ్చిన జనం ఇంటిపనుల్లో మునిగి ఉన్నారు. పొయ్యిలు వెలుగుతున్నాయి. వంటలు సాగుతున్నాయి. ధర్మయ్యతాత గొనుగుతూ పదం పాడుతున్నాడు. పెంటయ్య తల్లి పుల్లమ్మ మంచంలో మూలుగుతూంది. పెంటడు, వెంకడు కూర్చొని కూనిరాగాలు తీస్తున్నారు.

పావని, బ్రహ్మయ్య, కొమరయ్య గూడెంలో ప్రవేశించారు. కూనిరాగాలు తీస్తున్న వెంకడు వారిని చూచాడు. గబుక్కునలేచి నుంచున్నాడు. తన కళ్ళను తానే నమ్మలేనట్లు చూచాడు. కళ్ళు నలుపుకుని చూచాడు – వాళ్ళు మనుషులా కాదా? అన్నట్లు. "పెంటా! అటు చూడు ఎవరొచ్చిన్రో" అన్నాడు.

పెంటడు ఉలికిపడి చూచాడు.

"ధర్మయ్యతాతా! చూడు ఎవరొచ్చిన్రో! పావనమ్మొస్తున్నది, బ్రహ్మయ్యొస్తున్నడు, కొమరయ్యొస్తున్నడు" అన్నాడు పలవరిస్తున్నట్లు.

"అరే పెంటిగా! గప్పుడే నిద్రపోయినావుర – కలవరిస్తున్నావు. బాపనోండ్లు మన గూడేనికి ఎందుకొస్తర్రా?" ధర్మయ్య మంచంలో పడి ఉండే అన్నాడు. అతడు లేవడానికి ప్రయత్నించలేదు.

"ధర్మన్నా! వచ్చిందయ్యా పావనమ్మ. మన పాలిటి దేవత – వచ్చింది. ధర్మన్నా! చూడు, మేం గూడ వచ్చినం" – బ్రహ్మయ్య అన్నాడు.

ధర్మయ్య లేవడానికి ప్రయత్నించాడు – లేవలేకపోయాడు. చే యెత్తి మొక్కడానికి ప్రయత్నించాడు మొక్కలేక పోయాడు. "అమ్మా పావనమ్మా! నువ్వు మా గూడానికి వచ్చినవా తల్లి! ఎంత దయగలదానివమ్మా! ఇంటనే ఉన్నం నీ సంగతులు – ఇని. ఏం చేస్తమమ్మా! చూస్తున్నవు గదా నా గతి? నాకు రెక్కల్లేవు. రెక్కలున్నోండ్లకూ లేనట్లే నమ్మా–అందరి రెక్కలూ ఇరక్కొట్టిండు దొర. ఒరే ఎంకడూ, ఒరే పెంటడూ! మంచమెయ్యండిరా కూచుంటది మా తల్లి. వచ్చింది, మనమీద దయదలచి వచ్చింది" – ధర్మయ్య మాటల్లో ఆదరమూ, అభిమానమూ ఉట్టి పడుతున్నాయి. పావని ఉక్కిరి బిక్కిరి అయింది. వెంకడు తెచ్చి వేసిన మంచంలో కూర్చుంది. "మీరు కూడా కూర్చొండి" అన్నది.

"అంటరాని వాండ్లమమ్మా, మేం ఇట్ల దూరంగా కూలబడ్తంలే" అని కూలబడ్డాడు వెంకడు. బ్రహ్మయ్యా, కొమరయ్యా మంచం మీద కూర్చోలేదు. దూరంగా కూర్చున్నారు.

"వెంకయ్యా!" పావని ఏదో చెప్పబోయింది.

"ఎంకిగా అనుప్రిబాంచను. మీ కాళ్ళ కాడ పడుండెటోల్లం."

"వెంకయ్యా! మీరు బానిసలుకాదు – మనుషులు. మనం అంతా మనుషులమే. అందరం ఒకే తీరుగా పుట్టాం. కొందరు మిమ్ములను బానిసలను చేశారు. వారికి ఉన్న డబ్బుతో మిమ్ములను కొనుక్కున్నారు. బానిసలను చేశారు. మీరు మిమ్ములను తెలుసుకోవాలి. మీలో ఉన్న శక్తిని గ్రహించాలి. అది జరిగిన్నాడు ఏ శక్తీ మిమ్ములను బానిసలుగా ఉంచలేదు. మీరు కట్లు తెంచుకుంటారు. రెక్కలు

పెంచుకుంటారు. ఆకాశంలో ఎగురుతారు. సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ పట్టితెస్తారు. భూమిమీద వారితో ఊడిగం చేయిస్తారు."

"అమ్మా! పావనమ్మా! అమురుతం కురిపించే మాటలన్నవమ్మా! మేం గొడ్లోలె చస్తం. మమ్ముల మనుసులని గుర్తుపట్టినవమ్మా! కాని, మాకు తెలిసింది దొర, ఆయనిచ్చే అప్పులు, ఆయనకు చేసే చాకిరి. మాకు రెక్కలెట్లొస్తయమ్మా! మా కట్లెట్ల తెగుతయమ్మా!" ధర్మయ్య ఏదో అంతస్తు అందుకోలేక జారిపడుతున్నట్లు మూలిగాడు.

"ఇగో ధర్మయ్యతాతా! పావనమ్మ చెప్పేదాంట్ల సత్యమున్నదే. పడుంటె పశువులోలె పడుంటం. ఎదురు తిరిగితె పిల్లికూడా పులి అయితది, ఏమంటవ్?" బ్రహ్మయ్య ఉత్సాహం కనబరచాడు.

"ఎన్నడన్న మా గూడేనికే వచ్చినావె బ్రహ్మయ్యన్నా? జందెం తెంపుకుని వచ్చినవా ఏం?" పెంటయ్య ఎగతాళిగా అన్నాడు.

"ఇగో! బమ్మన్న నిజంగానే జందెం తెంపుకున్నాడు. ఈ అమ్మ చెప్పింది. కులాలని పెట్టినోడు మనను ఏరు చెయ్యటానికి పెట్టిండట. నిజంగా చెప్ప... మనందరం కష్టం చేసుకునేటోండ్లమే నాయె. మనకు కులాలేందే. కులాలని పెట్టింది శివయ్యేనసే- నీయవ్వ - వాడేమో ఏల్తాండు" - కొమరయ్య కులాలను గురించి తెలిసినంత చెప్పినా ఏదో చైతన్యం వచ్చినట్లు చెప్పాడు.

"కొమరయ్యన్నా! ఇగ మనందరం ఒకటన్నవు గద- నీయవ్వ - ఆ దొరను పట్టుకొచ్చి ముత్తాలమ్మకాడ మూలగంగ నరకమంటె నరకుత. ఏమైతదే, జేలుకు పోత" - పెంటయ్యలో ఆవేశం కట్టలు తెంచుకుంది.

"ఒరే పెంటిగా! మన కులమే అంతరా. పడుంటే పీనుగులోలె పడుంటం, కాకుంటె అందర్ని చంపుతమంటం. అమ్మ ఎందుకొచ్చిందో, ఏం చెప్పతదో ఇంటవా? అట్లనే కూస్తుంటవా?" ధర్మయ్య శాంతింపజేశాడు.

ఎవరూ మాట్లాడలేదు. వాతావరణం స్తంభించినట్లయింది. అంతా ఏదో అనంతం అయిన ఆలోచనలో మునిగినట్లయింది.

"పావనమ్మా! వచ్చినపని చెప్పక పోతిరి" - మౌనాన్ని భంగం చేస్తూ అడిగాడు వెంకడు.

"అమ్మకేమి పనిలేదు. మన పని కోసమే వచ్చింది" - బ్రహ్మయ్య చెప్పాడు.

"అదే అడుగుతున్నం - ఆయమ్మ ఈడికొచ్చింది- మేం మనుసులమని చెప్పింది. పావనమ్మ ఏం చెయ్యమంటదో చెప్పండ్రి, అగ్గిలో దూకమంటదా? పిడుగుల్లోకి ఉరకమంటదా?" పెంటయ్య ప్రతిధ్వనించాడు.

"అవన్నీ చేయనక్కర్లేదు. నేను చదువు చెప్పడానికి ఈ ఊరు వచ్చాను. చదువు మిమ్ములను మనుషుల్ని చేస్తుంది. శివయ్య గుట్టు రట్లను బయట పెడుతుంది. మీ కళ్ళు తెరిపిస్తుంది. లోకాన్ని చూచేట్లు చేస్తుంది. మీరు లోకాన్ని చూస్తే చాలు, శివయ్య కూలిపోతాడు. మీరు చదువుకోవాలి. మీ పిల్లలను చదివించాలి. అది అడగడానికే నేను వచ్చింది." పావని వచ్చిన పని వెళ్ళబెట్టింది.

"నాకేమి అర్థమయితలేదు, చదువుకుంటె శివయ్యెట్ల పోతడు?" సందేహం వ్యక్తపరిచాడు వెంకడు.

"అరే వెంకిగా, నీది మొద్దు మెదడురా! అమ్మకున్న తెలివి నీకున్నదా! ఆమె ఈడికెందుకు రావాల్రా – బువ్వ లేకనా బట్టలేకనా? శివయ్యకు ఎదురు నిలబడ్డది–మనకు తెలివి చెప్పతాంది. చెప్పినట్టు చెయ్యరాదు?" కొమరయ్య బోధించాడు.

"అలాకాదు కొమరయ్యా! మనం అన్నీ తెలియచెప్పాలి. వెంకయ్యా! మీరు బానిసలు ఎందుకు అయినారు?"

"ఏమో నా బొంద, నాకేమెరిక బాంచను. అంత ఎరికయితె ఈ దొర మా మీద ఇట్లెందుకు సవారి చేస్తడు?"

"అదేరా ఎరిక కావాలె. చదువుకుంటె అన్ని ఎరికయితయి. దొర మనవి చదువు కోనియ్యకుండ చేస్తాండు. సర్కారు బడి కట్టించిందా, అందుల గింజలు పోసుకున్నడు" అన్నాడు బ్రహ్మయ్య.

"ఆ గింజలు కాళీ చేయించాల్నె ఏమన్న కానీ" – పెంటయ్య నిజంగానే కాళీ చేయిస్తున్నట్లు అభినయించాడు.

"అరే పెంటిగా! ఊరుకో, చెప్పేదిది ఇను" – ధర్మయ్య వారించాడు.

"వచ్చిన బడిపంతులును లెక్కలు రాసెటందుకు పెట్టుకున్నాడు. పావనమ్మ వచ్చింది, వానిరోగం తిప్పింది. లెక్కలు రాయనన్నది. బడి పెట్టింది" – బ్రహ్మయ్య.

"బాగ రోగం కుదిరింది" – అరచేతిలో గుద్దుకొని ఆనందం అనుభవించాడు వెంకడు.

"శివయ్య మొదటిసారి లొంగిండు."

"అవుగద, కండ్లపడ్తనే ఉండె" – అందరూ ఒకేసారి అన్నారు–శివయ్య అధికారం డొల్లిపోతుంటే చూస్తున్నట్లు.

"అట్లని ఊరుకుండనుకున్నా? పావనమ్మకు సాయం చేసిన్నని నాకు పనిముట్లు ఇయ్యటం బంద్ చేసిండు. బాకీలు తీర్చకుంటే నా ఇల్లు గుంజుకుంట నంటుండు. పోరలు బడికి పోకుండ బెదిరిస్తుండు. ఇల్లు పోతే పాయె, కూటికి లేకుంటే బాయె, ఊరు బాగుపడాలె, శివయ్యకు బుద్ధి చెప్పాలని ఇట్లవచ్చిన" – బ్రహ్మయ్య అన్నాడు.

"చెప్పాల్నె ఓ బ్రహ్మయ్యన్నా, చెప్పాలె, మా అమ్మను పొట్టన పెట్టుకున్నాడు. మా అయ్యను చంపిండు. చెప్పదం, బుద్ధి అందరం కలిసి చెప్పగం. పోరల్ను బడికి పంపిస్తం, మేం చదువుకుంటం – ఇగ సరెనా?" వెంకడు అన్నాడు.

"చాలురా ఎంకడు, గామాత్రం చెప్పినవు. ఇగ మనందరం ఒక్కటే గద. ఏమంటవ్?" కొమరయ్య అడిగాడు.

అందరం ఒక్కటే!

మనందరం ఒక్కటే!

అందరూ ముక్తకంఠంతో అన్నారు. పావని ఆనందాతిరేకంతో తబ్బిబ్బయింది. తాను ఒక్కతి ఊళ్ళో ప్రవేశించింది. వంటరిగా ఏం చేయగలనని భయపడింది. ఇప్పుడు తనకు బలగం దొరికింది. బలం కలిగింది. ఈ బలంతో తాను ముందుకు సాగవచ్చు.

పావనిని సాగనంపడానికి వెంకడు, పెంటడు చాలదూరం వచ్చారు. వారిలో ఉత్సాహం తొణికిసలాడుతూంది.

బల్లెం పట్టుకున్న నర్సిమ్మ తాగి తూలుతూ వస్తున్నాడు. వీళ్ళను చూచాడు. నిలిచాడు.

"ఏయ్! ఎవఁడా అక్కడ?" మాట తడబడ్తాంది. కాళ్ళు వేళ్ళాడ్తున్నాయి.

"ఎవడంటున్నవా? నీ మొగడు" అన్నాడు పెంటడు. అంతా గొల్లుమని నవ్వారు.

"ఏమన్నరు? తిరుగుడు కొచ్చిన్రా! ఒరే, జర ఉషారుగ తిరుగుండి, దొంగలు పడ్తాన్రట. పోఁని ఇడిచి పెడ్తాన్న.

కాలిల ముల్లిరిగె
కానలేవా మల్లి"

అని పాడుకుంటూ వెళ్ళిపోయాడు.

# 10

గెలుపు మనిషితో గంతులు వేయిస్తుంది. ముందడుగు వేయడానికి ప్రోత్సహిస్తుంది. పావని ఈ మాత్రం గెలుపు లభిస్తుందని ఊహించలేదు. పల్లెకు వచ్చినప్పుడు ఆమెకు నిరాశ ఆవహించింది. ఆమె ఒక ఉద్దేశ్యంతో వచ్చింది. ఒక లక్ష్యసాధనకు వచ్చింది. పల్లెలో బడిపెట్టాలనీ, తద్వారా కొంత వెలుగు ప్రసరింప చేయాలనేదీ ఆమె ఆశయం. ఆమెను పంపించింది గవర్నమెంటే. అయినా పల్లెపరిస్థితిచూస్తే తాను ముందడుగు వేయలేను అనుకుంది. శివయ్య తనను అసలు నిలువనీయడు అనుకుంది. శివయ్య తనను నిలువనిచ్చాడు. ఇది తనకు గెలుపు. శివయ్యకు ఓటమి! ఆ ఊరి జనాన్ని చూస్తే నిరాశ కలిగింది. అంతా శివయ్య అడుగుజాడన నడిచేవాళ్ళు. అతను చావమంటే చచ్చేవాళ్ళు లేవమంటే లేచేవాళ్ళు. ఊళ్ళో అందరి ప్రాణాలూ శివయ్య గుప్పిట్లో ఉన్నాయి.

పావని నిరాశ చెందలేదు. నిరుత్సాహ పడలేదు. ప్రయత్నించి చూతామనుకుంది. బ్రహ్మయ్యను కదిలించింది. బ్రహ్మయ్యలో చైతన్యం చూచింది. చైతన్యం అందరిలోనూ ఉంటుంది. పరిస్థితుల ప్రభావం వల్ల దానికి మసి పడ్తుంది. ఆ మసి తుడవాలి అంతే. దీపశిఖ దానంతట అదే బయట పడుతుంది. దీపం తన వెలుగును దాచుకోదు. మరో దీపాన్ని వెలిగిస్తుంది, బ్రహ్మయ్య కొమరయ్యలో చైతన్యం రగిలించాడు. ఈ చైతన్య జ్వాల గూడెం దాకా పయనించింది. పెంటయ్య వెంకయ్య ధర్మయ్యలలో కాస్తదీప్తి కనిపించింది. చైతన్యం సాహసానికి దారితీస్తుంది. గూడెంలో జనం సాహసించారు పిల్లలను బడికి పంపడానికీ, రాత్రిళ్ళు వాళ్ళు చదువుకోవడానికీ అంగీకరించారు. కోటలోని మల్లమ్మకూ కొంత తెలివి వస్తాంది. శివయ్య అజేయుడు కాడని ఆమె గ్రహించింది. అంతేకాదు, తన అండన నిలిచేవారున్నారని గుర్తించింది. నిమ్మకాయలూ, రక్తపు కూడూ ఇంటి ముందు పోసింది. శివయ్యను గడగడలాడించింది. ఆనాటి ఆమె ఆనందాన్ని అక్షరీకరించడం అసాధ్యం! శివయ్య కూడా గడగడలాడ్తాడని నిరూపించింది.

అన్నింటినీ మించింది శాస్త్రిగారి పాత్ర. ముత్యాలును అంటుకున్ననాడే భయపడింది పావని. ఆనాటి ఉదంతం తరవాత పెదవి కదపలేదు శాస్త్రిగారు. శాస్త్రిగారి అంతరంగంలో ఏదో అనంతం అయిన మార్పు వస్తాంది. శివయ్యను

వారు చిన్నతనం నుంచి చూస్తున్నారు. దీవిస్తున్నారు, కీర్తిస్తున్నారు. శివయ్య శాస్త్రిగారికి దండాలు పెడ్తున్నాడు. దానాలు చేస్తున్నాడు. పావని బదిలీ విషయంలో అర్థించారు శాస్త్రిగారు. కాదుపొమ్మన్నాడు శివయ్య. శివయ్య నిజ స్వరూపం అనాడు గ్రహించారు శాస్త్రిగారు. శివయ్య రావణాసురుడని తేల్చుకున్నారు. పావని ఈ ఊరికి తేవడానికి ప్రయత్నం విరమింతాం అనుకున్నారు. అయినా పావని వచ్చేసింది. ఆ రావణుని ముందు పావని నిలువలేదనుకున్నారు. పావని బాల, అబల. రాక్షసుని తాకిడికి ఆమె తట్టుకోలేదనుకున్నారు. పావని గంగా ప్రవంతి అని వారికి తెలియదు. మెల్లగా పారినా మహా వృక్షాల్ని పెకిలించ గలదని వారు గ్రహించలేదు. అందుకే కాస్త భయపడ్డారు. ఆమెను అడ్డడానికి ప్రయత్నించారు. కాని, పావనికి చేదోడు వాదోడు లభించడం వారికి సంతృప్తి నిచ్చింది. వారిని పట్టుకున్న వ్యధల్లా పావని అంటరాని వారిని అంటుకుంటూందని. అందుకూ ఒక సమాధానం లభించింది శాస్త్రిగారికి. రావణుని సంహరించడానికి రాముడు కోతులనూ, ఎలుగ్గొడ్లను చేరదీశాడు. రాక్షసులను సంహరించడానికి నారాయణుడు అనేక అవతారాలు ఎత్తాడు. వామనుడయి బలిచక్రవర్తిని బిచ్చం అడిగాడు. రాక్షసులను సంహరించడానికి ఎలాంటి ఎత్తు ఎత్తినా తప్పు లేదని శాస్త్రాలు చెబుతున్నాయి. ఇంతకూ శివయ్య రాక్షసుడని గ్రహించారు శాస్త్రిగారు– చాల కాలం తరువాత, అదీ పావని వల్లనే. పావనికి కలుగుతున్న గెలుపు తమ గెలుపుగానే భావిస్తున్నారు. శాస్త్రిగారు సనాతనాచారాలు తొడుగును విప్పి, కొంత కాలం చిలక్కొయ్యకు తగిలించేశారు.

గ్రామ వాతావరణం కూడా కొంతలో కొంత మారింది. శివయ్య అజేయుడు కాడని జనం తేల్చుకున్నారు. పావని ఊళ్ళోకి రావడాన్ని సహించడనుకున్న శివయ్య సహిస్తున్నాడు. పావనితో లెక్కలు రాయించుకోవలసిన శివయ్య రాయించుకోవడం లేదు. జగన్నాథంతో రాయించుకుంటున్నాడు. పావని బడి పెట్టడాన్ని బలవంతాన్నయినా మాన్పించాల్సిన శివయ్య మిన్నకున్నాడు. మొన్నటి నిమ్మకాయల ఉదంతంతో పావని మీద గౌరవం మరీ పెరిగిపోయింది. పావని శివయ్యను ఎదిరిస్తూంది, గడగడలాడించింది. దాంతో ఆమె శక్తిస్వరూపిణి అయింది ఊరికి.

పావని పగటిపూట చింత చెట్టుకింద చదువు చెప్తూంది. ఇంటినుంచి కుర్చీ, చాపలు పట్టుకుని వచ్చేది. ఇప్పుడు వేళకు పెంటయ్య వస్తున్నాడు. కుర్చీ, చాపలు చెట్టుకిందవేసి, తన పనిమీద వెళ్ళిపోతున్నాడు. చింతచెట్టుకింద పావని కూర్చుంటే చాపలమీద నలుగురు, అయిదుగురుకంటే పిల్లలు ఉండడం లేదు. ఆ పిల్లలను చూస్తుంటే అనేక సమస్యలు ఎదురవుతున్నాయి. వాళ్ళకు బట్టలు ఉండడం లేదు. బరిబాత వస్తున్నారు. వాళ్ళను యూనిఫాంలో రమ్మని తాను అనలేదు. బ్రహ్మయ్యను పట్నం పంపింది. ఇక్కడి పరిస్థితి వివరంగా రాసి, ఆదుకొమ్మని తన మిత్రులకు రాసింది. వాళ్ళు కొన్ని పాతబట్టలు పంపించారు. ఆ బట్టలు తొడిగించిన్నాడు పిల్లల ముఖాల్లో ఆనందం చూస్తుంటే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"అమ్మా! ఈ అంగి శాన బాగుంది. నాకే ఇస్తరా, మల్ల గుంజుకుంటరా?" ముత్యాలు చొక్కా పట్టుకొని బేలగా అడుగుతుంటే పావని కడుపు చెరువు అయింది. పాత బట్టలకోసం పాకులాడే ఈ బాలురు భావిభారత పౌరులుమాత్రమే కాని, పాలకులు కాలేరు అనుకుంది.

"ముత్యాలూ! ఈ చొక్కా నీకే నమ్మా! నువ్వే ఉంచుకో. ఇంకా వస్తాయి ఇస్తా."

"అమ్మా! నేనిసువంటి అంగి ఎప్పుడు తొడుక్కోలే, శాన బాగున్నది. నేను ఉంచుకుంటా" – చొక్కాను ఎవరయినా లాక్కుపోతారేమో నన్నంత గట్టిగా పట్టుకుంది ఒక పాప.

ఈ పిల్లలు చదువుకోవడానికి వస్తున్నారంటే వీళ్ళ తలిదండ్రులకు బోలెడు నష్టం. వీళ్ళు ఇంటిదగ్గర ఉంటే పిల్లలను పట్టుకుంటారు. కట్టె, కంపా ఏరుకువస్తారు. ఒక్కొక్కసారి కూలికి పోయి, సోలెడు గింజలూ తెస్తారు. ఆర్థికంతో ముడిపడిలేని సమస్య కనిపించలేదు పావనికి. ఈ విషయం పాలకులకు ఎందుకు అర్థం కాదో తెలియలేదు. వాస్తవంగా ప్రభుత్వం ఈ పిల్లలకని కొంత డబ్బు ఇస్తూంది. ఇంత కాలంగా అది వారికి అందలేదు. వీరిపేర్లు రాసి అదీ శివయ్యే కాజేశాడు.

పిల్లలకు బట్టలు ఇచ్చినపుడు బాగానే ఉన్నాయి. బస్తీనుంచి అవి ఇస్త్రీరయి వచ్చాయి. రెండు రోజుల్లో అవి మురికి తోళ్ళు అయినాయి.

"సీతా! మీ అమ్మ బట్టలు ఉతకదా?" అడిగింది పావని.

"ఎట్ల ఉతుకతదండి? మా అవ్వ పనికి పోతది. పొద్దు కుంకినంక వస్తది."

"అట్ల కాదుండి. ఉతికెటందుకు నీళ్ళు యాడున్నయి? తాగెటందుకే దొరుకుత లేవు. ఊరి బాయికాడికి రానియ్యరు. ఎవరన్న చేదిపోస్తె తెచ్చుకోవాలె. బట్టలేమి ఉతుకుతముండి బాంచోల్లం" – వెంకడు అలా పోతూ పావని ప్రశ్నవిని సమాధానం చెప్పాడు. అతని నెత్తిన కంప ఉంది. శివయ్య పొలానికి కంచె వేయడానికి వెళుతున్నాడు.

ఎంత చిన్నచిన్నవి సమస్యలుగా పరిణమిస్తాయి. బట్టలు లేవంటే తెప్పించింది. వాస్తవంగా వాటిని ఉతకడం ఒక సమస్య. నీళ్ళు ఉండవు. స్వాతంత్ర్యం వచ్చి ముప్పైఏళ్ళయినా మనం వీళ్ళకు నీళ్ళు అందించలేకపోయాం. బట్టలు ఉతకడానికి నీళ్ళు మాత్రం ఉంటే సరిపోదు. సబ్బు కావాలి, సబ్బూ–నీళ్ళూకావాలి, ఉతకడానికి తీరిక కావాలి. ఉతుక్కోవాలనే ఉద్దేశం ఉండాలి. తిండికి లేనివాళ్ళు, పశువులుగా జీవిస్తున్నవాళ్ళు. బానిసలయి బతుకుతున్నవాళ్ళు వీళ్ళు. పాపం అనుకుంది పావని.

అలా అనుకొని ఊరుకో బుద్ధికాలేదు పావనికి. అదే ఆమెలోని ప్రత్యేకత–విశిష్టతా. బట్టలు ఇచ్చిన తరవాత బడికి వచ్చే పిల్లల సంఖ్య కొద్దిగా పెరిగింది. వారు వచ్చింది బట్టలకోసం – చదువు కోసం కాదు. ఆ విషయం తెలుసు ఆమెకు. అయినా సంతోషించింది. ఆ పేరుతోనైనా కొందరు చదువుకుంటారు. బాగానే ఉంది. కాని, ఈ మురికి కారుతున్న బట్టలూ, పిల్లలు ఆమె మనసులో సానుభూతిని ఏర్పరచుకున్నారు. వీరికి పారిశుధ్యం ప్రబోధించడం కాదు – ప్రత్యక్షంగా చూపించాలి.

పావని సబ్బులు సంపాదించాలనుకుంది. కొనడం ఆమె ఉద్దేశం కాదు. ఇచ్చే వారికి ఈ పిల్లల విషయంలో సానుభూతి కల్పించాలనుకుంది. ఆ ఊరిలో ఇవ్వగల వాళ్ళు ఇద్దరే ఉన్నారు. శివయ్య–జగన్నాథం. ఆమె శివయ్యను అర్థించదలచలేదు. తాను బడిపెట్టడమే కంటగింపుగా ఉంది, సబ్బులు ఇస్తాడా? జగన్నాథాన్ని అడిగి చూతామనుకుంది.

ఒకనాడు ఉదయం చింత కింది బడికి వెళ్ళేప్పుడు జగన్నాథం దుకాణానికి వెళ్ళింది. జగన్నాథం దుకాణంలో కూర్చున్నవాడు లేచి నుంచున్నాడు.

"అమ్మగారు తోవ తప్పినట్లున్నరు, ఈడికే వస్తున్రా?" ఇకిలించాడు జగన్నాథం.

"జగన్నాథంగారూ! మీ కోసమే వచ్చాను. మిమ్మల్ని దానం అడగడానికి వచ్చాను."

"ఉల్లి గడ్డలు అమ్ముకునెటోణ్ణి- దానధర్మాలు మాకేడ చాతనయితయిగని. వచ్చిన్రు గనక చెప్పండి, చాతనయితె ఇస్త."

"ఏంలేదు జగన్నాథంగారూ! బడికి వచ్చే పిల్లలున్నారు చూచారూ! పాపం వాళ్ళకు బట్టల్లేవండి."

"తెప్పించి ఇచ్చిన్రట కద పట్నం నుంచి-చెప్పుకుంటున్నరు ఊళ్ళ. ఇంటనే ఉన్న అమ్మగారూ! మీరెంత చెయ్యండి, ఆ లేకి ముండ కొడుకులు అంతే. సరెగాని, పెండ్లి చేసుకునెడిది ఉన్నదా లేదా? ఎందుకుండి వాళ్ళను పట్టుకొని మిడుకుతరు, మీరు బాపమ్మలు, కడగమంటే కాళ్ళు కడిగి నెత్తిన పోసుకుంటాం-వాళ్ళను బాగుచేసే పని పెట్టుకోకుండి, కాళ్ళు మొక్కుత."

పావని బాధపడింది. ఇక్కడికి రాకుండా ఉండాల్సింది అనుకుంది. అయినా తాను పని ఉండి వచ్చింది. ఊరికే పోవడం ఇష్టంలేదు.

"జగన్నాథంగారూ, పట్నంలో కొందరు దర్మాత్ములు వీళ్ళకోసం బట్టలు ఇచ్చారు. ఇచ్చినప్పుడు శుభ్రంగా ఉన్నాయి. ఇప్పుడు మురికి కారుతున్నాయి."

"వాండ్ల బతుకులే మురికి బతుకులు కాదుండి, సుబ్బరంగా ఉండమంటే ఉంటరా?"

"ఉండమంటే ఎవరూ ఉండరు. వాళ్ళను ఉంచాలి. మీ సంపాదన సొంతం వాళ్ళనుంచే వస్తూంది. వాళ్ళు మానేశారనుకోండి, మీ సంపాదన ఎలా ఉంటుంది? వాళ్ళల్లోనూ చీమూ, నెత్తురూ ఉన్నాయి. వాళ్ళలోనూ ఆవేశకావేషాలున్నాయి. వాళ్ళు ఎప్పుడూ ఇలాగే ఉంటారనుకోకండి. కాలం మారుతూంది. బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అయ్యేకాలం వస్తూంది. మీ వ్యాపారం నడవాలంటే వాళ్లను మంచి చేసుకోవడం అవసరం. కాదంటే, మరో సింగినాదాన్ని తెచ్చి పెట్టుకుంటారు. సరే వస్తా, మీ దగ్గరికి రావడమే తప్పయింది. మీరు మనుషులేమో, ఎక్కడన్నా పిసరంత మనసుందేమో అనుకున్నా!"

పావని ఆవేశం చూచి గడగడలాడేడు జగన్నాథం. పెరుగుతున్న పావని పలుకుబడి జగన్నాథానికి తెలుసు. అచ్చం శివయ్యను నమ్ముకుంటే చాలదు. పావని ప్రాపకం అవసరం అనుకున్నాడు.

"అయ్యో, అమ్మగారు అట్ల కోప్పడబట్టిరి. ఏదో తెలిసి తెలియని మాట అన్న. మీ అంతవారు మా ఇంటికి వచ్చినంక ఊరికె పంపితె పాపం తగులుతుంది. ఇంతకు ఎందుకొచ్చిన్రో చెప్పక పోతిరి- చెప్పండి ఏం కావలెనంటరో?"

"ఏం లేదులే, నీ దగ్గరికి రావడమే తప్పు. నాలుగు సబ్బులివ్వు - ఇవిగో డబ్బులు" అని సంచీలో చేయిపెట్టింది పావని.

"అగో, అట్లడుగుతే ఇవ్వకపోయినాను. మీరేమో కోప్పడ బడ్తిరి – ఇగ పట్టుర్రి, డబ్బులొద్దుగాని బాంచను, శివయ్యకు ఎరక కానియ్యకుండి" అని సబ్బులు అందించాడు జగన్నాథం.

పావని సబ్బులు అందుకుంది. జగన్నాథానికి డబ్బులివ్వలేదు. సాగిపోతుంటే అన్నాడు జగన్నాథం "వస్తుండుండి ఇట్లనే. కావలసింది పట్టుకు పోతుండండి. కోపం మాత్రం పెట్టుకోకుండి."

పావని సబ్బులు సంచీలో వేసుకుని బయలుదేరింది. ఆమెకు నవ్వు వస్తూంది జగన్నాథాన్ని తల్చుకుంటే. మెల్లగా అడుగుతే ఇవ్వలేదు. బెదిరిస్తే దోవకు వచ్చాడు. మనిషి తత్వమే అంతేమో! ఉన్నది ఎవడు వదులుకుంటాడు? లాక్కోవాలి అంతే! తాను బెదిరించిన తీరుచూస్తే ఆమెకే ఆశ్చర్యం అనిపించింది. ఉద్యమం అన్నింటినీ నేర్పుతుంది అనుకుంది. మొన్న శివయ్య ఇంటి ముందరి వృత్తాంతం గుర్తుకు వచ్చింది. తనకు మంత్రాలమీద నమ్మకం లేదు. ఉన్నవారికి పోగొట్టడానికే తానలా చేసింది. శివయ్య తనను శక్తి అవతారం అనుకున్నాడు. అతనికి ఉన్న నమ్మకంతోనే అతన్ని పడగొట్టాలి.

పావని చింతకిందికి చేరే సరికి పిల్లలంతా లేచి నుంచుని నమస్కరించారు. వాళ్ళలో ఆ మాత్రం క్రమశిక్షణ వచ్చినందుకు ఆమె ఉప్పొంగింది. పిల్లలతో ప్రార్థన చేయించింది.

"మీ బట్టలు ఎలా ఉన్నాయో చూసుకోండి."

"బాగున్నాయి గద" – ముత్యాలు అన్నది.

"బాగున్నాయా? మురికిగా లేవూ?"

"ఎప్పుడు ఇట్లనే ఉంటయి."

"ఎప్పుడయినా మీరు బడికి వెళ్ళారా?"

"లేదు."

"మీ కెవరయినా బట్టలిచ్చారా?"

"లేదు."

"ఎప్పుడూ జరగనివి ఇప్పుడు జరగాలి."

"ఎట్లనంటరు?"

"మీరు బట్టలు ఉతుక్కోవాలి. స్నానం చేయాలి."

పిల్లలంతా ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. మాట్లాడలేదు.

"మాట్లాడరేం?"

"మీరు చెప్పేడిది మాకేమి తెలుస్తలేదు. బట్టలు ఎట్ల ఉతుక్కుంటం– తానాలు ఎట్ల చేస్తం? ఏమి ఎరకయిత లేదు."

"నీలు. నీలేయి. నీలు. మా అవ్వ నీలకోసం బాయికి పోయింది. నీలు పోసెటోండ్లు పోయ్యలే. బాయిమీద కుండ పెట్టిందని పగలు కొట్టిర్రు. కుండ పోయింది. నీలులేవు" – లింగయ్య అది చెప్పకుని ఏడుపుకు లంకించుకున్నాడు.

పావని దగ్గరికి తీసుకుని ఓదార్చింది. కాని, కుండెడు నీళ్ళకోసం కుమిలిపోయే జనాన్ని చూచి ఆమె మనసు క్షోభించింది. బడిపిల్లలందరినీ తీసుకొని ఊరి బావికి

వెళ్దామనుకుంది. వీళ్ళతో నీళ్ళు తోడించి ఊరివాళ్ళకు బుద్ధి చెబుదా మనుకుంది. ఊరివాళ్ళంతా చూచి ఏడవాలి. ఈ బావి గూడానికే అంకితం అయిపోవాలి అన్నంత ఆవేశం వచ్చింది. అవును. అంతే, ఊరి బావి హరిజన బావి కావాలి. ఆ ఊరికి బావి లేకుండా పోవాలి. అంతే. అదే ఉపాయం. ఎంత బావుంటుంది! బాగానే ఉంటుంది. బావుంటుంది. గూడెపువారు నీళ్ళు తోడుకు పోతుంటారు. ఊరివాళ్ళు ఏడుస్తుంటారు–ఏడవనీ.

సమస్యలు ఇంత తేలిగ్గా పరిష్కారం అవుతే ఎంత బావుండును! అవి కావు. మరికొన్ని సమస్యలను మోసుకుని వస్తాయి. కలహాలు రేగుతాయి. కక్షలు పెరుగుతాయి. శివయ్య బావి పూడబోయిస్తాడు కాని గూడేనికి బావి దక్కనీడు. గూడెం జనం బావి కోసం పోట్లాడలేరు. వారు శివయ్య చేతిలో నలిగే చీమలు. చీమలు ఏకమయిన్నాడు పాముని చంపగలవు. చీమలు ఏకం కావాలి. కావాలి చీమలు ఏకం. ఇంకా కాలేదు. ముందు కావాలి.

పావని తల పట్టుకుని కూర్చుంది. ఆమె రక్తం వేడెక్కుతూంది. పొగలు సెగలు కక్కుతూంది. మెదడు వేడెక్కుతూంది. ఆలోచనతో ఆవేశాన్ని జయించాలి. అందుకు ఆమె మధన పడుతోంది.

"అమ్మా! మీరెట్లనో ఉన్నారు" – ముత్యాలు భయం భయంగా అడిగింది.

"ముత్యాలూ! మనకు నీళ్ళు కావాలి, మనం బట్టలు ఉతుక్కోవాలి, స్నానాలు చేయాలి. ఇదిగో, సబ్బులు తెచ్చా" – తీసి చూపించింది పావని. ఆవేశం కొంత తగ్గింది. ప్రసన్నంగా ఉండడానికి ప్రయత్నిస్తూ అన్నది.

"సబ్బు తెచ్చిన్రా! మా కోసమా? మా కోసమా?" అందరూ ఒకేసారి ఆశ్చర్యంగా అడిగారు.

"అవును. సబ్బు తెచ్చాను. మీ కోసమే. స్నానాలు చేయాలి. బట్టలు ఉతకాలి."

"అయితే ఏటికి పోదాం" – ముత్యాలు గుండె గంతులు వేస్తున్నట్లు అన్నది

పావనికి ఏటి విషయం తోచనేలేదు

"ముత్యాలూ! ఎంత మంచి దానివి. నాకు ఏటి విషయం తోచనేలేదు పదండి, ఏటికి పోదాం" అన్నది, ఏదో అత్యంత జటిలం అయిన సమస్యకు పరిష్కారం లభించినట్లు.

"పదండి ఏటికి–పోదాం–పోదాం" అన్నారు పిల్లలంతా.

పిల్లలను తీసుకొని పావని ఏటికి బయలుదేరింది. పిల్లల కోడిలా ఉంది పావని. ఆమె వెంట పిల్లలు తల్లి వెంటలా సాగిపోతున్నారు. ఆమె వారికి కథలు చెబుతూంది. కబుర్లు చెబుతూంది. పిల్లలంతా ఉత్సాహంగా సాగిపోతున్నారు. చాలు, ఈ పిల్లల్లో బాల సహజం అయిన ఉత్సాహం అంకురించింది. వీరు కొడిగట్టిన దీపాల్లా లేరు. అప్పుడే అంటుకుని వెలగబోతున్న దీపాల్లా ఉన్నారు.

ఆ ఊరు చీకటి గ్రామం. ఊరికి మూడువైపులా కొండలున్నాయి. అవి బోడిగుట్టలు కావు. చెట్టూ చేమా పెరిగిన కొండలు. పచ్చగా ప్రకృతి రామణీయకంగా ఉంటాయి. కొండల మీద గువ్వల చప్పుళ్ళు, చిలకల అరుపులు, కోకిలల గానాలు రమ్యంగా ఉంటాయి. కొండల్లో ఎలుగుబంట్లు, అడవి పందుల్లాంటి

జంతువులు ఉంటాయి. కాని, క్రూరమృగాలు లేవు. క్రూరమృగం ఊళ్ళో ఉంది. అది మనిషి నెత్తురు మరిగింది.

ఊరికి నాలుగోవైపు నుంచి ఏరు పారుతుంది. అది జీవనది కాదు అయినా, ఎండాకాలంలో ఒక పాయ పారుతుంటుంది. అయితే, ఇది ఊరికి దూరంగా ఉంది. ఏటినీరు వాడుకునేవారు తక్కువ. ఈ ఊరికి చేరుకోవాలంటే ఏరు దాటాలి. అందుకే ఈ ఊరికే రహదారులు లేవు. రహదారులు లేకుండా ఉండాలని శివయ్య సంకల్పన. రహదారి వేస్తే బస్సులొస్తాయి. బస్సులు నాగరికత మోసుకు వస్తాయి. తెలివి తేటలు తెస్తాయి. అవి వస్తే తన పని సున్నా. అతడు నాగరికతకు అడ్డు కట్ట కట్టాడు. విజ్ఞానానికి అడ్డుగోడ నిర్మించాడు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందనే విషయం ఆ ఊళ్ళో చాలా మందికి తెలియదు. అక్కడ బస్సును చూడని వాళ్ళు చాలా మంది ఉన్నారు. అక్కడికి పోస్టూ రాదు. కరెంటు లేదు. ఇంకా వేదకాలపు సనాతన నాగరికతను పట్టుకుని పాకులాడు తూంది ఆ ఊరు. అలాంటి ఊరు ఉంటుందా అని ఆశ్చర్యపడవచ్చు కొందరు. కాని, అలాంటి ఊళ్ళే అనేకం ఉన్నాయి ఈ భారతదేశంలో. భారతీయ తత్వశాస్త్రాన్ని గురించి బాకాలు ఊదేవారికి ఈ బడుగు గ్రామాలు తెలియవు. వారికి పుష్పకం తెలుసు. ఆనాడే విమానాలున్నాయని వీపు చరుచుకుంటారు. వారికి అప్పు తీర్చడానికి ఆలిని అమ్ముకున్న హరిశ్చంద్రుడు కనిపించాడు. కూటికి లేక కొడుకును బలి ఇవ్వడానికి అమ్ముకున్న రుచీకుడు కనిపించాడు.

ఆ ఊళ్ళో పొలాలున్నాయి. పొలాలకు పారడానికి చెరువు ఉంది. కాని హరిజనులు చెరువును తాకరాదు. నీరు మైల పడ్తుంది. ఆ ఊళ్ళో కొన్ని ఇళ్ళలో బావులున్నాయి. ఒక ఊరి బావి కూడా ఉంది. ఊరి బావి ఉమ్మడి బావి. గూడెం ఊళ్ళో భాగం కాదు. అందుకోసం దాన్ని అంటరాదు. ఊరికి ఒక పక్కన ఏరుంది. ఏటి నీళ్ళు "మైల" పడవు. పారే నీటికి పవిత్రత ఉంది. ఏటి నీటిని వాడుకో రాదని ఎవరూ అనలేదు. ఎంచేతంటే, అది వారికి అందుబాటులో లేదు. ఏటి నీటికి అంటులేదు. అందుకే పావని అక్కడికి బయలుదేరింది.

ఏటిగట్టున చెట్లున్నాయి. చెట్లు గుబురుగా ఉన్నాయి. పచ్చగా ఉన్నాయి. పరువంలో ఉన్నాయి. చెట్లమీద పిట్టలు రకరకాల అరుపులు అరుస్తున్నాయి. ఏరు ఎండిపోయింది. ఇసుక బయట పడింది. ఇసుక మీద చెట్ల బాపతు పూలు రాలి ఉన్నాయి.

పావని, పిల్లలు గట్లు దాటారు. చెట్లు దాటారు. ఇసుక మీదికి వచ్చారు. ఇసుక మీది పూలుచూచి వారిలో ఆనందం పురి విప్పింది. పూలు ఏరారు. బొడ్డు మల్లెపూవు కాడతెంపి బూరలా ఊదారు. పిల్లలు పసితనపు చేష్టల్తో పరుగులు తీస్తున్నారు. వారిని పట్టడం పావనికి కష్టం అయింది. ఉరికే వారి వెంట ఉరికింది. నవ్వేవారితో నవ్వింది. అందరినీ ఒకచోట కూర్చోబెట్టింది. తెల్లని ఇసుక, చిక్కని చల్లని నీడ, ఎంతో ఆనందం అనిపించింది. జీవితంలో ఒక కొత్త వసంతం చేరినట్లుంది. కొంతసేపు వారికి కాకి కథలు చెప్పింది.

అక్కణ్నుంచి వారు నీళ్ళ వైపు సాగారు. ఒకే నీటిపాయ ఏటి మధ్య నుంచి పారుతూంది. అది పాములా వంకరలు తిరిగి పోతూంది. నంగనాచిలా

పారుతూంది ఏరు. నీరు చూడగానే ఉవ్వెత్తుగా పరిగెత్తారు పిల్లలు. నీళ్ళలో గెంతారు. నీళ్ళు తాగారు. ఒకరిమీద ఒకరు ఊసుకున్నారు. పోట్లాడుకున్నారు. కుస్తీ పట్లు పట్టుకున్నారు. పావనికి వాళ్ళను వారించడం కష్టం అయిపోయింది.

పావని అందరినీ ఒకచోట చేర్చింది. బట్టలు విడిపించింది. అంతా దిసమొలతో ఉన్నారు. దిగంబరంగా ఉన్నారు. వారిబట్టలు తడిపించింది. బండ మీదకి తెచ్చింది. బట్టలకు సబ్బు రాస్తుంటే నురగ వస్తూంది. అది పిల్లలకు ఆశ్చర్యంగా ఉంది. నురగతో ఆడుకున్నారు. నురగ ముఖాలకు రుద్దుకున్నారు. నురగ ఒకరిమీద ఒకరు విసరుకున్నారు. బట్టలు శుభ్రంగా అయినాయి. పిండి ఆరేసుకున్నారు. తెల్లని ఇసుక మీద రంగు రంగుల బట్టలు – అనేక దేశాల పతాకాల్లా రెపరెపలాడుతున్నాయి.

పిల్లలు స్నానాలకి నదిలోకి వెళ్ళారు. వారందరికీ సబ్బు రాసింది. ఎన్నాళ్ళ మురికో! మురికి చేరడం తేలిక. వదిలించడం కష్టం. పిల్లలందరికీ స్నానాలు చేయించింది. వారంతా తడిసిన ముత్యాల్లా ఉన్నారు. ఇసుక మీద ఎండలో నుంచున్నారు. తడి శరీరాలు ఎండకు మెరిసిపోతున్నాయి. వాళ్ళ వళ్లు తుడవడానికి తువాళ్ళు లేవు.

పావని తనను చూచుకుంది. చీర సొంతం తడిసి పోయింది. తను అలసి పోయింది. ముఖం నిండా చెమట పట్టింది. ఉప్పు పేరింది. స్నానం చేస్తే బావుండును అనిపించింది. కాని, తనకు బట్టల్లేవు. ఎలా స్నానం చేస్తుంది? పిల్లల బట్టలు ఆరాలి. ఆరేదాకా పిల్లలు ఇసుక మీదనే ఉంటారు. వాళ్ళు గుజ్జనగూళ్ళు కట్టుకుంటున్నారు. కట్టిన గూళ్ళు కూల్చుకుంటున్నారు.

పావని చీరె విప్పింది. పరికిణీ, బ్లౌజుతో నీళ్ళలోకి దిగింది. బండ మీద చీర ఉతికింది. ఇసుకలోకి వచ్చింది. ఇసుక మీద చీర ఆరేసింది. చీర మీద ఇసుక చల్లింది, గాలికి లేవకుండా.

పావని చుట్టూ చూసింది. నరసంచారం లేదు. నిర్జనంగా ఉంది ప్రదేశం. ఏరు దాటే రేవు చాలా దూరంగా ఉంది. అటు ఎవరూ రారని నిశ్చయించుకుంది. కాస్త దూరం నడిచింది. ఎత్తుగా ఒక బండ కనిపించింది. ఏటిపాయ బండను ఆనుకొని ఒదిగి పారుతూంది. పాయకు అడ్డం కొన్ని రాళ్ళున్నాయి. అక్కడ కాస్త లోతుగా ఉంది. అడ్డుకున్న రాతిమీంచి పడుతున్న నీరు పిల్ల జలపాతంలా ఉంది. రొదపెడ్తూ, సుళ్ళు తిరుగుతూ సాగిపోతున్న నీరు కొంత దవ్వువెళ్ళి ప్రశాంతంగా సాగిపోతూంది.

పావని ప్రవాహపు వయారాన్ని చూస్తూ కూచుంది. ప్రవాహానికీ, జీవితానికీ దగ్గిర సామ్యం ఉంది. రెండూ అడ్డు లేనంత కాలం ప్రశాంతంగా ప్రవహిస్తాయి. అడ్డు తగులుతే జలపాతాలు సృష్టిస్తాయి!

వాతావరణం అందంగా ఉంది. పచ్చని చెట్లు, ఎర్రని పూలు, పిట్టల కిచకిచలు, ఏటి గలగలలు, నల్లని రాళ్ళు, తెల్లని ఇసుక చిత్రకారుని తూలికతో గీసిన చిత్రంలా ఉంది.

పావని పరవశించింది. జాకెట్టు విప్పింది. నీళ్ళలో దూకింది. నీళ్ళలో కూచుని చేతులు చాచి, కాళ్ళు ఆడించి, స్నానం చేసింది, అలా చాలాసేపు

కూర్చుంది. ఆమెకు ఆనందంగా ఉంది, ఆహ్లాదంగా ఉంది, తన్మయంగా ఉంది. పొద్దు వాలుతుండడం సహితం గమనించలేదు.

"అమ్మా! పోదామా?" ముత్యాలు మాటవిని లోకంలోకి వచ్చింది. చుట్టూ చూచింది, తనను ఎవరూ చూడ్డంలేదు గదా అని. ఏటికి దిగువన, అల్లంత దూరంలో పశువులు నీళ్ళు తాగుతున్నాయి. పశువుల కాపరి పెంటడు పశువులవెంట ఉన్నాడు. పావని అతన్ని చూచింది. అతడు తనను చూడలేదు గదా! ఎందుకో ఆమెకు సిగ్గు ముంచుకు వచ్చింది. ముఖం సాంతం ఎర్రపడింది. చప్పున లేచి ఉరికింది. బ్లౌజు అందుకుంది, వేసుకుంది. ఉరికి చీర కట్టుకుంది.

పొద్దు వాలిపోతూంది. పిల్లలందరికీ బట్టలు వేసింది. బయలుదేరడానికి అంతా తయారయ్యారు. అటు పెంటని వైపు చూచింది. పెంటడు పశువులను కడగడంలో నిమగ్నుడయి ఉన్నాడు. ఇటు చూచినట్లే లేదు. అయినా, ఆమె కెందుకో గుండె దడదడలాడింది.

పిల్లలంతా తయారయినారు బయలుదేరుతున్నారు. నీళ్ళు త్రాగి వస్తానని ముత్యాలు ఉరికింది. పావని వారిస్తున్నా ఉరికింది ముత్యాలు. ముత్యాలు నీళ్ళు తాగడానికి పోయినచోట గుండం ఉంది. అక్కడ ఏరు చాల లోతుంటుంది. అటు ఎవరూ వెళ్ళరు. ముత్యాలు నీళ్ళు తాగుతూ కాలుజారి గుండంలో పడిపోయింది. మునుగుతూంది, తేలుతూంది. పావని ఒక్క కేకపెట్టింది. గుండంలోకి దూకింది. పావనికి ఈతరాదు. ముత్యాలు చేయి అయితే పట్టుకుంది కాని, మునుగుతూంది, తేలుతూంది. బయట ఉన్న పిల్లలంతా కేకలు పెట్టారు. పశువులను కడుగుతున్న పెంటయ్య విన్నాడు. ఉరికివచ్చాడు. చూస్తే పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. తేలినప్పుడు చేయిఎత్తి ఏదో చెప్పబోతూంది పావని. పెంటయ్య గుండంలో దూకాడు. చూస్తుండగానే ముత్యాలును ఒక భుజం మీదా, పావనిని మరొక భుజం మీదా వేసుకుని బయటికి వచ్చాడు.

పావని ఇసుకమీద కూలబడింది. పూర్తిగా తడిసిపోయింది. నీరు కారుతూంది, పెంటయ్య చూస్తున్నాడని సిగ్గు ముంచుకు వస్తూంది. కాళ్ళకు చేతులు చుట్టి వళ్ళంతా దాచుకుంటూంది. వణికిపోతూంది.

"ఇయ్యాళ మా అమ్మకు గండం గడిచింది. ఎందుకొచ్చినవమ్మా ఇటు! నువ్వేదో దారిచూపుత వనుకున్నాం. నువ్వు లేకుంటే మా గతేంకావాలె తల్లీ! ఇసువంటి పనులు తలపెట్టకమ్మా!"

"అమ్మా! తల్లీ!" పెంటయ్య సంబోధన విన్నది పావని. తలెత్తి పెంటయ్యను చూచింది. తల్లిముందు నుంచున్న బిడ్డలా ఉన్నాడు. తల్లికి వచ్చిన ఆపదను గురించి తల్లడిల్లి పోతున్నాడు. అవును. తాను తల్లి, వీళ్ళంతా తన బిడ్డలు; సిగ్గెందుకు? అసలు తనకెందుకు సిగ్గు ముంచుకు వచ్చింది? బిడ్డముందు తల్లికేం సిగ్గు? అవును – తాను తల్లి, తల్లే తాను!

పావని లేచి నుంచుంది. వళ్ళంతా తడిసింది. తడిసిన చీర వంటికి అంటుకుపోయింది. పెంటయ్య తనను చూస్తున్నాడు. పెంటయ్య చూపులో ప్రసన్నత ఉంది. చూపులు స్వచ్ఛంగా ఉన్నాయి. నిర్మలంగా ఉన్నాయి.

పావని నిటారుగా నుంచుంది.

"అమ్మా! బట్టలన్నీ తడిసిపోయినయి. ఏమి ఇద్దు? నా తాన పై పంచ కూడా లేదు" – నిర్వేదం కనబరచాడు. నిస్సహాయత వ్యక్తపరచాడు.

"ఫరవాలేదు ఇలాగే వెళ్తా. ఇంటికి వెళ్ళే వరకు ఆరిపోతుంది. పిల్లల బట్టలు ఉతకడానికి వచ్చా."

"ఎంత దయగల తల్లివమ్మా! మురికి నిండిన పిల్లలను ముత్యాలవలె చేసినవ్. అమ్మా, నీ రుణం ఎట్ల తీర్చుకుంటం?"

"పెంటయ్యా! అటుచూడు అవు ఏదో మందబాసి ఉరుకుతూంది."

పెంటయ్య అటు చూచాడు దొంగ ఆవు ఉరుకుతూంది. కేకలు పెడ్తూ అటు పరిగెత్తాడు పెంటయ్య.

పావని ఇంటికి చేరేవరకు సాయంకాలం అయింది. శాస్త్రిగారు కాలుకాలిన పిల్లిలా ఇంట్లోకీ బయటికీ తిరుగుతున్నారు. పావనిని చూచి ప్రాణం లేచి వచ్చింది. "ఎటు పోయావమ్మా! ఇంత సేపు!!" ధ్వనిలో కోపం లేదు. ఉద్వేగం ఉంది.

"చెపుతా నాన్నా!" పావని లోనికి వెళ్ళింది. బట్టలు–మార్చుకుంది, తల ఆరబెట్టుకుంది. లాంతరు వెలిగించి తెచ్చి, స్టూలు మీద పెట్టింది.

శాస్త్రిగారు మంచంలో కూర్చుని ఉన్నారు. పావని పక్కన కూర్చుంది. జరిగింది సాంతం పూసగుచ్చినట్టు చెప్పింది.

శాస్త్రిగారు క్షణం మౌనం వహించారు.

పావని గుండె గుబగుబలాడుతూంది.

"అమ్మా!" శాస్త్రిగారు మౌనాన్ని చీల్చారు. "మేము అద్వైతాన్ని అధ్యయనం చేసినామమ్మా! అమ్మా పావనీ! నువ్వు అద్వైతాన్ని ఆచరిస్తున్నావమ్మా!"

పావని ఉక్కిరి బిక్కిరి అయింది. ఆమె హృదయం పొంగింది. "నాన్నా!" అని బుజంమీద వాలిపోయింది.

"అవునమ్మా!" శాస్త్రిగారు కళ్ళు తుడుచుకున్నారు. "శంకర భగవత్పాదులు పిపీలికాది బ్రహ్మాండం సాంతం బ్రహ్మమయం అన్నారు. వారికి బ్రాహ్మణులు చండాలురు సమానమేనమ్మా! శంకరుల వారు చండాలాష్టకం రచించారు. అమ్మా! మేం చదువుకున్నాం. నీవు ఆచరిస్తున్నావు" తలమీద చేయివేసి నిమురుతూ అన్నారు శాస్త్రులవారు. వారిలో పుత్రికావాత్సల్యం పొంగింది. గొంతు గద్గదం అయింది.

"నాన్నా ఏడుస్తున్నావా?" కన్నీరు తుడిచింది పావని.

"అవునమ్మా! మీ అమ్మ ఉంటే..." శాస్త్రిగారి దుఃఖం కట్టలు తెంచుకుంది.

"నాన్నా! నేనే నీకు అమ్మను. నాన్నా! నేను అమ్మను కానా? నేను నీకేకాదు – ఈ ఊరంతటికీ అమ్మను. అవున్నాన్నా, నిజం. పెంటయ్య చెప్పాడు – నేను అందరికీ తల్లిని నాన్నా! అవును, నేను తల్లినే!"

"అవునమ్మా! నువ్వు తల్లివేనమ్మా! ఈ ఊరికే కాదు – మంచితనానికే తల్లివమ్మా!"

"నాన్నా! అమ్మ ఉంటే....!" పావనికి దుఃఖం ముంచుకు వచ్చింది.

# 11

శివయ్య గొంతులో కరకక్కాయ పడింది. మింగాలేడు. కక్కాలేడు. పావని ఊళ్ళో ప్రవేశించడంతో అతని పట్టు విడిపోతూంది. తన కాళ్ళకాడ పడి ఉండే జనం చదువుకుంటున్నారు. తెలివి మీరుతున్నారు. తాను అడ్డలేకపోతున్నాడు. ఆపలేక పోతున్నాడు. ఊళ్ళో బడిపెట్టకుండా ఇంతకాలం ఆపగలిగాడు. ఇహ ఆపలేక పోతున్నాడు. పంతులు తనకు లెక్కలు రాసేవాడు. ఇప్పుడు ఆ సౌకర్యం లేదు. జగన్నాథం లెక్కలు రాస్తున్నాడు. కాని, అయిష్టంగా రాస్తున్నాడు. ప్రత్యక్షంగా కాకున్నా పరోక్షంగా నయినా తాను రాయలేనని చెపుతున్నాడు. అతడు వేళకు రావడం లేదు. వచ్చినా మనసుంచి పని చేయడం లేదు. ఇవ్వాళ కాకుంటే రేపయినా రాసినందుకు డబ్బు అడిగేటట్లున్నాడు!

శాస్త్రిగారు తనను ముఖస్తుతి చేసి జీవించేవాడు. తను చెప్పిందే శాస్త్రంలో ఉందని చెప్పేవాడు. శాస్త్రి కూడా మారిపోతున్నాడు. పావని అంటరాని వారిని అంటుకున్నా మాట్లాడ్డం లేదు. పైగా, ఆమె చేస్తున్న ప్రతిపనికీ మౌనంగా ఊరుకుంటున్నాడు.

బ్రహ్మయ్య తాను గద్దిస్తే కదిలేవాడు కాడు. పనిముట్లు ఇవ్వనంటే కాళ్ళు పట్టుకునేంత పనిచేసేవాడు. వాడు పావనికి తోడయినాడు. అగ్నికి తోడయిన వాయువులా తయారయినాడు. వాణ్ణి లొంగదీయాలనుకొన్నాడు. తాను. పనిముట్లు ఇవ్వనన్నాడు. అప్పు ఇవ్వడం బంద్ చేశాడు బ్రహ్మయ్య భార్యకు జబ్బుగా ఉంది. బెదిరిస్తే లొంగి వస్తాడనుకున్నాడు. అయినా, బ్రహ్మయ్య తనను లెక్కచేయడం లేదు. పనిముట్లకుగాని, అప్పుకుగాని రావడంలేదు పైగా, బడి పెట్టడానికి పావనికి సాయం చేస్తున్నాడు.

కొమరయ్య పరిస్థితి చూస్తే ఆశ్చర్యం అనిపించింది శివయ్యకు.

“దొరా! తాగని సారకు లెక్క రాసుకోటం న్యాయం కాదుండి. మీరు ఏమన్న అనుకోండి – తాగినోనికి తాగినంత రాసుకోండి. నిన్న నేను తాగలే – నా లెక్క రాసుకోవద్దు” అన్నాడు నిర్భయంగా. చెప్పుతో కొడితె చెప్పు తెచ్చి తన కాళ్ళ దగ్గర పెట్టిన కొమరయ్య అంత గట్టిగా అంటుంటే ఆశ్చర్యపడ్డాడు శివయ్య. అతనికి కోపం మండాల్సింది. కొమరయ్యను చావబాదాల్సింది. శివయ్య అలా చేయలేదు. ఏదో అతని శక్తి సొంతం జారిపోతున్నట్లుంది. కొమరయ్యకు సారె ఇవ్వడం మానేద్దాం అనుకున్నాడు. పెట్టే అప్పు నిలిపేద్దాం అనుకున్నాడు. కాని, అలా చేయడం వల్ల కొమరయ్య లొంగి రాలేదు. కొమరయ్యకు ఇదివరకే డబ్బు పెట్టాడు. కుండలన్నీ పచ్చిగా ఉన్నాయి. వాముకాలితే గాని కొంత డబ్బురాదు. ఎంత ఆలోచించినా చేయగలిగింది ఏమీ కనిపించలేదు. కొమరయ్య డిమాండుకు లొంగాల్సి వచ్చింది. తాగిన వాని పేరనే కాతాలో రాసుకోవడానికి అంగీకరించక తప్పలేదు. దాంతో శివయ్యకు బోలెడు నష్టం వస్తూంది. సారాయి కంట్రాక్టులో సర్కారు డబ్బు సైతం గిట్టుబాటు అయ్యేట్లు కనిపించడం లేదు.

పెంటడు పశువుల కాపరి – వెంకడు పొలం మీది బానిస – వీళ్ళు కూడా తెలివి మీరుతున్నారు.

శివయ్య కింద రకరకాల బానిసలున్నారు. అందరూ అతని గుప్పిట్లో గిలగిలా తన్నుకుంటున్నవారు. మొదటి రకం బానిసలు చేతిపనులు చేసుకునేవారు. వారికి పనిముట్లకు అప్పులు పెడ్తాడు. చేతి పనులవారు తాము సంపాదించింది శివయ్యకు అప్పగించాలి. అతను ఇచ్చింది మళ్ళీ అప్పుగా తీసుకోవాలి. బ్రహ్మయ్య. కొమురయ్య అలాంటివారు.

మల్లమ్మ మరో రకం బానిస. ఆమె భర్త అప్పుచేసి పారిపోగా బదులుగా వచ్చిన బానిస ఆమె. ఆమెకు జీతం లేదు. ఆమెకు రోజూ గింజలు ముట్టవు. పులిసిందీ పాసిందీ ఆమె ముఖాన కొడ్తారు. రేయింబవళ్ళు గానుగ ఎద్దుకంటే కూడా హీనంగా చాకిరీ చేస్తుంటుంది.

వెంకడు పుట్టుబానిస. అంటే, అతని తండ్రి చేసిన అప్పుకు తాను బానిస అయినాడు. తల్లి దినవారాలకు చేసిన అప్పుకు తనకు పుట్టబోయే బిడ్డలను బానిసలను చేశాడు. వెంకడికి జీతం లేదు. అతని తండ్రి చేసిన అప్పు, తను చేసిన అప్పు తీరదు. వెంకడు చేసిన చాకిరికి ఇచ్చే ప్రతిఫలం వడ్డీకింద పోతుంది. వెంకడికి దినభత్యం కింద గింజలు ఇస్తాడు. శివయ్య. వెచ్చాలకుగాను జగన్నాథం దుకాణానికి చీటి ఇస్తాడు. ఈ దినభత్యం అప్పులో చేరుతుంది. ఇదొక విషవలయం.

పెంటడు పుట్టుబానిస కాడు. పెంటడి తండ్రి చనిపోయాడు. దినవారాలకు అప్పుపెట్టి పెంటడిని బానిసగా కొనుక్కున్నాడు శివయ్య. పెంటయ్య వేతనం వగైరాల ఏర్పాటు వెంకడిలాంటిదే.

ఒకనాడు పెంటడు, వెంకడు కలిసి వచ్చారు. "దొరా! జగన్నాథం ముంచుతాండు. చీటికి సరింగ సరుకులు ఇస్తలేడు. పైకమే ఇప్పించుండి బాంచను, బతుకుతం" అన్నారు.

శివయ్య మండిపడ్డాడు. వాళ్ళను తిట్టాడు. చీటికాకుంటే డబ్బు ఇవ్వనన్నాడు. కారాలు మిరియాలు నూరాడు.

"ఇచ్చెడిది అప్పే కాదుండి, ఎట్ల ఇస్తే ఏమైతదుండి? జగన్నాథం ముంచుతాండు. ఇయ్యకుంటే వట్టి బువ్వ తిని బతుకుతాం, వద్దులేండి" అని వెళ్ళిపోయారు. శివయ్య నివ్వెరపోయాడు. ఎంత పొగరు వీళ్ళకు? తనను ధిక్కరించి వెళ్ళిపోయారు అనుకున్నాడు. అటు తరవాత తెలిసిందేమంటే – జగన్నాథం వేరే అప్పులు పెడ్తున్నాడని. "అరే పెంటడూ! పైకమే ఇస్త తీసుకపొండి" అన్నాడు.

ఈ విధంగా ఒక్కొక్కరూ చేయిజారి పోతున్నారు, తన అధికారాలకీ దర్పానికీ ఎక్కడో చిల్లిపడింది, అది కారిపోతూంది, ఆ చిల్లిని మూయడం ఎలా?

పావని శివయ్యకు దయ్యంలా కనిపిస్తూంది. ఆమెను తాను ఏమీ చేయలేక పోతున్నాడు. శాస్త్రిగారికి మంత్రాలు వచ్చు, పావని కూడా ఏదో శక్తిలా ఉంది. అదీకాక ఆమె గవర్నమెంటు ఉద్యోగి. ఆమె చదువుకున్నది. లోకం తెలిసింది తన దగ్గర చాల లోపాలున్నాయి. మొదటిది – తన దగ్గర అప్పులిచ్చే లైసెన్సు లేదు. అప్పులు చెల్లించలేదని కోర్టుకు వెళ్ళడానికి వీలు లేదు. లైసెన్సు లేదనే విషయం పావనికి తెలిస్తే ప్రమాదం. అంతేకాదు, హరిజన బాలురకని ఇచ్చిన సర్కారు డబ్బు తాను కాజేశాడు. ఇంతకాలం పంతుళ్ళు తన చేతిలో ఉన్నారు. పాళ్ళు పంచుకున్నారు అంగుష్టాలు ఎవరివి వేయించారో తెలియదు. అది బయట

పడినా కష్టమే. అంతేకాదు, పిల్లల కోసం వచ్చిన పాలపొడి, మొక్కజొన్న, రవ్వ పట్నంలోనే అమ్ముకుని డబ్బు తెచ్చుకున్నారు. మరొకటి – సర్కారు కట్టించిన బడిలో తాను గింజలు పెట్టుకున్నాడు. శివయ్య ఊరంతటినీ వణికించినవాడు, తాను భయపడుతున్నాడు.

ఈ ఆలోచనలన్నీ శివయ్యకు రావడానికి కారణం పావని పట్నం వెళ్ళటం. పట్నానికి వెళ్ళిన పావని ఏం ప్రమాదం తెస్తుందో అని భయపడిపోతున్నాడు. పావనిని వదిలించుకోవడానికి ఒక ఉపాయం కనిపెట్టాడు. సౌమ్యంగా వ్యవహారం పరిష్కరించాలనుకున్నాడు. జగన్నాథాన్ని పిలిపించాడు.

"పిలిచిన్రట దొరవారూ!" జగన్నాథం వచ్చాడు.

"జగన్నాథం! శాస్త్రిగారి దగ్గరికి పోదామనుకుంటున్న, జరవస్తవా?"

"అదేందుండి అట్లంటరు? మీరు రమ్మంటే రానంటనా? అసలు కత ఏంది? మీరు శాస్త్రిగారి ఇంటికి పోవటమేంది? పిలుస్తె రానంటుండా బాపనాయన?!"

"జగన్నాథం! కాలాన్ని బట్టి మనం నడుచుకోవాలె. రమ్మంటె రాకపోతాడాగని మనం పోతె అదొహ తీరు. అక్కర పడ్డప్పుడు వసుదేవుడంతటోడు గాడిద కాళ్ళు పట్టుకున్నడు. పని మనది, ఆడికి పోయిందే మంచిది, పోదాంపా."

"నన్నా రమ్మంటరా!" జగన్నాథాన్ని పిలుచుకొచ్చిన నర్సిమ్మ అడిగాడు.

"నువ్వెందుకు, పిల్లిని చంకన పెట్టుకున్నట్లు– బాకీ వసూలు చేయటానికి కాదు పోతున్నది" అని అడుగు వేశాడు శివయ్య.

జగన్నాథం, శివయ్య అడుగులో అడుగు వేసి కదలాడు. ఇద్దరూ మవునంగా సాగుతున్నారు శాస్త్రిగారి ఇంటి వైపు.

"ఇంతకు పనేందో చెప్పక పోతిరి. తీర ఆడికి పోయినంక ఏం మాట్లాడాల్నో ఎరక కావాలెగద!" జగన్నాథం చేతులు నల్చుకుంటూ అడిగాడు.

"నీకు ఎరక కాకుంటె మునిగి పోయిందేమి లేదుగని నేను అన్నదానికి ఊం కొడ్తుండు!" విసుగ్గా, చిరాగ్గా అన్నాడు శివయ్య.

జగన్నాథం మాట్లాడలేదు. మవునంగానే శాస్త్రిగారి ఇంటికి చేరుకున్నారు. శాస్త్రిగారు ఖల్వంలో పొడుం నూరుకుంటున్నారు. వస్తున్న వాళ్ళను చూచారు. అయినా, చూడనట్లే పొడుం నూరుకోవడంలో మునిగినట్లు నటించారు.

జగన్నాథం – శాస్త్రుల వారిని పిలిచాడు. అప్పుడే చూచినట్లు శాస్త్రులవారు లేచారు. "శివయ్యగారా! శివయ్యగారు మా ఇంటికి వచ్చిన్రా! నర్సిమ్మతో పిలువ నంపితె రాకపోయినాను? రాండి. కూర్చోండి" అని మంచం చూపించారు.

"శాస్త్రిగారూ! ఎంతయిన మీరు పెద్దలు. మీ దగ్గరికి మేము రావటమే మంచిదని వచ్చినం. ఈ ఊరి భారం సొంతం మన ముగ్గురి మీదనే నిలిచి ఉన్నది. మీరు మా ఇంటికి వచ్చినా, మేము మీ ఇంటికి వచ్చినా గ్రామక్షేమం కోసమే గదా!"

"అంతేగద మరి– ఇంకెవరు చూస్తరు మనం కాక" – జగన్నాథం.

"పొడుం ఘాటుగా తయారయింది. ఒక పట్టు పడ్తారా?" శాస్త్రిగారు తన లోకపు జవాబు ఇచ్చారు.

"అమ్మో! నస్యం పీల్చలేం గాని, పావనమ్మ కనపడదేమి? మాల గూడెం పోయిందా?" పావని పట్నం వెళ్ళిందని తెలిసే అడిగాడు శివయ్య.

"ఎక్కడికి పోయినా ఉద్యోగధర్మం మీదనే పోతుంది. ప్రస్తుతం పట్నం వెళ్ళింది."

"అహాఁ! పట్నం పోయినాది అందుకనే కనబడలేదు. ఎందుకా అని ఆలోచిస్తున్న" – జగన్నాధం ఆవులించబోయి అణుచుకున్నాడు.

"పావనమ్మ పెండ్లికి ఏమన్న ప్రయత్నిస్తున్నారా?" శివయ్య అసలు సంగతి వెళ్ళబెట్టాడు.

శాస్త్రిగారు క్షణం చకితులయినారు. ఈ విషయం మాట్లాడ్డానికి ఇంతదూరం వచ్చారన్నమాట అనుకున్నారు.

"శివయ్యగారూ! ఆడపిల్ల పెండ్లి అంత చులకనగా అవుతుందాండి? నా దగ్గర బుడ్డపైసలేదు. వేలకువేలు కట్నం ఇచ్చినా వరులు దొరకటం లేదు. పావని ఇప్పుడిప్పుడే సంపాదిస్తున్నది. ఏదన్న కాస్త వెనకేసుకుంటె చెయ్యాలెననుకుంటున్న."

"ఏమోనుండి చెయ్యాలె. ఎన్నాళ్ళు ఇంట్లో పెట్టుకుంటరు. ఎట్లనన్న ఆడపిల్లేగాని ఈడిపిల్ల అయితదా?" అన్నాడు జగన్నాథం.

"శాస్తుర్లుగారూ! ఇగో చూడండి. పావనమ్మ పెండ్లిబాధ్యత మీ మీద ఎంత ఉన్నదో మా మీదా అంత ఉన్నది. పావనమ్మ మీ బిడ్డ అయితే మా బిడ్డ కాదా! ఇగ చూడండి, యాడనన్న సంబంధం చూడుండి. ఎంతయితదో అంత ఖర్చు నేను పెట్టుకుంట. పెండ్లి చేసే జిమ్మేదారి నాది–ఇన్నరా!" శివయ్య ఉవాచ.

"అట్లనే ఇగ మీరన్నారుగదా, సంబంధాల కోసం చూస్త. దొరకంగనే మీకు చెప్పొత, పెండ్లి చేస్త. చెయ్యకుండ ఎట్లుంట? మీరు అంతమాట అన్నారు, చాలు. చేస్త, ఎందుకు చెయ్యను? పావని పెండ్లికూతురు కావాల్నని నాకు మాత్రం ఉండదూ! శివయ్యగారూ! ఇగ చూస్త. పెండ్లిచేస్త" – గౌరీనాథశాస్త్రిగారు ఆవేశంగా అన్నారు.

"ఇగ చూడండి పెండ్లికావలసిన...."

జగన్నాథం ఏదో అనబోయి శివయ్యను చూచి నాలుక కరచుకున్నాడు.

"శాస్తుర్లుగారూ! పెండ్లికావలసినపిల్ల అట్ల వాండ్లెంబడి తిరుగుతుంటే ఎవడన్న చేసుకుంటాడా? పెండ్లయ్యేదాకా జర ఆ గూడెం వైపు పోవద్దనుండి. ఏమంటారు?"

"ఎరకయింది. తెలుసుకున్న. ఇగ అట్లనే చేస్త. పావని ఎక్కడికి పోదు, పెండ్లిచేసుకుంటది."

"అంతే, అది జెప్పటానికే వచ్చినం, సంబంధం కుదరంగనే చెప్పండి, పెండ్లి చేస్తం, వస్తం మరి" – ఇద్దరూ లేచి వెళ్ళిపోయారు.

శివయ్య ఇంటికి చేరి మురిసిపోయాడు. మంచి పాచిక వేశా ననుకున్నాడు. తండ్రికీ, కూతురుకూ కయ్యం పెట్టాననుకున్నాడు, పాచిక పారుతుందనుకున్నాడు. సారాయి గ్లాసుతో గటగటా తాగాడు. సిగరెట్టు వెలిగించి గట్టిగా దమ్ములాగి విస్సురుగా పొగ వదిలాడు.

వారు వెళ్ళినతరవాత శాస్త్రిగారు పొడుం పీల్చి ఆలోచనలో పడ్డారు. అనవసరంగా శివయ్య దమ్మిడీ ఖర్చు చేయడు. అమాంతంగా శివయ్యకు అంత దానకర్ణత్వం

ఎందుకు పుట్టుకు వచ్చింది? నీతి చంద్రికలో నువ్వుపప్పుకథ గుర్తుకు వచ్చింది. నువ్వులకు సరికిసరి నూపప్పు పెడ్తానని వచ్చింది పొరుగింటావిడ. ఇంటావిడకు అనుమానం కలిగింది. దరియాప్తుచేస్తే తేలిన విషయం ఏమంటే – ఆరబోసిన నూపప్పు కుక్క ముట్టింది, దాన్ని మార్చుకోవడానికి పొరుగావిడ ఈ ఎత్తు ఎత్తింది. ఎంతయినా తాను బుద్ధిజాడ్యజనితోన్మాదుడు. పావని ఇది కనిపెట్టగలదు అనుకున్నారు. ఆలోచనలోనే కునుకుపట్టింది శాస్త్రిగారికి.

# 12

శాస్త్రిగారి ఇంటి ముందు బండి ఆగింది. పావని బండిలోంచి దిగింది. తెచ్చిన సరుకులు ఒక్కొక్కటే బండి లోంచి దింపుతూంటే శాస్త్రిగారు లోన పెట్టారు. బండి బాడుగది. బండివాడు బాడుగ అందుకొని వెళ్ళిపోయాడు.

పావని బాగా అలసి ఉంది. ముఖం నిండా దుమ్ము, కళ్ళలో అలసటా కనిపిస్తున్నాయి. తువ్వాలు, సబ్బు అందుకుని దొడ్లోకి వెళ్ళిపోయింది.

శాస్త్రిగారు పావని తెచ్చిన పదార్థాలను పరికించసాగారు. వారికి ఏమీ అర్థం కాలేదు. అన్నీ డబ్బాలే. అన్ని డబ్బాలు ఎందుకు తెచ్చిందో వారికి తెలియలేదు. ఉన్నది తామిద్దరు. ఇన్ని సరుకులు పట్నం నుంచి తేవాల్సిన అవసరం ఏమో వారికి అంతు బట్టలేదు. మూతలన్నీ తీసి చూశారు. పొడుం పీల్చి, మంచం మీద వాలిపోయి, తల గోక్కున్నారు. పంచాంగం అందుకుని పరిశీలించసాగారు.

పావని స్నానం చేసింది. తల తుడుచుకుంటూ లోన ప్రవేశించింది. పంచాంగం పరిశీలిస్తున్న తండ్రిని చూచింది.

"ఏం నాన్నా! ముహూర్తం చూస్తున్నావా? పెళ్ళి చేసేస్తావా ఏం?" వేళాకోళంగా అడిగింది.

శాస్త్రిగారు సీరియస్‌గా లేచి కూర్చున్నారు. "అవునమ్మా! నీకు పెళ్ళి చేసెయ్యాలె. ఇహ లాభం లేదు. ఎన్నాళ్ళు తిరుగుతవు ఇట్ల, పిల్లవాడు కుదిరిండు. ముహూర్తం చూస్తున్న."

"నాన్నా! ఏమిటి మీరంటున్నది? నాకు పెళ్ళేమిటి? ఒక్క రోజులో పిల్లవాడు ఎలా దొరికాడు? డబ్బు ఎక్కడిది?"

"అన్నీ సిద్ధం అయినాయి. ఇగ నువ్వు గూడేనికి పోవద్దు. నువ్వట్ల తిరుగుతుంటె నిన్నెవడు చేసుకుంటాడు?"

తండ్రి సీరియస్‌గానే మాట్లాడుతున్నాడు. పావని కాస్త తడబడింది. ఆమెకేమీ అంతు పట్టలేదు.

"నాన్నా! నేను పెళ్ళి చేసుకోను. నేను తల్లిని, అందరికీ అమ్మను. చేసుకోను నేను పెళ్ళి."

"చేసుకోవలసిందే, చేసుకోక తప్పదు. లేకుంటె నా ఇంట్లోంచి వెళ్ళిపో. ఊఁ, ఇప్పుడే. పో."

"నాన్నా!" పావని కళ్ళలో నీరు తిరిగింది.

"అవును. శివయ్య డబ్బిస్తనన్నడు. నీకు పెళ్ళి చేయమన్నాడు. అతను అన్న మాట నీకు చెప్పిన" అని గలగలా నవ్వేశారు శాస్త్రిగారు.

"నాన్నా! నా ప్రాణం తీసేశావు. ఏమిటో అనుకున్నా" అని నిట్టూర్చింది పావని. తానూ తండ్రితో పాటు నవ్వేసింది.

"శివయ్య ఎందుకన్న డంటవు-అట్ల?"

"నాన్నా! శివయ్య పెద్ద ప్లాను వేశాడు. పెండ్లి పేరుమీద మనిద్దరికీ పోట్లాట పెట్టాలనుకున్నాడు నువ్వు నన్ను వెళ్ళగొడ్తావు. నేను వంటరిని అయిపోతాను. అప్పుడు నా మీద పగ సాధించ వచ్చనుకున్నాడు. అతను పెండ్లికి డబ్బెందుకు ఇస్తాడు? ఆ పేరు చెప్పి మనను చీలదీయడం అతని ప్రథమ లక్ష్యం."

"ఎంత ఆలోచించావమ్మా పావనీ! నేను నిన్ను వదులుకుంటానా? నువ్వు మా అమ్మవు, తల్లివి. అంతే కాదమ్మా, ఈ ఊరికి దేవివి. శివయ్య పాలిటి శక్తివి" అని లేచి పావని తల ముద్దాడారు.

"నాన్నా! నువ్వు ఎంత మంచివాడివి నాన్నా! నువ్వు ఈ చిన్న విషయం గ్రహించలేకుంటే కథ సొంతం అడ్డం తిరిగేది."

"అమ్మా! నీ మంచితనం, మానవత నాలో ఎంతో మార్పు తెచ్చినయమ్మా! నేను మామూలు శాస్త్రిని అవుతే శివయ్య వలలో పడివుండే వాడిని. నువ్వు నాకే కాదు ఈ ఊరికే జ్ఞాన భిక్ష పెట్టావు తల్లీ!"

"నాన్నా!" పావని తండ్రిని కావిలించుకుంది. భుజం మీద తల పెట్టి ఆనందబాష్పాలు రాల్చింది.

"అమ్మా, నాకు భయం కల్గుతుంది తల్లీ! ఈ జయం నీది కాదమ్మా! మంచిది, మానవతది. కలుగుతుందమ్మా, జయం కలుగుతుంది" - కూతురు తలమీద చేయి వేసి నిమురుతూ అన్నారు.

పావని కన్నీరు తుడుచుకుంటూ చెప్పింది, "నాన్నా ఇవన్నీ బడిపిల్లల కోసం గవర్నమెంటు పంపింది. మొక్క జొన్న, రవ్వ, నూనె, పాలపొడి ఉన్నాయి. వారికి మధ్యాహ్నం ఫలహారం చేసి పెట్టాలి. గవర్నమెంటు చాలా కాలంగా ఇవి అందిస్తాంది. పంతులూ, శివయ్యా కలిసి మింగేస్తున్నారు."

"ఎంత దుర్మార్గులు! పసిపిల్లల నోటి ముందరిది గుంజుకుంటారామ్మా!"

"అంతేకాదు నాన్నా! గవర్నమెంటు ఈ పిల్లలకని ఇచ్చే డబ్బుకూడా కాజేస్తున్నారు. అదికూడా తెచ్చాను, వారికి అందిస్తాను."

"అమ్మా! నువ్వు మానవసేవ చేస్తున్నావమ్మా, మేము ఎక్కడనో కనిపించని మాధవుడు, మాధవుడు అని కొట్టుకు చస్తున్నాము. కానీ, తల్లీ కానీ, ధర్మోరక్షతి రక్షితః."

పావని ఇంట్లోకి వెళ్ళింది, నిప్పు రాజేసింది, ఉప్మా తయారుచేసింది, పాల పొడితో పాలుచేసింది. బట్టలు మార్చుకుంది. చింతకింద బడికి వెళ్ళేప్పుడు తండ్రితో చెప్పి వెళ్ళింది, వెంకడు వస్తే వాటిని పంపించమని.

పావని చింతకిందికి వచ్చేసింది. పిల్లలు కూడా వచ్చేశారు. వారు కొంతలో కొంత శుభ్రంగా ఉన్నారు, ముఖాలమీద సంతోషం కనిపిస్తాంది. వారి ముఖాల్లో ఇంతకాలంగాలేని పసితనం, చిలిపితనం కనిపిస్తున్నాయి.

"పట్నం సంగతులు చెప్పమ్మా!" ముత్యాలు అడిగింది.

"అబ్బో! అక్కడ చాల కథలున్నాయి! అక్కడ రైళ్ళున్నాయి, మోటార్లున్నాయి విమానాలున్నాయి. అక్కడా పిల్లలున్నారు, వాళ్ళంతా మిమ్మల్ని రమ్మన్నారు."

"ఓ, వస్తం. ఎప్పుడు తీసుకుపోతవమ్మా, చూస్తం మేము – పట్నం చూస్తం."

"తీసుకు వెళ్తా, అక్కడి పిల్లలు కూడా మిమ్మల్ని రమ్మన్నారు, అప్పటిదాకా బుద్ధిగా చదువుకోవాలి, విన్నారా!"

"చదువుకుంటం – చదువుకుంటం" – అంతా గంతులు వేశారు.

పావని వాళ్ళకు చదువు చెప్పడం ప్రారంభించింది, అందరిదీ ఒకే క్లాసు, ఒకటే పాఠం, అయిపోయింది. మధ్యాహ్నం అయింది, వెంకడు పనికి వెళ్లివుంటాడు, ఎలా వస్తాడు? ఈ ఆలోచన ఆమెకు రాలేదు, అప్పుడు సరే, తానే వెళ్దామని ఇద్దరు ముగ్గురు పిల్లలను తీసుకుని బయలుదేరింది. తోవలో శాస్త్రిగారు కనిపించారు, ఒక చేతిలో పాల బకెట్టు, మరో బుజంమీద ఉప్మాగిన్నెతో వస్తున్నారు. అలా తెస్తున్న తండ్రిని చూచి పావని పొంగిపోయింది.

"నాన్నా! మీరే తెస్తున్నారా?"

"అవునమ్మా! ఎంత చూచినా వెంకడు రాలేదు. పాపం, పసిపిల్లలకోసం చేసి పెట్టినది, వారికి అందకుండా పోతుందేమోనని ఇట్ల తీసుకొచ్చిన."

"బావుంది, మీరు తీసుకురావడమేమిటి? ఇటివ్వండి" అని వాటిని అందుకుంది, "ఇహ మీరు వెళ్ళండి."

"ఏమమ్మా! నేను రావద్దా అక్కడికి?" శాస్త్రిగారు పసిపిల్లవాడు తల్లిని అడిగినట్లు అడిగారు.

"నాన్నా! మీరు అక్కడికి వస్తారా?"

"వస్తానమ్మా! బాలలు భగవత్స్వరూపులు. ఆకలిగొన్న బాలలు ఈ ఆహారం ఎట్ల అందుకొంటారో చూస్తనమ్మా! చూడాలని ఉందమ్మా!" శాస్త్రిగారి గొంతులో ఆవేదన, ఆవేశం కనిపించాయి.

పావని వారించలేదు. శాస్త్రిగారు ఆమెను అనుసరించారు.

ఉప్మా, పాలూ చూశారు పిల్లలు. కాని, తమ తమ స్థానాల నుంచి కదల్లేదు. శాస్త్రిగారికి అది ఆశ్చర్యం కలిగించింది. ఆకలి గొన్న బాలలు ఈగల్లా ముసురు తారనుకున్నారు. ఆ క్రమశిక్షణ తన కూతురు ఏర్పరచింది. మురిసిపోయారు శాస్త్రిగారు. ఆకుల్లో ఉప్మా పెట్టి అందరికీ అందించింది పావని. చివరి వారు అందుకునే దాకా వారంతా తినడం ప్రారంభించలేదు, వారంతా తినడం మొదలు పెడ్తే వారి ఆకలి తెలిసి వస్తూంది, గబగబా మింగేస్తున్నారు.

శాస్త్రిగారు అది చూచారు. వారికి ఏదో కడుపు నిండినట్లు అనిపించింది, పాపం పసిపాపలు! పేదలు!! అన్నం లేనివారు! ఆహారం లభించింది!! అవురావురుమని తింటున్నారు!!!

"అమ్మా! శాన బాగున్నదమ్మా! ఇసువంటిది మేము ఎప్పుడు తినలేదమ్మా!" ఒక్కుమ్మడిగా అందరూ అన్నారు.

నుంచున్న శాస్త్రిగారి కళ్ళలోంచి టపటపా నీరు రాలింది, మిగిలిన నీరు సైతం

చండాలునికి పోసి, లోకంలోని దుఃఖం సొంతం తనకు ఇచ్చి, లోకానికి ఆనందం ప్రసాదించమని కోరుకుంటున్న రంతిదేవుడు వారి మనోఫలకంమీద మసిలాడు.

పావని హృదయం నిండిపోయింది. పాపల మాటలు గుండెకు గండికొట్టి కళ్ళ ద్వారా ప్రవహించింది.

"ఇంకాస్త తినండి" ఉన్నది. అందరికీ పంచిపెట్టింది. వారందరికీ పాలు గ్లాసుల్లో పోసి ఇచ్చింది.

పాలు వాళ్ళు ఎన్నడూ తాగలేదు. పాలు తాగుతున్న వారి ముఖాల్లోని ఆనందం చూసి శాస్త్రిగారు పరవశించిపోయారు. పావని ఆనందానికి అవధులు లేవు. ఆమె హృదయం నాట్యం చేస్తూంది.

"అమ్మా పావనీ! నా హృదయం నిండి పోయిందమ్మా! జప తపాదుల్లో లభించని ఆనందం లభింప చేశావమ్మా! అమ్మా పావనీ! నిజంగా నువ్వు తల్లివి, అమ్మవు, మాతవు. నీ వంటి మాతృమూర్తులు ఎంతో మంది కావాలమ్మా—ఈ దీనులను, దరిద్రులను కాపాడడానికీ, వారికి సేవ చేయడానికీ."

తన తండ్రి తనముందే తనను పొగడుతుంటే సిగ్గనిపించింది పావనికి. తల వంచుకుంది. తండ్రి తన పనికి అడ్డంకి అవుతాడనుకుంది. తండ్రి తనను ప్రోత్సహిస్తున్నాడు. అందుకు ఆమె ఉబ్బితబ్బిబ్బు అయింది.

తెల్లవారి స్కూలుకు వచ్చే పిల్లల సంఖ్య హెచ్చింది. పావని చేసి పెట్టే ఉప్మా పోస్తున్న పాలూ అందుకు కారణం. కొత్తగా వచ్చిన వారికీ, పాతవారికీ చదువు చెప్పడం కాస్త కష్టం అవుతూంది. అదీకాక గూడెంలో రాత్రి పాఠశాల; ఊళ్ళో అసలు పనే ఉండదనుకున్న పావనికి విరామం లేకుండా పని లభించింది. అంతేకాక, ఆమె శ్రమ ఫలిస్తూంది. అందుకు ఆమెకు ఎంతో సంతోషంగా ఉంది.

మరుసటిరోజు బ్రహ్మయ్య వచ్చాడు. చదువుకుంటున్న పిల్లల తల్లితండ్రులకు ఇవ్వాల్సిన డబ్బు తెచ్చానని చెప్పింది. బ్రహ్మయ్య ఆశ్చర్యపడ్డాడు. ఇంతకాలంగా వచ్చిన డబ్బు శివయ్య మింగాడని గ్రహించాడు. "వాడు మనిషి కాడుండీ, దయ్యం. అందుకే బిడ్డలు లేకుండ అయ్యిను. మొండి మొదలారి పోతడు" అని గూడానికి వెళ్ళాడు. శివయ్య డబ్బు మింగడం సంగతీ, పావని డబ్బు తెచ్చిన సంగతీ స్వంత ధోరణిలో ప్రచారం చేశాడు. డబ్బు తీసుకోవడానికి గూడెం వాళ్ళను వెంట పెట్టుకుని చింత చెట్టు కిందికి వచ్చాడు. పావని ఒక్కొక్కరినీ పిలిచి కాగితం మీద అంగుష్టం వేయించుకుని డబ్బు అందించింది.

డబ్బు అందుకుని వెళ్ళిపోతున్న జనం రకరకాలుగా వ్యాఖ్యానించారు.

"శివయ్య దొర కాదసె – దొంగ. మన కొచ్చిన డబ్బంత మింగిండట, వీని కడుపు కాల, వీని పెండ్లాం ముండమొయ్య."

– "పోరల నోటి ముంగలి బువ్వ గుంజు కున్నడటనే. వీని ఇంటికి చిచ్చు పెట్ట, వీని ఇంట్ల పీనిగ ఎల్ల."

"పావనమ్మ దేవతోలె వచ్చింది, పోరలకు చదువు చెపుతాంది."

"అట్లగాదె, మనమకూడా అంతో ఇంతో తెలివిన పడేస్తాంది."

"పోరలకు పాలు పోస్తోంది, బువ్వ పెడ్తాంది."

"అట్లగాదె. పైకం కూడ ఇస్తాంది."

గూడెం వాళ్ళు అనాటికి అంత పైకం ఒక్కసారి ఎన్నడూ కళ్ళ చూడలేదు. వాళ్ళకు ఏదో వింతగా ఉంది. కొత్తగా ఉంది. కూనిరాగాలు వస్తున్నాయి. అంత పైకం– అదేం పెద్ద మొత్తం కాదు – యాభయ్యో, అరవయ్యో – అదే లక్షల్లా కనిపిస్తాంది వాళ్ళకు. డబ్బు ఏం చేయాలో అర్థం కావడం లేదు. ఎవరికి వారు ఏవో ప్రణాళికలు సిద్ధం చేసుకుంటున్నారు. వచ్చిన రూపాయలు మళ్ళీ మళ్ళీ లెక్క పెట్టుకుంటున్నారు.

డబ్బు నర్సిమ్మకూ వచ్చింది. అది చూడగానే అతనికి వచ్చిన ఆలోచన సారాయి కొట్టు. కొట్టుకు వెళ్ళి ఊతంగా తాగాడు. బల్లెం పట్టుకుని గూడానికి వచ్చాడు.

"సర్వ రోగాలకు సారాయిరా మందు. అట్ల ఊకె కూకున్నారేమిర లంజకొడుకుల్లారా! పైకమొచ్చినంక సార తాగకుంటె పరమాత్మునికి కోపం వస్తది. ఊc, తాగాలెరా! తాగకుంటె దున్నపోతయిపుట్టడు. పైకం చూసుకొని మురుస్తాన్రేమిరా!" అని సీసా తీసుకుని గటగటా తాగాడు. ఇంత ధర్మయ్య నోట్లో పోశాడు. వెంకడికీ, పెంటడికీ పోశాడు.

చుక్కపడ్డ పెంటడు "అవునె, జరపడాల్సిందే, ఏమంటవు?" అన్నాడు.

మంచంలో పడిచస్తున్న పెంటడి తల్లి "అరే! నాకింత పొయ్యండిర! సార లేక నోరు చచ్చి పోతాంది" అంది.

సారాయి సీసాలు వచ్చేశాయి. గూడెం సాంతం సారాయి ప్రభావానికి లొంగి పోయింది. డప్పులు మోగుతున్నాయి. పాటలు సాగుతున్నాయి. నవ్వుకుంటున్నారు. తిట్టుకుంటున్నారు. తన్నుకుంటున్నారు. ఏడుస్తున్నారు. గూడెం సాంతం అయోమయంగా ఉంది. అగాధంగా ఉంది.

పావని రాత్రి పాఠశాలకని గూడేనికి బయలుదేరింది. కొంతదూరం నుంచే కేకలు, అరుపులు, నవ్వులు, ఏడ్పులు, కేరింతలు వినిపించాయి. ప్రమాదం జరిగిందా? సంబరం చేసుకుంటున్నారా? అర్థం కాలేదామెకు. గబగబా నడిచింది. ఆ దృశ్యం చూసి విస్తుపోయింది. ఆమెను ఎవరూ గమనించలేదు. ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

పావని చూచింది. సహించలేకపోయింది. భరించలేకపోయింది. ఎంతో శ్రమతో కట్టిన కొంప కూలుతున్నట్లనిపించింది గడ్డిపరకలు ఒక్కొక్కటే తెచ్చి కట్టుకున్న గూడు కాలిపోతున్నట్లనిపించింది. చేసిన శ్రమ సాంతం బూడిద పాలవుతున్నట్టు అనిపించింది. ఆమెకు దుఃఖం ముంచుకొని వస్తాంది. వెనక్కు తిరిగింది. నోట్లో కొంగు పెట్టుకుని ఇంటివైపు ఉరికింది. శాస్త్రిగారు ఇంకా పడుకోలేదు. పావని అప్పుడే వస్తుందని ఊహించలేదు. పావనినీ, ఆమె ముఖాన్నీ చూచి నివ్వెర పోయారు. ఏదో అపాయం జరిగిపోయిందనుకున్నారు. జంకారు. పావని తండ్రిని కావలించుకుని భోరుమంది.

"ఏమయిందమ్మా, చెప్పు. ఎవడువాడు? వాణ్ణి భస్మం చేస్తాను." శాస్త్రిగారు అగ్గి కక్కుతున్నారు. వారికి అర్థం అయింది మరొకటి.

"వాళ్ళు మనుషులు కాదు నాన్నా! పశువులు. బాగుపడరు."

శాస్త్రిగారు మండిపడ్డారు. పావనిని భుజం మీదినుంచి నెట్టేశారు. ఆమె తూలిపడబోయి నిలదొక్కుకుంది.

శాస్త్రిగారు మూలనున్న గొడ్డలి అందుకున్నారు. "ఎవడు వాడు, చెప్పు. నరుకుత. ముక్కలు చేస్త. కాకులకు గద్దలకు వేస్త. తల్లిని పట్టినవాణ్ణి క్షమించరాదు. తల నరకుతా. చెప్పు, వాడెవడో." శాస్త్రి శాస్త్రిలా లేరు. కసాయివాడిలా ఉన్నారు. ముఖం రక్తం చిమ్ముతూంది. కళ్ళు చింతనిప్పులు కురుస్తున్నాయి. వళ్ళు వణికి పోతూంది. చేతిలో గొడ్డలి ఉంది. పావని వైపు ఒక్క అడుగు వేశారు.

పావని నివ్వెరబోయి చూస్తూంది. ఓ క్షణం ఆమెకు ఏమీ అర్థం కాలేదు. మరుక్షణం తరువాత అర్థం చేసుకుంది– తండ్రి ఉద్రేకానికి కారణం.

"నాన్నా!" కేక పెట్టింది పావని.

అడుగేసినవారు అలాగే నిలబడిపోయారు శాస్త్రిగారు.

"నాన్నా! నేను పావనిని. పవిత్ర గంగను. నన్ను అంటుకున్నవాణ్ణి అక్కడే భస్మం చేయగలను. నేను నీ బిడ్డను నాన్నా! అమ్మ కన్న గంగను. అపవిత్రం అయిన పావని నీ ముందుకు రాదు నాన్నా! జరిగింది మరొకటి" అని, తాను చూచిందంతా చెప్పింది. దుఃఖం ముంచుకురాగా మంచంమీదపడి వెక్కెక్కి ఏడ్చింది.

"పశువుల్ని మనుషులు చేయటం కష్టమమ్మా! మనలో కూడా పశువు ఉన్నాడు. వాడు మనను వదులుతున్నాడా? అధైర్యపడకు. ధర్మం నీ పక్షాన ఉంది" అని ఓదార్చారు శాస్త్రిగారు. తాననుకున్న అవాంతరం సంభవించనందుకు వారికి ఊరటగా ఉంది.

## 13

మరుసటిరోజు రాత్రి పాఠశాలకు వెళ్ళ లేదు పావని. ఆమె మనసు పరిపరివిధాలుగా పోతూంది. గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంది. చీకట్లు ముసురుకుంటున్నాయి.

"అమ్మా!" అనే కేక వినిపించింది. గుర్తించింది. పిలుస్తున్నది పెంటయ్య, అయినా పలకలేదు. మళ్ళీ మళ్ళీ పిలిచాడు. నిలువలేకపోయింది. చప్పునలేచి చరచరా నడిచివచ్చింది.

"నేను మీ అమ్మను కాను. మీరు పశువులు, మనుషులుకారు. నేను రానుఫో."

పెంటయ్యకేమీ పాలుపోలేదు. పావని అలా ఎందుకు చీదరించుకుంటూందో అర్థంకాలేదు. "అమ్మా! నిజమేనమ్మా! మేం పశువులమే, నువ్వే మమ్ముల మనుషుల చేస్తున్నావు. ఇంక పూర్తి మడుసులం కాలే. నీక్కోపమొస్తె మల్ల గొడ్ల మయితం, గొడ్లోలె బతుకుతం."

"డబ్బువస్తే చాలు, తాగి తందనాలాడ్తారా? మనిషిని గుర్తించరా? మీరు మనుషులేనా?"

గ్రహించాడు పెంటయ్య. రాత్రి జరిగిన రభస అతని మనోఫలకం మీద మెరిసింది. "అమ్మా! మడిసి తప్పు చేస్తడని నువ్వేకదమ్మా చెప్పినవు. మేము నీ బిడ్డలం, బిడ్డలు తప్పుచేస్తే మన్నించవా తల్లీ! ఒక్కసారి గూడేనికిరా, అన్నిసంగతులూ ఎరకయితయి"– అర్థిస్తున్నాడు పెంటయ్య.

పావని కరిగిపోయింది. వీళ్ళు తనకే భాష్యాలు చెప్పేంత వారయినారు. అవును,

మనిషి తప్పు చేయడూ! మనిషి తప్పు చేస్తాడు. తప్పుదు. చేసిన తప్పును తెలుసుకున్నవాడు మనిషి. పావని పెంటయ్య వెంట బయలుదేరింది, ఆవువెంట దూడలా.

గూడెంలో శ్మశాన ప్రశాంతత వెలిసింది. ఒక్కరూ మాట్లాడ్డంలేదు. పావనిని చూచారు– ధర్మయ్య నోరు విప్పాడు.

"అమ్మా! తప్పు చేసినం, మన్నించు. మేం చేయలేదమ్మా, నర్సిగాడు చేయించిండు. వాడే సారా తెచ్చి పోసిండు. మమ్ములను మళ్ళా పశులను చేసిండు."

వెంకడు ఏదో తప్పుచేసిన వాడిలా వదిగి వదిగి కూర్చుంటున్నాడు.

పావని అసలువిషయం గ్రహించింది.

"ఇదంతా శివయ్య చేసిన నాటకం."

"అవునండి, వాడే చేయించిండు గిదంత" – గూడెంలో అడుగుపెడ్తూ అన్నాడు కొమరయ్య. బ్రహ్మయ్య ఊళ్ళో లేడు, భార్యదగ్గరికి వెళ్ళాడు.

"నర్సిగాడితో చెప్పి సార పోయించిండు. సార పోయించి ఊరిని మల్ల పశులమంద చేయాలనుకున్నాడు. ఈ ముండకొడుకులకు సార కనబడ్డది. సురసురమని లేచిన్రు, అమ్మను మరిచిన్రు, చదువు మరిచిన్రు, తెలివి మరిచిన్రు."

"అవునే, అట్లనే అయినమే. అమ్మా! ఇగ చేయం, నీ కాళ్ళ మీద పడ్తం. మేం తప్పుచేసినం, పాపం చేసినం, మన్నించు తల్లీ!" వెంకడు పావని కాళ్ళమీద పడ్డాడు. ధర్మయ్య తప్ప గూడెం సాంతం చేతులు జోడించి ప్రార్థించింది.

"ఇప్పుడు జరిగింది, ఇహ ఇట్లా జరగరాదు."

"జరగదు, జరగదు" ముక్తకంఠంగా అన్నారు.

"మీ బలహీనతలు శివయ్యకు తెలుసు..." ఇంకా ఏదో చెప్పబోతూంది. మల్లమ్మ పగిలినకుండ పట్టుకుని ఏడుస్తూ ప్రవేశించింది. పెంటయ్య ముందుకు ఉరికి అక్కను తీసుకుని వచ్చాడు. ఏమైందో చెప్పమని అడుగుతున్నాడు. మల్లమ్మ ఏడుస్తూంది. తుదకు ఆమె చెప్పిందాని సంగ్రహార్థం ఇది –

తల్లికి జబ్బుగా వుందని సుభద్రమ్మతో చెప్పకుండా గూడేనికి వచ్చింది. ఇంట్లో నీళ్ళు లేవని కడవ పట్టుకుని బావికి పోయింది. ఎవరోతల్లి నీళ్ళుచేది పోసింది. కడవ నెత్తిన పెట్టుకుని వస్తుంటే వెనకనుంచి వచ్చిన నర్సిమ్మ బల్లెంతో కడవను పొడిచాడు. నీళ్ళన్నీ కారిపోయినాయి. వెనక్కు తిరిగి చూస్తే నర్సిమ్మ. ఏడ్చుకుంటూ వచ్చి గూడెంలో పడింది.

పెంటడు నర్సిమ్మమీద నిప్పులు చెరిగాడు. ధర్మయ్య వారించాడు. వాడు ఊరకుక్క. ఇంత తిండి పడేస్తే కాళ్ళు నాకుతుంది అన్నట్లు మాట్లాడాడు.

"అసలు మల్లమ్మ ఎందుకు అమ్ముడు పోయింది?" పావని అడిగింది.

"మాకే మెరికయితదండి. పరమిగాడు అప్పుచేసిండు, పారిపోయిండు. మల్లమ్మ అమ్ముడు పోయింది."

"పరమయ్య అప్పుచేసింది పెళ్ళి కోసం. పెళ్ళి మనసులకు సంబంధించింది. మనసులు కలిస్తే పెళ్ళి అయిపోతుంది. అలాంటి పెళ్ళికోసం అప్పులు చేసి తాగి తందనాలాడాలా? అప్పున పడ్డందుకే పరమయ్య, మల్లమ్మ–శివయ్య చేతికి చిక్కారు.

వంద ఏళ్ళ పంట కావలసినది, ఇద్దరూ విడిపోయారు. మల్లమ్మ సీతలా, సావిత్రిలా పరమయ్యకోసం ఎదురు తెన్నులు చూస్తాంది. పెళ్ళికి అప్పుచెయ్యలేదనుకోండి, వాళ్ళిద్దరూ కలిసి ఉండేవాళ్ళుగా!"

గూడేనికి, మల్లమ్మకూ ఏవో పరమసత్యాలు గోచరిస్తున్నాయి. జరిగిన సంఘటనలన్నీ మల్లమ్మ కళ్ళముందు చకచకా సాగిపోతున్నాయి.

"చావుకు అప్పులు చేస్తాం. అప్పులు చేశామని తాగుతాం. తాగకున్నా, అప్పులు చేయకున్నా చచ్చినవానికి వచ్చిన ప్రమాదం లేదు. చచ్చినవాని పేరుమీద తాగి మనం బానిసలం అవుతున్నాం. పుట్టబోయే బిడ్డలను బానిసలను చేస్తున్నాం."

"అవునమ్మా! అదే మేం చేస్తున్నం. లగ్గాలు, చావులు, తాగుడు – ఇవి లేకుంటే మేమూ రైతులమేనమ్మా! మాకూ బూములున్నయి. మేమూ దున్నుకున్నాం." ధర్మయ్య చరిత్ర నెమరు వేసుకుంటున్నాడు.

"ధర్మయ్యతాతా! మల్లయ్య పొలాలన్ని ఎట్లా పొయ్యాయే?" మల్లమ్మ ఆసక్తిగా అడిగింది.

"అప్పులు చేసి కాగితాలు రాసిస్తే పొలాలు పోయినాయె. మీరంతా శివయ్య దస్తరంలో చిక్కిపోయారు. శివయ్య బీరువాలో ఉన్న కాగితాల్లో మీ బతుకులున్నాయి. కాగితం మీద అంగుష్టం వేసినప్పుడల్లా మొదలు భూమి, తరువాత మీరూ అమ్ముడుపోయారు. మీ ప్రాణాలు ఇప్పుడు మీ దగ్గర లేవు. శివయ్య దస్తరంలో ఉన్నాయి. శివయ్య అల్మారలో ఉన్నాయి. శివయ్య గుప్పిట్లో ఉన్నాయి. అతను మీ ప్రాణాలను పట్టుకున్నాడు. ఆడిస్తున్నాడు. అతడు చావమంటే చస్తున్నారు. లేవమంటే లేస్తున్నారు. వెంకడి తండ్రి ఎలా చచ్చాడు? వెంకడితల్లి ఎలా చచ్చింది? ఆలోచించండి ఒక్కసారి. శివయ్య దస్తరం చంపింది. శివయ్య కాగితాలు చంపాయి. ఈ విషయాలు మీరు తెలుసుకోవాలి. తెలుసుకొంటే పరిష్కారాలు మీరే కనుగొంటారు."

పావని ఉపన్యాసం ముగించింది.

వాతావరణం ఆవేశంగా ఉంది. ఆలోచనలో ఉంది. మవునంగా ఉంది. ఎగిరే గబ్బిలపు రెక్కలు చప్పుళ్ళు వినిపిస్తున్నాయి.

"అమ్మా! ఆ దస్తరం పోతే మా బూములు మా కొస్తయా? మా బాంచతనం పోతుందా? నా బావ పట్నంనుంచి వస్తడా? నన్ను చూస్తడా?" మల్లమ్మ అడిగింది. ఆమె ఊహాలోకంలో కాగితాలు లేవు. అప్పులు లేవు. తాను పరమయ్య బాహుబంధంలో ఒదిగిపోయినట్లు ఊహించుకుంది.

"పిచ్చిదానా! కాగితాలెట్లపోతయె? సర్కారు కాయితాల్నే నమ్ముతది. మనుషులను నమ్మదు. మనుషులను నమ్మే సర్కారొస్తే చెప్పలేం."

"తాతా! పావనమ్మ మనకు తెలివి తెచ్చింది. తెలివి అన్ని పనులు చేస్తది తాతా! పోత మరి, దొర్సానికి చెప్పకుండొచ్చిన" – మల్లమ్మ వెళ్ళిపోతూంది.

మల్లమ్మ ముందడుగు వేసింది.

ఆమె మరో ప్రపంచాన్ని గురించి కలలు కంటూంది.

ఆ రాత్రి శివయ్యకు పీడకల వచ్చింది. పావని నోట్లోంచి మంటలు వస్తున్నాయి. తాను మంటల్లో చిక్కుకున్నాడు. జ్వాలలు నాల్కల్చాచి చుట్టుకుంటున్నాయి. పెద్దగా కేకపెట్టి ఉలిక్కిపడి లేచాడు. చూస్తే పక్కన సుభద్రమ్మ పడుకొని ఉంది.

## 14

శివయ్య చిక్కుల్లో చిక్కుకున్నట్లు చితికి పోతున్నాడు. నిరంకుశంగా సాగిన అతని అధికారానికి ఎక్కడో గండిపడినట్లు అనిపిస్తూంది. పావన్ని బదిలీ చేయింతా మనుకున్నాడు. చేయలేకపోయాడు ఓడిపోయాడు. ప్రభుత్వ యంత్రాంగం సొంతం తన పక్షమే అనుకున్నాడు. కాని, ప్రభుత్వమే తనకు ఎదురు తిరుగుతున్నట్లుంది. అక్కడ తన మాట చెల్లుబాటు లేకుండా అయింది. అదే అతనికి తలవంపులుగా ఉందంటే, పావని ఊళ్ళో కల్లోలం లేపుతూంది. బడి పెట్టింది. పిల్లలను ఆకర్షిస్తూంది. ఇది తనకు కలిగిన రెండో ఓటమి. పావనికి సాయం చేసినందుకు బ్రహ్మయ్యను బెదిరింతామనుకున్నాడు. పనిముట్లు ఇవ్వడం మానేశాడు. పాత అప్పులు వసూలు చేస్తానని బెదిరించాడు. బ్రహ్మయ్య వచ్చి కాళ్ళు పట్టుకుంటాడు. లొంగిపోతాడు అనుకున్నాడు. అలా జరగలేదు. బ్రహ్మయ్య జంధ్యం తెంపుకుని గూడేనికే పోతున్నాడు అగ్నికి వాయువు తోడయినట్లు పావనికి బ్రహ్మయ్య తోడయినాడు. బ్రహ్మయ్య ఇల్లు స్వాధీనం చేసుకుందామనుకున్నాడు కాని, ఎందుకో ఎన్నడూ లేని జంకు ప్రవేశించింది అతనిలో పావని కోర్టుకు లాగుతుందేమో! తెలివి మీరుతున్న ప్రజలు ఎదురు తిరుగుతారేమో! ప్రభుత్వంలో ఎవరూ తన మాట వినేట్లు లేరు. అంతా పేదల పక్షం వహిస్తున్నారు. అంతా అయోమయంగా ఉంది శివయ్యకు. అమావాస్యలా ఉంది. ఎక్కడా వెలుగు కనిపించడం లేదు. పావని మీద చేయిచేసుకుందామనుకున్నాడు. పావనిని అంతం చేతామనుకున్నాడు. పావని అష్టభుజాలతో అనంతం అయిన ఆదిశక్తిలా కనిపించింది. మహిషాసురుని మర్దిస్తూంది. గౌరీనాథశాస్త్రి కపాలం ధరించి కనిపించాడు. అతడు శివశక్తిలా ఉన్నాడు. మూడో కన్ను తెరచేట్టున్నాడు. గౌరీనాథశాస్త్రి తనకు చలిమంటలా ఉపకరించాడు. ఇప్పుడు కార్చిచ్చులా కనిపిస్తున్నాడు. తననే కాల్చేట్లున్నాడు. తన కొంప తగల పెట్టేట్టున్నాడు. అవన్నీ విపరీత పరిణామాలుగా కనిపించాయి శివయ్యకు ఆ రాత్రి. మానవ సమాజంలో నియంతలకు స్థానం లేదు. మహో మహోనియంతలే మట్టికరిచారు. అయితే, నియంతగా ఉండగా ఏ నియంతకూ ప్రజాశక్తి కనిపించదు.

శివయ్య కావాలనుకున్నా రాత్రి నిలువలేదు. చీకటిని నిలుపగలవాడూ, ఉషస్సును అడ్డగలవాడూ కనిపించలేదు.

అనాటి సూర్యుడు వింతగా కనిపించాడు. వెర్రిగా కనిపించాడు. పిచ్చిపిచ్చిగా కనిపించాడు. తొలిసారిగా పొడిచినట్లు కనిపించాడు. అంతటా వెలుగులు చిమ్మినట్లు కనిపించాడు. సమానంగా వెలుగులు పరుస్తున్నట్లు కనిపించాడు. అలాంటి సూర్యుడు ఉదయించరా దనుకున్నాడు శివయ్య. ఉదయించాడు. చీకట్లు పారిపోరాదనుకున్నాడు శివయ్య. పారిపోతున్నాయి.

శివయ్య వాలు కుర్చీలో కూర్చున్నాడు. అతని మనసు మనసులో లేదు. జగన్నాథం లెక్కలు రాస్తున్నాడు.

"దొరా! కాల్మొక్త."

శివయ్య అటు చూచాడు. పెంటయ్య దీనాతిదీనంగా నుంచున్నాడు. శివయ్య పెంటయ్యను చూచాడు. పెంటయ్యలో మార్పులేదు. సూర్యోదయంలో మార్పుంది. అంతే శివయ్యకు ధైర్యం వచ్చింది.

"ఏమిరా పెంటిగా మూడు రోజులాయె పనికిరాక – ఏమనుకుంటున్నవు? నెత్తి తిరుగుతున్నాదిర."

"బాంచను, అమ్మకు కిందెట్టు–మీదెట్టుగున్నది. బాంచెను, వస్తలేను. గంజి తాగిచస్త నంటున్నది. జరన్ని నూకలు పెట్టురండి, కాల్మొక్త."

"లంజకొడక! చదువుకుంటున్రేమో గదరా– పోయి గా పావనమ్మ నడుక్కోని. పనికి రాకుంటే గింజెట్లొస్తదిరా! మాడి చావున్రి, గాడ్డి కొడుకులు."

"పనికి రాకుండ యాడున్నమండి. ఆపతి వచ్చిందని ఇంట్ల ఉన్న. పని చేయకుంటే పసులకు మేత ఏస్తలేరా నుండి. మేం పసుల కంటె అన్నాల మానుండి?"

"బలే! మాటలు నేర్చిన్రు. ఆ పావని మిమ్ముల చెడగొడ్తోంది. ఒకనాడు తీస్కపోయి ఏట్ల కలపుతాది."

"దొరా! నన్నేమన్నా అనురి. పావనమ్మను మాటలంటె బాగుండది. ముసల్ది చస్తాంది, గింజలియ్యమన్న. ఇయ్యకుంటె ఇయ్యనని చెప్పండి గని, మాటలంటె పడెడిది లేదు" – పెంటడు వెనక్కు తిరిగి విసవిసా వెళ్ళిపోతుంటె శివయ్య గుండె గుబగుబలాడింది. "చూసినవా జగన్నాథం?" అన్నాడు. "కలికాలం దొరవారూ!" అన్నాడు జగన్నాథం.

ఆ రాత్రి ఊరు నిద్రపోయింది. ఎక్కడో ఒక గబ్బిలం ఎగురుతూంది. కీచురాళ్ళు రొదచేస్తున్నాయి. వెన్నెల విరిసింది. నర్సిమ్మ ఊతంగ తాగి పదం పాడుకుంటూ సాగిపోతున్నాడు.

"పాలాసంద్రంలోన
పండిన నాసామి
ఏలా ఈలోకమును
ఏలా కున్నావయ్యా!

ఆడ పాలసంద్రంల పండి ఏంచేస్తవు? కల్లు సంద్రంలనన్నా, సార సంద్రంలనన్నా పండక పోయినాడు. నాకింత పోస్తుండె, వాడింత తాగుతుండే. పాలేంచేసుకుంటరా ఒరే నర్సిగా, మనమేం చాయ్ తాగెటోండ్లమా?"

నర్సిమ్మకు చీకట్లో ఎవరో నక్కినట్లు కనిపించింది. "ఎవరాడ? ఏమో చాటుకు నక్కుతాన్రు. ఈడు నర్సిమ్మ. దొరకు కుక్కసువంటోడు. కుక్కపట్టినట్లు పడ్త, ఎళ్లుండి ఇవతలికి" – తూలుతూ నీడవైపు కదిలాడు.

"అన్నా! నేనే మల్లిని" – మల్లమ్మ జంకుతూ వెలుగులోకి వచ్చింది.

"ఓసి మల్లి, నువ్వానె? ఎన్నెట్ల నిన్ను చూస్తె పానాలెగిరిపోతాన్నాయే. అగ్గో ఏమో మూటపట్టినవు చాటుగ. దొరింట్లో నుంచి దొంగతనంగా తెస్తాన్నవులే. ఏమన్నా చేసుకోపో, ఒక్కసారి... ఒక్కపాలి–" నర్సిమ్మ ఆమెను పట్టబోయాడు.

"నర్సిమ్మా! నాకు అన్నసువంటాడివి, నా జోలికి రాకు. దండం పెడ్త."

"నువ్వు నాకు చెల్లెవుకావె, మరదలా" అని మల్లమ్మను పట్టిలాగాడు. మల్లమ్మ రెండు చేతుల్తో నర్సిమ్మను నెట్టేసింది. నర్సిమ్మ వెల్లకింతలా పడిపోయాడు. కాని కొంగు పట్టుకున్న చేయి విడిపోగానే మూట విచ్చుకుంది.

తెల్లని నూకలు నేలపాలయినాయి.

అవి తల్లికి గంజి కాచి పోయడానికి మల్లమ్మ దొంగిలించిన నూకలు!

"ముండా! దొంగతనం చేసినావు?" లేవపోయాడు నర్సిమ్మ.

గూడెంలోంచి గొల్లున ఏడ్పులు వినవచ్చాయి.

"అమ్మా! చచ్చినావె" అని మల్లమ్మ శరవేగంగా ఉరికింది గూడెం వైపు. తల్లిశవం మీద పడి గొల్లుమంది మల్లమ్మ. "ఒరే పెంటా! అమ్మకు గంజి నీళ్ళు పొయ్యలేక చంపుకున్నంరా! అమ్మ చావలేదురా, మనం చంపినం" అని సోకాలు పెట్టింది.

"మల్లక్కా! అమ్మను మనం చంపలేదే – దరిద్రం చంపింది, పేదరికం చంపింది" అని తల బాదుకుని ఏడవసాగాడు పెంటయ్య.

"పెంటా! అమ్మను చంపింది శివయ్యరా! దొరరా! దొర చంపిండురా! దొరే చంపిండు. ఎందరినో చంపిండు, ఇంకెంత మందినో చంపుతడు."

"మల్లక్కా! ఏడవకుండి, ఏడుస్తె తిరిగొస్తదా? బూమి మీదికి వచ్చింది పోయెంటదుకే. పుల్లమ్మకు నూకలు అంతకాడికే ఉన్నయి, తీర్చుకున్నది, పోయింది. ఏడవకుండి" అని ఓదార్చాడు పెంటడు.

"అమ్మా, నిన్ను మేం మింగినమే, దొర మింగిండే, దరిద్రం మింగిందే" అని ఏడుస్తూనే ఉంది మల్లమ్మ. పెంటయ్య కొంత ఊరడిల్లాడు.

"పెంటా, మల్లీ" – ధర్మయ్యతాత పిలిచాడు.

అక్కా, తమ్ములిద్దరూ ధర్మయ్య తాతను పట్టుకుని ఏడ్చారు

"పెంటా! ఏడవకు. జీవి గూడు వదిలింది వెళ్లిపోయింది. కాని, ఇన్నవా మీ అమ్మ చావు మనుకు ఎంత తెలివి చెప్పించిందో" ధర్మయ్య ఇద్దరి తలలూ తన చేతులతో నిమురుతున్నాడు.

"ఏంది తాతా! ఏం తెలివి వచ్చిందే" – ఇద్దరూ కళ్ళు తుడుచుకుని ధర్మయ్య ఛాతిమీదినుంచి లేచి అడిగారు.

ధర్మయ్య తన చేతులు చూచుకున్నాడు. చేతులు వచ్చాయి, కదులుతున్నాయి! చాచాడు, మడిచాడు, బావున్నాయి!!

"తాతా! నీకు చేతులొచ్చినయి" – మల్లమ్మ అన్నది. ఎవరూ నమ్మలేదు. అంతా ఆశ్చర్యంగా చూచారు. గూడెం సొంతం కూడింది.

"ఒరేయి! నాకు చేతులొచ్చినాయి. మనకు తెలివి వచ్చింది."

"ఏందే మనకొచ్చిన తెలివి?" పెంకడు అడిగాడు.

"ఈ గూడెంలో ఎంతమంది చచ్చిన్రు, ఏమనుకున్నం? కాలం మూడింది చచ్చిన్రు అనుకున్నం. మన కరమ అనుకున్నం, ఏడిచి ఊరుకున్నం. పుల్లమ్మ చచ్చింది. పెంటడేమనుకుంటున్నడు? దరిద్రం చంపిందనుకుంటున్నడు. మల్లి ఏమనుకుంటాంది. దొర చంపిండనుకుంటాంది. ఎన్నడన్న ఇట్లనుకున్నమా మనం? ఇట్ల ఇశారించినమా మనం? చచ్చినోండ్లను బొందల పెట్టినం – పిత్త తాగినం, పన్నం. మనకు సత్తెం

తెలుస్తాంది, సత్తెం తెలుస్తాంది. పుల్లమ్మ చావు మనకండ్లు తెరుస్తాంది, తెరుస్తాంది." ఏదో మహా సత్యం ప్రకటించినట్లు గుండెలోంచి – హృదయ కుహరంలోంచి పలుకుతున్నాడు ధర్మయ్య.

పావని వచ్చింది. బ్రహ్మయ్య వచ్చాడు. కొమరయ్య వచ్చాడు అక్కడి వాతావరణం చూచి ఆశ్చర్యపోయింది పావని. సాధారణంగా ఈ పరిస్థితిలో ఏడుపు పెడబొబ్బల్తో దిక్కులు ప్రతిధ్వనించాల్సింది. వాతావరణం సాంతం మౌనంగా ఉంది. ఆలోచనలతో అలికిడి లేకుండా ఉంది.

"ధర్మయ్య తాతా!" పావని పిలిచింది. చిత్తరువుకు ప్రాణం వచ్చినట్లు మల్లమ్మ గొల్లుమంది. "పావనమ్మా! మా అమ్మను దొర మింగిండు" అని పావనిని కావలించుకొని గొల్లుమంది. పెంటయ్య గొల్లుమన్నాడు.

"జీవితం ఒక నాటకరంగం. రంగం మీదికి వచ్చిన పాత్రలన్నీ నిష్క్రమించాల్సిందే. చూచే వాళ్లమీద ప్రభావం వేసి వెళ్ళిపోయిన పాత్ర ధన్యం అయింది. మీ అమ్మ పుల్లమ్మ మన కళ్ళు తెరిచి పోయింది. ఆమె ధన్యురాలు. మళ్ళీ ఇలా గంజిలేక, మందులేక ఎవరూ చావకుండా చూడడం మన కర్తవ్యం. మీ అమ్మ పోయింది. మనమీద భారం పెట్టి పోయింది. ఏడవడం కాదు, ఏం చేయాలో ఆలోచించాలి" అని ఓదార్చింది పావని.

"అమ్మా! పావనమ్మా! నువ్వు దేవతవు తల్లీ! చూదినవా నాకు చేతులొచ్చినయి" అని చేతులెత్తి దండం పెట్టాడు ధర్మయ్య.

"తాతా! ధర్మానికి చేతులొచ్చాయి తాతా! ఈ చేతులు ఇహ పడిపోవు, బలపడ్తాయి. అధర్మాన్ని హతమారుస్తాయి."

"ఇప్పుడేం చేద్దమంటవు తాతా! బజన జరగాలె. సారనీలు కావాలె. ఎట్లొస్తయి?" వెంకడు అడిగాడు.

"ఎంకన్నా! మా అమ్మ బతికుండంగ గంజి పొయ్యలేక పోయినం. ఇప్పుడు సారపోస్తే పున్నెమొస్తదా? ఇట్లనే చావులకని, లగ్గాలకని అప్పులు చేసే బాంచలమయినం. నేను అప్పుతేనే. సారపొయ్యనే. నీయవ్వ ఏమన్న అనురి."
పెంటయ్య తెగించి చెప్పేశాడు.

"అట్లంటే ఎట్లరా, కులానికి కట్టుబడి ఉండాలె" – ఒక ముసలవ్వ అన్నది.

"శాన కాకుంటే మానె – జరన్ని నీళ్ళన్న తెప్పించకుంటే బాగుంటాదే." భజన చేయడానికి డప్పు తెచ్చినవాడు అన్నాడు.

"ఒరే! అప్పులు చేసే మనం ఈడికి వచ్చినం. కూటికి గుడ్డకు అప్పుచేస్తే అర్థమున్నది–నీయవ్వ, అప్పుచేసి సారనీలు పోస్తే పుల్లమ్మ లేచొస్తాదిర?" కొమరయ్య ప్రశ్నించాడు.

"అవ్! అప్పులు చేసే మన మీడికి వచ్చినం. మన పానాలన్నీ కుదువ పెట్టి కాయిదాలు రాసిచ్చి ఇట్లయినం. మనకేమి బూములు లేకుండెనా ఎవసాయం లేకుండెనా? అప్పులు చేసి కాగితాలు రాసిస్తిమి. దొరకు అమ్ముకుంటిమి. ఇట్ల బాంచోల్ల మయితిమి. మల్ల అప్పులెందుకు చేసుడు? ఎంకడు చెప్పిందే బాగున్నది. గప్‌చిప్‌న బొంద పెట్టిరాండి" – ధర్మయ్య ఉవాచ.

"అట్లనే బాగున్నది. అట్లనే బాగున్నది" అన్నారు చాలమంది. కొందరు గొణిగారు.

"తాతా! ఆ కాయిదాల్ల మన బూములున్నయంటివి, అయ్యిపోతే మన బూములు మనకొస్తయా?" మల్లమ్మ అడిగింది.

"పిచ్చిదానా! కాయితా లెట్లపోతయే. పోతే మనకే వస్తయి బూములు. రాకే మయితయి?" ధర్మయ్య చేతులు ఊపుకుంటూ చెప్పాడు

"తాతా! నేనొక్కమాట చెప్పత, ఇంటవా?" బ్రహ్మయ్య అడిగాడు.

"గీ తాగుడే మనను అప్పులపాలు చేసే, ఇల్లు గుల్లచేసే, వల్లు గుల్లచేసే. శివయ్యకేమో పైసనిండుతాండె. తాగుడు బంద్ చేస్తె మంచిది కాదే – శివయ్య మీద ఇంకొక దెబ్బ పడ్తది."

"బంద్! ఇగ తాగెడిది లేదు, మా అమ్మమీద వట్టు." పెంటయ్య అన్నాడు.

"దొరమీద దెబ్బ పడ్తదంటే నేను సుత బంద్!" వెంకడు దీక్ష పూనాడు.

"అట్లనే కానియిరి, ఎవరం తాగం" – అందరూ గునిశారు.

శవం లేచింది. మల్లి గొల్లుమంది. పెంటయ్య నోట్లో గుడ్డపెట్టుకుని ముందు నడిచాడు. కొమరయ్య, బ్రహ్మయ్య కూడా పాడె పట్టారు. పావని వారి వెంట సాగింది. డప్పులు లేవు, చప్పుళ్ళు లేవు, మౌనంగా ప్రశాంతంగా సాగిపోయింది శవయాత్ర.

## 15

బావిదగ్గర బకెట్లో నీళ్ళుపెట్టింది మల్లమ్మ, పీటవేసింది, కచ్చికా, చెంబూ అక్కడ పెట్టింది. మరో బకెట్టులోకి నీళ్ళుతోడి వాకిట్లోకి వెళ్ళింది, కళ్ళాపి చల్లడానికి.

మల్లమ్మతల్లి చచ్చిపోయింది అయినా గూడెంలో ఉండలేదు. ఆ రాత్రే శివయ్య ఇంటికి వచ్చేసింది. ఆమె దొంగతనంగా వెళ్ళింది. చెప్పివెళ్ళలేదు. చెపితే పోనియ్యదు సుభద్రమ్మ. ఆ మాట మల్లమ్మకు తెలుసు. అందుకే చెప్పకుండా వెళ్ళింది. అంతేకాదు, తల్లికి గంజికాచి పోద్దామని పిడికెడు నూకలు తీసుకుని బయల్దేరింది. ఎంతకాదన్నా అది దొంగతనమే. దొరసాన్ని అడిగి తీసికెళ్ళలేదు. అడుగుతే దొరసాని పెట్టదు. చచ్చేదానికి గంజెందుకు? గంజిపోస్తే బతుకుతుందా? అంటుంది దొరసాని. అందుకే చెప్పకుండా తీసికెళ్ళింది. నర్సిమ్మ పట్టుకున్నాడు. నూకలు దక్కలేదు, నేలపాలయినాయి. తల్లి దక్కలేదు, మట్టిపాలయింది.

తల్లి పుల్లమ్మ కనీసం గంజినీళ్ళు లేక చచ్చింది. తాను గంజి పోయలేకపోయింది. తమ్ముడు పెంటడు తల్లికి బాగలేదని చావుబతుకుల్లో ఉందని పనికిరాలేదు. పనికి రాకుంటే గింజలివ్వడు దొర. దొర పనికి జీతం లేదు. జీతం అనేది వడ్డీకింద పోతుంది. పనికి ఇచ్చే గింజలు అప్పుకింద పెరుగుతుంటాయి. మూడు రోజులనుంచి గింజల్లేవు. ఉపాసాలతో చస్తున్నారు. తల్లి గంజన్నా తాగి చస్తానంటూంది. ఆ పరిస్థితిలో పిడికెడు నూకలు ఎత్తుకెళ్ళింది మల్లమ్మ. మల్లమ్మ గింజలెత్తుకు పోయింది. ఫలితం దక్కలేదు, పట్టుబడ్డది.

మల్లమ్మ గుండెలో దుఃఖం దావానలంలా మండుతూంది. ఆమెను కుంగ దీస్తూంది. తల్లి చచ్చిపోయింది. గంజిసైతం గొంతులో పడకుండా ప్రాణాలు వదిలింది. తల్లి పోయిందనే దుఃఖం, గంజిసైతం పోయలేకపోయాననే అనే బాధ. దొంగగా పట్టుబడ్డాననే అనే భయం – మల్లమ్మ గుండె గుబగుబలాడుతూంది. కాళ్ళూ చేతులూ కదలడంలేదు. ఇలాంటి బతుకు ఎందుకు బతుకుతూందో అర్థం కావడంలేదు. చచ్చినా సుఖమే. చావు బానిసత్వం కంటే సుఖమైంది! మల్లమ్మ చచ్చిపోయేదే. ఆమెకేదో మిణుకు మిణుకుమనే ఆశ ఉంది. పట్నం పోయిన పరమయ్య వస్తాడు. తనను విడిపిస్తాడు. అదీ ఆశ. సీత కూడా అలాంటి ఆశతోనే బతికింది. రావణుడు పెట్టిన చెరలన్నీ అనుభవించింది. ఆశ అలంబనంగా జీవించింది సీత. అదే ఆశ అలంబనంగా జీవిస్తూంది మల్లమ్మ. ప్రేమకు అలాంటి బలం ఉంది. అది బాధలను భరింపచేయగలదు. త్యాగాలను చేయించగలదు.

మల్లమ్మ నీరసంగా ఉంది. భరించరాని దుఃఖంతో క్రుంగిపోతూంది, అయినా, ఆమె పని చేస్తూనే ఉంది. చాకిరి చేస్తూనే ఉంది. బకెట్టులోని నీళ్ళలో పేడ కలుపుతూంది. బల్లెం పట్టుకున్న నర్సిమ్మ కనిపించాడు. అతడు లోన అడుగుపెట్టాడు. మల్లమ్మ చూచింది. నర్సిమ్మ యమభటునిలా కనిపించాడు. అతనిచేతిలో యమపాశం కనిపించింది. మల్లమ్మ ఆపాదమస్తకం గజగజలాడిపోయింది.

నర్సిమ్మ మల్లమ్మను చూచాడు. అతని చూపుల్లో మంటలున్నాయి. కంట కాలున్నాయి. కంటకాలు మల్లమ్మ వంటిని గుచ్చుకుంటున్నాయి. మంటలు ఆమెను కాలుస్తున్నాయి. ఇదివరకే ఆమె కాలుతూంది. నర్సిమ్మ ఆమెను మంట పెడుతున్నాడు. మల్లమ్మ గ్రహించింది. రాగల పరిణామాలను ఊహించింది.

"అన్నా! కాలుమొక్త. బాంచనయిత, ఆ సంగతి చెప్పకు. నీ కడుపున పుడ్త. అవ్వ చచ్చింది. నన్నిడిచి పోయింది. నన్ను పొట్టల పెట్టుకో. ఇన్నవా?" మల్లమ్మ బ్రతిమాలింది. ఆమె మాటలకు రాళ్ళు కరగాల్సింది. నర్సిమ్మ రాయి కాదు, అతను కరగలేదు.

నర్సిమ్మ వికటంగా నవ్వాడు. కామం కన్నుకాననీయదు, మల్లమ్మకోసం చాల కాలంగా వల పన్నుతున్నాడు, మల్లమ్మ లొంగడం లేదు. రాత్రి దొరికింది, జారిపోయింది, ఇప్పుడు ఇలా బతిమలాడుతూంది, అతను కరగలేదు, లొంగదీసుకోవాలనుకున్నాడు.

"నువ్వంటే చచ్చిపోతున్ననే, ఒక్క పాలి, రాత్రికొస్త కాదనకు, ఎరిక కానియ్య, ఇన్నవా?" అతని కళ్ళల్లో కామం బుసలు కొడ్తున్నది.

మల్లమ్మ తలవంచుకుంది, నీళ్ళలో పేడ కలుపుతూంది.

"అన్నా!" అన్నది. ఇహ ఏమీ అనలేకపోయింది. ఆమెలో దుఃఖం పొంగుతూంది, కన్నీరు టపటపరాలింది.

"అంతేనంటావా? ఇగ తెల్లారెటాల్ల నువ్వు బతుకుతె చూస్త" అని చెరచెరా నడిచిపోయాడు నర్సిమ్మ. వెళ్ళిపోతున్న నర్సిమ్మను చూస్తుంటే సమీపిస్తున్న యమునిలా కనిపించాడు మల్లమ్మకు.

మల్లమ్మ పరిణామాలు ఊహించుకుంది, వణికిపోయింది. ఏదో ఆలోచనలో మునిగిపోయింది, పరిణామాలకు లొంగి ఊరుకోవడం విన్నటిస్థితి, అందుగురించి

ఆలోచించడం ఈనాటి స్థితి. ఆలోచించడం వస్తేచాలు, అదే మార్గాలు చూపిస్తూంది. మల్లమ్మ ఆలోచిస్తూంది – ఆలోచిస్తూంది. ఆమెకు ఏదో తట్టింది. ఒక చిరునవ్వు నవ్వుకుంది. ఆ చిరునవ్వు వెలుగుకు చీకట్లు పటాపంచలయినాయి. ఆమె చెంబుతో నీళ్ళు తీసుకుని చల్లింది.

నర్సిమ్మ దొడ్లోకి వెళ్ళాడు. సుభద్రమ్మ కచ్చికతో పళ్ళుతోముతూంది. పీటమీద కూర్చుంది. ఠీవిగా ఉంది.

"దండం పెడ్త, బాంచెను" – నర్సిమ్మ అన్నాడు.

"ఏందిర నర్సిమ్మా! పొద్దాలనే వచ్చినావు."

"దొర్సానీ! మీరు నిద్రపోతుండిరి. ఇల్లంతా లూటీ అయితాంది. ఎవరు చూస్తలేరు. నా కండ్ల ముంగల ఇల్లు గుల్లయితాంటె ఎట్ల చూస్తుండమంటరు?"

"ఏందిర, ఏమైందో చెప్పరాదు. ఊరికె గునుగుతవు."

"ఏం చెప్పమంటరు, బాంచెను. గామల్లి మీ ఇల్లంతా దోచుకుంటాంది."

"ఏంది, మల్లి దోచుకుంటాందా? ఇల్లంత దానికే వప్పచెప్పిన, లేకిముండ. అనుకుంటనే ఉన్న. మదం పట్టింది దానికి. మిండనికి పెట్తాందా?"

నర్సిమ్మకు మరో పాయింటు దొరికింది. మల్లమ్మకు బ్రహ్మయ్యకు అంట కడ్దామనుకున్నాడు బ్రహ్మయ్య పెళ్లాం జబ్బుగా ఉంది. చక్కగా అతుకుతుంది అనుకున్నాడు. కాని, తనకు దక్కాల్సిన మల్లమ్మను బ్రహ్మయ్యకు అంటగట్టడం ఎందుకో నచ్చలేదు నర్సిమ్మకు.

"మిండడెవడో ఎరికలేదు బాంచను– గని కుండెడు బియ్యం పట్కపోతుంటె చూచిన, పట్టుకున్న. బియ్యం పారబోసింది. పారిపోయింది, కాల్మొక్త. ఇట్ల ఎన్ని తీస్కపోయిందో–ఇంకెన్ని తీస్కపోతదో – చూసుకోండి బాంచను, ఈ ఇంటి ఉప్పు తింటున్న."

"ఏందిర! బియ్యం తీస్కపోయినాది – బాడ్కపు లంజముండ. దాని పానం తీయిస్తచూడు" అని గబుక్కున లేచి ఉరికింది కచ్చిక చేతితోనే. ఆమె విసురుకు నీళ్ళచెంబు పడి నీళ్ళు వలికిపోయాయి.

"ఏమండీ, ఇన్నారా!" భర్తను కదిపి లేపింది. బొగ్గు భుజానికి అంటుతూందని కూడా గమనించలేదు

"ఏందే! అట్ల లేపుతవు?"

"అయ్యో, కొంప మునిగిపోతుంటె అట్ల నిద్రపోతున్నారేముండి?"

"ఏమైందే? ఎందుకు మునుగుతాంది, రాత్రేమన్నా వాన బడ్డదా?"

"వాన కాదు – వల్లకాదు కాదు. మల్లి ఇల్లు దోచుకుపోయింది రాత్రి. ఉన్నదో ఉరికిపోయిందో ఎరకలే. ఇల్లంత గుల్ల అయింది."

"ఏదా లంజముండ – ఏం చేసింది?" ఇల్లు నిజంగానే గుల్ల అయినట్లు ఉలిక్కిపడి లేచాడు శివయ్య. "యాడున్నది లంజముండ" అని, "మల్లీ" అని కేక పెట్టాడు.

శివయ్య కేకకు ఇంట్లోని పిట్టలు భయపడి ఎగిరి, దారికానక పోట్లాడుకోసాగేయి.

"మల్లీ" – మళ్ళీ అరిచాడు. లేచి ఉరకబోయాడు. ధోవతి కాళ్ళలో తట్టుకుంది. ధోవతి సవరించుకుని ఉరికాడు. ఉరుకుతున్న శివయ్యకు కర్ర అందించింది సుభద్రమ్మ. "వట్టి చేతులతో పోకుండి–ఏం చేస్తదో లంజముండ" అని.

శివయ్య కేక విని మల్లమ్మ చేతిలో చెంబుతో అలాగే ఉరికివస్తూంది లోనికి – కర్రతో శివయ్య బయటికి ఉరికి వస్తున్నాడు. ఇద్దరూ గుమ్మం దగ్గర ఢీ కొన్నంత పనయింది. మల్లమ్మ చేతిలో చెంబు జారి పడిపోయింది.

"చెంబు పగల కొడ్తావు, లంజ ముండ" అని కర్రతో బాదాడు – అతనికి ఆ నెపం దొరికింది – మల్లమ్మ ఏం చేసిందో అతనికి తెలియదు కాని, కసి పేరుకు పోయింది చాలా కాలంగా – కారణం ఇది దొరికింది.

"చేయి జారింది బాంచెను – చంపకుండి." చేతులడ్డం పెట్టి రక్షించుకోవడానికి ప్రయత్నిస్తూంది మల్లమ్మ.

"చేయి జారినాది! అట్లనే జార్తదే మదం ఎక్కువైతే" అని మరోటి వేశాడు.

మల్లమ్మ భుజానికి తాకింది దెబ్బ – బురబురా పొంగింది.

"నాకేమెర్కలే బాంచను–కాల్మొక్త, నన్ను కొట్టకుండి. బతకనియ్యరి బాంచను. కాల్మొక్త" – విలవిలలాడిపోతూంది మల్లమ్మ.

శివయ్యలో రాక్షసుడు చేరాడు. వీరావేశంతో కొడ్తున్నాడు. శివయ్య కర్ర మల్లమ్మ నొసటికి తాకింది. చర్మం చిట్లింది, రక్తం కారుతూంది, జుట్టు ముడి విడిపోయింది, విరబోసుకుంది. వళ్ళంతా దెబ్బలతో హూనం అయింది, దద్దులు వచ్చాయి, శివయ్య లాగి మరోదెబ్బ కొట్టాడు, కర్ర విరిగింది. నిలబడిపోయాడు.

మల్లమ్మను చూచాడు.

మల్లమ్మ శక్తిలా ఉంది, కాళిలా వుంది, దుర్గలా ఉంది. నొసటి నుంచి రక్తం స్రవిస్తూంది. జుట్టు విరిసివుంది, కళ్ళలో రక్తం కనిపిస్తూంది, చేతులు ఎత్తింది. అరచేతుల్లోంచి రక్తం కారుతూంది, శక్తిరూపం భీకరంగా ఉంది. చూచాడు శివయ్య. అమాంతంగా నరసింహుని చూచిన హిరణ్యకశిపునిలా ఒక్క అడుగు వెనక్కువేశాడు.

మల్లమ్మ ఒక అడుగు ముందుకు వేసింది. తల ఒక్కసారి విదిలించింది. వెంట్రుకలు చిందులు తొక్కాయి. కొన్ని నొసటి రక్తంలో చిక్కుకుని నిలిచి పోయాయి. మిగతావి చిందులు తొక్కి నిలిచిపోయాయి.

మల్లమ్మకు శివం వచ్చింది. గంతులేసింది.

"ఊఁ... ఊఁ... ఉదేస్త... కూరేస్త. నరికేస్త... ఒరే, నా మీదనే తిరగబడ్తావుర... ఒరే... నేనెవర్ననుకున్నవుర... ముత్తాలమ్మను... పోచమ్మను... మరియమ్మను... ఇన్నవార! ఇన్నవా?"

సుభద్రమ్మకు మనిషంటే భయం లేదు– దేవర అంటే వణుకు. వణికిపోయింది సుభద్రమ్మ. వణికిపోయాడు శివయ్య.

"ధ్బ్రా్రి..." ఊదింది మల్లమ్మ. "ఊఁ... ఊ... మింగుత... నరుకుత... తరుగుత... తిరుగుత... ఉరుకుత."

"అమ్మో! కొంప మునిగిందే! తల్లీ, నువ్వెవరు చెప్పు, ఏమి కావల్నో చెప్పు...

ఎట్ల పోతవో చెప్పు. ఒరే నర్సిమ్మా! బాపనాయిన్ను పిలువరా!" సుభద్రమ్మ రొప్పుతూంది, మల్లమ్మ కాళ్ళమీద పడింది.

"నేనెవరో ఎరిక లేదానే... పుల్లమ్మను... నిన్న చచ్చిన... ఇయ్యాలొచ్చిన... నాకు గంజి పొయ్యనియ్యలే... నీ ఇల్లు తుడిచిపెడ్త. ఇల్లు ఊదుత... వాకిలి ఊదుత... ఇదంత మశాణం చేస్త."

"తల్లీ, మన్నించు. తెలియక తప్పు చేసినం. నీకు కల్లు కుండలు పోస్తం... సార సీసలిస్తం... అన్నపు రాసులు పెడ్తం... అన్ని పెడ్తం... ఎల్లిపోతల్లీ!"

శాస్త్రిగారు వచ్చారు. వారు నిరాసక్తంగా ఉన్నారు. వారిలో ఏదో బలమయిన మార్పు కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది. శివయ్య శాస్త్రులను చూచాడు.

"శాస్త్రిగారూ! కాపాడండి. శివశక్తి మా యింటికి వచ్చింది, పారదోలండి."

"శివయ్యగారూ! పుల్లి గంజిలేక చచ్చింది. దాని ఆత్మ ఘోషించి ఉంటుంది. ఇట్ల బిడ్డమీద పూనింది."

"ఊం... ఊ...ం పుల్లమ్మనే... గంజి పొయ్యనియ్యలే... నీ ఇల్లు తుడిచిపెడ్త... ఊం... ఊం..."

"తల్లీ, చల్లబడు, శాంతించు. అపరాధం జరిగిపోయింది. కావలెనన్నయి ఇస్తరు,. సాంబ్రాణి తెండి, నిమ్మకాయలు తెండి, కొబ్బరికాయలు తెండి" – ఆదేశించారు గౌరీనాథశాస్త్రిగారు.

"ఊం... ఊ...ం పుల్లమ్మనే... అన్ని కావాలె... అన్ని పొయ్యాలె."

"అన్ని ఇస్తం తల్లీ, అన్ని పోస్తం" – సుభద్రమ్మ భక్తిగా మొక్కింది.

శాస్త్రిగారు సాంబ్రాణి పొగ వేశారు. నిమ్మకాయలు నరికారు, కొబ్బరికాయలు కొట్టారు.

మల్లమ్మ అలసిపోయినట్లు పడిపోయింది. స్పృహ తప్పినట్లు పడిపోయింది.

"మంచంమీద పడుకోబెట్టండి. తెలివి వచ్చేదాకా ఏమనొద్దు. తెలివొచ్చిం తరవాత ఈ సంగతులేమి అడగొద్దు" అని శాస్త్రిగారు వెళ్ళిపోయారు.

సుభద్రమ్మా, శివయ్యా కలిసి మల్లమ్మను ఎత్తి మంచంమీద పడుకోబెట్టారు.

మల్లమ్మకు దెబ్బలు తిన్న బాధలేదు, జయించాననే ఉత్సాహం ఉంది. తాను దొరను వణికించింది. దొరసాన్ని వణికించింది!

## 16

శివయ్య వాస్తవం తెలుసుకున్నాడు, మల్లమ్మ విషయంలో వాస్తవంగానే బాధ పడ్డాడు. మల్లమ్మ చేసింది పెద్ద అపరాధం అనిపించలేదు అతనికి. కాసిన్ని నూకలు పట్టుకుపోయింది, చచ్చే తల్లిగొంతులో కాలే గంజి పోయడానికి. మల్లమ్మా మనిషే. తల్లి విషయంలో అనురాగం ఉండడం తప్పుకాదు గోరంతను కొండంత చేశాడు నర్సిమ్మ. దాన్ని మరింత చేసి చెప్పింది సుభద్రమ్మ. ఆమె మాట విన్నాడు తాను. రెచ్చిపోయాడు. మల్లమ్మ శక్తి స్వరూపం వహించింది. తల్చుకుంటేనే గుండె జల్లుమంది. శాస్త్రిగారు రక్షించారు. నిజంగా మల్లమ్మ నిప్పులాంటిది. భర్త ఋణం తీర్చుకోవడానికి తన ఇంట్లో పడి చాకిరి చేస్తుంది.

శివయ్యకు మల్లమ్మ విషయంలో సానుభూతి ఏర్పడుతుండగానే మరో సమస్య పడగ విప్పి ప్రత్యక్షం ఐంది. గూడెంలోని జనం తాగుడు మానారని తెలిసింది. వారు తాగుడు మానితే తన ఇల్లు గుల్లయినట్టే. సారాయి కంట్రాక్టుకు సర్కారుకు పైకం చెల్లించాలి. అంతేకాదు. ఈ తాగుడు వల్లనే వాళ్ళు తన దగ్గర అప్పులు చేస్తున్నారు. పెళ్ళిళ్ళకు, ప్రయోజనాలకు, చావులకు, దినాలకు వాళ్ళు అప్పులు చేయకుంటే తన ఉనికి లేదు. వాళ్ళు తాగి తందనాలు ఆడాలి. తన దగ్గర వడ్డీలు పెరగాలి. అప్పుడే వాళ్ళు తనకింద పడుంటారు. దీనికంతటికీ కారణం పావని. ఆమె ఊళ్ళోకి రావడమే తనకు అపాయం. ఆమె బడి పెట్టింది. చదువు చెపుతూంది. వాళ్ళకు వాస్తవాలు చూపిస్తుంది. పావని కొరకరాని కొయ్యగా ఉంది. ప్రభుత్వం కూడా తప్పటడుగులు వేస్తుంది. పేదలకు సాయం చేస్తుందట–పేదలకు!! శివయ్య పెద్దగా నవ్వాడు. ఎందుకు నవ్వాడో అతనికే అర్థం అయింది. పేదలు దైవోపహతులు. వాళ్ళను మనుషులేం బాగుచేస్తారు? వెర్రి భ్రమ. ఈ ప్రభుత్వం నిలవదు అనుకున్నాడు.

"దొరా! అందరొచ్చిన్రు, పట్టుకొచ్చిన" – నర్సిమ్మ కేక వినిపించింది. శివయ్య కళ్ళు తెరిచి చూచాడు. చీకటిగా ఉంది. తాను చీకట్లో కూర్చొని ఆలోచిస్తున్నాడా? ఇంకా ఉదయం కాలేదా? అని చూచాడు. కిటికీ మూసివుంది. కిటికీ తెరిచాడు. వెలుగు భళ్ళున లోన ప్రవేశించింది. నవ్వుకున్నాడు. వెలుగును మూయడానికి కిటికీ తలుపు చాలునన్నమాట! బయటికి నడిచివచ్చాడు. గూడెం సాంతం వాకిట్లో కనిపించింది.

"దండాలు పెడ్తం బాంచను పిలిచిన్రట వచ్చినం" – వెంకడన్నాడు.

"అరే! పెంటడు కండ్లపడ్తలేడేమిటి!" శివయ్య చూపులు ఒకసారి సర్వే చేశాయి.

"వచ్చిన బాంచను ఈడ ఉన్న" అని వెనుకనుంచి ముందుకు వచ్చిన పెంటయ్య "దొరా! మా అమ్మ చచ్చింది. దిక్కులేనోండ్లమయినం" అని ఏడ్చినంతపని చేశాడు.

"అరే పెంటడూ, ఏడ్వకు. అందరం పొయ్యేటోండ్లమే. మీ అమ్మ ఇయ్యాళ, మనం రేపు. పుల్లమ్మ పెద్దమనిషయింది. వచ్చినపని తీర్చుకున్నది. ఎల్లిపోయింది."

"అంతే బాంచను, బాగ చెప్పిన్రు. మా అవ్వ కాలంతీరి పోలేదుండి. దొరలు తల్చుకుంటె చచ్చేటోండ్లు బతుకుతరు, బతికెటోండ్లు చస్తరు" – వెంకడు మొరటుగానే శివయ్య చెప్పిన వేదాంతాన్ని ఖండించాడు.

వెంకయ్య మాటలు శివయ్యకు చురుక్కుమన్నాయి. మూగవాళ్ళకు మాటలు వస్తున్నాయి అనుకున్నాడు, 'మూకం కరోతి వాచాలం' అని దేవుణ్ణి గురించి శాస్త్రిగారు చెప్పినట్లు గుర్తు. పావని మూగవాళ్ళకు భాష నేర్పుతూంది.

"అరే పెంటడూ! మీ అమ్మ నిన్ను కన్నది, పెంచింది, పెద్దవాణ్ణి చేసింది. దాన్ని కుక్కను ఈడ్చేసినట్లు ఈడ్చేస్తివేమిరా, ఇది నీకు న్యాయమేనా?"

"దొరా! మేం కుక్కలకన్న ఎట్ల ఎక్కువుండి? కుక్కచస్తె ఎంతో మేంచస్తె అంతే. మా అమ్మ చచ్చేటపుడు గంజి పొయ్యలేక పోయినం. చచ్చినంక వైభోగం చేస్తే దానికి చేర్తాదుండి? బతికినోండ్లను గురించి ఇశారించే దొరలు లేరు.

చచ్చినందాన్ని గురించి ఎందుకులేరి. ఇట్ల బతకనియ్యరి బాంచను" - పెంటయ్య వాస్తవాన్ని బట్టవిప్పి నగ్నంగా చూపాడు.

"అరే! అట్లంటె ఎట్లరా? చచ్చింది దేవత అయితదట. నువ్వు విందులు చేయకుంటే దాని జీవాత్మ ఈ ఊరిని పట్టుకొని ఏళ్ళాడుతుంటది. చెప్పింది ఇను, ఎంత కావాల్నో చెప్పు. ఇస్త. ఇంత తాగుడు పోయించు."

"దొరవారూ! మీ అసువంటి దానకర్నున్ని చూడలేదుండి. వద్దంటే అప్పులిచ్చి దినవారాలు చేయిస్తున్నరు" - దస్తరం ముందు కూర్చున్న జగన్నాథం శివయ్యను పొగిడాడు.

"బతికినోల్లకు పూటకు లేదు, చచ్చిందానికి విందులేమ్టికిలేరి. అయినా, ఏం చూసి బాకీపెట్టరుండి? పెంటడు నిండ మునిగి ఉన్నడు-" వెంకయ్య వేయాల్సిన ప్రశ్నవేశాడు.

"అదేందిరా అట్లంటవు? పెంటడు లగ్గం చేసుకోడా? వానికి పిల్లలు పుట్టరా?"

"నేను లగ్గం చేసుకోన్రి. బాంచోల్లను పుట్టించటానికి పెండ్లెందుకుండి? మా అయ్య నన్ను బాంచోణ్ణి చేసి పుట్టించిండు. చాలు, నేను కూడా బాంచోళ్ళను పుట్టించాల్నా! మీరు నాకు బాకీ ఇయ్యొద్దు, నేను లగ్గం చేసుకోవద్దు."

"రే! చిన్నగ చెప్తాంటే ఇంటలేరు, లంజకొడుకుల్లార! ఆ చచ్చినముండ గంజో, గంజో అని చచ్చిందిట. ఇప్పుడది ఊరు పట్టుకుని తిరుగుతుంటది. మీకేంది, మీ సంగతి చూసుకుంటార్రు. నేను ఊరిసంగతి చూడాలె. ఇన్నవా? ఎంత కావాల్నో బాకీ తీసుకో, దిన వారాలు చెయ్యి, ఇన్నవా? ఇగో, శాస్త్రుర్లుగారుకూడ వస్తన్రు" అని వచ్చే శాస్త్రుర్లు గారికి స్వాగతం పలికి, కుర్చీలో కూర్చుండబెట్టి విషయం వివరించి, ధర్మం చెప్పమన్నాడు.

"అయ్యగారూ! గా చచ్చింది గంజి లేక చచ్చింది. మేం కల్లుతాగితె దానికి అందుతాదుండి బాంచను, నాలం చెప్పండి" - వెంకడు అడిగాడు.

శాస్త్రుర్లుగారు తల గోక్కున్నారు. సుదీర్ఘంగా ఆలోచించసాగారు. అందరూ మౌనంగా ఉన్నారు. శాస్త్రిగారి తీర్పుకోసం ఎదురుచూస్తున్నట్లున్నారు.

"దొరవారూ! ధర్మం కాలాన్నిబట్టి మారుతుంటుంది. యుగధర్మాన్ని మించిన ధర్మం లేదు. ద్రౌపదికి అయిదుగురు భర్తలు, అది ఆనాటి ధర్మం. ఈనాడు చెల్లదు. శాస్త్రంలో దినవారాలు చెయ్యమన్నారుగాని శక్తినిమించి చేయమనలేదు. రాముడు దశరథునికి గారపిండితో పిండాలు పెట్టినాడు. 'యదన్నః పురుషోభవతి తదన్నాస్తస్య దేవతాః' అన్నారు. ఉన్నదానిలో దినవారాలు చేయమన్నారుగాని అప్పుచేసి చేయమనలేదు" అని శాస్త్రులవారు చెప్పి ఊరుకున్నారు.

"శాస్త్రిగారూ! మీరు వాండ్ల పక్షం వహిస్తున్నారు" - శివయ్య మండిపడ్డాడు.

"ధర్మానికి పక్షపాతంలేదు. వస్తా దొరవారూ!" అని లేచి సాగిపోయారు శాస్త్రిగారు. చూస్తూ ఉండిపోయాడు శివయ్య. అతనికి అంతా విచిత్రంగా ఉంది. శాస్త్రిగారు కూడా మారిపోతున్నారు.

"అరే పెంటిగా! చిన్నగా చెప్తె నీకు నెత్తికెక్కుతలేదు. తీసుకుంటవా

అప్పుతీసుకుని దినవారాలు చెయ్యి, లేకుంటే తీసుకున్న అప్పు కక్కి ఈడినుంచి కదులు, ఇన్నవా?"

జనంలో కలకలం బయల్దేరింది. ఏం చేయాలో ఎవరికీ అర్థం కాలేదు. తలా ఒక మాటన్నారు. ఎవరేమంటున్నదీ అర్థం కావడం లేదు.

"ఉన్నట్లుండి తెమ్మంటె యాడినుంచి తెస్తడండి?" వెంకడు తెగేసి అడిగాడు.

"లేకుంటె దావా పెట్టి జేలుకు పంపిస్తా. శివయ్యంటే ఏందో నీకు అర్థం అయితలేదు. తీసుకో ఎంత కావాల్నో– ఇయ్యాలరాత్రికి గూడెంలో ఇందుకావలె. కాదంటవా, జేలుకు తయారుగుండు, ఇన్నవా?"

"పంపుడి జేలుకు. అడ ఇంత బువ్వన్న ఏస్తరు గద. మల్లొచ్చెటాల్కల్ల బాకీ ఉండకుండ అయితది. తయారుగున్ననుండి, పంపుండి. ఇగో, బేడీ లేయించుండి." చేతులు ఎత్తి చూపించాడు పెంటడు.

తెగపడ్డవాణ్ణి ఏం చేయడం? ఏమీ అర్థంకాలేదు శివయ్యకు. కోపంతో మండి పోతున్నాడు. కళ్ళు చింతనిప్పులవుతున్నాయి. కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి.

"ఒరే నర్సిగా! వీణ్ణిపట్టి చెట్టుకు కట్టెయ్యరా చూపిస్త తడాఖా! ఏమనుకుంటాడో గాడ్ది కొడుకు. పానంతీసే ఈణ్ణించి పంపుత. వీడు కూడ వీని అమ్మను చేరుకుంటాడు" – గట్టిగా అరిచాడు శివయ్య. అరుపుకు ఇల్లు దద్దరిల్లింది.

జగన్నాథం దస్తరం వదిలి ఎవరికీ చెప్పకుండా జారుకున్నాడు– శివయ్యకు రెండు వేళ్ళు చూపించి.

"ఏమంటావురా? దొర చెప్పినట్లు ఇను. గాడ్ది కొడక!" అంటున్నాడుగాని నర్సిమ్మ ఉన్నచోటునుంచి కదల్లేదు.

శివయ్య మండిపడ్డాడు. వీడూ వాళ్ళలో కలవలేదు గదా అని భయపడ్డాడు.

"అరే నర్సిగా! బొమ్మోలె నిలపడ్డవేమిరా! పడ్తవా? నన్ను పట్టమంటవా?"

నర్సిమ్మ బల్లెం పట్టుకొని ముందడుగు వేశాడు. వెంకడు వచ్చి పెంటనికి చాటు నిల్చున్నాడు. ఉన్నజనం సాంతం పెంటణ్ణే చుట్టేశారు. నర్సిమ్మకు పెంటడు అందేట్టు లేదు. అయోమయంలో పడ్డాడు నర్సిమ్మ. బల్లెం చేతులోంచి జారుతుంది. నిస్సహాయుడయి శివయ్యను చూచాడు.

"బాకీ చేయకుంటె పానం తీస్తడా? పెంటడి నెందుకుండి, అందరిని చంపుండి. ఊరిని పీనిగలపెంట చెయ్యుండి. కానియ్యుండి, ఎంతమందిని చంపుతరో చూస్తం. అన్నాలంగ అప్పులు పెట్టి, వడ్డీలు పెంచి, కూడు పెట్టక, కూలి ఇయ్యక, ఈ ఊరినంత పశులదొడ్డి చేసిన్రు. కుక్కిన పేలోలే పడుంటే ఇంకా కుక్కుతాన్రు. కుక్కుండి, చంపుండ్రి. ఇంత పాపం ఊరికే పోతదా! పోరలు లేకుండ అయిన్రు కద! ఇగ అందరిని చంపుండి. సుబద్రమ్మ, నువ్వు ఉట్టికట్టుకొని ఊరేగిన్రి, ఊరేగవయ్యా – ఊరేగూ! రా, ఇంకా కూచున్నవేం? చంపు, ఎంతమందిని చంపుతావో ఊఁ చంపవేం" – బయటినుంచి వచ్చిన బ్రహ్మయ్య ఉద్రేకంగా శివయ్య ముందుకు ఉరికాడు. పైపంచె అందించి, ఉరి తీయమన్నాడు.

శివయ్యకు అంతా అయోమయంగా ఉంది. అంతా కటిక చీకటిలా ఉంది. ఆకాశం విరిగిపడినట్లూ, సముద్రాలు ఇంకిపోయినట్లూ, సూర్యుడు నేలకూలినట్లూ

ఉంది. ఏం చేయాలో అర్థం కాలేదు. చంపమని మీదికి వచ్చే బ్రహ్మయ్యను ఏం చేయగలడు? చావడానికి సిద్ధంగా ఉన్న జనాన్ని ఏం చేయగలడు? వారంతా ఒక్కుమ్మడిగా తనమీద పడి ప్రాణాలు బలిగొంటె ఏం చేయగలడు? తానెంత? తన శక్తి ఎంత – అర్థం అయింది. ఎంత పెద్ద పామైతేనేం, చలిచీమలకింద నిలువగలదా? ఏం చేయాలి తాను? శివయ్య దిగ్గున లేచి నుంచున్నాడు. గబగబా లోనికి ఉరికాడు. తలుపులు దభాల్న వేసుకున్నాడు. "అయిపోయినాదిర గాడ్డి కొడుకుల్లార! రేపట్నించి ఏం తింటరో చూస్త" – గట్టిగా కేకపెట్టాడు. కాని, ధ్వనిలో వణుకు కనిపిస్తూంది. భయం వ్యక్తం అవుతూంది.

"చూస్తం మేం గూడ. తిండిలేకుంటే మాడి చస్తం. నీ పనికి అయితే రాము. చూస్తం ఎవరు గెలుస్తారో – రాముడే గెలుస్తడో – రావణాసురుడు గెలుస్తడో?" బ్రహ్మయ్య గట్టిగా అన్నాడు. అతని దృష్టిలో స్థిరత్వం ఉంది. పట్టుదలుంది. ప్రాణానికి తెగింపు ఉంది.

"అంతే – చస్తం – తేల్చుకుంటం. శివయ్య గెలుస్తడో, మేం గెలుస్తమో!" అంతా ఒక్కుమ్మడిగా అన్నారు. అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

శివయ్య ఇంకా వణుకుతూనే ఉన్నాడు.

శివయ్య ఇంకా వగరుస్తూనే ఉన్నాడు.

# 17

"చూస్తం – తేల్చుకుంటం" అని ఆవేశంగా అన్నది గూడెం. ఉద్రేకంలో అన్నారు జనం. కాని, వాస్తవంగా రంగంలోకి దిగుతే "తేల్చుకోవడం" అంత తేలిక కాదని తెలిసివస్తూంది. బానిసత్వం అన్నా, బంధం అన్నా – సాయంకాలానికల్లా శివయ్య వాళ్ళో గింజలు పోసేవాడు. ఆకలి ఆరడానికి అవి పనికి వచ్చేవి. గూడెం పనులు బంద్ చేసింది. తిండి బంద్ అయింది. ఏదిలేకున్నా మనిషి జీవించగలడు. తిండి లేకుంటే జీవించడం కష్టం. గూడేనికి ఏదీలేదు. ఉన్నదే తిండి. అది కూడా ఆగిపోయింది. తిండి గింజలను మించిన రాజకీయం లేదు. అది ఆగితే అంతా లొంగివస్తారు.

గూడెంలో నిప్పు రాజటం లేదు. జనం ఆకలితో అలమటించిపోతున్నారు. పసిపిల్లలు పాలులేక తల్లడిల్లిపోతున్నారు. గూడెం సాంతం పాడుబడ్డట్లుంది. నిర్జీవంగా ఉంది. నిరామయంగా ఉంది. శక్తిహీనంగా ఉంది. శ్మశానంలా ఉంది.

"ఎంకన్నా, ఆకలి మండిపోతున్నదిర! ఎన్నాళ్ళని ఇట్లుంటం? అగో చూడు, పోరలు అన్నుపట్టి ఏడుస్తన్రు. అరే, తిండికి లేనోడు గెలిచినాద్ర యాణ్ణన్న?" ధర్మయ్యకు చేతులు వచ్చినప్పటినుంచీ ఆకలి ఎక్కువయింది.

"నీయవ్వ, గిదంత గా బమ్మయ్య చేసిండు – పోదాం పారి వానింటిమీదకి." పిచ్చయ్య నేలమీద ఊసి లేచి నుంచున్నాడు.

"దొరకాడికిపోయి కాళ్ళు పట్టుకుందం. ఇంత గంజన్న పోస్తాడు" – ముసలి యల్లమ్మ మూలిగింది. లేవలేక కూలబడ్డది.

"అవ్వా! ఆకలి. అయ్యా! ఆకలి" – గూడెంలో ప్రతి గుడెసెనుంచీ ఆకలి కేకలు వినిపిస్తున్నాయి.

ఆకలిని మించిన ఆపద లేదు. అది గూడాన్ని ఆవహించింది. పెంటయ్య డొక్క కూడా మాడుతూంది. నిగ్రహించుకుంటున్నాడు. కానీ, ఆకలికేకలు వింటుంటే గుండె మండుతూంది. శివయ్య తమను మాడుస్తున్నాడు. కక్ష తీర్చుకుంటున్నాడు.

"నీయవ్వ, గా శివయ్యగాని తల పగులకొట్టి గింజలు తెచ్చుకుందాం పారి. ఆనాడే ఖతం చెయ్యాల్సింది, బమ్మయ్య ఆపిండు. లేరి పోదాం. వాడొక్కడు, మనం ఇందరం" అన్నాడు పెంటయ్య – పళ్ళు పటపట కొరికాడు – నిజంగానే శివయ్యను నరుకుతున్నట్లు అభినయించాడు.

"అరె పెంటిగా! శాన గరంగున్నవుగని– నువ్వు శివయ్యను చంపుతవు. పోలీసోళ్ళొచ్చి పట్కపోతరు. మళ్ళ ఇంకో శివయ్య ఎలుస్తాడు. వీండ్లది రావణాసురుని సంతతి– ఓ తలకాయపోతుంటె ఇంకోటి మొలుస్తుంటది" – అప్పుడే అడికి చేరిన బ్రహ్మయ్య అన్నాడు.

"ఇగ చూడు, బళ్ళ గోదాం పెట్టిండు. ఆ గింజ లూటీ చేస్తం. ఆకలికి ఆగలేకుండన్నమే బ్రహ్మయ్యన్నా!" వెంకడు నీరసంగా అన్నాడు.

"తప్పు, అలా చేయరాదు. మనం లూటీ చేస్తాం, ఇప్పటికి ఆకలి తీర్చుకుంటాం. పోలీసులువచ్చి మనమీద నేరం మోపుతారు. మనను దొంగలను, తాగుబోతులను చేస్తాడు శివయ్య. మనం మనుషులంగా శివయ్యను ఎదురుకోవాలి. దొంగలంగా కాదు. నేను గవర్నమెంటుకు రాశాను. ఆ గింజ మనకే దక్కుతుంది."

"సర్కార్ల అంతా శివయ్య మనుసులే కాదుండి. అడ మనమాట ఎవడు ఇంటడు?" ధర్మయ్య సందేహం వ్యక్తపరిచాడు.

"ధర్మయ్యా! పరిస్థితులు మారుతున్నాయి. కాకుంటె శివయ్య నన్నీ ఊళ్ళో ఉండనిచ్చేవాడా? మిమ్మల్ని ఇలా బతకనిచ్చేవాడా? ఇప్పటికే మిమ్మల్ని నన్నూ మసిచేసేవాడు. శతాబ్దాల బానిసత్వం పోవడానికి పోరాటం జరుపుతున్నాం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు బలి కోర్తాయి. ఎన్ని కష్టాలయినా ఓర్చుకుని నిలబడ్డప్పుడే మనం దాన్ని సాధించగలం."

"అమ్మా పావనమ్మా! నీ మాటలు శాన బాగున్నాయి. కాని, ఆకలిని ఆర్పెటట్టు లేవమ్మా! శివయ్య కాళ్ళన్న పట్టుకోవాలె. గోదాంనుంచి గింజలన్న తెచ్చుకోవాలె. నీ మాటలింటె కడుపు నిండది. నీ మాటలినే ఈడికొచ్చినం. ఇగ ఇనం" – పిచ్చయ్య వెటకారంగా అన్నాడు.

"ఒరే పిచ్చిగా! ఏమంటున్నావురా? దేవతను తిడ్తున్నావుర గాడ్దికొడుక! పురుగులపడి చస్తవు. అరే, ఎన్నడన్న పూర కడుపుకు తిన్నావుర. ఎన్నడన్న అందరం కలిసి పన్నాంర! నలుగురితోటి చావు పెండ్లితో సమానం కాదుర! అందరం కలిసి చస్తున్నం. గాడ్దికొడక, ఏడవకు, చెంపలేసుకో" – ధర్మయ్య అన్నాడు–తాను లెంపలు వేసుకుంటూ.

"పిచ్చయ్యా! మిమ్మల్ని చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతూంది. మీకు తిండి దొరకని నాటినుంచే నేనూ తిండి మానేశాను. చూడండి డొక్క" అని చూపించింది పావని.

"అమ్మా తల్లీ! నువ్వు ఉపాసాలుంటున్నావా?" ముక్తస్వరంగా అన్నారంతా.

"ఇదిగో, ఇవ్వాళ నా జీతం వచ్చింది. ఇదిగో డబ్బు" అని ధర్మయ్యకు అందించింది. "గింజలు కొని, గంజి కాచండి. ఎవరికివారు కాదు – ఒకేచోట కాచండి. అందరం తాగుదాం. నేనూ మీతోనే ఉంటా" – పావని పలికింది.

"అమ్మా! అనరాని మాటన్న, తల్లీ మన్నించు. నువ్వు దేవతమ్మా! మా కోసం దేవుడు నిన్ను పంపిండమ్మా! అమ్మా, గరీబోల్లమంత అంతేనమ్మా, అమ్మా! నన్ను మన్నించు తల్లీ!" అని కాళ్ళమీద పడ్డాడు పిచ్చయ్య.

పిచ్చయ్యను కాళ్ళమీద నుంచి లేవనెత్తింది. "పిచ్చయ్యా! మేలుచేసేవాణ్ణి గుర్తించటం కష్టమయ్యా! గొర్రె కసాయివాణ్ణే నమ్ముతుంది."

"అయ్యో! ఎంత అన్యాలం జరిగింది. పట్నం పోయిన. ఇప్పుడే వస్తాన్న. అన్ని తెలుసుకున్న. ఇగ ఉపాసాలుండేడిది లేదు. కుండలమ్మిన పైకం తెచ్చిన. ఇగోనె పైకం" – నోట్లు చేతిలో ఎట్టుకుని గంతులేశాడు కొమరయ్య. "పైకం శివయ్య కిచ్చేడిది లేదు."

"నీయవ్వ, ఇగేం చేస్తడే శివయ్య. ఇరుకున పడ్డడె శివయ్య" అని గంతులేశారు, పిచ్చయ్య. పెంటయ్య, వెంకయ్య వంట ప్రయత్నాల్లో పడిపోయారు. గంజి కాచుకుని అంతా వరసగా కూర్చుని తాగుతుంటె అందరికీ సంబరంగా ఉంది. అదో కొత్త వింతగా ఉంది.

"మల్లిని చూసినవా, దొరిల్లిడిచి వస్తలేదు. కూటికి చస్తమని బుగులు దానికి." వెంకడు అన్నాడు గంజి చప్పరిస్తూ.

"ఒరే ఎంకన్నా! దాని మాట ఎత్తకురా. అది చచ్చిందాంట్ల లెక్క. నాకు అమ్మలేదు, అక్కలేదు" అన్నాడు పెంటయ్య.

గూడెంలో ఉమ్మడి జీవితం బాగానే సాగుతూంది. పావని అక్కడే మకాం పెట్టింది. బ్రహ్మయ్య గూడెంలో ఉండే పనులు చేసుకుంటున్నాడు. కొమరయ్య సారె అక్కడే తిరుగుతూంది. పావని వారికి ప్రపంచాన్ని గురించీ, వస్తున్న – రావలసిన మార్పులను గురించీ వివరిస్తూంది. శుభ్రంగా ఉండడాన్ని గురించి బోధిస్తూంది. ధర్మయ్యకు ఇదంతా ఆనందంగా ఉంది. చేతులెత్తి పాటలు పాడుతున్నాడు.

కూర్చుని తింటే గుట్టలు కరిగిపోతాయి. కూలి సంపాదిద్దామని వెంకడూ, పెంటయ్య పొరుగూళ్ళకు బయల్దేరారు. భూస్వాములు ఎవరూ పనికి రానివ్వం అన్నారు. అంతటితో ఆగిపోలేదు. పంటలు కోతకు వచ్చాయి. గింజ రాలిపోయేట్లుంది. శివయ్య పొరుగూళ్ళ నుంచి కూలీలను పిలిపించాడు. వెంకడూ, పెంటయ్యా పొరుగూళ్ళకు వెళ్ళారు. కూలీలకు తమ బాధలు వ్యక్తపరిచారు. జరిగిన కథంతా చెప్పారు. తమ ఊరికి కూలికి రావద్దని బ్రతిమలాడారు. శివయ్య ప్రయత్నాలు ఫలించలేదు. ఒక్క కూలీకూడా ఆ ఊళ్ళో అడుగు పెట్టలేదు.

పరిస్థితి విచిత్రంగా ఉంది. పొలాల్లో పంట ఉంది. ఇంట్లో శివయ్య ఉన్నాడు. గూడెంలో కూలీలున్నారు. కూలీలు, బానిసలు, కూటికి లేనివాళ్ళు–శివయ్యకు వ్యతిరేకంగా కట్టుకట్టారంటే విపరీతంగా ఉంది. వింతగా ఉంది. చోద్యంగా ఉంది, జనం కళ్ళప్పచెప్పి చూస్తున్నారు. చుట్టుపట్ల అందరూ ఆసక్తిగా పరిశీలిస్తున్నారు.

## 18

శివయ్య పరిస్థితి విచిత్రంగా ఉంది. ఒకనాడు అతన్ని చూస్తే పిట్టలుసైతం నీరు తాగలేదు. ఇప్పుడు అతన్ని చూచి పిట్టసైతం బెదరడం లేదు. ఊళ్ళో అతన్ని ఎదిరించినవాడు లేడొకనాడు. ఇవ్వాళ అతనికి అనుకూలుడు లేడు. శాస్త్రిగారూ – జగన్నాథం కూడా అతని ఇంటికి రావడం లేదు. నర్సిమ్మ పశువులకు మేత వేస్తున్నాడు. అంతే. మేపడానికి తీసికెళ్ళడం లేదు. మల్లమ్మ ఇంటిముందు కళ్ళాపి చల్లుతూంది. ఇంత ఉడకేసి పెడ్తూంది. వాళ్ళిద్దరూ లేకుంటే శివయ్య పని మరీ కడుహీనం అయిపోయేది.

శివయ్యకు ఏమీ తోచటం లేదు. చూస్తూ చూస్తూ తన దొరతనం కూలిపోయింది. పెత్తనం రాలిపోయింది. అధికారం అంతరించింది. అస్తమించింది. అతని మాట చెల్లడం లేదు. అతని పనులు జరగడం లేదు. అందుకు కారణం అతని దౌర్జన్యం, అతడు చేసిన అక్రమాలు – అన్యాయాలు, సాగించిన హింస. ఆ విషయం అతడు గుర్తించలేదు. అధికారానికి వివేకం ఉండదు. విచక్షణ ఉండదు. విజ్ఞానం ఉన్నా పని చేయదు. శివయ్య వాస్తవం గుర్తించలేదు. సాధించాలనుకున్నాడు. జనాన్ని అణగదొక్కాలనుకున్నాడు. ఊడిపోయినా తన పెత్తనం మళ్ళీ రాబట్టుకోవాలనుకున్నాడు. స్థిరపరచుకోవాలనుకున్నాడు.

శివయ్య పట్నం చేరుకున్నాడు. అక్కడా అతనికి చుక్కెదురు అయింది. పంట పొలంలో రాలి పోతుందనీ, అది దేశానికి నష్టం అనీ, తనకు సాయం చేసి పంటను రక్షించి, తద్వారా దేశాన్ని రక్షించాలనీ అధికారులకూ, అధినేతలకూ విన్నవించాడు శివయ్య. బానిస విధానం రద్దయిందనీ, వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించామనీ జవాబు వచ్చింది. వాస్తవంగా తాము కల్పించుకుని బానిసల విముక్తి చేయవలసిందిగాని శివయ్యకు ఉన్న పలుకుబడిని చూచి మిన్నకున్నామన్నారు తాము జోక్యం కల్పించుకోకపోవడమే శివయ్యకు మేలు చేయడం అన్నారు.

"శాసనాలు మేమేనయ్యా చేసింది. ఎందుకో ఒకందుకు చేశాం. ఇప్పుడు కాదన్నామనుకో, మామీదా దుమ్ము పోసేవాళ్ళున్నారు. ఏదో సర్దుకుపోవాలి. తెగే దాకా లాగకు" – ఒక అధినేత, శివయ్యకు మిత్రుడు సలహా ఇచ్చాడు.

శివయ్యకు అంతా అయోమయంగా ఉంది. గంపెడాశతో పట్నం వచ్చాడు. నీళ్ళు కారిపోతున్నాడు. "సారాయి సుంకం కట్టలేదు. జప్తుదాకా రానిచ్చుకోకు" అని ఒక ఎక్సైజు అధికారి సలహా ఇచ్చాడు.

నోట్లో కరక్కాయ పడింది శివయ్యకు జనం సారాయి తాగడం బంద్ చేశారు. తనకు డబ్బు రావడం లేదు. పళ్ళూడకొట్టి వసూలు చేస్తామంటున్నారు అధికారులు.

మరో పిడుగు నెత్తిన పడింది శివయ్యకు.

"భూ సంస్కరణలు ప్రవేశపెట్టారు. ముందు భూమి దక్కించుకో. తరవాత మిగతావి చూసుకోవచ్చు. మనకు బలం భూమి. అది పోతే మనం పోతాం. సుభద్రమ్మకు విడాకులివ్వు. ఆమె కో పాలు దక్కుతుంది పాపం, పిల్లలు లేరాయె" అనే సలహా ఇచ్చాడొక భూస్వామి.

శివయ్య కాళ్ళకింద భూమి జరిగిపోతున్నట్లనిపించింది. తాను పాతాళానికి దిగజారి పోతున్నట్లనిపించింది. మొత్తం భూస్వాములు కలిసి ఏమీ చేయలేక పోయినందుకు వాళ్ళను నిందించాడు. కాళ్ళు నెత్తిన పెట్టుకుని ఊరికి ఉరికి వచ్చాడు.

కుంగిపోతున్న శివయ్యను చూచింది సుభద్రమ్మ. "ఏందండీ అట్లున్నరు? చూసుకుంట ఉరెందుకు పోసుకుంటరు? ఊరికి పగయి ఇల్లెట్ల బతుకుతం? ఏదో వాండ్ల మొఖాన పారెయ్యండి. నాకెందుకో బుగులుగ ఉన్నదండి. నా మాట వినండి" – బతిమాలుతున్నట్లు చెప్పింది.

"పట్నం నుంచి చచ్చి, చెడి వచ్చిన. ఇన్ని మంచి నీళ్ళన్న ఇయ్యక పోతివి. నీతులు చెప్తాంటివి, నువ్వు కూడ వాండ్లల్ల కలిసినవా ఏమి?"

"అట్ల ఎందుకు అనుకుంటరుండి? మీకు ఇప్పుడు అందరు పగోళ్ళుగనే కనపడ్తాన్రు" అని, గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. శివయ్య మంచినీళ్ళు తాగి, పంచెతో మూతి తుడుచుకుని మంచంమీద కూర్చున్నాడు.

"ఆ ముండ ఉన్నదా?"

"ఎవరు మల్లిముండా? పెరట్ల ఉన్నది, ఎందుకూ?"

"గా తలుపేసిరా."

"ఏందుండీ – పట్టపగలు – మనమింక అయసులున్నమా?" సుభద్రమ్మకు అర్థం అయింది మరొకటి – ఆమె సిగ్గుపడిపోయింది.

"ఏసి రమ్మంటుంటె ఇంటవా? పోతవా?" కర్కశంగా గద్దించాడు శివయ్య. సుభద్రమ్మ పిడుగుపడినట్లు వణికిపోయింది. అంతకు ముందు భార్యను కనీసం కసిరి ఎరుగడు శివయ్య. సుభద్రమ్మకు అన్నీ విపరీతాలు కనిపిస్తున్నాయి. గుండెలో గుబులు చేరింది. తలుపు వేయడానికి వెళ్ళినప్పుడు ఆకాశాన్ని చూచింది– పట్టపగలే చుక్కలు పొడవలేదు గదా అని.

"కూచో" – మాట కర్కశంగా ఉంది. సుభద్రమ్మ గుండె గుబగుబలాడుతూంది. పక్కగా నక్కి కూచుంది.

"ఆ ముండ ఇటు రాదుకద. మన మాటలు వినదు కద?"

"అదేందుండి – దానికి బయపడ్తరు?"

"వాండ్లకు బయపడే కాలమొచ్చిందే!"

"ఏందోనుండీ, నాకు బుగులుగున్నది. బ్రహ్మంగారు అన్ని చెప్పిండుగాని వాండ్లకు బయపడే కాలమొస్తదని చెప్పడాయె."

"బ్రహ్మంగారు కాదు, బ్రహ్మయ్యగాడు చెప్పతాండు. ఈ సర్కారున్నదే, మన కొంప నిలువున ముంచుతాంది."

"అదేందుండి అట్లంటరు – ఆడంత మనోళ్ళే ఉండిరి."

"అవు, ఉన్నది మనోండ్లే. మనమాట మాట్లాడ్తలేరు. మన కొంపలు ముంచుతాన్రు. వాళ్ళ కొంపలు మునుగుతయని తెలుసుకుంటలేరు."

"ఏందుండీ! అసలు సంగతి చెప్పకపోతిరి. మునుగుతాన్నయి మునుగుతాన్నయి అంటాన్రు. నాకేందో బుగులుగున్నది."

"అసలు సంగతేమున్నది? మన బూములన్ని గుంజుకొని మాల మాదుగుల కిస్తరట. మనం అరక దున్నాలె, వాడు దొరతనం చేస్తడు."

"అదేందుండి అట్లంటరు? ఎన్నడన్న ఉన్నదా? వాండ్లేమన్న మనకు పుట్టిన్రా?"

"నీతులు చెప్పితె నడుస్తలేదు. మనకు బూములు దక్కాల్నంటె నువ్వొక్క పని చెయ్యాలె."

"ఏందోనుండి, నాకేందో బుగులుగున్నది. ఏం చెయ్యమంటరో చెప్పండి."

"ఏం లేదు, నువ్వు విడాకులియ్యాలె. మనం విడుపు కాయిదాలు రాసుకోవాలె, నువ్వు నన్ను విడుచుకోవాలె. ఇగో కాయిదం తెచ్చిన, దస్కతు పెట్టు" – జేబులోంచి కాగితం తీసి మంచంమీద పడేశాడు.

సుభద్రమ్మ ఆ కాగితాన్ని చూచింది, గడగడలాడిపోతూంది. మంచంమీద ఉన్న కాగితం తాచుపాములా కనిపించింది. పడగ ఎత్తి కాటు వేయడానికి సిద్ధంగా ఉన్నట్లుంది. మంచంమీంచి చప్పున లేచింది. ఆమెకు చమటలు పడ్తున్నాయి. గుండె గుబగుబలాడుతూంది, కాళ్ళు వణకుతున్నాయి.

"ఏమండీ! మనం అగ్నిసాక్షిగ పెండ్లాడినమండి, మీరు నన్ను విడిచిపెట్టనని ప్రమాణం చేసిన్రుండి. బాపనాయన మంత్రాలు చదివి పెండ్లి చేసిండుండి."

"చదువమంటె బాపనాయన అప్పుడు పెండ్లికి చదివిండు. ఇప్పుడు విడాకులకోసం కూడ చదువుతడు, ఊఁ, పెట్టు దస్కతు" – శివయ్యలో కర్కశత్వం పెరుగుతూంది, కఠినంగా ప్రవర్తిస్తున్నాడు; ముఖంలో క్రౌర్యం తాండవం ఆడుతూంది.

"ఏమండీ, ఇది పవిత్ర బంధముండి, నూరేళ్ళ పంటండి, మనం బతికినన్నాళ్ళు కలిసి ఉండాల్నండి. వద్దండీ, ఈ పని చేయించకండి, మీకు దండం పెడ్తనండీ, కాళ్ళు మొక్కుతనండీ!" సుభద్రమ్మకు కన్నీరు దుముకుతూంది.

కసాయివాడు కత్తిపట్టుకుని నుంచున్నట్లున్నాడు శివయ్య. సుభద్రమ్మను చూచి అతడు కరగలేదు. మరీక్రూరంగా ప్రవర్తించాడు. "ఊఁ నీతులు చెప్పకు. దస్కతు పెట్టు" – కాగితం తీసి ఆమె మీదికి విసిరాడు.

పాము తనమీద పడినట్లు కెవ్వుమంది సుభద్రమ్మ.

"ఏమండీ! మీ కాళ్ళు పట్టుకుంట, మన బంధం బూమితో రాలేదండీ, ఆస్తి కోసం ఈ బంధాన్ని తెంపొద్దండి. ఈ బంధం ఆస్తికంటె గొప్పదండీ, భూమికంటె గొప్పదండి, చచ్చిందాక ఇది మనను వదలదండీ. వద్దండీ, ఈ పని నాతోని చేయించకండి" – చేతులు ఎత్తి, చేతులు జోడించి, రెక్కలు తెగుతున్న పక్షిలా బతిమిలాడింది.

అది శివయ్యమీద పనిచేయలేదు. అతనికి ఆస్తిభూతం ఆవహించింది. అది మానవతను మంట కలుపుతుంది. ప్రేమ బంధాలను కూల్చేస్తుంది, కాల్చేస్తుంది, నరునిలో మానవతను మంట కలుపుతుంది.

"దస్కతు పెడ్తవా, లేదా?" అని సుభద్రమ్మ జుట్టుపట్టుకొని, వంచి గుద్ద సాగాడు.

సుభద్రమ్మ పెద్దగా ఏడ్చింది, మొత్తుకుంది. "మీరు నన్ను చంపండి, చీల్చండి,

కాల్చండి, నేను దస్కతు పెట్టను" – ఆమె అరుస్తూంది, కేకలు పెడ్తూంది. జుట్టు పట్టుకుని వదలడంలేదు శివయ్య, దెబ్బలు కొట్టడం మానడం లేదు.

కేకలు విని మల్లమ్మ ఉరికి వచ్చింది. తలుపు నెట్టుకుని లోపలికి ఉరికి వచ్చింది. నర్సిమ్మ కూడా వచ్చాడు. "దొర్సానీ! దొర్సానీ!" అని అరిచారు.

"అడ్డమొస్తిరా పానాల్దీస్త" అని సుభద్రమ్మను వదిలి, కర్ర అందుకొనడానికి వెనక్కు ఉరికాడు శివయ్య. ఇద్దరూ కలిసి చాకచక్యంగా సుభద్రమ్మను బయటికి లాగారు. శివయ్య కర్ర పట్టుకుని వెనక్కు తిరిగాడు. "పానాల్దీస్త" అని కర్ర లేపాడు.

"దొరా!" అని కేక పెట్టింది మల్లమ్మ. ఆ కేకలోని ఆవేశానికి బొమ్మలా నిలబడిపోయాడు శివయ్య.

శివయ్య మల్లమ్మను చూచాడు. ఆమె ముఖం ఎర్రబడుతూంది. కళ్ళు జ్యోతులవుతున్నాయి. ఆమెకు శివం వచ్చేట్లుంది. గ్రహించాడు శివయ్య. కర్ర పారేసి విసురుగా దొడ్లోకి వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ తల దిమ్ముపట్టింది. క్షణం ఏమీ కనిపించలేదు. చూపందుతె మొదలు కనిపించింది కాగితం. లేచి పోయి పరపరా కాగితాన్ని చించేసింది. "నర్సిమ్మా! నన్ను మావాండ్ల ఇంటికి తోలిరా" అని చరచరా వాకిట్లోకి నడిచిపోయింది. మళ్ళీ ఏమనుకుందో వెనక్కు వచ్చింది. మల్లి చేతులు పట్టుకుంది.

"మల్లీ! ఇవి చేతులుకావు కాళ్ళనుకో. మా అయనను కాపాడు. ఈ ఇల్లు వదిలి పోకు. ఏమంటవ్? చేతుల చెయ్యెయ్యి."

మల్లమ్మ బొమ్మలా నిలబడి ఉంది. యాంత్రికంగా చేతిలో చేయివేసింది.

సుభద్రమ్మ వెళ్ళిపోయింది. నర్సిమ్మ ఆమె వెంట వెళ్ళిపోయాడు.

మల్లమ్మ నుంచునేవుంది. ఆమె కళ్ళవెంట ధారాపాతంగా కన్నీరు కారుతూంది. తాను పరమయ్యను పెళ్ళాడింది. తనను పెళ్ళాడటానికే పరమయ్య విడిపోయాడు. పరమయ్య వస్తాడనే ఆశతో ఈ బానిసత్వంలో జీవిస్తూంది. ఇప్పుడు శివయ్యా, సుభద్రమ్మా విడిపోయారు. తన బతుకే అంతా? విడదీయడం తప్ప కూర్చలేదా? ఇంతలో మరో ఆలోచన వచ్చింది. నర్సిమ్మ వెళ్ళిపోయాడు. ఈ ఇంట్లో తానూ–దొర. గూడెం ఏమనుకుంటుంది? ఇప్పటికే తనమీద ఆడి పోసుకుంటూంది? ఏం చేయాల? వెళ్ళడానికిమాత్రం వీల్లేదు.

"ఏయ్ లంజముండా! ఎల్లు. ఇంట్ల నర్సిమ్మ కూడా లేడు. దొరతోని కులుకుతావా? ఎల్లవే ముండా" – ఇంటిముందు నుంచొని పెంటయ్య అరుస్తున్నాడు.

"అమ్మా!" అని పెద్దగా ఏడ్చింది మల్లమ్మ. తరవాత నోట్లో కొంగుపెట్టుకుని దొడ్లోకి ఉరికింది.

## 19

సుభద్రమ్మ వెళ్ళిపోయిన ఇల్లు పిట్ట లేచిపోయిన గూడులా ఉంది. ఇల్లంతా బావురుమంటూంది. వెలవెలపోతూంది. కళావిహీనంగా ఉంది. పాడుబడిన ఇల్లులా ఉంది. శివయ్య అదోలా ఉన్నాడు; అతని అధికారం అస్తమించింది. వైభవం విరిగిపోయింది. ఏకాకిగా ఏడుస్తున్నాడు.

శివయ్య ఉదయం లేచి వచ్చి వసారాలో కూర్చుంటాడు. ఆ సంరంభం లేదు. ఆ సందడి లేదు. వంటరిగా కూర్చుంటాడు. వాకిలి సాంతం ఖాళీగా ఉంది, నిశ్శబ్దంగా ఉంది, శ్మశానంలా ఉంది. శివయ్యకు ఎదురుగా డస్కు వుంది. పక్కన బీరువా ఉంది. కాని డస్కు ముందు మనిషి లేడు. మల్లమ్మ చాయ్ తెచ్చి ఇస్తుంది. అందుకుని తాగుతాడు.

మల్లమ్మను చూస్తాడు. ఎందుకో ఆమెను చూస్తే జాలి కలుగుతుంది, మల్లమ్మకు తాను అన్యాయం చేశాడు. పరమయ్యను పారిపోయ్యేట్లు చేశాడు. ఆమెను హింసించాడు. పిడికెడు నూకలు తీసికెళ్ళిందామె. తాను ఆమెను చావబాదాడు. మల్లమ్మ తనను విడిచి వెళ్ళిపోవచ్చు. ఊరంతా విడిచిపోయింది. ఆమెకు అవకాశం వచ్చింది. అన్న పెంటయ్య అనేక దుర్భాషలాడాడు. అయినా ఆమె తనను విడువలేదు. ఆమె తన కిపుడు రక్ష, తాను నమ్ముకున్న భూములు, అధికారం, అప్పులు – తుదకు తన భార్య తనకు కాలేదు. తన రక్షణకు రాలేదు. మల్లమ్మ తనను విడిచి వెళ్ళి పోతుందేమోనని గుబులు పట్టుకుంది.

"మల్లమ్మా!" తొలిసారి "అమ్మా!" అని పిలిచాడు శివయ్య.

పనిలో ఉంది మల్లమ్మ. పైటకు చేతులు తుడుచుకుంటూ వచ్చి నిలబడింది.

"మల్లమ్మా! నీకు శాన అన్యాయం చేసిన నేనే పట్నం పోత, పరమయ్యను తెస్త. బాకీ రద్దుచేస్త, నువ్వు ఈడనే ఉండు. ఇన్నవా?" ఆశపెట్టి ఆమెను వుంచాలనుకున్నాడు.

"అట్లనే" అని వెళ్ళిపోయింది.

దొడ్లో పశువులు అంబారావాలు చేస్తున్నాయి. వాటిని విడువక చాలరోజులయింది. వాటిని తోలుకుపోవడానికి నర్సిమ్మకు భయంగా ఉంది. శివయ్యకూ భయంగానే ఉంది. అతను బయటికి వెళ్ళలేకపోతున్నాడు. పొలాల్లో పంటపండి ఒరిగి ఉంది. ఒక్కసారి కళ్ళారా చూచుకుని వద్దామనుకున్నాడు. వెళ్ళడానికి భయంగా ఉంది. బుగులుగా ఉంది. గుండె గుబగుబ లాడుతూంది. ఊరిని వణికించాడు శివయ్య. ఇప్పుడు ఊరిని చూచి వణికి చస్తున్నాడు శివయ్య.

దీనికంతటికీ కారణం ఎవరు? పావని. పావనిని తానేమీ చేయలేకుండా ఉన్నాడా? ఎందుకు? తానెందుకు చేయలేడు? పావనిని ఖతం చేస్తే? పావని ఎక్కడుంటూంది? గూడెంలో! అక్కడ మానవ దుర్గం ఉంది. దాన్ని ఛేదించాలి. ఆమెను అంతం చేయాలి. అంతేనా? అంతే! అయినా, ఎంతకాలం బతగ్గలరు కూలి జనం! కూటికి లేకుంటే వారే లొంగివస్తారు. చూతాం. "నర్సిమ్మా!" పిలిచాడు. నర్సిమ్మ వచ్చి నుంచున్నాడు.

"నర్సిమ్మా! నీ పేర భూమి రాసిస్త, సార దుకాణం నీపేర పెడ్త."

"అట్లనేనుండి."

"నర్సిమ్మా! నీ మనసులోని కోరిక నాకెరికె. మల్లమ్మ నీక్కావలె, అంతెనా?"

"అవుదొర, అంతే. అది చేయిరి నీ కాల్మొక్త."

"చేస్తరా! జర ఓపిక పట్టు. బల్లెం బాగున్నాదిర."

"బాగున్నాది బాంచెను, చూడుండి."

"అరే, తుప్పు పట్టిందిరా! తోము. తళతళ మెరవాలె, ఇన్నవా?"

"అట్లనే బాంచను" – బల్లెం తీసుకుని బావిదగ్గరికి వెళ్ళిపోయాడు. మల్లమ్మ నీళ్ళు తోడుతూంది. ఆమెను చూడగానే నర్సిమ్మ వళ్ళు వేడెక్కింది. "మల్లీ! ఇటురా, జర నీలుపొయ్యి." ఆమె బొక్కనతో నీళ్ళు పోస్తుంటే నర్సిమ్మ మల్లమ్మనే చూస్తున్నాడు. బల్లెం కడగడం లేదు.

"అన్నా! ఏంది అట్ల చూస్తున్నవ్?"

"అట్లెందుకంటవే! నిన్నే చూస్తున్న."

మల్లమ్మ బొక్కెన ఎత్తేసి అక్కన్నుంచి వచ్చేసింది. ఆమె గుండె గుబగుబలాడుతూంది. ఏదో భయంగా ఉంది. వంటింటి కిటికీలోంచి చూసింది.

నర్సిమ్మ బల్లెం పదును పెడ్తున్నాడు

పదును పెడ్తున్న బల్లెం మల్లమ్మ కళ్ళల్లో మెరిసింది. ఆమె గుండెలో భగ్గున మంట మండింది. ఏదో కుట్ర జరుగుతూంది అని గ్రహించింది. జాగ్రత్తపడాలనుకుంది. అప్రమత్తంగా వ్యవహరించాలనుకుంది.

రాత్రి భోజనాలయినాయి – మల్లమ్మ పక్క వేసింది. శివయ్య మంచంమీద కూర్చుని సిగరెట్టు కాలుస్తున్నాడు.

"దొరా! ముంగల మనసాల్ల పంట. చలిపెట్తాంది, బుగులుగున్నది."

"సరే, అట్లనే పండు."

"దొరా! నర్సిమ్మన్నను లోపట పండ పెట్టుకోరి. ఊరంతా ఉడుకుతాంది. పావనమ్మ పట్నం పోయిందట. గూడెం మనుసులు మంచోరుకాదు."

శివయ్య ఆలోచనలో పడిపోయాడు. పావని ఊళ్ళో లేదు. తన ప్లాను వాయిదా పడింది. మల్లమ్మ చెప్పిందే బాగుంది. ఏది వచ్చినా ముందు మల్లమ్మ మీద పడుతుంది. మల్లమ్మను దూరంగానే ఉంచాలి. నర్సిమ్మకు – వాడు దాహం తీర్చుకుంటె అరిపోతాడు. సాహసం చేయలేడు. తన పని తీరింతరవాతనే మల్లమ్మను అప్పగించాలి. అప్పగించాలా అసలు? అది తరవాత చూతాం అనుకున్నాడు.

"అట్లనే కానియ్యి". అన్నాడు.

నర్సిమ్మ మండిపోతున్నాడు అతని ఆశ నిరాశ అయింది. చాప వేసుకుని గదిముందు మేను వాల్చాడు. తాగి ఉన్నాడు. అయినా నిద్ర పట్టడంలేదు. అతనిలో అగ్గి రగిలింది. ఆకలిగొన్న పులిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతనికి శివయ్యమీద మంటగా ఉంది. తనకు మల్లిని అప్పగిస్తానన్నాడు. ఇప్పుడు గదిలో పెట్టి తలుపేశాడు. మండిపోతున్నాడు నర్సిమ్మ.

మల్లమ్మ వసారాలో మేనువాల్చింది– చింకి చాపమీద. ఆమెకు నిద్రరావడం లేదు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూంది. రాత్రి గడిచిపోతూంది, అర్ధరాత్రి దాటింది. దూరంగా కుక్కల ఏడుపు వినిపిస్తూంది, కీచురాళ్ళు రొదచేస్తున్నాయి, గబ్బిలాలు ఎగురుతున్నాయి.

ఊరంతా నిద్రపోతూంది. మల్లమ్మ లేచింది. కిటికీలోంచి చూచింది. శివయ్య గుర్రుకొడ్తున్నాడు. నర్సిమ్మ కనిపించలేదు. అతని అలికిడి వినిపించలేదు. చప్పుడు

కాకుండా ముందరి తలుపుకు బేడం వేసింది. వసారాకు కటకటాల తలుపుంది. అది తీసుకుంది. ఇంటి వెనక్కు వెళ్ళింది. కిటికీలోంచి చూచింది. నర్సిమ్మ నిద్రపోతున్నాడు. వెనకతలుపు బేడెం వేసింది. నవ్వుకుంది. తాను పులిని బోనులో పెట్టగలిగింది.

మల్లమ్మ వసారాలోకి వచ్చింది. తాళం చెవి చూసుకుంది. బీరువా తెరిచింది. దాన్నిండా కాగితాలున్నాయి. దస్తరం ఉంది. ఈ కాగితాల్లోనే ఊరి బానిసత్వం ఉందని చెప్పాడు ధర్మయ్య. ఈ కాగితాలు– వీటిలోని అక్షరాలు తమను బానిసలు చేశాయి. ఊరిని బానిసలు చేశాయి. ఆ కాగితాలు పాముల్లా కనిపించాయి, తేళ్ళలా కనిపించాయి. వాటిని చూస్తే ఆమెకు భయం కాలేదు. అన్నీ చచ్చిన తేళ్ళలా, పాముల్లా ఉన్నాయి. ఆమెలో ఏదో ఉత్సాహం పురివిప్పింది. ఆనందంతో గుండె గంతులు వేసింది. అన్నింటినీ తీసింది. దొంతులుగా కింద పేర్చింది.

మల్లమ్మ మళ్ళీ బయటికి పోయింది. ఆమె అన్నీ సమకూర్చి పెట్టింది. చాలా చాలా రోజులుగా ఈ ఆలోచన ఆమె మనసులో మసలుతూంది. కట్టెలన్నీ తెచ్చి పేర్చింది. అదొక పెద్ద చితిలా తయారయింది. ఆమె బానిసత్వానికి చితి పేరుస్తుంది, ఆమె ఉత్సాహానికి అంతులేదు. ఆమె గ్రామాన్ని విముక్తం చేస్తూంది. ఒకని ముక్తికే మనిషి ఉబ్బి తబ్బిబ్బవుతాడు. ఆమె గ్రామానికి విముక్తి ప్రసాదించబోతూంది.

మహా శక్తిలా కాష్టం పేర్చింది. అన్నీ ఒక్కసారి కాల్చడం ఆమెకు ఇష్టంలేదు. ఒక్కొక్కటీ కాష్టంలో తగలబడుతుంటే చూచి ఆనందించాలనుకుంది.

గూడెంల్లో పెంటయ్యకు మెలుకువ వచ్చింది, మల్లమ్మ మీద అతనికి మహా కోపంగా ఉంది. మల్లమ్మ గూడేనికి మచ్చగా తయారయింది. ఆమె తన అక్క కావడం అతనికి తల కొట్టేసినట్లుగా ఉంది. ఈ రోజు తేల్చుకోవాలనుకున్నాడు. మల్లమ్మను అంతమొందించాలనుకున్నాడు. పీడ వదిలించుకోవాలని బయల్దేరాడు.

మల్లమ్మ కాడుమీద కిర్సనాయిలు పోసింది. కట్టెల నన్నిటినీ బాగా తడిపింది. అగ్గిపుల్ల గీసి అంటించింది. కట్టెలు భగ్గుమని అంటుకున్నాయి, మండుతున్నాయి. ఆ మంటకు మల్లమ్మ ముఖం వెలిగిపోతూంది. మల్లమ్మ నడికట్టు వేసింది, వెంట్రుకలు చెల్లాచెదురయి వున్నాయి.

మల్లమ్మ ఆ మంట చూచింది. ఆమెలో అమితమయిన ఉత్సాహం పొంగింది. గుండె గంతులు వేయసాగింది. గట్టిగా కేకలు పెడ్దామనుకుంది, అరుద్దామనుకుంది, నాట్యం చేతామనుకుంది. వాస్తవంగా శివం వచ్చినట్లుంది ఆమెకు. ఆనందం అవధులు దాటుతూంది.

మల్లమ్మ నిగ్రహించుకుంది. పక్కన కాగితాల బొత్తులున్నాయి. వాటిని చూచింది. చేత్తో అందుకుంది. మంటలో వేస్తూంది ఒక్కొక్క కాగితం. ఖాతా బుక్కులు చించివేస్తూంది.

కాటి మంటకు ఆమె ముఖం ధగధగలాడుతూంది. ఆమె మనసు నిగనిగ మెరుస్తూంది. ఆమె బానిసత్వాన్ని తగలబెడ్తూంది!!

గూడెం నుంచి బయల్దేరిన పెంటయ్యకు మంటలు కనిపించాయి. శివయ్య ఇల్లు తగలబడ్తూంది అనుకున్నాడు. వెనక్కు తిరిగాడు. "శివయ్య ఇల్లు తగలబడ్తున్నది.

శివయ్య కాలి చస్తున్నడు" అని కేకలు పెట్టి అందరినీ లేపాడు. వార్త చిచ్చులా పాకింది. వెంకయ్య లేచాడు. బ్రహ్మయ్య లేచాడు. కొమరయ్య లేచాడు. పావని లేచింది. గూడెం సాంతం లేచింది. ఆశ్చర్యం లేదు – వార్త అలాంటిది.

ధర్మయ్య మంచంలోంచి గబుక్కున లేచాడు. దుమికాడు అతనికి కాళ్ళు వచ్చాయి. అది గ్రహించినట్లే లేడతను. అందరితోపాటు గునగునా ఉరికాడు. గూడెం సాంతం కదిలింది. ఊరు సాంతం కదిలింది.

"శివయ్య ఇల్లు తగలబడుతున్నది. శివయ్య కాలి చస్తున్నాడు."

అరుస్తూ, కేకలు వేస్తూ ఊరంతా శివయ్య ఇంటివైపుగా ఉరుకుతూంది.

కాడు కాలుతున్నది. కాగితాలు యజ్ఞానికి ఆహుతి అవుతున్నాయి. మల్లమ్మ పట్టలేకపోయింది. వికటాట్టహాసం చేసింది. ఆ నవ్వుకు కొండలూ, కోనలూ ప్రతిధ్వనించాయి.

శివయ్య గబుక్కున లేచాడు. కిటికీలోంచి చూచాడు. నాల్కలు చాచి మంటలు మండుతున్నాయి. ఆ మంటలు మల్లమ్మ ముఖాన మండుతున్నాయి. విరబోసిన జుట్టూ–వీరాంగనలాంటి ముఖం కాంతులు విరజిమ్ముతూంది. కాగితాలు మంటలో పడేస్తూంది. గ్రహించాడు శివయ్య. "లంజముండా!" అని కేక పెట్టాడు.

మల్లమ్మ మండే ముఖంతో శివయ్యను చూసింది. "ఊఁ... ఊఁ... ఊఁఊదేస్త... కూరేస్త... నరికేస్త" అరుస్తూంది మల్లమ్మ— శక్తిలా ఉంది. మహాకాళిలా ఉంది. దుర్గలాగుంది.

"అంతా ఉట్టిదే లంజముండా! నా కొంప ముంచినావు. నిన్నేం చేస్తనో చూడు" అని ఉరికాడు. రెండు తలుపులూ బయటి నుంచి గొళ్ళాలు పెట్టి ఉన్నాయి. ఇల్లంతా తిరిగాడు. నర్సిమ్మను లేపాడు. ఇద్దరూ గిజగిజ లాడారు. తలుపు కొట్టారు. బాదారు. ప్రయోజనం లేకపోయింది. కిటికీ దగ్గరకు చేరాడు శివయ్య. చేతికి అందిందల్లా మల్లమ్మ మీదికి విసురుతున్నాడు. కత్తిపీట మల్లమ్మ ముఖానికి తాకి చీరుకుపోయింది. నొసటినుండి రక్తం కారుతూంది. మల్లమ్మ లక్ష్యపెట్టడం లేదు. చివరి పుస్తకం మంటలో వేయడానికి ఎత్తింది.

కేకలు, పెడ బొబ్బలతో ఊరుసాంతం అక్కడికి చేరింది. ముందర పావని ఉంది. ఆ దృశ్యం చూచి అంతా చిత్తరువుల్లా నిలబడిపోయారు. చివరి బుక్కు మంటల్లోకి విసిరి పెద్దకేక పెట్టింది మల్లమ్మ.

పావని గ్రహించింది. ముందుకురికింది.

"మల్లమ్మా! నువ్వు మహత్కార్యం సాధించావు. ఊరంతటినీ బానిస బాధల్నుండి విముక్తం చేశావు" అని గట్టిగా కావిలించుకుంది. ముద్దులు పెట్టుకుంది. ఆమెను ఎత్తుకుని ఎగిరింది. గంతులు వేసింది. ఎదుట మండే మంటకు ఇద్దరూ ధగద్ధగాయమానంగా వెలిగిపోతున్నారు.

వచ్చిన జనం నివ్వెరబోయి చూస్తున్నారు. వాళ్ళకేమీ అంతుపట్టటం లేదు. పావని గ్రహించింది.

"మల్లమ్మ మన దేవత. మన దేవి. మన శక్తి. మన కాళి. ఈమె మహత్కార్యం చేసింది. మిమ్ములను బానిసత్వం నుంచి విముక్తులను చేసింది. మీ

అప్పు కాగితాలను మంట పెట్టింది. మీకిహ అప్పుల్లేవు. మీరు బానిసలు కారు. మీ పొలాలు తిరిగి మీకొచ్చేశాయి."

"మా పొలాలు ఇప్పించిన మల్లమ్మకీ జై!"

"మా బాంచతనం ఇడిపించిన మల్లమ్మకీ జై!"

ధర్మయ్య ముందుకురికాడు. మల్లమ్మను ఎత్తుకున్నాడు. ఎగురుతున్నాడు.

"మా బాంచతనం పోయెనె
మేమంత మనుషులమైతిమె"

జనం ఆనందంతో గంతులేస్తున్నారు కేరింతలు పెడుతున్నారు. ఆడుతున్నారు. పాడుతున్నారు. అంతా ఆనందంగా ఉంది. అట్టహాసంగా ఉంది.

శివయ్య జనాన్ని చూచాడు. లోన నక్కాడు. వీరంతా తన దగ్గరికి బానిసలుగా వచ్చిన జనమే. ఇప్పుడు రుద్రుల్లా వచ్చారు, శివుల్లా వచ్చారు, ఫాలాక్షుల్లా వచ్చారు. వణికి చచ్చిపోతున్నాడు శివయ్య.

పెంటయ్యకు అమాంతంగా గుర్తు వచ్చింది.

"శివయ్యగాడేడీ? ఆ దొంగ భాడఖావ్ ఏడీ?" అని తలుపు దగ్గరికి ఉరికాడు.

"ఏడీ? వాడేడీ? వాని అంతు తేలుస్తం" – జనం అంతా తలుపులమీద పడ్డారు. బాదుతున్నారు. కొడుతున్నారు. ఒకడు గునపం తెచ్చాడు ఒకడు గొడ్డలి తెచ్చాడు. తలుపులు బద్దలు కొట్టడానికి ఉరుకుతున్నారు.

"ఆగండి" – పావని కేక వినిపించింది. అంతా వెనక్కు తిరిగారు. ఆమె గబగబా ఉరికి గుమ్మానికి అడ్డంగా నుంచుంది–చేతులుచాచి.

"మనం మనుషులమా? రాక్షసులమా? చంపడం – చావడం తప్ప మనకేమీ తెలియదా? చంపడం – ముంచడం వాళ్ళపని. బతికించడం, సంపద పెంచడం మనపని. శివయ్యలో ఉన్న శక్తిని మల్లమ్మే కాల్చేసింది. శివయ్య ఆస్తిని నమ్ముకున్నాడు. అప్పులను నమ్ముకున్నాడు. అతను మనిషిని నమ్మలేదు. మానవత్వాన్ని నమ్మలేదు. అతను నమ్ముకున్న ఆస్తి, అప్పులు నశించాయి. ఇహ అతను చచ్చినట్లే. చచ్చినవాణ్ణి చంపి ఏంచేసుకుంటారు? మనిషిమాంసం తింటారా? మనిషి రక్తం తాగుతారా? వాళ్ళు అందరినీ చంపుతారు. మనం అందరినీ బతికిస్తాం. బతికించడం మనపని. శివయ్య చచ్చిన..."

ఇంకా మాట పూర్తికాలేదు – "అయ్యో చస్తి" అన్న శివయ్యకేక వినిపించింది. తలుపు తీసుకుని బల్లెంతో బయటికి వచ్చాడు నర్సిమ్మ. నర్సిమ్మ రుద్రమూర్తిలా ఉన్నాడు. అతని బల్లెంనిండా రక్తం ఉంది.

శివయ్య లోన గిలగిలా తన్నుకుంటున్నాడు.

నర్సిమ్మ రక్తం నిండిన బల్లెంతో నరసింహమూర్తిలా ఉన్నాడు.

మల్లమ్మ రక్తం నిండిన నొసటితో, విరబోసిన జుట్టుతో ఆదిశక్తిలా ఉంది.

పావని సరస్వతిలా ప్రసన్నంగా ఉంది.

కాళ్ళూ చేతులూ వచ్చిన ధర్మయ్య తనువు తెలియక ఆడుతున్నాడు.

అంతా నిశ్శబ్దంగా ఉంది.

శివయ్య మూలుగులు వినిపిస్తూనే ఉన్నాయి.

తూరుపు ఎర్రవారింది.

ప్రకృతి సొంతం ముక్తకంఠంతో పాడుతున్నట్లుంది:

"వెలుగులు చిమ్మే
వేకువ వచ్చెను.
జగములు మేల్కొను
జిలుగులు తెచ్చెను.
కలిమి లేములు
కల్లని చెప్పెను.
కొందరు బతికే
కాలము చెల్లెను.
అందరు బతికే
అందము లొలికెను!"

(అయిపోయింది)

# అంకితం

తోడుగా, నీడగా ఉండి
నన్నువీడి
వెళ్ళిపోయిన
భాయ్‌జాన్

—నార్ల చిరంజీవికి

# మనస్సులు

"నల్లనాగు" నా అర్ధశతాబ్దపు సాహిత్య జీవితంలో రచించిన కథానికలు. కొన్ని పత్రికల్లో వచ్చాయి. కొన్ని రేడియోలో ప్రసారం అయినాయి.

సాహిత్యపరంగా నాకు ఒక దృక్పథం ఏర్పరచుకోవడానికి మామయ్య వట్టికోట ఆళ్వార్‌స్వామి - భాయ్‌జాన్ నార్ల చిరంజీవి ఎంతగానో తోడ్పడ్డారు. 24-8-76 నాడు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగిన "జనపదం" ఆవిష్కరణ సభలో ఆ నవలను వట్టికోట ఆళ్వార్ స్వామి గారికి అంకితంగా సమర్పించాను.

"నల్లనాగు" భాయ్‌జాన్ నార్ల చిరంజీవికి అంకితం.

4-11-78 శనివారంనాడు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో కృతి సమర్పణ సభ జరిగింది. దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించగా, రాంభట్ల కృష్ణమూర్తి, చేకూరి రామారావు ప్రసంగించారు.

నార్ల చిరంజీవి సతీమణి శ్రీమతి నాగరత్నమ్మగారు అంకితం అందుకున్నారు.

1978 లో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు నల్లనాగును తొలిసారిగానూ, ఇప్పుడూ ప్రచురిస్తున్నారు. వారికి నా కృతజ్ఞతలు.

సికిందరాబాదు. దాశరథి రంగాచార్య
28-12-1997.

# కథాక్రమం



★ ★ ★

ఊహాచిత్రం:

# మళ్ళీ మహాత్ముడు మన మధ్యకు వచ్చాడు

ముక్కోటి తెలుగుల ముచ్చటైన ముఖ్యపట్టణం ఒకనాటి రాచరికానికి స్మారక చిహ్నాలుగా నిల్చిన మహాసౌధాల్తో చూడచక్కగా ఉంది. అర్థరాత్రి వెన్నెల పాలలో స్నానంచేసిన సౌధాలు కొత్త వన్నెలు తెచ్చుకొని మురిపిస్తున్నాయి. నగరం నిద్రాదేవత ఒళ్లో మైమరచింది. నగ్నంగా చలిలో వణకే పేదవాణ్ణీ సౌధాంతరాళంలో ప్రియురాలి వెచ్చని కౌగిట్లో నిద్రించేవాణ్ణీ ఒకే రకంగా నిద్రపుచ్చుతూంది, ఆ తల్లి. రాచబాట కిరుప్రక్కల చింకి సంచుల్లో ఒడలు దూర్చిన దౌర్భాగ్యుల్లో కొందరు రోగులు మూలుగుతున్నారు. మరికొందరు దగ్గుతున్నారు. చింపిరి తలతో తన మేను సైతం మోయలేని ఒక వృద్ధనారి మృత్యువు కౌగిట్లో గిలగిలా తన్నుకుంటూంది. పక్కనున్నవాడికే అదేమీ పట్టలేనట్లు నిద్రిస్తున్నాడు.

వెన్నెల రాచబాటమీద ప్రవహిస్తూంది. అక్కడక్కడ ఏదో వ్యాపారంనుంచి సోలుతూ తిరిగి వచ్చేవారి వెంట చీకట్లు నడక సాగిస్తున్నాయి. అక్కడక్కడా ఒక రిక్షావాడు చీకటిని తనతో తీసుకొని పరిగెడుతున్నాడు. తమ విధ్యుక్త ధర్మ నిర్వహణకుగాను నిలిచియున్న రక్షక భటులు, గూర్ఖావారు కాపలా కాస్తున్నారు.

అమాంతంగా నిశ్శబ్దాన్ని చీల్చుకొంటూ ఒక దూరశ్రవణ యంత్రం ఖంగుమంది. నిద్ర నిటారుగాలేచి ఆకాశంలో దూరిపోయింది. నడిరేయి పట్టపగలుగా మారింది. ఒక వార్త, శుభవార్త, నగరమంతా నిప్పులా పాకింది. ముద్రణాలయాలకు ప్రాణం వచ్చి అనేక పత్రికలను ప్రచురించాయి. పత్రికలు రెట్టింపు ధరకు అమ్ముడు పోతున్నాయి. పత్రికల్లో ఒక మహా వ్యక్తి చిత్రాలూ అతని జీవితానికి సంబంధించిన వింతవింత వార్తలూ నిండిపోయినాయి. ఎక్కడ చూచిన అదే వార్త.

జనం గుట్టలు గుట్టలుగా రోడ్లవెంట నడుస్తున్నారు. గుమిగూడుతున్నారు. చర్చలు సాగిస్తున్నారు. అసలు ఆ వార్త నిజమేనా? పత్రికలవాళ్ల కల్పనా? కాదు. ప్రభు పక్షీయుల అదుర్దా ఆ వార్త నిజమేనని నమ్మకం కలుగచేస్తూంది.

దుకాణాలన్నీ తెరువబడ్డాయి. మువ్వన్నె పతాకాలు మూడు రెట్ల ఖరీదుకు అమ్ముడు పోతున్నాయి. చర్ఖాసంఘం క్షణంలో ఖాళీ అయింది. ఖద్దరు కొట్లవాండ్లు కుబేరులై పోతున్నారు. మిల్లు యజమానులంతా ఖద్దరు ఉత్పత్తి చేయనందుకు విచారిస్తున్నారు. దర్జీవారు విధి విరామం లేకుండా బట్టలు కుట్టేస్తున్నారు.

రోడ్లమీద కార్లు సందు లేకుండా తిరుగుతున్నాయి. ఆర్డర్ల ఆలస్యం ఇప్పుడు సహించరాదు. స్వయంగా మంత్రులు శ్రద్ధ తీసుకుంటున్నారు. ఎక్కడ చూచినా మంత్రుల కార్లే కనిపిస్తున్నాయి. ప్రత్యేక యంత్రాల ద్వారా తెచ్చిన నీటితో రోడ్లు

అద్దంలా మెరిసేట్లు కడిగేస్తున్నారు. రకరకాల తోరణాలతో వీధులు, దుకాణాలు, ఇళ్ళు అలంకరించబడుతున్నాయి.

ఢిల్లీనుంచి నిముషానికొక విమానం వస్తూంది. అనేకమంది నాయకులు దిగుతున్నారు. ప్రపంచంలోని పెద్ద చిన్న దేశాల నాయకులంతా వింతవింత విమానాల్లో దిగుతున్నారు. అనేక దేశాల అధినేతలు అమాంతంగా దిగిపోతున్నారు. ధూమ శకటాల్లో జనం క్రిక్కిరిసి వస్తున్నారు. టిక్కెట్టు లేనివాళ్ళను పట్టుకోలేక అధికార్లకు మిడిగ్రుడ్లు పడ్డాయి.

రక్షక భటులు ఖద్దరుదారులై రిక్షాలను ఊరిబైటికి పంపిస్తున్నారు. నగరంలో దరిద్రం కనిపించకుండా ఉండేందుకుగాను లారీల్లో పల్లెలకు ఎగుమతి చేస్తున్నారు. ఒకవైపునుంచి ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు వస్తూంది. లక్షలాది జనం. అంతా దిగంబరులు. వీరు ఎగుమతి చేసే దారిద్ర్యానికి ప్రతినిధులు. తాము నగరంనుంచి వెళ్ళిపోమని సత్యాగ్రహం చేస్తారట! ఒకటి తర్వాత ఒకటి మంత్రులకార్లు వస్తున్నాయి. ఆ మహాత్ముని హృదయానికి బాధ కలిగించకుండా వాళ్ళందర్నీ శాంతంగా వెళ్ళిపొమ్మని ఉపన్యాసా లిస్తున్నారు. అవన్నీ అడవికి కాసిన వెన్నెల అయినాయి. పోలీసులు, లాఠీలు, టియర్ గ్యాస్ వృథా, వృథా. గుండ్లు పేల్చక తప్పిందికాదు. హాహాకారాలు చెలరేగేయి. ఒక నాలుగు చౌక ప్రాణాలతో అంతా సద్దు మణిగింది. దారిద్ర్యం నగరంలో ప్రవేశించకుండా నగరంచుట్టూ సైనికులు కాపలా ఉంచబడ్డారు.

అసలు ఆవార్త ఏమిటి?

ఒక దశాబ్దం గడిచింది, ఆ మహాత్ముడు స్వర్గంచేరి. స్వర్గసౌఖ్యాలు అతనికి గిట్టవు.

ఇంద్రుడు తన పదవీ రక్షణకై వేసే కుతంత్రాలు అతని కేవగింపు. అక్కడ ఆకలి లేదు. అన్నం లేదు. ఆర్జించుకున్నది ఖర్చు పెట్టుకోవడం తప్ప పని లేదు. సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని ఉత్త నూలుపోగుపెట్టి బంధించి సాధించిన రాజ్యంలో తన ప్రజల్ను చూడాలనే తహతహ ఆయనకు పెరిగింది. అక్కడి శాసనాలు ఇక్కడికి రాకను సహించవు. శాసనోల్లంఘనం సాగింది. ఆయనకు అమృతం ఇచ్చారు. అమృతం ఆరగిస్తే నిరశన వ్రతం ఏలా? అది సేవించ నన్నారు. ముక్కుల్లోంచి చెవుల్లోంచి అమృతం ఎక్కించడానికి దేవవైద్యులు చేసిన యత్నాలు వమ్మయినాయి. 10 రోజుల కఠిన నిరశన వ్రతం స్వర్గాన్ని కూకటి వేళ్ళతో కదిలించింది. ఇంద్రాదుల ప్రాణాలు దూబటిల్లాయి. దిగిరాక తప్పిందికాదు. వారికి అనుమతి లభించింది. రాజరికపుటినుప ఇరుసుల్లో నలిగిన ప్రజల్ను చూడ్డానికి భాగ్యనగరం విచ్చేస్తున్నారు.

ఇదీ వార్త.

ఆ మహాత్మునికి, జాతిపితకు ఘనమైన స్వాగతం ఇవ్వాలి. చరిత్రలో కనీ వినీ ఎరుగని స్వాగతం ఇవ్వాలి. వీధులన్నీ మువ్వన్నె పతాకాల్లో మునిగిపోయాయి. వీధి నాడు అంతా రమ్యంగా అలంకరించ బడింది. గాంధీజీ ఎలా వస్తారు? అదే విషమ విషయం. ఆయన పుష్పకంలోనే వస్తుండాలి. విమానాశ్రయంనుంచి రాజభవనం వరకు ఖద్దరు వస్త్రాలు పరవబడ్డాయి.

భళ్ళున తెల్లవారింది. భాగ్యనగరం అమరపురికంటే అందంగా అలంకరించబడింది. బ్రహ్మాండమైన ఊరేగింపు సాగింది. అసంఖ్యాకములైన కార్లు ముందు నడవగా

లక్షలాది జనం ఊరేగింపులో వస్తున్నారు. ఊరేగింపు గాంధీజీకి ప్రియమైన భజనలుచేస్తూ ఏనుగులా నడుస్తుంది.

ఊరేగింపు విమానాశ్రయం చేరింది. వర్గాల వారీగా జనాన్ని విభజించి స్థలాన్ని నిర్దేశించే అట్టలు నాట్యం చేస్తున్నాయి. దేశదేశాల నాయకులు అతి సన్నిహిత ప్రదేశానికి చేరుకున్నారు. అంతస్తులనుబట్టి దూరమౌతూ ఒకటి రెండు మైళ్ళదాకా జనం కూడింది. ఇసుక వేస్తే రాలని జనం. నినాదాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.

నిరీక్షణ, క్షణంయుగంగా నడుస్తోంది.

పుష్పకం ప్రశాంతంగా దిగింది. ఏమాత్రం ధ్వని లేదు. నినాదాలు ఆకాశాన్నంటాయి. పుష్పకంలో చోదకుడు లేడు. తలుపులు లేవు. తెరవరాదు, మూయరాదు. యంత్రాలు కనిపించడం లేదు. విచిత్రం! విదేశాల వైజ్ఞానికులు గుమికూడారు. వారికది కొరకరాని కొయ్య అయింది. తలుపు తెర్చుకోదు – గాంధీజీ బయటికి రారు. ఐదు నిముషాలు గడిచాయి. జనసాగరము కట్లు త్రెంచుకొని లోనికి వచ్చింది. విమానము ఎగిరిపోయింది. నిరాశ వ్యాపించింది. వార్త తప్పా? నిజమా? ఈ వార్తకు తన ప్రక్కవాడే కారణము అనుకొని ప్రతివాడూ ప్రక్కవానితో పోరాటం సాగించాడు. కురుక్షేత్రం ప్రత్యక్షమయింది.

కారులు వరుసగా పారిపోతున్నాయి. అది రాజభవన మార్గం. ఒక పెద్ద మురికి పేట బాట ప్రక్కనే ఉంది. ఆ మురికిలోనే ఒక గుడిసె. ఊదితే పడిపోయేంత గట్టిది. గోడలు లేవు. కుక్కిమంచం, మంచంలో ముసలవ్వ. ముగ్గుబుట్ట తల. ముడతలు పడ్డ శరీరం, ఆకలితోనూ, రోగంతోనూ కళ్ళల్లోకి ప్రాణాలొచ్చినై.

అక్కడ ఒక అయిదు అడుగుల వ్యక్తి. మోకాలివరకు పంచె, గజంగుడ్డ పైన ఉన్నవాడు, నున్ననితలా – తెల్లని శరీరము – చిరునవ్వు చిందులు తొక్కే ముఖం గలిగి ఆమెకు జావ పోస్తున్నాడు. ఈ రోగానిక్కారణమయిన మురికిని పారద్రోలడానికి మెట్టప్రదేశంనుంచి తట్టతో మన్ను తెచ్చి మురికి ప్రాంతంలో పోస్తున్నాడు. అతనికి అలసట లేదు. విరామం లేదు. చిరునవ్వుతో మట్టి తెచ్చి పోస్తున్నాడు. ఆ తట్టా మట్టీ మురికి పేటను నిర్మూలిస్తాయా? ఆ తట్టా మట్టీ కాదు, ఆయన విశ్వాసం ఆ మురికి పేటను నిర్మూలిస్తుంది.

మొదటి కారు అక్కడ ఆగింది. ఒక పొడుగుపాటి వ్యక్తి ఖద్దరు షేర్వానీ, బట్టతల, చిరాకుముఖంతో ఆ వ్యక్తివైపు నడిచాడు. ఆ వృద్ధునికి నమస్కరించాడు. ఆ వృద్ధుడు అతని చేతికి ఒక తట్టయిచ్చి చిరునవ్వు నవ్వి తన పని ప్రారంభించాడు.

కార్లలోని జనం తండోప తండాలుగా మూగారు. నాయకులలో చర్చలు సాగినాయి. కల్లోలం రేగింది. కారులు చెదిరాయి. కొన్ని దోవ పట్టాయి. జనసాగరం మహోఘోషతో సాగివస్తోంది. నాయకులు ఒక పరిష్కారానికి వచ్చినట్లు కనిపించలేదు. జనం దగ్గరికి వస్తున్నది, ఏం చేయాలి? నిర్ణయం జరిగిపోయినట్టే నిశ్శబ్దత కనిపించింది. ఆ వృద్ధుడు అరెస్టు చేయబడినాడు. మహాత్ముని వేషంతో ప్రజల్ని మోసగించచూచాడనే నేరం అతనిమీద మోపబడింది. షేర్వానీవ్యక్తి వద్దంటూ ముందుకురికాడు– వందచేతు లతన్ని వెనక్కు లాగాయి. వెయ్యినోళ్లు గుసగుసలు చెప్పాయి.

# పెన్సిలు భారతం

ఒక శుభదినాన సరిగా టైముకు వచ్చాడు ఇన్వార్డు గుమాస్తా. అల్మారా తెరిచి అన్నీ సర్దుకుని జాగ్రత్తగా కూర్చున్నాడు. ఆ తరువాత కోటుజేబులూ, చొక్కా జేబులూ అతి ఆదుర్దాగా వెతికి కళ్ళజోడు బైటికి తీశాడు. ఒక చెవ్వుకు – దారం కట్టుకుని కళ్లజోడు తగిలించి రిజిస్టర్ తెరిచాడు. కంటికి దగ్గరిగా పెట్టుకొని చూచి రాయడానికి సిద్ధం అవుతూ కోటుజేబు తడుముకున్నాడు ఒక జేబు, రెండు జేబులూ – అన్ని జేబులూ వెతికాడు. ఆదుర్దా ఎక్కువైంది. కాగితాలన్నీ తీశాడు. అల్మారా మొత్తం గాలించాడు. ఎంత గాలించినా దొరకందే. ఒక వ్యక్తి ఏదో కాగితం పట్టుకొచ్చి ఇస్తూ "అర్జంటండి. కాస్త తీసుకోండి" అన్నాడు.

"అయితే ఏం చేయమంటావయ్యా? చస్తున్నాం. పొద్దున్లేస్తే అన్నీ అర్జంటే. అక్కడ పడేసి వెళ్లు" అన్నాడు చీదరించుకుంటూ.

"రశీదు తెమ్మన్నారండీ మావాళ్ళు."

"ఏం, మేం మింగేస్తామా? అయినా అగు, పెన్సిల్ దొరకందే" అని మళ్ళీ వెతకడం ప్రారంభించాడు ఎంతో ఆదుర్దాగా. ఫైళ్ళు దొంతర్లు దొర్లిస్తున్నాడు. వెతుకుతున్నాడు. చంద్రుడైనా అందేట్టున్నాడుగాని పెన్సిల్ దొరికేట్లులేదు ఆ గుమస్తాకు. "అయ్యా! చెరువు గండిపడిందండీ, తొందరగా మరమత్తు కావాలి" అన్నాడు అగంతుకుడు. "అయితే నన్నేంచేయమంటావయ్యా? చెరువుబూడ్చమంటావా? అంత తొందరుంటే అక్కడ పారేసి వెళ్ళు" అన్నాడు మహాచిరాగ్గా.

"నా దగ్గర పెన్నుందండీ. రశీదు రాసివ్వండి" అన్నాడు వచ్చినవాడు.

"నేను గవర్నమెంటు మనిషిని తెలుసా? గవర్నమెంటు పెన్సిల్తోనే రాయాలి. ఇరవైఅయిదేళ్ళ నుంచి సర్వీసు చేస్తున్నా – ఇరవై అయిదేళ్ళు. ఎప్పుడూ ప్రైవేటు పెన్సిలుతో రాసి ఎరుగను" అన్నాడు. విసుగుపుట్టిన అగంతుకుడు కాగితం అక్కడ పడేసి వెళ్ళిపోయేడు.

పెన్సిలు దొరకాలి, నంబర్లు వేయాలి. అప్పుడుగాని ఆఫీసు పని మొదలుకాదు. గుమాస్తా అతిదీనంగా సూపరెండెంటు దగ్గరకెళ్ళి నసుగుతూ "పెన్సిల్... పెన్సిల్... సార్" అన్నాడు. "ఏమిటయ్యా, ఏమైంది పెన్సిల్కు?" అన్నాడు చిరాగ్గా. "కనిపించడం లేదుసార్!"

"కళ్ళు పెట్టుకుచూడు."

"అద్దాలు కూడా పెట్టుకొని చూశాను సార్!"

"ఏమంటావ్ మరి?"

"ఇంకో పెన్సిల్... ఇప్పించండి."

"ఇండెంటు తేవయ్యా, ఎప్పుడూ నీతో వచ్చిన గొడవే ఇది."

"అది దేంతో రాయాలి సార్!"

"ఏడిసినట్లేవుంది, నా ముఖం, ఎవరిదగ్గరైనా తీసుకోవయ్యా."

"ఎవరిస్తారు సార్?"

"మరేం చేయమంటావు?"

"మీరే రాయండి సార్."

"బావుంది, సన్యాసివాడి పెళ్లికి జుట్టూ జందెం కూడా అరువేనట. రాయవయ్యా మహానుభావా" అంటూ పెన్ను ఇచ్చాడు. ఇండెంటు రాసి, సంతకముపెట్టి జాగ్రత్తగా పెన్నుకు క్యాప్ బిగించి ఇచ్చేశాడు గుమస్తా.

ఇండెంటు యు.డి.సి నుంచి సూపరెండెంటుకు, సూపరెండెంటు నుంచి అసిస్టెంటు సెక్రటరీకి, అక్కణ్నుంచి స్టేషనరీ క్లర్క్కు వెళ్ళింది. స్టేషనరీ క్లర్కు ఇండెంటు పుచ్చుకొని "ఈ సంవత్సరానికి స్టోర్సువారు సరఫరా చేసిన పెన్సిళ్ళు అయిపోయాయి. ఆజ్ఞ అవుతే స్టోర్సు వారిని అదనముగా ఒక పెన్సిలు సరఫరా చేయాల్సిందిగా కోరబడును" అని రాసి యు.డి.సి కి పంపాడు. ఆయన సంతకం పెట్టి సూపరెండెంటుకు పంపాడు. సూపరెండెంటు సంతకంచేసి అసిస్టెంటు సెక్రటరీకి పంపాడు. ఆయన డిప్యూటి సెక్రట్రీకి, ఆయన సెక్రట్రీకి పంపించాడు. సెక్రటరీ సంతకము అయి తిరిగి నిచ్చెన దిగుతూ డిస్పాచ్ క్లార్కు దగ్గరికి వచ్చింది. డిస్పాచ్క్లార్కు స్టోర్సుకు పంపాడు. స్టోర్సు గుమాస్తానుంచి యు.డి.సి., అక్కణ్నుంచి సూపరెండెంటు, అక్కణ్ణించి డైరెక్టరుకు వెళ్ళింది. ఆయన "సప్లయిచేసే పెన్సిళ్ళేమో ఇదివరకే సప్లయిచేశాం. ఇంకా సప్లయి చేయడానికి మా దగ్గర ప్రొవిజన్ లేదు" అని వ్రాసి పంపేడు.

ఆఫీసులో పనే లేదు. వచ్చే ఫైల్సు గుట్టలుగా పెరుగుతున్నాయి. గుమాస్తాలు క్రికెట్ కామెంటరీ వింటూ కూర్చున్నారు. అర్జంటు విషయాల్ని గురించి టెలిఫోనులు వస్తున్నాయి సెక్రటరీకి. ఆయన డిప్యూటీ సెక్రటరీని, ఆయన అసిస్టెంటు సెక్రటరీని, ఆయన సూపరెండెంటునూ, ఆయన క్లార్కుల ప్రాణాలు తింటున్నారు. అయినా కాగితం కదలడంలేదు. సెక్రటరీకి ఈ జాప్యానికి కారణం అర్థం కాలేదు. తన్ను స్వయంగా చూడమని డిప్యూటి సెక్రటరీని కోరాడు. ఆయనకూ అర్థంకాక అసిస్టెంటు సెక్రటరీని తన్ను స్వయంగా చూడమన్నాడు. అసిస్టెంటు సెక్రటరీ సూపరెండెంటు మీద కారాలు మిరియాలు నూరాడు. "ఏం మొఖం పెట్టుకొని డిప్యూటి సెక్రటరీని చూసేది? నువ్వురా నావెంట" అన్నాడు. సూపరెండెంటు ఏం మాట్లాడ్తాడు? క్లార్కుతో సహా సిద్ధం అయాడు. ఈ సైన్యం యావత్తూ డిప్యూటీ సెక్రటరీ దగ్గరికి వెళ్ళింది. ఆయనా బైలుదేరాడు. మొత్తం బెటాలియన్ సెక్రటరీ దగ్గరికి వెళ్ళింది. ఈ సైన్యాన్ని చూచి అధికారికి గుండెలు పగిలాయి.

"ఏం, ఎందుకువచ్చారు?"

"మీరు రమ్మన్నారుగదండీ."

"నేను రమ్మన్నానా? అబ్బే లేదే. వెళ్ళిపోం డిక్కడినుంచి. ఏమిటి ఈ సైన్యం?"

"కేసుల్లో జాప్యం విషయం...!"

"ఓహో అదా, ఏమిటీ రోజు టెలిఫోనుల మీద టెలిఫోనులు వస్తున్నాయి. ఇంత జాప్యం అయితే ఎలా?"

"అదే చెప్దామని వచ్చాం సార్!"

"చెప్పండి."

డిప్యూటీ సెక్రటరీ అసిస్టెంటు సెక్రటరీని, అసిస్టెంటు సెక్రటరీ సూపరిండెంటునూ, సూపరిండెంటు యు.డి.సి.నీ, యు.డి.సి. క్లార్కునూ చూశారు. పాపం, గుమాస్తాకు చేతులు వణుకుతున్నాయి. మాట తడపడ్తూంది. చెవ్వుకు కట్టుకున్న కళ్ళద్దాల తాడు ఊడింది. గభాల్న తీసి జేబులో పెట్టుకుంటూ "తప్పం... తా... నా...దే సార్... పెన్సిల్... పోయింది" అన్నాడు ప్రాణంలేని మనిషిలా.

"ఇంకో పెన్సిలు ఏర్పాటు చేయండి" అన్నాడు అధికారి.

"రాశామండీ" అన్నాడు, అంతకి కింది అధికారి.

"తొందరగా అందేట్టు చూడండి" అన్నాడు అధికారి. 'చిత్తం' అన్నారు అంతా.

ఆఫీసుకి వచ్చేసరికల్లా స్టోర్సు డైరెక్టర్ నోటు కనబడింది. సూపరెండెంటు స్టేషనరీ క్లార్కుకు వ్రాశాడు. ఆయన "ప్రొవిజన్ అయిపోయిన మాట వాస్తవమేకాని, పనియావత్తూ ఆగిపోయింది కాబట్టి, అత్యవసర విషయంగా భావించి ఒక పెన్సిలు సరఫరా చేయునది. ఆలస్యానికి స్టోర్సు డిపార్టుమెంటు వారే బాధ్యతవహించాల్సి ఉంటుంది" అని రాశాడు. అది మళ్ళీ సూపరిండెంటు నుంచి యథారీతిగా యాత్రసాగించి, అధికారి వద్దకుంబోయి, అటనుంచి సోపానంబులు డిగ్గి, ఉద్యానశాఖలో యాత్ర సాగించి వున్నతాధికారి కడకుం జేరె. ఆయన 'అనివార్యకారణాల ఆధారంగా ఒక పెన్సిలు సరఫరా చేయునది' అని వ్రాశాడు. మళ్ళీ అది పరమపద సోపాన పటంబెక్కుచు దిగుచు కార్యాలయంబునకు జేరె.

ఈ లోగా గుమాస్తాగారికి ఎలుక కన్నంలో పోయిన పెన్సిలు దొరికింది. పోయిన పెన్సిలు దొరికింది కాబట్టి దాన్ని వాడడానికి అనుమతి ఇవ్వాలని ఆయన అర్థించాడు. సూపరిండెంటు గుమాస్తామీద ఖస్సుబుస్సుమని, ఇంత కథ జరిగింతర్వాత అది వాడడానికి అనుమతించనన్నాడు. ఇరవై అయిదేళ్ళ సర్వీసులో బ్లాకుమార్కులేంది, ఇవ్వాళ నేను పెన్సిలు పోగొట్టానని అపవాదు తెచ్చుకోననీ, కొత్తపెన్సిలు తన కవసరంలేదని చెప్పాడు గుమాస్తా. సూపరిండెంటుకు కోపం వచ్చింది. అసిస్టెంటు సెక్రటరీకి రాశాడు. అసిస్టెంటు సెక్రటరీ గుమాస్తాను ఎక్స్ప్లనేషన్ కోరాడు. ఎక్స్ప్లనేషన్ సరిగాలేదనీ సస్పెండు చేయవలసిందిగా రికమెండు చేశాడు అసిస్టెంటు సెక్రటరీ. ఆయన డిప్యూటీ సెక్రటరీకి, ఆయన సెక్రటరీకి రాశాడు. "ఇంత చిన్న విషయానికి ఆయన్ను సస్పెండు చేయడానికి రూల్సు వొప్పుకోవు. ఆయనకు వేరేపని అప్పగించి విచారణ సాగించునది" అని రాశారు. అది శాస్త్రోక్తంబుగా అంచెలంచెలు దాటి అమలుపర్చువరకు రెండు వర్షర్తువు లేతెంచి నిర్గమించె. గ్రామంబున కాటకంబు వ్యాపించె, ప్రభుత్వంబు కాటక పీడితులకు భూరిసహాయంబు చేసె. ఆగమ వర్షర్తువున తటాకంబు నిర్మితంబగునని విననయ్యెడి.

★ ★ ★

# నిరుద్యోగం

మందేశంలో నిరుద్యోగం పెరుగుతూందట! ఈ మాటలు ఎవరో అంటే చచ్చినా – నేను చచ్చినాకాదు, చెప్పేవాడు చచ్చినా – నమ్మకపోయేవాణ్ణి. చెప్పిందేమో మోతుబరీ ఆసామి అయె, నమ్మకపోవడం ఎలా? పోనీ, ఆ చెప్పినవాడు నన్ను చాటుగా పిల్చి "ఏమయ్యా ఫలానాగారూ! మందేశంలో నిరుద్యోగం పెరుగిపోతూంది" అంటే నమ్మేవాణ్ణే కాదు. అలా కాక నిండు సభలో చిన్నా, పెద్దా, ఉన్నా, లేని అందరిముందూ అంత పెద్ద గద్దె ఎక్కి చెబితే ఎలా నమ్మకపోయేది? ఆ చెప్పినవాడేమైనా సామాన్యుడా అంటే, కాదాయె! సాక్షాత్తు పదికోట్ల ఆంధ్రుల ప్రధాని అలా చెపుతూంటె కాదనడం ఎలా? ఆ మాట ఎంత నమ్ముదామన్నా మనసు నమ్మందే! ఎలా నమ్ముతుంది చెప్పవయ్యా! నిన్నంటె నిన్న ఇంటికి సున్నాలు వేయింతామని కాలికి బలపాలు కట్టుకొని తిరిగానా? పనివాళ్ళు దొరకందే. దొరికినవాడు తాను కోరిందానికి దమ్మిడీ – కాదు – కాదు– నయాపైసా తగ్గించినా రానంటే, నిరుద్యోగం ఉందని ఎలా అనుకొనేది? వాస్తవంగా దేశంలో నిరుద్యోగమే ఉంటే పదిమందీ మా ఇంటికివచ్చి "బాబ్బాబు, ఇంటికి వెల్లవేయించుకోండి, ఉద్యోగంలేక చచ్చిపోతున్నాం" అని బతిమిలాడక పోయారూ?

మరి ఆ పెద్దమనిషి ఎలా బొంకాడూ అని. అంత చదువుకున్న వాడూ, అంత పెద్ద పదవిలో ఉన్నవాడు బొంకుతాడా? లేక, ఆయం చెప్పిందానికి వేరే అర్థం ఏమైనా ఉందేమో? అవును, ఆయన గొప్ప పండితుడట కూడాను. నానార్థాలు గల ఒక పదం ప్రయోగించాడు. ఇక చావరా ఎలా అర్థం అవుతుందో చూదాం, అని చల్లగా ఢిల్లీ చేరుకున్నాడు. ఈ విషయంలో డౌట్ క్లియర్ చేసుకోందే నిద్రరాదు. ఎవర్నైనా పెద్దవార్ని అడగాలి.

ఇంతట్లోకే పంచకట్టూ, లాల్చీ, పైన కండువా, బట్టతలా, అచ్చం మా తెలుగు పండితుడిలాంటి ఒక వ్యక్తి కనిపించాడు. "బాబ్బాబు ఒక్కమాట. ఒక్కటంటే ఒక్కటేమాట." అని పిల్చా. ఆయన వెనక్కి తిరిగిచూసి ఆగిపోయాడు. నేను పరుగెత్తినట్లు నడిచి ఆయన దగ్గరకిచేరి "అయ్యా! మీరు పండితులేకదూ!" అని అడిగా.

"ఏమిటయ్యా కథ?"

"ఏం లేదండి. ఒక చిన్న సందేహం వచ్చింది. విడదీస్తారేమోనని..."

"ఏంటో చెప్పు" అన్నాడు తలమీదకు చెయ్యి పోనిచ్చి.

"నిరుద్యోగం అంటే ఏమిటండీ?"

"నిరుద్యోగం అంటేనా?... నిరుద్యోగం తెలీదటయ్యా? ఉహ్ – నిరుద్యోగం. నిరుద్యోగం అంటే నిరుద్యోగమే."

"అంటే...."

"నిరుద్యోగమేనయ్యా!"

"అది నాకూ తెలుసు స్వామీ! దానికి అర్థం నేను మిమ్మల్నడిగింది"

"అర్థం చెప్పమంటావూ. నిరుద్యోగం అంటే ఉద్యోగం లేకపోవడం."

"అదేనండీ, అసలు ఉద్యోగం అంటే?"

"ఏడిసినట్లే ఉంది" అంటూ విసుక్కుంటూ వెళ్ళిపోయాడు. అంతలేసి పండితులకే తెలియని అర్థం నాకెలా తెలుస్తుంది? ఇందులో ఏదో రహస్యం ఉండితీరాలి. అది తెలుసుకొని తీరాలి.

తెలుసుకోవడం ఎలా? డిక్షనరీ చూస్తే తెలిసిపోదూ? ఎందుకు తెలియదూ? స్టేట్ సెంట్రల్ లైబ్రరీకి వెళ్లే బస్సెక్కా. బస్సెక్కిం తర్వాత ఇంకో ఆలోచన వచ్చింది నాకు. చాల ఆలోచన్లు వస్తుంటాయిలెండి. భూమి తలక్రిందులుగా తిరగడం ప్రారంభిస్తే మనం ముసలాళ్ళం అయ్యే బదులు కుర్రాళ్ళం అయి తిరిగి మళ్ళీ తల్లిగర్భంలోకి పోయి అలాఅలా కరిగిపోతాం అనేది వాటిలో ఒక ఆలోచన. ఇలాంటి ఆలోచన్లు కొల్లలనుకోండి. ఇది ఇండియా అయిపోయింది కానీ, లేకుంటే పది పిహెచ్.డి.లు చేసి ఉండేవాణ్ణి.

దానికేంగాని ప్రస్తుతం వచ్చిన ఆలోచన ఏమిటంటే, ఇంగ్లీషుకు డిక్షనరీ ఉంటుంది నిజమే. నా దగ్గర కూడా ఉంది. కాని, తెలుగులో కూడా డిక్షనరీ ఉంటుందా అని. వెంటనే మరో ఆలోచన. లేకపోవడం ఏమిటి? శ్రీనాథుడు అంతటివాడు వ్రాసిన మనుచరిత్ర డిక్షనరీ కాక పోవునా? అంటే, తెలుగులో డిక్షనరీని మనుచరిత్ర అంటారన్నమాట. సరాసరి వెళ్ళడం వెళ్ళడమే మనుచరిత్ర చూస్తే సరిపోతుంది. కాని, అన్నిట్లోకీ మంచి మనుచరిత్ర ఏదో ముందు తేల్సుకోవాలి. ఒక పదాన్ని గూర్చి రీసర్చి చేస్తున్నప్పుడు మంచి మనుచరిత్ర చూడ్డమే మంచిది. మన కంట్రీ లాంగ్వేజెస్‌తో వచ్చిన ఇబ్బందే ఇది – అసలు దేశంలో ఎన్ని మనుచరిత్ర లున్నాయో వాటిల్లో మంచిదేదో అందరికీ తెలిసేట్లు ప్రచురించచద్దూ? ఇంగ్లీషులో చూడండి. వర్డ్సువర్తు రాసిన డిక్షనరీ మంచిదని ఇంత కుర్రాడిక్కూడా తెలుసు. మొట్టమొదటగా నేను తెలుసుకోవాల్సింది, మనుచరిత్రల్లో మంచిదాన్ని గురించి.

ఘట్టివాణ్ణి పట్టుకోవడానికి స్టేట్ లైబ్రరీ పత్రికల సెక్షన్‌వైపు వెళ్ళా – భారతి చదివే పండితుడు కనిపించాడు. భారతి చదువుతున్నాడంటే పండితుడు కాక ఏమౌతాడు? దాన్నిండా ఎస్ట్రాలజీయేనాయే! నా లాంటి వారికి ఏమి అర్థం అవుతుంది? వీపు మీద చేయివేశా – మా ఆవిడే తలుపు తీస్తుందని నుంచున్న నాకు దాసీది ప్రత్యక్షం అయినట్లు అయింది ఆయన స్థితి. లైబ్రరీలో సైలెన్సు అబ్జర్వ్ చేయాలి కాబట్టి బైటికి రమ్మని సంజ్ఞ చేశా. కళ్ళద్దాలుతీసి కేసులో పెట్టుకొని, కేసు జేబులోవేసి, జేబులోంచి నశ్యపుడబ్బా తీసి దానిమీద వేలుతో కొడుతూ నా వెంట నడకసాగించాడు. ఉన్న మెట్లన్నీ దిగి ముందున్న పార్కులోకి వచ్చి ఆయనకోసం ఎదురు చూస్తూ నుంచున్నా. నశ్యం పట్టుబట్టి వేళ్ళు దులుపుకుంటూ ఆయనావచ్చి చేరారు.

"ఎక్స్క్యూజ్ మీ, కూర్చోండి."

ఆయన కూర్చున్నాడు.

"మీరు పండితులేనాండి?"

"అంటే...?"

"బాగా చదువుకున్నవారేనా అని?"

"ఎందుకు?"

"చిన్న పనుందండి."

"ఏమిటది?"

"ఒక్క విషయం."

"చెప్పవయ్యా!"

"అట్టే పెద్దదేం కాదండీ."

"ఏదైతే ఏం. నువ్వు చెప్పందే."

"ఇంత చిన్న విషయం అడుగుతున్నానని ఏమీ అనుకోరుకదూ!"

"చెప్పవయ్యా బాబూ చంపక."

"ఏమీలేదండీ."

"అయితే వెళ్ళిపోతా!" లేచాడు.

"అబ్బే, ఒక్కచిన్న విషయమండీ!"

"చంపేసేట్టున్నావే. అసలు విషయం చెప్పక చిన్నదండీ, పెద్దదండీ–పొడుగుదండీ, పొట్టిదండీ, అంటే ఎలా?"

"కోప్పడకండి సార్!"

"కోపం ఏమీలేదయ్యా చెప్పు."

"మనుచరిత్రలో మంచిది ఏదండీ."

"వావిళ్ళవారిది."

"వావిళ్ళవారు కూడా మనుచరిత్ర రాశారాండి."

"కాదయ్యా ప్రచురించారు. రాసింది పెద్దన."

"హర్షుడు రాసిన మనుచరిత్ర మంచిది కాదాండి?"

"హర్షుడు మనుచరిత్ర వ్రాయడం ఏమిటయ్యా!"

"పొరపాటు, పొరపాటు, శ్రీనాథుడండీ!"

"ఏడిసినట్టే వుంది. మనుచరిత్ర వ్రాసింది ఒక్కడేనయ్యా – ఆయనే పెద్దనామాత్యుడు."

"అయితే ఆయన రాసిందే మంచి దంటారాండి?"

"ఉన్నదే ఒక్కటైతే మంచీ చెరుపేమిటయ్యా?"

"నేను ఒక్క పదాన్ని గురించి సెర్చ్ చేయాలనుకుంటున్నానండీ, అది అందులో దొరుకుతుందాండి?"

ఆయన పిచ్చివానిలా విరగబడి నవ్వడం మొదలుపెట్టాడు. నేను వెర్రిమొగం వేసుకొని చూస్తూ నుంచున్నా. ఇదేనండీ మన ఇండియన్స్‌లో ఉన్నలోపం. ఎవరైనా రీసెర్చి చేస్తుంటే కో ఆపరేట్ చేయరు సరిగదా హేళన చేస్తారు. అమెరికాలోనైతే రీసెర్చి చేస్తున్నాడని తెలిస్తేచాలు – వాళ్ళకు కావలసిన సకల సౌకర్యాలు కాళ్ళ ముందు వచ్చి వాల్తాయి.

పొట్టపట్టుకొని నవ్వి నవ్వి, "నీకు కావాల్సింది నిఘంటువయ్యా, నిఘంటువు" అన్నాడు.

"అంటే?"

"నిఘంటువేనయ్యా."

నాక్కోపం వచ్చింది. ఏమిటీ వెర్రివేషాలు. నాకు తెలిసినవన్నీ ఆయనకు తెలుసా? మా ఇంటినంబరు చెప్పమనుచూతాం. ఏదో పెద్దమనిషి అనుకుని అడుగుతుంటే ఏమిటా నవ్వు!

"తెలుగు కాదయ్యా! ఇంగ్లీషులో ఏమంటారు?"

"అల్లాగా డ్షి... డ్షి... డిక్షనరీ"

"అదేనండీ నాక్కావల్సింది. దాన్ని మనుచరిత్ర అనరూ?"

"అనరయ్యా, మనుచరిత్ర ప్రబంధం."

"అంటే?"

"అంటే గింటే నీకెందుకు? నీ రీసెర్చికి కావాల్సింది నిఘంటువేనయ్యా! అది చూసుకో" అన్నాడు హేళనగా. నాకు చాల నామర్దా అనిపించింది. ఏదో ఒక పుస్తకం పేరు నాకు తప్పుగా తెలిసినంత మాత్రంలో నేనే దద్దమ్మనైపోయానా! ఇంగ్లీషును గురించి అడగమనండి, జాన్సన్ నాటకాలన్నీ గడగడా అప్పగించేస్తా. ఏం వస్తే ఏం లాభం? దశరథుడు గాడిద కాళ్లు పట్టుకున్నట్లు పట్టుకోవల్సి వచ్చింది ఈ పండితుణ్ణి.

"సర్లేండి థాంక్స్! మీకు శ్రమ ఇచ్చాను. నిఘంటువే చూసుకుంటూ్లేండి" అని వెళ్ళిపోతూంటె పిల్చాడు పండితుడు.

"ఏ నిఘంటువు చూస్తావయ్యా?"

"నిఘంటువు చూడమన్నారు కదండీ!"

"నిఘంటువు లెన్నో ఉంటాయి. ఏది చూస్తావు" అన్నాడు మళ్ళీ వెక్కిరిస్తున్నట్లు.

అవును, ఆ విషయం. నాదే తప్పు డిక్షనరీ అంటే ఏ డిక్షనరీ? ఇంగ్లీషులో షేక్స్పియర్ నుంచి శంకర్ నారాయణదాకా డిక్షనరీలు వ్రాశారు. అలాగే తెలుగులో కూడా చాలా ఉండొచ్చు.

"కాస్త ఘట్టి నిఖంటువు చెప్పండి. ఓ ముఖ్యమైన పదం చూడాలి."

"నిఖంటువు కాదయ్యా, నిఘంటువు."

'ఖ' కు 'ఘ' కు భేదం లేదు కదండీ?"

అలా కాదని వ్యాకరణం అంతా అప్పచెప్పాడు.

"సరేండి. ఏదైనా మంచి నిఘంటువు పేరు చెప్పండి."

ఆయన చెప్పింది నాకు జ్ఞాపకము ఉండేట్లు కనిపించక "ఆంధ్రవాచస్పత్యము" అని నోట్ చేసుకున్నా. మీరేమన్నా అనండి, ఈ వర్నాక్యులర్స్ ఇంప్రూవ్ కాకపోవడానిక్కారణం ఈ ఘట్టి పేర్లేనండి, ఇంగ్లీషులో చూడండి ఎంత తేలిక పేర్లుంటాయో; శంకర్ నారాయణ డిక్షనరీ.

ఆయంతో శలవుతీసుకొని లైబ్రరీలోని పుస్తకాల పట్టిక చూశా. ఆంధ్ర వాచస్పత్యం లేదు. పట్టికలన్నీ రచయితల పేర్లతో ఉన్నాయి–అది రాసిందేమో

తెలియదాయెను. నేను నోట్ చేసుకున్నదాని కింద రచయిత? అని వ్రాసి పండితుని ముందుంచా. ఆయన ఏవో రాశాడు. పరీక్షగా చూసి జాగ్రత్తగా చదువుతే "కొత్త శ్యామల కామశాస్త్రి" అని ఉంది. వర్ణమాల వరుసగా జ్ఞాపకం లేనికారణాన తంటాలుపడి పుస్తకం నెంబరుచూసి వెళ్తను కదా, అలాంటి పేరున్న పుస్తకాలే మూడున్నాయి. ఇంకేం చేతును? ఆ మూడు పుస్తకాల్నూ చించి అవతల పారేద్దామన్నంత కోపము వచ్చింది- ఒక్క పదాన్ని గురించి రీసర్చి చేతామంటే ఇన్ని అడ్డంకులా? అందుకే అంతా అమెరికా వెళ్లి రిసెర్చ్ చేస్తారు-

మళ్ళీ పండితునిదగ్గరికి వెళ్తే ఏమనుకుంటాడు? పట్టితేభ్యంకింద జమకడ్తాడు. ఇంగ్లీషు బుర్రను తెలుక్కు తర్జుమాచేసి చూతామని మూడు పుస్తకాలూ కిందపర్చి పరీక్షగా చూస్తే ఇట్టే తేలిపోయింది. ఇంత్తెతే మూడూ మూడు భాగాలు-ఒకదాంట్లో కొన్ని, అక్షరాలూ, ఇంకోదాంట్లో కొన్ని మిగిలినవన్నీ మూడోదాంట్లో ఉన్నాయి-అవును తెలుగేమన్నా చిన్నభాషా. చితక భాషా! మొత్తం 74 అక్షరాలాయెమరి.

తథదధన.... తథ దధన.... వెదికి వెదికీ "న" పట్టుకున్నా-న కు గుడీ; దానికి దీర్ఘంకూడా పట్టుకున్నా. "నీరు" తర్వాత "ద"కు ఒత్వంఉన్న వల్లా రెండే రెండు పదాలు-

నీరు దొత్త = ద్వ × వి × చూ × నీరు తుత్ర నీరు దోమ = ద్వ + వి × చూ + జలమశకము × మశకము.

ఇంత కష్టపడినా కావలసిన పదం దొరక్కపోయినందుకు చాల కోపం వచ్చింది- పుస్తకాలక్కడే పారేసి కాలుతో తొక్కి మరీ బైల్దేరా- ఇంతలో మెరుపులా ఓ ఆలోచన తట్టింది. మొదటి పండితుడేం చెప్పాడు? నిరుద్యోగం అంటె ఉద్యోగము లేకపోవడం అని కదా- "ఉద్యోగం" అనే పదం చూస్తే సరిపోదూ! "ఉ" పట్టుకొని "ద"కు ఒత్వంఇచ్చి "గము"కు కలిపి చూశా-ఈ విధంగా ఉంది-

ఉద్యోగము- సం- వి- అ- పుం- కడక: చూ

యత్నము- 2- పదవి- చూ. హోదా-

ఏమిటిది? సం వి అ పుం కడక చూ యత్నము పదవి చూ హోదా- విడదీసి చదివినా కలిపి చదివినా ఏ విధంగా చదివినా అర్థం కాలేదు- బుర్ర తిరిగిపోయింది- ఓపిక చచ్చింది- పుస్తకాలు నేలక్కొట్టి పరిగెత్తుకొచ్చా. వెధవ నిరుద్యోగం ఎంతపని చేసిందీ!!

★ ★ ★

# ప్రేమ కథ

అద్దంలో ఆ రోజే ఒక తెల్ల వెంట్రుక కనిపించింది మేరీకి. గుండె జల్లుమన్నది. అప్పుడే వార్ధక్యం వచ్చేసిందా? ముగ్గుబుట్ట తలతో, ముడుతల ముఖంతో మదర్ నాన్సీ ఆమెకు గోచరించింది. తల్లిదండ్రుల గారాబం తెలియని బాల్యం ఇట్టే దొర్లిపోయింది. తల్లిని చెరిచి, తండ్రిని కాల్చి చంపారు రజాకార్లు. తనను తెచ్చి పెంచి పెద్దదాన్ని చేసి ఫాదర్ గతించారు. ఇంకా 25 వసంతాలన్నా చూడలేదు. అప్పుడే శిశిరంలాంటి వార్ధక్యం వచ్చేసిందా? అద్దంలో ముఖం కనిపిస్తూంది. నల్లగా, నున్నగా, గుండ్రంగా ఉంది. కళ్ళు చిన్నగా ఉన్నాయి. తనకేమి లోపం? తాను వలచీ, వలపించుకోవాలనీ పరితపించిపోతూంది కొంత కాలంగా. తన జీవితంలో ఎవడూ ప్రవేశించడేం? తన హృదయాన్ని అర్థం చేసుకొనే వాడు దొరకడేం?

అమాంతంగా తలుపు నెట్టుకొని వచ్చింది సంధ్య. "మేడమ్! మీరే సలహా ఇవ్వాలి" అంటూ వచ్చి కుర్చీ లాక్కొని పక్కన కూర్చుంది. గులాబీ రంగు కాగితం అందించింది. "చెప్పండి మేడం, మోసం చేయడుకదా?" గులాబీరంగు కాగితంమీద ముత్యాల్లాంటి అక్షరాలు "ప్రేయసీ" అంటూ ప్రారంభం. అది ప్రేమలేఖ. మేరీ గుండె దడదడ లాడింది. ఉత్తరం పూర్తిగా చదవలేకపోయింది. "సంధ్యా! ప్రేమించే వాడుంటే మోసగిస్తే మాత్రమేం?..." అనేసింది తనకు తెలియకుండానే. సంధ్య లక్ష ప్రశ్నలు వేసింది. తనకు అతడు పార్కులో ఎలా కలిసిందీ, ఏమన్నదీ, తానంటే అతనికి ఎంత ఇష్టమో, తనకు అతడంటే ఎంత ప్రాణమో, తల్లిదండ్రులెలా అడ్డు తగుల్తారో అన్నీ ఎంతో వివరంగా చెప్పింది. మేరీ తల తిరిగిపోతూంది. వేటికీ సరైన సమాధానం చెప్పలేకపోయింది. "సంధ్యా! ప్రేమ త్యాగాన్ని కోరుతుంది, దేనికైనా కొన్ని కష్టాలెదుర్కోవాలమ్మా" అని మాత్రం సమాధానం చెప్పగలిగింది. మళ్ళీ ఏవో లక్ష ప్రశ్నలేసింది సంధ్య. అతడు అందమైన వాడనీ, తనకోసం ఏదైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాడనీ ఏవేవో చెప్పింది. ఆమెలో పొంగి పొరలుతున్న ఆనందాన్ని చూచి ఈర్ష్య పడింది మేరీ. తన పరిస్థితిని చూచి వగచింది. కాగితాన్ని భద్రంగా మడిచి గుండెలో దాచుకొని, "మేడమ్, ఈ సంగతి ఎవరితోనూ అనకండేం" అంటూ వెళ్ళిపోయింది సంధ్య.

వంటరితనంలో మేరీ బాధ మరింత పెరిగింది. గుండె రక్తంగా కనిపించింది. జీవితం వెలితిగా, వృథాగా గోచరించింది. పూవు వికసిస్తుంది. తుమ్మెదకోసం అర్రులు చాచుతుంది.

ప్రతి రోజూ సాయంకాలం పార్కుకు పోవడం అలవాటు చేసుకుంది మేరీ. ముస్తాబై పత్రిక సాహచర్యంతో పార్కులో బెంచీ మీద కూర్చుంటుంది. చూడడం పత్రికనే, కాని ఆలోచనలు ఎక్కడెక్కడో విహరిస్తుంటాయి.

"కాస్త పత్రిక ఇలా ఇస్తారూ. ఇక్కడే కూర్చుని చూచియిస్తా."

తలఎత్తి చూచింది మేరీ. యువకుడు. అంతే, అందాన్ని గురించి ఆమె ఆలోచించలేదు. పత్రిక అందించింది. ఆదే బెంచీమీద కూర్చున్నాడు. మేరీ హృదయం కొట్టుకుంది.

పత్రిక తిరిగి ఇచ్చి "థాంక్స్" అన్నాడు. వెళ్ళిపోతాడేమో అనుకుంది. ఎలా వుండమనడం?

"మీరు ఫలానా కాలేజీలో లెక్చరరు కాదూ?" అడిగాడు. అవుననీ, మీకెలా తెలుసుననీ సంభాషణ సాగిద్దామనుకుంది. కాని, అవునన్నట్లు తల ఊపి ఊరుకుంది.

"చక్కగా బోధిస్తారని విన్నాను."

తన బోధనను గురించి ఇతనికెలా తెలుసు?

అదే విషయం అడిగేద్దాం అనుకుంది. కాని, అడగలేక పోయింది. చిరునవ్వు మాత్రం నవ్వి ఊరుకుంది.

"ఎం. ఏ.లో క్లాసు వచ్చిందా?!"

"వచ్చింది. ఫస్టు క్లాసు."

"సబ్జక్టు?"

"ఉర్దూ."

"ఉర్దూ నాకు అభిమాన భాష. ఈ జిగర్ షేర్ గుర్తుందా?

1. "జబ్ సే రుఖెపుర్నూర్ జల్వా నజర్ ఆయా
కాబా నజర్ ఆయా నకలీసా నజర్ యా"

(అందమైన నీ ముఖం చూశాను. మక్కా మదీనా అన్నీ మరచాను.)

గుండెలో గిలిగింత పెట్టినట్లయింది మేరీకి. పద్యం తనను గురించే చదివినట్లనిపించింది.

"జిగర్ తరవాత అంత అందంగా గజల్ చెప్పేవారు కనిపించలేదు. ఆయన గజళ్లు వినడానికి జనం నిద్రమాని తెల్లవార్లూ కూర్చునేవారు."

"జిగర్ కవితామూర్తి. జిగర్ అంటే అర్థం హృదయం కదా. వాస్తవంగా కవితలో హృదయం నింపాడు.

2. బే ఖైఫ్ దిల్ హై ఔర్ జియే జారహా హూఁ
ఖాలీహై సీషా ఔర్ పియే జారహా హూఁ"

"చాలా బాగా చెప్పారు. ఆనందం లేకున్నా జీవిస్తున్నా, గ్లాసు కాళీ అయినా తాగేస్తూనే ఉన్నా నంటాడు. ఇంత అందంగా సులభంగా చెప్పడం మరొకరికి సాధ్యపడదు. దాన్ని మీరు మరీ అందంగా చదివారు. ఆనందం లేదని బాధ పడిందానికంటే దాన్ని అమర్చుకోవడానికి ప్రయత్నించాలంటాను. మీరేమంటారు?"

"నాకు అభిప్రాయాలు లేవు. జిగర్ చెప్పారు.

3. "మౌత్ క్యా ఎక్ లఫ్జె బేమానీ
జిస్‌కో మారా హయాత్‌నేమారా"

"వహ్వా! మృత్యువు అవిశ్వాసానికి అక్షర రూపం, చంపిందల్లా అందరినీ జీవితమే."

"ఇంత అందమైన మీకు ఈ నిరాశ ఏమిటో అర్థంకాలేదు."

ఏం చెప్పాలో అర్థంకాలేదు మిస్ మేరీకి. ఒక నిట్టూర్పు విడుద్దామనుకొని అణుచుకుంది.

అలా కొంతసేపు కబుర్లాడుకొని విడిపోయారు. ఆ రేయి మేరీ మరీ మధన పడింది. చేతికందిన చషకం జారి పడినట్లయింది. అతని పేరూ ఊరూ కూడా తెలుసుకోలేదు. వలపించి మోసగిస్తాడేమో! హయ్యో! వలచే వాడుంటే మోసగిస్తే మాత్రమేం? మోసగించనీ, అనుకుంది.

మరుసటి రోజు పార్కుకు వెళ్ళింది. అదే బెంచీమీద కూర్చుంది. నిరీక్షణ గడియలు యుగాలుగా గడిచాయి. అతడు రాలేదు, నీరసించి నిట్టూర్పులు విడుస్తూ హాస్టలుకు చేరుకుంది.

ఒకనాడు మేరీకి ఉత్తరం వచ్చింది. క్లాసులోకి తెచ్చిచ్చాడు ప్యూను. గుండె దడదడలాడింది. తనకూ ఒక ఉత్తరం వచ్చింది. అదీ గులాబి రుంగుది. సంధ్యకు వచ్చినలాంటిది. గుండె గంతులు వేసింది. పాఠం చెప్పలేకపోయింది. చెపుతున్న పాఠం లైలా మజ్నూ. మజ్నూ పిచ్చివాడై పోయాడు. ఎందుకు? లైలా అందం చూచా? లైలా వట్టి వికారిదట. లైలా అంటే రాత్రి అంధకారంలా నల్లగా ఉండేదట. మజ్నూ ఆవిడను ఎంతగా ప్రేమించాడు! ఇంకేవో ఆలోచనలు వచ్చాయి. పిరియడు దొర్లించాలని చూచింది. పిరియడు అయిపోయింది. పర్మిషన్ తీసుకొని వెళ్ళి పోయింది. గది తలుపు బిగించి ఉత్తరం తీసింది.

4. *యూఁజిందగీ గుజార్ రహాహూఁ తేరే బగైర్*
*జైసే కోయీ గునాహ్ కియే జా రహా హూఁ*
(నీవులేని జీవితం ఇలా గడుపుతుంటే ఏదో పాపం చేస్తున్నాను అనిపిస్తోంది.)
సాయంకాలం పార్కులో కలుసుకుంటానని రాశాడు రమేశ్.

మూడే పంక్తులు రాశాడు. మూడు పేజీలు రాయకూడదూ? ఎన్నో సార్లు చదువుకుంది. వసంతం విరిసింది. గుండె ఉరకలు పెట్టింది. సూర్యుడు నిలిచిపోయాడు. కదలడం లేదు. ఇంకా రెండే అయింది.

ఎవరో తలుపు తట్టారు. సంధ్య పిలుస్తోంది. ఉత్తరం దాచేసి, భావాలను దాచుకోవడానికి ప్రయత్నించి తలుపు తీసింది.

"మేడమ్, ఏమిటా ఉత్తరం? ఎందుకలా అయిపోయారు?"

ఏం చెప్పాలో అర్థం కాలేదు. బొంకింది, స్నేహితురాలి దగ్గరినుంచి వచ్చిందని.

సంధ్య కా సమాధానం తృప్తి కలిగించలేదు. ఉత్తరం చూస్తానంది. చించి పారేశానంది. సంధ్య ఏదో తన కథ చెప్పబోయింది. మేరీ వినదలచుకోలేదు. ఆ మాటా ఈ మాటా చెప్పి పంపించేసింది.

సాయంకాలం పార్కుకు చేరింది. ఎదురుచూస్తూ కూర్చుంది. రమేశ్ వచ్చాడు.

"క్షమించాలి. విధిలేక ఢిల్లీ వెళ్ళాల్సి వచ్చింది, మిమ్మల్ని చూసినాటినుంచీ మీరు నా హృదయంలో చేరి గిలిగింతలు పెడ్తున్నారు. ఉత్తరం రాయకుండా వుండలేకపోయాను. తీరా రాసిం తరువాత మీరేమనుకుంటారోనని బాధ పడ్డాను" అన్నాడతను.

ఏం చెప్పాలో అర్థం కాలేదు మేరీకి. ఏవేవో చాలా విషయాలు చెప్పాలనుకొని వచ్చింది. సిగ్గు క్రుంగదీస్తూంది. "కూర్చోండి" అని మాత్రం అని తలవంచుకొని-

5. "సునానే చలేథే ఉన్సె హాలె దిల్
నజర్ మిల్తేహి రంగ్ ఫఖ్ హోగయా" అంది.

[హృదయంలో ఉన్న విషయాలన్నీ వారితో చెప్పకుందామని బయలుదేరాను. కాని, చూపులు కలిశాయి. వెలవెల బోయాను.]

"అర్థం చేసుకున్నాను. నేనూ ఒక 'షేర్' [కవిత] విన్నవిస్తా.

6. పీషా మస్త్ బాదః మస్త్ హుస్న మస్త్ ఇఖ్ మస్త్
ఆజ్ పీనేకా మజా పీకర్ బహక్ జానేమే హై."

మత్తెక్కించే మధువు, మత్తు గొలిపే మబ్బు, మత్తుగొల్పు అందం, మత్తుగొల్పు వలపు, నేడు త్రాగడంలో మజా త్రాగి స్పృహతప్పడంలో వుంది."

సాగర సంగమంలా వారి మనసులు కలిశాయి. కలకాలంగా మేరీ ఎదురుచూచిన మధుర గడియలు వచ్చి వాలాయి. ఆ రేయి గడిచిపోయింది తరవాత కొన్ని రోజులు గడిచాయి. వారిద్దరూ పెళ్ళి చేసుకున్నారు.

తొలిరేయి రమేశ్‌ను అడిగింది మేరీ "రమేశ్! నాలో అందంలేదు, చందంలేదు, డబ్బా దస్కంలేదు. ఏమి చూచి వలచావ్ నన్ను?"

"మై డార్లింగ్ మేరీ! నిజం చెప్పమంటావా! నీ జీతాన్ని చూచి నిన్ను వలచాను." తరవాత చెప్పిన మాటలు మేరీకి వినిపించలేదు మనం వినవచ్చు. "మేరీ! నేనూ ఎం.ఎ. పాసయ్యాను. రెండు సంవత్సరాలు తిరగ్గా తిరగ్గా ఉద్యోగం లభించింది. ఆరు నెలలుకాకుండానే రిట్రెంచిమెంటు పేరుతో నా ఉద్యోగం ఊడింది. ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. ఏం చేయను? నిన్ను ప్రేమించాను."

పూడిపోయిన గొంతుతో "రమేశ్! నువ్వు నన్ను మోసం చేశావనను. నా జీతం చూచైనా నన్ను ప్రేమించావు. నీ ప్రేమే నా జీవితం! అంతే చాలు. నన్ను విడిచి పోకు రమేశ్. నన్ను విడువకు" అని కన్నీటితో భుజంమీద వాలిపోయింది మిసెస్ మేరీ.

[తర్వాత ఏం జరిగింది? రమేశ్‌కి మరో ఉద్యోగం దొరికిందా? లేక మేరీకి ఉద్వాసన జరిగిందా? ఏం జరిగిందో — అది వేరే కథ- మరో మాట- బోలెడు ప్రేమకథలు చదివేసిన పాఠకులు ఇదీ ఓ ప్రేమకథేనా? ఛస్! ఓ రిట్రెంచ్‌మెంట్ కథ అని నిరసించ వొచ్చు. సార్! రచయిత మాత్రం ఏం చేస్తాడు? అందంలేని అమ్మాయి, జీతం లేని అబ్బాయి ప్రేమించుకొని కాపరం పెడతామంటే వొద్దంటామా, మీరే చెప్పండి?]

★ ★ ★

# పిచ్చుకలు

మా ఇంట్లో పిచ్చుకలూ ఉంటాయి. మాతోపాటు కొన్ని వస్తూ పోతూంటాయి. కాని ఒక జంట కాపురమే పెట్టింది. ఊరపిచ్చుకలంటే నాకెంతో ఇష్టం. మెడకింద మీసాల్లాంటి నల్లనిచారతో మగపిట్టా, అమాయకంగా కనిపించే ఆడపిట్టా ముచ్చటగా చెరో తలుపుమీదా కూర్చుంటాయి– ఎదురు బదురుగా. కిచకిచ లాడ్తాయి. ఏమిటో వాటి మాటలు కొంతసేపు పోట్లాడుకున్నట్లు కిచకిచమంటాయి. రెండూ కలిసి తుర్రుమని లేచిపోతాయి. చెరొక పూచికపుల్ల ముక్కులో పెట్టుకొని వచ్చేస్తాయి. అవి గూడుకట్టుకుంటున్నాయి. మా గూటిమీద నమ్మకం లేదు వాటికి.

ఇంటినిండా పుల్లలు పడేస్తుంటే విసుక్కుంటుంది మా శ్రీమతి. ఇల్లంటే ఇంటి వాళ్లకే కాదనీ, అనేక ప్రాణులకు అది నిలయం అనీ చెప్పానావిడతో. నల్లులకంటే పిచ్చుకలు నయమని చెప్పాను. "నిజమేనండీ! పిచ్చుకలు ఎంచక్కా కిచకిచ మంటాయి," అన్నది ఆవిడ.

మా పిల్లలకు పిచ్చుకలంటే ప్రాణం. పిడికెడు గింజలు వేసి, ఏరుకొని తింటూంటే ఎంతో ఆనందంగా చూస్తారు. వాటికి నీళ్లు తాగిస్తానంటాడు మా చిన్నవాడు. గ్లాసులో తెచ్చి నీళ్లు పెట్టాడు. అవి తాగకుంటే మారాం చేస్తాడు. "పిచ్చుకలకు గ్లాసులుండవురా, కిందపోయి తాగుతై" అంటే పోశాడు. అవి ముక్కుతో తాగుతూ బెదురుచూపులు చూస్తుంటే వాడెంత ఆనందపడ్డాడో చెప్పలేం.

ఒకనాడు స్కూలు టైమైనా పిచ్చుకలకు గింజలేస్తూ కూర్చున్నాడు పెద్దవాడు. అదేమిట్రా అంటే, 'పిచ్చుకలకు స్కూల్లేదుగా, నాకెందుకు?' అన్నాడు. ఇంతలో పిట్టలు తుర్రుమని లేచిపోయాయి. "అదిగో, అవి స్కూలు కెళ్ళాయి" అన్నాను. "వాటి స్కూలు ఎక్కడ?" అని అడిగాడు.

"ఆకాశంలో మీకు కనిపించదు."

"అక్కడేం నేర్పుతారు?"

"గింజలు తెచ్చుకోవడం, గూడు కట్టుకోవడం."

"మా స్కూల్లో ఎందుకు నేర్పరు?"

ఏం చెప్పను? అదో పెద్ద రాజకీయ సమస్య.

పిట్టలు ఎత్తున ఎవరికీ అందనిచోట గూడుకట్టుకున్నాయి. అయినా, మా పిల్లలు రోజూ ఎక్కి చూచేవారు. ఒకనాడు ఆఫీసునుంచి రాగానే గంతులేస్తూ చెప్పారు – "డాడీ! పిట్టలు గుడ్లు పెట్టా" యని. మా పెద్దమ్మాయి వర్ణించి

మరీ చెప్పింది– తెల్లగా, గుండ్రంగా, చిన్నగా, ఎంతో అందంగా ఉన్నాయని. మా శ్రీమతికూడా ఎంతో ఉత్సాహం కనబరచింది.

"అవునండీ, చాలా అందంగా ఉన్నాయి" అన్నది.

"నువ్వూ ఎక్కావంతెత్తుకు?"

ఆమె బుగ్గలు జేవురించాయి.

బూట్లున్నా విప్పకుండా నేనూ ఎక్కి చూచా.

"మరో రెండు చిట్టిపిచ్చుకలు వస్తాయి" అన్నాను.

మా చిన్నవాడు ఎగిరి గంతేశాడు. "నేను వాటికి పాలు పట్టిస్తా" అన్నాడు.

ఒకనాడు భోజనాలు చేస్తున్నాం. ఏదో నేలమీద పడిన చప్పుడైంది. రెండు పిట్టలూ కిచకిచమని అరుస్తున్నాయి. అటునుంచి ఇటూ, ఇటునుంటి అటూ ఎగురుతున్నాయి. అందరమూ తిండిమానేసి విభ్రాంతిపోయి చూడసాగేం. ఈలోగా నేలమీద కిచకిచ వినిపించింది.

"పిట్టపిల్ల పడ్డదీ!" కేకలేసింది మా అమ్మాయి. అదే కేక అందరూ వేశారు. అన్నాలు వదిలి దానిచుట్టూ చేరారు.

అది ముక్కు తెరుస్తుంది. ఒక్క అడుగు ముందుకు వేస్తుంది. గాభరాగా అటూ ఇటూ చూస్తుంది. ఎగరలేదు. రెక్కలురాని పక్షి దానికి అన్నం పెడ్తానని ఒకడు, నీళ్ళు పడ్తానని ఒకడు నానా గల్లంతు చేస్తున్నారు పిల్లలు. మా పెద్దమ్మాయి చిరిగిన రగ్గు ముక్కల్తో గూడు తయారుచేసింది. అందులో దాన్ని ప్రవేశపెట్టింది.

"ఇది నా పిట్ట. పెంచి పెద్దదాన్ని చేస్తా."

"కాదు. అది అందరిదీ. పెంచి పెద్దదాన్ని చేద్దాం" అన్నాడు పెద్దవాడు.

"ఇక నేను స్కూలుకు వెళ్ళను" అన్నాడు చిన్నవాడు.

అందరమూ పెళ్ళికి వెళ్లాల్సొచ్చింది. వచ్చేవరకు పిట్టకు సరిపడ గింజలూ, నీళ్ళూ పెట్టారు పిల్లలు. దానికి వెలుగు రావాలని కిటికీ సైతం తెరిచి వుంచారు. మేం వెళ్ళింది ఒక పల్లెకు. పల్లె చూపించడానికి తీసికెళ్ళాను పిల్లలను. మోటబావిలోపల ఉన్న ఈత చెట్టుకు గిజిగాని గూళ్లు కనిపించాయి వారికి. అవి తమకు కావాలన్నారు. పిట్టపిల్లను అందులో పెట్తామన్నారు పిల్లలు. ఆసామి కష్టంగా అది తీయించి ఇచ్చాడు.

ఇంటికి రావడం రావడమే పిట్ట దగ్గరికి ఉరికారు పిల్లలు. అది తల ఎత్తి, ముక్కుతో ఏదో చెప్తూతూ కిచకిచమంటూంది.

"ఏమిటూ అనేది?" అడిగాడు చిన్నవాడు.

"నన్నెందుకు వదిలిపోయా రంటూంది" అన్నాడు పెద్దవాడు.

చిన్నవాని కళ్ళనిండా నీరు వచ్చింది.

"డాడీ! నన్నెందుకు తీసికెళ్లావు? నేను పిట్టతో వుండేవాణ్ణిగా" అన్నాడు.

ఒకనాడు నేను బజారునుంచి వచ్చేవరకు అందరూ భోజనాలు చేస్తున్నారు.

నేను వంటింట్లో అడుగు పెట్టేవరకు "పిట్ట పిట్ట" అని కేక పెట్టారు పిల్లలు. చూస్తే అది సుమారు నా కాళ్ళకిందికి వచ్చేసింది. తుళ్ళిపడి ఎగిరి వెనక్కు గంతేశాను. పిట్ట ఎగిరి మా చిన్నవాడి పళ్ళెపుఅంచున కూర్చుంది.

"అమ్మ! బతికింది." అంతా నిట్టూర్చారు.

* * *

పిట్ట కొద్దికొద్దిగా ఎగురుతూంది. "రెక్కలొస్తే వుంటుందట్రా అది మీ దగ్గర?" అన్నాన్నేను.

"మనిషి ముట్టుకున్నదాన్ని పిట్టలు రానీయవట" అంది మా చిన్నమ్మాయి.

భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళడానికి బట్టలు వేసుకుంటూ అన్నాను: "పిట్టకు ఎండ తగలాలట్రా. అది ఎగరడం నేర్చింది, కాస్త ఎండలో వదలండి."

ఆ రోజు ఎందుకో మా పిల్లలకు శలవు వచ్చింది. ఎంతో హుషారుగా వున్నారు; పిట్టతో ఆడుకోవచ్చని. ఒకడు పిట్టను ఎండలో వదిలాడు. ఒకడు గింజలేశాడు. అది గింజలు ఏరుకొని తింటూ మెల్ల మెల్లగా ఎగురుతూంది. చుట్టూ చేరి అందరూ చూస్తున్నారు. బూట్లకు లేసులు కట్టుకుంటూ నేనూ చూస్తున్నాను.

ఒక గద్ద వచ్చింది. పిట్టపిల్లను ఎగరేసుకుపోయింది.

"పిట్టపోయె, పిట్టపోయె" అని పిల్లలు గొల్లుమన్నారు. నేను బయటికి పరిగెత్తాను. మా ఆవిడ ఎంగిలిచేత్తో ఉరికి వచ్చింది.

నేను ఆ రోజు ఆఫీసుకు వెళ్ళలేదు.

శ్రీమతి వండలేదు.

చిన్నవాడికి జ్వరం తగిలింది.

★ ★ ★

# జై జవాన్

హోటల్లో కూర్చున్నా. కాఫీకి ఆర్డరిచ్చాను. రేడియో పలుకుతూంది. వింటున్నా.

"ఇది దేశాలమధ్య యుద్ధంకాదు. సిద్ధాంతాల మధ్య యుద్ధం. ప్రజాస్వామ్యానికీ, నియంతృత్వానికీ యుద్ధం, మత మౌఢ్యానికీ, మానవతకూ యుద్ధం. మానవత మంట కలుస్తున్నది. దానవత పురివిప్పి గంతులు వేస్తూంది. దాన్ని మంటకలపాలి. మానవతను నెలకొల్పాలి. అందుకూ ఈ పోరాటం."

ఏవో సెగలూ పొగలూ మనసులో చేరాయి. సిగరెట్టు వెలిగించాను. ఆ పొగలు వదులుతున్నట్లనిపించింది. కాఫీ వచ్చింది, తాగాను. సెగలు తాగినట్లనిపించింది.

కిరాతుడు క్రౌంచ పక్షిని కొట్టాడు. అది విల విలా తన్నుకొని ప్రాణాలు వదిలింది. అది వాల్మీకి నాటి మాట. నేడు కిరాతుని బాణం వట్టిపోయింది. క్రౌంచ పక్షులు కిరాతునిమీద దాడి చేశాయి. వాని కళ్ళలో పొడిచాయి. రక్తం బొటబొటా కారుతూంది. ఎంత హాయిగా ఉంది అది చూస్తుంటే! ఎంత ఉద్రేకం కలుగుతూంది. ఎంత ఉత్తేజం పొంగుతూంది.

యుద్ధం నాకు గిట్టదు. ఆ మాటకొస్తే ఏ కవికీ, రచయితకూ – కళాకారునికీ గిట్టదు. అసలు భారతదేశానికి గిట్టదు. కాని, ఏం చేయాలి? అన్యాయం జరుగుతూంది. హింస చెలరేగుతూంది, పొరుగిల్లు తగలబడింది. పొగలు మన యింట్లోకి వస్తున్నాయి. మంటలు ఆర్పాలి. అందుకు సాగాలి, ముందుకు సాగాలి. ఆగలేం, యుద్ధం చేయాలి, మానవత గెలవాలి, దానవత్వం ఓడాలి.

పాన్ దుకాణం దగ్గరికి వచ్చాను. పాన్ తిని మళ్ళీ సిగరెట్టు కాల్చాను. ఎక్కడ విన్నా అవే మాటలు, అవే చర్చలు. పొగ వదులుతూ రోడ్డు మీదకు వచ్చాను. కాలిబాటమీద నుంచున్నాను.

ఒక సైనికుడు – ఒక జవాను – వస్తున్నాడు. అతని వెనుక ఒక ముసలవ్వ వస్తూంది. వెండి వెంట్రుకలు, ముడతలుపడిన ముఖం. ఏడుస్తున్నట్లుంది. జవానును అడ్డుతూంది. ఏదో గొణుగుతూంది. అతడు ఏదో చెప్తున్నాడు. సాగిపోతున్నాడు. ఆవిడ మళ్ళీ అడ్డుతూంది.

చూచాను. ఏదో ఆసక్తి ఏర్పడింది. అతను దేశరక్షణకు వెళ్ళుతున్నాడు ఆవిడ ఎవరు? ఎందుకు ఆపుతూంది? తెలుసుకోవాలనిపించింది. ఆసక్తి ఏర్పడింది. సమీపించాను. ఆవిడను అడిగాను.

"అయ్యో! కాళ్మొక్త. మొన్ననే వచ్చిండండి–రజమీద. వీడు నా పోరడుండి. వీడి పెండ్లం నీళ్లాడింది. పోరడు పుట్టిపోయిండు. ఇంతట్లనే ఖబర్ వచ్చింది. మినిట్ ఉంటలేదుండి. ఉరుకుతాండు. జంగ్ జరుగుతున్నదట గద?" ముసలవ్వ చెప్పింది.

మాతృహృదయం పొంగింది. ప్రతిబిడ్డా తల్లికి ముద్దే. మనందరినీ కన్న తల్లిని కాపాడ్డానికి వెళ్ళుతున్నాడమ్మా నీ బిడ్డ. నీ బిడ్డ ధన్యుడు తల్లీ! అందామనుకున్నాను. అనలేకపోయాను. ఏం చేయాలో తోచలేదు. పక్కకు చూచాను. పూలదుకాణం కనిపించింది. వారిని అక్కడే ఉండమని దుకాణానికి ఉరికాను. దుకాణంలో పెద్ద పూలదండ కనిపించింది. ఇవ్వమన్నాను. అది దేవునికోసం కట్టింది ఇవ్వనన్నాడు దుకాణంవాడు. అంతకంటే సదుపయోగం అవుతుందని పూలదండ కొన్నాను. వింతగా చూచాడు పూలకొట్టువాడు. పరిగెత్తి జవాను మెళ్ళో పూలదండ వేశాను. నేనే చప్పట్లు కొట్టాను.

వీధిన నడిచే జనంకూడారు, ఏమిటి అన్నట్లు చూచారు. "వీర సైనికుడు సమరానికి వెళుతున్నాడు. గౌరవించడం మన కర్తవ్యం" అన్నాను. జనంలో సంచలనం బయలుదేరింది. పరిగెత్తారు, పూలదుకాణానికి. పూలదండలు పడుతున్నాయి. పుష్పగుచ్ఛాలు అందుతున్నాయి. బజారు సాంతం కదిలింది. కొందరు పండ్లిచ్చారు, కొందరు బట్టలిచ్చారు, కొందరు బిస్కట్లిచ్చారు.

జవాను పూలల్లో మునిగిపోయాడు.

కానుకలు అతని ఎత్తు అద్దె బడ్డాయి.

ముసలవ్వ కళ్ళల్లో ఆనందం కనిపించింది.

"జై జవాన్" కేక వేశాన్నేను.

వేల కంఠాలు మారుమ్రోగాయి.

కార్లు ఆగాయి, బస్సులు ఆగాయి, రిక్షాలు ఆగాయి, సైకిళ్ళు ఆగాయి. జవాన్‌ను స్టేషనుకు మేం తీసికెళ్తామంటే మేం తీసికెళ్తామని వాదులాట జరిగింది. యువకులు ముందుకు వచ్చారు. జవాన్ను ఎత్తుకున్నారు. ఎగిరారు. గంతులు వేశారు. భుజాలమీద జవాన్ని ఎక్కించుకుని సాగిపోయారు.

"వీరజవానుకు జై!"

నినాదాలు పిక్కటిల్లుతున్నాయి. ఉత్సాహం ఉరకలు పెడుతూంది. ఊరేగింపు సాగుతూంది. ఎక్కణ్ణుంచో బ్యాండు కూడా వచ్చేసింది.

మగువలు మంగళహారతు లిచ్చారు. కుంకుమ బొట్లు పెట్టారు. ఒక యువతి బొటనవేలి రక్తంతో రక్తతిలకం దిద్దింది.

ఊరేగింపు స్టేషనుకు చేరింది. స్టేషను జనంతో కిటకిటలాడింది.

జవాను తన మెడలోని దండలన్నీ తల్లిమెడలో వేసి పాదాభివందనం చేశాడు.

అవ్వ పిడికిలి బిగించి అరచింది –

"జై జవాన్!"

వేలకంఠాలు మారుపలికాయి –

"జై జవాన్!"

★ ★ ★

# తెరవెనుక

రవి నిలిచిపోయాడు - గేటుముందు గూర్ఖాను చూచి.

ఎన్నో ఆశలు పెంచుకొని వచ్చాడు - అన్నీ కూలిపోయాయి. అసలు తనకు ప్రవేశం లభిస్తుందా అనుకున్నాడు. పరంధామయ్య బంగళా చూచాడు - తనను చూచుకున్నాడు. తన వేషం తనకే చిరా కనిపించింది. కొంతలో కొంత సిగ్గనిపించింది.

రవి గూర్ఖాను చూచాడు - బంగళాను చూచాడు. లాభం లేదనుకొన్నాడు. వెనక్కు తిరిగి వెళ్ళిపోదామను కొన్నాడు. అనుకున్నాడేగాని వెనక్కు తిరగలేదు. ముందడుగువేసి గబగబా సాగిపోయాడు - గేటు దాటాడు. గూర్ఖా రవిని ఆపలేదు. అయినా, గుండె గుబులు ఆగలేదు రవికి.

రవి పరంధామయ్యను మెచ్చుకున్నాడు. గూర్ఖాను మెచ్చుకున్నాడు. వెనక్కు చూడకుండా మెట్లెక్కాడు.

రవి మెట్లెక్కి నిలిచిపోయాడు. తివాచీని చూచి నిలిచిపోయాడు. రవి తివాచీని చూచాడు - సొగసుగా ఉంది. తన కాళ్ళు చూచుకున్నాడు - మొరటుగా ఉన్నాయి. తివాచీ శుభ్రంగా ఉంది - రవి కాళ్ళు దుమ్ముకొట్టుకొని ఉన్నాయి.

రవి రెంటినీ చూచాడు. కాళ్లు దులుపుకున్నాడు. తివాచీకి అంటకుండా అడుగు పెట్టాడు - వరండాలో ప్రవేశించాడు. వరండా విశాలంగా ఉంది. అందంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది. దిగాలుపడి చూస్తున్నాడు రవి.

"ఎవరో వచ్చారు!" చిలక పలికింది.

రవి ఉలిక్కిపడి చూచాడు.

పంజరంలో చిలక పలికింది. రవికి ముచ్చట వేసింది. పరంధామయ్యను మళ్ళీ మనసులో మెచ్చుకున్నాడు. చిలకను చూస్తూ నుంచున్నాడు. చిలక అందం చూడ్డంలో మునిగిపోయాడు.

"ఎవరు కావాలి?" ఒక నౌకరు వచ్చి అడిగాడు.

అది రవికి వినిపించలేదు. రెండో సారి నౌకరు గట్టిగా అడుగుతే వినిపించింది రవికి. కాస్త తడబడ్డాడు.

"పరంధామయ్యగారి దర్శనానికి వచ్చాను." వినయంగా విన్నవించాడు రవి.

వచ్చినవాడు రవిని పురుగును చూచినట్లు చూచాడు - "వస్తారుండు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

రవికి వచ్చిన వాడిమీద కోపం వచ్చింది. తనను చూచుకొన్నాడు. కోపం దిగిపోయింది.

వరండాలో సోఫాలున్నాయి. అయినా అతడు కూర్చోలేదు. గోడల్ని పరిశీలించ సాగాడు. పటాలు అనేకం ఉన్నాయి గోడలకు. అన్నీ పరంధామయ్యగారు మంత్రిగా

ఉన్నప్పుడు మహానాయకులతో తీయించుకున్నవి. వాటిని చూచి ధైర్యం వచ్చింది రవికి. పరంధామయ్యగారి ఒక్క మాట–ఒక్క చీటి–ఒక్క టెలిఫోను–తన పని జరిగిపోతుంది.

"చేస్తాడా పరంధామయ్య?"

"ఎందుకు చేయడు?"

"ఎందుకు చేస్తాడు?"

ఇలాంటివే పలురకాల ఆశలు, నిరాశలతో సతమతం అవుతుండగా 'అం ఏమబ్బాయ్,' అంటూ ప్రవేశించాడు పరంధామయ్య.

పటాల మీంచి దృష్టి మళ్ళించి చూచాడు– పరంధామయ్య! దేవుడు ప్రత్యక్షం అయినట్లయింది. తబ్బిబ్బయినాడు – తత్తర పడ్డాడు రవి, అయినా ఎలాగో నమస్కరించాడు.

"రా – కూర్చో" అంటూ పరంధామయ్య సోఫా వైపు నడిచి కూర్చున్నాడు.

రవి పరంధామయ్యతో నడిచాడు – కాని కూర్చోలేదు – సోఫాను పట్టుకొని నుంచున్నాడు.

"చాలా సేపైందా వచ్చి? రాత్రి మంత్రిగారికి పార్టీ ఇచ్చాను. చాల పొద్దుపోయింది–ఏ తెల్లవారు జామునో పడుకున్నా – తప్పవు ఇవన్నీ మాకు. ఆ మంత్రి విదేశాలకు వెళ్తున్నాడు – అందుకే ఆలస్యంగా లేచాను – మామూలుగా నైతే తెల్లవారు జామునే లేస్తాను–నేను గాంధీజీ ఆత్మకథ చదివాను" – ఇంకేవేవో చెప్పకు పోతున్నాడు పరంధామయ్య. అవన్నీ తనకు ఎందుకు చెప్తున్నాడో, తాను ఏమనాలో అర్థం కాలేదు రవికి – చేతులు పిసుక్కుంటూ నుంచున్నాడు రవి.

పరంధామయ్య రవిని జాలిగా చూచాడు. "అలా నుంచున్నా వేం? కూర్చో. తప్పలేదు–మేం సోషలిజం తెస్తాం – పర్లేదు – కూర్చో – నాకు పెద్దా చిన్నా లేదు –– అందర్నీ కూర్చోమంటా – అది సోషలిజం కాదూ – కాదంటారు కొందరు – వాళ్ళకు తెలియదు అసలు సోషలిజం – నేను ఓడిపోయాను – కాకుంటే ఇప్పటికి సోషలిజం తెచ్చేవాణ్ణే" – ఇంతవరకు బాగానే ఉంది, రవి వింటూ పోతున్నాడు – అతనికేమీ అర్థం కాలేదు – అది అర్థం చేసుకోవడానిక్కాదు వచ్చింది తను – తన పని కోసం. రవి చిక్కులో పడ్డాడు "ఏమంటావ్?" అనే పరంధామయ్య ప్రశ్నతోని.

తికమక పడ్డాడు రవి. అతని గొంతులోంచి అతనికి తెలియకుండానే వచ్చాయి పదాలు:– "అవునండీ, అక్షరాల నిజం."

"అద్గది అలా అను – అందరికీ అర్థం కావయ్యా ఇలాంటివి. నువ్వు తెలివి కలవాడిలా ఉన్నావు. రా. కూర్చో" అని చేయిపట్టి లాగి తన ముందు సోఫాలో కూర్చోపెట్టాడు పరంధామయ్య రవిని.

రవికి ఇంద్రాసనం లభించినట్లయింది – అయినా, ముళ్ళమీద కూర్చున్నట్లే కూర్చున్నాడు బిక్కమొహం వేసి – అతని మనసు మాత్రం ఆనందంతో గంతులు వేస్తోంది – నీరు విడిచిన చేపలా.

"అం చెప్పు, కాఫీ తాగుతావా? టీయా? కాఫీ సైతం తాగకుండా వచ్చేశాను ఎవరో వచ్చేరంటే – ఎవరొచ్చినా పాపం, పనిమీదే వస్తారుగా! నేను కాఫీ

తాగుతూ కూర్చుంటే ఎలా? ఇలాంటివాళ్ళనేనయ్యా జనం ఓడించేది. ఇదీ మన ప్రజాస్వామ్యం. ఏమంటావ్?"

"మరేనండీ" అన్నాడు రవి.

"సరేగాని, ఇంతకూ కాఫీయా? టీయా?"

"ఇప్పుడెందుకు లెండి - మీరు పుచ్చుకోండి."

"బావుంది, నిన్ను వదిలి నేనా - మీరు యువకులయ్యా - మీ భుజ స్కంధాల మీద ఉంది భారతదేశపు బరువంతా - కాఫీ తెప్పిస్తా - సరేనా?"

"సరేనండీ!"

కాఫీ వచ్చింది. అప్పటికి రవి కొంత సర్దుకున్నాడు - కాఫీ కప్పు తీసుకొని చప్పరించసాగాడు.

"ఇంతకూ వచ్చిన పని చెప్పావు కావు?" పరంధామయ్య అడిగాడు.

రవి తనలోకంలోకి వచ్చేశాడు - పరంధామయ్యముందు సోఫాలో కూర్చుని కాఫీ తాగుతున్న దర్జా నుంచి ఇరుకు ఇంట్లోకి వెళ్ళిపోయాడు. మంచంలో ముసుగుకప్పుకొని పడుకున్న తల్లి - వయసు వచ్చీ వయసెరుగక బండ చాకిరీ చేస్తున్న చెల్లి - పుస్తకాల్లేక రాసుకున్న నోట్సు బట్టీ పెడ్తున్న తమ్ముడు - ఇంటి నిండా ముసురుతున్న ఈగలు - ముందున్న మురికి కాలువా-అమాంతంగా ముక్కు మూసుకున్నాడు - సగం తాగిన కప్పు టీపాయ్ మీద పెట్టి, చేతులు ముడుచుకొని కూర్చొని విన్నవించాడు:

"నాకు ఫస్టు మార్కులొచ్చాయండీ - చదువంటే ఆపేక్ష - నాన్నపోయారు - అమ్మకు క్షయ - పెళ్ళి కావలసిన చెల్లి - చదువుకునే తమ్ముడున్నారు - ఈవినింగ్ కాలేజీలో చేరాను - ఏదైనా ఉద్యోగం చూపిస్తే - మీ దయ - జన్మ జన్మాలకు రుణపడి ఉంటాం. తరవాత మాట్లాళ్ళేక పోయాడు.

"అలాగా పాపం!" చుట్టవెలిగిస్తూ అన్నాడు పరంధామయ్య - సాఫాలో వాలి పోయి పొగ వదలసాగాడు.

పరంధామయ్యను చూస్తూ ఉండిపోయాడు రవి.

మౌనం - నిశ్శబ్దం.

"రవీ" సోఫాలో ముందుకు వంగి చుట్ట బూడిద యాష్ట్రేలో దులుపుతూ అన్నాడు పరంధామయ్య. "అసలు ఈ పరీక్ష లెందుకయ్యా నాకర్థం కాక అడుగతాను. మీమీద నమ్మకం లేక కాదూ పరీక్షలు పెట్టేది! ఈ ప్రభుత్వానికి యువజనులమీద విశ్వాసంలేదయ్యా! ఉంటే ఇలా జేల్లో కూర్చో పెట్టినట్టు కూర్చోపెట్టి ఎందుకు చెప్పు పరీక్షలు రాయించడం? మేం ఫలానా. ఫలానా సబ్జక్ట్సు చదివాం అని మీరొక సర్టిఫికేటు ఇస్తే ఆ యూనివర్సిటీవారు డిగ్రీలు పారేస్తేపోలా! వారికి కర్చూతప్పె, మీకు శ్రమాతప్పె. అయినా చదువుల్లో ఏముంది చెప్పు - తెలివికావాలిగాని - అదెలాగూ డిగ్రీలలో రాదాయె. మేమేం చదివాం చెప్పు. నాకు డిగ్రీఉందా! నేనూ నీలాగే పాతికేళ్లకింద ఉద్యోగం వెతుక్కుంటూ నానా గడ్డికరచాను. అదృష్టం బాగుండి అది దొరకలేదు- మంత్రినయ్యాను - మూడుటరమ్లు చేశానయ్యా! చూస్తున్నావుగా ఈ బంగళా - కారూ అన్నీ స్వార్జితం - అదృష్టం బాగాలేక -, ఈ తడవ ఓడిపోయాననుకో - అయితే మాత్రం మళ్ళీ మంత్రిని కాకపోతానా

– వీళ్ళకేం తెలుసునయ్యా ప్రభుత్వం చేయడం – మూడు టరముల అనుభవం ఉంది, అందుకే సలహాలకు పిలుస్తుంటారు. ఇంతకూ ఏమంటావ్? చదువులను గురించి నా అభిప్రాయాలు. మోస్ట్‌మోడరన్ కావూ?"

చిత్తరువులా కూర్చొని వింటున్న రవికి ఆ ప్రశ్న కొరడా దెబ్బలా తగిలింది.

"మీరు మోస్ట్ మోడరన్ సార్! ఎంత గొప్పగా ఆలోచించారు! కాని అది అమలు జరపడం ఎలా సార్?"

"మీరు యువకులు, విద్యార్థులు, మీరు సాధించలేని దేముందయ్యా ముందడుగు వేయాలి – అంతే – ప్రభుత్వాలే మారిపోతాయి. సాధించాలయ్యా – సాధిస్తే అన్నీ సాధ్యమే. నువ్వే ఈ ఉద్యమానికీ నాయకుడివి, ఏమంటావ్!"

అర్థంకాలేదు రవికి. అయోమయంలో పడిపోయాడు తానెందుకోసం వచ్చాడు? తానేమి కానున్నాడు? ఊహించుకున్నాడు – ఏదో బంగారు కలలు కనిపించాయి. కలలు కరిగాయి – అమాంతంగా మురికి కొంపలో పడిపోయాడు.

"సార్! మా అమ్మ – క్షయ – చెల్లి – తమ్ముడు...."

"అవన్నీ నేను చూచుకుంటాను. ఆ బాధ్యత నాది – నువ్వు నాయకునివి కావాలి. నా అంతవాడివి కావాలి" అని జేబులోంచి పచ్చకాగితాలు తీసి అందించాడు పరంధామయ్య.

కళ్ళు జిగేలుమన్నాయి రవికి. పచ్చ కాగితాలు తన చేతిలో. ఉబ్బితబ్బిబ్బైనాడు– "సార్! మీకెలా కృతజ్ఞత తెలుపుకోవాలి సార్ – ఎలా మీ రుణం తీర్చుకోను సార్..." ఇంకేదో ఇలాంటి స్తోత్రం చదివేశాడు.

"నువ్వు నాయకునివే కావాలోయ్! నువ్వు గొప్పవాడివి కావాలోయ్" అని భుజంమీద చేయివేశాడు పరంధామయ్య.

"నన్నేం చేయమంటారు సార్?" హనుమంతునిలా చేతులు జోడించి అడిగాడు రవి – ఆజ్ఞ అవుతే సమస్తలోకాలూ తగులపెట్టి వస్తాననేంత ధ్వని ఉంది అందులో.

మళ్ళీ చెప్పాడు పరంధామయ్య. చదువులను గురించి తన అభిప్రాయాల్ని – వివరంగా – "గుర్తుందిగా మన నినాదం – చెప్పు ఏమిటో?" అడిగాడు పరంధామయ్య.

"పరీక్షలుకాదు – డిగ్రీలుకావాలి"

"యువజనులు సాధించలేనిది లేదు."

పిడికిలి బిగించి గట్టిగా నినాదం చేశాడు రవి.

"అంతే, మరేం లేదు. డబ్బును గురించి బాధపడకు" అని రవితో పాటు మెట్లుదిగిన పరంధామయ్య డ్రైవరును పిలిచి కారులో పంపించాడు రవిని.

వెళ్ళిపోతున్న కారునుచూచి తృప్తిగా నవ్వాడు పరంధామయ్య.

కార్లో కూర్చున్న రవికి నేల కనిపించలేదు.

రవికి కాలేజీలో మిత్రులు పెరిగి పోతున్నారు. పరంధామయ్య నినాదానికి ప్రచారం ఎక్కువ అవుతూంది. ఒకనాటి సాయంకాలం రవి తన మిత్రుల్తో దిగాడు – కార్లల్లో – పరంధామయ్య సౌధానికి. పరంధామయ్య వారికి స్వాగతం ఇచ్చాడు. వచ్చినవారూ, పరంధామయ్యా పరమ సంతోషించారు. వచ్చిన వారికి సంతోషం పరంధామయ్య పరిచయం లభించినందుకు. పరంధామయ్యకు సంతోషం తన పాచిక పారుతున్నందుకు. పరంధామయ్య వారితో పరమ ఆప్తునిలా మాట్లాడాడు. పరీక్షల్ని

గురించి వివరించాడు. నిరుద్యోగ సమస్యను గురించి వాపోయాడు – యువజనుల శక్తిని కొండంతలు చేసి చెప్పాడు. అంతేకాదు, టేబుల్‌మీద బాటిల్ ఒపెన్‌చేశాడు – సోడాలు బుస్సుమన్నాయి. గ్లాసులు కణకణమన్నాయి. రవికీ, అతని మిత్రులకూ పరంధామయ్య చెప్పింది అప్పుడు బాగా అర్థం అయింది.

తెల్లవారింది – మత్తుమత్తుగా కదిలారు రవీ – అతని మిత్రులూ. సాగనంపాడు పరంధామయ్య ఆశలు రెక్కలు తొడుక్కొని ఎగిరిపోయారు వచ్చినవారు.

అలా వెళ్ళినవారు ఊరుకోలేదు. కాలేజీలో కల్లోలం లేపారు. "పరీక్షలు కాదు డిగ్రీలు కావాలి" అని నినాదాలు చేశారు. కుర్రాళ్ళు కాలేజీ వదిలేశారు. పత్రికల్లో పతాక శీర్షికల్తో నినాదం వచ్చింది.

రవి మురిసి పోయాడు.

పరంధామయ్య మురిసి పోయాడు.

రవి పలుకుబడి హెచ్చుతూంది. అతనికి విరామం ఉండడం లేదు – బార్లు, కార్లు, కాలేజీలు, చర్చలు, ఉపన్యాసాలు.

రవి ఛోటా నాయకుడై పోయాడు. అతడు ఉద్యోగం మరచాడు. ఇల్లు మరచాడు – ఉన్నత పదవులను గురించి కలలు గంటున్నాడు.

రవి ఒక మహాసభ ఏర్పాటు చేశాడు. పరంధామయ్య ఉపన్యసించాడు:

"విద్యార్థులారా! యువజనులారా! భావిభారత అధినేతలారా!" అని ప్రారంభించే సరికి విద్యార్థులలో ఉత్సాహం ఉరకలు వేసింది – వారు చప్పట్లు కొట్టారు– ఈలలు వేశారు. పరంధామయ్య గొంతు సవరించుకొని మళ్ళీ సాగించాడు – అయన మహోపన్యాసం ఇచ్చాడు – రవి కంటె ఒక అడుగు ముందుకు వేశాడు:

"మనకు పరీక్షలు వద్దు, డిగ్రీలూ వద్దు, ఉద్యోగాలు కావాలి – ఉద్యోగాలు – ఉద్యోగాలులేని డిగ్రీలు కడుక్కు తాగుతామా? యువజనులారా! ఒకేఒక్క మాట అడగండి ప్రభుత్వాన్ని – మాకు ఉద్యోగాలు కావాలి – అంతే – డిగ్రీలు వద్దు పరీక్షలూ వద్దు."

ఉపన్యాసం విన్న జనం ఉక్కిరి బిక్కిరి అయినారు. ఉబ్బితబ్బిబ్బైనారు. పరంధామయ్యకు జైకొట్టారు. అతన్ని ఎత్తుకొని ఎగిరారు. వీరంగం వేశారు – ఈలలు కొట్టారు.

ఆ రాత్రి పరంధామయ్య ఇంట్లో పెద్దపార్టీ అయింది – విద్యార్థులు సమ్మె చేయాలని నిశ్చయించారు.

పత్రికలు వార్తలు ప్రకటించాయి.

ప్రభుత్వం బిత్తరపోయింది.

అయినా సమ్మె ఆగలేదు.

సమ్మె రోజుకుముందు రవి వంటరిగా పరంధామయ్య ఇంటికి వచ్చాడు. వచ్చినవాడు ఇంటిముందున్న వస్తాదుల్ను చూచి వణికిపోయాడు. పరంధామయ్య అతనికి అభయం ఇచ్చాడు – వస్తాదుల్ను ఎందుకు రప్పించిందీ వివరించాడు:–

"ఈ ప్రభుత్వం ఉంది చూచావూ! వట్టి సమ్మెలకు లొంగదు. కొంత హింసకావాలి. కొన్ని బస్సులు తగలబడాలి – కొన్ని కాల్పులు జరగాలి. కొందరు ఒరగాలి – కొన్ని రైళ్ళు నిలవాలి. కొన్ని లైట్లు పగలాలి – ఇవన్నీ మీరు చేయగలరా?"

రవికి ఏమీ అర్థంకాలేదు. అతడు జవాబూ చెప్పలేదు కళ్ళప్పగించి చూచాడు – అంతే.

పరంధామయ్యే జవాబు చెప్పాడు, "చేయలేరు. అందుకే వీళ్ళను పిలిపించాను. వీళ్లు అన్నీ చేయగలరు–చేస్తారు. నువ్వు ఇంకా కుర్రాడివి. నాయకుడివి కావలసిన వాడివి – అందుకే చెప్తున్నా అన్నీ. అన్నీ సక్రమంగా ఉన్నాయా?" అడిగాడు పరంధామయ్య.

అంతా సక్రమంగా ఉందని ఎంతో ధైర్యంగా చెప్పాడు రవి. ఎవరో కొందరు మాత్రం ఇది స్వార్థపరుల పన్నాగం అంటున్నారుగాని మెజారిటీ సమ్మె చేస్తున్నారన్నాడు. కాలేజీలో ప్రవేశించువారి కాళ్ళిరక్కొట్టే ఏర్పాటు చేయించానన్నాడు రవి.

పరంధామయ్య రవిని మెచ్చుకున్నాడు. పైకి వస్తావని వీపు చరిచాడు.

రవి పొంగిపోయాడు.

సమ్మె మొదలైంది. విద్యార్థులు రెండు పక్షాలుగా విడిపోయారు. కాలేజీముందు కురుక్షేత్రం సాగింది. పోట్లాటలు, కుస్తీలు, కుమ్ములాటలు – కొందరికి గాయాలు తగిలాయి. కొందరు ఆస్పత్రుల్లో చేరారు.

ప్రభుత్వం జోక్యం కలిగించుకోలేదు. పరిస్థితి ప్రశాంతంగా ఉందని ప్రకటించింది.

రోజులు గడుస్తున్నాయి. ఉద్రేకాలు పెరుగుతున్నాయి. కాలేజీ ధ్వంసం అయింది. ఫర్నీచర్ తగలబడింది. పోలీసు దిగింది – లాఠీచార్జి చేసింది. టియర్‌గ్యాస్ వదిలింది. విద్యార్థులు కాలేజీ వదిలి వీధులు పట్టారు. బ్రహ్మాండమైన ఊరేగింపు సాగింది. విద్యార్థుల్లోంచి రాళ్ళవాన కురిసింది. వీధుల్లోని దుకాణాల అద్దాలు బద్దలైనాయి. పోలీసులు లారీలు దిగారు. కాల్పులు జరిపారు. ఆ తరువాత టియర్‌గ్యాస్ వదిలారు – వెంట తరిమి లాఠీచార్జి చేశారు.

బస్సులు తగుల బడ్డాయి.

వీధిలాంపులు ముక్కలైనాయి.

పట్నంలో ఉద్రేకం ప్రబలిపోయింది. హింస పురివిప్పి ఆడింది. ప్రజలు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకున్నారు. పత్రికలు నోళ్ళువిప్పి పెను కేకలు పెట్టాయి.

ప్రభుత్వం మేల్కొన్నది. సమ్మె మానమనీ, శాంతంగా ప్రవర్తించమనీ విన్నవించింది. విన్నపాలు వమ్ము అయినాయి. సంప్రదింపులకు రావలసిందని విద్యార్థులను పిలిచింది.

పరంధామయ్య పెద్దసభ చేశాడు. అది విద్యార్థుల విజయమన్నాడు. సంప్రదింపులకు తానే పోతానన్నాడు. విద్యార్థులు ఏకగ్రీవంగా అంగీకరించారు.

సంప్రదింపులు ప్రారంభం అయినాయి. సమ్మె సాగుతూనే ఉంది.

సంప్రదింపులకు వెళ్ళిన పరంధామయ్య ప్రభుత్వాన్ని వెక్కిరించాడు–బేరం ప్రారంభించాడు– తనను కనీసం మంత్రిని చేయకుంటే దేశం తగలబడుతుందన్నాడు – తన శక్తిని అంచనా వేసుకొమ్మని వెకిలిగా నవ్వాడు –, సిగరెట్టు దమ్ము గట్టిగా లాగాడు – ఆ తరువాత మాట్లాడలేదు.

ప్రభుత్వం బిత్తరపోయింది. దానికీ దీనికీ సంబంధం ఏమని అడిగింది.

"అందులోనే ఉంది రాజకీయపు చిట్కా. మీరు ఇవ్వననండి, నేను వెళ్ళిపోతా" అన్నాడు పరంధామయ్య.

ప్రభుత్వానికేం అర్థం కాలేదు. "మీరిలా అన్నారని వారికి చెబితే!" ఒక ప్రశ్న వేసింది.

"చెప్పి చూడండి. వారు మిమ్మల్ని నమ్మరు."

బయట నినాదాలు మొదలైనాయి. పరంధామయ్య జయ జయ ధ్వానాలు వినిపించాయి.

ప్రభుత్వం దిగి వచ్చింది – మరేదైనా పదవి ఇస్తానంది. అయితే ఇవ్వాల్టికి సంప్రదింపులు ఆపివేద్దామన్నాడు పరంధామయ్య రేపు మళ్ళీ కొనసాగింతామన్నాడు. బయటికి వచ్చిన పరంధామయ్య సంప్రదింపులు కొనసాగుతున్నాయనీ ప్రభుత్వం కొంత దిగివచ్చిందనీ ప్రకటించాడు.

విద్యార్థులు ఆయన్ను ఎత్తుకొని గంతులు వేశారు.

సంప్రదింపులు చాలా కాలం కొనసాగాయి– అయినా సమ్మె ముగిసింది.

చివరకు పరంధామయ్య మంత్రి అయినాడు – అందుకు రవి పొంగిపోయాడు. తొలుత పరంధామయ్యకు అభిందనలు చెప్పినవాడు రవి.

రవి బ్రహ్మాండమైన అభినందన సభ ఏర్పాటు చేశాడు – ఒక లారీ పూలదండలు పడ్డాయి పరంధామయ్య మీద. పరంధామయ్య బ్రహ్మాండమైన ఉపన్యాసం ఇచ్చాడు. తనను మంత్రిని చేసినందుకు విద్యార్థులకు, యువజనులకు కృతజ్ఞతలు చెప్పాడు. పరీక్షలు లేకుండా డిగ్రీలు, డిగ్రీలు లేకుండా ఉద్యోగాలను గురించి విచారించడానికి ఒక కమిటీ వేశామని చెప్పగానే కరతాళ ధ్వనులు మిన్ను ముట్టినవి. మరొకవైపునుంచి పాత చెప్పులూ, కుళ్ళిన టమాటాలూ వేదికపై పడ్డాయి. దాంతో సభలో కల్లోలం చెలరేగింది.

పరంధామయ్య ఫారెన్ కారులో బయట పడ్డాడు.

కాలం ఎవరికోసం ఆగింది? గడిచిపోతూనే ఉంది. రవికి మళ్ళీ గడ్డురోజులు వస్తున్న జాడలు కనిపించాయి. పరంధామయ్యను కలుసుకొందామన్నా కనిపించడంలేదు.

ఒకరోజు పట్టుదలగా బయలు దేరాడు. పరంధామయ్య ఇంటి ముందున్న గూర్ఖా రవిని ఆపుచేశాడు. రవికి కోపం వచ్చింది. గూర్ఖామీద గుర్రుమన్నాడు. గూర్ఖా అతన్ని మెడపట్టి గెంటేశాడు. రవి నేలమీద పడిపోయాడు. గాయాలు తగిలాయి. గుండెలో మంటలు చెలరేగాయి.

రవి నేరుగా కాలేజీకి వెళ్ళాడు. పరంధామయ్య నిజ స్వరూపాన్ని గురించి వివరించాడు. మంత్రి అయి విద్యార్థులను మరచాడన్నాడు. అసలు మోసపోయింది తామే నన్నాడు. చాలా ఉద్రేకంగా మాట్లాడాడు. పరంధామయ్యను సవాలు చేయాలన్నాడు. బయలు దేరింది విద్యార్థి దళం.

పరంధామయ్య ఇంటిమీద బ్రహ్మాండమైన దాడి జరిగింది. పరంధామయ్య ఇంటి ముందు కాల్పులు జరిగాయి.

రవి తుపాకి గుండుకు బలి అయినాడు.

విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనరాదని పత్రికా ప్రకటన చేశాడు పరంధామయ్య.

★ ★ ★

# అప్పిచ్చువాడు

తెల్లవారింది. హుసేన్‌సాగర్ ప్రశాంతంగా ఉంది. కొవ్వు పెరిగిన జనం కార్లు నిలిపి కాలినడక సాగిస్తున్నారు టాంక్‌బండ్‌మీద. సైకిల్‌మీద పోతున్నాడొక పోలీసు జవాను. ఒక గద్ద బాణంలా నీటివైపువాలి రాకెట్టులా ఎగిరిపోయింది. పోలీసు జవాను చూశాడు. సైకిలుకు స్టాండువేసి చెరువులోకి చూశాడు. శవం నీటిమీద తేలుతూంది. అమాంతంగా సైకిలెక్కి హడావుడిగా తొక్కాడు. పోలీసులు హుటాహుటిగా వచ్చారు. శవాన్ని తీశారు - ఫుట్ పాత్‌మీద వేశారు. రెండు మూడు మోటారు సైకిళ్ళు పెద్ద రొద చేస్తూ వచ్చి శవం దగ్గర నిలిచాయి. వచ్చినవారు పోలీసు అధికారులు. ఆదేశాలిచ్చారు, తుపాకి గుండులా సాగిపోయారు.

అందరూ వెళ్ళిపోయారు. ఒక్క పోలీసు జవాను మిగిలిపోయాడు, అతడు ముదుసలి - కంకాళానికి చర్మం తొడిగినట్లున్నాడు. అక్కణ్ణుంచి కదిలి లాఠీయుక్తంగా బెంచీమీద కూర్చున్నాడు. టోపీతీసి మోకాలికి తగిలించుకున్నాడు. సగం కాల్చిన బీడీ జేబులోంచి తీసి కాల్చాడు. పొగ వదిలి శవంవైపు చూచాడు. శవం ఉబ్బివుంది. వీడూ ఇవ్వాళే చావాలీ, వెధవ. అనుకున్నాడు చచ్చికూడా పోలీసుల్ని చంపుతారు జనం అనుకున్నాడు. పెళ్ళాం ఇంటిదగ్గర రోగంతో కుంగిపోతూంది. ఇవ్వాళయినా ఆస్పత్రికి తీసికెళ్దామనుకున్నాడు. పొద్దున్నే తేలాడు వెధవ, తన ప్రాణం తీయడానికి! తానిక్కడ శవాన్ని రక్షించడానికూర్చున్నాడు. అక్కడ తన భార్యను రక్షించేవారు లేరు. శవానికి కప్పడానికి కొత్తగుడ్డ - బతికినవాడికి చింపులుసైతం లేవు. చచ్చినవాడికి ఆరడుగుల స్థలం గ్యారంటీ! బతికి ఉన్నవాడికి అంగుళం స్థలం లేదు! యా అల్లా! బతికి ఉన్నవాళ్ళకంటే చచ్చినవాళ్ళకే ఎక్కువ హక్కులిచ్చావు. పోలీసు బీడి దమ్ములాగితే పొగరాలేదు. నలిపిచూచి నేలకొట్టాడు. శవంవైపు చూచాడు. ఎవరో వస్తున్నట్లు కనిపించింది. తల గోక్కొని టోపీ నెత్తిన పెట్టుకొని లేచి నుంచొని లాఠీ అందుకున్నాడు. వచ్చినవాడు ఘరానా మనిషి. శవాన్ని చూచి తొలగిపోయాడు.

పోలీసు నుంచునే ఉన్నాడు. కాకులు, గద్దలూ ఆకాశంలో శవం చుట్టూ తిరుగుతున్నాయి. డబుల్ డెకర్ సాగిపోయింది. సైకిళ్ళవాళ్ళు పోతూ పోతూ ఫుట్‌పాత్ మీద కాలుపెట్టి ఆగి, శవాన్ని చూచి సాగిపోతున్నారు.

టంకసాలలోంచి పొగ వస్తూంది.

హుసేన్ సాగర్ నంగనాచిలా ఉంది.

టాంక్ బండ్‌మీద సందడి ఎక్కువయింది.

శవం చుట్టూ జనం కూడుతున్నారు.

విడిపోతున్నారు. శవం గమనించలేదు. జవాను గమనిస్తున్నాడు.

స్కూటరు రయ్యిమని వచ్చి ఆగింది. రామసామి దిగాడు. జేబులోంచి పైసలు తీశాడు. శవాలకు పైసలెయ్యడం అతని సరదా. రామసామి ఫుట్‌పాత్ ఎక్కాడు. శవాన్ని చూచాడు. శవపు ముఖం చూచాడు. చేయి ముడుచుకుంది. పైస రాలలేదు. రామసామి ముఖంలోంచి నిప్పులు కురిశాయి. "ఒరే వెంకట్రావూ! చచ్చావురా! నా బాకీ ఎగ్గొట్టి చచ్చావురా! ఇంత దుర్మార్గుని వనుకోలేదురా! ఎవడు తీరుస్తాడురా నీ అప్పు?" అని కాలెత్తి తన్నబోయాడు. పోలీసు పరిగెత్తి వచ్చాడు. రామసామిని పక్కకు జరిపాడు.

"మీకు తెలుసాండి ఈ మనిషి?" పోలీసు ప్రశ్నించాడు.

"తెలియకేం భాయీ! అప్పు తీసుకున్నాడు నా దగ్గర, దుర్మార్గుడు. కోర్టు డిక్రీ తప్పించుకోవడానికి చచ్చాడు. ఇప్పుడేం చేయగలదు కోర్టు! నా బాకీ ఎలా రాబట్టను?"

"ఏమండీ, వీరికి భార్యా బిడ్డలున్నారా? ఇల్లెక్కడో తెలుసా?"

"అందరూ వున్నారు. అన్నీ తెలుసు. నన్నే ముంచి చచ్చాడు వెధవ."

రెండు మోటారు సైకిళ్ళు ఆగాయి. అధికారులు దిగారు. ఒక వ్యాన్ వచ్చింది. శవాన్ని ఆస్పత్రికి తీసికెళ్ళింది పోస్టుమార్టమ్‌కు.

రామసామిని తీసుకొని వెంకట్రావు ఇంటికి వెళ్ళాడు జవాను. స్కూటరు దిగకుండానే కేకపెట్టాడు రామసామి. "నన్ను ముంచిపోయాడు వెంకట్రావు, హుస్సేన్ సాగర్‌లో దూకి చచ్చాడు." సావిత్రి బాణంలా బయటికి దూసుకొని వచ్చి ప్రాణంలేని ప్రతిమలా నుంచుంది–కళ్ళలో కోటి ప్రశ్నలు కనిపించాయి. రామసామి మాట నమ్మలేనని ఆమె ముఖం చెపుతూంది.

"నిజమేనమ్మా! శవాన్ని ఉదయం తీశాం – వెంకట్రావుదేనని చెప్పాడు రామసామి" జవాను చెప్పాడు – అతని కంఠం రుద్ధం అయింది. ఎక్కణ్ణుంచి వచ్చిందో తెలీదు శక్తి, గావుకేకపెట్టి కుప్పలా కూలిపోయింది సావిత్రి. ఇద్దరు బిడ్డలూ ఆమెను చుట్టుకొని ఏడ్పు సాగించారు.

రామసామి పోలీసుని తీసుకొని స్కూటరుమీద సాగిపోయాడు.

ఎవరూ గమనించని వెంకట్రావు తల్లి కుక్కి మంచంలో గుటుక్కుమంది. సంసార బంధాలనుంచి విముక్తి పొందింది.

తండ్రి వెంకట్రావుకు కాలేజీ చదువులు చెప్పించాడు, ఉన్న నేల చెక్క అమ్మి. కొడుకు కలెక్టరవుతాడని ఆశపడ్డాడు. వెంకట్రావు కాలేజీ చదువుతోపాటు సావిత్రితో ప్రేమాయణం సాగించాడు. పట్టాతోపాటు ప్రేయసిని తీసుకొని ఇంటికి వస్తే తండ్రి మండిపడ్డాడు. తానొక సంబంధం చూశానన్నాడు. ప్రేమ ప్రాశస్త్యాన్ని గురించీ, కట్నాల కొరివిని గురించీ గట్టి ఉపన్యాసం దంచాడు వెంకట్రావు. తండ్రి మీద మీసం మెలేశాడు. తిరుగుబాటు చేశానని సంతృప్తిపడ్డాడు. తండ్రి కొడుకు ముఖం చూడనన్నాడు. తల్లి ఎడముఖం పెడముఖం పెట్టింది. లెక్కచేయలేదు వెంకట్రావు. సావిత్రితో స్వర్గంలో తేలిపోసాగాడు. తండ్రి మంచం పట్టాడు. కృంగి కృశించి పరమపదించాడు. రాజమ్మతోపాటు వెంకట్రావూ తండ్రి శవంమీదపడి గొల్లుమన్నాడు. దినవారాలయింతరువాత చూస్తే అప్పు నెత్తినేసుకున్న యిల్లు తప్ప ఏమీ కనిపించలేదు.

రాజమ్మకు మొదటినుంచీ మధుమేహం. ఇప్పుడు రక్తపోటు పట్టుకొంది. ఇవి వున్నవాళ్ళకు రావలసిన రోగాలు, లేనివాళ్ళకు వస్తే తుడుచుకుపోవాల్సిందే - జబ్బులది పాపం, నిజంగా సోషలిజం - మరి మందులది కాదుగా!

బరువేమిటో తెలిసి వచ్చేలోగా సావిత్రి కడుపుతో ఉంది. ఆవిడకు వాంతులు. మంచం పట్టింది. వేళకు తిండి లేకుంటే రాజమ్మ మొత్తుకుంటుంది. వెంకట్రావు గరిట పట్టుకున్నారు. వెంకట్రావుకు సావిత్రి ఒక నరకంలా తోచింది. అప్పు హనుమంతుని తోకలా పెరుగుతోంది. వెంకట్రావు విసుక్కున్నాడు. చిరచిరలాడేడు. చిందులు త్రొక్కాడు. అందర్నీ తిట్టాడు. తనను తిట్టుకున్నాడు. సావిత్రి కాస్త బాగుపడింది. ఆవిడకి ఇల్లు అప్పగించాడు. ఉద్యోగాన్వేషణకు పట్నం బయల్దేరాడు. కోడలు తనకు కూడుపెట్టదని రాజమ్మ మొత్తుకుంది. సావిత్రి తల బాదుకొని ఏడ్చింది. ఏడ్పులు- పెడబొబ్బల మధ్య వెళ్ళిపోయాడు వెంకట్రావు.

పట్నం వచ్చాడు వెంకట్రావు. తిరగరాని చోట్ల తిరిగాడు. అడగరానివాళ్ళను అడిగాడు. అందరూ మొండిచెయ్యి చూపించారు. అప్పుడు వెంకట్రావుకు కొన్ని సత్యాలు తెలిసి వచ్చాయి. పట్టా ఎందుకూ పనికిరాదనుకొన్నాడు. పట్టాకోసం పెట్టిన పొలం ఉన్నా బాగుండే దనుకున్నాడు. ఆదర్శాలు అగర్భ శ్రీమంతుల సొత్తు అనుకొన్నాడు. ప్రేమల పెళ్ళిళ్లు పేదవారికి కావనుకున్నాడు.

గడిచిన కాలాన్ని తిట్టుకుంటూన్నప్పుడు రామసామి కనిపించాడు. డబ్బు ఉంటే ఉద్యోగం వస్తుందనే వెలుగు చూపించాడు. వెంకట్రావు ఊరికి వెళ్ళాడు. ఇల్లు తెగనమ్మాడు. ఇంటితో బంధం తెగిపోయినందుకు తల్లి ఏడుస్తే తానూ ఏడ్చాడు వెంకట్రావు.

కడుపుతో ఉన్న పెళ్ళాన్నీ, కాలు కదపలేని తల్లినీ తీసుకొని వచ్చి పట్నంలో ఒక టిక్కీలో మకాం పెట్టాడు వెంకట్రావు. డబ్బు చూసుకుంటే రామసామి అడిగినంత మిగల్లేదు. వెంకట్రావు రామస్వామి కాళ్ళూ, కడుపులూ పట్టుకున్నాడు. రామసామి వెంకట్రావుకు అప్పు పెడతానన్నాడు. అంతే చాలునని మురిసిపోయాడు వెంకట్రావు. రామసామి నోటు మీద సంతకం పెట్టించుకొన్నాడు. వడ్డీ వాటంగానే రాశాడు. వెంకట్రావు సంతకం పెట్టాడు.

రామసామి స్కూటరు వెంకట్రావు టిక్కీముందు ఆగింది. అపాయింట్ మెంట్ ఆర్డర్ అందించాడు రామసామి. వెంకట్రావు ఎగిరి గంతేశాడు. తల్లితోనూ, భార్యతోనూ చెప్పాడు. వారికి రామసామిలో దేవుడు కనిపించాడు. వారు అతనికి మొక్కారు. వెంకట్రావు భజన చేశాడు.

వెంకట్రావు గుమాస్తాగా చేరాడు. అప్పుడు తెలిసిందతనికి, రామసామి కూడా అక్కడే గుమాస్తా అని. నెలరోజుల కటిక చీకటి తరువాత జీతం చేతిలో పడ్డది వెంకట్రావుకు. అతడు మురిసిపోయాడు. వెంకట్రావు డబ్బు లెక్కపెడుతున్నాడు. రామస్వామి ప్రత్యక్షం అయినాడు. వెంకట్రావు వణికిపోయాడు. వెంకట్రావు చేతిలో డబ్బు లాక్కుని "అప్పుకింద" అని వెళ్ళిపోయాడు రామసామి. వెళ్ళిపోతున్న రామసామి రాక్షసునిలా కనిపించాడు వెంకట్రావుకు. కోపం పొంగింది కాని మింగాడు.

తాను రామసామికి అమ్ముడుపోయా ననుకున్నాడు. ఈ దేశంలో బానిసలు లేరనే విషయం శుద్ధ అబద్ధం అనుకున్నాడు.

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికివస్తే మందు తెచ్చావా అని తల్లీ, పళ్ళు తెచ్చారా అని పెళ్ళాం అడిగారు. మంచంలో తల్లిని చూచాడు. కళ్ళలో ప్రాణాలున్నాయి. ఎదుట సావిత్రిని చూచాడు. పొట్ట పెరుగుతూంది. దడుచుకున్నాడు. బయటకు వచ్చి ఏడ్చాడు. కళ్ళు తుడుచుకొని రామసామి ఇంటికి వెళ్లాడు. కాగితంమీద సంతకం పెడుతుంటే రక్తం అక్షరాల్లోకి దిగుతున్నట్లనిపించింది. డబ్బు తీసుకొని ఇంటికి వస్తూ ఆలోచించాడు, తాను గుమాస్తాయే – రామసామి గుమాస్తాయే. రామసామికి స్కూటరుంది, మంచి యిల్లుంది, సర్వసౌఖ్యాలూ ఉన్నాయి. తనకేమీ లేవు. ఎందుకని? రామసామి రక్తం పీల్చగలడు! జలగ ఏనుగును సైతం చంపగలదట!

రోజులు గడిచిపోతున్నాయి. వెంకట్రావు కుంగిపోతున్నాడు. రాజమ్మకు గుండెజబ్బు వచ్చి అస్పత్రిలో పడ్డది. సావిత్రి కాన్పు కష్టం అయింది. సావిత్రీ, రాజమ్మా బయటపడ్డారు. వెంకట్రావు రామసామి గోతిలోకి దిగిపోతున్నాడు చాకిరి చేస్తున్నాడు, రామసామికి అప్పచెబుతున్నాడు. అప్పులూ, వడ్డీలూ పెరుగుతున్నాయి. మళ్ళీ సావిత్రి కన్నది.

సావిత్రికి పాల్లేవు. పాపలకు పాలు తేలేదు. తల్లికి పక్షవాతం. మందు లిప్పించలేదు. తిండి లేదు. బట్టల్లేవు. ఆఫీసర్లతో చీవాట్లు. నరకంలో సంసారం చేస్తున్నట్లుంది.

ఒక నెల నిశ్చయం చేసుకున్నాడు. రామసామికి డబ్బివ్వరాదనుకున్నాడు. రామసామి నానాగల్లంతు చేశాడు. నలుగుర్ని కుదిర్చాడు. కాలరు పట్టుకొని లాగాడు. అయినా డబ్బివ్వలేదు వెంకట్రావు. వెంకట్రావు ముఖాన ఊసి వెళ్ళిపోయాడు రామసామి. గెలిచానని ఇంటిదోవ పట్టాడు వెంకట్రావు. దోవలో నలుగురు వెంకట్రావు మీదపడి చితక్కొట్టి డబ్బులు లాక్కుని వెళ్ళిపోయారు. అస్పత్రిలో స్పృహ వచ్చి చూస్తే సావిత్రి కనిపించింది. ఇంటికి వచ్చి చూస్తే నయాపైసా లేదు. తల్లి మొత్తుకుంటూంది. పాపలు ఏడుస్తున్నారు. వెంకట్రావు మనసును రంపంతో కోస్తున్నట్లనిపించింది. ఆఫీసులో అందరినీ దేబిరించాడు. రూపాయి పుట్టలేదు. ఆ సాయంకాలం కోర్టునుంచి సమన్లు వచ్చాయి. వెంకట్రావు బోనెక్కాడు. సంతకాలు తనవే. కాదనడానికి వీల్లేదు. కత్తెరలో ఇరుక్కున్నాడు. కదల్లేడు. ఇంటికి వచ్చి అందర్నీ తిట్టాడు. పాపలను పట్టుకొని చావగొట్టాడు. వాళ్లు ఎక్కెక్కి ఏడుస్తున్నారు.

"చాతకాని వాళ్లు చేసేదంతే" అన్నది మంచంలోంచి రాజమ్మ.

వెంకట్రావు కొట్టే బిడ్డను చప్పున వదిలాడు. చతికిలపడి తల పట్టుకొని కూర్చున్నాడు కొంతసేపు. దిగ్గున లేచి చరచరా వెళ్లిపోయాడు. సావిత్రి పిల్లలను విడిపించుకొని ఉరికి వచ్చింది బయటికి.

వెంకట్రావు కనిపించలేదు – వెళ్ళిపోయాడు.

పోయిన వెంకట్రావు తిరిగి రాలేదు.

పోలీసులు వెంకట్రావు శవాన్ని ఇంటికి తెచ్చారు. చూస్తే మరో నాలుగు శవాలు కనిపించాయి!!!

# ఆకలి

వేదాంతి ఉలిక్కిపడ్డాడు - గడియారపు గంటలు విని. గోడ గడియారం అయిదు కొట్టింది. అతడు ముంజేతి గడియారం చూసుకున్నాడు. ఆఫీసు గడియారంమీద నమ్మకం లేదతనికి. ముంజేతి గడియారంలో అయిదు దాటింది. పదినిమిషాలు మించిపోయింది. అంతటితో ఆగడం లేదు. సెకనుల ముల్లు సాగిపోతూనే ఉంది. గోడ గడియారం చూచాడు. పెండ్యులం ఊగుతూనే ఉంది.

ముల్లు సాగుతూంది.

పెండ్యులం కదులుతూంది.

వేదాంతి ఆలోచించాడు. కాలం ఇలా జారిపోవలసిందేనా? చెల్లిపోవలసిందేనా? జారిపోకుంటే ఏమవుతుంది? చెల్లిపోకుంటే?

కాలం నిలిచిపోతే?

భూభ్రమణం ఆగుతే?

సూర్యుడు కదలకుంటే?

వేదాంతి దడుచుకున్నాడు. అన్నీ ఆగినట్లే అనిపించిం దతనికి. బెదిరిపోయాడు. తన గుండెమీద చేయి వేసుకున్నాడు.

గుండె కదలాడుతుంది.

గడియారపు ముల్లు కదులుతూంది.

గోడ గడియారం "టక్ టక్" అంటూంది.

వేదాంతి ఆలోచించాడు. అవును. ఏదీ నిలవడానికి వీల్లేదు. ఆగడానికి వీల్లేదు. నిశ్చలంగా ఉండడానికి వీల్లేదనుకున్నాడు.

కదలిక జీవితం.

చైతన్యం జీవిత పరమార్థం.

జీవితం కదలిక అనుకున్నాడు వేదాంతి. అంతే. వేలు స్విచ్చిని నొక్కింది. బయట బెల్లు మ్రోగింది. చప్రాసీ ఉరికి వచ్చాడు. 'డ్రా' తెరిచాడు. సబ్బూ తువ్వాలూ వగైరా తీశాడు. బాత్‌రూంలో పెట్టాడు. బయటికి వచ్చాడు. వేదాంతి బాత్ రూంలో ప్రవేశించాడు. ముఖం కడుక్కున్నాడు. పౌడరు వగైరా అద్దుకున్నాడు.

ముఖం అందంగా కనిపించింది.

ముఖం తాజాగా కనిపించింది.

ఈల వేశాడు వేదాంతి.

మురిసిపోతున్నాడు వేదాంతి.

వేదాంతి ఆలోచించాడు. తాను ఎందుకిలా మురిసిపోతున్నాడు? అవును, ఎందుకు? ఎందుకు ఈలకొట్టాడు తాను?

వేదాంతికి అర్థం అయింది. వాస్తవంగా తాను అందమైనవాడుకాడు. ప్రస్తుతం అతను తాజాగానూ లేడు. తన అందం, తాజాదనం భ్రమ-వట్టి భ్రమ.

భ్రమ మనిషిని మురిపిస్తుంది-మరిపిస్తుంది.

భ్రమ మనిషిని నడిపిస్తుంది - ఏడిపిస్తుంది.

వేదాంతి భ్రమలో ఉన్నాడు.

వేదాంతి కుర్చీలో కూర్చున్నాడు. ఏదో నిలకడ కనిపించింది. జీవితం కదలిక - జీవితం చైతన్యం - జీవితం స్పందన. నిజమే! నిలకడ ఏది? What Is static? కదలిక లేనిదేది? స్పందన లేనిదేది? వేదాంతి కూర్చున్నాడు. ఆలోచనలు కూర్చోవటంలేదు.

కదలిక లేనిది - స్పందన లేనిది "చావు", "మృత్యువు."

మృత్యువు - చావు - మృత్యువు - చావు.

వేదాంతి నిశ్చలంగా కూర్చోలేకపోయాడు.

నిశ్చలం అయింది చావు.

నిస్పందం అయింది చావు.

వేదాంతి నిశ్చలంగా ఉన్నాడు. కదలిక లేకుండా ఉన్నాడు. స్పందన లేకుండా ఉన్నాడు. వేదాంతి అనుకున్నాడు - తానే చావుకు ప్రతిరూపం కాదుగదా? తానే చావా? చావు తానా? తాను చావా? ఏమో మరి. అలాగే కనిపిస్తోంది. వళ్ళు చల్లబడుతున్నట్లుంది. శ్వాస నిలుస్తున్నట్లుంది. ఏమిటీ చల్లదనం? ఏమిటీ నీరసం? ఏమిటీ నిశ్శబ్దం? తాను చనిపోతున్నాడా? చావు ఇలాగే ఉంటుందేమో!

ఏమో! ఎవడు చూచాడు చావును?

చూచిందెవడు చావును?

చావును చూచిందెవడు?

అంతా జీవితం చూచినవాళ్ళే!

అంతా బ్రతుకును చూచినవాళ్ళే!!

వేదాంతికి జీవితమే తానుగా కనిపించింది. జీవితమే తాను. తానే జీవితం. తాను కదలిక. తాను చైతన్యం. తాను స్పందన.

వేదాంతి చప్పున లేచాడు. కదిలాడు, సాగాడు. బూట్లు టకటక లాడేయి. స్ప్రింగ్ డోర్ తెరుచుకుంది- మూసుకుంది. అతను బయట పడ్డాడు. వెలుగు కనిపించింది. చల్లని గాలి తాకింది. పచ్చని చెట్లు కనిపించాయి. హాయిగా ఉంది. హుషారుగా ఉంది.

గదిలో చీకటి - బయట వెలుగు.

గది ఇరుకు - బయట విశాలం.

వేదాంతి నడక సాగించాడు. అతడు స్కూటర్ స్టాండ్ వైపు వెళ్తున్నాడు. యాంత్రికంగా అడుగులు పడుతున్నాయి. స్కూటర్ స్టాండ్ కుర్రాడు ఎదురుగా వచ్చాడు - సలాం చేశాడు. వేదాంతి స్కూటర్ తేలేదని జ్ఞాపకం చేశాడు.

వేదాంతి చప్పున ఆగిపోయాడు. ఉలిక్కి పడ్డంత పని చేశాడు. అవును, తాను స్కూటర్ తేలేదు. వర్క్ షాపులో ఇచ్చి వచ్చాడు. వర్క్ షాపువాడు దోచేస్తున్నాడు. వాడన్నది ఒప్పుకోవల్సిందే. వాడందించిన బిల్లు చెల్లించాల్సిందే! తాను చదువుకున్నవాడు – ఆఫీసరు. తననే దోచేస్తున్నాడు వాడు, ఎందుకు? వాడికి తెలిసింది తనకు తెలియదు – అంటే:–

తెలిసినవాడు తెలియనివాణ్ణి దోచుకుంటున్నాడు.

అంతా తెలిసిన వాళ్లవుతే?

మనకు తెలియని విషయాలే ఎక్కువ.

ఎంత జ్ఞానులం మనం!!

వేదాంతి ఆఫీసుగేటు దాటాడు. బస్‌స్టాప్ వైపు నడిచాడు. ఈ నగరంలో బస్సులకు స్టాండ్లు లేవు. అవి తమ ఇచ్ఛవచ్చినచోట ఆగును. స్టాండ్లల్లా మనుషులకే. మనుషుల స్టాండులో నుంచున్నాడు. సిగరెట్టు వెలిగించాడు. సిగరెట్టు పొగలోంచి కనిపించింది రోడ్డు అవలి ప్రక్క. అతనికి ఫుట్‌పాత్ కనిపించింది. ఫుట్‌పాత్ కెర్బ్‌స్టోన్ కనిపించింది. కెర్బ్‌స్టోన్ మీద కూర్చున్న వ్యక్తి కనిపించాడు. అతని జుట్టు జడలు కట్టింది. ముఖం చెమట పట్టింది. కళ్ళు పీక్కుపోయాయి. చెంపలు డొక్కుపోయాయి. చెవులు వేళ్ళాడుతున్నాయి. వంటినిండా దుమ్ముంది. వంటిమీద బట్టలేదు. మొలకు జానెడు బట్ట ఉంది – అది చింపులది. కుడికాలి పిక్కకు రక్తం కారుతూంది. కారుతూనే ఉంది, నిలవడం లేదు. అదొక పుండులా ఉంది. భూమిపుండులా ఉంది, పుండుమీద ఈగలు, దోమలు వాలుతున్నాయి జడలమనిషి పుండును చూసుకున్నాడు. చేత్తో విసురుతున్నాడు. విసిరినపుడు పోతున్నాయి దోమలు, మళ్ళీ వచ్చి వాలుతున్నాయి ఈగలు. అతనికి డొక్కలేదు. అది వెన్నుకు అంటుకుంది. డొక్క గుహలా ఉంది. గుహలో లోకాలు పట్టేట్లున్నాయి. అతడు ఒక్కోసారి పైకిచూస్తున్నాడు. "ఆకలి" అని అరుస్తున్నాడు. అరచినప్పుడు నోరుసాంతం తెరుస్తున్నాడు, ఆ నోరు ఆకాశమంత ఉంది. అందులో భూలోకం పట్టేట్లుంది. అరచినప్పుడు కళ్ళు విచ్చుకుంటున్నాయి. వాటిల్లో మంటలు కనిపిస్తున్నాయి. అవి భయంకరంగా ఉన్నాయి.

వేదాంతి ఆకలి మనిషిని చూచాడు. జంకాడు. ఆకలి మూర్తిని చూచినట్లనిపించింది. ఆకలి అలానే ఉంటుందనిపించింది. అంత భయంకరంగానూ వుంటుందనిపించింది. ఆకలికి అంత పెద్ద నోరనిపించింది, అది లోకాల్నే మింగగల దనిపించింది.

వేదాంతికి ఈ ఆకలి తెలీదు. అతనికి తెలిసింది ఆకలి రుచిగా ఉంటుందని – అందంగా ఉంటుందని – అద్దాలచాటున ఉంటుందని, అందుకే ఆకలిని చూసి జడుసుకున్నాడు. ఒక అడుగు వెనక్కు వేశాడు. సిగరెట్టు పారేశాడు. ఇంతలో బస్సువచ్చి దూరంగా ఆగింది. బస్సుకు బోర్డులేదు. అతడు బస్సువెంట పరిగెత్తాడు. బస్సు అందలేదు. సాగి పోయింది. అది తాను ఎక్కాల్సిన బస్సు కాదని తెలిసింది. కాళ్ళీడ్చుకుంటూ వెనక్కు వచ్చాడు. నుంచున్నాడు. వెళ్ళిపోతున్న బస్సును చూస్తున్నాడు. బోర్డులేని బస్సుల వెంట పరిగెత్తడమే జీవితం అనుకున్నాడు.

వేదాంతి అటు చూచాడు. ఒక బస్సు కనిపించింది. అది ఆకలి మనిషికి అడ్డుగా నిలిచింది. అతనికి ఆకలి మనిషి కనిపించలేదు. నిట్టూర్చాడు. బస్సు కదలిపోయింది. ఆకలి మనిషి కనిపించాడు. "ఆకలి" అన్నాడు. ఆ కేక వేదాంతి చెవుల్లో సుళ్ళు తిరిగింది. గుండెకు చిల్లిచేసింది. ఆకలి మనిషిని చూస్తున్నాడు వేదాంతి. ఆకలి మనిషికి ఎవరో అరటిపండు ఇచ్చారు. ఆకలి మనిషి క్షణంలో మింగేశాడు. తొక్కు, తొడిమా ఏదీ కనిపించలేదు. ఆశ్చర్య పడ్డాడు వేదాంతి ముందు, తరువాత భయపడ్డాడు. వాడు తనను కూడా మింగేయడు కదా అనుకున్నాడు.

వేదాంతి ముందు బస్సు నిలిచింది. అది అతను ఎక్కాల్సిన బస్సే. గబ గబా పరిగెత్తాడు. దిగేవారు దిగడం గగనం అయింది, దిగనివ్వడం లేదు, ఫుట్ బోర్డు మీదవారు. కష్టంగా దిగారు దిగేవాళ్ళు. బస్సు భర్రుమని వెళ్ళిపోయింది. వేదాంతి ఎక్కలేక పోయాడు, దిగబడి పోయాడు. బస్సు దొరకదని నిశ్చయించుకున్నాడు. ఆటోలో వెళ్ళిపోదామనుకున్నాడు. ఆటో కనిపించలేదు, కనిపించిన ఆటోవాడు రానన్నాడు.

వేదాంతి అటు చూచాడు. ఆకలి మనిషి లేచాడు. నుంచున్నాడు. ఒక మనిషిని సమీపించాడు. ఆకలి అన్నాడు. ఆ వ్యక్తి జంకాడు. రెండడుగులు వెనక్కు వేశాడు. ఆకలి మనిషి ఒక అడుగు ముందుకు వేశాడు. ఆ వ్యక్తి జేబులో చేయి పెట్టాడు. పైసా తీశాడు. ఆకలి మనిషికి అందించాడు. ఆకలి మనిషి అందుకోలేదు, కోపంగా చూచాడు. వెనక్కు తిరిగాడు. ఫుట్‌పాత్ మీద కూలబడ్డాడు. పుండును చూసుకున్నాడు. ఈగల్ను విసురుతున్నాడు.

వేదాంతి ఆకలి మనిషిని చూచాడు. చూపు మళ్ళించుకున్నాడు. అక్కడ దుకాణం కనిపించింది. దుకాణంలో రొట్టెలు అందంగా పేర్చి ఉన్నాయి, కోడుగుడ్లు దొంతరులున్నాయి, బిస్కెట్ల పొట్లాలున్నాయి, చాక్‌లెట్ల డబ్బాలున్నాయి. అతడు అన్నీ చూచాడు, నోరూరింది. రొట్టె కొందామనుకున్నాడు, స్లైసులు కాల్పించుకు తినవచ్చు ననుకున్నాడు, కరకరలాడేట్లు కాల్పించాలనుకున్నాడు. దుకాణం మెట్లెక్కాడు. రొట్టె సగంకాదు - సొంతం కొన్నాడు. డబ్బిచ్చాడు రొట్టె అందుకునేటప్పుడు దృష్టి అటు పడ్డది. ఆకలి మనిషి తననే చూస్తున్నాడు. చేతులు వణికాయి. రొట్టె వదిలేద్దామనుకున్నాడు. మెట్లు దిగుదామనుకున్నాడు. రొట్టె పట్టుకునే మెట్లు దిగాడు.

వేదాంతికి ఆకలి మనిషి కనిపించాడు. తననే రెప్పవేయకుండా చూస్తున్నాడు. వేదాంతి ఆకలి మనిషినే చూస్తున్నాడు. మరేం చూడ్డంలేదు. ఆకలి మనిషి వేదాంతి చేతిలోని రొట్టెనే చూస్తున్నాడు. మరేం చూడ్డంలేదు. వేదాంతి బస్‌స్టాప్ చేరుకున్నాడు. ఆకలి మనిషి అడుగు ముందుకు వేశాడు. వేదాంతి పారిపోదామనుకున్నాడు. కాళ్లు కదల్లేదు. అటు ఒక బస్సు ఆగింది. ఆకలి మనిషి కనిపించలేదు. హమ్మయ్య! అనుకున్నాడు వేదాంతి. బస్సు సాగిపోయింది. ఆకలి మనిషి దూసుకొని వచ్చేస్తున్నాడు - రోడ్డు దాటి. వేదాంతి రొట్టెను గట్టిగా పట్టుకున్నాడు. ఒక కారు వేగంగా వస్తూంది. ఆకలి మనిషిని ఢీకొనేట్టుంది. ఢీ కొంటే బావుండు ననుకున్నాడు వేదాంతి. ఆకలి మనిషి కారు కింది నలిగిపోతే బావుండు ననుకున్నాడు వేదాంతి. అలా జరగలేదు. కారు కిర్రుమని ఆగింది. అది

గమనించినట్లే లేదు ఆకలి మనిషి. దూసుకొని వచ్చేస్తున్నాడు. రానే వచ్చాడు. వచ్చి వేదాంతి ఎదుట నిలిచాడు.

"ఆకలి" – నోరంతా తెరిచాడు.

వేదాంతి రొట్టె గట్టిగా పట్టుకున్నాడు. రెండడుగులు వెనక్కు వేశాడు.

ఆకలి మనిషి ఒక అడుగు ముందుకు వేశాడు. వేదాంతి ముఖంలో ముఖం పెట్టాడు. "ఆకలి" అని నోరు తెరిచాడు.

వేదాంతి వణికిపోయాడు. రొట్టెను రెండు చేతుల్తో వెనక్కుపట్టుకున్నాడు. మరో అడుగు వెనక్కు వేశాడు.

వెనక నుంచి దూసుకొని వచ్చిన కుక్క వేదాంతి చేతిలోని రొట్టె లాక్కుంది. ఉరికింది. అంతా క్షిప్తలో జరిగింది. మెరుపు మెరిసినట్లు జరిగింది.

వేదాంతి వెనక్కు తిరిగి చూచాడు. కుక్క పరుగు తీస్తూంది. దాని వంకర తోక కనిపిస్తూంది,.

ఆకలి మనిషి పెద్దగా నవ్వాడు.

వేదాంతి ఇటు తిరిగాడు.

"మనిషి కంటె కుక్కలే నయం" అన్నాడు ఆకలి మనిషి. అక్కడి నుంచి కదిలాడు. ఫుట్ పాత్ మీద కూలబడ్డాడు. పుండు మీది దోమల్ను విసురుకుంటున్నాడు.

వేదాంతి బస్సెక్కాడు. బస్సు కదిలిపోతుంటే ఆకలి మనిషినే చూశాడు. అతని మాటలు వేదాంతి చెవిలో రింగు మంటున్నాయి.

"అవును. అడుగుతే ఎవడిస్తాడు? లాక్కోవడమే మందు" అనుకున్నాడు వేదాంతి బస్సు దిగుతూ.

★ ★ ★

# నవల

రైలు ప్లాట్‌ఫారం మీద ఆగింది. రచయిత దిగాడు. జేబులోంచి టిక్కెట్టు తీశాడు. ఆ వూరి వరకే ఉంది. అక్కడ దిగిపోవల్సిందే. అది అతని ఊరు కాదు. ఉన్నడబ్బుతో టిక్కెట్టు కొన్నాడు అది ఆ ఊరు వరకే వచ్చింది. రచయిత ప్లాట్‌ఫారం మీద నుంచున్నాడు. రైలు కూతపెట్టింది. సాగిపోయింది.

రచయిత తనను చూసుకున్నాడు. గడ్డం మాసింది. ముఖాన ఉప్పు పేలింది. జేబులో చేయిపెట్టాడు. చిల్లర తగిలింది. తీసిచూశాడు. రూపాయిలోపు ఉంది. అతడు పంపు దగ్గరికి నడిచాడు. ముఖం కడుక్కున్నాడు. చొక్కాతో తుడుచుకున్నాడు. మంచినీళ్ళు తాగాడు కడుపునిండా. బెంచీమీద కూర్చున్నాడు. కాస్త తేలిగ్గా ఉంది, జేబులోనుంచి చిల్లర తీశాడు. చూచాడు. అంతే ఉంది ఏమీ పెరగలేదు – తరగలేదు.

రచయిత లేచాడు. గబగబా ఊళ్ళోకి నడిచాడు. ఊరు పెద్దదే–టౌను, దుకాణాలు చాలా ఉన్నాయి. కొందరు పబ్లిషర్లూ ఉన్నారు. అతనికి తెలిసిన వారు మాత్రం ఎవరూ లేరు. అతడు హోటల్లోకి దూరాడు. కాఫీ తాగాడు. బయటికి వచ్చాడు. చిల్లర చూసుకున్నాడు. తరిగింది. అతనిగుండె తరిగింది. అతడు పుస్తకాల దుకాణానికి వెళ్ళాడు. ఒక నోట్‌బుక్ కొన్నాడు. ఒక పెన్సిలు కొన్నాడు. చిల్లర అయిపోయింది. సిగరెట్టుకు కూడా మిగల్లేదు.

రచయిత రైలు స్టేషనుకు చేరాడు. అప్పటికి సాయంకాలం అయింది. లైట్లు వెలిగాయి. అతడు బెంచీమీద కూర్చున్నాడు. సరిగ్గా బెంచీ పక్కనే స్తంభం ఉంది. దానికి లైటు ఉంది, అది వెలుగుతూంది. అతడు నవల రాయాలనుకున్నాడు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

రచయిత దగ్గరికి ఒక ఆడది వచ్చింది. ఆమె ఆడదానిలా లేదు. ఎండిపోయిన తోలు తిత్తిలా ఉంది. కళ్ళు పీక్కుపోయాయి – ఎక్కడో ఉన్న జాడ కనిపిస్తూంది. వెంట్రుకలు చిందర వందరగా ఉన్నాయి. ఆమె రచయిత పక్కన కూర్చుంది. రచయిత జంకాడు. జరిగాడు.

"మూడు రోజులైంది. గిరాకీలేదు. తిండిలేదు, డొక్క వణకుతూంది. ఒక్కడు దొరికాడు. వాడు ఎగ్గొట్టి పోయాడు. పావలా ఇవ్వు చాలు, వస్తా. ఆకలి మండిపోతూంది. ఏమంటావ్?"

రచయితకు ఆ మాటలు వింతగా ఉన్నాయి. జాలివేసింది. ఉంటే యిచ్చేవాడే. జేబు ఖాళీగా ఉంది. చిరునవ్వు నవ్వాడు. ఆమె మరో రకంగా అర్థం చేసుకుంది. "పోనీ, బేడా ఇవ్వు–చాలు, కాఫీ తాగుతా–ఏమంటావ్? కావాలా?"

రచయితకు అర్థంకావడంలేదు–ఏం చేయాలో తికమక పడుతున్నాడు అమాంతంగా ఒక ఆలోచన స్ఫురించింది.

"నీ కథ చెప్తావా?"

"ఓ, ఏమిస్తావ్?"

"నా దగ్గరేమీలేదు, నేను రచయితను. నువ్వు కథ చెప్పు, నేను నవలగా రాస్తాను."

"ఛూ! నాకు ఆకలిగా ఉంది. నవలరాస్తే ఆకలి తీరుతుందా? ఛీ! మరొకణ్ణి వెదుక్కుంటా. ఛీ" అని వెళ్ళిపోయిందామె.

ఆమె వెళ్లిపోయింది కాని, రచయిత నుంచి వెళ్ళిపోలేదు. అతని అంతరాంతరాల్లో ఆవిడ నిలిచిపోయింది. అతనికి ఊపిరి సలపడంలేదు. నవల రాస్తే ఆకలి తీరుతుందా? అనే మాటలు మెదడులో గిరగిరా తిరుగుతున్నాయి. ఎంత వాస్తవం చెప్పింది! వాస్తవం ఎంత కరకుగా, కఠినంగా ఉంటుంది! ఆవిడ స్త్రీ. అందరిలానే పుట్టింది. అందరిలా ఉండాలని ఉండదా ఆవిడకు? వళ్లు అమ్ముకొని బతకాల్సిన అవసరం ఎందుకు వచ్చింది? ఎవరు తెచ్చారు? సమాజం తెచ్చింది. ఈ వ్యవస్థ తెచ్చింది ఈ పరిస్థితులు తెచ్చాయి. "ఆకలికి అమ్ముడయిన ఆడది." నవలకు పేరు స్ఫురించింది. పరిస్థితులు కళ్ళకు కనిపించాయి. సమాజం దినమొలతో అతనికి కన్పించింది.

రచయిత పెన్సిలు అందుకున్నాడు. రాయడం ప్రారంభించాడు. ఆకలి దహిస్తుంది. చలి వణికిస్తూంది. అతనికి ఏమీ కనిపించడం లేదు. అతనికి కనిపిస్తున్నది ఎముకలపోగు–ఆడది! అంతే, రచన సాగిపోతున్నది. సమయం గడిచిపోతున్నది, రైళ్లు వస్తున్నాయి. పోతున్నాయి. గడియారం గిరగిరా తిరిగిపోతున్నది. అర్ధరాత్రి అయింది. అతనికి తెలియదు. అతను రాస్తునే ఉన్నాడు. అందులో మునిగిపోయాడు. అతడు కాలాన్ని గమనించలేదు. నవల ముగిసింది. చూస్తే తెల్లవారుతూంది. అతనికేదో సంతృప్తిగా ఉంది. మంచినవల రాశానని ఆనందంగా ఉంది. అతడు అటుచూచాడు. ఆమె కనిపించింది. తనవైపే వస్తూంది. "ఇదిగో బేడా. డబ్బులే దన్నావుగా, కాఫీ తాగు, కథలపిచ్చి మాను, కూలి చేసుకో" అని ఆమె బేడా అతని ఒళ్లో వేసింది. వెళ్ళిపోయింది.

రచయిత దిమ్మెర పోయాడు. అచేతనంగా ఆవిడను చూస్తూ ఉండి పోయాడు. ఆవిడ కనుమరుగైంది. రచయిత బెంచిమీద బేడా కనిపించింది. పాపం, రచయిత సిగరెట్టు కాల్చా లనుకున్నాడు, నవల ముగించగానే. బేడా అందుకొని లేచాడు. సిగరెట్టు కొన్నాడు. కాల్చాడు. పొగ వదులుతుంటే ఆలోచనలు తంపరలుగా వస్తున్నాయి! ఆవిడ ఉన్నతంగా కనిపించింది. మహోన్నతంగా కనిపించింది. వృత్తి ఏదైతేనేం – ఆవిడ దగ్గర మానవత ఉంది అనుకున్నాడు.

రచయిత ఒక పబ్లిషర్ దగ్గరికి వెళ్ళాడు. రాత ప్రతి అతని కిచ్చాడు. తన స్థితి వివరించాడు. పబ్లిషరు ఒక దండకము చదివాడు–వ్యాపారం దెబ్బతిన్న దన్నాడు–నవలలు ఎవరూ కొనడం లేదన్నాడు–నాటకం అవుతే బాగుండు నన్నాడు – అనేక మాటలని అర్ధరూపాయి ఇచ్చాడు. అచ్చు వేయడం విషయం తరవాత చెపుతానన్నాడు.

రచయితకు అర్ధరూపాయి దొరికింది. ఆవిడ కోసం వెదికాడు. కనిపించలేదు.

కొందరిని అడిగాడు. వారు ఇతన్ని చూచి నవ్వారు–గేలి చేశారు–హేళన చేశారు.

రచయిత పబ్లిషరు చుట్టు చాలా సార్లు తిరిగాడు అర్ధా, రూపాయి ఇస్తూ పోయాడు. పబ్లిషరు నవలను చాలామందికి చూపించాడు, వారు బావుందన్నారు. వ్యాపారం చేసుకోవచ్చన్నారు. పబ్లిషరు రచయితకు యాభై ఇస్తానన్నాడు. హక్కులన్నీ తనవే నన్నాడు. రచయిత ఉబ్బిపోయాడు. సరే నన్నాడు. యాభై ఇమ్మన్నాడు.

"అబ్బే! అప్పుడే ఎట్లా? అచ్చు కావాలి. నువ్వే ప్రూఫులు చూడాలి, ఇంద" అని భోజనానికి డబ్బిచ్చాడు.

రచయిత భోజనం చేస్తున్నాడు. అతనికి ఆనందంగా ఉంది–తన నవల అచ్చవుతూందని. అతనికి ఆవిడ గుర్తువచ్చింది. ఆవిడ కనిపించి ఉండకపోతే? తానీ నవల రాయలేక పోయేవాడు. ఈ కథ ఆమెది. ఈ డబ్బు ఆమెకు చెందాలి. యాభై వచ్చిన్నాడు ఆమెకు ఇచ్చేయాలనుకున్నాడు. ఆమెను వెదకడం మానుకున్నాడు.

రోజులు గడిచి పోతున్నాయి.

అచ్చుపని మొదలయింది.

అతను ప్రూఫులు చూస్తున్నాడు.

పుస్తకం అచ్చయింది. ముఖచిత్రం తయారైంది. బైండింగ్ అయింది. పుస్తకం తన చేతికి వచ్చింది. రచయిత మురిసిపోయాడు. ఇహ తనకు యాభై వస్తాయి. యాభై అందుకుంటాడు. ఆమె కోసం వెదుకుతాడు. కనుగొంటాడు. ఆవిడకు యాభై ఇస్తాడు. పుస్తకం ఇస్తాడు. ఆవిడ కథే రాశానని చెప్పతాడు, ఆవిడ కళ్ళు తళుక్కుమంటాయి, ఆవిడలో ఆశ కనిపిస్తుంది. అది చూడాలి అనుకున్నాడు.

పబ్లిషర్ను డబ్బడిగాడు.

"ఇంకేడ డబ్బు! భోంచేశావు గదయ్యా! ఇదిగో లెక్కరాసి పెట్టా. పది వస్తాయి తీసుకో" అని పది రూపాయలూ, పది పుస్తకాలు అందించాడు. దండం పెట్టాడు–ఇహ కదులు ఇక్కణ్ణుంచి అన్నట్లు!

రచయిత మారు మాట్లాడలేదు.

అతడు అల్మారీలను చూశాడు–వాటిలోని తన పుస్తకాల్ను చూశాడు. పబ్లిషర్ను చూశాడు. పది రూపాయల నోటు చూశాడు. అందుకున్నాడు, మెట్లు దిగాడు. సాగిపోయాడు.

రచయిత ఆవిడకోసం బైల్దేరాడు. స్టేషనుకు వచ్చాడు. అప్పుడే రైలు వచ్చింది. ఆగింది. జనం అటు పరుగెత్తుతున్నారు – ఎవరో రైలు కింద పడ్డారని. రచయిత పరిగెత్తాడు. జనం మూగి ఉన్నారు. నెట్టుకొని వెళ్ళాడు. చూశాడు.

ఆవిడే!!!

ఆవిడ ప్రాణంలేని నవ్వు నవ్వుతూంది.

తననే వెక్కిరిస్తూందనుకున్నాడు రచయిత. రచయిత కళ్ళు నిండాయి. కన్నీరు రాలింది.

నవలకు అలాంటి ముగింపు ఇవ్వకుండా ఉండాల్సింది అనుకున్నాడు.

హత్య తానే చేసినట్లు విలవిల్లాడాడు.

★ ★ ★

# అగ్గిరెమ్మలు

తొలిసారి ఆమెను చూసింది బస్టాపులో. ఆమె నన్ను చూళ్ళేదు. ఆమె అందర్నీ చూసింది. నేను మాత్రం ఆమెనే చూశాను. మరెవర్నీ చూళ్ళేదు.

బస్టాండుకు ఆమె చరచరా నడిచి వచ్చింది. ఏదో పోగొట్టుకున్నట్లు చుట్టూ చూచింది. ఒక్కసారి అక్కడున్న వాళ్ళందర్నీ కలియ చూచింది. అప్పుడే నేనామె చూపును చూసింది. మళ్ళీ చూళ్ళేదామె. బాగ్‌లోంచి పుస్తకం తీసింది. చదువుతూంది.

ఆమె పుస్తకం చదువుతూంది. నేను ఆమెను చూస్తున్నాను. పుస్తకం సంగతి నాకు తెలీదు. ఆమె పుస్తకంలోంచి దృష్టి మరల్చడంలేదు. నేను ఆమెనే చూస్తున్నాను. ఆమె గమనించలేదు.

నాకు నచ్చింది ఆమె చూపులు. ఆమె చూపులు స్నిగ్ధంగా లేవు. చల్లగా లేవు. మల్లెలు కనిపించవు. అందుకే నాకు నచ్చింది. ఆమె చూపుల్లో ఆవేశం ఉంది, ఆవేదన ఉంది, ఆత్రం ఉంది, ఆతురత ఉంది. అందుకే ఆ చూపులంటే నాకిష్టం. అందం నాకంతగా నచ్చదు. ఆవేశం అంటే–ఎంతో ఇష్టం. నాకు అందం చాలచోట్ల కనిపించింది. నాకు ఉభయసంధ్యల్లో–పంట పొలాల్లో–అడవుల్లో–కొండల్లో, అనేకమంది అమ్మాయిల్లో ఆవేశం నాకు చాలా అరుదుగా కన్పిస్తుంది. అక్కడక్కడా కనిపిస్తుంది. చూపుల్లో కనిపించ లేదెన్నడూ–అదీ అమ్మాయి చూపులో. అందుకూ ఆమె అంటే నా కిష్టం ఏర్పడింది.

ఆమె పుస్తకం చదువుతూంది.

నేను ఆమెను చూస్తున్నాను.

ఆమె నన్ను మరోసారి చూస్తుందని నా ఆశ.

అందుకే ప్రతి లిప్తా ఆమెనే చూస్తున్నాను. నేను చూడని లిప్తలో ఆమె నన్ను చూస్తుందేమోనన్న భయం. ఆమె చూపును చూడాలి, అదీ నా ఆశ. అందుకే అన్నింటినీ మరిచిపోయాను. వచ్చిన బస్సునుకూడా గమనించలేదు. ఆమె కదిలింది. ఆమె కదలికను చూశాను. బస్సు కనిపించింది. ఆమె చర చరా నడిచింది. పుస్తకం మూసి బస్సు ఎక్కింది. బస్సు వెళ్ళిపోతోంది.

నేను వెళ్ళాల్సిన బస్సూ అదే. ఐనా ఎందుకో కాళ్ళు కదల్లేదు. కదిలేవరకు బస్సు వెళ్ళిపోతోంది. నేను నిట్టూర్పు విడువలేదు. ఎలక్ట్రిక్ పోల్‌ను చూచాను. ఆమె ఆ స్తంభం ముందు నుంచుంది. ఆమె అంత అందమైందేమీకాదు. అలా అని మన తారలవలె వికారమయిందీ కాదు. ఆమె జడ చాలా పొడవు. పిరుదుల దాకా ఉన్నట్లుంది. సగంవరకే అల్లినట్లుంది. మిగతాది నిర్లక్ష్యంగా వదిలివేసి నట్లుంది. ఆమె జుట్టు చెదిరి నట్లుంది. ఆమె ముఖంలో నిర్లక్ష్యం కనిపిస్తుంది. అలంకారం

లేదు. ఆమె కండ్లు వింతగా ఉన్నాయి. అవి చెవులదాకా లేవు. లోతుగా ఉన్నాయి. పెద్దవేమీ కావు. చిన్నగా వున్నాయి. ఆమె గడ్డం చిన్నది. ఆమె చెంపలు పల్చనివి.

ఆమె ఏది?

ఏది ఆమె?

అలా అనుకునే వరకు స్తంభం కనిపించింది. నిట్టూర్చాను.

బస్సు వచ్చి ఆగింది. ఎక్కాను. బస్సు కదిలింది.

నన్ను ఆమె చూపులే వెంటాడుతున్నాయి. ఆ చూపుల్ని చూడాలని తహ తహ పెరుగుతూంది. ఆమె ఎవరో తెలియదు. ఎక్కడుంటుందో తెలియదు. ఎందుకీ తహతహ? తహతహ ఎందుకో చెప్పగల వాడేడి? అయినా, నాకు వెన్నెల వేడిగా లేదు. అది చల్లగానే ఉంది. మనసులో ఎక్కడో ఊదుబత్తి వెలిగించినట్లుంది. సన్నని సెగ, పల్చని పొగ.

ఆమె కనిపించలేదు.

కనిపించదనీ అనుకున్నాను.

నేను చావాలనుకోలేదు. మజ్నూను కాను.

ఒకనాడు బస్సులో ఆమె కనిపించింది. ఆమె పుస్తకం చదువుతూంది. ఆమె పక్కసీటుమాత్రం ఖాళీగా ఉంది.

"కూర్చోవచ్చునా?" అడిగాను.

ఆమె మాట్లాడలేదు. పక్కకు జరిగింది కూర్చోమన్నట్లు. కూర్చున్నాను. ఆమె తెలుగు పుస్తకం చదువుతూంది. ఆమె తెలుగు పుస్తకాలు చదువుతుందనుకోలేదు నేను.

"మీరు ఎప్పుడూ చదువుతుంటారా?"

ఆమె మాట్లాడలేదు. చిరునవ్వు లాంటిది నవ్వుకుంది.

"ఈ రచయిత నాకు తెలుసు" అన్నాను. ఆమె పుస్తకం మూయలేదు. నా వైపు చూసింది.

"అవును. బాగా పరిచయం. వట్టి పిచ్చివాడు–వెర్రివెధవ."

ఆమె పుస్తకం మూసింది. నన్ను ఎగాదిగా చూసింది. "ఎందుకు?" అడిగింది. ఆమె గొంతు దురుసుగా ఉంది.

"ఎందుకేమిటి–లోకం తీరు తెలియని వాడు అంత చదివి ఏంలాభం? నయాపైసా సంపాదించడు. చింపిరి జుట్టు, మాసిన గడ్డం, లొట్ట చెప్పులూ. ఇరవై నాలుగ్గంటలు సిగరెట్టు కాలుస్తుంటాడు. మంటను మింగి మంటలు రాస్తున్నానని భ్రమపడ్తాడు, పొగ వదులుతూ. అతని కళ్ళల్లో మాత్రం చింతనిప్పులుంటాయి. ఎప్పుడూ ఆలోచిస్తుంటాడు. కళ్ళు కంటకంటాయి. పుస్తకాలు రాసి లోకాన్ని మారుస్తానంటాడు. పిచ్చి కాకుంటే ఏమిటిచెప్పండి? నేనతని రచనలేమీ చదవలేదు."

ఆమె నిట్టూర్చింది. నవ్వలేదు. నన్నొకసారి తన చూపుల్తో కాలిచింది. ఆ చూపుల్లో ఆవేశం అరిగిపోయింది. ఏదో నిరాశ కనిపించింది.

"నాకు వారు తెలియదు. వారి రచనలే తెల్సు, అవి చాల గొప్పవి, మహోన్నతాలు. వారు చాలా గొప్పవారు. వారు పుస్తకాలు మాత్రం రాసి ఊరుకుంటున్నారని మీరెందు కనుకుంటున్నారు!"

"నాకు తెలిసిందదే."

"మీరు తెలుసుకోవాల్సింది చాలా వుంది. వారి ప్రతి పుస్తకం ఒక ఉద్యమం."

"అలాగా! అయితే తెలుసుకుంటాను. నాకు వారి కళ్ళంటే చాలా ఇష్టం. అవి ఎప్పుడు చింతనిప్పులు కురుస్తుంటాయి."

"అలాగా!" ఆమె నన్ను చూసింది. ఆ చూపుల్లో ఆవేశం ద్విగుణీకృతంగా ఉంది.

"మీ చూపులన్నా నాకు ఇష్టం."

ఆమె చెంపలు సిగ్గుతో ఎర్రబడలేదు. ఆమె తలవంచుకోలేదు. గోళ్లు గిల్లుకోలేదు.

"ఎందుకు?" అడిగిందామె. ఆమె ధ్వనిలో ఆవేశం వుంది, అది అనుకున్నంత దురుసుగా లేదు.

"మీ చూపుల్లో ఆవేశం ఉంది."

"మీకు ఆవేశం అంటే ఇష్టమా?"

"నాకిష్టమైంది అదొకటే."

"అలాగా, అయితే మళ్ళీ కలుసుకుందాం" అని లేచి బస్సు దిగి వెళ్ళిపోయిందనే విషయం బస్సు కదిలింతరవాతగాని నాకు తెలియలేదు.

అప్పుడుగాని అర్థంకాలేదు–నేను ఆమె పేరు, ఉనికి తెలుసుకోలేదనే విషయం.

ఆమె బస్టాప్‌లో కనిపించింది. స్తంభం పక్కన నుంచుని పుస్తకం చదువుతూంది. ఆమెను చూచాను. పలకరించాలనిపించింది. వెళ్ళాను. నమస్కరించాను. ఆమె తృళ్ళిపడింది. నన్ను చూచింది.

"ఓహో మీరా?" అంది పుస్తకం మడిచి.

"ఈ పుస్తకం తెచ్చాను" అని అందించాను.

"కొత్తగా వచ్చిందా, ఆ రచయితదే."

"అవును. మీ కోసమే తెచ్చాను."

"మీరు చదివారా?"

"చదివాను."

"ఎలా ఉంది?" ఆమె కళ్ళల్లో ప్రశ్నల దొంతర్లు, ప్రశ్నల తోరణాలు కనిపించాయి.

"అది పుస్తకం కాదు, ఉద్యమం."

ఆమె కళ్ళల్లో వెలుగులమూలాలు కనిపించాయి.

బస్సు వచ్చింది, వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్న బస్సును ఆమె చూసింది.

"అరే! బస్సు వెళ్ళిపోయిందే!" అన్నది. అప్పుడుగాని నేను వెళ్ళిపోతున్న బస్సును చూడలేదు.

"అలా పార్కులోకి వెళ్ళి కూర్చుందామా?"

"పార్కంటే మీ కిష్టమా?"

"కాదు."

"మరి?"

"మీతో మాట్లాడ్డం అంటే ఇష్టం."

"అలాగా! అయితే నడవండి."

ఇద్దరం మౌనంగా నడిచి పార్కులోకి వెళ్లాం. పచ్చిక మీద కూర్చున్నాం. ఆమె బటాణీలు కొన్నది, నాకు వాటి అవసరం ఏర్పడలేదు.

"ఆ హీరో అలా చచ్చిపోవడం నా కిష్టంలేదు" అన్నాను.

పంటితో బటాణీని నొక్కి నన్ను చూచింది. కంటిరెప్పలు చీల్చుకొని చూచింది. ఆ చూపులో మోదుగుపూలు కనిపించాయి. కొండలమంటలు కనిపించాయి.

"ఎందుకు?" ఆమె అగ్గి కురిసింది.

నేను మాట్లాళ్ళేదు. వాస్తవంగా ఆమె చూపుకు జంకాను.

"పట్టా పుచ్చుకుని పదిమంది చుట్టూ తిరిగింది. ఉద్యోగం దొరక్కున్నా పెళ్ళాడి, పిల్లల్ని కని, వారిని పోషించలేక నిరాశ చెంది ఏ రైలు కిందనో పడిచస్తే బావుంటుంది కదూ!"

"అలా అనికాదు." నేను జడుస్తూనే అన్నాను.

"మరి?"

నేను మాట్లాళ్ళేకపోయాను.

"మీరు సినీమాలు చూస్తారా?" ఆమె చూపులోనూ, ధ్వనిలోనూ ఉద్రేకం లేదు.

"సినీమాలు మానెయ్యండి ఇలాంటి పుస్తకాలు అర్థం అవుతాయి."

"మంచిది, మానేస్తాను."

ఆమె మాట్లాళ్లేదు. బటాణీలు తింటూంది. నేను ఆమెను చూస్తున్నాను. ఆమె ఆవేశం నాకు అర్థం కాలేదు. అదే అడిగాను.

"ఆ మేడలు చూస్తున్నారా, ఆ గుడిసెలు చూస్తున్నారా? ఎందుకా వ్యత్యాసం?"

"ఏమో!"

"ఆ వ్యత్యాసాలు అంతం కావాలనే మా ఆవేశం."

"ఎలా?"

"ఆ మేడలు కాలి –కూలాలి."

ఆమె కళ్ళలో అగ్నిపర్వతాలు పేలాయి.

"వాటికి అగ్గిపెట్టి, కాల్చి కూల్చి బూడిద చేయగలను, క్షణంలో. చెప్పండి చేయమంటారా?" నా రక్తంలో లావా ఉరికింది.

ఆమె పెద్దగా నవ్వింది.

నేను వెలవెలబోయి చూశాను.

"అవి సిమెంటు బంగళాలు. వాటికి నిప్పంటుకోదు."

"ఎలా మరి?"

"అందుకే ఆలోచన. ఆలోచన, ఆవేశం రెండూ కావాలి."

"నాకేమీ అర్థంగావడం లేదు."

"సరే, ఆ రచయిత కలిశారా?" అమ్మాయిలా అడిగింది.

"పుస్తకం చదివాక వెళ్లాను. అత నక్కడ లేదు. ఎక్కడికి వెళ్ళిందీ ఎవరూ చెప్పలేదు."

"సరే, వెళ్దామా మరి?"

"మీ పేరు చెప్పారు కాదు."

"సుజాత."

"సుజాతా?"

"సుజాత తెలియదూ! బుద్ధునికి జ్ఞాన భిక్ష పెట్టింది."

"ఓహో, మీరేనా ఆ సుజాత?".

"కాను. నా పేరు సుజాత."

ఇద్దరమూ బస్టాప్‌దాకా నడిచాం. ఇద్దరమూ బస్సెక్కాం. దిగి పొయ్యేప్పుడు తన రూముకు రమ్మని అడ్రసు ఇచ్చింది.

తరవాత అనేక పుస్తకాలు చదివాను. వాటిల్లో మహోన్నతశిఖరాలు కనిపించాయి. అధఃపాతాళాలు కనిపించాయి. పోరాటాలు తెలిశాయి. ఉద్యమాల ఉరుకులు గోచరించాయి. వెలుగులు కనిపించాయి. వెలుగు బాటలు దొరికాయి.

సుజాత గదికి వెళ్లాను, ఉదయమే. ఆమె అప్పుడే వచ్చినట్లుంది. ముఖంలో అలసట కనిపిస్తూంది. నన్ను చూసింది. ఒక చిరునవ్వు నవ్వింది. గది తాళం తీసింది. ఇద్దరమూ లోనకు ప్రవేశించాం.

ఆ గది ఆడపిల్ల గదిలా లేదు. పుస్తకాలు చిందరవందరగా పడిఉన్నాయి. కుర్చీలమీదా, మంచంమీదా దుమ్ము పేరి ఉంది. అక్కడక్కడా సిగరెట్టు పీకలూ, బీడీపీకలూ ఉన్నాయి.

"ఇంత దుమ్ము పేరింది, శుభ్రం చేయకూడదూ?" అన్నాన్నేను.

"దేశంలో ఇంతకు అనేకరెట్లు దుమ్ము పేరివుంది. దాన్ని దులపాలి."

"దులపడం ఇంటినుంచి మొదలు పెట్టవచ్చుగా?"

"వచ్చు. మీరు సహాయపడ్తారా?"

ఇద్దరంకలిసి దుమ్ము దులిపాం. గది ఊడ్చాం. చెత్త ఎత్తిపోశాం, అప్పుడు కాస్త హాయిగా కూర్చున్నాం.

"సమాజం కుళ్ళిపోయింది. మరమ్మత్తు చేసేమార్గం?" అడిగాను.

"విప్లవం, విప్లవం రావాలి!" సుజాత పిడికిలి బిగించి గట్టిగా అన్నది. అప్పుడామె ముఖంలో మందారాలు పూశాయి. అగ్గి మంటలు మండాయి. అరుణపతాకాలు రెపరెపలాడాయి.

"మీరు చాల అందంగా ఉన్నారు" అన్నాను. నా ధ్వనిలో ఉద్వేగం ఉంది.

"మీకు అందం ఇష్టమా?"

"కాదు – ఆవేశం. ఆవేశం ఎంత అందంగా ఉంటుందో ఇవ్వాళ చూశాను."

"అలాగా!" ఆమె నవ్వింది. ఆ నవ్వు నిర్లక్ష్యంగా ఉంది. పేలవంగా ఉంది.

ఆ తరువాత ఇద్దరం కలిసి అనేక చోట్లకు తిరిగాం, సమావేశాలలో మాట్లాడాం, పల్లెలకు వెళ్ళాం, బస్తీలకు వెళ్ళాం, కార్మికులతో మాట్లాడాం, కర్షకుల్ని కలుసుకున్నాం, విద్యార్థులతో తిరిగాం, యువకుల్లో కలిసిపోయాం. సుజాత ఉపన్యాసంలో అగ్గి ఉంది. అది ఊరికేనే రాజుకుంటుంది.

ఒకనాడు ఒక పల్లెకు వెళ్ళాం. చీకటి పడింది. కొందరు ఊళ్ళోంచి వచ్చారు. ఏటిఇసుకలో కూడాం, చర్చలు జరిపాం, తగాదా పడ్డాం, కలిసి పోయాం. అంతా ముగిసేవరకు అర్ధరాత్రి అయింది. తిండి లే దారాత్రి. ఇది మామూలు

అయిపోయింది. ఊళ్ళోకి వెళ్దామన్నారు వాళ్ళు. ఇక్కడే పడుకుంటామన్నాం, నేనూ - సుజాతా. అలాగే జరిగింది.

వేసవికాలం. ఏటిపాయ సన్నగా పారుతుంది. ఇసుక హాయిగా ఉంది. ఇసుకమీద పడుకున్నాం, నేనూ సుజాతా. వెన్నెల విరిసింది. అలసట తగ్గిపోతూంది. హాయిగా ఉంది.

"సుజాతా! మీకు ప్రేమమీద నమ్మకం ఉందా?"

"ఉంది. కాని ఈ సమాజంలో ప్రేమసహితంగా అన్నీ వ్యాపారాలే. వ్యాపారం మీద నమ్మకంలేదు." వెల్లకింతలా పడుకొని చుక్కల్ని లెక్కపెడ్తున్నంత నిర్లిప్తంగా అన్నది.

సుజాతతో ఉన్న చిక్కే అది. ప్రతి సమస్యకు చప్పున చిక్కులు అల్లేస్తుంది. అవి విడదీయడం ఎవడికీ తరంకాదు.

"నా ప్రేమమీద నమ్మకం ఉందా?

"ఉంది."

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను."

సుజాత నావైపు మళ్ళింది. నన్ను ఒకసారి తన చూపుతో కొలిచింది. క్షణం మాట్లాడలేదు.

"సరే. ప్రేమించండి" అని వెల్లకిలా పడుకుంది. మళ్ళీ - వేలితో చుక్కల్ని లెక్కపెడుతూ

నేను లేచి కూర్చున్నాను ఆమె నా వైపు చూళ్ళేదు. నేనే ఆమెను చూస్తున్నాను.

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" నా ధ్వనిలో ఆవేశం ఉంది.

"మీ ఆవేశం నాకిష్టం. ప్రేమిస్తున్నాను" అన్నది. ఆమె చలించలేదు. చుక్కల్ని లెక్కపెడ్తున్నంత తేలిగ్గా అన్నది.

నాలో ఉత్సాహం పొంగింది. ఉద్రేకం మండింది. అమాంతంగా సుజాత భుజాలు పట్టుకొని ఊపెయ్యాలనిపించింది. కాని, నిగ్రహించుకొన్నాను. ఇసుకలో వాలిపోయాను.

"మనం పెళ్ళి చేసుకుందామా?"

"చేసుకోవచ్చు!" ఆమె నా వైపు తిరిగింది. ఇద్దరమూ చాల దగ్గర్లో ఉన్నాం.

"ఒక తేదీ నిర్ణయించడం మంచిది."

"మీరే నిర్ణయించండి" అని వెల్లకిలా పడుకుంది. ఈ తడవ ఆమె చుక్కల్ని లెక్కించలేదు. కళ్ళు మూసుకుంది.

మూసుకున్న కళ్ళనే చూస్తూ కూర్చున్నాను. కాస్సేపు పడుకొని నిద్రపోయాను.

తెల్లవారి ఆ ఊరినుంచే బయల్దేరేప్పుడు పెండ్లికి తేదీ నిర్ణయించుకున్నాం. పెండ్లినాడే కలుసుకుందామని ఇద్దరమూ విడిపోయాం.

ఒక చీర మాత్రం కొన్నాను సుజాతకు. ఆ రాత్రి సుజాత కళ్ళు నన్ను వెంటాడేయి. నిద్రపట్టలేదు. కొత్త చీరలో సుజాతను ఊహించుకొంటూ పడుకున్నాను.

తెల్లవారింది. చీరపట్టుకొని సుజాత గదికి పరుగెత్తాను.

గది తలుపులు బార్ల తీసున్నాయి.

సుజాత లేదు!

గది సాంతం చిందరవందరగా ఉంది.

నా గుండె జల్లుమంది.

ఏదో అవాంతరం శంకించింది.

పక్క గదికి ఉరికాను, అడిగాను.

"పోలీసులు వచ్చారు... సుజాతను అరెస్టు చేశారు, తీసికెళ్ళారు" అని చెప్పారు.

"ఎందుకు?" నాలో ఆవేశం కట్టలు తెంచుకుంటోంది.

"ఆమె కథ[లాస్తుందట, బాంబులు చేస్తుందట."

"అబద్ధం – అంతా అబద్ధం. అయితే నేనూ కథ[లాస్తాను. నేనూ బాంబులు చేస్తాను" అని కేకలు పెట్టాను. ఉరికాను ముందుకు.

★ ★ ★

# నల్లనాగు

"అమ్మా!" సుజాత సోఫాలో కూర్చుంది. తీరిగ్గా ఉంది. వారపత్రిక అందుకుంది. సీరియల్లో మునిగిపోతుంది. ఆమెకు ఏమీ కనిపించలేదు. వినిపించలేదు.

"అమ్మగారూ!"

పిలుపు కాస్త దగ్గరగా ఉంది. సుజాత సీరియల్లోంచి బయటపడింది. పైకి చూసింది. తలుపులు బార్లాతీసి ఉన్నాయి. మెట్లమీద ఒక అమ్మాయి నుంచుంది.

అమ్మాయి నల్లరాతి బొమ్మలా ఉంది, శిల్పి మలచిన శిల్పంలా ఉంది, నల్లగా ఉంది, కాటుకలా ఉంది. మధ్య పాపిట తీసింది. వెంట్రుకలు దిగదీసింది. నొసటి కొసన మొల్చాయి కొన్ని వెంట్రుకలు. అవి లొంగలేదు. గాలికి ఆడుతున్నాయి. నొసట కుంకుమ పొడిచిన పొద్దులా ఉంది. కళ్ళు ఆలిచిప్పల్లా ఉన్నాయి. వాటిలో ఎర్రని జీరలున్నాయి. కళ్ళు కాస్త ఎరుపు. వాటిల్లో అమాయకత కాపురం పెట్టింది. ముక్కు తీర్చిదిద్దినట్టుంది. దానికి ముక్కెర ఉంది. ముక్కెరకు ఎర్రరాయి ఉంది. అది మెరుస్తూంది, బుగ్గలు నున్నగా ఉన్నాయి. వేయి స్తంభాల గుడి స్తంభాల్లా మెరుస్తున్నాయి. పెదవులు ఎర్రగా ఉన్నాయి. మందారాల్లా ఉన్నాయి. చుబుకం చిన్నగా ఉంది. ముద్దొస్తూంది. మెడ కురచగా ఉంది. నల్లపూసలు రంగులో కలిసి పోయాయి. పయ్యెదలో పరువం పిటపిటలాడుతూంది.

చూస్తూ ఉండి పోయింది సుజాత. నవల్లో నాయికకంటే అందంగా ఉంది.

"అమ్మగారూ! పని మనిషి కావలెనన్నారట."

సుజాత ఈ లోకంలోకి వచ్చింది.

"నువ్వు పనిచేస్తావా?" ఆశ్చర్యం వ్యక్తపరచింది.

"అవ్వమ్మా! పనిమనిషి కావలెనన్నారట, వచ్చిన."

"నీ పేరు?"

"నీలమణి అంటరు."

"పేరు బావుంది–నీకు తగినట్లు. పని జాగ్రత్తగా చేస్తావా! మా ఇంట్లో అంతా గాజు సామానుంది."

"నా కెరికేనమ్మా! పదిలంగ పనిచేస్త."

తరువాత నెల జీతాన్ని గురించి బేరం జరిగింది. నీలమణి ఒప్పుకుంది. నీలమణి లోనికి వచ్చింది. గిన్నెలు తోమిపెట్టింది. గాజు సామాను కడిగి పెట్టింది. అది పరీక్ష, ఆమె నెగ్గింది. మెచ్చుకుంది సుజాత. నీలమణి ముఖం వెలిగింది. మబ్బుల్లో మెరుపు మెరిసింది. తెల్లవారినుంచి వస్తానని చెప్పి నీలమణి వెళ్ళిపోయింది.

నీలమణి సుజాత ఇంట్లోకి రావడం పోవడం చూశారు ఇరుగమ్మలు, పొరుగమ్మలు. గబ గబ వచ్చేశారు. నీలమణి ఎందుకు వచ్చిందని అడిగారు. చెప్పింది సుజాత.

"అబ్బో! అది నంగనాచి, మగవాళ్ళ మనసు పాదరసం లాంటిది. దాన్నెందుకు పెట్టుకున్నారు?" ఆశ్చర్యం వ్యక్తపరచారు అమ్మలక్కలు.

చిరునవ్వు నవ్వింది సుజాత. "మా వారు అలాంటివారు కారు. మరో ఆడదాన్ని కన్నెత్తైనా చూడరు. మీరు నిశ్చింతగా ఉండండి." సుజాత కళ్ళల్లో గర్వం కనిపించింది.

వచ్చినవారు మూతులు విరిచారు. నీ ఖర్మ అన్నట్లు చూశారు. వెళ్లిపోయారు.

సుజాతకు విశ్వనాథం కనిపించాడు కళ్ళలో విశ్వనాథం నిష్ఠగలవాడు. అతడు సుప్రభాతం చదువుతాడు. విభూతి వంటినిండా ధరిస్తాడు. సంధ్య వారుస్తాడు. నమకం చమకం వగైరాలన్నీ చదువుతాడు. నిత్యం పూజ చేస్తాడు. విభూతితోనే ఆఫీసుకు వెళతాడు. అతనొక ఆఫీసరు. గుడి కనిపిస్తే గుంజిళ్ళు తీస్తాడు. ఆఫీసులో అతనికో స్టెనో ఉంది. షర్మిలా – వగలాడి వన్నెల విసనకర్ర ఆవిడ విశ్వనాథానికి వల పన్నింది, ప్రమోషన్ కోసం. విశ్వనాథం లొంగలేదు. షర్మిలాను ట్రాన్స్‌ఫర్ చేయించాడు. ఆ విషయం తెలిసింది సుజాతకు. సుజాత పొంగిపోయింది. విశ్వనాథాన్ని ముద్దు పెట్టుకుంది మెచ్చుకోలుగా.

తెల్లవారి నీలమణి వచ్చింది. తలుపు తట్టింది. విశ్వనాథం తలుపు తీశాడు. నీలమణిని చూశాడు. చూస్తూ ఉండిపోయాడు.

"పని మనిషిని. అమ్మగారు పెట్టుకున్నారు. అడ్డం జరుగుండి."

అడ్డు జరిగాడు విశ్వనాథం. నీలమణినే చూస్తున్నాడు. అటునుంచి సుజాత వస్తూ, ఇటునుంచి నీలమణి పోతూ కనిపించారు. విశ్వనాథం నీలమణి నడకను చూశాడు. ఆమె పిక్కలు మెరుస్తున్నాయి. సంగడి పట్టిన నల ముద్ద కోళ్ళలా ఉన్నాయి. వాటికి వెండి కడియాలున్నాయి. అవి తళుక్కుమంటున్నాయి.

ఆనాడూ పూజచేశాడు విశ్వనాథం. అతనికి శివుడు కనిపించలేదు. నీలమణి కనిపించింది. సుజాతను తల్చుకున్నాడు. తేరుకున్నాడు. నిగ్రహించుకున్నాడు. ఆఫీసుకు వెళ్లాడు.

నీలమణి పనికి వస్తూనే ఉంది.

విశ్వనాథం చూస్తూనే ఉన్నాడు, సుజాత కంటపడకుండా!

ఒకనాడు టెలిగ్రాం వచ్చింది, సుజాత తల్లికి జబ్బుగా ఉందని. విశ్వనాథం తనకు సెలవు లేదన్నాడు. రావడం వీలుపడదన్నాడు. సుజాతకు వెళ్ళక తప్పలేదు, వెళ్ళింది.

తెల్లవారింది. నీలమణి తలుపు తట్టుతుందని చూశాడు. నీలమణి రాలేదు. రాదని తేల్చుకున్నాడు. సుజాత రావద్దని చెప్పిందనుకున్నాడు. కట్టుదిట్టం చేసి వెళ్లిందనుకున్నాడు. కస్సు బుస్సు మనుకున్నాడు. ఆడవాళ్ళంతా ఇంతే ననుకున్నాడు. ఆఫీసుకు వెళ్లాడు. తిరిగి వచ్చేప్పుడు స్కూటరు నీలమణి ఇంటివైపు మళ్ళించాడు. ఇల్లు తెలుసుకోవటం కష్టం కాలేదు.

నీలమణి గుడిసెముందు కూర్చుంది, చేటలో బియ్యం ఏరుతూంది. స్కూటరు చప్పుడు విన్నది. తల ఎత్తింది. విశ్వనాథం కనిపించాడు. లేచి నుంచుంది.

"పనికి రాలేదేం?"

"అమ్మగారు లేరుగద!"

"హోటలు తిండి పడదు. నాకు కాస్త వండిపెట్టాలి. ఏమంటావ్?"

"అట్టనే వస్త–పొద్గాల."

"ఇప్పుడు రారాదూ?"

"అయనొస్తడు అన్నానికి–పొద్గాలవస్త."

"సరే, ఈ పూట హోటల్లో తింటా. ఉదయం తప్పకుండా రావాలి, ఏమంటావ్?"

"అట్లనేనునండి."

విశ్వనాథం స్కూటరు సాగిపోయింది.

తెల్లవారకుండానే లేచాడు విశ్వనాథం. తలుపు తట్టిన చప్పుడుకోసం ఎదిరి చూశాడు.

కాలం కదలడంలేదు.

తలుపు తట్టడం వినిపించడంలేదు.

నీలమణి రాదేమోననుకున్నాడు. ఏదో పోగొట్టుకున్నట్టు వెదుక్కోసాగాడు.

తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. ఉరికాడు విశ్వనాథం. తలుపు తీశాడు.

నీలమణి కనిపించింది.

విశ్వనాథంలో విద్యుత్తు ఉరికింది.

నీలమణి తల వంచుకుంది. సాగిపోయింది.

విశ్వనాథం ఆమె నడకను చూస్తున్నాడు. పిక్కల్ను చూస్తున్నాడు.

విశ్వనాథం తలుపు వేశాడు. గొళ్ళెం వేశాడు.

నీలమణి గమనించలేదు. ఆమె పనిలో మునిగిపోయింది.

ఇల్లు ప్రశాంతంగా ఉంది. ఎవరూ లేరు. తాను, నీలమణి. విశ్వనాథం గుండె ఉరుకులు పెట్టింది. గదిలోకి వెళ్ళాడు. కొన్ని నోట్లు తీసుకున్నాడు. డబ్బు అన్నింటినీ కొనగలదనే విశ్వాసం విశ్వనాథానిది. అందుకే అతనికి భక్తి మెండేమో?

విశ్వనాథం నీలమణి దగ్గరికి చేరాడు. నీలమణి గిన్నెలు తోముతూంది బూడిదతో. ఆమె చేతులనిండా బూడిద ఉంది. విశ్వనాథం డబ్బు చూపాడు నీలమణికి.

"జీతం పయలికి తీసుకుంట – అమ్మగారిస్తది."

"జీతం కాదు. ఉంచుకో – పాపం, కష్టపడుతున్నావు."

"మేం కష్టపడేటోండ్లమే." నీలమణి తల పైకెత్తలేదు. ఆమె గాజుప్లేటు తోముతూంది.

విశ్వనాథం మరీ దగ్గరికి వచ్చాడు.

నీలమణి గమనించింది. ఆమె గుండె గుబగుబలాడలేదు. కాళ్ళు వణకలేదు. నోరు అర్చుకొని పోలేదు. ఆమె పని చేస్తూనే ఉంది. చేతిలో గాజు ప్లేటుంది.

విశ్వనాథం నీలమణి చేయి పట్టుకున్నాడు. నీలమణి చేతిలోని ప్లేటు జారిపడింది. చప్పుడైంది. పగిలింది. విశ్వనాథం గమనించినట్లు లేదు. నీలమణి చేయి విశ్వనాథం చేతిలో ఉంది. చేయి మెత్తగా లేదు. పూవులా లేదు. సుజాత చేతిలా లేదు. అది కఠినంగా ఉంది. కర్కశంగా ఉంది. రాయిలా ఉంది.

నీలమణి విశ్వనాథాన్ని చూసింది. ఆమె కళ్ళు ఎర్రగా ఉన్నాయి. మోదుగు పూలలా ఉన్నాయి. ఆ కళ్ళు విశ్వనాథంలో అగ్గి రగిల్చాయి. మరో అడుగు ముందుకు వేశాడు.

"అయ్యగారూ! చెయ్యి వదులుండి. మీరు పెద్దోళ్ళు."

"అదేం లేదు. ఒక్కసారి." ఇకిలించాడు విశ్వనాథం.

"విడువుండి." గట్టిగా అరిచింది.

విశ్వనాథం ఆమెను దగ్గరికి లాక్కున్నాడు.

నీలమణి విదిలించింది. చేయి విడిపించుకుంది. దూరం జరిగింది.

విశ్వనాథం లంఘించాడు. పొదివి పట్టుకున్నాడు.

నీలమణి మండిపోయింది. అగ్నిజ్వాల అయింది. పెద్దగా కేకలు పెట్టింది. విశ్వనాథాన్ని నెట్టింది. అతను పడిపోయాడు. అతని భుజానికి పగిలిన గాజు పెంకు గుచ్చుకుంది. రక్తం కారుతూంది. నీలమణి అది చూడలేదు. ఆమె ఆదిశక్తిలా ఉంది. విశ్వనాథం చేయి అందుకుంది. కేకలేస్తూంది. బయటికి లాక్కుపోతూంది. విశ్వనాథాన్ని గుమ్మం బయటికి లాక్కొచ్చింది.

నీలమణి కేకలు విన్నారు చుట్టుపక్కలవాళ్లుకూడాను.

"చూసిన్రా అమ్మ – నేను కావల్నట ఈ అయ్యకు. బంగారుమనసు వంటి పెండ్లం ఉన్నది!" నీలమణి అరుస్తూంది. అందరికీ చెప్పతూంది. విశ్వనాథం కిక్కురుమనలేదు. తల వంచుకున్నాడు, నుంచున్నాడు.

ఇంటిముందు ఆటో ఆగింది. సుజాత దిగింది. విన్నది. చూసింది.

"నాటకం వేసింది ఇందుకా?" అని, "నీలమణీ! నువ్వు గట్టిదానివి. ఆడది లొంగి చెడ్డది. ఎదిరించాలి. ఆడది ఎదిరించాలి. ఎదిరించక గత్యంతరం లేదు" అంటూ పెద్ద అంగలు వేస్తూ ఇంట్లోకి వెళ్ళింది. తలుపు దఢాల్న వేసింది. విశ్వనాథం ముఖాన మూసినట్లుంది తలుపు.

విశ్వనాథం అటు చూశాడు.

కూడిన ఆడవారు ఘొల్లుమని నవ్వారు.

విశ్వనాథం పూజ చేయలేదు. అయినా అతని ముఖానా, వంటినా బూడిద ఉంది. భుజానికి గాయం వుంది. అతనికి ఆ బాధ తెలియడం లేదు. అతడు మూతపడిన తలుపుల్నే చూస్తున్నాడు.

నీలమణి వెళ్ళిపోతూంది.

కూడిన మగవాళ్ళంతా ఆమెనే చూస్తున్నారు.

ఆమె నల్ల నాగులా కనిపించింది.

వంకరు వంకర్లుగా సాగిపోతూంది నీలమణి–కాదు–నల్లనాగు!

★ ★ ★

# శంక

రాజయ్య హైదరాబాదుకు బయల్దేరాడు. అతడు తరచుగా పట్నం వెళుతుంటాడు. అతడు వ్యాపారస్తుడు. అందుకే తరచుగా పని పడ్తుంది. ఈ తడవ హైదరాబాదు వస్తున్నాడు బస్సులో. బస్సులోనే అతనికి గుండెనొప్పి అనిపించింది. గుండెనొప్పి అంటే భయం రాజయ్యకు. చప్పున గుండె ఆగిపోతుంది అనుకున్నాడతను. బస్సులో అటూ ఇటూ చూచాడు. అంతా బాగానే వున్నారు. ఎవరూ తనవైపు చూడ్డంలేదు. ఛ, ఏం మనుషులు! మానవత్వం లేదు. తోటి వానికి గుండె నొప్పి వచ్చింది. కనీసం సానుభూతి చూపరు, అనుకున్నాడు.

బస్సు వేగంగా పోతూంది. రాజయ్యకు గుండెనొప్పి ఎక్కువ అయినట్లనిపించింది. చేత్తో రుద్దుకున్నాడు. కాస్సేపు గుండెను పట్టుకున్నాడు. బస్సు చప్పున ఆగింది. ఊపు ఊపింది ఆగే ముందు. రాజయ్య బెదిరాడు. లేచి కూచున్నాడు. ఎదుట చూచాడు. ఎడ్లబళ్ళు వరసలుగా పోతున్నాయి. ఒక బండి ఎద్దు మాట వినలేదు. బండి బస్సు ముందుకు వచ్చేసింది. బండికి ప్రమాదం తప్పించాలనుకున్నాడు. అందుకే అమాంతంగా ఆపాడు డ్రైవరు.

బస్సు సాగింది. రాజయ్య కూర్చున్నాడు. ఆ సీటులో అతను ఒక్కడే ఉన్నాడు. నొప్పి కాస్త తగ్గినట్లే ఉంది ఆలోచన్లు తగ్గలేదు. బస్సు సడన్‌గా ఆగింది! తన గుండె అలాగే ఆగుతే? అవును. ఈ బస్సులోనే! ఇప్పుడే! ఇక్కడే! తాను చనిపోయినట్లే! అవును, తన బంధువొకడు అలాగే చచ్చిపోయాడు. అవును, చావంటె ఎంత? నిముషం, అంతకంటే! బతుకంటే! చాల పొడవు! రాజయ్యకు బాల్యం గుర్తుకు వచ్చింది. వయసు గుర్తుకు వచ్చింది. జొన్నచేలు – రాములమ్మ. రాములమ్మ కళ్ళు పెద్దవి. ఎర్రవి! ఎర్రగా మందారాల్లా ఉండేవి. రాములమ్మ కళ్ళు నవ్వేవి–ఆమె పెదాలు నవ్వేవి కావు, రాములమ్మ మాలఇల్ల. జొన్న చేలు రత్నాలు కురిపించింది. ఆ తరువాత రాజయ్య రాములమ్మను అడగలేదు. రాజయ్యకు పెండ్లయింది. పిల్లలు. వాళ్ళు కన్పించారు. బస్సులో చచ్చిపోతే! చచ్చిపోతే ఎట్లా! ఏముంది చావంటే? నిముషం, అర నిముషం.

రాజయ్యకు గుండె నొప్పి లేదు. కాని, చనిపోతాడని బాధ వ్యథ దుఃఖం ఆతురత. రాజయ్యకు దుఃఖం పొంగింది. లేచి నుంచొని అందరితో చెపుదామనుకున్నాడు, తాను చనిపోతున్నాడని–బస్సులోనే. తాను చనిపోతే ఏం చేయాలో కూడా చెపుదా మనుకున్నాడు. కాని చెప్పలేదు, పిచ్చివాడంటారనుకున్నాడు. నిజంగా తనకు నొప్పిలేదు! ఎందుకు చస్తాడు? నిజంగానే పిచ్చి అనుకున్నాడు.

రాజయ్య నవ్వుకున్నాడు. కిటికీలోంచి చూస్తున్నాడు. చెట్లు పరిగెత్తుతున్నాయి. ఒక ఏరు వచ్చింది. ఏటి మీద వంతెన, అదీ ఉరుకుతూంది, వెళ్ళిపోయింది.

ఏమిటి తొందర వీటికి? ఎందుకు ఉరుకుతాయి అట్లా? అనుకున్నాడు రాజయ్య. నవ్వుకున్నాడు. ఎంత వెర్రివాడు తాను! అవెక్కడ ఉరుకుతున్నాయి! ఉరుకుతున్నది తాను! తానున్న బస్సు!! తాను ఉరుకుతే అన్నీ ఉరికినట్లు కనిపిస్తాయి. తాను నిలిస్తే అన్నీ నిలిచినట్లు కనిపిస్తాయి. తానుంటేనే లోకం, తాను లేకుంటే లేదు.

రాజయ్య ఆలోచనలు తెగాయి. బస్సు ఆగింది. పట్నం వచ్చింది. ఎక్కడికి వచ్చింది పట్నం? అది ఉన్న చోటునే ఉంది. బస్సు పట్నం చేరింది. రాజయ్య దిగాడు. అన్నీ మరిచాడు. వ్యాపారంలో దూరాడు. అతనికి ఏదీ గుర్తు రాలేదు. బాగా రాత్రికి గాని గదికి చేరుకోలేదు.

రాజయ్య గదిలో పడుకున్నాడు. నిద్రరాలేదు. విశ్రాంతిగా ఉంది. గుండె నొప్పిలాంటిది వచ్చి నట్లనిపించింది. బస్సులో వచ్చినలాంటి ఆలోచనలు మళ్ళీ వచ్చాయి. ఆ రాత్రి అతనికి నిద్ర రాలేదు. లోకం చేతిలోంచి జారిపోతున్నట్ల నిపించింది. పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నట్లనిపించింది. ఎడారిలో పరిగెత్తినట్లుంది. అలసిపోయినట్లుంది. జబ్బునపడి లేచినట్లయినాడు రాజయ్య.

రాజయ్య ఉదయమే బయల్దేరాడు. డాక్టరు ఇంటికి వెళ్ళాడు. డాక్టరు గుండె స్పెషలిస్టు. రాజయ్యను పరీక్షించాడు. ముఖం చిట్లించాడు. ఏమి చెప్పలేదు. చీటీ రాసిచ్చాడు. ధర్మాసుపత్రికి రమ్మన్నాడు. రాజయ్య దేబిరించాడు. తన గుండె ఎలా ఉందో చెప్పమన్నాడు. డాక్టరు ఆస్పత్రిలోగాని చెప్పనన్నాడు. ఈసిజీ తీస్తేగాని తెలియదన్నాడు డాక్టరు.

రాజయ్యకు అనుమానం పట్టుకుంది. అతను ఇంటినుంచి చక్కగా బయల్దేరాడు. ఇక్కడ అతనికిది పట్టుకుంది. డాక్టరు వివరంగా చెపితే బావుండేదేమో! అతను చెప్పలేదు. ఇతనికి అనుమానం పెరుగుతూంది.

రాజయ్య ఆస్పత్రికి చేరాడు. డాక్టర్లంతా అతన్ని పరీక్షిస్తున్నారు. పెద్ద డాక్టరు ఏదో చెపుతున్నాడు ఇంగ్లీషులో. రాజయ్యకు ఇంగ్లీషు రాదు. చిన్న డాక్టర్లు ఒక్కొక్కరూ చూస్తున్నారు, పరీక్షగా చూస్తున్నారు, శ్రద్ధగా చూస్తున్నారు. ఎవర్నీ చూడ్డంలేదు. తననే చూస్తున్నారు. ఏమి కారణం? ఏదో ఉంది. తనకు నిజంగానే గుండె జబ్బులా ఉంది! ఆస్పత్రిలో చేరాలన్నాడు డాక్టరు. తప్పలేదు. చేరాడు రాజయ్య.

రాజయ్యకు వార్డులో ఒక మంచం ఇచ్చారు. ఆ మంచం శుభ్రంగా ఉంది. ఖాళీగా ఉంది. హాయిగా వుంది. మంచం మీద పడుకున్నాడు రాజయ్య. ఈ సీసాలో ఏముందో తెలియదు రాజయ్యకు. జబ్బు ఏమిటో తెలియదు. ఆస్పత్రికి వచ్చాడు. మళ్ళీ ఇంటికి చేరుకుంటానా అని అనుమానం వచ్చింది.

రాజయ్య మంచం దగ్గరికి వచ్చాడు పక్క మంచపు మనిషి. "పాపం! నీకిచ్చారా ఈ మంచం?" అన్నాడు. మంచం దగ్గరికి కూడా రాలేదు. వెళ్ళిపోయాడు. మంచం బావుంది. ఎందుకలా విచారం వ్యక్తపరుస్తాడు? అనుకున్నాడు రాజయ్య.

రాజయ్య అటు తిరిగాడు మంచంలో. అటు మంచపు రోగి లేవలేదు. ఎముకుల పోగులా ఉన్నాడు. ఆ రోగిని చూచి రాజయ్యకు జాలి కలిగింది. "అయ్యో పాపం!" అన్నాడు. ఆ రోగికి దగ్గు. అది విన్నట్లు లేదు. దగ్గు తెములుకున్నాడు.

రాజయ్యను చూచాడు. ఆ చూపుల్లో జాలి ఉంది. సానుభూతుంది. "పాపం, నీకిచ్చారా ఈ మంచం?" అన్నాడు.

రాజయ్య గుండెలో బుల్లెట్లు దూరినట్లయింది. ఎందుకిలా ఈ మంచాన్ని గురించి వ్యాఖ్యానిస్తున్నారు? ఏమైంది ఈ మంచానికి? దయ్యాలూ, భూతాలూ ఏమైనా వున్నాయా? రాజయ్యకు రాగూడని ఆలోచనలన్నీ గబగబా వచ్చేస్తున్నాయి. మంచంలో లేచి కూర్చున్నాడు. దుప్పటి తీసేశాడు. నర్సు వచ్చింది, టెంపరేచర్ చూడ్డానికి. "మీకీ మంచం ఇచ్చారా, పాపం!" అని నోట్లో థర్మామీటర్ పెట్టింది. థర్మామీటర్‌తో వెళ్ళిపోతున్న సిస్టర్ని అడిగాడు రాజయ్య. ఆమె నవ్వింది. వెళ్ళిపోయింది.

రాజయ్యకు ఇహ మనసు మనసులో లేదు. అతడు మంచం దిగాడు. పచార్లు సాగించాడు. రోగులంతా అతన్ని అదోరకంగా చూస్తున్నారు. కబేలాకు పంపే గోవును చూచినట్లు చూస్తున్నారు. రాజయ్య గుండె గుబగుబలాడింది. గుండెలో పోటు వచ్చినట్లనిపించింది. ఓర్చుకొని బాత్‌రూమ్ వైపుకు సాగాడు. ఒక కుర్రాడు చక్రాల కుర్చీలో వస్తూన్నాడు. రాజయ్యను చూచాడు. "నీకేనా ఆ మంచం ఇచ్చింది?" అడిగాడు. రాజయ్యకు బాధగా ఉంది. అయినా అడిగాడు; "ఏం, ఆ మంచానికి ఏమైంది?"

"ఆ మంచంలో వరసన ఆరుగురు చచ్చారు" అని సాగిపోయాడు కుర్రాడు.

రాజయ్యకు గుండెనొప్పి బలంగా వచ్చింది. తట్టుకోలేకపోయాడు. పడిపోయాడు. చమటలు పట్టాయి. నలిగిపోయాడు. నలుగురుపట్టి మంచం మీదికి చేర్చారు. రాజయ్య ఆ మంచం మీద ఉండనంటాడు. ఉరకచూస్తాడు. ఉరకలేడు. గుండె పోటు ఎక్కువ అయింది. మరో పోటు వచ్చింది. విలవిల్లాడిపోయాడు. డాక్టరు వచ్చాడు. పెతిడ్రిన్ ఇచ్చాడు. Massive attack అన్నాడు. చాలా కష్టం అనీ అన్నాడు. షీట్ చూచాడు. ఆరోగ్యంగా వచ్చాడు. ఎందుకిలా అయినాడు? అని చర్చించుకున్నాడు. వెళ్ళిపోయాడు.

రాజయ్య నిద్రలో మునిగిపోయాడు. మత్తులోకి జారిపోయాడు. "పాపం రాజయ్య!" అని ఆస్పత్రిలో వాళ్లందరు చూచిపోతున్నారు.

రాజయ్యకు అర్ధరాత్రి తెలివి వచ్చింది. మంచం చూచుకున్నాడు. భయం అయింది. గుండె నొప్పి అలాగే వుంది. పైగా భయం. వెలకిల్లాడు. మంచం మీంచి లేచాడు. తల్లడిల్లుతున్నాడు. మంచం దిగాడు. నేలమీద పడిపోయాడు. చలికాలం. ఈదరగాలి వస్తూంది. వణుకుతున్నాడు. మంచం ఎక్కాడు. కప్పుకోడు. భయం–చనిపోతాడని! గుండె నొప్పి పెరిగిపోతూంది, అంతా నిద్రపోతున్నారు అడిగేవాళ్ళు లేరు.

రాజయ్య భరించలేక పోతున్నాడు. రాజయ్యకు తన ఊరు కన్పించింది. పిల్లలు కనిపించారు. ఇహ తాను ఇంటికి చేరలేననుకున్నాడు. బయల్దేరేప్పుడు ఆరోగ్యంగా బయల్దేరాడు. ఆస్పత్రికి రావడం తప్పైంది. అనుకున్నాడు. ఇహ తాను ఇంటికి చేర ననుకున్నాడు. తన శవమే చేరుతుందనుకున్నాడు. మరణయాతన పడుతున్నాడు రాజయ్య.

తన ఊరు,
తన ఇల్లు,
తన పెళ్ళాం
తన పిల్లలు-

కనిపిస్తున్నారు రాజయ్యకు. మనం ఉంటే మన ఊరు. మనం ఉంటే మన ఇల్లు. మనం ఉంటే మన పెళ్ళాం. మనం ఉంటే మన పిల్లలు.

మనం లేనినాడు?

మనకేదీలేదు.

మనకేదీలేదు.

మనకేదీలేదు.

తెల్లవారింది. నర్సు వచ్చి చూచింది. మంచం కాళీగా ఉంది. రాజయ్య పారిపోయాడా? అడిగింది. నవ్వింది. అందరూ అటువైపు చూచారు. మంచం కాళీగా ఉంది. పక్క మంచం అతను కిందికి చూచాడు.

"ఇదిగో! ఇక్కడ పడి ఉన్నాడు రాజయ్య."

"అరే!" అని చూచింది నర్సు.

రాజయ్య వళ్ళు చల్లగా ఉంది. నాడి ఆడ్డం లేదు.

నర్సు రాజయ్య ముఖంమీద గుడ్డ కప్పింది.

వార్డులో జనం సొంతం రాజయ్య శవం చుట్టూ చేరారు.

* * *

# కుక్కపిల్ల

పూలంటే నాకు ఇష్టం. పారిజాతాలంటే మరీ ఇష్టం. చాలా ముక్కువ. పారిజాతం మొక్క చాలాసార్లు నాటాం. అంటుకోలేదు. అంటుకుంటే పెరక్కుండానే యెండిపోయేది. చివరకు కాంపౌండు పక్కన నాటాం, అది అంటుకుంది. గుబురుగా పెరిగింది. పూలు విరగబూస్తూంది. ఎర్రనికాడ–పల్చని రెక్కలు–లేత సువాసన. పారిజాతం అందంగా ఉంటుంది. అవి నేలరాలినప్పుడు చూట్టం, వాటిని ఏరటం సరదా. మా పారిజాతం చెట్టు మా కాంపౌండు బయటికి గూడా వ్యాపించింది. పూలు రోడ్డు మీద కూడా రాల్తాయి. వాటిని అంతా ఏరుకుపోతారు. అవీ మా చెట్టు పూలేగా అని నాకు గర్వం. శ్రీమతికి అది నచ్చదు. మన చెట్టుపూలు వేరే వాళ్ళెందుకు తీసుకోవాలి అంటుంది. అందుకు కొన్నాళ్ళు కాపలా కూడా ఉంది. ఇరుగు పొరుగు వాళ్ళతో తగాదా కూడా వచ్చింది. అయినా ఆ పూల మీద మమకారం వదులుకోలేదామె. చివరకు ఒక ఉపాయం కనిపెట్టింది. మా పాపను తెల్లారుజామున లేపుతుంది. పూలబుట్ట అందిస్తుంది. ఎవరూ లేవకముందే మా పాప పూలు ఏరి తెస్తుంది. పాపకుకూడా సరదాయే పారిజాతాలంటే!

ఒకనాటి తెల్లారుజామున పాప నన్ను లేపింది. "నాన్నా! కుక్క పిల్లలు పెట్టింది. ఎంత బావున్నా యనుకున్నావు! పారిజాతం చెట్టుకింద నాలుగు పిల్లలు పెట్టింది" అని నాలుగు వేళ్ళు చూపింది. నన్ను లాక్కెళ్ళింది. మా కాంపౌండు అవతల కుక్క పిల్లలు పెట్టింది. పిల్లలు ముద్దుగా ఉన్నాయి. రెండు నల్లగా ఉన్నాయి. ఒకటి నల్లగా ఉండి తెల్లని మచ్చలది. మరొకటి తలమీద పొట్టమీద నల్లగా ఉండి మిగతా తెల్లగా ఉంది. నాలుగు పిల్లలూ బావున్నాయి. అవి పారిజాతాల్లా ఉన్నాయి. వాటిమీద పారిజాతాలున్నాయి. తల్లికుక్క నన్ను చూచింది. చెవులు నిక్కపొడిచింది. లేచి నుంచుంది. గుర్రు మంది. దాని కళ్లు మెరుస్తున్నాయి. గుర్రుగుర్రు మంటూంది. అడుగు ముందుకు వేస్తే కొరికేస్తా నంటూంది. పాప నా చాటుకు చేరింది. నేను అడుగు ముందుకు వేయలేదు. పాప పారిజాతాలు ఏరలేదు. మేం లోపలికి వచ్చాం. శ్రీమతి గడప కడిగింది. పసుపు రాచింది. కుంకంబొట్లు పెడ్తూంది. అలాంటప్పుడు గడప దాటరాదు. దాటితే శ్రీమతి పులి అవుతుంది. అందుకు బయటనే నుంచున్నా.

"ఏవండీ! కుక్క పిల్లలు బావున్నాయి, సాదుకుందామా?" అర్థిస్తున్నట్లుగా అడిగింది బొట్లు పెట్టడం ఆపి, ముంజేతితో ముఖం మీది వెంట్రుకల్ను తొలగిస్తూ, ు ఎత్తి నావైపు చూస్తూ.

ఆవిడకు తెలుసు నా బలహీనత – అలా చూస్తే దేనికైనా వప్పుకుంటానని.

"అవున్నాన్నా! కుక్కపిల్లల్ని సాకుదాం." పాపకూడా అడిగింది - రెండు చేతుల్తో పూలబుట్ట పట్టుకొని తలెత్తి చూస్తూ.

నాకు కుక్కలంటే బొత్తిగా ఇష్టంలేదు. కాదు-గిట్టదు. వాటికి మనుషుల్ని మించిన విశ్వాసం ఎందుకుండాలి? కారణం అదని చెప్పలేను. కాని, కుక్కలంటే గిట్టదు. అవి కరుస్తాయి. కరిచే కుక్కలంటేనే కాదు, అసలు కుక్కలంటేనే గిట్టదు నాకు. కారణా లెందుకు? కుక్కలంటే నాకు గిట్టదు - అంతే.

శ్రీమతి చూపులకు ఓడిపోయాను. అవన్నీ చెప్పలేకపోయాను. "చూతాంలే" అని తప్పుకున్నాను. శ్రీమతి చిన్నబుచ్చుకున్నది. అది నాకు కాస్త బాధ కలిగించింది. ఆనాడు గేటుదాకా వచ్చి సాగనంపలేదు శ్రీమతి. ఏదో వెలితిగానే ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ నా మనసులో కుక్కపిల్లలే మసలుతున్నాయి చిన్న బుచ్చుకున్న శ్రీమతే కనిపిస్తూంది.

సాయంకాలం ఇంటికి వచ్చేవరకు శ్రీమతీ, పాపా గేట్లో నుంచుని ఉన్నారు. "చూశారా పాపం, కుక్కపిల్ల చచ్చిపోయింది. తల్లికుక్క కూర్చొని కన్నీరు కారుస్తూంది. ఏమిటో మమకారం!" నా గుండె కరిగింది. చూళ్ళేకపోయాను. ఇంట్లోకి వచ్చేశాను.

రాత్రి భోజనాలు చేస్తున్నాం. "నాన్నా! కుక్కపిల్లను సాదుకుందాం." మా పాప అంది. శ్రీమతి అనలేదు. అలా నావైపు చూస్తూ కూర్చుంది. వంకాయకూర చాలా బావుందన్నాను. శ్రీమతి మురిసిపోవాల్సింది. ఊహుఁ. అలాకాదే! గబగబా భోజనం ముగించింది. లేచిపోయింది. గ్రహించాను. తాను అడగలేక పాపతో అడిగించింది. అబ్బో! ఆ రాత్రి చాలా టెక్కు చేసింది. కంచిపట్టుచీర కొనిపెడ్తానన్నాను. తనకు పాల పిట్ట రంగుది కావాలంది.

పాప పారిజాతాలు ఏరడం మానేసింది. కుక్క ఉందిగా చెట్టుకింద. శ్రీమతికి సంతోషంగా ఉంది. ఎంచాతంటే, మరెవరూ పూలు ఏరుకపోవడం లేదు. నేను ఆఫీసుకు వెళ్ళేప్పుడు చూస్తాను. నలిగిన పారిజాతాల్లో పడి వుంటుంది తల్లికుక్క. మూడు పిల్లలూ పాలు తాగుతుంటాయి. పిల్లలు చాలా సతాయిస్తాయి. లాగుతాయి. కొరుకుతాయి. పీకుతాయి. ఎంత సహనం తల్లికి! కిక్కురుమనదు. అలాగే పడివుంటుంది, పాలన్నీ అయిపోయేదాకా! తల్లిని మించిన సహనం ఎవరికుంది?

ఒకనాడు ఇంటికి వస్తుంటే కుక్కపిల్లలు కనిపించాయి రోడ్డుమీద. అవి ఆటలాడుకుంటున్నాయి. దూరంగా పరుగులు తీస్తున్నాయి. దగ్గరకు వస్తున్నాయి. కొట్లాడుకుంటున్నాయి, పోట్లాడుకుంటున్నాయి. మళ్ళీ కరుస్తున్నాయి. కలుస్తున్నాయి. కుక్కపిల్లలు చూడ్డానికి బాగనిపించాయి. పిల్లలు అన్నీ బావుంటాయి. పెరిగినప్పుడు చూడాలి. తల్లి కుక్క ఎలా ఉంది ఎముకల పోగులా! అది జాతికుక్క కాదు. నాటుకుక్క.

సాయంకాలం ఇంటికి వచ్చాను, కాఫీ అందిస్తూ శ్రీమతి చెప్పింది రెండు కుక్క పిల్లలు చచ్చిపోయాయని. అవి కారు కింద పడ్డాయట. పాప మరీ వర్ణించి చెప్పింది, అవి కారుచక్రాల కింద పడడం– నలిగి చావడం. నా మనస్సు కలుక్కుమంది. కాఫీ తాగలేదు. గబగబా గేటు దగ్గరికి వచ్చి చూచాను. ఒకే

కుక్క పిల్ల ఒంగి కూర్చొని వుంది. తల్లికుక్క దాని పక్కనే కూర్చుంది. కన్నీరు కార్చడం లేదు – బహుశా ఎండిపోయి ఉంటుంది. దీనంగా, దుఃఖంగా నావేపు చూస్తోంది. నేను చాలాసేపు చూళ్ళేకపోయాను. ఇంట్లోకి వెళ్ళి సిగరెట్టు కాల్చాను. శ్రీమతి అదోలా చూచింది నన్ను. ఆవిడ చూపులు నాకు తెలుసు. ఆవిడ పెదవి ఎక్కువగా కదల్దు. చూపులే మాట్లాడ్తాయి! ఇప్పుడామె అంటున్న దేమంటే – కుక్కపిల్లలు చచ్చాయవి. ఆవిడ చూపులు చూడ్డం మానేశాను. పాప చూస్తోంది. పాప అచ్చం తల్లిపోలికే! "నాన్నా, కుక్క పిల్లను సాదుకుందాం" అంటూంది చూపుల్తో. నేను కాఫీ వదిలేశాను. కాని, మరో సిగరెట్టు కాల్చాను.

ఒకనాడు సినీమాకు వెళ్ళాం. సినీమా అయిపోయింది. ఏంబావుండలేదు. చెత్త. అయినా సినీమాలు చూడాల్సిందే. చూడ్డంతోనే విసిగిపోయాను. టాక్సీలో బయలుదేర్దాం. టాక్సీ డ్రైవరు కుర్రాడు. అతడూ సినీమా చూచాడు. హుషారుగా ఉన్నాడు. జోరుగా నడిపిస్తున్నాడు కారు. ర్యాష్ డ్రైవింగ్ – రెండుమూడు చోట్ల మనుషులకు పెట్టేవాడే. కాని, తప్పిపోయిరిది. శ్రీమతి దిగులు దిగులుగా చూస్తోంది, నాకు భయంగానే ఉంది. పాప నన్ను కరచి పెట్టుకొని కూర్చుంది.

కారు ఖర్రుమని ఆగింది. పెద్ద కుదుపు ఇచ్చింది. నాకేదో భయం అయింది. మనిషి చచ్చాడనుకున్నా. "ఏమైంది?" అడిగాను. "ఏం లేదు సార్, కుక్క" అని స్టార్ట్ చేస్తునే ఉన్నాడు డ్రైవర్. "ఆపు" అని గట్టిగా కేక పెట్టాను. డ్రైవర్ అదురుకొని ఆపేశాడు. డోరు తెరిచి దిగాం. చూస్తే తల్లికుక్క కడుపు మీదినుంచి కారు పోయింది. చితికింది. పేగులు బయట పడ్డాయి. కుక్కపిల్ల ఉరికి వచ్చింది. తల్లిచుట్టూ తిరుగుతూంది. తల్లికి ఇంకా కొన ఊపిరి ఉంది. అది నా వైపు దీనంగా చూస్తున్నది. జాలిగా చూస్తున్నది. కుక్కపిల్ల చూస్తున్నది. నావైపే చూస్తున్నది. నేను ఏడ్చాను. డ్రైవర్ని తిట్టేశాను. అతడు తలవంచుకున్నాడు. వెళ్ళిపోయాడు.

తల్లికుక్క చచ్చిపోయింది రోడ్డుమీద డొక్క చితికి.

కుక్కపిల్ల నా కళ్ళలో మసల సాగింది. ఏదో నాకు బాధ్యత ఉన్నట్లు ప్రవర్తించసాగింది.

తల్లికుక్క చూపులు గుర్తుకు వచ్చాయి. అది అలా ఎందుకు చూసింది? ఈ పిల్లను నీకు అప్పగిస్తున్నా అన్నది, ఇహ నీదే బాధ్యత అన్నది. అవును. అది నాకో బాధ్యత అప్పగించిపోయింది.

కుక్కపిల్లను చూచాను. ముద్దుగా ఉంది. తలమీద, పొట్టమీద నల్లని మచ్చలు. మిగతా తెలుపు. దాని కళ్ళు మెరుస్తున్నాయి. ఎందుకో అదంటే ముద్దు వచ్చింది నాకు. దాన్ని అందుకున్నాను. ఎత్తుకున్నాను. తల నిమిరాను.

శ్రీమతి కళ్ళు మెరిశాయి.

పాప తనకిమ్మని కుక్కపిల్లను ఎత్తుకుంది.

కుక్కపిల్ల సహితంగా నలుగురం ఇంటివైపు సాగాం.

★ ★ ★

# విశ్వాసం

మా ఇంటి ముందు ఒక మేడ వుంది. మేడంటే మేడ కాదు. అది ఒక కోట. అందులో లాన్స్ వున్నాయి గార్డెన్సున్నాయి.

మేడ చాలా అందంగా ఉంది. మాకు కనిపించేది రెండో అంతస్తు మాత్రమే. అది పగలంతా నిద్ర పోతుంది. రాత్రి మేల్కొంటుంది. అనేక కార్లు వస్తాయి. లైట్లు వెన్నెల్లా వెలుగుతాయి. జనసమ్మర్దం ఎక్కువగా ఉంటుంది.

మేడ గేటు సరిగ్గా మా యింటి ముందుంది. గేటు ముందు గూర్ఖా ఉంటాడు. గేటు ఎప్పుడూ మూసే ఉంటుంది. ఉదయం గేటు లోపల మూడు కుక్కలుంటాయి. అవి గేట్లో కూర్చుని ఉంటాయి. కుక్కలు బావుంటాయి. అందంగా ఉంటాయి. ఒకటి ఎత్తుగా వుంటుంది. చామనచాయ. దానికి బొచ్చుండదు. అది కుక్కలా ఉండదు. తోడేలులా ఉంటుంది. రెండోది పొట్టిగా ఉంటుంది. వంటినిండా బొచ్చు. కళ్ళమీద కూడా బొచ్చుంటుంది. అది నడిచినట్లుండదు. పాకినట్లుంటుంది. అది కుక్కలా ఉండదు. పిల్లిలా ఉంటుంది. మూడోది నల్లగా ఉంటుంది. బక్కగా ఉంటుంది. అది నడవదు, గంతులేస్తుంది. అది కుక్కలా ఉండదు. జింకలా ఉంటుంది.

రోజూ ఉదయం సుజాత మా గుమ్మంలో నుంచుంటుంది. మూడు కుక్కల్నీ చూస్తుంటుంది. అవి ముద్దుగా ఉంటాయి. ముచ్చటగా ఉంటాయి. కాట్లాడవు, కొట్లాడవు, దొరల్లా కూర్చుంటాయి, నుంచుంటాయి. అలా కొంతసేపుంటాయి. తరవాత ముగ్గురు మనుషులు వస్తారు. వాటిని తీసికెళ్తారు. అప్పుడు గాని సుజాత లోనికిరాదు.

సుజాతకు కుక్కలంటే ఇష్టం. సుజాత వచ్చింది. నా ముందు కూర్చుంది. చిరునవ్వు నవ్వింది. కళ్ళు పెద్దవి చేసింది. అదో రకంగా చూసింది. నాకు తెలుసు–ఆవిడ ఏదో అడగాలనుకుంటూంది. అది నాకు తెలుసు. నేను గమనించనట్లు నటించాను. పత్రిక చూస్తున్నాను.

"ఏవండీ!"

నేను పత్రిక పక్కకు పెట్టి చూచాను.

"చూడండి. ఎదుటింటి కుక్కలు ఎంత బావున్నాయో!"

నేను మాట్లాళ్ళేదు.

"మనం ఒక కుక్కను సాకుకుందామండీ!" ప్రాధేయపడినట్లు అడిగింది.

"పిచ్చి సుజాతా! కుక్కలూ, కారులూ–ఉన్నవాళ్ళకు. మనం సాకలేం."

సుజాత దిగ్గున లేచింది. ఆమెకు కోపం వచ్చింది. చరచరా లోనికి వెళ్ళిపోయింది. ఆమె కోపం జడలోకూడా కనిపించింది.

నవ్వుకున్నాను.

సుజాత కాఫీ కప్పు తెచ్చింది. టీపాయ్ మీద పెట్టింది. వెళ్ళిపోయింది. ఆమె బుసలు కొడుతూంది.

రోజూ మేం కలిసి కాఫీ తాగేవాళ్ళం. కబుర్లు చెప్పుకునే వాళ్ళం. ఎంతో ఆనందం ఒలికిపోయింది వెధవ కుక్కపిల్ల కోసం! మనసు మూలిగింది. కాఫీ తాగాను–వంటరిగానే. తప్పలేదు.

సుజాత తెలివైంది. రాత్రి అడిగింది. కుక్కలు మంచివికావు. కరుస్తాయి– ఎన్నో చెప్పాను. వినలేదు, అనేక అస్త్ర శస్త్రాలు ప్రయోగించింది. లొంగక తప్పలేదు. లొంగాను. నా బలహీనతలు తెలుసు సుజాతకు. గెలిచింది. ఆమె చిరునవ్వు నవ్వింది, చాలు. అందులో కొట్టుకు పోయాన్నేను.

కుక్కలంటే ఎందుకో నాకు ఇష్టం ఉండదు. కుక్కను తేవడం నాకు నచ్చదు. కాని ఇది సంసారం. సుఖంగా నడవాలంటే కాంప్రమైజ్ అవసరం. అందుకే ఒప్పుకున్నాను. కాని టలాయిస్తున్నాను. దేశంలో కుక్కలు లేవంటాను, ఆమె నమ్మదు. అవి ఖరీదయిన వంటాను. అయినా ఫరవాలేదంటుంది. అవి మంచివి కావంటాను. తాను బాగు చేస్తానంటుంది– నన్నేదో మరమ్మత్తు చేశానని ఆమె ధీమా.

నేను కుక్కను తేలేదు.

ఆమె పోరు మానలేదు.

ఒకనాటి ఉదయం ఒక కుక్కపిల్ల నేరుగా మా ఇంట్లోకి నడిచి వచ్చేసింది అప్పటికి నేనింకా లేవలేదు. చూసింది సుజాత. ఎగిరి గంతేసింది. కేకపెట్టింది. కుక్కపిల్లను ఎత్తుకుంది. పరిగెత్తి వచ్చింది. దుప్పటి లాగింది.

"చూడండి! కుక్కపిల్ల ఎంత ముద్దుగా ఉందో–సాదుకుందాం–ఇహ మీరు తేనవసరం లేదు." గుక్క తిప్పుకోకుండా అప్పచెప్పింది. సుజాత ముఖంలో ఆనందం ఆటలాడుతూంది.

వంటింట్లో పాలు పొంగి పోయాయి. పొంగిన చప్పుడు వచ్చింది. మాడు వాసన వచ్చింది.

"అయ్యో పాలు!" అని పరిగెత్తింది సుజాత, కుక్కపిల్లను నా వళ్ళో వదిలి.

కుక్కకూన నిజంగానే బావుంది. రంగు నలుపు. ముక్కు మీంచి, కళ్ళమధ్య నుంచి ముఖం దాకా తెల్లనిచార ఉంది. చెవుల కొసలు తెలుపు. ముందటి రెండు కాళ్ళ మొదళ్ళూ తెల్లగా ఉన్నయి. కళ్ళు వెలుగుతున్నాయి. ముద్దొచ్చింది.

సుజాత కాఫీ, పాలు తెచ్చింది. కుక్కపిల్లకు సాసర్లో పాలు తాగించింది. అప్పటిదాకా సుజాత కాఫీ తాగలేదు. సుజాత అనాడు ఎన్నో ముచ్చట్లు చెప్పింది. ఆమె గుండె గంతులు వేస్తూంది. కాఫీ చాలా రుచిగా ఉంది ఆ రోజు!

సాయంకాలం ఇంటికి వచ్చాను. సుజాత కుక్కపిల్లతో ముచ్చట్లాడుతూంది. కుక్కపిల్ల నన్ను చూచింది. ఆమె వళ్ళోంచి చెంగున దూకింది. తోక ఆడించింది. నా కాళ్ళల్లో తిరగ సాగింది. కాళ్ళు నాకుతూంది. నేను ఎత్తుకున్నాను. సుజాత ముఖం జిగేలుమంది. కాఫీ తేవడానికి లోనికి వెళ్ళింది. సుజాతను చూచాను.

నడకలో వయ్యారం ఉంది. జారు జడలో మల్లెల దండలు మస్తుగా తురిమింది. తెల్ల పడగ గల నల్లనాగులా ఊగుతూంది జడ. సుజాత కాఫీ తెచ్చింది. ఆమెలో కొత్త సొగసులు విచ్చుకున్నాయి. నాలో ఒకింత ఉద్రేకం కలిగింది. ఆమె చేతిలో కప్పులు! నా వడిలో కుక్కపిల్ల!!

సుజాత ఎదురుగా కూర్చుంది.

"లైకా" అని పిలిచింది.

కుక్కపిల్ల నా వడిలోంచి గంతు వేసింది. ఆమె దగ్గరికి వెళ్ళిపోయింది.

"పేరు పెట్టేశావన్నమాట–బావుంది."

సుజాత కళ్ళు నవ్వాయి. నొసలు నవ్వాయి. బుగ్గలు నవ్వాయి.

నిగ్రహం కోల్పోయాను.

కుక్కపిల్ల అక్కడే మెసులుతూంది.

లైకాను పక్కలో పడుకోబెట్టుకుందా మంటుంది. వద్దన్నాను. దానికి వేరే పక్క అమర్చింది.

సుజాత గేట్లోని కుక్కల్ని చూడ్డానికి పోవడంలేదు. ఆవిడకు అసలు తీరడంలేదు. లైకాకు స్నానంచేయించడం, పాలు తాగించడం, అన్నం తినిపించడం, తిప్పడానికి తీసికెళ్ళడం.

లైకా పెద్దది అయింది. అప్పుడు ఇంకా అందంగా మారింది. నేను ఆఫీసుకు వెళ్తుంటే సుజాతతో పాటు గుమ్మందాకా వస్తుంది లైకా. తిరిగి వచ్చేవరకు గుమ్మంలో నా కోసం కూర్చుంటుంది. తోకాడిస్తుంది. కాళ్ళల్లో తిరుగుతుంది. లైకా మా కుటుంబంలోది అయిపోయింది.

లైకా చాలా తెలివైంది. ఇంటిముందు వుంటే ఈగను కూడా రానివ్వదు. సుజాత ఏదైనా ఆరబోస్తే కాపుంటుంది. కాకిని వాలనివ్వదు. సుజాత మార్కెట్టుకు వెళ్తే వెళ్తుంది. పేరంటానికి వెళ్ళినా వెళ్తుంది. లైకాకేం లేదు. ఉండి పొమ్మంటే ఉండిపోతుంది. సుజాతకు తోచదు. వెంట తీసికెళ్తుంది. సినిమాకెళ్తే లైకా రాదు. ఇంటిముందే ఉండిపోతుంది. ఇంటికి తాళం వేయకుండా వెళ్ళినా ఫరవాలేదు.

ఒకనాడు ఆఫీసుకు తయారవుతున్నాను. సుజాత బయటి నుంచి ఉరికి వచ్చింది, రొప్పుకొంటూ.

"కుక్కల్ని పట్టుకెళ్తున్నారండీ!"

"అయితే మనకేం?"

"లైకానుకూడా పట్టుకెళ్తారేమోనండీ–భయంగా ఉంది. కాస్త వాళ్ళతో చెప్పండి."

"ఇంట్లో పెట్టరాదూ! నాకు ఆఫీసుకు టైమవుతుంది."

"ఏమండీ, ఇంకా చిన్నపిల్లనుకుంటున్నారండీ దాన్ని? కాస్త చెప్పిరాండి. పుణ్యం ఉంటుంది." కళ్ళల్లోంచి నీళ్ళు దుముకుతున్నాయి.

బయటికి వెళ్లి చూచాను. మున్సిపాలిటీ వాళ్లు కుక్కల్ని పడ్తున్నారు. బోను వ్యానులో కుక్కలున్నాయి. వాటిని చూశాను. నాకు భయం అయింది, లైకాను

పట్టుకెళ్తారని. వాళ్లకు చెప్పాను. వినలేదు. లైసెన్సు కొనమన్నారు. కొంటానన్నాను. దక్షిణ సమర్పించాను. మెత్తపడ్డారు. లైకాను చూపాను–పట్టవద్దన్నాను. వప్పుకున్నారు. లైకాను ఇంట్లోకి పంపించాను. ఆఫీసుకు వెళ్ళాను. అక్కడ ఫైళ్ళు కనిపించలేదు. బోనులో లైకా కనిపించింది. గుండె దడదడలాడింది, వెళ్ళిపోదామనుకున్నాను. ఏవో మీటింగులు–వదలలేదు. ఆనాడే ఆలస్యం అయింది.

ఇంటికి వచ్చాను. సుజాత నామీద పడ్డది. గొల్లుమంది. "లేదండీ. ఇహ లైకా లేదండీ. పోయిందండీ–పోయిందండీ!"

నా చేష్టలు ఉడిగాయి. ఓదార్చవలసినవాణ్ణి దుఃఖం ముంచుకొచ్చింది. భోరున ఏడ్చేశాను.

వంటల్లేవు. ఆకళ్లు లేవు. తలుపులు తెరచుకొని కూర్చున్నాం. లైకా వస్తుందని ఆశ!

ఇల్లు శ్మశానంలా ఉంది.

ఊపిరి బిగపట్టినట్లుంది.

కాలం గడవడంలేదు.

గోడదూకిన చప్పుడు–ఉరికాం.

లైకా వచ్చేసింది–తోక ఆడిస్తూ.

సుజాత పెద్దగా అరిచింది ఆనందంతో!

నేను లైకాను కావిలించుక్కూర్చున్నాను!

తెల్లవారి పండగ చేసుకున్నాం – లైకా వచ్చినందుకు. లైసెన్సు కొన్నాను లైకాకు. ఇహ లైకాకు ఢోకా లేదని నమ్మకం!

ఒకనాటి అర్ధరాత్రి బయట గొడవ విని లేచాను ఉరికాను. మేడముందు గుంపుంది. లైకా ఉరికివస్తూంది. దానికి తలమీద గాయం అయింది. రక్తం కారుతూంది. ఇంటికి తీసికెళ్ళాను. సుజాత ఏడ్చేసింది. అయొడిన్ వేసి కట్టుకట్టాం. చాలా రోజులు ఆస్పత్రికి తిరిగింది సుజాత. అప్పటికిగాని లైకా గాయం తగ్గలేదు.

ఆ రాత్రి బంగళాలో దొంగలు పడ్డారట. మేడలోఉన్న కుక్కలు అరవలేదు. లైకా చూచింది. దొంగ కాలుపట్టింది. దొంగ లైకాను కొట్టాడు. అది వదల్లేదు. వాడు మొత్తుకున్నాడు. గూర్ఖా లేచాడు. గస్తీ పోలీసు వచ్చాడు. జనం లేచారు. దొంగను పట్టేశారు. బంగళాలో వాళ్ళు లేవలేదు. వాళ్ళను లేపారు. దొంగను చూపారు. విషయం చెప్పారు. వాళ్ళు లైకాను మెచ్చుకున్నారుట!

ఆదివారం. ఇంట్లో ఉన్నాను. బంగళా గూర్ఖా వచ్చాడు. సలాం చేశాడు. సాబ్ పిలుస్తున్నారన్నాడు. వెళ్ళాను.

అది పెద్దగది. ఎర్రని తివాచీ పరచివుంది. సోఫాలున్నాయి. గది రమ్యంగా వుంది. ఒక నడివయసుమనిషి ఒక సోఫాలో ఉన్నాడు. అతని పక్కన ఒక యువతి వుంది. అందం రాసిపోసినట్లుందామె! అంటుకుంటే మాసిపోయేట్లుంది. ఆమె చిరునవ్వుతో స్వాగతం పలికింది. కూర్చోమంది. కూర్చున్నాను. ఆమె మాట్లాడింది–ఇంగ్లీషులో. మాట వీణ మీటినట్లుంది.

"మీ లెకా చాలా మంచిది."

నేను ఉబ్బిపోయాను. మాట్లాళ్ళేదు.

"మాకిచ్చేయ గూడదూ; మేం బాగా పోషించగలం."

నా గుండెలో చిచ్చు రగిలింది. మంచిది మాకు ఉండగూడదు. వారికే ఉండాలి. ఇదేగా వాళ్ళనుకునేది!

"అది మేం సాదుకున్నది. క్షమించండి. ఇవ్వలేం" అన్నాను సాధ్యమైనంత వినయంగా.

"ఉచితంగా కాదు...డబ్బు తీసుకోండి. వేయి ఇస్తాం – చాలా?" అతను పలికాడు కేసులోంచి సిగరెట్టు తీస్తూ.

"క్షమించండి, అది మా బిడ్డలాంటిది. అమ్ముకోలేం." పదాలు కరకుగానే వచ్చాయి. లేచి నుంచున్నాను వెళ్ళిపోవటానికి.

"ఆలోచించండి. తొందరేంలేదు. ఇంకాస్త ఎక్కువ కావాలన్నా ఇస్తాం." ఆమె అన్నది. ఆమె దయ్యంలా కనిపించింది.

నేను చరచరా ఇంటికి వచ్చేశాను. సుజాతకు చెప్పాను. ఆమె అగ్గికక్కింది. "డబ్బుంటే అన్నీ కొనొచ్చనుకుంటారు. ఛీఛీ" అన్నది.

ఆ వేసవిలో ఊరికి వెళ్లాల్సివచ్చింది. వారంలో తిరిగి వస్తాం, లైకాను ఎందుకు తీసికెళ్లడం అనుకున్నాం. పక్కింటి ఆవిడకు అప్పగించాము. చెప్పాల్సినవి అన్నీ చెప్పింది సుజాత. వెళ్లేప్పుడు సుజాతా, నేనూ లైకాను ముద్దుపెట్టుకున్నాం. టాటా చెప్పింది లైకా. వెళ్లాం.

వారంలో తిరిగివద్దాం అనుకున్నాం. కుదరలేదు. నెలదాకా తెమల్లేదు. ఏవో ఆపదలు వచ్చాయి. ఉక్కిరి బిక్కిరి అయిపోయాం. లైకా గుర్తుకే రాలేదు–తిరిగి బండి ఎక్కేదాకా!

రైలు దిగాం. లైకా కళ్లలో మసలింది. తోకాడిస్తూ వస్తుంది. కాళ్లు నాకుతుంది అనుకున్నాం. రిక్షాలో వస్తున్నంతసేపూ లైకాను గురించే మాట్లాడుకున్నాం.

రిక్షా ఇంటిముందు ఆగింది.

'లైకా' అనిపించలేదు.

బంగళా గేట్లోకి చూచాం–లైకా అక్కడుంది. దుక్కలా వుంది. సింహంలా వుంది. మమ్ము చూచింది. తోకాడించలేదు. బయటికి రావడానికి ప్రయత్నించలేదు.

సుజాతకు ఏడ్పు వచ్చేసింది.

గేటువంక చూచాను. గూర్ఖా లేడు. లైకాను వాళ్లు పట్టేశారనుకున్నాను. అయినా, మనది విశ్వాసంగల జంతువు. వచ్చేస్తుందనుకున్నాను. రిక్షా దిగాను. గేటు ముట్టుకున్నాను. మొరగసాగింది. గేటు తెరిచాను. లోన అడుగు పెట్టాను.

లైకా నా పిక్క పట్టింది–కరిచేసింది.

నేను కెవ్వున కేక పెట్టాను.

సుజాత రిక్షాలోనే పడిపోయింది–స్పృహ తప్పింది.

బంగళాలో యువతి బయటికి వచ్చింది. నన్ను బయటికి పంపించింది. గేటు మూసింది.

లైకా తోక ఆడించుకుంటూ ఆమె వెంట వెళ్ళిపోయింది.

# విలువల వలువలు

తెల్లవారింది. ఎండపొడ అప్పుడప్పుడే పడుతూంది. డాక్ బంగళా వరండాలో కూర్చున్నాను. ముందు లాన్ వుంది. ఆ తరువాత కాంపౌండు. లాన్‌లో పచ్చని పచ్చిక వుంది. బార్డర్లలో గులాబీ మొక్కలున్నాయి. గులాబీలు విరబూశాయి. అది చాలా పెద్దరకం గులాబీ. పసుపు పచ్చని గులాబీ బాగా విచ్చుకుంది. రేకులు ఊడిపడేట్లున్నాయి. రేకులమీద మంచు బొట్లున్నాయి-ముత్యాల్లా. నీరెండకు అవి తళతళ లాడుతున్నాయి. నాకు గులాబీలంటే ఇష్టం. ఇష్టంలేకున్నా ఇష్టం కలిగించేట్లుంది ఆ దృశ్యం. వాలు కుర్చీలోంచి లేచాను. లాన్‌లోకి వెళ్ళాను. విరబూసిన గులాబీని తెంపాను. మళ్లీ వరండాలోకి వచ్చాను. గులాబీ నా చేతిలో ఉంది. ముక్కు దగ్గర పెట్టుకున్నాను. వాసన చూశాను. బావుంది. అమాంతంగా నా దృష్టి గులాబీ కొమ్మమీద పడింది. దానికి పూవులేదు. అది బోడిగా ఉంది. అది మొండిగా ఉంది! ఎందుకో బాధనిపించింది. పూవు అక్కడ ఉండాల్సింది తెంపి తెచ్చాను. అందాన్ని చిదిమేసినట్లు అనిపించింది. తల్లినించి బిడ్డను వేరుచేసి నట్లనిపించింది.

ఆ కొమ్మ బోసిగా ఉంది. బోడిగా ఉంది.

ప్యూను టీ తెచ్చాడు పాట్‌తో. టీపాయ్ మీద ట్రే పెట్టి వెళ్ళిపోయాడు. నేను కప్పులో టీ కలుపుతున్నా. పక్కనే గులాబీ ఉంది. ఎదురుగా బోసిబోయిన కొమ్మ ఉంది. మనసు బావుండలేదు. ఎందుకో బాధగా ఉంది. టీ కప్పు అందుకున్నాను. టీ చప్పరిస్తున్నాను. టీ బావుంది. మనసు బావుండలేదు. టీ కప్పు ట్రేలో పెట్టాను. సిగరెట్టు వెలిగించాను. చిరుచలిగా ఉంది. చాయ్ తరవాత సిగరెట్టు హాయిగా ఉంటుంది. నాకెందుకో అంత హాయిగా లేదు. టీపాయ్‌మీద గులాబీపూవు! అక్కడ లాన్‌లో బోసిపోయిన గులాబికొమ్మ!!

గేటుదగ్గర జవాను ఎవరినో అటకాయిస్తున్నాడు. ఆడమనిషిలా ఉంది. బతిమి లాడుతుంది. బామాలుతూంది. వినడంలేదు జవాను. "దొర ఇప్పుడు ఎవరినీ చూడరు, ఇంకా లేవలేదు" – ఇలాంటి అబద్ధాలన్నీ చెపుతున్నాడు. జవాన్ని పిలిచాను. వచ్చిన వారిని పంపించమన్నాను.

ఆడమనిషి వచ్చింది. నా ముందు నుంచుంది – అంటే అరుగుకింద – లాన్‌లో. ఆమె అరుగంత ఎత్తులేదు–పొట్టి. నల్లగా వుంది, జీడిగింజలా. నడివయసు మనిషి. ముఖాన ముడతలున్నాయి. దవడలు పీక్కుపోయాయి. కళ్ళు లోతుగా ఉన్నాయి. వెంట్రుకలు మాసివున్నాయి. చిందర వందరగా ఉన్నాయి. ముడికట్టింది. కాని, వెంట్రుకలు మాట వినడంలేదు. పుక్కిట పాన్ ఉంది. పళ్ళు గారబట్టి ఉన్నాయి. మెడలో వెండిగొలుసుంది. రవిక లేదు. పయట ఉంది. చీర కాసెబోసి కట్టింది. మురికిగా వుంది.

ఆమె నా ముందు నుంచుంది.

నేను సిగరెట్టు ఆర్పేశాను–ఆమెను వినడానికి.

"నా బిడ్డనిప్పించుండి దొరా! నీ కాల్మొక్త. బాంచనయిత – నీ కడుపున పుడ్త" అని అరుగును పట్టుకొని దండం పెట్టసాగింది.

టీపాయ్‌మీద గులాబీ ఉంది. లాన్‌లో బోసిపోయిన కొమ్మవుంది.

ఆమె మాట్లాడుతుంటే గారపట్టిన పళ్ళు బయట పడ్తున్నాయి. నోట్లోంచి తుప్పిళ్ళు రాలుతున్నాయి.

"బిడ్డను అమ్ముకున్నం. కడుపుదొరా! కడుపు. ఇది శాన చెడ్డది. ఎన్ని పన్లన్నా చేయిస్తది. ఆకలికి ఆగలేక పోయినం. ఏం చెయ్యమంటవు? కరువొచ్చింది. కరువంటే ఇసొంటసొంటి కరువనుకున్నావా? బువ్వ కాదు, నీలు కూడ దొరక్కపాయె. కడుపు మండిపోతోంది. కూళ్ళు లేవు. రాళ్లుకొట్క బతుకుతం. బాంచను. కూటికే కరువాయె, కూలెవడిస్తడు? పది దినాలు ఉపాసం ఉన్నాం. బాంచను. నేను, మా అయన. మా అయన చచ్చిండు ఈ మద్దెన. రాయి కొట్టబోయిండు. పాం కరిసింది. పానం ఇడిసిండు. ఇన్నావా దొరా! దిక్కులేని దాన్నయిన. అయన్ను కొంచపాయె దేవుడు–నన్నెందుకు కొంచపోడు–ఆడి నోట్లో మన్నుపడ" అని చేతులెత్తి ఆకాశం మీద దుమ్ముపోసినట్లు చేసింది. ఎప్పుడు చనిపోయాడో కాని, ఇప్పుడే తనముందే చనిపోయినట్లు విలపించసాగింది. ఆమె దుఃఖం మూర్తీభవించినట్లున్నది. పైట కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది.

"మా అయన చచ్చిండా. పోరడుకూడ లేడు, బాంచను. వాన్నిప్పించుండి–నీ కాళ్ళమీద పడ్త–నీ బాంచనయిత – కడుపున పుడ్త" – చెప్పకుపోతూనే వుంది. అసలు విషయం చెప్పదు. ఏడుస్తుంది–తల బాదుకుంటుంది.

"పోరనికి ఏమైంది? ఎక్కడి కెళ్ళాడు? అసలు విషయం చెప్పు" అన్నాను.

టీపాయ్‌మీద గులాబీ వుంది.

లాన్‌లో బోసిపోయిన కొమ్మ వుంది.

"అవుదొరా! అసలుకత చెప్పకపోతిని. పోయిన పెద్దాయన యాదికొచ్చె. అన్ని మరిస్తిని. మాకున్న రోగమే ఇది. కావల్సింది చెప్పకోలేం. అటెన్క ఏడ్చిచస్తం. ఇగ ఇనుమరి. కరువొచ్చిందని చెప్పిన్నా. పది దినాలు ఉపాసాలుంటిమి. ఆలుమగలం సరే. పోరడున్నడు. ఏడ్వబట్టె మొత్తుకోబట్టె బువ్వలేదాయె, పది దినాలాయే. పానం అన్నపట్టిందీ. పోరడు చచ్చెటట్లున్నడు. నేను ఏడిస్తిని. పాన మేడిది, ఏడ్వటానికి! పోరడు చస్తడేమోనని బుగులుపట్టింది. నా పానం తీస్కోని సోలెడుగింజలియ్యమంటిని. పానం ఎవడికి కావాలె దొరా! పానానికి పైసలొస్తయా! సోలెడు గింజలియ్యకపాయె దొరా! మా పానాలు కరీదు ఎంతో ఇన్నవా? కన్నవా? పోరడు నా ముంగల్నె చస్తున్నడు. ఎట్ల చూడాలె. తల్లి కడుపు బాంచెను. తరక్కపోతాంది. ఏంచెయ్యమంటరు చెప్పండి? పోరణ్ణి అమ్ముకున్నం దొరా! పోరణ్ణి అమ్ముకున్నం, మా కడుపులు నింపుకున్నం."

మాతృ హృదయం పొంగింది. దుఃఖం కట్టలు తెంచుకుంది. హోరుమని ఏడ్చేసింది ఆ తల్లి! కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది. ఎక్కెక్కి ఏడుస్తోంది. తల బాదుకొని ఏడుస్తోంది.

సిగరెట్టు కాలుద్దామని ప్యాకెట్‌లోంచి తీశాను. మళ్ళీ లోపలికి నెట్టేశాను.

ఎందుకో చెప్పలేను. నా కళ్ళు చెమ్మగిల్లాయి. గుండెలు అవిసిపోయేట్లు ఏడుస్తూంది తల్లి. దస్తీతో కళ్ళు తుడుచుకున్నాను, పక్కకు చూచాను. ఫ్యూన్ నుంచున్నాడు. అతని కళ్ళూ ఆర్ద్రంగా ఉన్నాయి. ముందుకు చూచాను. జవాను నుంచుని ఉన్నాడు. అతని కళ్ళల్లో బాధ గూడు కట్టుకొని వుంది.

ఆకలి ఎంత చెడ్డది!

బిడ్డను అమ్ముకునేట్లు చేసింది! అనుకున్నాను.

"అవును, ఎవరికి అమ్మావు? ఏమిటి చెప్పు, నీ బిడ్డను నీకిప్పిస్తాం" అని ఆమెను ఓదార్చాను.

"ఇప్పిస్తరా దొరా! ఇప్పిస్తరనే ఈడికొచ్చిన. మీరు దరమదొరలు. నా పోరణ్ని ఇప్పించండి. నీ కడుపున పుడ్త. పోరణ్నిప్పించండి. కూలినాలి చేసి పెడ్తడు. నాకేం చేతనయితలేదు" అని కాళ్ళు పట్టుకుంది. పిల్లవాణ్ణి విడిపిస్తానన్నప్పుడు ఆమె కళ్ళల్లో వెలిగిన వెలుగు చూడాలి!

"ఎవరికి అమ్మావు, ఏమిటి? అసలుకథ చెప్పవు-ఎట్లా?"

"అయ్యో! అది చెప్పకపోతిని! మా అలొగాజనం అంతే! ఎటువస్తే అటె కొట్టుకపోతం. అసలుసంగతి ఎరకచేసుకో. పోరణ్ని కొంటనన్నాడు ఎంకటయ్య. పట్కపోయిన ఎంకటయ్య కాడికి. పోరడు బువ్వకోసం మొత్తుకుంటాడు. ముందర బువ్వపెట్టమన్నం. పోరనికి ఎంకటయ్య బేరం తెంపమన్నాడు. ముప్పయి రూపాయ లిస్తనన్నడు. పోరణ్ణి ఇడిచి పొమ్మన్నాడు. ఈ ఊళ్ళ ఉండొద్దన్నడు. మళ్ళ ఇటు రావద్దన్నడు. వప్పుకున్నముండి అలు మగలం. ఎంకటయ్య ముప్పయిచ్చిండు. పోరనికి బువ్వపెట్టింది. పోరడు బువ్వమీద పడ్డడు, పుల్లిస్తరాకు మీద కుక్కపడ్డట్టు. అడు అమ్మను చూడడాయె.....అయ్యను చూడడాయె-అన్నాన్నే చూస్తాండె, ఎంకటయ్య ఎల్లి పొమ్మనె. పోరడు బువ్వ తింటాంటె మేం బయట పడ్డముండి. మల్ల కళ్ళపడడాయె పోరడు!" అని మళ్ళీ ఏడ్పు లంకించుకుంది.

ఆకలి ఎంత చెడ్డది!

తల్లినీ, తండ్రినీ కూడా వదులుకుంది!!

నేను డ్రైవరుతో చెప్పాను కారు తెమ్మని. ఆమెను ఓదార్చాను. బిడ్డను ఇప్పిస్తానన్నాను. నా వెంట రమ్మన్నాను. ఆమె నన్ను అనుసరించింది. నేను గేటువైపు నడుస్తున్నాను. వెనక్కు చూశాను!

టీపాయ్ మీద గులాబీ ఉంది.

లాన్‌లో బోసిపోయిన కొమ్మ ఉంది.

మా కారు వెంకటయ్యగారి గేట్లో ప్రవేశించింది. వెంకటయ్యగారి లోగిలి చాలా పెద్దది. ఒకపక్క ఇల్లు, మరోపక్క కొట్టం - మధ్యన బోలెడు ఖాళీస్థలం ఉంది. అప్పుడే తెల్లవారింది. కొందరు ఊడుస్తున్నారు. కొందరు కసవు ఎత్తుతున్నారు. వెంకటయ్యగారు వేపచెట్టుకింద నుంచొని పుల్ల తెంపిస్తున్నారు. కారు చప్పుడు విన్నారు. ఇటు చూచారు. కారు కనిపించింది. నేను కనిపించాను. మరేమీ కనిపించలేదు వారికి. ఉరికి వచ్చారు.

"కలెక్టరుగారా! అయ్యొ, అయ్యొ, చెప్పితే వచ్చేవాణ్నిగా మీరెందుకొచ్చిన్రు?" అని కారుడోర్ తెరిచాడు.

"ఏం, మేం రాగూడదా మీ ఇంటికి?" అన్నాన్నేను.

"ఎంతమాట, ఎంతమాట" అని క్షణంలో అనేక పురమాయింపులు చేశాడు. మొత్తం లోగిలి ఊపిరి బిగపట్టి నన్ను చూసింది. క్షణంలో చైతన్యం వచ్చింది. అంతా అటూ ఇటూ ఉరికారు. వసారాలో కుర్చీలు వేశారు. కూర్చున్నాం. వెంకటయ్యగారు ఇంకా ఏదో హడావిడి చేస్తున్నారు. ఇంకా టీ రాలేదు. నేను సిగరెట్టు వెలిగించాను. అగ్గిపుల్ల అర్పుతూ తల్లిని చూపాను వెంకటయ్యగారికి.

తల్లి కారు దిగింది. ఒకసారి మొత్తం కలియజూసింది. ఆమె బిడ్డలేనట్లున్నాడు. నేలమీద గొంతు కూర్చుంది. రెండు చేతులతోనూ తల గోక్కుంటూంది.

"గుర్తించారా ఈమెను?" అడిగాను.

"లేదే. ఎవరు? మీవెంట వచ్చిందా?" వెటకారం ధ్వనించింది వెంకటయ్యగారి స్వరంలో.

"నేనుండి. మా పోరణ్ణి అమ్మితింగద కరువుల."

"ఓహో నువ్వా! వీరిగాని తల్లివన్నమాట. నీ మగడెటుపాయె, ఒక్కదానివె వచ్చినవు?"

"ఆయన చచ్చిండు పాం కరిసి. నేనిట్లయిన. పోరణ్ణి ఇస్తరేమో ఆసర అయితడని వచ్చిన."

వెంకటయ్యగారు నా ముఖం చూచాడు.

"మీరు వీళ్ళబ్బాయిని కొన్నారటగా?" అడిగాను సూటిగా వారి కళ్ళల్లోకి చూస్తూ.

టీ వచ్చింది. కప్పు నా చేతికి అందిస్తూ అన్నారు, "పుణ్యం చేయబోతే పాము కరిచిందని సామెత ఉంది కలెక్టరుగారూ! ఆ కరువులో నేను వీళ్ళకు డబ్బివ్వకుంటే, వీరిగాడికి తిండి పెట్టకుంటే వీళ్లు ముగ్గురూ చచ్చివుండేవారు. ఇప్పటికి వాళ్ళ పేర్లుకూడా ఉండేవికావు. ఆకలితో చస్తుంటే వీరణ్ణి నాకు అప్పగించిపోయారు. కొనడం ఏమిటి? ఏమన్నా పశువా కొనడానికి? ఇప్పుడు వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది నేను. తీసుకుపోతానని వచ్చింది తల్లి! మీరే చెప్పండి న్యాయం" అన్నారు వెంకటయ్యగారు.

తల్లి లేచినుంచుంది. ఏదో అనబోయింది. నేను వారించాను.

"వెంకటయ్యగారూ! మీరు వీరణ్ణి పెంచి పోషించారు. నిజం. ఇంతకాలం వాడితో పనిచేయించుకొన్నారు. సరిపోయింది. వీరణ్ణి తల్లికి అప్పగించడం న్యాయం. బిడ్డను తల్లినుంచి వేరుచేయడం ఏమంత మంచిదంటారు?"

వెంకటయ్యగారు మాట్లాళ్ళేదు.

నేను మాట్లాళ్ళేదు.

తల్లి మాట్లాడలేదు.

మౌనం వెలిసింది.

చీమ చిటుక్కుమంటే వినిపించేట్లుంది.

"కలెక్టరుగారూ!" మౌనాన్ని భంగం చేశారు వెంకటయ్యగారు. "మీరు చెప్పింది న్యాయం. అవును, ప్రభుత్వం మీది. కాదనడానికి మేమెంతవాళ్ళం? కాని, ఒకటి

ఆలోచించండి. ఈమె వాణ్ణి కన్నది. ఆకలికి అమ్ముకొన్నది. వెళ్ళిపోయింది. మేం పెంచి పెద్దచేశాం. పెంచిన అనుబంధం ఉంటుందంటారా?"

ప్రశ్న సూటిగా ఉంది. వెంకటయ్యగారి ధ్వనిలో ఆర్ద్రత కూడా వుంది. నేను ద్వివిధలో పడ్డాను.

"చట్టం అన్నిటికంటె గొప్పది. శాసనం గుర్తించిందే న్యాయం. కాదంటారా?" అడిగాన్నేను.

"కాదనను. అక్కర్లేదని అమ్ముకొని పోయిన బిడ్డను ఇప్పించడానికి వచ్చారు. సరే కానివ్వండి."

ఇంతలో ఒక కుర్రాడు వచ్చి గుంజకు అనుకొని నుంచున్నాడు. 12, 13 ఏండ్లుంటాయి. ఎర్రగా వున్నాడు. బలంగా వున్నాడు. తనకంటే పెద్ద చొక్కా తొడుక్కున్నాడు. అది అక్కడక్కడా చిరుగులు పట్టింది. చొక్కా పొడుగుండడాన వేసుకున్న నిక్కరు కనిపించడంలేదు. అతడు నన్ను చూస్తున్నాడు. తల్లిని చూస్తున్నాడు. మరేమీ గమనించినట్లు లేదు.

"అరే!" గుంజకు అనుకున్న కుర్రాణ్ణి సంబోధించాడు వెంకటయ్యగారు – "ఆ ముసల్దాన్ని గుర్తుపట్టావురా?" అడిగాడు.

లేదన్నట్లు తల ఊపాడు.

"మీ అమ్మరా" అన్నాడోలేదో "అమ్మా!" అని ఉరికాడు వీరడు. తల్లి కొడుకును పెనవేసుకుని కన్నీరు కార్చింది. తల్లీ కొడుకులు భోరున ఏడ్చారు.

మేం చిత్తరువుల్లా చూస్తున్నాం. మా కళ్ళు చెమ్మగిల్లిన సంగతి మేమిద్దరం గమనించలేదు.

దుఃఖం గాని, ఆనందంగాని ఎంతోసేపు ఉండదు. తల్లీ కొడుకులు స్థిమితపడ్డారు.

"వీరా! మీ అమ్మ వచ్చింది. ఇహ మీ అమ్మ వెంట వెళ్ళిపో, మీ దొర చెపుతున్నాడు" అన్నాన్నేను.

వీరడు తల్లిని విడిపించుకున్నాడు. గుంజ దగ్గరికివచ్చి నుంచున్నాడు. కదలడు, మెదలడు, ఉలకడు, పలకడు.

నేను బిత్తరపోయాను. తల్లి వెంట పొమ్మంటే దూరంగా పోతాడు!

"పోరా! మీ అమ్మ వచ్చింది, వెళ్ళు" అన్నారు వెంకటయ్యగారు.

"పోను. నాకాడ బువ్వ దొరకదు" అని గుంజను గట్టిగా పట్టుకున్నాడు. ఎవరైనా లాక్కుపోతారేమోనని.

తల్లి చేతులెత్తి సాపిస్తోంది కొడుకును.

తనను పోషించేవారు లేరనీ–వచ్చి పోషించమనీ.

నా తల గిర్రున తిరిగింది.

విలువల వలువలు ఊడిపడ్డాయి – విలువలు దిసమొలతో గోచరించాయి.

అన్నం అనురాగం కంటే గొప్పది.

అర్థం అనుబంధాన్ని మించింది.

బంగ్లాకు తిరిగివచ్చాను. మనసు అదోలా ఉంది. మెదడు పిచ్చిపిచ్చిగా ఉంది.

గులాబీ వాడిపోయింది.

కొమ్మకొన ఎండిపోయింది.

★ ★ ★

# చదువు

ఎంకటికి కడుపులో పేగుల్లేవు. వంట్లో కండలేదు. కళ్ళలో వెలుగులేదు. చెంపల్లో నునుపులేదు. అయినా బతుకుతున్నాడు. అంతేకాదు పనిచేస్తున్నాడు.

ఎంకటిని డాక్టర్లు చూడలేదింతవరకు. చూసి ఉంటే ఆశ్చర్యపడిపోయేవారు. అతను వయసుకు తగిన ఎత్తులేదు–బరువు లేదు. అతని ఆహారంలో విటమిన్లు లేవు. ప్రోటీన్లు లేవు. అసలు ఆహారం లేదు. ఆశ్చర్యం కాదూ మరి డాక్టర్లకు–అతను జీవిస్తున్నందుకు! అంతేకాదు, పని చేస్తున్నందుకు!

ఎంకటి పెద్దవాడు కాదు. పసివాడు. పదేళ్ళవాడు. పాలబుగ్గలతో ఉండాల్సినవాడు. బడిలో చదువుతూ ఉండాల్సినవాడు. ఆటలలో పోటీ పడాల్సినవాడు. స్నేహితులలో తిరగాల్సినవాడు. తలిదండ్రుల గారాబం నోచుకోవలసినవాడు.

ఎంతటి భావి భారత పౌరుడు! సామాజిక శాస్త్రజ్ఞులు అతణ్ణి చూడలేదు. చూస్తే చెప్పేవారే అతను సమాజానికి భారం అవుతాడని. నేరాలు చేసి జీవిస్తాడని. మరొకర్ని బతకనివ్వడని. తాను బతకడని!

ఎంకటి పదేళ్ళకే సకల బాధ్యతలూ నిర్వహిస్తున్నాడు. ఎంకటి ఎదగలేదు. ఎదగడానికి తిండిలేదు. పొట్టిగా, కురచగా ఉంటాడు. ఎంకటి వంట్లో కండ లేదు. కండ పెరగడానికి తిండిలేదు. ఎంకటి బక్కగా ఉంటాడు. ఎముకలకు చర్మం తొడిగినట్లుంటాడు. అతనికి డొక్క ఉన్నట్లు కనిపించదు. అది లోతుగా వెళ్ళిపోయింది. వీపుకు అంటింది. బహుశా వెన్నూ డొక్కా ఒకటేనేమో అనిపిస్తుంది. అతని వంటిమీద బట్టలుండవు. నడుముకు ఒక నిక్కరుంటుంది. అది అతనిది కాదని చూస్తేనే తెలిసిపోతుంది. తలకు ఒక చింపిరి గుడ్డ చుట్టుకుంటాడు. తలమీది వెంట్రుకలు ఎర్రగా ఉంటాయి. కళ్లు పీక్కుపోయాయి. ఎండిన చెరువుల్లా ఉంటాయి. చెంపల్లో మాంసం లేదు. డొక్కుపోయి ఉంటాడు అతని ముక్కు పెద్దది.

ఎంకటి దొరకు బానిస. దొర లెక్కడున్నారని మీ రడగొచ్చు. నైజాం నవాబుతోనే పోయారని మీ అభిప్రాయం కావచ్చు. మీరు పొరబడ్డారు. చాలామందికి వలెనే మీకూ వాస్తవాలు తెలియవు. దొరతనాలు పోయినాయి. దొరలు పోలేదు. బానిసలు ఇంకా ఎక్కడున్నారని మీకు భ్రమ కలుగవచ్చు. బానిసత్వం పోయింది. బానిసలు పోలేదు.

ఎంకటి దొర పశువులను కాస్తాడు. ఉదయమే వస్తాడు. పేడ తీస్తాడు. పశువుల పాలు తీస్తాడు. కసవు ఊడుస్తాడు. పశువులను విప్పుతాడు. పగలంతా అడవిలో కాస్తాడు. సాయంకాలం వాటిని తోలుకుని వస్తాడు. కట్టేస్తాడు. మేత వేస్తాడు. పాలు తీస్తాడు. నీళ్ళు తోడ్తాడు. కుడితి కలుపుతాడు. తాగిస్తాడు. పాలు పిండుతాడు. ముగ్గుతో లాంతర్లు తుడుస్తాడు. వెలిగిస్తాడు. ఇంటికి పోతున్నట్లు దొరకు చెపుతాడు.

దొర మిగిలిన పనులు పురమాయిస్తాడు. అప్పుడు తలగుడ్డ విప్పి నేలమీద పరుస్తాడు ఎంకటి. దొర సోలెడు గింజలు అందులో పోస్తాడు. అప్పుడు ఇంటిదోవ పడ్తాడు ఎంకటి.

ఎంకటికి జీవితం లేదు—అతడు గానుగ ఎద్దు—కాదు – గానుగదూడ. దూడల్ని గానుగలకు కట్టరు. గమనించండి. మనుషులకు ఆ సూత్రం వర్తించదు.

ఎంకటి మనిషి!

ఎంకటి ఒకనాడు లాంతర్లు తుడిచాడు. వెలిగించాడు దొర ఆదేశించాడు. ఎంకటి లాంతరు పట్టుకున్నాడు. లాంతరు వెలుగుతుంది. ఎంకటి చీకట్లో ఉన్నాడు. చీకటీ వెలుగూ నడిచాయి. గదిలో ప్రవేశించాడు. గదిలో బల్ల ఉంది. రెండు కుర్చీలున్నాయి. ఒక కుర్చీమీద దొర కొడుకు కూర్చున్నాడు. ముద్దుగా వున్నాడు. బొద్దుగా వున్నాడు. మరో కుర్చీలో పంతులు కూర్చున్నాడు. బల్లమీద పుస్తకం వుంది. బల్లమీద లాంతరు పెట్టాడు ఎంకటి. వెలుగొచ్చింది. పంతులు చెపుతున్నాడు. దొరబిడ్డ చదువుతున్నాడు.

ఎంకటి చూస్తున్నాడు. వింటున్నాడు.

"చదువులో సకలం వుంది. చదువు నేర్చినవాడు గొప్పవాడు కావచ్చు. విద్య లేనివాడు వింత పశువు."

ఎంకటి తదేకంగా వింటున్నాడు. తన్మయుడై వింటున్నాడు. ఏకాగ్రంగా వింటున్నాడు. అతనికి బాహ్యప్రపంచం తెలియడం లేదు. దొర వచ్చి గద్దించేదాకా అతడీ లోకంలో లేడు. దొర తరుముతే బయటపడ్డాడు.

ఎంకటి గుడిసెకు చేరుకున్నాడు. కుక్కి మంచంలో తీసుకుంటూంది తల్లి ముత్తమ్మ. ఇంట్లో దీపం మిణుకు మిణుకు మంటూంది. అవి ఏవీ గమనించలేదు వెంకటి.

"అవ్వా! చదువుకుంటానే" అన్నాడు.

ఆ మాటల్లో ఆర్తి వుంది, ఆరాటం ఉంది, తపన ఉంది.

అవేవీ గమనించలేదు, ముత్తమ్మ. ముత్తమ్మమీద పిడుగు పడ్డట్లయింది.

"నీ కేమన్న పోయెకాలం వచ్చినాదిర! మీ తాత చదివిండా? మీ అయ్య చదివిండా? మనం బాంచోళ్లం బిడ్డా! బాంచోళ్ళంగానే బతకాలె. నువ్వు సదువుకుంటవ్ – బాగానే వున్నది. నా గొంతుల గంజెవడు పోస్తడు? దొర గొడ్లనెవడు కాస్తడు?"

"అవ్వ! దొరకొడుకు చదువుకుంటాండె. నాకు సదవాల్నని ఉన్నది."

"కొడకా! దొరలెక్కడ? మన మెక్కడ? దొరలు దొరలే–బాంచలు బాంచలే–గింజలెత్తెచ్చినవా?"

వాస్తవంగా గింజలు తేలేదు ఎంకటి. వెనక్కు ఉరికాడు గింజలకోసం. మళ్లీ గదిలో చూచాడు. పంతులు చెప్తాతున్నాడు దొర కొడుకు చదువుతున్నాడు. ఎంకటి ప్రాణం తప తప కొట్టుకుంది. దొర గద్దించాడు మళ్లీ. గింజలు పోశాడు తల గుడ్డలో. గింజలు తీసుకొని బయల్దేరాడు ఎంకటి. ఎంకటికి గింజల ఉత్సాహం లేదు. చదువు వినలేదని బాధ ఉంది.

బువ్వతాగి తల్లీ కొడుకులు ముడుచుకున్నారు. ఎంకటికి నిద్రపట్టడంలేదు. పంతులు చదువుచెపుతున్న దృశ్యం, దొరబిడ్డ చదువుతున్న దృశ్యం వెంటాడుతున్నాయి.

"అవ్వా, సదుకుంటే ఏమైతది?"

"దొర నీ పానాల్తీస్తడు. మీ అయ్య దొరకు నిన్ను అమ్మిండు. నీ పానం దొర చేతులున్నది. ఇన్నావా? నువ్వు చచ్చినంక నేనాడ బతుకుత?" ముత్తమ్మ ఖంగు ఖంగున దగ్గింది. విలవిల్లాడింది. ప్రాణంపోయి మళ్ళీ వచ్చినంత పనయింది.

ముత్తమ్మకు క్షయ. అలా అని వాళ్లకు తెలియదు. వైద్యశాస్త్ర పురోగతి పట్నాలుదాటి పయనించదు. ముత్తమ్మకు తెలిసింది అది మాయదారి రోగమని, ఎప్పుడో ఎత్తుకుపోతుందని.

ఎంకటికి ఆరాత్రి నిద్రపట్టలేదు. పంతులు చదువు చెప్పడం – దొర బిడ్డ చదువుకోవడం. తల్లి పిచ్చిదనుకున్నాడు. తాను చదువుకుంటే దొరకేం నష్టం? దొరను అడుగుదాం అనుకున్నాడు. దొర వప్పుకుంటాడనే అతని భ్రమ.

తెల్లవారింది. మామూలు కార్యక్రమాల్లో మునిగిపోయాడు. సాయంకాలం అయింది. ఎంకటి లాంతర్లు తుడిచాడు. ముట్టించాడు. లాంతరు పట్టుకొని దొరముందు నుంచున్నాడు. తల వంచుకున్నాడు. ఏదో అడగా లనుకుంటున్నాడు. అడగలేకపోతున్నాడు.

"ఏందిర, ఏమో నసుగుతున్నావు. ఏడవరాదు" అన్నాడు దొర సిగరెట్టు వెలిగించుకుంటూ.

"దొరా. నేన్సదుకుంట."

"ఓర్లంజకొడుకు చదువుకుంటడటనే!" అని గొల్లుమని నవ్వాడు దొర. "చదువుకొని దొరతనం చేస్తావుబే, ఫో – ఫో. లాంతరాడ పెట్టిరా పో. ఇంట్ల మీ అవ్వ చస్తది" అన్నాడు.

ఎంకటి అక్కడ్నించి కదల్లేదు.

"చెప్పితే ఇనపడ్తలేదు – పోరా గాడ్దీ కొడక! పంతులొచ్చుంటాడు."

"దొరా! నాకు సదుకోవాల్నని ఉన్నది."

దొరా ఉగ్రుడయి పోయాడు. "నీ యవ్వ, చదువుకుంటావు గాడ్దీ కొడక" అని కర్ర అందుకొని బాదేశాడు ఎంకణ్ణి దొర. ఎంకడి చేతిలోని లాంతరు నేలమీద పడింది. పగిలిపోయింది. ఎంకడి వళ్లు పేలిపోతూంది. గదిలో కూర్చున్న పంతులు ఉరికి వచ్చాడు. దొరకొడుకు వచ్చాడు. దొర్సాని వచ్చింది.

ఎంకడి వళ్ళు చిట్లింది. రక్తం కారుతూంది.

"అదేంది పోరని పానం తీస్తవా? వాడు చస్తే మనమీది కొస్తది" అన్నది దొర్సాని.

కర్ర విరిచి పారేశాడు దొర. "లంజకొడుకు! చదువు కుంటడట చదువు" అని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఇంట్లోకి వెళ్లిపోయాడు దొర.

ఎంకటి ఏడవలేదు. గాయాలతోనే లేచాడు. మెట్లు దిగాడు. చీకట్లో వెళ్ళిపోయాడు.

"సార్! నాయనెందు కొట్టిండు ఎంకణ్ణి?"

దొర కొడుకు అడిగాడు.

"ఎంకటి చదువుకుంటనన్నడట."

"మరి నేను చదువుకుంటున్న గద?" అని పసివాని అమాయక ప్రశ్న. పంతులు దానికి జవాబు చెప్పలేదు - కాదు - చెప్పలేడు.

తల్లిని చూచాడు ఎంకటి. దుఃఖం దాగలేదు. తల్లిమీద పడ్డాడు. హోరుమన్నాడు.

తల్లి కొడుకును చూచింది. కారుతున్న రక్తం చూచింది. చెప్పిన కథ విన్నది. మాతృ హృదయంలో అగ్నికొండ బద్దలయింది. లావా పొంగింది. ఉప్పెన లేచింది. తుఫానులు చెలరేగాయి. అగ్నిమంటలు లేచాయి. అతనిని దగ్ధం చేసేవే. కాని, ఆమె బానిస. గులాము. ఆమెకు గుండె ఉందని ఆమె సైతం గుర్తించదు. తానే కాలి కూలింది. ఏడ్చింది. అంతే. కనీసం శపించలేదు.

ఆ రాత్రి ఇద్దరూ ఉపవాసం.

ప్రొద్దున్నే అయిన వంటితోనే పనిలోకి వెళ్ళాడు ఎంకటి. లాంతరు గదిలో పెట్టే పని తొలగించాడు దొర. ఇచ్చే గింజలు సగానికి తగ్గించాడు. అరసోలెడు గింజలు చెంబులో పోస్తే గుడ్లల్లో నీళ్లు నిండాయి ఎంకటికి. దొరను జాలిచూపుల్తో చూశాడు. ఆ చూపులకు మనిషి అయితే కరిగి, నీరై పారేవాడే. చూపుల భాష బలం అయింది. దొర కరగలేదు.

ఎంకటి దొర కాళ్లమీద పడ్డాడు. ఏడ్చాడు. "దొరా! నేన్సదుకోను" అని. కన్నీళ్ళతో కాళ్ళు కడిగేశాడు. చదువుకంటే గింజలు గొప్పవని తెలిసి వచ్చింది ఎంకటికి. దొరకు ఆ విషయం మొదటి నుండే తెలుసు. అందుకే అతడు అరసోలెడును సోలెడు చేయలేదు.

ఎంకటి జీతం చేస్తూనే వున్నాడు. తప్పదు. కాని, అతనికి ఒక వాస్తవం తెలిసింది. దొరకు చదువంటే బెదురు. కాబట్టే, తాను చదువుకోవాలి. ఆ తపన అతన్ని వదలడంలేదు. పసి గుండెలో పరితాపం.

ఎంకటి ఒకనాటి రాత్రి పంతులు ఇంటికి వెళ్ళాడు. తలుపు తట్టాడు. పంతులు తలుపు తీశాడు. ఎంకటిని చూచి ఆశ్చర్యపోయాడు.

"దొర పిలిచిండా?" అడిగాడు.

"కాదండి. నేనే వచ్చిన."

"ఏమిటి సంగతి?"

"సదుకోవాల్నని ఉన్నదండి. సదువు చెప్తరా? రాత్రిళ్ళు వస్త. దొరకు తెలుస్తే పానం తీస్తడు."

పంతులు గుండె కరిగింది. ఎంత తపన ఉంది చదవాల్నని! ఇతనికి చదువు లేదు. ఎంత చెప్పినా రాదు దొర కొడుక్కు. వాడికి చదువు చెప్పాలి. వింతగా వుంది స్థితి.

"దొర కొట్టింది మరిచినవా?"

"దొర కొట్టిందు గన్కనే సదుకోవాల్నని ఉన్నదండి. చెప్పుతరా - రాత్రిళ్ళు వస్త?"

"ఎంకటీ! బస్తీకి పోరాదు–చదువు చెప్తరు - పైసలిస్తరు - ఏమంటవ్?"

"ఎట్లపోతనుండి – మా అయ్య అమ్మ పోయిండు దొరకు నన్ను. ఇగ చచ్చెడిదాక బానిసోన్ని. ఎట్లపోత?"

"ఎంకటీ! కొత్త ఖానూను వచ్చింది ఇన్నవా? ఎట్టి చేయించుకోటం నేరం. నీ బాంచదనం పోయింది. నువ్వు విడుదలయినవు, ఇగ దొరేం చేయలేడు నిన్ను."

"ఏమన్నవు పంతులూ! దొర బలం పోయినాది? నేను బాంచను కానా? నన్నేం చెయ్యలేడా దొర? పంతులూ, నీ కాల్మొక్త. నువ్వు దేవునివి" అని స్తుతించాడు ఎంకటి.

ఎంకటి ఉరికాడు తల్లి దగ్గరికి – కేకవేసి చెప్పాడు – "అవ్వా! మనం బాంచలం కాం. ఖానూ నొచ్చింది. మనం బస్తీ పోదం. నేన్సదుకుంట."

ముత్తమ్మ కళ్ళల్లో వెలుగులు కనిపించాయి. స్వేచ్ఛలో ఎంత వెలుగుందో కనిపించింది. "నిజమా కొడకా! మనం బాంచలం కామా? దొరబలం చచ్చిందా?" ఆ మాటల్లో ఉన్న ఆనందం అక్షరాలకు అందేది కాదు.

తెల్లారి పలకా పుస్తకం పట్టుకొని దొర ఇంటికి వెళ్ళాడు ఎంకటి. దొర నిర్విణ్ణుడయినాడు.

"దొరా! నేను సదుకోన్కి పోతున్నా బస్తీకి." ఎంకటి మాటల్లో గర్వం కనిపించింది.

దొరలో పడగ నేలకు కొట్టుకుంటున్న పాము కనిపించింది.

★ ★ ★

# గెలుపెవరిది?

ఆఫీసులో కూర్చున్నాను. పనిలేదు, ఫైళ్ళురావు. పేపర్లన్నీ చదవడం అయిపోయింది. పెన్సిలుతో బొమ్మగీస్తూ కూర్చున్నాను. లక్ష్మి వచ్చింది. లక్ష్మికి పనిలేదు. కబుర్లుచెప్పడానికి వచ్చిందనుకున్నా, కాదు. ఆమె విజయం సాధించింది, ఆ వార్త చెప్పడానికి వచ్చింది.

లక్ష్మికి ఒక తమ్ముడున్నాడు. అతని పేరు శేఖర్. శేఖర్ మెడిసిన్‌లో చేర్తానని పట్టుబట్టాడు. అతనికి మార్కులు రాలేదు. సీటు రాలేదు. శేఖర్‌కు మెడిసిన్‌లో సీటుకావల్సింది కట్నంకోసం. వాస్తవంగా మెడిసిన్ అంటే అతనికి ఇంటరెస్టులేదు. శేఖర్ తన ప్రయత్నం విరమించలేదు. లక్ష్మి కూడా చాలా ప్రయత్నించింది. మొత్తంమీద సాధించింది. డొనేషన్ కట్టి మెడిసిన్‌లో సీటు సంపాదించారు.

శేఖర్‌కు మెడిసిన్లో సీటు దొరికిందనే విషయం ఆడపిల్లల తండ్రులకు అమాంతంగా తెలిసిపోయింది. ఒకరు, ఇద్దరు, అనేకమంది, పిల్లనిస్తామని వస్తున్నారు. లక్ష్మి చాలా తెలివైంది. బేరం తెలివిగా చేసింది. పెద్ద మొత్తానికే కుదిరింది బేరం. పెళ్ళి అయింది. పెళ్ళికి నేనూ వెళ్ళాను. అమ్మాయి బావుంటుంది, అందంగా. అయితే కాస్త సెక్సీగా కనిపిస్తుంది. పేరు సుషుమ. పెళ్ళి బాగా చేశారు.

శేఖర్‌కు పెళ్ళి అయింది. సుషుమ, శేఖర్‌ను వదలలేదన్నా, శేఖర్ సుషుమను వదల్లేదన్నా ఒకటే. వారు హానిమూన్లకు తిరిగారు. సినీమాలూ, పార్టీలు, పిక్నికులు లెక్కలేవు. సుషుమ చురుకైంది. మొగుణ్ణి ప్యాంటు జేబులో పెట్టేసుకుంది. శేఖర్ సుషుమ జేబులోనే సుఖంగా గడిపాడు.

లక్ష్మికి అది నచ్చలేదు. తమ్మునికి అనేక విధాల చెప్పింది. ప్రేమ మైకం విచిత్రం అయింది. అది దేన్నీ చూడనీయదు. విననీయదు. శేఖర్ వినలేదు.

మెడిసిన్ ఫస్టియర్ పరీక్షలయ్యాయి. రిజల్ట్సు రాకముందే శేఖర్‌కు తెలిసిపోయింది. అక్కను 'బతిమాలాడాడు. లక్ష్మి చీదరించుకుంది. తన మాట విననందుకు తరిమి కొట్టింది. అయినా శేఖర్ ఆమెను వదల్లేదు. సుషుమకు చులకన అయిపోతానన్నాడు. పరీక్ష పాస్ కాకుంటే సుషుమ తనను వదిలేస్తుందన్నాడు. అసలు తానింత విషం తిని ప్రాణాలు విడి చేస్తానన్నాడు.

లక్ష్మికి తమ్ముని విషయంలో జాలి కలిగింది. తమ్ముడు పాస్ కావాలి. లక్ష్మి అసాధ్యురాలు. మాట అనుకుందంటే సాధించి తీరుతుంది. ఆమె దగ్గర ఆ చాకచక్యం ఉంది. ఆమె డైరెక్టుగా దేవుని దగ్గిరనుంచి సైతం సిఫార్సు తేగలదు!

లక్ష్మి నా దగ్గరకి వచ్చింది. విషయం సాంతం వివరించింది. సాయం చేయమని అడిగింది. లక్ష్మి అడిగితే కాదనే వారుండరు. నేను కాదన్నాను. వైద్యం మానవుల ప్రాణాలకు సంబంధించిన శాస్త్రం. అందులో మార్కులు వేయించుకునే వ్యాపారం

మంచిది కాదన్నాను. వైద్యశాస్త్రాన్ని వ్యాపారం చేయవద్దన్నాను. మనుషుల ప్రాణాలతో చెలగాట మాడరాదన్నాను.

లక్ష్మి విచిత్రంగా నవ్వింది. ఆమె నవ్వులో నా చాతకానితనాన్ని వెక్కిరించడం ఉంది. "అసలు ఈ సమాజమే వ్యాపార సమాజం–వైద్యం వ్యాపారం కాకుండా ఎలా ఉంటుంది?" అని ప్రశ్నించింది. వ్యానిటీ బ్యాగ్ అందుకుని చకచకా నడిచిపోయింది. ఆమె నడకలోని వయారం చూస్తూ కూర్చున్నానే తప్ప ఆమె నన్ను ఈసడించి వెళ్లిపోతూందని గమనించలేదు.

ఆనాడు నన్ను ఈసడించి వెళ్ళిపోయిన లక్ష్మి ఇవ్వాళ ప్రత్యక్షం అయింది. ఆవిడను చూస్తేనే ఆమె గెలిచి వచ్చిందని అర్థం అవుతూంది. ఆమె కళ్ళలో విజయం తొణికిసలాడుతూంది. ఆమె నన్ను తృణీకారంగా చూసింది. వానిటీ బ్యాగ్‌లోంచి మార్క్స్ మెమొరాండం తీసి నాకు అందించింది.

మెమో చూచి నేను ఆశ్చర్యపోలేదు. లక్ష్మి సామర్థ్యం నాకు తెలుసు, అయినా మార్కులు చూచి చకితుణ్ణి అయినాను. శేఖర్‌కు బాగా వచ్చాయి మార్కులు.

లక్ష్మి నావైపు చూచి అదోరకంగా నవ్వింది. ఆమె నవ్వులో తన గెలుపు, నా ఓటమి ప్రతిబింబించాయి. అసలు ఈ గెలుపెవరిది? ఓటమి ఎవరిది? అని ఆలోచించసాగాను, ఆలోచిస్తూనే బెల్లు నొక్కి బంట్రోతును పిలిచాను. కాఫీ కోసం పంపించాను. లక్ష్మి తాను కార్యం ఎలా సాధించింది వివరిస్తుంది. నాకది అంతగా వినిపించడంలేదు. నేను ఆలోచిస్తున్నది వేరు – ఈ గెలుపు ఎవరిది? ఇది దేశాన్ని ఎటు నడుపుతూంది?

ఇంతలో ఫోను వచ్చింది. మాట్లాడి రిసీవర్ పెట్టేశాను. "ఫోను చేసింది సావిత్రి. వచ్చేస్తానంటూంది కొన్ని క్షణాల్లో" – లక్ష్మితో అన్నాను.

లక్ష్మి సావిత్రిని వర్ణిస్తుంది. "చురుకైన పిల్ల, చాకచక్యం గలది, ఆమె కళ్ళల్లో వెన్నెల రాసులుంటాయి" అంటూంది.

సావిత్రి నాకు అంతగా తెలీదు. ఒకనాడు మెరుపులా ఊడిపడింది. తనను తానే పరిచయం చేసుకుంది. చొరవ ఉన్న మనిషిలా కనిపించింది. తాను రచయిత్రి కావాలనుకుంటున్నానంది.

సావిత్రి రచయిత్రి కావాలనుకుంటూంది. అమాంతంగా నాలుగు నవలలు రాయాలనుకుంటూంది. ఆ నాలుగూ సినీమాలుగా వస్తాయని కలలు గంటూంది. తరవాత సినీమాల వాళ్ళంతా తన చుట్టూ తిరుగుతారనీ, తాను విమానాల్లో తప్ప ప్రయాణించననీ ఒక ఊహా చిత్రం సృష్టించింది.

మంచిదే. సావిత్రి రచయిత్రి కావలసిందే. సావిత్రిని "గోపీచంద్" గురించి అడిగాను. తనకు హిందీ రాదంది. "గోపీచంద్" హిందీ రచయిత అని ఆమె అభిప్రాయం. కుటుంబరావుగారిని గురించి అడిగాను. కుటుంబరావుగారు గొప్ప రచయిత అన్నదేగాని వారి రచనలేమీ చదివినట్లులేదు. మరి కొంతమంది ఇంగ్లీషు రచయితలను గురించి, తెలుగు రచయితలను గురించి అడిగాను.

"అస్తమానం చదువుతూ కూర్చుంటే రాయడం ఎప్పుడండీ? నాకు చదవడం ఇష్టం ఉండదు. రాయడమే ఇష్టం" అంది.

సావిత్రికి నచ్చచెప్పాను, చదవండే రాయడం కష్టమని. అధ్యయనం అవసరం అన్నాను. రచయితల శైలి, వారి పాత్ర పోషణ, వారి మెళుకువలు తెలుసుకోవాలన్నాను. కొందరు ప్రముఖ రచయితల రచనలను గురించి వివరించాను.

సావిత్రికి నేను చెప్పింది ఏదీ నచ్చినట్లు కనిపించలేదు. అయినా, నన్ను కించపరచలేదు. కొన్ని పుస్తకాల లిస్టు నాతో రాయించుకొని వెళ్లిపోయింది.

సావిత్రి తరవాత ఒకసారి వచ్చింది ఆమె ఒక రాత ప్రతి నాకు అందించింది. అది తాను రాసిన నవల అని చెప్పింది. సావిత్రిలో రచయిత్రి కావాలనే ఆతురత తప్ప, తపన లేదని అర్థం చేసుకున్నాను.

మరికాస్త అధ్యయనం చేస్తే మంచిది అని సలహా ఇచ్చాను. సావిత్రి కాస్త చిరాగ్గా చూచింది. ముందు తన నవల చదవమంది. అందులో అందరు నటీనటులకు అవసరం అయిన పాత్రలు తీర్చి దిద్దానంది.

సావిత్రిని నిరుత్సాహ పరచడం ఇష్టంలేదు. నవల చదివి దాని గుణదోషాలు విచారిస్తా నన్నాను.

"నవల బావుంది. ఇంతకుముందు ఎవరూ రాయనంత బాగా రాశాను. ఒకరిద్దరు చదివి అసలు ఇది ఇంగ్లీషు నవలల స్థాయిలో ఉందన్నారు. మీరు చేయాల్సిందల్లా దీన్ని అచ్చువేయించే ఉపాయం. అచ్చవుతే సినిమా తీసేవాళ్లు రెడీగా ఉన్నారు" అన్నది.

నేను చిరునవ్వు నవ్వాను. రాత ప్రతి నా దగ్గర ఉంచిపోయింది. నవల సాంతం ఓపిగ్గా చదివాను. నవలలో భాషలేదు. శైలిలేదు. కథ కారుచవకది. పాత్రపోషణ లేదు. సంఘటనలు విమానాలలోనూ, హెలికాప్టర్లలోనూ జరుగుతాయి. నేలమీద జరిగేవి ఏవీ ఉండవు.

సావిత్రి మళ్ళీ వచ్చింది. ఆమె నవలను గురించి నా అభిప్రాయం కాస్త సరళంగా, ఆమె మనసు అంతగా నొవ్వకుండా చెప్పాను. కొన్ని సలహాలు ఇచ్చాను. మరొకసారి రాస్తే మంచి నవల కావచ్చు అని ఆమెను ప్రోత్సహించాను.

"కాస్త పబ్లిషర్ను చూచిపెడ్దురూ!" అన్నది. సావిత్రి అందమైందని చెప్పాను. ఆమె చూపులోని అర్థింపు వెన్నెలలు కరిగిస్తుంది, చంద్రికలు కురిపిస్తుంది. నేను చలించాను. పబ్లిషర్ను చూడాలనే అనుకున్నాను. కాని అతడు ప్రచురించాల్సింది సావిత్రి చూపుల వెన్నెలలు కాదు–ఆమె రాసిన నవల.

"నవలను కాస్త ఇంప్రూవ్ చేయి. ఉన్నఫళంగా ఏ పబ్లిషరూ ప్రచురిస్తాడనుకోను" అన్నాను.

"అంతేనంటారా?" ఆమె కళ్ళలో కన్నీరు సుళ్ళు తిరిగింది. రాత ప్రతి అందుకొని వెళ్లిపోయింది.

నాకు సావిత్రి మీద జాలేసింది. కాని, కళలకు సంబంధించినంతవరకు మనిషిమీద జాలి పనికిరాదు. కళాకారుని వ్యక్తికి దూరంగా కళ కళగా నిలవాలి.

అవ్వాళ వెళ్ళిన సావిత్రి ఇవ్వాళ ఫోను చేసింది.

కాఫీ వచ్చింది. కాని, సావిత్రికోసం వెయిట్ చేద్దామని కబుర్లలో పడ్డాం. తలుపునెట్టుకొని మెరుపులా ప్రవేశించింది సావిత్రి.

సావిత్రి కళ్ళలో, ముఖంలో, నడకలో, ఆమె ప్రత్యణువులో విజయోత్సాహం కనిపిస్తూంది. రావడం రావడం నా టేబుల్ మీదికి ఒక పుస్తకం విసిరింది. రెప్పవాల్చకుండా నా రియాక్షన్స్ కోసం చూస్తుంది.

పుస్తకం అందుకున్నాను. పేరుచూసి చకితుణ్ణయినాను. అదే నవల – నేను బాగా లేదన్నది! అచ్చయింది. అట్టమీది బొమ్మ ముచ్చటగా ఉంది. సావిత్రి పేరు ఎరుపురంగులో పెద్ద అక్షరాలలో అచ్చయింది! పుస్తకం ముద్దుగా ఉంది.

"కంగ్రాట్స్" అన్నాను – చిరునవ్వు నవ్వాను – నాకే తెలుస్తూంది – నా నవ్వు పేలవంగా ఉందని.

"బాగా వచ్చింది కదూ!" అంది లక్ష్మి.

సావిత్రి కళ్ళలో గెలుపు రేఖలు కదలాడాయి.

"నా నవల సినిమా తీస్తున్నారు!" సావిత్రి గొంతులో విజయనాదం వినిపించింది.

"కాఫీ తీసుకోండి" అన్నాను.

కాఫీ చప్పరిస్తుంటే నా ఆలోచనా పథంలో మానవుడు కనిపించాడు. మనిషి శారీరక స్వాస్థ్యం చూచేవాడు వైద్యుడు. మానసికమయిన ఆరోగ్యాన్ని చూచేవాడు రచయిత. వైద్యం, రచన – రెండూ వ్యాపారంగా మారిపోయిన జాతి జీవనాన్ని తలచుకుంటే జాతి రక్తం కలుషితం అవుతున్నట్లు, జాతి నవనాడులు కుంగుతున్నట్లూ అనిపించింది.

★ ★ ★

# మర్రిచెట్టు

చెట్లు మనకు మిత్రులు, బంధువులు, ఆప్తులు. పచ్చగా, గుంపుగా ఉన్న చెట్లు కంటికి హాయినిస్తాయి. మనసును ఉల్లాసపరుస్తాయి. చెట్లు మనకు తిండి పెడ్తాయి. ప్రాణ వాయువు యిస్తాయి. చెట్లు మనకు నీడనిస్తాయి. మండే ఎండలో సైతం చల్లని చెట్ల నీడ ఎంతో హాయినిస్తుంది. కాలి నడక వాళ్ళు కాదు, కారు నడక వాళ్ళు కూడా కారు నిలుపుకో వలసి వస్తే చెట్టు నీడ కోసం వెదుక్కుంటారు. చెట్టు నీడకు మాత్రమే కాదు, అనేక విధాల పనికి వస్తుంది. మనిషి కళ్ళు మూస్తే పనికిరాడు. చెట్టు చచ్చి కూడా మనిషికి పనికి వస్తుంది. మనిషికి చివరకు చెట్టే కావాలి. బతికి వున్నా చెట్టే కావాలి.

చెట్లను గురించి తలచుకున్నప్పుడల్లా నాకో మర్రి చెట్టు గుర్తుకు వస్తుంది. అది చెట్టుకాదు, వృక్షం. వృక్షం అన్నా చెట్టన్నా ఒకటేగా అంటారు మీరు. అది నిజమే. సంస్కృతంలో చెపితే దాని గౌవరం పెరుగుతుంది. చెట్టు అంటే చిన్న చెట్టు అనే ఐడియా వస్తుంది. వృక్షం అంటే పెద్ద చెట్టు అనేది స్ఫురిస్తుంది. వాస్తవానికి నేను చెపుతున్న మర్రిచెట్టు మహావృక్షం. రాజు మామూలు వాడు, మహారాజు గొప్ప రాజు, రాజాధిరాజు రాజులకు రాజు. న్యాయానికి ఆ మర్రి చెట్టును వృక్షాధి వృక్షం అనవచ్చు. ఎంచేతనంటే, ఆ మర్రి చెట్టు అంత పెద్దది. ఎంత పెద్దది? ఎలా చెప్పాలబ్బా!

ఆ మర్రి వైశాల్యం ఎంత అంటే చెప్పలేం. కొన్ని ఎకరాలు ఉండొచ్చు. దాని కొమ్మలు యింటి దూలాల కంటే లావుంటాయి. పొడవు ఎంత అంటే ఎలా చెప్పడం? అది పెరిగే కొమ్మ. కొమ్మలు చాచిన ఆ చెట్టును చూస్తుంటే, చేతులు చాచిన తల్లిలా అనిపిస్తుంది. తల్లి తన బిడ్డకే ఆశ్రయం యివ్వలేదు. ఆమె ఒడి ఎంత? ఈ మర్రి తల్లి బిడ్డల్ను కనలేదు. కానీ, ఎవరో కన్న బిడ్డలకు ఆశ్రయం యిస్తుంది. పచ్చగా దళసరిగా ఉన్న మర్రి ఆకుల నీడ మహా సౌధాలకన్నా చల్లగా ఉంటుంది.

సౌధాలున్నవారు సరే. కొంపా గోడూలేని జనానికి చల్లని నీడనిస్తుంది ఆ మర్రి. మర్రి చెట్టు ఊరును అనుకునే ఉంది. ఆ మర్రికి ఒక పక్కన సత్రం ఉంది. సత్రంలో కాస్త ఉన్న బాటసారులు విడుస్తారు. బొత్తిగా లేని కబోది పక్షులకు యిల్లు మర్రి. మర్రికి మరో పక్క శివాలయం ఉంది. అది శిథిలం అయింది. బోసి గోడల్తో ఏడుస్తున్నట్లుంది.

ఎవరో ఒక దాత ఏనాడు కట్టించాడో తెలియదు కాని, మర్రి నీడ పాకినంత మేర ఒక గద్దె కట్టించాడు. దాన్ని అరుగు అందాం. అరుగుది రాతి కట్టడం. అయన ఆ అరుగు ఎందుకు కట్టించాడయా అంటే, ఆ మర్రి కింద బిచ్చగాళ్లు విడిసేవారు. వంటలు చేసుకునేవారు. కాపురాలు చేసేవాళ్ళు. పిల్లల్ను కనేవాళ్ళు.

వాళ్ల సౌకర్యార్థం బహుశా ఆ అరుగు కట్టించి వుంటాడు. ఆ చెట్టు నీడన, ఆ అరుగు మీద అనేక సంసారాలు కాపరం చేసేవి. ఇన్ని కాపరాల సందడి, పిల్లల ఆటల హడావుడి, చెట్టు మీద నివసించే కాకుల, పిట్టల కలకలంతో మఱ్ఱిచెట్టు మహా సందడిగా ఉండేది.

అది మఱ్ఱి కాబట్టి సరిపోయింది. మనిషి అవుతే కొమ్మలు వాల్చేసేవాడు. కదిలి సాగిపోయేవాడు.

ఆ మఱ్ఱి కింద శివయ్య కాపరం ఉంటున్నాడు. ఎప్పణ్ణుంచి ఉంటున్నావంటే శివయ్య చెప్పలేడు. శివయ్య పుట్టిందగ్గర్నుంచీ అక్కడే ఉంటున్నాడు. అతనికో పెళ్ళాం ఉంది. పెళ్ళయిందా అంటే చెప్పలేం. ఇద్దరు బిడ్డలున్నారు. బుడతలు. పుట్టడం చాలా మంది పుట్టారు గంగమ్మకు. అంతా పోయారు. పోయిన వారిని తల్చుకొని ఏడ్చేది గంగమ్మ. "పుట్టింది చచ్చేందుకేనే పిచ్చిదానా! నిన్న వాళ్ళు, రేపు మనం" అనేవాడు శివయ్య.

శివయ్య బైరాగి. అతని సంసారం అంతా రెండు కుండలు, మూడు మూకుళ్ళు, ఒక చింకి చాప. మరిచాను, శివయ్య ఆస్తిలో తాంబుర్ర కూడా ఉంది. అది అతనికి అన్నం పెడ్తుంది. శివయ్య తెల్లవారు జామున లేచి స్నానం చేస్తాడు, మఱ్ఱి దగ్గర ఉన్న బావిలో. ఒక మాట చెప్పడం మరిచాను. మఱ్ఱి కింద అరుగు కట్టించిన దాత మఱ్ఱి పక్కన బావి కూడా తవ్వించాడు. స్నానం ముగించిన శివయ్య ముఖాన నామాలు దిద్దుతాడు. తాంబుర్ర తీసుకుని 'రాం బనాయా సీతారాం' అని పాడుకుంటూ బిచ్చానికి బయల్దేర్తాడు. అతనికి బ్రహ్మంగారి పదాలు వచ్చు. చక్కగా పాడ్తాడు. అంతేకాదు, వాటిలో మైమరచి ఆలపిస్తాడు. జోలె పట్టుకుని ఊళ్ళో తిరుగుతాడు. పట్టపగటికి జోలె నిండకున్నా తిరిగి వస్తాడు. గంగమ్మ యింత కాచి పోస్తుంది. తాగుతాడు. సాక్కి మఱ్ఱి కింద వాల్తాడు. ఇద్దరు బుడతలు అతని రొమ్ము మీద ఎక్కి నానా గొడవ చేస్తారు. అయినా అతడు గమనించడు. నిద్రపోతాడు. సాయంత్రం సంధ్యా కబళానికి వెళ్తడతను. పగలు కాచిందే డొక్కలో పోసుకుని రాత్రికి బ్రహ్మంగారి పదాలు చదువుతుంటాడు. ఆ మఱ్ఱికింద నివసించే దీనులు, దరిద్రులు, వికలాంగులు శివయ్య చుట్టూ కూర్చుంటారు. వారికి దీపాల్లేవు. చుక్కలే దీపాలు.

శివయ్య చెట్టుకిందివారికి 'సామి.' చెట్టు కింద ఒక లోకం ఉంది. ఆ లోకానికి గురువు శివయ్య. శివయ్య చెప్పిందే అక్కడ వేదం. శివయ్య తప్పు చెప్పడు. అది అక్కడి వారి నమ్మకం. మఱ్ఱి చెట్టు కింది జీవితం ప్రశాంతంగా జరిగిపోతూంది.

ఒకనాటి మిట్టమధ్యాహ్నం ఆ మఱ్ఱి కిందకి ఒక వ్యక్తి వచ్చాడు. అతను పొడవరి, బలిష్టుడు. ధోవతి కట్టాడు, లాల్చీ వేశాడు... అతని చూపుల్లో ఆశ అంగలారుస్తూంది. అతని ముఖాన అగ్ని మండుతూంది. అతని పేరు నారాయణ.

నారాయణను చూచారు... మఱ్ఱి కింది జనం. అంతా దిగ్గున లేచారు. శివయ్య నిద్రపోతున్నాడు. అతన్ని లేపారు. శివయ్య కళ్లు నల్చుకొని చూచాడు. ఎదురుగా నారాయణ కనిపించాడు. యమదూతలా కనిపించాడు.

'ఈ స్థలం నాది. ఇక్కడ మీరుండడానికి వీల్లేదు' – నారాయణ గర్జించలేదు,

అన్నాడు. అయినా, అది ఉరుములా అక్కడి వారి గుండెల్లో ఉరిమింది. వారు గజగజ వణికారు. మర్రి వణికింది. ఆకు రాల్చింది.

'బాబూ! ఇక్కడ మేం తరతరాలుగా ఉంటున్నాం, వెళ్ళిపొమ్మంటే ఎక్కడికి పోతాం బాబూ! దయదల్చాలి, పేదవాళ్ళం.' శివయ్య బ్రతిమిలాడాడు.

చెట్టు మీది పిల్లలంతా దిగారు. అక్కడ ఒక గుంపు ఏర్పడింది.

'అందర్నీ పొమ్మనడం లేదు. నా హక్కు ఒప్పుకోండి. తలా పావలా అద్దెకట్టండి.'

'అలాగే బాబూ!' అన్నాడు శివయ్య. అంతా నిట్టూర్చారు. నారాయణ వెళ్లిపోయాడు. మర్రి కిందివారు అద్దె కడ్తున్నారు. కాని, శివయ్య మనసులో గుబులు చేరుకుంది. మర్రి కింద భయం కాపురం పెట్టింది.

మరొకనాడు నారాయణ వచ్చాడు. వెంట గొడ్డళ్ళ వాళ్ళను తెచ్చాడు. మర్రి కింది జనం గడగడలాడారు. ఒక కొమ్మ మాత్రం కొట్టించుకు పోతానన్నాడు నారాయణ. కొమ్మకొడుతుంటే తన రెక్క నరుకుతున్నట్లనిపించింది శివయ్యకు. విలవిల లాడాడు. మర్రి కింది జనం కన్నీరు రాల్చారు. మర్రి పైన కాకులు కావుకావుమంటూ మర్రి చుట్టూ తిరిగాయి. నారాయణ మర్రికొమ్మ కొట్టించుకుపోయాడు.

శివయ్య వంట్లో నీరసం ప్రవేశించింది. అతనిలోని ఉత్సాహం అడుగంటుతుంది. 'మర్రి మరొకరిదని తేలింది. యివ్వాళ కాకుంటే రేపు మర్రిని వాడు నరుకుతాడు' అన్నాడు శివయ్య, ఆ రాత్రి కూడినవారితో.

'సామీ! మర్రి చెట్టు పోతే మా గతేమిటి?' అడిగారు జనం.

'మన గతి చూచే వాళ్ళుండరు నాయనా! స్వార్థం పెరుగుతుంది. సామాన్యుడు బతకడు.!

మర్రి కింది జీవితంలో భయం ప్రవేశించింది. ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని జీవిస్తున్నారు జనం. పిల్లలు కోతి కొమ్మంచి ఆడ్డానికి రావడం లేదు. కాకులు మాత్రం వాటి నివాసం వదల్లేదు. శివయ్య జబ్బున పడ్డాడు. లేవడం లేదు. శివయ్య కొడుకులు స్టేషన్ దగ్గర మూటలు మోస్తున్నారు. గంగమ్మ కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తోంది. గంగమ్మ రెక్కలు విరిగిన పక్షి అయింది. శివయ్యను అక్కడి జనం ఆదుకొంటూనే ఉన్నారు. అయినా, అతడు కోలుకోవడం లేదు. అతనికి పట్టింది మనో జాడ్యం. ఇంతమంది నిరాశ్రయులైతే ఎలా? యింత కాలం జనానికి ఆశ్రయం యిచ్చిన మర్రి కూలుతే ఎలా? శివయ్య కుమిలిపోతున్నాడు. శివయ్య చిక్కిపోతున్నాడు. శల్యం ఐపోతున్నాడు.

మరోనాడు నారాయణ వచ్చాడు. అతడు మందీ మార్బలంతో వచ్చాడు. అనేక గొడ్డళ్ళ వాళ్ళను వెంట తెచ్చాడు. 'కదలండి చెట్టు కిందినుంచి, యిది నాది' – గర్జించాడు నారాయణ.

'బాబూ! అలా అనకు. ఈ వృక్షానికి బీజం ఎంత? అది ఎవరు వేశారో ఎవరి కెరుక? మర్రి నీది కాదు బాబూ, అందరిది. అద్దె కడుతున్నాం, పుచ్చుకో. అందరినీ ఉండనీ.'

'మర్రి నాది. నేనేమైనా చేసుకుంటా. జరపండిరా ముసలివాణ్ణి' – అరచాడు నారాయణ. నారాయణ మనుషులు శివయ్యను అవతలికి చేర్చారు.

మర్రి కింది జనం గగ్గోలు పెట్టారు. కల్లోలం చెలరేగింది. పెద్ద సుడిగాలి రేగింది. దుమ్ము సుళ్లు తిరుగుతూ ఆకాశానికి ఎగిరింది. గాలి దుమారం సాగింది. రేగింది.

నారాయణ మనుషులు మర్రి మొదలు నరకసాగారు. ఒక్కొక్క గొడ్డలి వేటు శివయ్య గుండెల్లో పడుతూంది. కోతి కొమ్మంచి ఆడే పిల్లలంతా చుట్టూ గుమిగూడారు. కాకులు కావుకావుమని కాకి గోల చేస్తూ వలయాలు తిరుగుతున్నాయి. చెట్టు కొట్టేవాళ్ళను ముక్కుల్తో పొడవాలని చూస్తున్నాయి.

గంగమ్మ నిలువలేక పోయింది. గావుకేక పెట్టి పరుగెత్తింది. చెట్టును కావలించుకొంది. గొడ్డలి వేటు ఆమె తలకు తాకింది. కిమ్మనలేదు. కూలింది. మర్రి మొదలు రక్తంతో తడిసింది.

శివయ్యా అశువులు వీడాడు.

మర్రి కింద జనం గొల్లుమంది.

నారాయణ ఆ స్థలంలో పెద్ద హోటలు కట్టాడు. అది ఆ ఊరికి మకుటాయమానంగా ఉంది.

హోటలుకు కాస్త దూరంలో శివయ్య సమాధి ఉంది.

★ ★ ★

# అర్ధరాత్రి అరుణోదయం

డబ్బుంటే అన్నీ సాధించవచ్చునంటారు. రమణి పుట్టింట డబ్బుంది. చదువు ఉంటే తెలివి వస్తుందంటారు. రమణికి చదువు ఉంది. అందం ఉంటే అదోరకం అంటారు. రమణికి అందం ఉంది. గుణం ఉంటే రాణిస్తుందంటారు. రమణికి గుణం ఉంది. అసలు జీవితానికి ఏది అవసరమో తెలుసుకోవడం కష్టం.

రమణికి తండ్రి లేడు. తల్లి ఉంది. కొంత ఆస్తి ఉంది. మరెవరూ లేరు. రమణికి అందం ఉంది: ఆకర్షణ ఉంది. వయసు వంక తీరుస్తుంది అని సామెత, వయసు అందరికీ వస్తుంది. దాంతో ఆమె అందం పురివిప్పింది. రమణి బక్కపల్చగా ఉంటుంది. డబ్బపండులాంటి చాయ. కాస్త పొడవు. ఆమె కళ్ళల్లో అందం గూడు కట్టుకుంది. ముక్కు కొనదేరింది. ఆమె వెంట్రుకలు శ్రావణమేఘాల్లా ఉంటాయి. ఆమెలో ఆకర్షణ ఉంది. స్కూలుకు వెళ్ళే రోజుల్లో ఆడపిల్లలే ఆమెను ముద్దుపెట్టుకునేవాళ్లు. తన అందం అంటే రమణికి గర్వం కాదు కాని మురిపెం. అందువల్ల ఆమె చక్కగా ముస్తాబు అవుతుంది. ఆమె అద్దంముందు కూర్చుంటుంది. కళ్లు రెపరెప లాడిస్తుంది. అది ఆమెకే ఆనందం కలిగిస్తుంది.

రమణి తల్లి రాజమ్మ. కూతురు లక్షణాలు ఆమెకు నచ్చవు. అందం బయట పెట్టడానికి కాదంటుంది. అందం గుంభనగా ఉండాలంటుంది. అంతగా అలంకరించుకోవద్దంటుంది. ఓణీ భుజాలనిండా కప్పుకొమ్మంటుంది.

రమణి తెలుగు నవలలు చదువుతుంది. పత్రికలు చదువుతుంది. సినీమాలు చూస్తుంది. అవన్నీ ఆమెకు మధుర స్వప్నాలు చూపుతాయి. అందమయిన అబ్బాయి, కారులో షికారు, సెలయేటివద్ద జంటపాటలు – ఇలాంటివే ఎన్నో ఆమె గుండెను పులకరింపచేస్తాయి.

వయసును ఎవ్వడూ ఆపలేడు.

వయసుతో వచ్చే ఊహలు అలాగే ఉంటాయి.

రమణికి ఏదో కావాలనిపిస్తున్నది. మనసు దేనికోసమో ఎదురుచూస్తున్నది. కావాలంటున్నది. కితకితలు పెడుతున్నది. వెదుకుతున్నది. వేసారుతున్నది.

రాజమ్మ అంత పిచ్చిదేం కాదు. కూతురును గమనించింది. వయసే అలాంటిది. అది ఆమెకు తెలుసు, రమణికి జతకోసం వెతకసాగింది. ఈ సమాజంలో అబ్బాయిలు అమ్మకానికి ఉన్నారు. దొరుకుతారు. ఆమె కొనగలదు. అయినా తనకు నచ్చిన కుటుంబం కావాలి. రమణికి నచ్చాలి. కొన్ని తనకు నచ్చాయి. రమణి ముక్కు విరిచింది. కొన్ని రమణికి నచ్చాయి. తనకు నచ్చలేదు. సంప్రదాయం మంచిది కాదు. కూతురు సుఖపడదు అనుకొన్నది.

యవ్వనం జలపాతంలాంటిది.

నిలవడానికి వీల్లేదు. ఉరకాల్సింది. రమణి అలాంటిది.

అనుభవం శరత్కాలపు నదిలాంటిది.

దానికి వేగం లేదు - ఉరుకులు పరుగులు లేవు. రాజమ్మ అలాంటిది.

రమణికి శరత్తు తటస్థపడ్డాడు. అతడు ఆమె అందాన్ని అందలాలకు ఎత్తాడు. అతడు ఆమెను రంభ, తిలోత్తమ అనలేదు. సినిమా స్టారులతో పోల్చాడు. సినిమా ప్రపంచంలాంటిదే అసలు ప్రపంచం అనే భ్రమ కలిగించాడు. అతడు చెపుతుంటే ఆమె రెప్పలార్చుకుంటూ విన్నది.

"ఆకాశంలోనే ఇల్లు కట్టుకుందాం. ఇంద్రధనుస్సుతో ఆటలాడుకుందాం" అన్నాడు.

"అక్కడ ఇల్లు ఎట్లా నిలుస్తుంది? ఇంద్రధనుస్సు మనకెలా అందుతుంది?" కన్నులు పెద్దగాచేసి అడిగింది రమణి.

"అమెరికావాళ్లు ఆకాశంలో ఇళ్లు కడుతున్నారు. నకిలీ ఇంద్రధనుస్సులు సృష్టిస్తున్నారు. అక్కడ అన్నీ అద్దెకు దొరుకుతాయి. పెళ్లయితే మనం ఇక్కడ ఉండంగా."

"అబ్బో! ఎంత మంచివాడు నా శరత్" అని అతనిని గాఢంగా కౌగిలించుకుంది.

శరత్తు సిగరెట్టు వెలిగించి, ఆమె తల నిమిరాడు.

ప్రస్తుతం రమణి ఈ లోకంలో లేదు. ఆమె మబ్బుమీద నివాసం ఏర్పరచుకుంది.

"అమ్మా! నేను ఒక అబ్బాయిని ప్రేమించాను."

రాజమ్మ చకితురాలు అయింది. తన కూతురేనా అంటున్నది అని ఆశ్చర్యపోయింది. "ఎంతకు తెగించావే. కథ ఎంత వరకు వచ్చింది?" అడిగింది.

"ఎంతవరకు వస్తే ఎందుకు? శరత్తునే చేసుకుంటాను."

"నాకు ఇష్టం కాకుంటే? నేను చేయకుంటే?"

"లేచిపోతాను" - రమణి అన్నది. ఊరుకున్నది.

రాజమ్మ మీద పిడుగులు కురిశాయి. ఉప్పెన వచ్చింది. సూర్యచంద్రాదులు రాలిపోయారు. క్షణం నోట మాట రాలేదు. తరవాత ఏడ్చింది. మొత్తుకున్నది. రమణిని బాదడానికి ఆమెకు చేతులు రాలేదు. కందిపోతుందేమోనని భయం. బతిమిలాడింది. మొత్తుకున్నది. రమణి కరుగుతుంది అనుకున్నది. రమణి మరీ కఠినురాలు అయింది. మాట్లాడలేదు. అలంకరించుకున్నది. బయటపడ్డది.

రాజమ్మ చూస్తూ ఉండిపోయింది. తల్లి మనసు చెరువు అయింది. ఆమె తల బాదుకొని ఏడ్చింది.

శరత్తు వెయిట్ చేస్తున్నాడు.

"మనం లేచిపోదాం" అన్నది రమణి.

శరత్తు ఖంగు తిన్నాడు. "వీల్లేదు. మనం పెళ్లిచేసుకోవాలి."

"మా అమ్మ ఒప్పుకోవడం లేదు."

"ఒప్పించాలి."

ఇద్దరూ రాజమ్మ ఇంటికి వెళ్ళారు.

"శరత్తును తెచ్చాను, మాట్లాడు" అన్నది తల్లితో రమణి.

రాజమ్మ విస్తుపోయింది. అయినా తలిదండ్రులు , ఊరూ, పేరూ, ఆస్తిపాస్తులు అడిగింది.

"నాకు అవేవీ లేవు. నాకు రమణి కావాలి. పెళ్లి చేయండి. అమెరికా వెళ్ళి పోతాం."

"కట్నం?" అడిగింది రాజమ్మ.

"ఇచ్చుకోవాల్సిందే." సంఖ్య చెప్పాడు శరత్.

రాజమ్మకు మరేమీ కనిపించలేదు. రమణి పట్టు వదల్లేదు. శరత్ ఇల్లువిడిచి కదల్లేదు. రాజమ్మకు గత్యంతరం లేదు. అడిగిన కట్నం ఇచ్చింది. పెండ్లి చేశానని పించింది. పంపించింది.

రమణి పట్నం చేరింది – కాదు శరత్ చేర్చాడు. విశాలం అయిన రోడ్లు, అనేక అంతస్తుల భవనాలు, కార్లు, నగరం అందంగా కనిపించింది రమణికి. నగరాలకు వెలుగులు జిలుగులు ఉంటాయి. మనసులు ఉండవు. నగరాలు వట్టి కట్టడాలు. ఇది తెలుసుకోవడానికి అనుభవం కావాలి.

రమణి శరత్ ఇంట్లో ప్రవేశించింది. ఆ ఇల్లు చూడగానే ఊహా ప్రపంచం కూలసాగింది. శరత్ లోపలికి దారితీశాడు. ఒక ముసలమ్మ ముందరికి వచ్చింది. "మా అమ్మ" అని పరిచయం చేశాడు శరత్తు. శరత్ తనకు తల్లి ఉందని చెప్పలేదు. రమణి మనసు చివుక్కుమంది. రాములమ్మ పాదాలంటి నమస్కరించింది. రాములమ్మ రమణిని చూడలేదు. "నగలు ఇంతేనా?" అని అడిగింది. రమణి తలవంచుకుంది. లోనికి వెళ్లింది.

తన తల్లి తన సుఖంకోసం ఉన్నదంతా దోచిపెట్టి తనను పంపించింది. వచ్చిన తాను ఎన్ని నగలు తెచ్చానని చూస్తున్నది ఈమె. తల్లిది ప్రేమ, త్యాగం. ఈమెది ఆశ. ఎంత తేడా! ఎక్కడికి వచ్చి పడిపోయాను అనుకుంది. ఆలోచనలో పడి పోయింది. కట్నాన్ని గురించో, మరి దేనిని గురించో తల్లి శరత్తును అడుగుతూంది – దూరంగా. అన్నీ తనకు వినిపిస్తూనే ఉన్నాయి. తాను వచ్చినందుకు సంతోషించినవారు లేరు. తాను తెచ్చిందాన్ని గురించి చర్చించుకుంటున్నారు.

గాలిమేడలు కూలుతున్నాయి.

ఊహాలోకం వెలిసిపోతున్నది.

"ఏమిటి? అలా కూర్చున్నావు? నిన్ను కష్టాలు పెడుతున్నామా? లే. లేచి వంట చేయి." రాములమ్మ కుర్చీలో కూర్చుని ఆజ్ఞాపించింది.

రమణి లేచింది. తల్లి తనకు వంటపని ఎన్నడూ చెప్పలేదు. 'నాకు వంట తెలియదు' అని గునిసింది. అర్థవంతగా శరత్తును చూసింది.

"అలా పెంచిందన్నమాట మీ అమ్మ! ఒక వంటమనిషిని వెంట పంపాల్సింది" అని కుర్చీలోంచి లేచి, రమణిని వంటింట్లోకి తోసింది. రమణి చేతులు కాల్చుకుంది. బొబ్బలు వచ్చాయి. పెద్దగా ఏడుద్దామనుకుంది. కాని, ఏడ్చే స్వేచ్ఛ కూడా లేదు. అక్కడ స్వేచ్ఛ – ఇక్కడ బానిసత్వం. తాను కోరి, డబ్బిచ్చి బానిసత్వం కొనుక్కుంది.

ఆ రాత్రి శరత్తుకు చేతులు చూపింది. అతడు మాట్లాడలేదు. దుఃఖం ముంచుకొని వచ్చింది. దిండులో తల పెట్టుకొని ఏడ్చింది. రమణిని ఆకాశసౌధంలో

ఉంచుతానన్నాడు శరత్. సిగరెట్టు కాల్చాడు. ఆర్పాడు. రమణిని దగ్గరకు లాక్కున్నాడు. నిద్రపోయాడు.

'ఛీ! వీడు మనిషేనా?' అనుకుంది రమణి. కాని, రమణికి స్వేచ్ఛలేదు. స్వాతంత్ర్యం లేదు. కనీసం కాదనడానికి లేదు.

మరోనాడు "అందం ఎందుకమ్మా, కడుక్కు తాగనా! ఆ అందం చూపే మురిపించింది. కట్నం లేకుండా కట్టుకున్నాడు" అని ఎవరితోనో చెప్తుతూంది రాములమ్మ.

రమణి విన్నది. ఉరికి చెప్పాలనుకుంది. కాని, కాళ్ళు విరిగినట్లు చతికిలపడింది. ఏదో రోత అనిపించింది. కట్నం సంగతి తల్లికి చెప్పడా? చీడపురుగులా అనిపించాడు శరత్. ఆ రాత్రి నిలదీసి అడగాలనిపించింది. అడుగుదామనుకుంది. ధైర్యం తెచ్చుకుంది.

ఆ రాత్రి పొద్దుపోయి వచ్చాడు శరత్. వింతగా వచ్చాడు. తూలుకుంటూ వచ్చాడు. అతడు గది తలుపు వేశాడు. రమణి లేచి నుంచుంది. వచ్చినవాడు చెంప ఛెళ్ళుమనిపించాడు. రమణికి భూమి గిరగిరా తిరిగింది. "కట్నం ఇచ్చామని ఎందుకు చెప్పావ్?" మరొకటి తగిలించాడు. "మూగదెయ్యంలా చూస్తావేం, చెప్పు" అని బాదసాగాడు.

రమణికి కన్నీరు ఇంకిపోయింది. రోషం ముంచుకు వచ్చింది. "అవును. కట్నం ఇచ్చాను. నిన్ను కొన్నాను. నన్ను కొడ్తే బావుండదు." సాహసం చేసింది.

"ఏమన్నావు!" అని జుట్టు పట్టుకొని గోడకు వేసి కొట్టాడు రమణిని. రమణి కెవ్వుమని కేకవేసింది. రాములమ్మ ఉరికి వచ్చింది. "ముండా! నా కొడుక్కు ఎదురు చెప్తావా?" ఆమె నాలుగు అంటించింది.

రమణి మానసిక స్థితిని గురించి రాయడం కష్టం.

తెల్లవారింది. ముగ్గురూ కూడారు.

"వాడు దుబాయ్ పోతాట్ట. ఉన్న నగలు ఇచ్చెయ్యి. మీ అమ్మకు ఉత్తరం రాయి. డబ్బు తెప్పించు. కట్నంలేని పెళ్ళికి నేనైతే ఒప్పుకునేదాన్ని కాదు. నంగనాచివి. వాణ్ణి వలలో వేసుకున్నావ్" అన్నది రాములమ్మ.

రమణి నగలు తెచ్చి ఇచ్చింది. రాసిన ఉత్తరం మీద సంతకం పెట్టింది. వెళ్ళి పడుకుంది. ఆమెకు జ్వరం వచ్చింది. ఎవరూ పట్టించుకోలేదు. దానంతట అదే తగ్గింది.

నగలు అమ్మినవి అయిపోయాయి. డబ్బు రాలేదు. డబ్బుకోసం మళ్లీ బాదాడు శరత్. రాములమ్మ తాళం వేసింది. నేను వెళ్లి డబ్బు తెస్తానన్నది రమణి. "మేము నిన్ను వెళ్లనీయం. మాకు డబ్బు కావాలి." టెలిగ్రాం ఇచ్చాడు శరత్.

ఉన్న ఇల్లు అమ్మి డబ్బు పంపించింది రాజమ్మ.

డబ్బు అందిన్నాడు రమణి పడిన బాధ చెప్పనలవి కాదు. ఇక్కడ నిలువ నీడ లేకుండా అయ్యేట్టుంది. తనవల్ల తల్లి నిరాశ్రయురాలు అయింది. రాక్షసుల మధ్య బతికిందానికంటే చావు మేలు అని నిశ్చయించుకుంది. ఉరి, విషం, కిరసనాయిలు! ఒక నిశ్చయానికి రాలేదు. ఆత్మ ఘోషిస్తున్నది.

"డబ్బు అయిపోయింది. వాడు ఇంకా కావాలంటున్నాడు. ఏం చేతాం?" తల్లిని అడిగాడు శరత్తు.

"ఉత్తరం రాయి" – రాములమ్మ రమణిని ఆదేశించింది.

"ఉత్తరం రాయను. ఉరిపెట్టుకుంటాను. ఇంక నా దగ్గరేముంది?"

"అంతదాకా వచ్చిందీ?" అని పళ్లు పట పట కొరికాడు. రమణి మీదికి ఉరికాడు శరత్. కాని కొట్టలేదు. "నీ దగ్గర ఉన్నదాన్నే డబ్బు చేసుకుంటాను" అని వెళ్ళిపోయాడు.

ఒకనాటి రాత్రి చిత్తమ్మను ఇంట్లో ఉంచి, బయటినుంచి తాళంవేసి, తల్లీ కొడుకులు వెళ్లిపోయారు.

చిత్తమ్మ పనిమనిషి. పేదరాలు. ఆమెను చూడగానే రమణికి తల్లి గుర్తుకువచ్చింది. మీద పడి బావురుమన్నది. తన మనసంతా వెళ్లబోసుకుంది. చిత్తమ్మ కరిగిపోయింది. వాళ్లు రమణిని అరబ్బువానికి అమ్మడానికి పథకం వేసి వెళ్ళారని చెప్పింది. రమణి తల బాదుకుంది. తాను చస్తానంది. చావడానికి పిరికితనం, బతకడానికి సాహసం కావాలంది చిత్తమ్మ. బతికే ఉపాయం బోధించింది. ఇద్దరూ ఒక నిశ్చయానికి వచ్చారు.

అర్ధరాత్రి తలుపు తట్టారు.

తలుపు తెరుచుకుంది.

రమణి, చిత్తమ్మా రోకళ్లతో వచ్చిన ఇద్దరి తలలు బద్దలు కొట్టారు. శరత్తు, అరబ్బువాడూ నేలకూలారు.

ఇంటిముందు రక్తపుమడుగు.

రమణి, చిత్తమ్మా ఆదిశక్తుల్లా, అగ్నిజ్వాలల్లా నిలిచారు.

అర్ధరాత్రి అరుణోదయం అయింది.

* * *

# తామరపూలు

బాల్యం... ఆ పదం గారడి చేస్తుంది. ఆ పదం వినగానే మబ్బుల మీద స్వారీ చేస్తున్నట్లూ - నక్షత్రాలతో ఆడుకుంటున్నట్లూ అనిపిస్తుంది. అలా విహరిస్తూపోతే చందమామ ఎదురవుతాడు. ఆ చంద్రునిలో ఒక పొన్న చెట్టు ఉంటుంది. ఆ చెట్టు క్రింద ఒక ముసలవ్వ కూర్చుని ఉంటుంది. ఆమె రాట్నం మీద దారం తీస్తుంటుంది. అలా అలా విహరించి దిగి వస్తే మా ఇంటి ముందరి రెండు చింత చెట్లు గుర్తుకు వస్తాయి.

ఆ రెండు చింతలు - వాటి సాంద్రచ్ఛాయలో బంగారు బాల్యం కరిగిపోయింది. అందకుండా పోయింది. దొరక్కుండా పోయింది.

నా బాల్యం వెళ్లిపోయింది.

తిరిగి చూడకుండా పోయింది.

కనిపించకుండా పోయింది.

మా యింటి ముందరి రెండు చింతలు, చలికాలంలో వెచ్చని నీడ! ఎండ కాలంలో చల్లని నీడ! ఒక్క చింత కింద నర్సిగాని గుడిశ.

నర్సయ్య నా బాల్య మిత్రుడు. అతనితో - ఆ చింతల నీడన ఎన్ని ఆటలు ఆడామో! గోలీలు ఆడాం. చిర్రగోనె ఆడాం. బిళ్లంగోడు ఆడాం. మొగల్ పఠాన్ ఆడాం. దాగుడు మూతలు ఆడాం. ఉప్పు బెర ఆడాం.

ఆటలు! ఆటలు! అటువంటిదే బాల్యం!

ఉంటుందా వెర్రి బాగులుది! వెళ్లిపోయింది!!

దీపావళి వచ్చిందంటే పండుగలకు పండుగ! టపాకులు - మతాబులు లేవు. కోలలు చేసుకునేవాళ్లం. వాటిని పోటీపడి గిరగిరా తిప్పేవాళ్ళం. ఒక జ్వాలా వలయం! ఒకటి కాదు - రెండు కాదు - అనేక జ్వాలా వలయాలు!! ఇంద్రధనుస్సులు గిరగిరా తిరుగుతున్నట్లుండేవి.

అప్పుడప్పుడూ మా పక్క ఇంటి సీత వచ్చేది. చింతల నీడకు రవంత దూరంలో బొడ్డుమల్లె పున్నాగ - చెట్టు ఉండేది. సీత ఆ పూలు ఏరుకోవడానికి వచ్చేది. తెల్లవారే వరకు బొడ్డు మల్లెలు - నేలకానరాకుండా రాలేవి. సీత పూలు ఏరడం బాగనిపించేది. ఆమెకు వడి నిండా పూలు ఏరిపెట్టడం సరదా! నర్సయ్య చెట్టును ఊపుతాడు. పూలు - వానలా రాల్తాయి. ఆ రాలడం సీతా, నేనూ సంబరంగా చూచేవాళ్ళం.

సీత వడి నిండితే గంతు లేసుకుంటూ పరిగెత్తేది. మే మిద్దరం చూస్తూ ఉండేవాళ్ళం! ఆమె లేడిలా గంతులు వేస్తూ పరిగెత్తేది.

బొడ్డు మల్లెపూవు కాడ తుంపి నోట్లో పెట్టుకుని ఊదేవాళ్ళం. సీత కూడా ఉన్నప్పుడు ఆ ధ్వని విని ఆమె కిలా కిలా నవ్వేది! ఆమె కళ్ళు పెద్దవి. అలా నవ్వినప్పుడు చిన్నవి అయ్యేవి. మేమూ ఆమెతో కలిసి నవ్వుతాం.

కాని సీత నవ్వే వేరు!

ముత్యాలు రాల్తాయి

ఒక్కోసారి సీత – వడి నిండా పూలతో – కూలి పడిన గుడి స్తంభం మీద కూర్చునేది. పూలు తీసి తన వ్రేళ్ళతో సుతారంగా మాల అల్లేది. అలా బారెడు మాల అల్లుతుంటే ఆశ్చర్యంగా చూస్తూ ఆమె పాదాల చెంత కూర్చునేవాణ్ణి!

అది ఒక ఆనందం!

అది ఒక అంబరం అందటం!!

సీత బారెడు మాల అందుకొని నిర్దయగా వెళ్లిపోయేది! ఆమె నడకను చూస్తూ ఉండిపోయేవాణ్ణి!!

వర్షాకాలం హర్ష కాలం! అది వచ్చిందంటే మా ఆనందానికి అవధుల్లేవు. జోరున వానలో ఎగిరే వాళ్ళం. గంతులేసే వాళ్ళం. వర్షంలో నుంచొని – నెత్తి మీది నుంచి పడే వాన నీరు – ముక్కు మీది నుంచి జారుతుంటే – నాలుకతో చప్పరించడం!

అదొక మహత్తర అనుభూతి!

అది చెప్పడానికి భాష లేదు! పదాలు చాలవు!!

మా ఇంటి పక్క నుంచి పంట కాలువ పారుతుంది. ఉదయం నర్సయ్యా, నేనూ బయలుదేర్తాం. ఇసుకలో కాళ్ళు ఈడుస్తూ కాలువలో నడుస్తాం. మధ్య మధ్యన ఎగు్రుతాం. గంతులేస్తాం. నీళ్ళు చల్లుకుంటాం. అలా చెరువు తూముదాకా నవ్వుతూ త్రుళ్ళుతూ సాగిపోతాం.

అక్కడ కాలువ నుంచి బయటపడతాం. చెరువు కట్టలు ఎక్కుతాం.

అది మా ఊరి చెరువు. దాని పేరు ముత్యాలమ్మ కుంట. చెరువు పక్కన పెద్ద రాతి పరుపు. దాని మధ్యన ఒక ముద్దు వచ్చే మర్రి గున్న. దానికి అవల ముత్యాలమ్మ గుడి. చెరువు కట్ట దిగువన గుబురు నాగ జముండ్లు! వాటిని అనుకొని పచ్చని పొలాలు! చెరువు కట్ట మీద అక్కడక్కడా మోదుగు చెట్లు.

మేము చెరువు కట్ట ఎక్కి చూస్తే చెరువులో నీళ్ళు కనిపించేవి కావు. చెరువు నిండా పరుచుకున్న పచ్చని తామర ఆకులు. వాటి మీద ముత్యాల్లా మెరిసి – ఆటలాడే నీటి బిందువులు – రెండాకులకు ఒక పూవు చొప్పున విచ్చుకున్న తామరలు. వాటి మీద ఎగిరే నల్లని తుమ్మెదలు. అబ్బో! అదొక మహోద్భుత దృశ్యం!

లోకంలోని తామరలన్నీ అక్కడె చేరినట్లు!

లోకంలోని అందాలన్నీ అక్కడే రాశి పోసినట్లు!

అది మాటలకు అందని అందం. ఆ అందం వదలడం ఇష్టం కాదు. అక్కణ్ణుంచి కదలను.

ఎండ ఎక్కుతుంది. అవి మరింత అందం సంతరించుకుంటాయి.

ఎండ చురుక్కు మంటుంది. అయినా కదలను. ఆ అందం వదలరానిది.

వదలను! నర్సయ్య జ్ఞాపకం చేస్తాడు – ఇంట్లో కొడ్తారని! అతడు నన్ను లాక్కుపోతాడు. దూరంగా అమ్మ కనిపిస్తుంది. అన్నానికి పిలవడానికి వస్తుంది. ఇహ తప్పదు. వెళ్ళిపోతాను! అయినా తామరల చెరువు నన్ను విడువదు! వెంటనే వస్తుంది!

ఒకనాడు చెరువును అలా చూస్తున్నాను. తామరలు పరుచుకొని పడుకోవాలని పించింది.

"నర్సయ్యా! పూలు తెస్తవా? వాటి మీద పడుకోవాలె ననిపిస్తున్నది" అన్నాను.

"అట్లనురి. ఇగొ దిగితి. బండెడు కోస్తి" అన్నాడు నర్సయ్య.

అయితే, అన్ని పూలు తెంపడం మనసొప్పలేదు. రెండు తామరలు కోయించాను. రెండు చేతుల్లో పట్టుకున్నాను. తామర తూళ్లు మంచు తీవల్లా చల్లగా హాయిగా ఉండేవి. వాటి చివరన వికసించిన పద్మాలు!!

అలా వెళ్తున్నప్పుడు సీత కనిపించింది. రెండు తామరపూలు సీతకు అందించాను. సీత అవి అందుకున్నది. ఎగిరింది. గంతేసింది. చెంగు చెంగున ఎగురుతూ మాయం అయింది. బహూశా ఒక రాజ్యం చేతి కందినా అంతకు మించి ఆనందించరు!

నేను చింతల నీడలో – గుడి స్తంభం మీద కూలబడ్డాను. చెరువు పక్కనున్న పరుపు బండ మధ్య మర్రిగున్న కింద సీత కూర్చుంటుంది. నేను గంపలతో తామరలు తెస్తాను. ఆమె ముందు పోస్తాను. సీత బొడ్డు మల్లెలతో వలె తామరపూలతో మాల అల్లుతుంటుంది. నేను ఆమె పాదాల చెంత చతికిలపడి సీత వ్రేళ్ళ కదలికలు చూస్తూ ఉండిపోతాను!

అదీ దృశ్యం! అలా జరగాలని ఊహ!!

ఒకనాడు సీత చేయి పట్టుకొని చెరువుకు రావలసిందని ప్రాధేయపడ్డాను.

"ఛీ! ఆడపిల్లలు చెరువుకొస్తరా? మా అమ్మ చంపుతది" అని నన్ను విడిచి – రాతి బొమ్మలా సాగిపోయింది!

నేను కుప్ప కూలిపోయాను. సీత తామరలు కద్దుండగా చూడలేను!

సాయంత్రం మళ్ళీ చెరువుకు వెళ్ళే వాళ్ళం. అంత అందం కనిపించేది కాదు. అందం సొంతం ఎవడో దోచుకు పోయాడు అనిపించేది. అయినా ఉదయం విచ్చుకున్న పూలనూ – సాయంత్రం ముడుచుకున్న పూలనూ చూడకుండా ఉండలేకపోయేవాణ్ణి.

ఒక రోజు నాయనమ్మను అడిగాను. "ఎండకేమో!" అన్నది.

తామరలను కాపాడాలి. వాటికి ఎండ తగలరాదు. ఇంట్లోంచి చింత గింజలు తీసికెళ్ళాను. చెరువు కట్ట మీద నర్సయ్య గుంతలు తీశాడు. నేను గింజలు వేశాను. పూడ్చాను. చింతలు పెరుగుతాయి. వాటి చిక్కని నీడలో తామరలు వాడవు! అలా అనుకొని రోజూ చెంబులతో వాటికి నీళ్లుపోశాం. కొన్ని రోజుల తరవాత మొక్కయి మొలిచాయి! పచ్చని రెండు గింజలను చీల్చుకొని – చిగురు కిరీటంగా వచ్చిన మొక్కల బారులు మురిపించాయి. వాటిని వదలబుద్ధి కాదు!

ఒకనాడు చెరువు కట్టకు వెళ్ళాం. అక్కడ మొక్కల్ను పశువులు తొక్కేశాయి. మేకలు మేసిపోయాయి. మొక్కలు ఉన్న జాడ కూడా మిగల్లేదు. నాకు ఏడుపు

వచ్చింది. పెద్దగా ఏడ్చాను. ఎక్కెక్కి ఏడిచాను. మంచి నీళ్ళకు వచ్చిన ఆడవాళ్ళు చూచారు. కారణం తెలుసుకున్నారు. నవ్వారు. కొంగుతో నా కన్నీళ్లు తుడిచారు. నన్ను ఇంటికి తీసికెళ్ళారు. మా నాయనకు అప్పగించారు. మా ఇంట్లో అంతా నన్ను చూశారు. విరగబడి నవ్వారు.

"వెర్రి వెధవా! తామరలు ఎండకు వాడవు, విచ్చుకుంటవి. సూర్యుడు క్రుంగుతె ముడుచుకుంటవి" అన్నారు నాయన.

అయితే, ఇదంతా సూర్యుని పని. వాణ్ణి క్రుంగకుండా చేయాలి! ఏం చేయాలి? గొడుగు పట్టుకుంటే సరి. ఒక్క గొడుగు చాలదు. ఇంట్లో ఒక్కటే గొడుగు ఉంది!

తాటి చెట్టు ఎక్కి సూర్యుణ్ణి పట్టవచ్చు. కాని, దానికి ఇంకా పెద్దవాణ్ణి కావాలి! ముని కాళ్ల మీద లేచినా గూడు అందలేదు.

ఆకాశం వంగే చోటికి వెళ్లాలి! అదిగో, అక్కడ సూర్యుణ్ణి పట్టాలి! నర్సయ్యను వెంట పెట్టుకొని బయలుదేరాను. ఎంత దూరం వెళ్ళినా ఆకాశం వంగిన చోటు రాలేదు. సాయంత్రానికి ఇల్లు చేరుకున్నాం. అంతా నా కోసం పరేషానుగా ఉన్నారు.

మా నాయన గద్దించారు. "ఆకాశం వంగిన చోటికి" అన్నాను.

"మామ్మే! మా నాయనే!" అని మా అమ్మ గట్టిగా కౌగలించుకొని ముద్దులాడింది. ఆకాశం వంగే చోటు ఉండదని చెప్పింది.

ఆనాటి అమ్మ ముద్దుల ఆనందం మరలి వచ్చేనా!!!

వర్షా కాలం దాటిపోయింది. ఎండల కాలం వచ్చింది. చెరువు సాంతం ఎండిపోయింది. ఆ తామరలు – ఆ అందం అంతా అంతరించింది. పందులు తామర దుంపలు తవ్వుకొని తింటున్నాయి.

నా మనసు నెర్రెలు వారింది!

చెరువు కట్టన ఉన్న మోదుగులు విరగపూశాయి. ఒక్క ఆకులేదు. చెట్లు సాంతం నిప్పు కణికలతో కణకణ లాడుతున్నాయి. పూసిన మోదుగుల అందం చూచి తీరాలి. అయినా, తామరల్లా అనిపించేవి కావు. నాలో తామరల తాపం చల్లారలేదు.

బొడ్డు మల్లెలు లేవు. సీత మల్లెలు ముందు పోసుకొని మాల అల్లుతుండేది. ఒకనాడు వడి నిండా మోదుగు పూలు తెచ్చి ఆమె ముందు పోశాం. "మోదుగు పూలు మాల కడ్తరా?" అని చివాలున లేచి వెళ్లిపోయింది.

చెరువు కట్టకు వెళ్లినప్పుడల్లా బీటలు వారిన చెరువును చూస్తే ఏడుపు వచ్చేది. "వానాకాలం వస్తది. చెరువు నిండుతది. తామరలు పూస్తయి" అనేవాడు నర్సయ్య.

వానాకాలం కోసం ఎదిరిచూపులు! ఎదిరి చూపులు!! ఎదిరిచూపులు!!!

మృగశిర ప్రవేశిస్తే వర్షం వస్తుందన్నారు మా నాయన! మృగశిర రానే వచ్చింది. బెల్లంలో ఇంగువ పెట్టి మిగించింది నాయనమ్మ.

వాన పడుతుంది! చెరువు నిండుతుంది. తామరలు తంపరలుగా పూస్తాయని ఆశ!!!

రోజంతా ఎదిరి చూశాను. రాత్రి సాంతం మేలుకున్నాను. ఆకాశం మీదనే దృష్టిని నిలిపాను. మబ్బులు రాలేదు. వాన కురవలేదు. నా ఆశ ఫలించలేదు.

చెరువును చూచి ఏడుపు వచ్చింది. మోదుగు పూలు కూడా లేవు. ఎడారి వలె ఉంది. బీడుగా ఉంది. దాడి జరిగినట్లుంది.

రోజులు గడుస్తున్నాయి. చినుకు రాలడం లేదు.

"వాన రావటానికి ఏం చేస్తరు?" నర్సయ్యను అడిగాను.

"అంజనేయస్వామికి నీళ్ళు పొయ్యాలె" అన్నాడు.

ఆనాడు తలమీంచి స్నానం చేశాను. తడి తలతో, తడి బట్టలతో, నెత్తిన తప్పేలడు నీళ్ళతో అంజనేయస్వామి గుడికి వెళ్ళాను. స్వామి పాదాల మీద నీళ్ళు గుమ్మరించాను. కళ్ళు మూసుకొని ప్రార్థించాను.

"స్వామీ! వాన పడెయ్యి. చెరువు నింపు. తామరలు పూయించు."

రోజులు గడుస్తున్నాయి. వాన రాలేదు. చెరువు నిండలేదు. తామరలు పూయలేదు.

ఆనాడు తడిసిన తలలతో, తడిసిన బట్టలతో మా ఇంటికి కొందరు పిల్లలు వచ్చారు. వారిలో ఇద్దరు రోకలిని చెరొక వైపు బుజాలు మీద పెట్టుకున్నారు. రోకలి మధ్యన గుడ్డలో కప్పను కట్టి తెచ్చారు.

"కప్పా తల్లి నీళ్లాడె - కడవా నిండా వానా కురిసె
దోమా తల్లి నీళ్లాడె - దొడ్లా నిండా వానా కురిసె
ఈగా తల్లి నీళ్లాడె - ఇంటీ నిండా వానా కురిసె
పాముా తల్లి నీళ్లాడె - పటువా నిండా వానా కురిసె."

వారు అలా ఎందుకు వచ్చారని అడిగాను. "కప్పతల్లికి నీళ్ళు పోస్తె వాన కురుస్తది" అన్నారు.

"వాన కురుస్తదా! చెరువు నిండుతదా!! తామరలు పూస్తయా!!!" అడిగాను.

"ఓ! కురుస్తది" అన్నారు.

బావి దగ్గరకు ఉరికా. నీళ్ళు తోడా. తప్పేల నింపా. తప్పేలతో తెచ్చి కప్ప తల్లి మీద నీళ్ళు గుమ్మరించా.

"కప్ప తల్లీ! వాన పడెయ్యి. చెరువు నింపు. తామరలు పూయించు" అని మొక్కాను.

రోజులు గడుస్తున్నాయి. వాన రాలేదు. చెరువు నిండలేదు. తామరలు పూయలేదు.

చెరువు దగ్గరికి వెళ్ళాను. ఏడిచాను. చింతల కిందకి చేరాను. ఆటలు ఆడలేదు. గుడి స్తంభం మీద కూలబడ్డాను. ఊరు బోసిగా ఉంది. వెలితిగా ఉంది. వెళ్ళిపోయినట్లుంది.

"వానపడదా! చెరువు నిండదా!! తామరలు పూయవా!!!" నర్సయ్యను అడిగాను.

"వాన కురుస్తది. ఇయ్యాళ బోనాలు పడ్తున్నారు" అన్నాడు.

ఆ సాయంత్రం మంచి బట్టలు వేసుకొని బయలుదేరాను. ముందు డప్పుల వాళ్ళు – కొమ్ముల వాళ్ళు సాగుతున్నారు. వారు కొమ్ములు ఊదినప్పుడు నాకు వింత అనుభూతి కలిగేది. గుండెలో ఉరుము ఉరిమి క్రమంగా జారిపోతున్నట్లనిపించేది. డప్పుల చప్పుళ్లకు ఎగరాలనిపించేది. ఎగిరేవాణ్ణి.

వారి వెనుక ఆడవారు. కడవల దొంతరలు – బిందెల దొంతరలు పెట్టుకున్నారు. దొంతరలకు వేప మండలు కట్టారు. వేపాకు మండలు పట్టుకొని మగవారూ, పిల్లలూ సాగుతున్నారు.

"వాన కురుస్తదా! చెరువు నిండుతదా! తామరలు పూస్తయా!!!" అక్కడ ఒకర్ని అడిగాను.

"ఓ! కురుస్తది" అన్నాడు.

తప్పేలలో నీళ్లు నెత్తిన పెట్టుకొని నేను నడిచాను.

"ఆడపిల్లలు పెట్టుకుంటరు. మగపిల్లలు పెట్టుకోరు." నర్సయ్య అన్నాడు. నేను వినలేదు. తల మీద తప్పేలతో నడిచాను.

ఊరేగింపు చెరువు కట్టకు చేరింది. ముత్తాలమ్మ గుడి ముందు నీళ్ళు గుమ్మరించారు. నేనూ గుమ్మరించాను.

"ముత్యాలమ్మ తల్లీ! వాన పడెయ్యి. చెరువు నింపు. తామరలు పూయించు" అని మొక్కుకున్నాను.

ఆ రాత్రి వాన కోసం ఎదిరి చూచాను. ఆకాశం మీదనే దృష్టి ఉంచాను. నల్లని ఆకాశంలో తెల్లని చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. ఆశ మోసుకొని ఒక మబ్బు ముక్క వచ్చింది. ఆశలు వమ్ము చేసింది. చిటపట చినుకులు రాల్చింది. తేలిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. వాన రాలేదు. చెరువు నిండలేదు. తామరలు పూయలేదు.

"వాన పడదా? చెరువు నిండదా? తామరలు పూయవా?" నర్సయ్యను అడిగాను.

"ఇయ్యాళ సాయెబులు చెరువులో నవాజు చేస్తరట." నర్సయ్య చెప్పాడు.

ఆ సాయంకాలం చెరువు దగ్గరికి వెళ్ళాను. సాయెబులు తళతళ మెరిసే షేర్వానీలు వేసుకొని కూడారు. కొందమందికి గడ్డాలున్నాయి.

"నవాజు చేస్తే వాన కురుస్తదా! చెరువు నిండుతదా!! తామరలు పూస్తయా!" ఒకరిని అడిగాను. "ఓ! కురుస్తది" అన్నాడు.

సాయెబులంతా చెరువులోకి దిగారు. వరుసలుగా నుంచున్నారు.

నేనూ వారి వెంట సాగాను. నర్సయ్య వెనక్కు లాగాడు. సాయెబులు వరుసలుగా వంగారు. కూర్చున్నారు. ఏదో చదివారు. లేచారు. వెళ్లిపోయారు.

ఆ రాత్రి వాన కోసం ఎదిరి చూచాను. ఆకాశం మీదనే దృష్టి ఉంచాను. నల్లని ఆకాశంలో తెల్లని చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. ఆశ మోసుకొని ఒక మబ్బు ముక్క వచ్చింది. ఆశలు వమ్ము చేసింది. చిటపట చినుకులు రాల్చింది. తేలిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. వాన రాలేదు. చెరువు నిండలేదు. తామరలు పూాయలేదు.

చింతల కిందికి వెళ్ళడం మానేశాను. నర్సయ్య మా ఇంటికి వస్తున్నాడు. వానను గురించే ఆలోచన! ఏం చేయాలో తోచదు. ఉన్నట్లుండి ఆకాశమంత పెరగా లనిపించేది. అప్పుడు మబ్బుల్ని లాక్కొచ్చి కురిపించవచ్చు. ముని కాళ్ల మీదతా చూస్తే గూడు అందలేదు.

దేవుడు వాన పడెయ్యడం లేదు. దేవుడు చెడ్డవాడా? దేవుని పటం చూచాను. దేవుడి చేతిలో తామరపూవు ఉంది. తామర లంటే దేవుడికీ ఇష్టమే! దేవుడికి తన తామరయే ఇష్టంలాగుంది. చెరువు నిండా తామరలు చూడలేడేమో! దేవుని చేతిలోని తామర లాక్కుంటే సరి! చెరువులో తామరలు పూయిస్తాడు! దేవునికి కావాలిగా ఒకటి! పీట వేసుకున్నా పటం అందలేదు.

ఒకనాడు నర్సయ్య ఉరికి వచ్చి చెప్పాడు సీత వచ్చిందని. వెళ్లి చూచాను. సీత స్తంభం మీద మౌనంగా కూర్చుంది. అశోకవనంలో సీతలా ఉంది. ఆమె ముందు పూలు లేవు. ఆమె మాల అల్లడం లేదు. ఆమెలో విషాదచ్ఛాయలు కనిపించాయి.

నేను ఆమె పాదాల చెంత కూర్చున్నాను. ఆమె నన్ను చూచింది. మాట్లాడలేదు. నాకు దుఃఖం వచ్చింది.

"సీతా! వాన పడదా? చెరువు నిండదా? తామరలు పూయవా?" నా మాటలు కన్నీట తడిశాయి.

సీత నన్ను ఒక రకంగా చూచింది. ఆ చూపులో ఆర్ద్రత ఉంది, తడి ఉంది, ఆప్యాయత ఉంది.

"రేపు చెరువులో విరాటపర్వం పురాణం చెప్పతరట. వాన వస్తది. చెరువు నిండుతది. తామరలు పూస్తయి " అన్నది. ఆమె మాటల్లో అంతులేని విశ్వాసం దర్శనం ఇచ్చింది.

"సీతా! నువ్వొస్తవా చెరువుకు?"

"వస్త కద" అన్నది. ఆమె కళ్లు తామర రేకులంత అయినాయి.

సీతా, నేనూ జంటగా ఇళ్లకు చేరుకున్నాం.

రేపు రానే వచ్చింది. గ్రామం సొంతం చెరువు దగ్గరే చేరింది. నడి చెరువులో పందిరి వేశారు. బారుగడ్డం – తేజోవంతము లయిన నేత్రముల స్వామి తివాచి మీద కూర్చున్నారు. వారి ముందు వ్యాస పీఠం. వ్యాస పీఠంలో భారతం. వారి ప్రార్థన మేఘ గంభీరంగా ఉంది. వారి గొంతు కంచు గంట.

విరాటపర్వం ప్రారంభం అయింది.

సీత మర్రి నీడలో కూర్చున్నది. మాల అల్లుతున్నది. నేను ఆమె పాదాల చెంత కూర్చున్నాను. ఆమె వ్రేళ్ల కదలిక – మాల అల్లిక చూస్తున్నాను.

"సీతా!"

సీత చూచింది.

"చెరువు చూసినవా! బీటలు వారింది."

సీత తొలిసారిగా బీటలు వారిన చెరువును చూచింది. చూస్తూనే ఉంది.

సీత కళ్లను చూచాను.

ఆమె కనులు ఎండిపోయాయి. ఆమె కనుపాపల్లో బీటలు వారిన చెరువు దర్శనం ఇచ్చింది.

సీత గంభీరంగా ఉంది.

"సీతా!"

పలుకలేదు.

"వాన వస్తుందా?"

"వాన కురుస్తుంది. చెరువు నిండుతుంది. తామరలు పూస్తయి." ఆమె ధ్వనిలో - శాసనం ఉంది.

సీత కళ్లను చూచాను.

సీత కళ్లలో నీరు నిండింది.

ఆమె కనులు నిండిన చెరువుల్లా ఉన్నాయి.

సీత ఆకాశంలోకి చూచింది.

నేనూ ఆకాశంలోకి చూచాను.

మబ్బులు కమ్ముకుంటున్నాయి. ఏనుగులు గుంపులా సాగి వస్తున్నాయి. చల్లని గాలి వీస్తున్నది.

క్షణాల్లో ఆకాశం మేఘచ్ఛన్నం అయింది.

ఇద్దరమూ ఆకాశాన్నే చూస్తున్నాం.

ఫెళ ఫెళార్భటులతో ఉరుములు వినిపించాయి.

శిశిర వృక్షాల్లా మెరుపులు మెరిశాయి.

చినుకులు! చినుకులు! చినుకులు –

జల్లు! జల్లు! జల్లు!

జోరున వాన – విస్సురు గాలి.

సీతా – నేనూ చెట్టపట్టాలు పట్టుకొని ఎగిరాం.

వాన నీరు ముక్కు మీది నుంచి కారుతుంటే చప్పరించాం.

వాన దంచుతున్నది.

మేము ఎగురుతున్నాం.

ఆడుతున్నాం.

మంచి మనసు చలించాలి.

అంతే.

ప్రకృతి పులకిస్తుంది.

★ ★ ★